Andhra Patrika Press, Madras.



కవిబ్రహ్మ తిక్కన

**(Tikkana, the Kavibrahma)**

—Potluri Hanumantha Rao

# సంవత్సరాది

కవిభూషణ, సెట్టి లక్ష్మీనరసింహము





శ్రీయువతీ దృష్టులకు స
దా యువకుండగుచు మోదదాయకుఁడౌ శ్రీ
నాయకుఁ డయసంధాయకుఁ
డే యువవత్సరమునందు నఖిలజనులకున్.

యువతులును, యువకులును, బ
ల్లవించు నుల్లమ్ములను జెలఁగి మెలఁగఁగ, మా
ధవసహితముగా వచ్చెను
యువసంవత్సరము బహుతరోత్సవకరమై.

శ్రీ వనేందిర మాధవావలోకనమున
వలపు హెచ్చఁగఁ గ్రొత్త చెలువు దాల్చె;
యువరాజు గాన మాధవకుమారుండైన
మారుండు సర్వాధికారి యయ్యె;
వఱలెఁ గుంకుమబొట్టువలెఁ బ్రాక్సతీముఖ
మధ్యంబునన్ రవిమండలంబు;
సంభ్రమంబున భక్తజనులు శ్రీరామ లీ
లా మహోత్సవసమారంభు లైరి;
"వచ్చె! వచ్చెఁ! గ్రొత్తవత్సరం బిది మహో-
త్సవదినం!" బటంచు జనములు నగ-
రముల, గ్రామములను, బ్రమదంబు నొందిరి:
ముదములొలయు గాది యిది యుగాది.



# యువ పంచరత్నములు

పురాణం సూర్యనారాయణతీర్థులు

శ్రీయును, వాణి పార్శ్వములం
జేరి భజింపుచు నుండ నిందుకాం
తైన్య యఖిలప్రపంచముల
హాయిగ నేలుచు భక్తలోకముం
బాయని వజ్రవర్మ మయి
పాలన సేయు మదంబ, దేవి తా
నీ యువవత్సరంబున న
భీష్టము లిచ్చుత మెల్లవారికిన్.

యువ వచ్చెను యువ వచ్చెను,
యువ వచ్చె నటంచుఁ బ్రజ మహోత్సాహముతో
నవు నెదురు చూచుచుండఁగ,
యువ! వచ్చితె? కొనుము స్వాగతోక్తులు ప్రీతిన్.

స్వాగతము నీకు, నీ యు
ద్యోగులు సూర్యాదులగు గ్రహోత్తములకు, మీ
స్వాగతము సకలజనులకు,
స్వాగత మగుఁగాక ప్రకృతవత్సర దేవా!

శ్రీమంతులకు స్వదేశీయాభివృద్ధికై
పట్టెద మనుబుద్ధి పుట్టుఁగాక
యుద్ధాది విప్లవోద్యోగముల్ విరమించి
ప్రభుతలు శాంతిఁ జేపట్టుఁగాక
వర్షమ్మువలన నేపాటి హానియు లేక
పాఁడి పంటలు పెంపుఁ బట్టుఁగాక
సంతుష్టి వృద్ధి మై సర్వప్రజకు భీతిఁ
గొల్పునాథులను బోఁగొట్టుఁగాక
వసుధ నెల్లప్రజయు వైభవమయము, ను
త్సవమయమ్ము నగుచుఁ దనరుఁగాక
రససమృద్ధి గలిగి మెసఁగెడి కవితయె
ముదముఁ గూర్చుచుండి పొదలుఁగాక!

శివ మగుత మెల్లెడల మా,
యువరాజున కతనిక్రింది యుద్యోగులకుం
శివమయ మై దేశ మిమ్మ, [illegible]
యువవత్సరమందు మిపుల నొప్పుతను శివా!


AMRUTANJAN
A Safe Cure for Head-Ache
and all other aches & pains
Sold Everywhere
AMRUTANJAN DEPOTS,
BOMBAY — MADRAS — CALCUTTA.

ఓం

# ప్రస్తావన

శ్లో. ఓమ్ నమః ప్రణవార్థాయ శుద్ధజ్ఞానైకమూర్తయే,
నిర్మలాయ ప్రశాన్తాయ దక్షిణామూర్తయే నమః.

శ్రీమన్మహేశ్వర లీలావిలాస పరికల్పితములైన విశ్వవిలాసములు చిత్రవిచిత్రములు. అనంతములైన దేశకాలపాత్రతరంగములు విశ్వేశ్వర విలాసములందు మాయమగుచున్నవి. అనంతములైన దేశకాలపాత్రల సంస్మరణసంకీర్తనములు నిత్యమైన సచ్చిదానందానుభవమునకు సాధనములు. దేశములు, ఖండములు, గోళములు, గ్రహములు, నక్షత్రములు, మండలములు, బ్రహ్మాండములు, సంవత్సరములు, శకములు, యుగములు, మన్వంతరములు, పరార్థములు, కల్పములు, అవతారములు, మనువులు, మహర్షులు, దేవతలు బ్రహ్మవిష్ణుమహేశ్వరులు, శ్రీ వాణీగిరిజాదులు నిత్యమైన సచ్చిదానందానుభవమునకు నిమిత్తసాధనములు. కర్మలు, కళలు, శాస్త్రములు, పురాణేతిహాసములు, వేదములు జీవజాలములకు నియతకర్మానుష్ఠానమునకు సాధనములు. నియతకర్మానుష్ఠానసాధ్యమైన పురుషార్థమునకు స్వాత్మానుభవము పరమప్రమాణము. అనంత శాస్త్రకళాజ్ఞానాతీతమైన స్వాత్మానుభవము నిత్యమైన పురుషార్థము. ధర్మార్థకామమోక్షములు నియతకర్మానుష్ఠానమునకు సాధనములు, సాధ్యములు. సాధనసాధ్యములు సాధకానుభవమునందు పరిణామమును పొందుటకు ధర్మము మూలము. అనంతములైన అర్థకామములు ధర్మపరాయణములగుట సుఖమునకును, ధర్మమర్థకామపరాయణమగుట దుఃఖమునకును మూలబీజము. ప్రవృత్తియందు సాపేక్షములైన సుఖదుఃఖము లర్థకామపరాయణములయి దుఃఖానుభవమునకు మూలబీజములయి ప్రజ్ఞావాదమునకు వినియోగపడుచున్నవి. నిత్యకర్మానుష్ఠాన మాత్మారాధనమునకు గాకను నర్థకామారాధనమునకు వినియోగపడు నాత్మార్థమైన ధర్మశక్తిని కృశింపజేయుచున్నది. ఆత్మశక్తిరహితమయిన కర్మానుష్ఠానము దురంతకీలకమునకు వినియోగపడుచున్నది. మహాభారతసంగ్రామరంగమునందు శ్రీ కృష్ణపరమాత్ముడు అర్జునునకుజేసిన మహాయోగోపదేశము ప్రవృత్తియందు నారాయణుడు నరునకు జేయుచున్న నిత్యోపదేశముగ నున్నది ఆత్మానుభవాభావమైన కర్మకాండకును శాస్త్రజ్ఞానమునకును, శ్రీ కృష్ణపరమాత్ముడుపదేశించిన "అశోచ్యానన్వశోచస్త్వం ప్రజ్ఞావాదాంశ్చ భాషసే—(ఇతిబీజమ్)"సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణంవ్రజ"—(ఇతిశక్తిః)—"అహం త్వాసర్వపాపేభ్యో మోక్షయిష్యామి మాశుచః"—(ఇతి కీలకమ్,) శక్తికీలకములు నిరర్థకములయి "విషాదయోగప్రజ్ఞావాదములు" సార్థకము లగుచున్నవి. ప్రపంచపరిణామవ్యవహారములందు వర్తమానయుగమునందు వ్యక్తులు, కులములు, సంఘములు, జాతులు స్వాత్మానుభవరహితమైన విషాదయోగప్రజ్ఞావాదారాధనమును జేయుచు నవయుగనిర్మాణసంకల్పమును జేయుచున్నవిధము భయంకర సంరంభమునకు బీజముగ నున్నది. కర్షకభూస్వాములు, కార్మికధనస్వాములు, ద్విజద్విజేతరులు, ప్రజాసంస్థానములు, ప్రజాప్రభుత్వములు, కర్షక పారిశ్రామికులు, ఆచార్యసంస్కర్తలు, స్త్రీ పురుషులు, వృద్ధయువకులు, ఆచారపరాయణులు పరివర్తకులు నవయుగారంభమునకు సమరసన్నాహములను జేయుచున్నారు. ఆధిపత్యము, ఆచార్యత్వము, రాజ్యత్వము, నిరంకుశత్వము, సామ్రాజ్యాభిమానము, వ్యక్తిస్వాతంత్ర్యము, ప్రజాస్వామ్యత్వము, సాంఘికత్వము, సాంఘికప్రభుత్వము

నియంతృత్వము, ఫాసిటుజము, హిట్లరు నియంతృత్వము, (Communism) ప్రపంచపరిణామమునందు మహాపరివర్తనమును గలుగజేయుచున్నవి. ప్రజాస్వత్వములు, ప్రభుత్వాధికారములు సంరంభసంక్షోభములకు మూలము లగుచున్నవి. ప్రపంచావృతమైన మహాపరివర్తన సమయమునందు నియతకర్మానుష్ఠానమునకు దేశకాలపాత్రాధారమైన మహాసంకల్పమును జేయుట స్వానుభవసిద్ధమైన పురుషార్థసిద్ధికి సాధనము.

నిత్యకర్మానుష్ఠానమునందు తిథివారనక్షత్ర గ్రహయోగాదుల పరిజ్ఞానము యోగసిద్ధికి సాధనముగ నున్నది. నూతనసంవత్సరారంభమున పంచాంగశ్రవణ మననములు భావికార్యసంసిద్ధి కుత్సాహజనకములుగ నుండగలవు. అనంతములైనను ననిత్యములైన దేశకాలపాత్రావరణములు నిత్యమైన పురుషార్థసిద్ధికి సాధనములుగ నుండుటకు పంచాంగశ్రవణము ధర్మార్థసాధనముగ నున్నది. నిత్యమైన ఆత్మజ్ఞానము ననంతములైన ప్రకృతి విలాసముల సాధనమునను పరిస్ఫుటము చేయుటకు దేశము, కాలము, పాత్రలు పరమార్థసాధనములు.

యశ్శృణోతి మధుశుక్లపక్షకే వర్షనాథ సదివాదికం ఫలమ్,
ప్రాప్నుయా ద్దురితముక్త విగ్రహ శ్చాయు రర్థ మతులం యశస్సుఖమ్.
రాజామంత్రీ సస్యనాథో రసానా మీశాస్సార్థం స్వామినో నీరసానామ్,
అర్ఘాధీశఃకించ మేఘాధినాథో దద్యుశ్శ్రేయశ్శృణ్వతాం తత్ఫలాని.

ప్రభవాది చాంద్రమానాబ్దములం దెనిమిదవ యేడు భావసంవత్సరము గతించి, ౯-వ యేడు యువసంవత్సర మారంభమైనది. సచ్చిదానందాత్మకమైన ఆత్మసంస్మరణమునకును, సంకల్పమునకును ప్రాచీన సంప్రదాయసిద్ధమైన నిత్యసంకల్పము సాధనముగ నున్నది :—

పంచాంగము

“శ్రీశంభో రాజ్ఞయా ప్రవర్తమానస్య ఆద్య బ్రహ్మణః ద్వితీయపరార్థే, శ్వేతవరాహకల్పే, వైవస్వతమన్వంతరే, కలియుగే, ప్రథమపాదే, జంబూద్వీపే, భరతవర్షే, భరతఖండే, మేరో ర్దక్షిణదిగ్భాగే, శ్రీశైలస్యాగ్నేయప్రదేశే, కృష్ణాకావేర్యోర్మధ్యదేశే, యువనామ సంవత్సరే, ఉత్తరాయణే, వసంతఋతౌ, చైత్రమాసే, శుక్లపక్షే, ప్రథమాయాం, రేవతినక్షత్రే, గురువాసరే, పురుషార్థ ముపాస్యే ”

సద్యోగాశ్రయములైన దేశకాలములందు ద్వీపములు, వర్షములు, ఖండములు, గోళములు, మండలములు, విశ్వములు, సంవత్సరములు, శకములు, యుగములు, మన్వంతరములు, కల్పములు, పరార్థములు సాపేక్షములు. భావసంవత్సర నిర్గమనమును, యువసంవత్సరారంభమును కాలమహార్ణవమునం దొకబిందువును పోలియున్నను ఆత్మజిజ్ఞాసకు పంచాంగశ్రవణరూపమునను పరమార్థసాధనముగ నున్నది. కాలమహార్ణవమునందు శాలివాహన శకాబ్దములు ౧౮౫౭, విక్రమార్క-శకాబ్దములు ౧౯౯౨, హూణశకాబ్దములు ౧౯౩౪, ఫసలిశకాబ్దములు ౧౩౪౩, భరతశకాబ్దములు ౫౦౭౭, కలియుగాది సౌరాబ్దములు ౫౦౩౬, సృష్ట్యాదిసౌరాబ్దములు ౧,౯౫,౫౮,౮౫,౦౩౬ గతించినవి. కలియుగాదినుండియును ౪౮ చాంద్రమాన చాంద్రాయణపరివృత్తులు ముగిసి ౪౯ వ పరివృత్తియం దెనిమిదేండ్లు గతించి తొమ్మిదవయేడు యువసంవత్సర మారంభ మైనది. బ్రహ్మకల్పమునందు, ద్వితీయపరార్థమునందు, ప్రథమవర్షమునందు, ప్రథమమాసమునందు, ప్రథమపక్షమునందు, ప్రథమదినమునందు, ౧౩ ఘటికలు, ౪౨ విఘటికలు గతించినవి. అనంతమైన కాలచక్రమునందు గతించిన భావాబ్దమొకక్షణముగను, భావాబ్దేతిహాసములు పరమాణువులుగను నున్నవి. నిరపేక్షమైన ఆత్మతత్వమునందు సాపేక్షములైన దేశకాలసంకీర్తనలు క్షణమాత్రములైనను సత్యమైన ఆత్మపరిజ్ఞానమునకు సాధనములుగ నున్నవి.

చాంద్రమాన యువసంవత్సరమునకు గురువు రాజు, రసాధిపతి, గణకుడు ; ఫలము :- వర్షసమృద్ధి, గోక్షీరసమృద్ధి, విప్రాగ్నిహోత్రాభివృద్ధి, సర్వజనమహోత్సవము, సువృష్టి, సస్యాభివృద్ధి, వృక్షజాతిఫలాభివృద్ధి, సదారోగ్యము, సుభిక్షము, గణకులకు

సౌమ్యబుద్ధి, నరుల కత్యంతసుఖము; శని సేనాధిపతి, మంత్రి, అర్ఘాధిపతి, మేఘాధిపతి, గ్రామపాలకుడు; ఫలము :—రాజవిగ్రహము, నాగరవైరము, శలభపీడ, ప్రజాపీడ, స్వల్పవర్షము, చోరాగ్నిభయము, రోగవ్యాపనము, అల్పవృష్టి, కృష్ణధాన్యాభివృద్ధి; కుజుడు సస్యాధిపతి, నీరసాధిపతి, పురోహితుడు, పరీక్షకుడు; ఫలము:—రక్తభూమిసస్యాభివృద్ధి, మహాశాలితువరచణకాద్యభివృద్ధి, అర్ఘవృద్ధి, జలాభావము, చోరాగ్నిభయము, రాజకలహము, తుషధాన్యనాశనము, నరపతుల ప్రజాపీడ; చంద్రుడు ధాన్యాధిపతి; ఫలము :—గోక్షీరాభివృద్ధి, సుభిక్షము, మహావర్షము, వ్యాధిరాహిత్యము; శుక్రుడు దైవజ్ఞుడు; ఫలము :—ప్రజాధర్మనిరతత్వము, రాజుల మంత్రవిచారజ్ఞత్వము, విపులనీతినిరతత్వమును; గోపాలుడు పశుపాలకుడు; ఫలము:—పశువృద్ధి, సుభిక్షము, తృణవృష్టిసంపూర్ణాభివృద్ధి, సస్యార్ఘసమృద్ధి; నీలనామకమేఘము; ఫలము:—గోకులపూర్ణము, వస్త్రాభివృద్ధి, జలవృష్టి, సకలమానవతుష్టి.

యువసంవత్సర సామాన్యఫలము :—

శ్లో. ప్రకీర్ణకామ ప్రభవా యువాబ్దే గోధూమశాలీక్షుఫలాని భుక్త్వా,
చోరామయవ్యాళభయం ప్రభూతంతథాపివిందంతినదుఃఖమేతాః.

వర్తమానసంవత్సరఫలముసామాన్యమైననుధాతృసంవత్సరపరివృత్తి భయంకరముగ నున్నది. గతించినధాతృసంవత్సరఘోషము భావిభయంకరపరిస్థితులకు సూచనగనున్నది. సకలరాజ్యములును చేయుచున్న సంగ్రామసన్నాహములు మహాప్రళయచిహ్నములుగను గోచరం బగుచున్నవి. భావసంవత్సరమునందు గోప్యముగనున్న సంగ్రామజ్వరము యువసంవత్సరమునందు బహిర్గతమై ధాతృసంవత్సరమునందు భయంకరరూపమును దాల్చునటులు శకునములు గనుపడుచున్నవి. గత మహాసంగ్రామము గలుగజేసిన ప్రళయవేదన శ్మశానవైరాగ్యముగను పరిణమించినది. ఆయుధవిసర్జనసభ విచ్ఛేదమైనది. నానాజాతిసమితి శాంతిస్థాపనమునకు నిరర్థకమైనది. క్రీ॥ శ॥ ౧౯౧౪-వ సంవత్సరమునందు సంప్రాప్తమైన ప్రళయతాండవమె ధాతృసంవత్సరమునందు సంభవమైననువిచిత్రములేదు. ప్రపంచపరిస్థితులు భయంకరరూపమును దాల్చుచున్న విధమును యూరపు రాజ్యములందును, జపానురుష్యారాజ్యములందును జరుగుచున్న రహస్యాలోచనలును, ఆయుధ నిర్మాణధారణవ్యాపారములును విశదము చేయుచున్నవి.

ప్రపంచ పరిస్థితులు

అనంతమైన ప్రవృత్తియందు భూగోళోదంత మతిస్వల్పమైనను మానవుల యహంకారాభిమానములు ప్రముఖము చేయుచున్నవి. భూగోళవిస్తీర్ణము, ౧౯,౬౯,౫౦,౦౦౦ చదరపుమైళ్లు. జనసంఖ్య౧,౮౪,౯౫,౦౦,౦౦౦. ఆప్రదేశమునందు ౫,౭౫,౧౦,౦౦౦ భూప్రదేశము ౧౩,౯౪,౪౦,౦౦౦ జలప్రదేశము. భూప్రదేశమునందు ఆఫ్రికా ౧,౧౫,౦౦,౦౦౦, ఉత్తర అమెరికా ౮౦,౦౦,౦౦౦, దక్షిణ అమెరికా ౬౮,౦౦,౦౦౦, యూరపు౩౭,౫౦,౦౦౦,ఓషియానియా,౪౦,౦౦,౦౦౦ ధ్రువప్రదేశములు ౬౨,౭౫,౦౦౦ ఆసియా౧,౭౦,౦౦,౦౦౦ చదరపుమైళ్లు. భూప్రదేశమునందు సుక్షేత్రములు ౩౩౦,౦౦,౦౦౦, ఎడారులు ౫౦,౦౦,౦౦౦, ఉన్నతప్రాంతములు ౧,౯౦,౦౦,౦౦౦ చదరపుమైళ్లు.

ప్రపంచమునందుగల ౧,౮౪,౯౫,౦౦,౦౦౦ జనులందును మంగోలియనులు ౬౮,౦౦,౦౦,౦౦౦ కాకేషియనులు ౭౨,౫౦,౦౦,౦౦౦, నీగ్రోలు ౨౧,౦౦,౦౦,౦౦౦, సెమిటికులు ౧౦,౦౦,౦౦,౦౦౦, మలయనులు ౧౦,౪౫,౦౦,౦౦౦, అమెరికా ఇండియనులు ౩,౦౦,౦౦,౦౦౦ కలరు. మతముల ననుసరించి క్రైస్తవులు, ౬౯,౨౪,౦౦,౦౦౦, యూదులు ౧,౬౧,౩౧,౦౦౦, మహమ్మదీయులు ౨౦,౯౦,౨౦,౦౦౦, బౌద్ధులు ౧౫,౦౧,౮౦,౦౦౦, హిందువులు ౨౩,౦౧,౫౦,౦౦౦, కన్ఫూషియనులు టాయిస్టులు ౩౫,౦౬,౦౦,౦౦౦, షింటోలు ౨,౫౦,౦౦,౦౦౦, జంతుపూజకులు ౧౩,౫౬,౫౦,౦౦౦, ఇతరులు ౫,౦౮,౭౦,౦౦౦ కలరు.

ప్రపంచమునందలి వివిధ దేశములయందును గోధుమలు ౬,౦౨,౦౦,౦౦,౦౦౦, రాయిలు ౧,౯౭,౦౦,౦౦,౦౦౦, ఓటులు ౩,౪౮,౦౦,౦౦,౦౦౦, బార్లి ౭,౭౪,౦౦,౦౦,౦౦౦, మొక్కజొన్నలు ౩,౬౧,౦౦,౦౦,౦౦౦, క్వార్టు లుత్పన్నము లగుచున్నవి. బియ్యము ౧౪,౦౦,౦౦,౦౦౦, జొన్నలు ౩,౦౦,౦౦,౦౦౦, బంగాళాదుంపలు ౧౯,౦౦,౦౦,౦౦౦, దుంపశర్కర ౮౮,౦౦,౦౦౦, చెఱకుశర్కర ౧,౨౦,౦౦,౦౦౦, తేయాకు ౮,౪౦,౦౦౦, కాఫి ౧౮,౦౦,౦౦౦, కోకో ౬,౦౦,౦౦౦, పెద్దచిక్కుడు ౬౨,౫౦,౦౦౦, అవిశలు ౭౬,౦౦,౦౦౦, ప్రత్తిగింజలు ౧,౧౫,౦౦,౦౦౦, దూది ౫౫,౦౦,౦౦౦, ఉన్ని ౧౫,౫౦,౦౦౦, జూటు ౧౪,౭౦,౦౦౦, పట్టు ౫౫,౧౦౦, మాయపట్టు ౩,౦౦,౦౦౦, పొగాకు ౭౭,౦౦,౦౦౦, రబ్బరు ౮,౫౦,౦౦౦,



పెట్రోలియము ౧౯,౫౦,౦౦,౦౦౦, రాగి ౧౦,౦౦,౦౦౦, సీసము ౧౧,౯౦,౦౦౦, తగరము ౮౫,౦౧౦, తుత్తినాగము ౯,౮౦,౮౦౦, అల్యూమినము ౧,౪౦,౦౦౦, ఇనుము ౪,౮౦,౦౦,౦౦౦, ఉక్కు ౬,౨౦,౦౦,౦౦౦, అయస్కాంతము ౧౩,౦౦,౦౦౦, సున్నపు ఫాస్ఫేటులు ౧,౭౫,౦౦,౦౦౦, పొటాషులు ౧౫,౭౫,౦౦౦, లవణము ౭,౫౦,౦౦,౦౦౦, బొగ్గు ౧,౧౦,౦౦,౦౦,౦౦౦, నిక్కెలు ౩౯,౦౦౦ టన్ను లుత్పన్నము లగుచున్నవి. విద్యుచ్ఛక్తి ౭,౬౦,౦౦,౦౦,౦౦,౦౦౦, కిలోవాటులును, బంగారము ౨,౫౦,౦౦,౦౦౦ ఔన్సులు, వెండి ౧౬,౩౦,౦౦,౦౦౦ ఔన్సులు, ప్లాటినము ౨,౫౦,౦౦౦, ట్రాయిఔన్సులును పుట్టుచున్నవి.

ప్రపంచమున మేకలు గొఱ్ఱెలు ౪౦,౯౧,౦౫,౨౦౦, కోళ్లు ౯౬,౦౨,౮౨,౦౦౦, గుఱ్ఱములు ౬,౬౫,౯౩,౭౦౦, పందులు ౧౧,౫౬,౯౧,౫౦౦, పశువులు ౪౭,౧౨,౮౬,౫౦౦, కలవు. ప్రపంచమునందు గల పాడి పంటలు జంతువులు మానవుల జీవయాత్రకు చిరకాలము సరిపోవు నని పండితాభిప్రాయము. ప్రపంచమునందు జనాభివృద్ధి ౬౦౦ కోట్లకు పెరిగినను అన్నపానీయముల కభ్యంతరములు కలుగవని పండితుల యభిప్రాయము, ప్రపంచమునం దంతటను మానవపోషణమున కవసరమైన పాడిపంటలు, జీవజాలములు, నీటివసతులు, భూవసతులు సమృద్ధిగ నున్నను ప్రపంచము నావరించిన దురాశాపిశాచము పరమానర్థములకు మూలముగ నున్నది. శ్వేతజాతులు పూనిన పరాక్రమణవిధానము సర్వసంహారమునకు వినియోగ పడుచున్నటులు ప్రపంచోద్ధరణమునకు వినియోగ పడుటలేదు.

ప్రపంచేతిహాసములందు గతించిన ౧౫౦ పండ్ల చరిత్రమును యూరపురాజ్యముల చరిత్రముగ పరిణమించినది. శ్వేతజాతులు సాయుధపాణులై పరదేశముల నాక్రమించిన చరిత్రము దారుణాధ్యాయముగ నున్నది. పాశ్చాత్యులు పరదేశాక్రమణమును స్వప్రయోజనార్థమును, స్వీయవ్యాపారార్థమును చేసినను ప్రపంచోద్ధరణమునకు చేసినట్లు ఘోషించుట పరిపాటియైనది. శ్వేతజాతులప్రముఖులు నిరంతరము "తెల్లజాతుల భారధర్మమును" సకలదుర్నయములకును కారణముగ పరిగణించుట వారి దురహంకారమునకు నిదర్శనము. ఆస్ట్రేలియారాజ్యము ౩,౦౦,౦౦,౦౦౦ చదరపు మైళ్ల విస్తీర్ణమును గలిగియున్నను ౬౦,౦౦,౦౦౦ తెల్లవారికి స్వాస్థ్యముగ నున్నది. ఈవిశాలదేశమునందు పరజాతీయులు స్వదేశస్థులు ౬,౦౦,౦౦౦ మాత్రమెయున్నను శ్వేతేతరజాతులకు ప్రవేశము నిషేధింపబడుచున్నది. శ్వేతజాతులు అమెరికా, ఆఫ్రికా, ఆసియా మొదలగు ఖండములను బలవదన్యాయాక్రమణమును జేసి కలుగజేసిన దుర్నయములు మానవధర్మేతిహాసములందు విషాదాధ్యాయములుగ నున్నవి. ఉత్తరదక్షిణ అమెరికాఖండములు ౧,౪౮,౦౦,౦౦౦ చదరపుమైళ్ల విస్తీర్ణమును, ౨౧,౦౦,౦౦,౦౦౦ ప్రజలను గలిగియున్నను శ్వేతప్రజాధిపత్యమునకు నిలయములుగ పరిణమించినవి,

అమెరికాసంయుక్తరాష్ట్రములవికాసము ప్రపంచపరిణామమునం దుద్యోగపర్వముగ నున్నను శ్వేతేతరులనుభవించిన దుఃఖపరంపరలు పరమ విషాదమును గలుగజేయుచున్నవి.

ప్రపంచపరిణామ మహోమయమై దురూహ్యముగ ప్రపంచమునం దంతటను యుద్ధధ్వనులు ప్రతిధ్వనించుచున్నవి. మహాసంగ్రామరంగ మాసియాఖండమొ యూరపుఖండమొ కాలగర్భమునందు గలదు.

ప్రపంచ పరిణామము

జపానురుష్యాలుస్వస్తివచనములను పఠించుచు సంగ్రామసన్నాహములను జేయుచున్నవి. చైనా, మంగోలియా, మంచూరియా దేశములు దుర్భరదైన్యమును, దారిద్ర్యమును, నిస్సహాయత్వమును ననుభవించుచు బలవత్తమమైన రాజ్యతంత్రములకు గురియగుచున్నవి.

జర్మనుక్షాత్రము హిట్లరు నాయకత్వముక్రిందను విజృంభించుచున్నది. ఆయుధవిసర్జనసభ నిరర్థకమైనది. జపాను వాషింగ్టనుసంధిని తిరస్కరించినది. ప్రపంచ వ్యవహారములం దనుభవము గల ఫ్రాంసు సిమ్మోన్సు గారి జోస్యము గమనార్హము.

"యూరపురాజ్యములందు ౨౦ ఏండ్లకు పూర్వము సంప్రాప్తమైన సంగ్రామలక్షణములె వర్తమానకాలమునందు విజృంభించుచున్నవి. సంగ్రామ మన్నిరాజ్యములకును భయంకరముగ నున్నను సంగ్రామసన్నాహము లపారము లయినవి. సకలరాజ్యములందును అశాంతి రాజ్యముచేయుచున్నది. వర్తమానకాలమునందు ౨౦ ఏండ్లక్రితము లేని నూతనమైన ఆర్థికదుస్థితి తటస్థించినది. రుష్యావిప్లవమున కార్థికదుస్థితితోడై ప్రపంచమునం దంతటను సాంఘికవిప్లవము తలయెత్తినది. రుష్యాకమ్యూనిజమును ప్రతిఘటించుటకు ఫాసిజము, నాజీజము, సామ్రాజ్యాభిమానము, ధనాభిమానము, మతాభిమానము జాత్యభిమానము విశ్వప్రయత్నములను జేయుచున్నను ప్రయోజనము సంశయాస్పదము. ప్రపంచమునందంతటను ప్రజలు పనిపాటులులేక నన్నార్తులై పరితపించునపుడు విప్లవతాండవ మనివార్యము."

జర్మనురాజ్యమునందు హిట్లరు పూర్ణధ్వజారోహణము యూరపు రాజ్యములందు, ముఖ్యముగను ఫ్రాన్సురాజ్యమునందు పరమవిషాదమును, ప్రధాన రాజ్యములం దాయుధాభివృద్ధిని గమనించినపుడు ధాతసంవత్సరమునం దాయుధోపయోగ మనివార్యముగ నున్నది. ప్రధానరాజ్యముల ఆయుధబలములు :—

గ్రేట్ బ్రిటన్

| | ౧౯౧౮ | ౧౯౨౫ | ౧౯౨౯ | ౧౯౩౪ |
|---|---|---|---|---|
| మరఫిరంగులు | ౨,౦౦౦ | ౧౭,౨౫౨ | ౧౨,౫౧౦ | ౧౮,౪౦౦ |
| పెద్దఫిరంగులు | ౨,౦౦౦ | ౨,౨౬౭ | ౨,౨౭౪ | ౨,౮౦౦ |

సంయుక్తరాజ్యములు (అమెరికా)

| | | | | |
|---|---|---|---|---|
| మరఫిరంగులు | ౧,౫౦౦ | ౩౮,౫౦౦ | ౩౫,౦౦౦ | ౩౬,౦౦౦ |
| పెద్దఫిరంగులు | ౯౫౦ | ౨,౭౧౬ | ౩,౦౦౦ | ౩,౯౭౦ |

జపాన్

| | | | | |
|---|---|---|---|---|
| మరఫిరంగులు | ౯౬౭ | ౮,౯౦౦ | ౫,౬౫౦ | ౯,౨౦౦ |
| పెద్దఫిరంగులు | ౧,౨౦౦ | ౧,౨౩౦ | ౧,౨౬౨ | ౨,౨౦౦ |

ఫ్రాన్స్

| | | | | |
|---|---|---|---|---|
| మరఫిరంగులు | ౧,౬౭౭ | ౨౩,౮౦౦ | ౨౨,౭౦౦ | ౨౩,౦౦౦ |
| పెద్దఫిరంగులు | ౩,౮౨౦ | ౨,౫౮౦ | ౨,౫౧౬ | ౩,౦౦౦ |

జర్మనీ

| | | | | |
|---|---|---|---|---|
| మరఫిరంగులు | ౪,౩౧౨ | ౩౩౪ | ౩౩౪ | ౧,౦౦౦ |
| పెద్దఫిరంగులు | | | | |

ఇటలీ

| | | | | |
|---|---|---|---|---|
| మరపిరంగులు | ౪౨౪ | ౬,౭౫౦ | ౬,౫౦౦ | ౬,౫౫౦ |
| పెద్దపిరంగులు | ౧,౨౦౪ | ౧,౯౦౬ | ౨,౩౬౦ | ౨,౫౦౦ |

ఈ మహారాజ్యముల వాయుయానాలు అపరిమితములు

| | | | | |
|---|---|---|---|---|
| గ్రేట్ బ్రిటన్ | ౨౭౨ | ౧,౩౧౦ | ౧,౭౨౪ | ౩,౦౦౦ |
| సం. రా. (అమెరికా) | ౬౫ | ౧,౮౨౭ | ౩,౧౨౯ | ౫,౦౦౦ |
| జపాన్ | ౨౫ | ౬౬౨ | ౧,౨౬౦ | ౨,౨౦౦ |
| ఫ్రాన్స్ | ౨౦౦ | ౫,౪౫౦ | ౫,౦౦౦ | ౬,౦౦౦ |
| జర్మనీ | ౨౦౦ | ... | ... | ౨,౦౦౦ |
| ఇటలీ | ౩౦ | ౧,౮౪౫ | ౨,౦౦౦ | ౨,౫౦౦ |
| మొత్తం. | ౭౯౨ | ౧౦,౨౯౫ | ౧౩,౨౧౩ | ౨౦,౭౦౦ |

ఈ ఆయుధసన్నాహములకు ద్విగుణీకృతముగను ౧౯౩౫ వ సంవత్సరమునందు జపాను, గ్రేటుబ్రిటను, ఇటలీ, ఫ్రాన్సు, అమెరికా సంయుక్తరాష్ట్రములు మొదలగు రాజ్యములం దాయుధనిర్మాణమునకు ప్రయత్నములు ప్రచండముగను జరుగుచున్నవి. ప్రజలన్నాతురు

లయి పరితపించుచున్నపుడు రాజ్యాదాయమునందు విశేష భాగమును మహామారణసాధనములకై వినియోగించుట కేవల మాసురబలారాధనము. జర్మనీయందు నాజీవిజృంభణము ప్రశంసనీయమైనను ప్రళయసూచకముగ నున్నది. జర్మను లాత్మగౌరవమునకై యవలంబించుచున్న వ్యవహారక్రమ మంతయును కాలాంతరమునం దాత్మవినాశనమునకై వినియోగపడుట ప్రకృతిధర్మము. సంగ్రామాంకురములను నాటిన క్షేత్రములందు శాంతి సస్యములు ఫలింపజాలవు.

యూరపుప్రధాన రాజ్యములు, జపాను, అమెరికాసంయుక్తరాష్ట్రములును సైన్యశిక్షణమునకు, నౌకాదళనిర్మాణమునకు, వైమానిక దళనిర్మాణమునకును చేయుచున్న వ్యయ మపారము. మహాసంగ్రామమునకు పూర్వసైన్యవ్యయమును తదనంతరవ్యయ మనేకరెట్లు మించినది. వర్తమాన సంవత్సరమునందు సంగ్రామ సన్నాహములకు వివిధరాజ్యములకును ౬,౦౦ కోట్లు రూప్యములు వ్యయమగునటులు లెక్కింపబడినది. గంటకు ౧౭౦ మైళ్లు నడిచెడివిమానములు విషపదార్థములతో గలుగజేసెడి సంహారము సంభావనాశక్తికతీతము. భావిభాగ్యము దైవాధీనమునం దున్నదని విశ్వసించినను యూరపురాజ్యములు నాటిన కర్మబీజములఫల మవశ్యమనుభోక్తవ్యము.

హిట్లరుగా రవలంబించిన స్వస్తికపతాకావరోహణము సంగ్రామసన్నాహములు పాశ్చాత్యసంస్కారమునకు పరమప్రమాణములు. బాహ్యచిహ్నములకును, ఆంతరంగికవిశ్వాసములకును సంబంధములేని పాశ్చాత్యసంస్కారము ప్రళయమునకువలెను నిర్మాణమునకు సాధనము గాజాలదు.

**నాజీవిజృంభణము**

సృష్టిలయము లన్యోన్యాశ్రయములై స్థితి కసాధనము లైనను సంకల్పరహితమైన కర్మానుష్ఠానము కార్యసిద్ధికి నిరర్థకము. నాజీధర్మమార్గ మవశ్యము యూరపుఖండమును సంగ్రామానలదగ్ధము చేయుట తథ్యము. జర్మనీ పునరుద్ధరింపదలచిన నిర్బంధ సైనికవిధానము, యువతీయువకుల వ్యాయామ శిక్షణాక్రమము, ఆయుధ నిర్మాణాభివృద్ధి, విషవాయునిర్మాణము, రహస్యమారణయంత్రసాధనములు ౧౯౩౯వ సంవత్సరమునందేమి సమకూర్చనదియును దురూహ్యము. జర్మనురాజ్యార్థికస్థితి అధ్వాన్నముగ నున్నను ప్రజలయుత్సాహమునకు మితిమేరలు లేకున్నవి. జర్మను దేశమునందు గోరింగుగారి యాధిపత్యముక్రిందను ౩౦౦౦ స్థాయుధవిమానములు సంగ్రామమునకు సంసిద్ధముగ నున్నవి. వర్తమాన సంవత్సరమునం దీ విమానముల సంఖ్యను హెచ్చించి సంగ్రామారంభమునందే ప్రాన్సును దగ్ధపటలము చేయుట జర్మనుసైన్యాధికారుల సంగ్రామవ్యూహము. తా నొకటి తలచిన దైవము వేరొకటి తలచుననుట యథార్థమైన విషయము. జాతిధనపక్షరక్షణపరాయణమైన హిట్లరు రాజ్యతంత్రము సోవీటురుష్యాయందు జాగ్రత్తను గలుగజేసినది. ఆంగ్లమంత్రి సర్ జాన్ సైమను హిట్లరుగార్ల సంప్రతింపుల ఫల మేమైనను జర్మనురాజ్య మితరరాజ్యములను బెదరించుచు లాభమును పొందుచు సంగ్రామసన్నాహములను ద్విగుణీకృతము చేయుట యనివార్యము.

**రుష్యా రాజ్యము**

ప్రపంచపరిణామమునందు సోవీటు రుష్యా దంతము నూతనపర్వోదంతము. రుష్యావ్యవహారములు యూరపు ప్రభుత్వములకును, ధనభూస్వాములకును గర్హ్యముగను కార్మికుల కాకర్షణయోగ్యముగను నున్నవి. గతించిన శతాబ్దియందు యూరపురాజ్యము లారాధించిన రాజకీయార్థికమతసాంఘిక పారిశ్రామికవిధానములు పరివర్తనము నొందినవి. వ్యక్తిస్వాతంత్ర్యసిద్ధాంతము వెనుకబడినది. యూరపురాజ్యము లారాధించెడి ధనకుబేరులు, ప్రభుపరంపరలు, మతగురుపరంపరలు, సాంఘికవిభేదములును నిర్గమనమును పొందినవి. ప్రజాసమష్టి బలధనధాన్యార్జన వినియోగములందు వ్యక్తిస్వాతంత్ర్యము సంగమించినది. సకలజన సామాన్యప్రయోజనములందు ప్రత్యేకప్రయోజనము లంతరించుచున్నవి. ప్రజలుబల

వంతముగను పనిపాటులందు నిమగ్నులగుచున్నారు. వ్యక్తివికాసమున కవరోధము కలిగినను ప్రజాసామాన్య వికాసమున కవలంబనము కలిగినది. సోవీటు రాజ్యాంగారాధనము ప్రథమమున బలవంతారాధనమైనను క్రమముగను నభిమానారాధనపరిణామమును పొందుచున్నది. స్త్రీలు పురుషులు చిరకాలసంచితములైన ఆచారపాశబంధములను విసర్జించి సోవీటు ధర్మారాధనమునందు భక్తిపరాయణు లగుచున్నారు. సంసారబాధ్యతాభారములు దంపతులకు తగ్గిపోవుచున్నవి. పిల్లలసంరక్షణశిక్షణభారమును ప్రభుత్వము పూనుచున్నది. స్త్రీలు పురుషులవలెను సైన్యరక్షణాది సకలవృత్తులయందును నధికారులగుచున్నారు. రాజ్యము సంరక్షణభారమునకు తోడు విద్యావినోదవ్యాపార పరిశ్రమనిర్మాణాదిభారము నంతయును వహించుచున్నది. మానవ విశ్రాంతికి యంత్రశక్తియును, యంత్రోపయోగమును వ్యాపకమును గాంచుచున్నవి. మానవులు రాజ్యాంగయంత్రభాగములవలెను నిర్బంధముగను పాటుపడుచున్నను కమ్యూనిజము ధర్మసంరక్షణము ప్రజలకు విధ్యుక్తమైనది. రుష్యారాష్ట్రములు ౮,౨౪౧,౬౨౩ చదరపుమైళ్ళవిస్తీర్ణమును,౧౬౬,౨౯,౮౩,౦౦౦ ప్రజలను అపారమైన పాడిపంటలను, సహజసంపదలను, శక్తిసాధనములనుగలిగి యూరపు ఆసియా ఖండములందు ప్రాబల్యమును బడయుట విధికృతము. అన్ని రాజ్యములును క్రమముగను సోవీటురుష్యాకుగల సహజస్వత్వముల నంగీకరించుచు సంధివ్యాపారముల నాదరించుచున్నవి. ఫ్రాన్సు రుష్యాలకు మహాసంగ్రామమునకుపూర్వమువలెనే వర్తమానకాలమునందును సంధియేర్పడినది. రుష్యారాజ్యమునకు ఆసియాఖండమునందు జపాను, యూరపుఖండమునందు జర్మనురాజ్యము ప్రబలశత్రువులు. విశాలమైన రుష్యారాజ్యాంతర్భాగములను కబళించుటకు రెండు రాజ్యములును సంకల్పించినవి. మాస్కోవునకు దూరమునందున్న జపాను ఆటలు కొంతసాగినను యూరపురాజ్యముల నడుమనున్న జర్మనీఆటలు సాగుట దుర్లభము.

విశాలమైన రాజ్యమును రక్షించుటకు రుష్యారాజ్యమును సాయుధవైమానికదళమును సిద్ధముచేయుచున్నది. వైమానికదళనిర్మాణమునందు జర్మనుల ప్రావీణ్యమత్యధిక మని యంగీకరింపబడుచున్నది. జర్మనులు, రాజ్యాధికారులు వారిశక్తిసామర్థ్యములను,జర్మను ప్రజలను వైమానికులను జేయుటకు జేయుచున్న శిక్షప్రయత్నములు బహిరంగరహస్యములు. వర్తమాన సంవత్సరమునందు జర్మనీ ౨౦,౦౦౦ వాయువిమానములను గలిగియుండునట్లు ల్యూహింపబడుచున్నది. రుష్యా, ఫ్రాన్సు, బ్రిటను, ఇటలీ మొదలగు రాజ్యములకు జర్మనీమార్గము నవలంబించుట యనివార్యమైనది.

ఇటలీరాజ్యమును జర్మనురాజ్యమువలెను ముస్సొలోని నాయకత్వముక్రిందను విజృంభించి కయ్యమునకు కాలుదువ్వుచున్నది. ఫ్రాన్సు ఆఫ్రి
ఇటలీ కాయందిటలీరాజ్యమున కభయమునొసంగినది. ఇటలీ రాజ్యము అబిసీనియా రాజ్యముపట్లను చూపుచున్న దుర్వినయము పాశ్చాత్యరాజ్యముల దురాక్రమణమునకు ప్రబలనిదర్శనము. ముస్సొలోని హిట్లరుగారలమార్గములు సామాన్యములైనను ప్రయోజనములు భిన్నములు. జర్మనురాజ్యము బలప్రదర్శనమూలమునను సర్వత్ర విజయధ్వజములను స్థాపింపను సంకల్పించినది. ఇటలీ చతుర్విధోపాయములను ఇటలీ ప్రాబల్యమును వ్యాప్తముచేయుట కుపక్రమించినది. ఇటలీ యవలంబించెడి సామదానోపాయములకు పోపు మతాభిమానమునకు కొంత వినియోగపడవచ్చును. ముస్సొలోనిఫాసిజమునందు సీజరుప్రతిష్ఠ, పోపుప్రతిష్ఠ సమ్మేళనమును పొందియుండును. హిట్లరుఫాసిజమునందు కేయిజరు ముష్టియుద్ధప్రతిష్ఠ మూర్తీభవించినది. ఇటలీఫాసిజము యూరపుశాంతిసంరక్షణమునకు కొంత వినియోగపడునను నాశ గలుగుచున్నది. బ్రిటను, ఫ్రాన్సు, ఆస్ట్రియా, ఇటలీరాజ్యములసంయోగబలము శాంతిసంరక్షణమునకు సాధనము గాగలదను నాశ ప్రబలుచున్నది.

యూరపురాజ్యాంగములందు రాజ్యాంగపరివర్తనమునకు భావపరివర్తనమునకును నిలయము. మానవ

**ఫ్రాన్సు**

స్వాతంత్ర్య చిహ్నములైన "సమత్వము, స్వాతంత్ర్యము, సోదరత్వము" ఫ్రాన్సుదేశమునందు వికసించి ప్రసవించినవి. గ్రేటు బ్రిటను, జర్మను రాజ్యముల నడుమను చిరకాలము నుండియును పరాసుభూమి రణరంగముగను పరిణమించినది. గతించిన అయిరోపా మహాసంగ్రామసమయము నందువలెను వర్తమానకాలమును నీపరిస్థితులనే వెల్లడి చేయుచున్నది. ఆదికాలమునుండియును జర్మనీ ఫ్రాన్సు రాజ్యములకు గల వైర ముపశమించుటకు సాధనములు దుర్లభములు. జర్మనీయందు గతవత్సరమునందు నాజీ పక్ష విజృంభణము తిరిగి ౧౯, ౮-వ సంవత్సర పరిస్థితులను సమకూర్చుచున్నది. ఫ్రాన్సుదేశము పూర్వము వలెనే సంగ్రామసన్నాహములను చేయుచున్నది. గత సంవత్సరమునందు సైన్యములకు ౫,౯౦,౦౦,౦౦౦ సవరనులు వ్యయమైనవి. ౩౦౦౦ విమానదళమునుగలిగియున్నను విమానబలమునందు వెనుకబడుచున్నది. గత సం. నందు సారుప్రజలయభీష్టప్రకటనము జర్మనుప్రజల దృఢసంకల్పము సువ్యక్తముచేసినది. ప్రజలు ౧౦౦ కి ౯౦ వంతునను జర్మనుసంయోగమును వ్యక్తముచేసిరి. ఫ్రెంచి మంత్రిబార్థోగారిహత్య యూరపురాజ్యములందు మహాసంచలనమును గలుగజేసినను ఫ్రెంచి యూగోస్లేవియా ప్రభుత్వము లవలంబించిన నిగ్రహము సంగ్రామాంకురముల వ్యాపనము నాపినది. ఫ్రాన్సుసరిహద్దులందు నిర్మించిన దుర్గావళులు బలీయములైనను దుర్గసంరక్షణము దుర్లభమగుచున్నది. ఫ్రాన్సుసైన్యబలము వర్తమానకాలమునందు ౧౯౧౮ సంవత్సరముకన్నను సకలవిధముల నధ్వాన్నముగ నున్నది. ఫ్రాన్సుదేశమునందు సంగ్రామవ్యూహనిర్మాణమున కవసరమైన సైన్యదళములు లేవు. ఉన్నసైన్యదళములనైనను సైన్యవ్యూహములను సమకూర్చుట దుర్లభము అని ఫ్రెంచిసైన్యసంఘము తలచుచున్నది. జర్మనీ ఇటలీదేశములందు గల విమానదళములు కొన్ని గంటలలో విమానదళములు వ్యూహములై యన్ని ఫ్రాన్సు రైలుమార్గములను ధ్వంసము చేయగలవు. జర్మను ఫిరంగులును విశేషాభివృద్ధిని పొందినవి. జర్మను విమానములు గంటకు ౨౦౦ మైళ్లు వేగమునను నూతనాయుధములతోను ఫ్రాన్సుమీదను దండయాత్రచేసి వెడలగలుగునపుడు ఫ్రాన్సు కల్పించిన రక్షణమార్గమంతయును నిరర్థకము కాగలదు. ఫ్రాన్సురాజ్యమాయుధవిసర్జనమును శాంతిసంరక్షణమును గోరుచున్నపుడు జర్మనురాజ్యము సంపూర్ణాయుధధారణమును బూనుటయును కయ్యమునకు కాలు దువ్వుటయును విషాదకరమైనను హిట్లరుగారు స్వయంప్రకటనములతోను స్వకార్యములను సాధించుటయును సంభవము. కాలక్రమమునను జర్మనుబలాయుధము లభివృద్ధిని పొందుట సహజమైనను ఫ్రాన్సుప్రజలు ప్రాణ మున్నంతవరకును దేశసంరక్షణమును చేయదలచినవిధమును గతించిన ౧౫౦ సంవత్సరముల చరిత్రము తెల్లము చేయుచున్నది. ఆసన్నమైన మహోపద్రవమునుండి స్వదేశమును, యూరపుఖండమును, ప్రపంచమును కాపాడుట యూరపురాజ్యాంగములకు ధర్మమైయున్నది. బెల్జియము, పోలండు, జూగోస్లావియ, జెకస్లావిక, రూమేనియ, రుష్యా, గ్రేటుబ్రిటను, ఇటలీ రాజ్యములతో ఫ్రాన్సు సంరక్షణ సంధులను జేసికొన్నది. యూరపురాజ్యముల సమరసంక్షోభమునందు ఫ్రాన్సు అనుభవించుచున్న కష్టపరంపరలు యూరపు రాజ్యముల యోగక్షేమములకును, శాంతిసంరక్షణమునకును పరమావసరములు. సర్ జాన్ సైమను, ఈడెనుగారలు ఫ్రాన్సు, జర్మనీ, ఇటలీ రాజ్యములలో చేసెడి సంప్రతింపులు యూరపుశాంతిని గాపాడుటకు వినియోగపడు గాత!

యూరపునందలిపోలండు, సర్వియా, రుమేనియ, స్వీడను, బెల్జియము, బల్గేరియ, స్విజర్లాండు, స్పెయిను

**చిన్న రాజ్యములు**

జెకొస్లావాకియ, గ్రీసు, హంగరి, తుర్కి మొదలగు స్వల్పరాజ్యములు

మహారాజ్యముల మధ్యను దుర్భరదుఃఖవేదన ననుభవించుచున్నవి. మహారాజ్యములపంచతంత్రములు స్వల్ప రాజ్యములస్థితిగతులను దుర్భరము చేయుచున్నవి. రుష్యా జర్మనురాజ్యముల మధ్యను స్వల్పరాజ్యములు నిలుచుట దుర్లభమైనను స్వల్పరాజ్యముల స్వతంత్రసంరక్షణమే పూర్వమువలెనే భావికాలమునందును మహాసంగ్రామాంకురములకు క్షేత్రములు గావచ్చును. యూరపుఖండమునందు శాంతిని సంరక్షించుట బ్రిటీషుసామ్రాజ్యమునకు పురుషార్థము, పుణ్యము.

ఐరోపా మహాసంగ్రామానంతరము ప్రపంచమునకు గలిగిన వైరాగ్యము క్రమముగ నంతరించినవిధము గతించిన పదినైదేండ్ల వ్యవహారములును వెల్లడిచేయుచున్నవి. ప్రపంచమునందు పునర్నిర్మాణభారము అమెరికామీద వలె బ్రిటిషుసామ్రాజ్యముమీదను కలదు.

బ్రిటిషు సామ్రాజ్యము

సూర్యాస్తమయములేని బ్రిటిషుసామ్రాజ్యము భూమండల వ్యాప్తమై పునర్నిర్మాణమునకు సకలవిధముల ననుకూలముగ నున్నది. బ్రిటిషు సామ్రాజ్య విస్తీర్ణ జనసంఖ్యలు:—

| | మైళ్ల విస్తీర్ణము | జనసంఖ్య |
|---|---|---|
| యూరపునందు | ౧,౨౮,౫౮౨ | ౪,౯౦,౦౦,౦౦౦ |
| ఆసియాయందు | ౧౭,౨౪,౫౫౦ | 3౬,౫౦,౦౦,౦౦౦ |
| ఆఫ్రికాయందు | ౪౬,౧౨,౦౦౦ | ౬,౦౦,౦౦,౦౦౦ |
| ఉత్తర అమెరికా | 3౭,౯3,౦౨౦ | ౯౦,౦౦,౦౦౦ |
| మధ్యఅమెరికాయందు | ౭,౬౦౦ | ౫౦,౦౦౦ |
| వెస్టుఇండీసునందు | ౧౨,3౦౦ | ౨౦,౦౦,౦౦౦ |
| దక్షిణ అమెరికా | ౯,౮౭ ౦౦౦ | 3,౨౦,౦౦౦ |
| ఓషియానియా | 33,౦౦,౦౦౨ | ౯౦,౦౦,౦౦౦ |
| మొత్తము | ౧,౯౯,౦౯,౮౭౨ | ౪౯,33,౮౦,౦౦౦ |

గ్రేట్బ్రిటనునందు అధినివేశ రాజ్యములందు ౭ కోట్లమంది తెల్లజాతివారును, శేషించిన ప్రజలందు 3౫,౨౮,3౭,౭౭౮ హిందూదేశీయులును, ఇతరులు ౭ కోట్లమందియు వివిధ ప్రాంతములందును గలరు. ప్రజలందు హిందువులు ౨౧ కోట్లమంది, మహమ్మదీయులు ౧౦ కోట్లమంది, క్రైస్తవులు ౮ కోట్లమంది, బౌద్ధులు ౧,౨౦,౦౦,౦౦౦, శేషించినవారు ఇతరమతస్థులు. ఈ మహాసామ్రాజ్యమునకు గ్రేట్బ్రిటను మూలస్థానము. సామ్రాజ్యాంతర్భాగములందు స్వపరిపాలనాధికారము గల అధినివేశరాజ్యములును, మధ్యమాధికారము గల క్రౌనుకాలనీలును, నిరంకుశాధికారము గల పరాధీన రాజ్యములును, వివిధములైన పరిపాలనవిధానములు గల ప్రదేశములును గలవు. తెల్లజాతులుగల ప్రదేశములందు స్వపరిపాలనమును, తెల్లవారులేని స్థలములందు నిరంకుశ పరిపాలనమును బ్రిటిషు రాజ్యాంగములకు కీలకములు. బ్రిటిషుసామ్రాజ్యపరిపాలనము పూర్వమువలెనే బ్రిటిషు ప్రయోజనములకును, తెల్లవారి ప్రయోజనములకును వినియోగపడినటులు స్వదేశీయుల ప్రయోజనములకును, శ్వేతేతరజాతుల ప్రయోజనములకును వినియోగపడుట లేదు. ప్రపంచమునందు కాలక్రమమున మానవ స్వాతంత్ర్యవికాసము సంప్రాప్తమగుచున్నను బ్రిటిషు సామ్రాజ్య నిర్వాహకులు పూర్వ పరిస్థితులనే సంరక్షించుచు సామ్రాజ్యక్షేమమునకును, సామ్రాజ్యాంతర్భాగ వికాసమునకును ప్రతిబంధకములను కల్పించుట రాజనీతిగ పరిణమించినది.

గ్రేట్బ్రిటను నౌకాదళమునందు వెనుకబడినను నీయేడు 3000 విమానములు నిర్మించుటకు నిర్ణయింపబడినది. గ్రేట్బ్రిటనునందు పన్ను ౧౯౧3 నందు తల ౧-కి 3-౧౧-౦ నుండి ౧౯33 నందు స. ౧౬-౭-౦ నకు హెచ్చినది. ఒటావా యొడంబడికయును బంగారుప్రమాణ విసర్జనమును వ్యాపారాభివృద్ధిని కొంత గలుగజేసినను నది సంతృప్తికరముగాదు. గత సంవత్సరమునందు మద్యపానమునకు ౧,౨౮,౧౭,౦౦౦ సవరనులు వ్యయమైనవి. ప్రజలు తల ౧-కి మద్యమునకు స. ౮-౧౭-౮ను పన్నులకు ౧౬-౭-౦ సవరనులును చెల్లించుట బ్రిటీషుభాగ్యస్థితికి నిదర్శనమైనను శుభస్థితికి నిదర్శనము కాదు. క్షీణించుచున్న బ్రిటీషువ్యాపార పరిశ్రమాదుల నుద్ధరించుట కాత్మవిశ్వాసమును స్వయంసహాయమును సాధనములు కాని వ్యాపారరక్షణమును పరాక్రమణమును సాధనములు

శావు. కన్సర్వేటివుకవచమును ధరించిన జాతీయప్రభుత్వము క్రమముగను ప్రజావిశ్వాసమును గోల్పోవుచున్నవిధము భావి ఎన్నికలఫలము తెలుపుచున్నవి.

**ఆసియా**

ఆసియాఖండమని భూభాగములందు విశాలమైన ప్రాచీనఖండము. ఆసియా భూతలమునందు మూడవవంతువిస్తీర్ణమును, ౧,౦౧,౩౦,౦౦,౦౦౦ ప్రజలను కలిగియున్నది. భూగోళమునందు గల ౧౮౫ కోట్ల ప్రజలందును ౧౦౧ కోట్లు ఆసియాయందు కలరు. చీనాయందు ౪౨, హిందూస్థానమునందు ౩౫, ఆసియా రుష్యాయందు ౫, నెదర్లాండునందు ౬, జపాను రాజ్యమునందు ౮ కోట్ల మంది ప్రజలు కలరు. ఆసియాఖండము ప్రకృతిసంపదల కాకరమై ఆదికాలమునుండియును మానవాభ్యుదయమునకు వినియోగపడిన విధమును ప్రపంచేతిహాసములు వ్యక్తము చేయుచున్నవి. యూరపు రాజ్యముల వ్యాపనాధిపత్యము లాసియాఖండవాసులను నిరర్థకులను నిర్వీర్యులను నిర్ధనులనుజేసినది. ఆసియా ఆఫ్రికాఖండములయాధిపత్యము యూరపురాజ్యముల భాగ్యభోగములకువలెను విజ్ఞానమునకును మూలాధారము. ఆసియాయందు ౨౦ లక్షలవిస్తీర్ణమును ౩౬ కోట్ల ప్రజలును గల బ్రిటీషుసామ్రాజ్యాంతర్భాగములు గలవు. బ్రిటీషుద్వీపము లాసియాఖండమునందలిబ్రిటీషుసామ్రాజ్యాంతర్భాగములకు ౩౨ కోట్ల సవరనుల ఎగుమతులను, సామ్రాజ్యాంతర్భాగములనుండి ౩౦ కోట్ల సవరనుల దిగుమతులను జేయుచు ౯౨ కోట్ల సవరనుల నష్ట నిచ్చినది. ఆసియాసామ్రాజ్యాంతర్భాగములందు హిందూస్థానము బ్రిటీషుసామ్రాజ్యశుభస్థితికి మకుటముగ నున్నది. యూరపురాజ్యము లాసియాఖండభాగములను తాత్కాలికమైనబాహుబలముచేతను జయించినను ఆసియాఖండము యూరపు రాజ్యములను నిత్యమైన ధర్మబలముచేతను జయించినది. యూరపు రాజ్యముల విజ్ఞానమునకు మూలాధారము లైన యవన రోమక సంస్కారములును ఆసియా విజ్ఞానఫలములు. యవనతత్త్వశాస్త్రమును రోమక ధర్మశాస్త్రమును ఆసియావిజ్ఞానసంస్కారఫలములు. ఆసియాయందలి అలెగ్జాండరువిజయములును, రోమకసామ్రాజ్యవిజయములును నామరూపములు లేకను జీర్ణించినను ఆసియావైజ్ఞానికవిజయము లవిచ్ఛిన్నముగను పల్లవించి ప్రసవించుచున్నవి.

**విజ్ఞానవిజయము**

యూరపు మతధర్మ సంస్కారమునకు మూలబీజమైన క్రైస్తవమతమున కాసియాఖండము జన్మస్థానము. క్రైస్తవమతము పశుప్రాయులైన యూరపు ప్రజలను మానవధర్మ పరాయణులను చేసిన విధమును యూరపు దేశచరిత్రములు వెల్లడి చేయుచున్నవి. యూరపు రాజ్యములు క్రైస్తవమతమును స్వీకరించినను క్రైస్తవధర్మవికాసము ప్రాచ్యదేశములందువలెను పాశ్చాత్యదేశములందు సాధ్యము గానివిధమును క్రైస్తవమతవ్యాపనము బోధించుచున్నది. ప్రపంచవ్యాప్తము లైన క్రైస్తవమహమ్మదీయమతములకును తత్త్వశాస్త్రములకును నాసియాఖండము జన్మస్థానము. ఆరంభమునందు యూరపురాజ్యముల పశుబల మాసియాఖండవాసులకు సంభ్రమసమ్మోహములను గలుగజేసినను సహజమైన ధర్మబలముసమ్మోహనాస్త్రములనుశిథిలముచేసి ఆసియాఖండవాసులకు ప్రత్యభిజ్ఞానమును గలుగజేయుచున్నది. జపాను సామ్రాజ్యమునందు ౨,౬౦,౭౩౮ చదరపుమైళ్ల ప్రదేశము, ౯ కోట్ల ప్రజలు గలరు.

**జపాను**

జపానీయుల బాహుబల విజయములు ప్రాచ్యులకాత్మ సంస్మరణమునకును, ఆత్మ విశ్వాసమునకును, వినియోగపడినవి. సంగ్రామరంగములందువలెను ఆర్థికవ్యాపార పారిశ్రామిక రంగములందును జపానీయుల విజయములును, పాశ్చాత్యుల పరాజయములును శ్వేత జాతుల పరాక్రమ భ్రమను, శ్వేతేతరజాతుల దౌర్బల్య భ్రమను తొలగించి ఆసియా వాసులకు ప్రత్యభి

జ్ఞానము గలిగించినవి. ఆసియాఖండవాసులకు, ముఖ్యముగను జపాను ప్రజలకు గలిగిన ప్రత్యభిజ్ఞానము భయంకరమైన సంగ్రామపరిణామమును పొందుట సంభవము. కాలాంతరమునందైనను యూరపుపరాజయమును, ఆసియావిజయమును ధ్రువములైనను సన్నిహితభావిపరిణామము దారుణముగ నున్నది. మంచూరియారంగమునందు రుష్యా-జపాను రాజ్యములు చేయుచున్న సంగ్రామసన్నాహములు పాశ్చాత్యరాజ్యముల యాదరణమునకు పాత్రములై భయంకర పరిణామమునకు బీజము లగుచున్నవి. మంచూకో స్వతంత్రరాజ్య స్థాపనమునకు నానాజాతిసమితిరూపమునను యూరపురాజ్యములును, అమెరికా - సంయుక్తరాష్ట్రములును ప్రతిఘటించినను తన దృఢసంకల్పమును గత సంవత్సరమునందు సార్థకము చేసినది. కెయిజరు ౩౦ ఏండ్లకు పూర్వము నిర్ణయించినటులు శ్వేతజాతు లన్నియును జేరి పింగళజాతులను, నల్లజాతులను నిర్జింపబూనుట సహజము. శ్వేతజాతుల సంస్కారమె ప్రపంచేతిహాసములందు సుందోపసుందోపాఖ్యానముగను పరిణమింపగలదు. ఆసియాఖండవాసులకు ప్రాణ మాన ధన ధర్మ రక్షణముల కాసియాఖండవాసుల పూర్ణసంయోగ మత్యంతావసరము. ప్రపంచమునందు శాంతిని ధర్మమును స్థాపించుట కాసియాధర్మవిజయమునకు బలవిజయమును నవసరముగ నున్నది.

మూదిపరిశ్రమవ్యాపార నిర్వహణ విషయము లందు జపాను హిందూస్థానములకును జరిగిన యొడంబడిక జపానుప్రజల కార్యశూరత్వమునకు నిదర్శనము. బ్రిటీషు రాజ్యాధికారులు హిందూస్థానమునందువలెను ప్రపంచమునందంతటను వ్యాపార పరిశ్రమల పంపకమున జపానుకును స్వదేశములకును ప్రతికూలముగను గోరుటను జపాను నిరాకరించుట న్యాయము. ఆసియాఖండ సంయోగావసరమును జపాను ప్రకటించినవిధము మానవస్వాతంత్ర్య ధర్మాభిలాషుల కభివందనపాత్రము. శ్వేతప్రజల స్వప్రయోజనపరాయణత్వమునకు ౧౦౦ కోట్ల ప్రజలను నిరంతర దరిద్రదాస్యావరణములందు నిలిపియుంచుట మానవధర్మాభ్యుదయమునకును, విశ్వకల్యాణమునకును, శ్వేతముఖులస్వప్రయోజనములకును నిరుపయోగము. జపాను చీనారాజ్యముపట్లను జూపుచున్న భేదదండన తంత్రములను విడిచి సామదానోపాయముల నవలంబించుట యుభయదేశములకును శ్రేయస్కరము.

విశ్వమునందు విశ్వాధారమైన ధర్మసూత్రము విశ్వసంరక్షణపోషణమునకై వినియోగపడుచు విశ్వయాత్రయందు వృద్ధిక్షయములు సంభవములగుచున్నవి.

**హిందూస్థానము**

హిందూస్థానము విధివశమునను నామరూపములందు మార్పులు గలిగినను మానవధర్మపరిణామమున కవిచ్ఛిన్నముగను వినియోగపడుచున్నది. వేలయేండ్లవిచ్ఛిన్నముగను సజీవముగను నున్న మతాచార సంప్రదాయ బద్ధమయిన హిందూస్థానము భావికాలమునందును సజీవముగ నుండుట ప్రకృతిధర్మము. వేదవేదాంత పరమైన మానవధర్మశాస్త్ర పరిణామమునకు హిందూస్థానము ప్రపంచమునందు సుక్షేత్రముగ నున్నది. వివిధమతస్థులకును, జాతులకును, సంఘములకును, సాహిత్య సారస్వతములకును, సంస్కారాచారవ్యవహారములకును హిందూస్థానమునందుగల సంయోగ సాహచర్యములు భావిమానవధర్మపరిణామమునకు శుభసూచకములు. తత్త్వవిచారమున కేకాంతమైన వేదాంతాద్వైతము నివృత్తియందువలెను ప్రవృత్తియందును సమన్వయముగాగలవిధమును భారతీయసంస్కారము విశదము చేయుచున్నది. యూరపుఆసియాఖండరాజ్యము లాత్మోద్ధరణమునకు కర్మయోగావలంబనమును పూనిన సమయమునందు, భారతీయులును పూర్ణకర్మయోగ పరాయణులయి పురుషార్థమునుబడయుట పరమార్థము. అఖండమైన సహజసంపదలు, ౩౫ కోట్లప్రజలు, ౧౦,౯౮,౩౦౦ చదరపుమైళ్ల విస్తీర్ణమునుగల భరతఖండము స్వయంపోషణమునకు సకలవిధములను తగియున్నది. భారతీయులాత్మ

విశ్వాసపరాయణులును, స్వయంసహాయ యోగాభ్యాస పరాయణులును నయి పుణ్యమును పురుషార్థమును బడయుటకు భగవంతు డనుగ్రహించుగాత !

హిందూస్థాన రాజ్యాంగములు

మహాఖండమైన భరతఖండ మాదికాలము నుండియును నేకఖండముగను వ్యవహరింపబడినవిధమును హిందువుల నిత్యసంకల్పము విశదము చేయుచున్నది. ప్రపంచ పరిణామమునందు మమకారాహంకారములు వికాసమునకువలెను విలయమునకును వినియోగపడుచున్నవి. కురుక్షేత్ర రణరంగవ్యవహారముల విషయమై ధృతరాష్ట్రునకు తనవారేమి చేసిరనువిషయమునను, దుర్యోధనునకు జయాపజయ విషయమునను, విజయునకు ధర్మాధర్మవిషయమునను సంశయము గలిగినది. 'శరీరమాద్యంఖలు ధర్మసాధనం' అనెడి ధర్మము ప్రవృత్తియందు ప్రధానధర్మసూత్రము ధర్మజిజ్ఞాసకును, కర్మజిజ్ఞాసకును, బ్రహ్మజిజ్ఞాసకును మూలాధారము మహత్తుపరిణామమైన ప్రవృత్తి. భారతీయ రాజ్యాంగ పరిణామమునకు మూలస్కంధములు భారతీయులు, భరతఖండము. ప్రవృత్తియందు సకలార్థసాధనములును ప్రజలమీదను, దేశముమీదను నాధారపడి దేశప్రజాభ్యుదయములకు వినియోగపడుచున్నవి. హిందూస్థాన రాజ్యాంగవ్యవహారములు సహజమైన ధర్మసూత్రమునకు భిన్నముగను విదేశప్రజల లాభములకును, విదేశ ప్రయోజనములకును వినియోగపడుచు నిరుపయోగములుగ నున్నవి. ఏకత్వమునం దనేకత్వ సంభావనా సందర్శన సమత్వభావములు వేదాంతమునందువలెను రాజ్యాంగములందును సమానధర్మముగనున్నవి. నిత్యమైన ధర్మసూత్రార్థానుసారముగను హిందూస్థాన రాజ్యాంగనిర్మాణము ఫెడరేషను ధర్మసూత్రముల ననుసరించుట సహజధర్మము.

ఫెడరేషను

మహాఖండమైన భరతఖండమునకు భిన్నరాష్ట్రములు, మతములు, భాషలు, జాతులు, సంస్థానములు, పరిస్థితులు, ప్రయోజనములు ప్రత్యేక సంరక్షణమును కోరుచున్నను ఏకాంత ప్రయోజనసంవర్ధన సంరక్షణములందే ప్రత్యేక ప్రయోజనము రక్షణములును సాధ్యములు. హిందూస్థాన మేక దేశలక్షణలక్ష్యములనుచిరకాలమునుండియును కలిగియున్న విధమునకు ప్రాచీనరాజ్యాంగములు, మహమ్మదీయ బ్రిటీషు రాజ్యాంగములు ప్రబలప్రమాణములు. బ్రిటీషురాజనీతితంత్రము ప్రజాలక్ష్యమును, రాష్ట్రముల లక్ష్యమును, సంస్థానలక్ష్యమును పరావలంబనమునందు లగ్నమై పరమానర్థములకు మూలమైనది. బ్రిటీషు ప్రభుత్వమవలంబించిన రాజ్యాంగవిధాన భావిరాజ్యాంగ విధానమును నిరర్థకముచేయుట సహజమైనను ఫెడరేషనువిధానమును నితరవిధానములవలెను ప్రయోగయోగ్యముగ నున్నది. హిందూస్థానమునందు గల రాష్ట్రములను, సంస్థానములను నేకభావప్రయోజనబద్ధములను జేయుటయందు బ్రిటీషుప్రదేశ ప్రయోజనములకును, సంస్థానములప్రయోజనములకును, బ్రిటీషుసంస్థానముల ప్రజాప్రయోజనములకును సామరస్యము సహజమైనను సంఘర్షణ మనివార్యము.

బ్రిటీషు రాష్ట్రములు

నూతనరాజ్యాంగవిధానమునందు నూతనమైన ఉత్కళసింధురాష్ట్రములు చేరి ౧౧ స్వపరిపాలనరాష్ట్రములును, ౮ కమిషనరు రాష్ట్రములును కల్పింపబడినవి. ఆ రాష్ట్రములం దయిదు రాష్ట్రములు మద్రాసు, బొంబయి, బెంగాలు, సంయుక్తరాష్ట్రములు, బీహారు ౧. లెజిస్లేటివు అస్సెంబ్లి ౨. లెజిస్లేటివుకౌన్సిలును, శేషించిన రాష్ట్రములందు అస్సెంబ్లిమాత్రమే యుండునటులు నిర్ణయింపబడినది. ప్రజలయందు స్వల్పమయినను ప్రబోధ మేర్పడినపుడు దాని నిర్బంధించుటయె రాజ్యాంగములకు ప్రయోజనమని జె. పి. సి. రిపోర్టును, పార్లమెంటు శాసించుచున్న ఇండియాబిల్లు నిబంధనలును విశదము చేయుచున్నవి. వివిధరాష్ట్రములందును లెజిస్లేటివు అస్సెంబ్లి సభ్యుల సంఖ్య:—

# రాష్ట్రీయ శాసనసభలు

| రాష్ట్రములు | మొత్తము సభ్యులసంఖ్య | సాధారణ సభ్యుల స్థానములు: మొత్తము సాధారణ సభ్యులస్థానములు | సాధారణ సభ్యుల స్థానములు: కొన్ని జాతులకు ప్రత్యేకించబడిన స్థానములు | నిమ్న జాతులు మొదలయినవారి స్థానములు | సిక్కులు | మహమ్మదీయులు | ఆంగ్లో యిండియనులు | యూరోపియనులు | హైందవ క్రైస్తవులు | వాణిజ్యపరిశ్రమలు మొదలగు స్థానములు | భూస్వాములు | విశ్వవిద్యాలయము | కార్మికులు | స్త్రీలకు: సాధారణ స్థానములు | స్త్రీలకు: సిక్కులు | స్త్రీలకు: మహమ్మదీయులు | స్త్రీలకు: ఆంగ్లో యిండియనులు | స్త్రీలకు: హైందవ క్రైస్తవులు | రాష్ట్రముల జనసంఖ్య లక్షలు |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| మదరాసు | ౨౧౫ | ౧౪౬ | ౩౦ | ౧ | — | ౨౮ | ౨ | ౩ | ౮ | ౬ | ౬ | ౧ | ౬ | ౬ | — | ౧ | — | ౧ | ౪౫౬ |
| బొంబాయి | ౧౭౫ | ౧౧౪ | ౧౫ | ౧ | — | ౨౯ | ౨ | ౩ | ౩ | ౭ | ౨ | ౧ | ౭ | ౫ | — | ౧ | — | — | ౧౮౦ |
| బెంగాలు | ౨౫౦ | ౭౮ | ౩౦ | — | — | ౧౧౭ | ౩ | ౧౧ | ౨ | ౧౯ | ౫ | ౨ | [illegible] | ౨ | — | ౨ | ౧ | — | ౫౦౧ |
| సంయుక్తరాష్ట్రములు | ౨౨౮ | ౧౪౦ | ౨౦ | — | — | ౬౪ | ౧ | ౨ | ౨ | ౩ | ౬ | ౧ | ౩ | ౪ | — | ౨ | — | — | ౪౮౪ |
| పంజాబు | ౧౭౫ | ౪౨ | ౮ | — | ౩౧ | ౮౪ | ౧ | ౧ | ౨ | ౧ | ౫ | ౧ | ౩ | ౧ | ౧ | ౨ | — | — | ౨౩౬ |
| బీహారు | ౧౫౨ | ౮౬ | ౧౫ | ౭ | — | ౩౯ | ౧ | ౨ | ౧ | ౪ | ౪ | ౧ | ౩ | ౩ | — | — | — | — | ౩౨౪ |
| మధ్యరాష్ట్రములు, బీరారు | ౧౧౨ | ౮౪ | ౨౦ | ౧ | — | ౧౪ | ౧ | ౧ | — | ౨ | ౩ | ౧ | ౨ | ౩ | — | — | — | — | ౧౫౫ |
| అస్సాము | ౧౦౮ | ౪౭ | ౭ | ౯ | — | ౩౪ | — | ౧ | ౧ | ౧౧ | — | — | ౪ | ౧ | — | — | — | — | ౮౬ |
| పశ్చిమోత్తర సరిహద్దు రాష్ట్రము | ౫౦ | ౯ | — | — | ౩ | ౩౬ | — | — | — | — | ౨ | — | — | — | — | — | — | — | ౨౪ |
| ఒరిస్సా | ౬౦ | ౪౪ | ౬ | ౫ | — | ౪ | — | — | ౧ | ౧ | ౨ | — | ౧ | ౨ | — | — | — | — | ౬౭ |
| సింధు | ౬౦ | ౧౮ | — | — | — | ౩౩ | — | ౨ | — | ౨ | ౨ | — | ౧ | ౧ | — | ౧ | — | — | ౩౯ |

వివిధరాష్ట్రములందును లెజిస్లేటివు కౌన్సిలు సభ్యుల సంఖ్య:— బంగాళము ౬౫, సంయుక్తరాష్ట్రములు ౬౦, బీహారు ౩౦, బొంబయి ౩౦, మద్రాసు ౫౬.

సర్ సౌమ్యుయేలుహోరుగారును, వారి సహచరులును స్వపరిపాలనరాష్ట్రనిర్మాణములను జేయుచు ప్రధానరాష్ట్రములందు రెండు శాసనసభలను నిర్మించుటయును స్వపరిపాలనావరణములను సంకుచితము చేయుచు సంస్కరణముల ప్రయోజనమును నిరర్థకము చేయుచున్నవి. ప్రతినిధుల నెన్నుకొనుటయం దేర్పడిన ప్రత్యేకసాంఘిక హద్దులను నిర్ణయించుట మూలప్రయోజనములనే నిర్మూలము చేయుచున్నది. ఫెడరలు ప్రభుత్వమునకు ప్రతినిధులను పరోక్షమార్గమునను నెన్నుకొనుటయును నసంభావ్యము. రాష్ట్రీయస్వపరిపాలనమున కేర్పడిన రక్షణములు, మినహాయింపులు, హక్కులు, బాధ్యతలు పోను శేషించిన ధనాధికారములు స్వపరిపాలననామమున కర్హముకావని రాజ్యాంగవేత్త లందరును ఘోషించుచున్నారు. గవర్నరుగారికి నిర్ణయించిన ప్రత్యేకాధికారములు, నిరంకుశశాసననిర్మాణాధికారము స్వపరిపాలన భావమునకే ప్రతికూలము. అయినను జాయింటు పార్లమెంటరీకమిటీ రిపోర్టును ఖండించినవారు కొందరు సంస్కరణవిధానము నాదరింపగోరుట దేశావృతమైన భావక్రియాదాస్యమునకునిదర్శనముగనున్నది. రాష్ట్రీయస్వాతంత్ర్య మధికారలాభములను నన్నుగ్రహింపకపోవుటయెకాకను ప్రజల పన్నుల భారమును మాత్రము వృద్ధిచేయుటకు వినియోగపడుట యథార్థము. నూతన రాష్ట్రనిర్మాణములందును రాజకీయ ప్రయోజనములకు గల ప్రతిష్ఠ ప్రజాప్రయోజనములకు లేకుండుట సంస్కరణముల మూలసంకల్పమును విశదము చేయుచున్నది. రాష్ట్రములందును, ఫెడరలు ప్రభుత్వమునందును ధనస్వాములకు, భూస్వాములకు, వ్యాపారస్థులకు, పురవాస్తవ్యులకును స్థిరస్థానములేర్పడి గ్రామవాసు లెప్పటిరీతిని కష్టములపా లగుదురని రిపోర్టులు, నాయకాభిప్రాయములు, శాసనసభలచర్చలు, పార్లమెంటుచర్చలు విశదము చేయుచున్నవి.

ఫెడరేషను ప్రభుత్వమునకును, సంస్థానప్రభుత్వములకును గల సంబంధములను నిర్ణయించుటయందు భేదాభిప్రాయము లనంతము లుండుట సహజము.

**ఫెడరలు ప్రభుత్వము**

రాజ్యాంగశాస్త్రముల కింతవరకును పరిచితమైన విధానములకును, ఇండియాబిల్లు నిర్ణయించుచున్న విధానమునకును గలభేదము విశేషమయినను దేశపరిస్థితులందు మార్గాంతరము దుర్లభము. ఫెడరలు రాజ్యాంగము ప్రాణములేని కల్పవృక్ష మని రాజ్యాంగవిధానపరిశీలనము విశదము చేయుచున్నది. ఫెడరేషను ప్రభుత్వమునకు సంపూర్ణబాధ్యత లేదు. బ్రిటీషురాష్ట్రములు చేరినను సంస్థానభాగములు చేరనంతవరకును ఫెడరేషను ప్రయోగయోగ్యము గాదు. సంస్థానములు ఫెడరేషనునందు జేరుటకు గల్పించుచున్న యభ్యంతరములు స్వప్రయోజనపరాయణములైనను బ్రిటీషుప్రభుత్వాదరణమును బడసినవి. శ్రీనివాసశాస్త్రిగారు తెలిపినటులు సంస్థానాధీశులకు బ్రిటీషుప్రభుత్వమునకును హృదయపరివర్తనము గలుగవలయును. సంస్థానాధీశులు నిరంకుశపరిపాలనవిధానమును విసర్జించి ప్రజాస్వపరిపాలన విధానము నవలంబింపవలసిన యవసరమును గ్రహింపవలయును. హిందూస్తాన సమష్టిప్రయోజనములకు బ్రిటీషుప్రభుత్వాధికారులు, సంస్థానాధీశులు, బ్రిటీషుహిందూస్తాన సంస్థానప్రజలును యథాశక్తిని త్యాగాంజలులను సమర్పించవలసిన యవసరము గలిగినది. గవర్నరు జనరలు నిర్వహించవలసిన ప్రత్యేకాధికార బాధ్యతలు, సంస్థానాధీశుల స్వత్వములు, బ్రిటీషు వ్యాపారరక్షణములు, సైన్యవ్యవహారములు, విదేశవ్యవహారములు, సంస్థానములు, మతసంబంధములు మొదలగు సకలవ్యవహారములును గవర్నరు జనరలు పరిపాలనావరణములందు చేరియున్నవి. శేషించిన యధికారములైనను వ్యవహరించుట ప్రజల కసాధ్యమని ఫెడరలు

అస్సెంబ్లి, స్టేటుకౌన్సిలువ్యవహారములు, సభ్యులసంఖ్యలు విస్పష్టము చేయుచున్నవి. ఫెడరలు అస్సెంబ్లియందు గల ౩౭౫ స్థానములందును ౨౫౦ స్థానములు బ్రిటీషుభాగములకు ౧౨౫ స్థానములు సంస్థానములకును నిర్ణయింపబడినవి. స్టేటుకౌన్సిలునందుగల ౨౬౦ స్థానములందును ౧౫౬ స్థానములు బ్రిటీషుభాగములకును, ౧౦౪ స్థానములు సంస్థానములకును నిర్ణయింపబడినవి. రెండు ఫెడరలు ఛేంబరులందును గల ౬౩౫ సభ్యులందును సామాన్యప్రజాభిప్రాయమును దెలుపుట కెప్పటికిని నవకాశము లుండవు. సంస్థానములస్థానములు ప్రజాభిప్రాయములకు ప్రతికూలుర హస్తగతములగుట సహజము. బ్రిటీషుఇండియాస్థానములకైనను ప్రతినిధులు ప్రజాభిప్రాయములను వ్యక్తము చేయగలప్రతినిధులకు స్థానములను గల్పింపకుండుట కేవలము నిరంకుశాభిమానము. స్టేటుకౌన్సిలున కేర్పడిన సభ్యులందు ౯ ఏండ్లకొకసారి మూడవవంతు సభ్యులు తిరిగి ఎన్నుకొనునటు లేర్పాటుచేయుటవలనను ౨౫ ఏండ్లవరకును నేవిధమైనమార్పులును దుర్లభములు. రాజ్యాంగసంస్కరణములు దేశాభ్యుదయమును స్వారాజ్యమును ముందునకుబదులు వెనుకకు లాగునని పరిశీలనము వెల్లడిచేయుచున్నది. ఇండియాబిల్లు నిర్బంధవిధానములను రక్షించుట కేర్పడినను ప్రజాస్వాతంత్ర్యాభిలాషను నిర్మూలము చేయుట యెవరికిని తరముగాదు. సంస్థానాధీశుల ప్రతినిధులమూలమునను స్వారాజ్యానుభవమును దుర్లభము చేయబూనుట యధర్మము. ప్రపంచావృతమైన మహా పరివర్తనమునందు హోరువర్గము సంకల్పించిన తంత్రము లన్నియును మాయమగు నని గ్రహించుట వివేకము.

హిందూస్తానమునందుగల సంస్థానములు బ్రిటీషు ప్రభుత్వాదరణమునకు పాత్రములై దేశాభ్యుదయమునకు ప్రతిబంధకములగుట దురదృష్టము. పాటియాలా మహారాజు, మైసూరు మహారాజు మొదలగు దేశభక్తిపూరితులైన

సంస్థానములు

సంస్థానాధీశులయినను దేశక్షేమమునకు స్వీయగౌరవప్రతిష్ఠలను విసర్జించుట పరమార్థము. సంస్థానాభ్యుదయము సమష్టి దేశాభ్యుదయముమీద నాధారపడియున్నది; కాని బ్రిటీషుదాక్షిణ్యముమీద నాధారపడియుండలేదు. భారతీయ స్వారాజ్యయజ్ఞమునందు సంస్థానములు చేరకుండుట యసంభవము. సంస్థానాధీశులును కాలమహిమ నుల్లంఘింపజాలరు. సంస్థానముల యోగక్షేమములు భారతీయుల యాదరణమునకు పాత్రములైనటులు బ్రిటీషు రాజ్యాధికారుల యాదరణమునకు పాత్రములు కావు. రోథరుమియరు ప్రభువు పాటియాలా, బికానీరు మహారాజులకు పంపిన సందేశములు సంస్థానాధీశులపట్లను ప్రజలపట్లను కన్సర్వేటివు డైహార్డులకును కన్సర్వేటివులకును గల గౌరవాదరణములకు ప్రమాణములు. ఫెడరేషను హిందూ రాజ్యాంగవిధానమునకు విధికృతమను హోరుగారి వాదమునకును, ఫెడరేషను పనికిరాదను చర్చిలు వర్గవాదమునకును మాటలందు భేద మున్నను ప్రయోజనముమాత్రము సమానము. ఫెడరేషనును రద్దుచేయుటకు వైస్రాయికి సంపూర్ణాధికారముగలదు. సంస్థానాధీశులు మాటలను స్వార్థమును విడిచి స్వీయక్షేమమునకును దేశక్షేమమునకును త్యాగమునుజేసి ఫెడరేషనునందు త్రికరణశుద్ధిగను జేరుట ధర్మము. ఫిరంగిగుండ్లవందనగౌరవము, నిరంకుశాధికారగౌరవము ప్రజాదరణగౌరవముల కెప్పటికిని సాటిరాదు. సంస్థానాధీశు లాత్మసంరక్షణమునకైనను ఫెడరేషను నంగీకరింపకతీరదు. జాతీయప్రభుత్వము జులై మాసతమునకు ఇండియాబిల్లును శాసనము చేయుటయును, ౧౯౩౫ వ సంవత్సరమునం దాచరణమునందు బెట్టుటయును సంభవము. ఇండియాబిల్లు వ్యవహారములందు లేకపోయినను శాసనమునందు సంరక్షణములు, మినహాయింపులు, నిరంకుశాధికారము, ప్రభువు. పార్లమెంటు, హిందూస్తాన కార్యదర్శి బాధ్యతలు గల ఫెడరేషను రాజ్యాంగమును నిర్ణయించుచున్నది. ఇండియాబిల్లునందుగల రాజ్యాంగవిధానము బాధ్యతాయుతపరిపాలన

మయినది, డొమినియనుస్టేటసైనది, నిరంకుశపరిపాలనమైనది, మాయమాట లయినదియును కాలము నిర్ణయించగలదు. సర్ సామ్యుయల్ హోరువర్గమువారేమిసంకల్పించినను ఇండియాబిల్లుపరిణామమును నిర్ణయింపగల శక్తిసామర్థ్యములు భారతీయుల యధీనము నందుమాత్రము కలవు. భారతీయులకు గల శక్తికి అస్సెంబ్లీ వ్యవహారములు ప్రమాణములుగ నున్నవి.

**భారత శాసన సభ**

గత సంవత్సరమునందు జరిగిన అస్సెంబ్లిఎన్నికలఫలితము నిరంకుశప్రభుత్వమునకు జ్ఞానోదయమును గలుగజేయుటకు తగియున్నను ప్రభుత్వహృదయము నందు నంచలనము కలుగకుండుట దురదృష్టము. దేశమునందంతటను కాంగ్రెసుఅభ్యర్థులకును,జాతీయపక్షాభ్యర్థులకును అఖండవిజయము గలిగినది. ప్రభుత్వావలంబకులపరాజయము ప్రభుత్వాధికారులప్రవృత్తియందు నిగ్రహమును గలుగజేయుటకు బదులాగ్రహమును వృద్ధిచేసినది. శ్రీ షణ్ముగముచెట్టి, రామస్వామిమొదలిగారు మొదలగు నాయకుల పరాజయము జిజ్ఞాసకు బదులు ప్రజ్ఞావాదమునకు సాధనమైనది. శ్వేతపత్రమునందలి విధానము జాయంటుకమిటీరిపోర్టునందును, జాయంటుకమిటీరిపోర్టునందలివిధానము ఇండియాబిల్లునందును సంకుచితము చేయబడినవి. సంకల్పమునందు లేనిబీజము వ్యవహారములందు సఫలముగాదు. జాయంటు పార్లమెంటరికమిటీ రిపోర్టును శాసనసభ నిరాకరించినది. ప్రభుత్వమునకు గలుగుచున్న పరాజయము లన్నిపక్షములవారికిని ప్రభుత్వ విధానముపట్ల గల నిరసనభావమునకు నిదర్శనములు. రైల్వేలపరిపాలనము, సైనికపరిపాలనము, వైద్యశాఖాపరిపాలనము, భారతీయ సైన్యకల్పనవిధానము, ప్రభుత్వ నిర్బంధవిధానము, బర్మా విభజనవిధానము మొదలగుసకలవ్యవహారములందును ప్రభుత్వమునకు గలిగిన పరాజయములు ప్రజాభిప్రాయమును వెల్లడి చేయుచున్నను ప్రభుత్వమునకు చలనము గలుగుటలేదు. కాంగ్రెసుపక్ష ప్రతినిధులు, జాతీయపక్ష ప్రతినిధులు, స్వతంత్రపక్షప్రతినిధులు, వ్యక్తిప్రతినిధులును ప్రభుత్వవిధానమునునిరసించినవిధము ప్రభుత్వవిధానముదేశకాలపరిస్థితులకు నిరుపయోగమని విశదమైనది. సర్ జేమ్సుగ్రిగ్గు, సర్ యన్. యన్. సర్కారు, సర్ హెన్రిక్రెయికు గారులు మొదలగు ప్రభుత్వసభ్యులుచూపుచున్న నిరాదరణభావము ప్రజలకును ప్రభుత్వమునకును గల పాశబంధములను శిథిలము చేయుచున్నది. సామ్రాజ్యశాసనసభయందు రాజ్యాంగమునందు హృదయపరివర్తనము నయినను కలుగజేయుట దుర్లభ మని వ్యవహారోదంతములు విశదము చేయుచున్నవి. శ్రీ భూలాభాయిగారి గంభీరప్రసంగములు, సత్యమూర్తి, గోవిందవల్లభపంతుగారల తీవ్రవిమర్శనలు, ఇతరసభ్యుల తీవ్ర ఖండనములు ప్రభుత్వసభ్యులకు కోపావేశములనుగలుగజేసినను చేయగలదేదియును లేకను ప్రభుత్వసభ్యులు బుసకొట్టుట యనుచితము. శాసనసభ నిరాకరించిన వ్యయాంశముల నెప్పటివలెనే రాజప్రతినిధి పునరుద్ధరణమును చేయుటయును ప్రభుత్వ నిర్లక్ష్య భావమునకు నిదర్శనము. సర్ జేమ్సుగ్రిగ్గుగారు కాంగ్రెసు ప్రతినిధులను పరిహసించినరీతిని "ఆకల్పాంతమును ౩౫ కోట్ల ప్రజలను శోకరించుటయును వంచించుటయును దుస్తరము", అని స్వయముగను గ్రహించుట వివేకము. భారత శాసనసభా వ్యవహారములు ప్రభుత్వదౌర్బల్యమును, ప్రజల ధర్మబలమును ప్రజలకును, ప్రపంచమునకును ప్రదర్శించుటకు వినియోగపడుచున్నవి. సర్ సామ్యుయలు హోరుగారు ఇండో-బర్మా ఆర్థికవ్యవహారములను వ్యవహారసంబంధముగల బర్మాభారతీయులతో సంప్రతించకను ఏమెరి రౌలటుగారల యభిప్రాయానుసారము నిర్ణయించుట భారతీయాభిప్రాయము లరణ్యరోదనము లనుటకు పరమ ప్రమాణములు. భారతీయార్థికవ్యవహారము లీవిషయ నిర్ధారణమునకు మహావ్యాఖ్యానములు

భారతీయార్థికవ్యవహారములు రాజకీయములవలె నధ్వాన్నముగనున్న విధమును కేంద్రరాష్ట్రప్రభుత్వ

ములబడ్జెటులు వెల్లడిచేయుచున్నవి. గతించిన అయిదారేండ్లయందును పన్నుల భారము ౧౦౦ కి ౨౦ వంతునను వృద్ధిని పొందినది. ఆదాయమును సమకూర్చుట ప్రజలవంతును వ్యయముచేయుట ప్రభుత్వాధికారులవంతును నైనపుడు ప్రభుత్వముబాధ్యత నిరర్థకము. ఆర్థికమంత్రి తనబాధ్యతను పన్నులను చెల్లించెడి వారలకుగాకను పన్నులను ఖర్చుపెట్టెడివారలకు గలిగియుండుట సకలార్థికధర్మములను విరుద్ధము. ఆత్మరక్షణము ప్రజల కవసరమనియును, ప్రభుత్వాధికారుల కనవసర మనియును ఆర్థికధర్మము చెప్పక చెప్పుచున్నది.

**భారతీయార్థిక వ్యవహారములు**

వర్తమానార్థిక సంవత్సరమునందు (౧౯౩౪-౩౫) ౯౧౦౦ లక్షలాదాయమునుండి ౮౭౯౩ లక్షల వ్యయముపోను ౩౨౭ నిలువయుండును. ౧౯౩౩-౩౪ సంవత్సరము నిలువ ౬౨ లక్షలు కలిసి ౩౮౯ లక్షలునిలువయుండును. ౧౯౩౫-౩౬ సంవత్సరములకునిలువ ౧౫౦ లక్షలు. నిలువమొత్తమునుండి ౧౦౦ లక్షలు గ్రామసీమలఆర్థికోద్ధరణమునకును, ౪౦ లక్షలు రోడ్లకు, ౨౫ లక్షలు పశ్చిమోత్తరరాష్ట్రములందు రోడ్లకు, ౨౦ లక్షలు బ్రాడుకాస్టింగునకు, ౯౩ లక్షలు పౌరవైమానికాభ్యుదయమునకు, ౩౬ లక్షలు పూసానుండి డిల్లీకి వ్యవసాయ పరిశోధనశాఖా నిర్మాణమునకును, ౭౫ లక్షలు అప్పును తీర్చుటకును వినియోగించుటకు నిర్ణయింపబడినది. నిలువనుండి నిర్ణయించిన ౩౮౯లక్షల వ్యయము పోను శేషించిన ౧౫౦ లక్షలనుండి వెండి సుంకమును ఔన్సుకు ౨ అణాల వంతునను తోళ్లఎగుమతిపన్నును తగ్గించుటవలనను, ఆదాయపు పన్నును ౧౦౦ కి ౫ వంతున తగ్గించుటవలనను, తగ్గించినజీతములను పునరుద్ధరణముచేయుటవలనను రాగల సంవత్సరాదాయవ్యయములు ౬ లక్షల నిలువతోను సరిపెట్టబడినవి.

ఆర్థికమంత్రి గ్రిగ్గుగారి నిర్ణయము లన్నియును ఆర్థికసిద్ధాంతములకు ప్రతికూలములు. నెలనెలకు వందలు వేలు జీతములుపొంది సుఖజీవనమును గడపుచున్న ఉద్యోగస్థులకును రొక్కపుటాదాయమును పొందెడివారల పన్నులభారమును తగ్గించుటయును అన్నమో రామచంద్రాయని పరితపించెడివ్వారల కించుకయైనను ఉపకృతి కల్పించకుండుటయును శాస్త్రసమ్మతముకాదు. ఆదాయమునుండి వాయువిమానములకు ౯౨ లక్షలును, ౩౬ లక్షలుడిల్లీయందలి వ్యవసాయపరిశోధనశాలకును, ౨౦లక్షలు బ్రాడుకాస్టునకును వినియోగించుటవిపరీతముగనున్నది. గ్రిగ్గుగారి రాజనీతి బాలిశులరాజనీతిగనున్నది. గ్రామసీమోద్ధరణమునకు పాపపరిహారార్థమునకుగాను డంబమునకు ౧౦౦ లక్షలను గ్రాంటు నిచ్చుటవలనను ౧౪౮ లక్షలను నిరభ్యంతరముగను వ్యయముచేయవచ్చునని గ్రిగ్గుగారు తలచుట బుద్ధిమాంద్యము. గ్రిగ్గుగారవలంబించిన ఆర్థికనీతి నిరంకుశప్రభుత్వమునకు సహజమైన దురభిమానపూరితముగ నున్నది. ప్రజాప్రతినిధులు కోరెడి నిరుపేదలపన్నులను తగ్గించుటకుబదులు ప్రభుత్వోద్యోగులజీతముల నుద్ధరించుటయును, ఆదాయపు పన్నును తగ్గించుటయును ప్రజాశయములను ప్రజాప్రతినిధులయభిప్రాయమును ధిక్కరించుటయును సహజముగ గలుగుచున్నది. ప్రభుత్వప్రతిష్ఠను ప్రజ్వలింపజేయుటకును, కాంగ్రెసువిజయమును తృణీకరించుటకును ౧౦౦ లక్షల దానము, ౧౪౮ లక్షల నిరంకుశవ్యయమును ప్రజానిరాదరణమును శాసనసభా నిరాదరణమును బడయుట సముచితముగ నున్నది. పోస్టుకార్డులస్టాంపులధరలను, ఉప్పుపన్నును తగ్గించుటకు బదులు విమానాదుల సౌకర్యమునకు ద్రవ్యమును వ్యయముచేయుట గ్రిగ్గుగారి ప్రతిష్ఠకుగాని, ప్రభుత్వవివేకమునకుగాని నిదర్శనముగాదు. ఆదాయము ౯౧ కోట్లయందును ౭౦ కోట్లు సైన్య పౌరసేవోద్యోగులకును, వడ్డీకిని పోను శేషించిన ద్రవ్యమునైన శాసనసభాభిప్రాయానుసారముగను సామాన్యప్రజాప్రయోజనములకు వినియోగింపకుండుట విపరీతార్థికనీతిగ నున్నది. గతించిన రెండేండ్లయందును హిందూస్తానమునుండి ౨౩౫ కోట్ల

బంగారమెగుమతియైనది. ఈబంగారమునందు విశేష భాగము గ్రామవాసులు పన్నులను చెల్లించుటకై సగల నమ్మిన బంగారము. అన్ని దేశములును బంగారమును దిగుమతిచేయుటయున్ను హిందూస్థానము బంగారము నెగుమతి చేయుటయును పారతంత్ర్యదేశస్థితికి తగియున్నది. గ్రిగ్గుగారి సమర్థనముమాత్ర మెవరికిని నర్థము గాకున్నది. నిరంతరము ప్రజాప్రతినిధులు చూపెడి ప్రతిఘటనమువలనను సామాన్యప్రజలకు స్వల్పమైన యుపకృతి గలిగినను ప్రయత్నయోగ్యము.

కేంద్రప్రభుత్వమునందు గల దుర్దశయె రాష్ట్ర ప్రభుత్వములందును ప్రత్యక్ష మగుచున్నది. అనేక రాష్ట్రము లాదాయమునకు మించిన వ్యయము గలుగుచున్నది.

మద్రాసు రాష్ట్రా దాయ వ్యయములు

చెన్నరాష్ట్రమునందు గతించిన రెండేండ్లకునురాగల సంవత్సరమునకును ఆదాయవ్యయ పరిశీలన చేసినపుడు ౧౯3౫-3౬ లకు ఆదాయము ౧౬౪౯౦౯ వేలు, వ్యయము ౧,౬౪,౪౨౪ వేలు; నికరపు నిలువ ౪౮౫ వేలు. మద్రాసుబడ్జెటునందు ప్రధానాదాయమునకు భూమిశిస్తుఆధారము. భూమిశిస్తు దుర్భరముగ నున్న విధమునకు గతించిన మూడేండ్లయందును ప్రభుత్వమొనగుచున్న గ్రాంటులె నిదర్శనములు. ధాన్యముల ధరలు పడిపోయినను విదేశములనుండి బియ్యముదిగుమతి యగుచున్నను ప్రభుత్వము సిస్తును తగ్గించకుండుట రయితుల నిస్సహాయస్థితికి నిదర్శనము. రయితులు పొలములను, నగలను అమ్మి సిస్తులను చెల్లించుచున్నను ప్రభుత్వము ధరలను పెంచుటకును రయితుల ఆదాయము నభివృద్ధి చేయుటకును ప్రయత్నములను జేయకుండుట యార్థిక శుభస్థితికి ప్రతికూలము. నీటివసతుల నభివృద్ధి చేయుటకును, తుంగభద్ర జలాశయ నిర్మాణమునకును ప్రభుత్వము సొమ్మును నిర్ణయించుట సముచితముగ నున్నను నాద్రవ్యము ననేకరెట్లుహెచ్చించినకాని జలాధారములనుబాగుజేయుటయునునిర్మించుటయును సాధ్యముగాదు. వరిపంటకు నీటివసతులును, తగిన భూములు గల మద్రాసురాష్ట్రమునకు బియ్యము,వడ్లదిగుమతులు పరిహాసపాత్రములు. దిగుమతుల నాపుటకు, వరిసాగును వ్యాపింపజేయుటకును తగిన సుంకములను విధించుటకు ప్రయత్నించుటయును ప్రభుత్వ ధర్మము. పన్నులందు విశేషభాగమును రయితులు చెల్లించుచున్నను రయితున కేవిధమైన సహాయమును కేంద్ర రాష్ట్రప్రభుత్వములు కల్పింపకుండుట దేశానర్థములకు మూల మగుచున్నది. అభివృద్ధి శాఖలయం దయినను రయితుల కుపకృతి గలుగజేయుటకు ప్రభుత్వము పూనుకొనలేదు. కేంద్ర రాష్ట్ర ప్రభుత్వముల ఆదాయములు ౧౯3౨-33 లందు ౨౬౮ కోట్లును ప్రజాసామాన్యము విశేష భాగము భరించుచున్నది. ప్రజాదాయము గతించినఅయిదారేండ్లయందును తగ్గి ప్రజల పన్నులభార మధికమైనది. దినదినము దేశ మధోగతిపాలగుచున్నను తరణోపాయ మగమ్యగోచరముగ నున్నది. బ్రిటీషుప్రభుత్వమమూలమునను తరణోపాయ మసాధ్యమని ఇండియాబిల్లు ఆర్థికనిర్ణయములు, వ్యాపారవిధానములు, పారిశ్రామికసిద్ధాంతములు, యానవాహనములు, రైలు నిర్మాణములు, వాయుమార్గములు, ప్రాచీనసంస్కార వాసనలు సహస్రముఖములను విశదము చేయుచున్నవి.

ప్రపంచావృతమైన మహాప్రబోధోదయ సమయమునందు హిందూస్థానముమాత్రము నిద్రావస్థయం దాత్మహత్యను జేసికొనజాలదు. 3౫౦ లక్షలప్రజలాత్మహత్యను చేసికొనదలచినను అది

ప్రపంచ ప్రబోధము

దుర్లభము. యూరపు ఆసియాఖండములందు విజయమును పొందినరాజ్యములును, పరాజయమును పొందినరాజ్యములును, చిన్నరాజ్యములును, పెద్దరాజ్యములును పురోవృద్ధికిని, ఆత్మసంరక్షణవికాసములకును అహమహమికను జూపుచున్నపుడు హిందూస్థానమును సమ్మోహసంశయములను విడిచి ఆత్మసంస్మరణమును పొంది స్వధర్మనిర్వహణమునకు పూనుకొనుట ప్రకృతిధర్మము. పరాజితమైన జర్మనీయందు నాజీవిజయోన్మాదము చెలరేగుచు హిట్లరు

ప్రతిభ మాఱుమ్రోగుచున్నది. విశాలమైన రుష్యాయందు కమ్యూనిజము ప్రజాప్రబోధమును జేయుచున్నది. ఇటలీయందు ఫాసిజము వికసించుచు ముస్సోలినీ సంస్మరణము ప్రతిధ్వనిల్లుచున్నది. అయిర్లాండునందు డివెలరా పూర్ణస్వతంత్ర ధ్వజారోహణమును జేయుచు దేశాభ్యుదయమును జేయుచున్నాడు. అమెరికాయందు రూజువెల్టుగా రర్బుదములను వ్యయముచేయుచు నవీనార్థికసిద్ధాంతములను సాధ్యముచేయుచున్నాడు. జపాను సాహసనిగ్రహములను బూనుచు సామ్రాజ్యవ్యాపనమును జేయుచున్నది. చీనా పురోభివృద్ధికిని, శాంతిస్థాపనమునకును మహాదుఃఖ వేదన ననుభవించుచున్నది. ఫ్రాన్సు ఆత్మరక్షణమునకు సంగ్రామధ్వనులను వ్యాపింపజేయుచున్నది. గ్రేట్బ్రిటను సామ్రాజ్యసంరక్షణమునకు రాజ్యతంత్రకౌశలమును వినియోగించుచున్నది. సకలరాజ్యములును యథాశక్తి నాత్మసంరక్షణమునకు విశ్వప్రయత్నములను జేయుచున్నవి. ప్రపంచావృతమైన ప్రబోధావస్థయందు హిందూస్తానమును ఆత్మోద్ధరణమునకు సంకల్పించుట సహజమైనను దేశపరిస్థితులు విపరీతముగ నున్నవి. సకల రాజ్యములందును ప్రజలు, నాయకులు ప్రభుత్వము లేకప్రయోజనమునకు కలిసి పని చేయుట సామాన్యధర్మమైనను పరాధీనమైనహిందూస్తానమునందు ప్రజానాయకులును, ప్రభుత్వాధికారులు, సమానప్రయోజనములను విడిచి భిన్నప్రయోజనపరాయణులయి ప్రజాశక్తులను, దేశశక్తులను వికసింపజేయుటకును వినియోగించుటకును సమర్థులు గాకున్నారు. గాంధి మహాత్ముని అనాసక్తకర్మయోగపరాయణత్వ మీ విషయమును పరిస్ఫుటముచేయుచున్నది.

ప్రపంచావృత మైన విషాదయోగావస్థయందు పారతంత్ర్యపాశబద్ధమైన హిందూస్తానపరిస్థితులు విషాదభరితముగ నున్నవి. ప్రభుత్వలక్ష్యము బ్రిటీషుప్రయోజనములందులగ్నమైనటులు హిందూస్తాన ప్రయోజనములందు లగ్నము గాకున్నది. ప్రభుత్వాధికారులు హిందూస్తానీయు లయినను, విదేశీయులైనను వారి లక్ష్యములండను శ్వేతభవనమునందువలెను డిల్లీ అస్సెంబ్లి భవనమునందు లగ్నముగాకున్నది. అధికారులదేహములు డిల్లీ అస్సెంబ్లియం దున్నను వారిబుద్ధి లండనునందలి హిందూస్తానకార్యదర్శియధీనమునం దుండును. రాజప్రతినిధి మొదలు రక్షకభటునివరకును గల ప్రభుత్వోద్యోగులకు లక్ష్యము శ్వేతభవనము, శ్వేతముఖులు కాని అస్సెంబ్లిభవనము, హిందూస్తానీయులును కాదు. సైన్యములకు, ప్రభుత్వోద్యోగులకును నైవేద్యము పోను శేషించిన పదార్థములు దేశక్షేమమునకును, ప్రజాక్షేమమునకును వినియోగపడెడివిధమును ఆదాయవ్యయ నిర్ణయములు, ఇండియాబిల్లునిర్ణయములును వేయినోళ్లను చాటుచున్నవి. శేషాదాయమునైనను హిందూస్తానాభ్యుదయమునకు ప్రజాసంకల్పానుసారముగ వినియోగించుట కధికారు లంగీకరించనివిధమును రాజప్రతినిధి సమర్థనములు, కార్యనిర్వాహకాధికారుల దురాగ్రహములు వెల్లడిచేయుచున్నవి. పరమవిషాదావస్థయందునుఆత్మశక్తిని వినియోగించుచుసంకల్పసిద్ధికి ప్రయత్నించుట పురుషార్థ మనియును, దైవమును దూరుట కాపురుషలక్షణ మనియును గాంధిమహాత్ముని యుపదేశాచరణములు ప్రజానాయకులకు విశ్వాసమును గలుగజేసినవి. గాంధిమహాత్ముని నాయకత్వమునను స్వయంసహాయోద్యమమును, సహాయనిరాకరణోద్యమమును రాజకీయార్థికసాంఘికాది వ్యవహారములందు ప్రజానాయకుల కాత్మవిశ్వాసమును గలుగజేయుట నిస్సహాయస్థితియం దాశాజనకముగ నున్నది. గాంధి మహాత్ము డుపక్రమించిన యాత్మోద్ధరణసాధనము ఫలప్రద మగుటకు స్వాత్మావలోకనము పరమార్థగ్రహణసాధనము.

విషమ పరిస్థితులు

హిందూస్తానవిషమపరిస్థితులను మనోగతముచేసికొనుట కితరదేశముల పరిస్థితుల నవగతముచేసికొనుట ప్రయోజనకరము. ప్రపంచవ్యవహారములందు సంసారప్రవృత్తికి మానవస్వాతంత్ర్య ధర్మాభ్యుదయము పర

మార్గము. పరమార్థసాధనములయినను ప్రజాదేశముల జ్ఞానమునకు సాధనముగ నున్నది.
ఆర్థికవిద్యా వ్యవసాయాదాయాదిపరిజ్ఞానము కర్తవ్య పరి కొన్ని దేశముల లెక్కల వివరములు:—

| | హిందూస్థానము | బ్రిటిషుసంయుక్తరాష్ట్రములు | అమెరికా | జపాను |
|---|---|---|---|---|
| విస్తీర్ణము | ౧౮,౦౮,౬౭౯ | ౯౪,౨౭౮ | ౩౬,౮౫,౩౮౨ | ౧,౪౭,౫౯౩ |
| జనసంఖ్య | ౩౫,౨౮,౩౭,౭౭౮ | ౪,౬౧,౭౮,౮౮౪ | ౧౨,౨౭,౭౫,౦౪౬ | ౬,౫౩,౬౬,౫౦౦ |
| గ్రామములు | ౩౧,౩౮,౫౮,౫౬౭ | ౭౯,౯౯,౭౬౫ | ౫,౩౮,౨౦,౨౨౩ | ౨,౬౪,౧౩,౦౦౦ |
| పట్టణములు | ౩౮,౯౭,౯౨౧ | ౩,౧౯,౪౮,౧౬౬ | ౬,౮౯,౫౪,౮౨౩ | ౩,౩౩,౨౪,౦౦౦ |
| వ్యవసాయము | ౭౫% | ౨౦ % | | |
| ఆదాయము(కోట్లు) | ౨౬౮ | ౧,౩౩౪ | .౨,౭౩౨ | ౪౫౯ |
| తలకు రూ. | ౧౦ | ౨౯౦ | ౨౨౨ | ౭౬ |
| ఉత్పత్తి | ౨,౫౦౦ | ౨,౪౫౨ | ౧౨,౩౧౭ | ౧,౪౦౮ |
| | ౭౧ | ౫౩౧ | ౧,౦౦౩ | ౨౩౨ |
| వ్యవసాయము లక్షల (య.) | ౨,౬౧౦ | ౩౩౦ | ౯,౫౫౦ | ౨౩౦ |
| పరిశ్రమాలయము | ౯,౪౨౨ | ౧,౦౩,౫౦౦ | ౧,౨౪,౧౩౬ | ౫౯,౮౮౭ |
| (కోట్లు) | ౭౦౦ | ౭,౦౬౭ | ౨౩,౦౦౦ | ౧,౦౦౯ |
| వ్యాపారము | ౨౬౫ | ౧,౪౯౫ | ౧,౦౧౧ | ౩౧౮ |
| బ్యాంకింగు | ౮౮౨ | ౧౨,౫౫౭ | ౨౨,౦౭౧ | ౬,౬౭౦ |
| విద్య | ౮% | ౭౬% | ౭౪% | ౫౦% |

నాలుగు దేశముల ఆదాయవ్యయములను, వ్యాపార పరిశ్రమలను, ఆస్తిఅప్పులను,సంపదలను పరిశీలించినపుడు హిందూస్థానము జనసంఖ్యయందు మొదటిస్థలమును, వైశాల్యమునందు రెండవస్థానమును నాక్రమించుచున్నను ఆర్థికసంపదలందును, వ్యాపారపరిశ్రమలందును, విద్యయందును, బాంకింగునందును వెనుకబడియున్నదని సువ్యక్త మగుచున్నది.

వెనుకబడియుండుటకు కారణము బ్రిటీషుప్రభుత్వ విధాన మని గ్రాహ్య మగుచున్నది. బ్రిటీషుప్రభుత్వము నకు ముతకపదార్థములను పండించుటయందును,ఎగుమతి చేయుటయందును గల శ్రద్ధపరిశ్రమల యభివృద్ధియందును, నిర్మాణపదార్థముల మెగుమతులందును గలుగకున్నది. విదేశవ్యాపారము గతించిన అయిదేండ్లయందును ౧౦౦ కోట్లు తగ్గిపోవుటవలనను పంటలును, వ్యాపారమును తగ్గిపోయినవి. వ్యవసాయము తగ్గిపోవుటవలనను విదేశములనుండి బియ్యము, గోధుమలు మొదలగు నాహారపదార్థములు దిగుమతి యగుచున్నవి. ఆహారపదార్థముల దిగుమతులు వ్యవసాయవృత్తి తగ్గుటయును, దేశమునందు నిరుద్యోగము నభివృద్ధి చేయుటయేకాకను దేశక్షేమమునకు మూలస్కందములైన ఆయురారోగ్యములను నిర్మూలముచేయు చున్నవి. సకలరాజ్యములును పంటలను పదార్థనిర్మాణములను ధరలను వృద్ధిచేయుటకు ప్రయత్నముచేయునపుడు బ్రిటీషుప్రభుత్వము నిరర్థకముగను నుండజాలదు. బ్రిటీషు ప్రభుత్వము నిరాదరణను జూపినను, ప్రజానాయకులు నిస్సహాయు లయి కాపురుషులవలెను మరణ వేదన ననుభవించుట ధిక్కారయోగ్యము. వర్తమాన నిస్సహాయ స్థితియందు ప్రజలు స్వాయంసహాయము మూలముననను చేయగల కార్యవిధాన మనంతము గలదు. హిందూస్థానమునందు ౧౦౦ కి ౮౦ మంది గ్రామసీమలందు వ్యవసాయవృత్తిని నుపవృత్తులను నవలంబించుచున్నారు. పరిశ్రమయుగమునందు కేవలము వ్యవసాయవృత్తి సుఖజీవనమునకు సాధనము కాదని

వ్యవసాయ పరిశ్రమలు

యూరపురాజ్యముల చరిత్రలవలెను జపానుదేశచరిత్రమును చాటుచున్నది. హిందూదేశమునకు సహజములైన దూది జనపనారల పరిశ్రమలకుతోడ ననేకగృహపరిశ్రమలను స్థాపించి పోషించుట యవసరము. హిందూస్తానమునం దుత్పన్నములైన పదార్థములు హిందువుల యుపయోగముననే వినియోగపడుట కవకాశములు కలవు. జనబాహుళ్యము 3౫ కోట్లప్రజలు గల హిందూస్తాన ముత్పత్తి వినియోగముల కితరులమీద నాధారపడవలసినయవసరము లేదు. మూలయంత్రాలయపరిశ్రమలను గృహపరిశ్రమలను పరస్పరసంఘర్షణము లేకుండ స్థాపించి వ్యాపింపజేయుటకు దేశక్షేమపరాయణులు పూనుకొనుట క్షేమకరము.

కీలక పరిశ్రమలు

పరిశ్రమలందు సకలదేశములకును అన్నవస్త్ర పరిశ్రమలు ప్రధానములు. యంత్రాలయ పరిశ్రమలు లేనపుడు ౭౦ ఏండ్లకుపూర్వము హిందూస్తాన మన్న వస్త్రములందే కాక నితరపరిశ్రమలందును స్వయంపోషణమును గలిగి ప్రపంచమున కాదర్శ ప్రాయముగ నుండెను. ప్రపంచమునం దంతటను పూర్వము రత్నగర్భయనియును, స్వర్ణభూమియనియును ప్రసిద్ధిని బడసిన పుణ్యభూమి వర్తమానకాలమునందు దారిద్ర్యగ్రస్తమును, వ్యాధిగ్రస్తమును నై పరాధీనస్థితియందు పరిహాసపాత్రముగ నున్నది. ప్రపంచమునం దంతటను 3౫ కోట్లప్రజల కీదౌర్భాగ్యస్థితి యెటులుగలిగినదను ప్రశ్నకు సమాధానము సులభము. ప్రపంచమునందు బానిస లేలయుండి రనుప్రశ్నకు సమాధానమె హిందూస్తానభావదాస్యమునకును సమాధానము. వ్యవసాయపదార్థములను పండించుటయును పండినదానితో తృప్తినిజెంది అర్ధాకలితో నిద్రించుటయును, వైరాగ్యభావముతో సానందముగను కాలయాపనము చేయుటయును ప్రజలకు పరిపాటియైనది. అన్నిటిని మించిన పిరికిమచ్చమందు సర్కారు ఉద్యోగములు. కష్టపడకుండ కాలముగడపుటను బ్రిటీషు ప్రభుత్వ మభ్యాసముచేసినది. ఉద్యోగదాస్యము గౌరవరూపమునుదాల్చినది. పరిశ్రమలు కృశించినకొలదియును పరావలంబనము వృద్ధిని జెందినది. ప్రజలు స్వయం సహాయపరాయణులై "కృషితోనాస్తి దుర్భిక్షం" అను నార్యోక్తి ననుసరించుటకు బదులు నిరుద్యోగారాధన పరాయణు లయి కృశించుచున్నారు. బ్రిటీషుపరిశ్రమలవలె జర్మనీ, ఫ్రాన్సు, ఇటలీ, జపాను మొదలగు రాజ్యముల పరిశ్రమలును హిందూస్తానప్రజలను నిరుద్యోగులను, నిర్ధనులను, నిరాధారులను చేయుచున్నవిధమును దేశవ్యవహారములు విశదము చేయుచున్నవి. నిద్రావస్థయందు మునిగియున్నప్రజలను మేలుకొలుపుట దుర్లభమైనది. యంత్రాలయ పరిశ్రమలను స్థాపించుటయును, పోషించుటయును నవసరమైనను 3౫ కోట్ల ప్రజలుగలిదారిద్ర్యగ్రస్తమైన దేశమునందు యంత్రాలయముల ప్రయోజనము చిరకాలమునకు గాని లాభదాయకము గాదు. యంత్రాలయపరిశ్రమలం దభివృద్ధిని పొందిన యితరదేశములతో పోటీకి నిలుచుటయును ముఖ్యముగ సామ్రాజ్యరక్షణవ్యాపారమును ప్రతిఘటించుటయు కష్టసాధ్యము. సకలయంత్ర పరిశ్రమలకును రక్షణ మవసరము. స్వాతంత్ర్యములేని దేశమునం దీరక్షణమార్గము విఘ్నపరంపరలతో గూడియున్నది. రక్షణమార్గ మెటులు పరిణమించినను గృహపరిశ్రమలు, స్వదేశీదీక్ష, నిరుద్యోగసమస్యయు దారిద్ర్యసమస్యను నివారించుటకు కొంతవరకు వినియోగపడగలవు. చిరకాలము గృహపరిశ్రమ సంస్కారమున కలవారైన 3౫ కోట్ల ప్రజలు గల దేశమునందు పరిశ్రమాభ్యుదయము కుటుంబము, కులము, గ్రామము, సంఘముల ద్వారా క్రమ వికాసమును పొందుట దేశకాల పరిస్థితుల కనుకూలము. గాంధిమహాత్ముడు సంకల్పించిన గ్రామోద్యోగ మార్గమును నీ ప్రయోజనమును సాధించుటకు వినియోగపడగలదు. తోళ్లు, గాజులు, బొమ్మలు, కుండలు, నార, తాళ్లు, ఖద్దరు బట్టలు, కంబళ్లు, కుండలు, పాత్రలు, నూనె, బుట్టలు, అద్దకము మొదలగు పరిశ్రమలను చేయుట కవకాశములు విశేష

ముగ గలవు. ప్రజలందరును కర్మయోగపరాయణులై దేశమును ప్రజలను నావరించిన జాడ్యమాంద్యములను విడిచి కృతార్థు లగుదురుగాత!

హిందూస్థానమునకు గల రాజకీయార్థిక సాంఘికపారిశ్రామికాదిసమస్య లన్నియును ఆంధ్రరాష్ట్రమున కధికతరముగను వర్తించుచున్నవి. ప్రాచీనకాలమునందు

**ఆంధ్ర రాష్ట్రము.**

వ్యక్తిత్వము గలిగి వికసించిన ఆంధ్రదేశ మిపుడు అధోగతికి పాలైనది. పూర్వము గల దేశములందు నొకదేశమై పశ్చిమతీరమునుండి తూర్పుతీరమువరకును వ్యాపించి మగధరాజ్య భాగమునుసయుత మాంధ్రరాజ్యమునందు గలిగినయాంధ్రరాజ్య మిపుడు మద్రాసు రాష్ట్రమునందు నిజాము, మైసూరుసంస్థానములందును నంతర్ధాన మయినది. దక్షిణాపథమునం దార్యవిజ్ఞానమునకు స్వాగతంబు నొసంగి ఆర్య ద్రావిడ విజ్ఞానములను మేళగించిన ఆంధ్రసంస్కార మిపుడు నిర్వీర్యముగ నున్నది. భాషయందును, సంప్రదాయాచార వ్యవహారములయందును వ్యక్తిత్వము గల ఆంధ్రావని అజ్ఞాతవాసము ననుభవించుచున్నది. ఆంధ్రదేశ భాషా ప్రజాసాహిత్య సంస్కారము లాత్మోద్ధరణమున కవకాశరహితము లై పూర్ణసాధనములు గాకున్నవి. బ్రిటీషు ప్రభుత్వపరిపాలనాసిద్ధాంతములు ప్రజాశక్తివిజృంభణమునకు ప్రతికూలములుగ నున్నవి. పరిపాలనావిధాననిర్వాహకులు, భూస్వాములు, ధనస్వాములు, ఆంగ్లసంస్కారప్రియులు, బ్రిటీషు ప్రజలుగ నుండుట రాజ్యాంగములకు కీలకము. ఇండియాబిల్లును నీసూత్రములనె స్థాపించుచున్నదని లాస్కీగా రిటీవలనె తెలిపియుండిరి. లేబరుప్రభుత్వమైనను బ్రిటీషురాజ్యాంగకీలకమును హిందూస్థానమునందు మార్చుట దుర్లభము. స్వయంపోషణాధారములులేని సింధు, ఉత్కళరాష్ట్రముల నిర్మాణమును, ఉత్కళరాష్ట్రమునందు ప్రజల యోగక్షేమములతో నిమిత్తములేకను ఆంధ్రభాగములను ఏజన్సీభాగములను జేర్చుటయును పరిపాటియైన బ్రిటీషురాజ్యనీతి. సర్ సామ్యుయలుహోరుగారికి పర్లాకిమిడిరాజాగారిని సంతృప్తిపరచుటయందును, ప్రజాభీష్టములను ప్రతిఘటించుటయందును గల యభిమానము ప్రజాభిలాషలను సార్థకముచేయుటయందు గనుపడదు. ఫెడరేషనువిధానమునకు కీలకమైన భాషా ప్రయుక్త రాష్ట్రవిభజనము నిరాకరించుటయును, ఇండియాబిల్లు నందైనను నీవిషయమునకు సౌకర్యములను కల్పింపకుండుటయును స్థిరమైన బ్రిటీషురాజ్యతంత్రము. ప్రజాసంకల్పమును, ప్రజాక్షేమమును సఫలముచేయవలసిన ఆంధ్రప్రభువులు, జమీన్‌దారులు, విద్యావంతులు ప్రతికూలురగుటయును దురదృష్టము. లండనునకు వెడలిన ఆంధ్రరాయబారము జయప్రద మగుటకు ప్రజానాయకులు కృషిచేసి భగవదనుగ్రహమును బడయుదురుగాత!

అనంతమైన ప్రపంచపంచాంగశ్రవణానంతర మతిస్వల్పమైన స్వవిషయపంచాంగశ్రవణ మాత్మావలోకనము ప్రయోజనకరము. నూతనసంవత్సరారంభము

**యువసంవత్సరాది సంచిక**

నందు గలిగెడిసంకల్పములు సంవత్సరాంతమునందు సంకల్పబీజములుగనె యుండుట సామాన్యము. నవయౌవనోదయమునం దుదయించెడి జీవయాత్రాసంకల్పములు వార్ధక్యమునందును సంకల్పములుగ నుండుటయెగాకను వికల్పములగుటయును సామాన్యము. అలెగ్జాండరు మహారాజువలెను స్వవిజయములకు బాహ్యప్రపంచములకై విచారించెడివా రసంఖ్యాకులు సకలజీవయాత్రారంగములందును వర్ధిల్లుచున్నను అశోకచక్రవర్తివలెను ఆత్మధర్మవిషయావలోకనము దుర్లభము. అఖండమైనబాహ్యప్రపంచావలోకనారాధానములందు ఖండమైన స్వవిషయావలోకనము జిజ్ఞాసకుమూలమై ఆత్మజిజ్ఞాసకు సాధనముగనున్నది. ఆత్మావలోకమునందు పురుషార్థముసాధ్యముగాగలవిధమునకు గాంధిమహాత్ముని ఆత్మకథ ప్రమాణము.

యువసంవత్సరాది సంచికయందలి ముఖపటము వర్తమానసంవత్సరమునందు గాంధిమహాత్ము డుపక్ర

మించిన గ్రామోద్యోగయాత్రకు చిహ్నము. హిందూ
స్థానస్థితికి మూలస్కంధములయిన గ్రామముల యుద్ధ
రణము ప్రజలయార్థికోద్ధరణమునకును, స్వయంసహాయ
మునకును, ఆత్మగౌరవమునకును సాధనము. ప్రజలుశుభ
దాయకమయిన గ్రామజీవనమును విడిచి నగరజీవనము
నారాధింపగోరుట యనుచితము; ఉచితమైనను నసా
ధ్యము. ౩౫ కోట్లప్రజలకు నగరములందు పారిశ్రామిక
జీవన మసాధ్యము. గ్రామసీమలందు పారిశ్రామికవ్యవ
సాయజీవనములను సంయోగము చేయుట పుణ్యము,పురు
షార్థము. ప్రజలజీవయాత్రకు మూలాధారములైన వ్యవ
సాయము, నేత, కమ్మరము,వడ్రంగము,కుంభనిర్మాణము,
మొదలగు వృత్తుల యాదరణపోషణములను ముఖ
పట మవగతము చేయుచున్నది. గాంధిమహాత్ముడు
జీవయాత్రకు పరమార్థమైన ధర్మసూత్రనిర్మాణమును
జేయుచు పరిశ్రమసాధనముల నుపగతము చేయు
నటులు చిత్రింపబడినది. చిత్రకారుని భావనాశక్తి
సహజమై, ప్రకృత ప్రయోజనములకును, ప్రపంచ
ప్రయోజనములకును ననురూపముగ నున్నది. యువసం
చికయందలి వ్యాసములును రాజకీయ సాంఘికార్థిక
సాహిత్యవిషయములం దాంధ్రప్రపంచమునందు పర్యా
ప్తంబగుచున్న భావరూప పరివర్తనమునకు ప్రమాణ
ములు. శ్రీ వల్లూరి సూర్యనారాయణరావుగారి ప్రజా
ప్రభుత్వమున కషాయము, శివరామశాస్త్రిగారి ఊరిబడి,
రామకృష్ణారావుగారి అభిమన్యుడు, వేంకటావధానిగారి
మాలోకము, రాఘవాచార్యులుగారి విశాఖదత్తుడు
మొదలగు వ్యాసములు, కథలు, పద్యములు, విమర్శ
నలు సాహిత్యాభ్యుదయమునకు నిదర్శనములు. త్రివర్ణ
చిత్రములు చిత్రకారుల నిర్మాణ సామర్థ్యమునకును, సం
భావనాశక్తికిని నిదర్శనములు. శ్రీచిత్రగారి కాశ్మీర సుం
దరి, దుర్గాదాసుగారి పండ్లపడుచు, కృష్ణమూర్తిగారి
దివ్యక్షణము, వేంకటసుబ్బారావు గారి శచీంద్రుడు,
శ్యామలా దేవిగారి అలంకరణము, హనుమంతరావుగారి
కవిబ్రహ్మతిక్కన, వేంకటరావుగారిప్రేమజ్యోతి, రామా
రావుగారి రేణుక చిత్రకారుల నిర్మాణశక్తిని విశదము
చేయుచున్నవి. సామాన్యచిత్రములు వివిధరంగములం
దును దేశావృతమైన ప్రజానాయకుల ప్రయత్నములను
నామ రూపములను ప్రత్యక్షముచేయుచున్నవి.
యువసంవత్సరాదిసంచికను ప్రచురించుటకు వ్యాసము
లను, చిత్రపటములను,ఛాయాపటములను పంపిన మహా
జనులకును, ఇతరవిధముల సహాయముచేసిన మహాజను
లకును వందనములు.

అనంతమైన కర్తవ్యమునందు పరిమిత దేశకాల
పాత్రావరణములందు కృత మతిస్వల్పము. కీలకసంవ
త్సరమునుండి యువసంవత్సరాంతమువరకును ఆంధ్ర
పత్రిక చేసిన కార్యములు ప్రపంచవ్యవహారములందత్యంత
పరిమితములు. వాయువేగముతో ప్రవర్ధమానం బగు
చున్న భావరూపపరివర్తనములు దురూహ్యములు, వర్ణ
నాతీతములు. గతించిన ౨౬ ఏండ్లయందును ప్రపంచ
వ్యవహారములందును, ఆంధ్రవ్యవహారములందును
గలుగుచున్న పరివర్తనమును సింహావలోకనమును
జేయుటకు సంవత్సరాదిసంచికలు వినియోగపడగలవు.
ప్రపంచపరివర్తనమునం దొక దారుణసంగ్రామపర్వము
గతించినను వేరొకభయంకర సంగ్రామపర్వ మారంభ
మగుచున్నది. శాంతిపర్వారంభమున కెన్ని యుద్ధ
పర్వము లవసరమో దురూహ్యము. ప్రపంచ మంత
యును ఆర్థికసమరమునందు మునిగితేలుచున్నది. శాంతి
పర్వారంభమునకు ఆర్థికసంగ్రామాయుధసంగ్రామము
లంతరించుటకు విశ్వప్రయత్నము లవసరములని ప్రపంచ
వ్యవహారములు చాటుచున్నవి. గత సంవత్సరమునం
దార్థికమహాసభా వ్యవహారములును నిరర్థకములైనను
వర్తమానసంవత్సరమునందు శాంతి పర్వారంభమునకు
ప్రయత్నములు జరుగుట శుభచిహ్నము. సంగ్రామ
దౌర్జన్యమును సంగ్రామసన్నాహములు జయించుట
యసంభవము. సంగ్రామదౌర్జన్యమును శాంతిసాధ్య
మయిన ధర్మబలము జయించగలదు. కలియుగారంభము
నందు మహాభారతయుద్ధము ప్రతిపాదించిన ధర్మసందేశ

ముసె గాంధిమహాత్ముడు వర్తమానకాలమునందు ప్రపంచమున కాత్మికధానుభవపూర్వముగను ప్రదర్శించుచున్నను ప్రపంచసంస్కారము ప్రతిఘటించుచున్నది. రుష్యాయందు స్టాలినుగ్గారు ఈడెనుగారికి తెలిపినటులు మహారాజ్యముల ధర్మబలము ప్రపంచశాంతికి వినియోగపడవలసియున్నది. మహారాజ్యములసంయుక్తధర్మబలము శ్వేతజాతులందు సంగ్రామనివారణమునకు వినియోగపడినను శ్వేతేతరజాతుల నిర్బంధములకు వినియోగపడదని నానాజాతిసమితివ్యవహారములు విస్పష్టముచేసినవి. జపాను నానాజాతిసమితినుండి వెడలిపోయినవిధమాసియాప్రజలపట్ల యూరపురాజ్యములకు గల నిరసనభావము విశదమగుచున్నది. ఆత్మగౌరవము వ్యక్తముచేయగల జపానురాజ్య మాత్మగౌరవమును వ్యక్తముచేసినది. యూరపురాజ్యములు చిరకాలమునుండియును నవలంబించుచున్న పరాక్రమణ ధర్మమునే జపాను రాజ్య మవలంబించినను జపాను వ్యవహారములను ముఖ్యముగను మంచూకోరాజ్యనిర్మాణమును నానాజాతిసమితి గర్హించినది. ఆయుధధారణ ధర్మమును యూరపురాజ్యముల ప్రమాణమునకును, జపానురాజ్య ప్రమాణమునకును భేదములు నిరూపింపబడినవి. వ్యాపారవిధానమునందును యూరపురాజ్యములు జపానుకు ప్రత్యేకధర్మమును నిర్ణయింపగోరినవి. యూరపురాజ్యములు నేర్పినవిద్యనే జపాను యూరపురాజ్యములకు ద్విగుణీకృతముగ నేర్పుచున్నది. రుష్యానుండి చీనాతూర్పురైలుమార్గమును కొన్నది. జపాను క్రమముగను చీనాను నిర్బంధించుచు రాజ్య వ్యాపనమును జేయుచున్నది. జపాను సైన్య, నౌకాబలములు ప్రబలము లైనను వైమానికబలమునందు జపాను వెనుకబడియున్నది. సోవిటు రుష్యా ప్రబలమైన వైమానిక బలముల నాసియా, యూరపుఖండమునందు సిద్ధము చేయుచున్నది. జపాను, చీనాపట్ల నవలంబించుచున్న భేదదండన తంత్రములు ప్రస్తుతము సఫల మగుచున్నను కాలక్రమమున భగ్న మగుట సహజము. ఆసియాఖండ గౌరవసంరక్షణమును స్థాపింపదలచిన జపానురాజ్యము ప్రధానమైన చీనారాజ్యము మిత్రత్వమును స్థాపించుట సంకల్పసిద్ధికి మూలబీజము. ఈడెను, స్టాలిను సంప్రతింపు ప్రస్తుత సంగ్రామ రంగము ప్రాచ్యదేశములం దారంభమగునదియును, పాశ్చాత్యదేశములం దారంభమగునదియును విమర్శించియుండును. సోవిటు రుష్యాను ప్రాచ్యరంగమునందు జపాను పాశ్చాత్యరంగమునందు జపాను ప్రతిఘటించుచున్నవి. పాశ్చాత్యరంగమునందు గ్రేటుబ్రిటను, ఫ్రాన్సు, మధ్య యూరపురాజ్యములు రుష్యామిత్రత్వము నభిలషించుచున్నవి. ప్రాచ్యరంగమునందు రుష్యా జపాను సంగ్రామమును యూరపురాజ్యము లానందముగను జూచుచు వ్యాపారలాభమును బడయగలవు. గ్రేటుబ్రిటను నుభయసందర్భములందును తటస్థముగనుండి లాభమును పొందవచ్చును. హిట్లరు ప్రగల్భములు సమరసన్నాహములకు వినియోగపడుచున్నను సంగ్రామము వర్తమానపరిస్థితులందు దుర్లభము. ప్రాచ్యరంగమునందైనను 1936 వరకును సంగ్రామ మసంభవమని ప్రపంచపరిస్థితులు విశదము చేయుచున్నవి. బ్రిటీషు జాతీయప్రభుత్వ మీ సంవత్సరమునందు ఇండియా బిల్లును సిద్ధముచేసియును, నితర ప్రయత్నములను చేసియును 1936 సంవత్సరమునందు రాజ్యతంత్ర రంగము నాక్రమించుటకు సిద్ధముగ నుండునను వ్యవహారోదంతము విశదము చేయుచున్నది. కాంగ్రెసు పట్ల ప్రభుత్వ మవలంబించుచున్న సామదానభేదదండనోపాయములు బ్రిటీషుజాతీయప్రభుత్వ రాజ్యనీతికి సువ్యాఖ్యానము.

భావసంవత్సరోదంతము హిందూస్థానరాజ్యాంగ చరిత్రమునందును, కాంగ్రెసుచరిత్రమునందును నూతన శకారంభమును విశదముచేయుచున్నది. గాంధిమహా

కాంగ్రెసు

త్ముని నాయకత్వముక్రిందను గతించిన ౧౫ ఏండ్లయందును కాంగ్రెసు అవలంబించిన శాసనోల్లంఘనప్రస్థాన ముపసంహరింపబడినది. శాసనసభల బహిష్కారము తొలగింపబడి

నది. కాంగ్రెసుశాఖగను పార్లమెంటరిబోర్డు ఏర్పాటు చేయబడి సామ్రాజ్యశాసనసభాస్థానములను కాంగ్రెసు పక్షమున నభ్యర్థించుటకు నిర్ణయింపబడినది. కాంగ్రెసు అంగనిర్మాణము పరివర్తనమును పొందినది. కాంగ్రెసు నంఘను, అఖిలభారత స్థాయిసంఘమునందును ప్రతినిధులసంఖ్య తగ్గింపబడినది. గాంధిమహాత్ముడు కాంగ్రెసు సంబంధమును చాలించుకొనెను. కాంగ్రెసుధర్మసూత్రమును ("Peaceful and Legitimate Means") దౌర్జన్యరహితమైన శాంతసమ్మతమైన సాధనములకు ("Truthful and Non-violent") "సత్యాహింసాసాధనములు" మార్చుటకు చేసిన ప్రయత్నములు ప్రతిఘటనమును పొంది పరాజయమును పొందినవి. గాంధితత్త్వమునందె కాంగ్రెసునకు విశ్వాసము తగ్గినటులు భేదాభిప్రాయములు వ్యక్తము చేసినవి. గాంధిమహాత్మునకు సత్యాహింసలు సంకల్పసిద్ధికి సాధనములె కాక నుసాధ్యములు. ప్రభుత్వ మవలంబించిన నిర్బంధవిధానము కాంగ్రెసు వ్యవహారములను స్తంభింప జేసినది. ఆంగ్లవిద్యావంతులు వారి లక్ష్యమును శాసనసభలకు మరల్చిరి. శ్రీయుత సత్యమూర్తిగారు మొదలగు నాయకులు శాసనసభాప్రవేశము విషయమై చేసిన యాందోళనము కార్యరూపమును దాల్చినది. ఈ సందర్భములందు 3½ ఏండ్లతర్వాతను బొంబయియందు శ్రీయుత బాబు రాజేంద్రప్రసాదుగారి యాధిపత్యముక్రిందనుగూడిన ౪౮వ కాంగ్రెసు నూతనశకారంభమును జేసెనవిధమును కాంగ్రెసు వ్యవహారములు విశదముచేసినవి. శ్రీ బాబు రాజేంద్రప్రసాదుగారి దేశభక్తి, త్యాగము, ప్రజ్ఞాపాండిత్యములు, కార్యపరాయణత్వము బొంబయి కాంగ్రెసువిజయమునకు వినియోగపడినను కాంగ్రెసువిధానము నూతనమార్గము నవలంబించవలసిన యవసర మవగతమైనది. కాంగ్రెసునందు సహాయనిరాకరణపక్షము, శాసనసభా ప్రవేశపక్షము, సాంఘికపక్షము, ప్రత్యేకసంఘాభిమానపక్షము, బహిష్కారపక్షము మొదలగుపక్షములు కాంగ్రెసునందు భేదాభిప్రాయములను గలుగజేసినవి. గాంధిమహాత్ముని నిర్గమనము కాంగ్రెసు బలగౌరవముల కభ్యంతరములను గలుగజేసినది. ఇట్టి విషాదపరిస్థితులందును అసెంబ్లి ఎన్నికలందు కాంగ్రెసు సభ్యులకు గలిగిన అఖండవిజయము ప్రజలకు కాంగ్రెసుపట్లను, సంపూర్ణస్వరాజ్యముపట్లను గల దృఢవిశ్వాసమును నిరంకుశాధికార వర్గమునకు సువ్యక్తము చేసినది. నిరంకుశప్రభుత్వము ప్రజాభిప్రాయములను శాసనసభలయందును, నితర రంగములందును నిర్లక్ష్యము చేయుచున్నవిధము కాంగ్రెసు బాధ్యతను, ప్రజానాయకుల బాధ్యతను ద్విగుణీకృతము చేయుచున్నది. శాసనసభలు స్వరాజ్యసంపాదనమునకు సాధనములు గాకపోయినను ప్రజాభిప్రాయములను వ్యక్తము చేయుటకును, నిర్బంధవిధానములను నిరాకరించుటకును వినియోగపడుచున్నవి. శాసనసభలయందున్న వందలమందియును, బయటనున్న వేలు లక్షలు మందియును కాంగ్రెసు సంఘములను, కాంగ్రెసు కార్య విధానమును చైతన్యప్రదము చేయుటయును విధికృతముగ నున్నది. పారతంత్ర్యపాశములందు నిశ్చేష్టత ననుభవించుచున్న హిందూస్తానమునకు పూర్ణస్వరాజ్య సంపాదనము హిందూస్తాన ప్రజాధీనమునందు గల విధమును ప్రజలు గ్రహించి లక్షలమంది కాంగ్రెసుసభ్యులుగ జేరి కాంగ్రెసు కార్యవిధానమును పూర్వమువలెనే భావికాలమునందును నారాధించి పూర్ణస్వరాజ్యస్థాపనమును జేయుటకు భగవదనుగ్రహమునకు పాత్రులగుదురు గాత!

గాంధిమహాత్ముడు కాంగ్రెసు సాంఘికార్థిక పారిశ్రామికాది విషయములందవలంబించిన యాత్మ విశ్వాస సాధనము ప్రపంచమునకు సనాతనమైనను వర్తమాన పరిస్థితులందు నవీనమై అభ్యాసయోగమునందు సందేహములు గలుగుచున్నవి. సత్యాహింసలు సకలార్థసిద్ధికి సనాతనములయిన పరమార్థసాధనములు. సత్యజ్ఞానానందమయమైన ప్రపంచమునందు సత్యము సకలార్థములకును మూలాధారము. సత్యమును మనోవాక్కాయములను ననుభవసిద్ధము చేయుట కాత్మానుభవము ప్రమాణము. దేశకాల పాత్రాధారమయమైన బాహ్య ప్రపంచమునందు సత్యసంభావన సందర్శనములు సాపేక్షములు, నిరపేక్షమైనను సత్యానుభవ మాత్మానుభవమునందే సాధ్యము. అవతార పురుషులైన మహాత్ములకు సత్యానుభవము సాధ్యము. గాంధి మహాత్ముడు ప్రపంచ వ్యవహారములందు కార్యసాధన ముపక్రమిం

గాంధి మహాత్మునకు

చిన సత్యాగ్రహము దురారాధ్యమైనను సత్యసాధన మనుపరమార్థమును మహాత్ముని ఆత్మకథ విచిత్రముగను విశదముచేయుచున్నది. సంగ్రామ సన్నాహములందును, దౌర్జన్యమునందును, పరాక్రమణ పరపీడనములందును నిమగ్నమైన ప్రపంచమునకు గాంధిమహాత్ము డుపక్రమించిన సత్యాగ్రహము శాంతి స్థాపనమునకు యథార్థమైన సాధనము. ఆసాధనమును ప్రపంచమున కనుభవసిద్ధము చేయుట కవలంబించిన త్యాగయోగమార్గము శాంతికాముల శ్రవణమనన ధ్యానసంకీర్తనాచరణములకు దగియున్నది. గాంధిమహాత్ముడు సత్యాగ్రహారాధనమునుచేసెడి విధమును సత్యాగ్రహాశ్రమ విసర్జనము, కాంగ్రెసు పరిత్యాగము, మమకారాహంకారవిసర్జనము, ఆత్మనిగ్రహము వెల్లడిచేయుచున్నవి. వ్యాసవశిష్ఠ శుకజనకజిన బౌద్ధాశోకాదిమహానుభావులకు జన్మభూమియైన హిందూస్తానమునందు గాంధిమహాత్ముడు జన్మించుట మహాభాగ్యము. భాగ్యభోగపరాయణమైన వర్తమాన ప్రపంచపరిస్థితులందు రాజులకు, రయితులకు, కుబేరులకు, దరిద్రులకు, సైనికులకు, సామాన్యులకు, స్వతంత్రులకు పరతంత్రులకు సత్యాగ్రహమునందు విశ్వాసము లేకపోయినను సాధనాంతరములు దురారాధ్యములయి ప్రపంచశాంతికిని ఆత్మోద్ధరణమునకును సత్యాహింసలు శరణ్యములు. ఆంధ్రమహాజనులు గాంధిమహాత్ము డుపక్రమించినసత్యాగ్రహ యాత్రా సేవనము చేసి కృతార్థు లగుదురుగాత!

ధర్మసూత్రబద్ధమైన విశ్వమునందు చరాచరజీవజాలములకు జీవయాత్ర కాత్మావలంబనము సాధనము. పిపీలికాది బ్రహ్మపర్యంతము గల జీవజాలము లనవరతము సాంఖ్యయోగ సాధనముల నాత్మవికాసమును బొందుచు చతుర్విధపురుషార్థములనుబడయుచున్నవి.

**ఆంధ్రుల కర్తవ్యము**

పురుషార్థమునకు దేశకాలపాత్రావరణములందు సాధనములు వేరైనను సాధ్యము సమానము. ప్రపంచవ్యాప్తములైన దేశకాలపాత్రావరణములందు వ్యక్తులు, కుటుంబములు, కులములు, సంఘములు, జాతులు, దేశములు, శకములు భిన్నములైనను నియతమైన మానవధర్మప్రయోజనము విశ్వపరిణామమునకు సమానము. హిందూస్థాన స్వాతంత్ర్యోద్యమమునం దాంధ్రమహాజనులును స్వధర్మనిర్వహణమును జేసినవిధము దేశీయవ్యవహారములు వెల్లడిచేయుచున్నవి. ఖద్దరు, సత్యాగ్రహము, హరిజనసేవ, కాంగ్రెసువ్యవహారములు మొదలగు దేశహితైక కార్యములందువలె సంగీత సాహిత్య కళారంగములందు ఆంధ్రమహాజనులు చేయుచున్న పరిశ్రమ ప్రశంసాపాత్రము. ప్రపంచవ్యాప్తమైన దుర్దశయం దాంధ్రావని యనుభవించుచున్న కష్టపరంపర లనుభవైకవేద్యములు. ఆంధ్రదేశమునందు వ్యవసాయము ప్రజాజీవనమునకుమూలాధారము. ప్రజలు గ్రామసీమవాసులు. దేశాభ్యుదయమునకు సాధనములైన పరిశ్రమవ్యాపారములు మృగ్యములు. గాంధిమహాత్ము డుద్ధరింపసంకల్పించిన గ్రామోద్యోగోద్యమము ఆంధ్రదేశ ప్రజోద్ధరణమునకు సకల విధములను తగియున్నది. ప్రజానాయకులు పక్షమతసంఘదశాసంస్కారభేదములను మరచి గ్రామసీమలందలి ప్రజోద్ధరణమునకు పాటుపడుట పురుషార్థసాధనము. గ్రామసీమోద్ధరణమునకు రాజులు, శ్రీమంతులు, విద్యావంతులు, కవులు, గ్రంథకర్తలు, పరపతిసంఘాభిమానులు బ్యాంకరులు, సాహిత్యోపాసకులు, కళాభిమానులు, గురువులు, భక్తులు, కర్మకారులు, రయితులు మొదలగు సకలజనులును కలిసి దేశసేవను, మానవసేవను జేయుట కపారమైన యవకాశములు గలవు. నిర్దుష్టమైన ఈ పనులనైనను జేయుటకు గాంధిమహాత్మునకును ప్రజానాయకులకును నవకాశములను గలుగజేయుట ప్రభుత్వమునకు ధర్మము. గాంధిమహాత్ముడు యువసంవత్సరమునందు గ్రామోద్యోగోద్యమనిర్వహణ నిర్మాణవ్యాపనములకై దేశసంచారమును జేయబూనుట సముచితముగ నున్నది. ఆంధ్రదేశప్రజాభాషాభిమానులందరును గాంధిమహాత్ముని ఉద్యోగపర్వసంచారమును, సార్థకముచేయుటకును, కృతార్థు లగుటకును శ్రీభగవద్గీతాంతమునందలి సంజయుని ధర్మోపదేశమును సార్థకము చేయుదురుగాత!

శ్లో. యత్ర యోగీశ్వరః కృష్ణోయత్ర పార్థో ధనుర్ధరః,
తత్రశ్రీ ర్విజయో భూతి ర్ధ్రువా నీతి ర్మతిర్మమ.

---

# ౪౮-వ భారత జాతీయమహాసభ




౧. అధ్యక్షులు శ్రీ రాజేంద్రబాబు, వారి సతీమణియు



౫. విషయనిర్ణయసభనుండి తిరిగివచ్చుచున్న మహాత్ముఁడు, వల్లభాయిపటేలు, నారిమనుగార్లు

# ౧ రాజకీయము

## ౪౮-వ దేశీయమహాజనసభ—అధ్యక్షోపన్యాసము

సోదర సోదరీమణులారా!

మూడున్నర సంవత్సరములు నిరంతరకృషిసల్పి అష్టకష్టముల కోర్చి నేటికి తిరిగి మనమిచట సమావేశమైతిమి. డాక్టరు ఆనీబీసెంటమ్మగారు స్వర్గస్థులగుటచే ఆమెయొక్క పరిపక్వమైన వివేకసంపదను, ఆమెయొక్క సన్మార్గోపదేశములను మనము నేడు గోల్పోయితిమి. చిరకాలానుభవజ్ఞురాలైన ఆమెజీవితచరిత్రయును, సత్కార్యదీక్షయును అనేకవేలమందికి ప్రబోధకరమై, ఉత్సాహజనకమైయుండెను. యావజ్జీవితము దేశసేవాపరాయణుడై యుండిన సర్ శంకరన్ నాయరుగారిని, జాతీయపక్షమునకు పట్టుగొమ్మయై యుండిన సర్ సయ్యాదు హసన్ ఇమాముగారిని కోల్పోవుట దేశదౌర్భాగ్యము. హసన్ ఇమాముగారు ౧౬ సం.ల క్రింద ఈ బొంబాయినగరములో జరుపబడిన స్పెషల్ కాంగ్రెసుసభకు అధ్యక్షత వహించియుండిరి. విఠల్ భాయిపటేలుగారు అసెంబ్లీసభాధిపతులై అధ్యక్షపీఠమునందున్నప్పుడే గాక, తదితరకాలములందును దేశస్వాతంత్ర్యసంపాదనమునకై బద్ధకంకణులయి యుండిరి. అట్టిమహనీయుడు నేడు లేనిలోటు కన్పించుచునే యున్నది. దానిని తీర్చుట సాధ్యముకాని మాట. దేశప్రియ జితేంద్రమోహన సేనుగుప్తాగారి అకాలమరణము మనలో చాలమందికి ఆత్మబంధువియోగమువంటిది. ఏ. రంగస్వామి అయ్యంగారు స్వర్గస్థులయిరి ఆయన సుప్రసిద్ధ పత్రికానిర్వాహకుడును, రాజ్యాంగతంత్ర మర్మవేత్తయును అగుటవలన పలుమారు మనకు తోడునీడగా తోడ్పడిన ఆయన జ్ఞానసంపద నేడు మనకు కరవైనది. వీరు గాక బందిఖానాలో ఇనుపతలుపులచే బంధింపబడి యున్న జవహర్లాలు నెహ్రూగారికి మన మీ సభాస్థలినుండి మన మంగళాశీస్సులను, అభినందనములను అందజేయవలసి యున్నది. కుటుంబకష్టము లెన్నివచ్చినను, తన దేశవాసులెంత వెనుకంజవేసినను అప్రతిహత సుస్థిరసంకల్పముతో పట్టినపట్టు వీడని యుక్కుతునకవంటి యువకుడితడు. ఈసమయమున దూరదేశమునందున్న సుభాసచంద్రబోసుగారినికూడ మనము స్మరింపవలెను. ఆతడు అచంచల వీరుడు. వీరేగాక మనకు తెలియకుండ దేశదాస్య విమోచనార్థము పడరాని యిడుముల బడినట్టియు, బడుచున్నట్టియు మహానుభావుల కందరికిని మనము వందనము లాచరింపవలసియున్నది. దేశముకొఱకు అపారత్యాగ మొనర్చి ప్రాణములు గోల్పోయిన ధన్యాత్ముల కందరికిని మనము బద్ధాంజలులము.

అతిక్లిష్టమైన విషమసమయమున జరుగుచున్న యీకాంగ్రెసు సభకు అధ్యక్షపదవిని వహింపవలసినదిగా నన్ను మీరు కోరితిరి. మరల కాంగ్రెసుసభ సమావేశమగువరకునుసభా వ్యవహారభారమును నేనే వహింపవలయునని మీరు అపేక్షించుట సహజమే కాని యీ ఆధిపత్యము నంతను వహించుటయందుగల అపారమైన బాధ్యత నా శక్తికి మించినదని నెఱచుచున్నాను. ఏదో ఒక మారుమూల పడియుండి నాచేతనయిన దేశసేవను చేయుచు కాలక్షేపము చేయుట నాకు హాయిగా నుండును. కాని భారతజాతి యంతయును నన్నీ కార్యభారమును వహింపవలసినదిగా కోరి పిలచి పెద్దపీట వేసినప్పుడు నా దేశీయుల యాజ్ఞను నేను తృణీకరింపజాలను. దేశసేవ చేయుటకు సంసిద్ధుడనై మీయెదుట నిలిచితిని. నా శక్తిసామర్థ్యము లీకార్యభారమునకు తగినంతగా లేవని నాకు తెలియును. మీకు నాయందు గల విశ్వాసము కేవలము నాయందుగల గౌరవాధిక్యమును సూచింపదనియు, ఇటీవల మా బీహారురాష్ట్రవాసులు సత్యాగ్రహసమరమున జూపిన అల్పమాత్ర త్యాగముపట్ల మీ ప్రశంసకును, బీహారు రాష్ట్రమున కిటీవల సంభవించిన భూకంప మహోపద్రవసందర్భమున దేశమంతయును సర్వతోముఖముగా కనుబరచిన ఆదరణాతిశయమునకును ఇది సూచకము. కాబట్టి మీ యందరియొక్క సాహచర్య సహాయ సంపదవల్లనే యీకార్యభారమును వహింపగల్గుదును.

బీహారురాష్ట్రము పదిమాసముల క్రిందట భగవంతుని కోపానలమునకు పాల్పడినది. భూకంపమువల్లను, వరదలవల్లను బీభత్సమైన బీహారురాష్ట్రమునందలి జనులయెడల భారతదేశమంతయును కరుణారసవృష్టిని ప్రత్యక్ష సేవాసహాయములరూపమున గురిపించెను. ఆసేతుహిమాచలము గల భారతీయులందరును, ఖండాంతరములందలి భారతీయులును, విదేశములవారును బీహారుప్రజలయెడల తమ వాత్సల్యమును, అనురాగమును సకలవిధముల వెల్లడించిరి. ఆభూకంప మహోత్పాత మెంత యపూర్వ వైచిత్ర్యమో యీవిశ్వవ్యాప్తమైన ఆదరణానురాగములుకూడ అంత యపూర్వవిశేషమైనది ఇంత విస్తీర్ణము గల భూభాగ మిదివర కెన్నడును భూకంప సంక్షుభితము కాకున్నను ఇటువంటి మహాప్రళయములు ప్రపంచచరిత్రలో మరికొన్ని ఉదాహరణములుగా పేర్కొనబడియున్నవి. కాని, ఆవెనుకటి యుపద్రవముల సందర్భములం దింతటి సర్వజనాదరణ మెన్నడును చూపబడినట్లు కానరాదు. ఉత్తరహిందూస్థానమందలి యొక్కప్రాంతము

నందలి జనుల మొఱాలించి జాతీయాభిమాన ప్రపూరితమైన యావద్భారతవర్షము కన్నీరు విడిచెను; కనకవర్షము గురిపించెను; కాయకష్టమునకు కావలసిన సేవాసహాయ మొనర్చెను. బీహారు భూకంప బాధిత కేంద్ర సహాయనిధి సంఘమువారు వ్రాసినరీతిగా బీహారు భూకంపమునందు వేలకొలది ప్రాణములు పోయినవి. రాష్ట్రము దుఃఖసముద్రమయ్యెను. కాని, యీదుఃఖసముద్రమునందు భారత జాతియంతయును నదీసంగమమువలె ఐక్యమై పరస్పరవైషమ్య విభేదముల నన్నింటిని మరచెను. ఈమహాసంక్షోభ సమయమునందట్టి వైషమ్యములన్నియు క్షుద్రవిషయములని భారతీయు లందరును గ్రహింపగల్గిరి.

## కాంగ్రెసుయొక్క ఇటీవలి చరిత్ర

కడచిన ౫౦ సంవత్సరములనుండియును కాంగ్రెసు మహాసభ పెక్కుమార్పులను పొందినది.

ఈ జాతీయ మహాసభయొక్క మనోరథమును, అసమర్థతాపజయములను, విజయాభ్యుదయములను సింహావలోకనముగా విమర్శింప కుతూహలముపుట్టును. కాని, మన భవిష్యత్కార్యక్రమ నిర్ణయమున కెంతవరకు అవసరమో అంతవరకే పూర్వ కథా వృత్తాంతము నొక్కింత వివరించెదను.

౧౯౩౧ మార్చి నెలలో కరాచీయందు సక్రమముగా గడచిన మహాసభ సమావేశమై గాంధీ - ఇర్విను ఒడంబడిక పిమ్మటనే అది జరిగినది. ఆ ఒడంబడికవల్ల ఆంగ్ల భారతదేశములకు రెంటికిని సుస్థిర శాంతిసమాధానములు ఏర్పడగలవని ఆశపుట్టెను. కాని, అట్లుజరగక పోయెను. సత్యాగ్రహసమరముకూడ ఇపుడు విరమింపబడినది. కనుక రెండవ రౌండుటేబిలుసభకు మహాత్ముడు పోయి మరలి వచ్చిన తోడనే ఏ పరిస్థితులవల్ల మరల సత్యాగ్రహోద్యమమును సాగింపవలసి వచ్చెనో ఆకారణముల నన్నింటిని పూసగ్రుచ్చినట్లుగా చెప్పుట యనావశ్యకము. కాని ఒక్కవిషయము చెప్పవలెను. గాంధి - ఇర్విను ఒడంబడికలోని షరతులను మాత్రము ప్రభుత్వాధికారులు అడుగడుగునకును తృణీకరించి ఆ ఒడంబడికను వ్యర్థమొనర్చుచువచ్చిరి. చిట్టచివరకు ఇర్వినుప్రభువు వైస్రాయిపదవినుండి విరమించెను. విల్లింగుడనుప్రభువు వైస్రాయి అయ్యెను ఇర్వినుప్రభువు అనవసరముగా లోబడి లొంగిపోయెననియు, అట్టి లొంగుబాటు తప్పుపని యనియు ప్రభుత్వాధికారులు భావింపసాగిరి. గవర్నమెంటు యొక్క ధోరణియంతయును మారిపోయినది. రెండవ రౌండు టేబిలుసభ ముగియగానే, కాంగ్రెసుసభను ఆకస్మికముగా అణకట్టవలెనని గట్టి ప్రయత్నములు చేయబడెను. కాంగ్రెసుసభవారి కోర్కెల నెరవేర్చుట దుస్సాధ్య మనియు, గవర్నమెంటువారట్టికోరికల నీడేర్పజాల రనియు విశదపరచబడెను. ఇంగ్లాండు దేశమునకూడ దీని కనుగణముగనే సందర్భము లన్నియు మారిపోయెను. అచటి కార్మిక పక్షమువారికి ప్రభుత్వాధికారము తొలగిపోయెను. కన్సర్వేటివు పక్షమువారికి (సంస్కరణ ప్రతిఘాలురకు) అధికారము చేతికి వచ్చెను. అందువల్ల వైస్రాయిగానుండిన ఇర్వినుప్రభువుయొక్కయు, ఇండియా కార్యదర్శిగా నుండిన వెడ్జివుడ్ బెన్నుగారియొక్కయు వ్యవహారధోరణియంతయును తారుమారయ్యెను

గాంధిమహాత్ముడు రౌండుటేబిలు సభ యైనపిమ్మట ఇంగ్లాండునుండి రాగానే చాల మెలకువతో కుయుక్తులతో పన్నాగము చేయబడిన విపరీతపరిస్థితులు దేశములో కన్పించెను. సంయుక్తపరగణాలయందు పన్నుల నిరాకరణ మను ఉద్యమము విజృంభించుచున్నదను నెపమొకటి సూచింపబడెను. కాని, పంటలధరలు పడిపోవుటవల్ల రైతులు శిస్తులుచెల్లింపజాల మని మొఱపెట్టుచుండుటచేత కాంగ్రెసు నాయకులు శిస్తు రిమిషనుల విషయములో గవర్నమెంటు అధికారులతో సంప్రతించుచుండిరి. ఆసంప్రతింపుల పర్యవసానము తెలియువరకుమాత్రము రైతులు శిస్తులను చెల్లింపక నిలిపియుంచిరి. దీనినే పన్నుల నిరాకరణోద్యమముగా గవర్నమెంటువారు చెప్పిని పండిత జవహరిలాలు నెహ్రూగారిని, షెర్వానీగారిని, టాండను గారిని మహాత్ముడు మరలివచ్చుటకు రెండుదినములు ముందే అరెస్టు చేసిరి. అబ్దుల్ గఫూరుఖానుగారిని, ఆయన అనుచరులను ప్రాతచట్టము ప్రకారము అరెస్టుచేసి ఖైదీలగా నిర్బంధించియుంచిరి. కొన్ని దారుణమైన దండశాసనములను (ఆర్డినెన్సులను) బెంగాలురాష్ట్రమునందు అమలునకు తెచ్చిరి అటువంటి మరికొన్ని ఆర్డినెన్సులను (అత్యవసర శాసనములను) సంయుక్తపరగణాలలోను, సరిహద్దురాష్ట్రములలోను కూడ వర్తింపజేసిరి మహాత్ముడు ఇంగ్లాండునుండి ఓడ ఎక్కి వచ్చుచు మార్గమధ్యములోనే కొన్ని అభిప్రాయములను ప్రకటించెను. వీలైనంతవరకు గవర్నమెంటువారితో సహకార సాహచర్యములకు సిద్ధముగా నున్నానని తెలిపెను. కాని బొంబాయిలో ఓడ దిగగానే, తన సహచరులగు ప్రముఖు లనేకులు అరెస్టు చేయబడుటయును, దారుణశాసనములు క్రొత్త క్రొత్తవి అమలుజరుపబడుటయును చూచెను ఇంకను వీలైనంతవరకు సమాధానపద్ధతి ఏదైననొకటి చూడవలెనని గాంధిజీ యత్నించెను. అందుకొరకై వైస్రాయి యగు విల్లింగ్డనుగారిని సందర్శించి మాట్లాడుట కవకాశమొసంగవలసినదని వైస్రాయిగారికి దరఖాస్తు పంపుకొనెను కాని, వైస్రాయి తాను దర్శనమిచ్చి మాట్లాడుటకు వీలులేదని మొగమోటములేక బదులు చెప్పెను. బెంగాలురాష్ట్రమునకును, సంయుక్తపరగణాలకును, సరిహద్దురాష్ట్రమునకును సంబంధించినవిషయములనుగూర్చి ప్రస్తావింపని యెడలనే వైస్రాయి దర్శనమిచ్చి గాంధిజీతో మాట్లాడెదనని ఒక షరతు ఏర్పరచెను. అందువల్ల మహాత్ముడిక గత్యంతరములేక సత్యాగ్రహోద్యమమును మరల ఉపక్రమించుటకు సిద్ధముకావలెనని కాంగ్రెసు వర్కింగుకమిటీకి సలహా యిచ్చెను. కట్టకడపటి ప్రయత్నము మరొక్కటి గాంధిమహాత్ముడు చేసెను. బేషరతుగా తనకు సందర్శన మిచ్చి మాట్లాడుటకు అవకాశమీయవలెనని మరొకమారు మహా

త్ముడు వైస్రాయిని కోరుచు తంతివార్త నంపెను. అట్టి అవకాశము నొసంగనియెడల కాంగ్రెసు వర్కింగుకమిటీవారు సత్యాగ్రహమును తిరిగి ప్రారంభింపనున్నారనికూడ వైస్రాయికి మహాత్ముడు తన విధ్యుక్తధర్మముగా తెలియజేసెను కాని, ఆ విన్నపమునకు ప్రత్యుత్తరము మహాత్ముని, సర్దారు వల్లభాయిపటేలును, తదితర కాంగ్రెసు నాయకులను అరెస్టుచేయుటకై జారీచేయబడిన అరెస్టువారంటులే.

కాంగ్రెసుపై యిది దొంగచాటుదెబ్బగా పడినది. ఈదెబ్బతో కాంగ్రెసుఉద్యమమునంతను ఒకపక్షములోఅణగద్రొక్కివేయగలమని గవర్నమెంటువారు ఉవ్విళ్లూరిరి. కాంగ్రెసువారు మాత్రము తగిన ప్రయత్నములో లేకున్నను, పెద్దపెద్ద నాయకులందరును అవ్యవధిగా అరెస్టుచేయబడుటవల్ల ఉద్యమమును కట్టుదిట్టముచేసి అంగబలమును ఏర్పాటుచేయుటకు తగిన సంప్రతింపు సలహాల కవకాశములేకపోయినను వర్కింగుకమిటీవారు చూపించిన వ్యవహారమార్గమును దేశమంతయును శ్రద్ధతో సమయస్ఫూర్తితో అనుసరించి సత్యాగ్రహమును సాగించినది. వేలకొలది జనులు మరల జెయిళ్లకు సిద్ధమైరి; లాఠీచార్జీలకు తలయొగ్గిరి; తుపాకులకాల్పులకు గురియై నిలిచి; జరీమానాలకు జడియలేదు. ఆస్తియంతయు సర్కారుకు దాఖలైనను సత్యాగ్రహమును వీడలేదు. రాజు తలచినప్పుడిక దెబ్బలకు కొదువలేదు.

ఉద్యమముమాత్రము అణగద్రొక్కబడలేదు. మాసములపర్యంతము అది అవిచ్ఛిన్నముగా సాగెను. అధికారులు ఆశ్చర్యపరవశులైరి. కాంగ్రెసుసభయొక్క అత్యవసరసమావేశములు ఢిల్లీలోను, కలకత్తాలోను జరుపబడెను. ఆసందర్భములందు అనేకులు అరెస్టుచేయబడిరి. లాఠీలు ప్రజలపై ప్రయోగింపబడెను. కాంగ్రెసుసభ జరుగకుండ ఆటంకపరచవలెనని పోలీసులు పహరా తిరుగుచుండినను సభ జరిగెను. ఈరీతిగా చెలరేగిన ప్రభుత్వనిరంకుశత్వమును పూసగ్రుచ్చినట్లు వివరించుట అనవసరము. అప్పుడు జారీచేయబడిన చండశాసనములలోని సెక్షనులను పరిశీలించినయెడల చాలును. ఆనాటి ఆర్డినెన్సులే శాసనసభ్యుల దయవల్ల స్థిరశాసనములైనవి. ఆశాసనములవల్ల న్యాయసభలకు న్యాయవిచారణప్రసక్తి తొలగింపబడెను. పోలీసు అధికారులకే సర్వాధికారము లొసగబడెను. పత్రికల నోరు మూయబడెను. క్రొత్తనేరములు కొన్ని కల్పింపబడెను ఒకరి నేరమునకు మరొకరిని శిక్షించుటకును, సాముదాయికముగా పెక్కుమందిని శిక్షించుటకును అధికారములు కల్పింపబడెను. ఈశాసనములుగాక, బెంగాలు రాష్ట్రమునందలి విప్లవకారుల యుద్ధృతమును అణచివేయుటకు ఆరాష్ట్రమునకు ప్రత్యేకశాసనము వర్తింపజేయబడెను. అందువల్ల దేశాభ్యుదయార్థమై సాగింపబడు సదుద్యమములు కూడ పోలీసువారికి వెరచి విరమింపబడెను. ఈవిప్లవకారుల రాజకీయ దురంతములనుగూర్చి కాంగ్రెసువారు తమయభిప్రాయమును నిర్దుష్టముగా వెల్లడించియున్నారు. ఈరాజకీయహత్యలను నిరసించెడి గాంధిమహాత్ముని సదోధనలవల్ల రాజకీయ హత్యాప్రయత్నములందు ప్రజలకు విముఖత్వము కలుగజేయబడెను. కాని గవర్నమెంటువారి కఠినదారుణచర్యలవల్ల రోషావేశులైయున్న ప్రజలను నయవాక్యములతో నొప్పించుట కాంగ్రెసునాయకులకు దుష్కరకార్యమయ్యెను. దేశమును అంతకంతకు కల్లోలముల కీడ్చి బీభత్సముచేయుననియు, ఈ రాజకీయ దురాగతములు హింసాసంప్రదాయ విరుద్ధములనియు కాంగ్రెసునాయకు లెప్పుడును వాదించి ఖండించుచునే యున్నారు. కాని ప్రభుత్వనిరంకుశత్వమువల్ల యువకుల రోషావేశమును ఉపశమింపజేయుట అసాధ్యమగుచున్నది.

దేశ మిప్పుడు ఆర్థికదుర్దశలో మునిగియున్నది. ఈస్థితిలో ఆర్థికవ్యవహారములను మన గవర్నమెంటువారు మనదేశక్షేమమునకు అనుకూలముగా గాక ఇంగ్లాండుదేశక్షేమమున కనుకూలముగా నడిపించుచున్నారు. రైతులు శిస్తులను చెల్లింపజాలని దురవస్థలపాలైయున్నారు. ప్రభుత్వమువారికి ద్రవ్యము తక్కువగుటవల్ల ప్రజాహితకార్యములకు మంజూరుచేయవలసిన ద్రవ్యమును చాలవరకు తగ్గించిరి. దేశములో వ్యాపారము మందగించినది రమారమి ౨౦౦ కోట్ల రూప్యముల విలువగల బంగారము మనదేశమునుండి విదేశములకెగుమతియైనది. దేశములో జీవనోపాధులు లేక అల్లాడు నిరుద్యోగుల సంఖ్య మితిమీరుచున్నది. ఈనిరుద్యోగులసంఖ్య వెనుకటి మామూలు దినములలోనే అత్యధికముగా నుండెను. అట్టి నిరుద్యోగులసంఖ్య లెక్కకు మిక్కిలిగా నుండుటవల్లనే గవర్నమెంటువారు అట్టివారి లెక్క జాబితాలు తయారు చేయజాలకపోయిరి. ఇటీవల గడచిన సంవత్సరములలో ప్రభుత్వఋణము చాలగా పెరిగినది. పన్నుల భారము హెచ్చింపబడినది. దారిద్ర్యములో మునిగియున్న ప్రజలు క్రొత్తపన్నులతో మరింత పీడింపబడుచున్నారు. పైఉద్యోగస్థుల జీతములను భరించుటకై కొంతవరకును, దేశస్వాతంత్ర్యముకొరకై ప్రజలు చేసెడి ప్రయత్నముల నణచివేయుటకై కొంతవరకును ప్రభుత్వాదాయము హెచ్చింపబడుచున్నది.

భారతదేశమునకు అనర్థదాయకమనియు, ముఖ్యముగా దేశములోని రైతాంగమునకు నష్టదాయకమనియు దేశములోని వ్యవహారవేత్తలందరును ఒట్టావాఒడంబడికను ఏకగ్రీవముగా ఖండించియుండిరి. ఆ ఒడంబడిక ప్రకారము ఎగుమతిదిగుమతిసరకులపై సుంకములు విధింపబడెను. అనుకొనినప్రకారముగా ననర్థములే కన్పించెను. ఆ ఒట్టావా ఒడంబడికమూలముగా బ్రిటిషుసామ్రాజ్యములో చేరిన దేశముల సరకుల వ్యాపారమునే అభిమానించి తక్కువ రేవు సుంకములు విధింపబడవలెననిరి. ఈబ్రిటిషువ్యాపారపక్షపాత మనెడి రథచక్రములకు భారతదేశమునుకూడ అంటగట్టి యీడ్చుకొని పోవుచున్నారు.

## ఖండాంతర భారతీయులు

ఖండాంతరములందున్న భారతీయులయవస్థ విషాదకరముగనే యున్నది. బ్రిటిషుసామ్రాజ్యములో చేరిన వలసరాజ్యములందలి భారతీయుల కష్టనిష్ఠురములను గూర్చి మనము చిరకాలమునుండియు మొఱపెట్టుచునే యున్నాము. అందువల్లనే మనము బ్రిటిషు సామ్రాజ్యాతీతమైన సంపూర్ణ స్వాతంత్ర్యము కావలెనని కోరుట కూడ సంభవించినది. ఈ వలసరాజ్యములలో భారతీయులు చిరకాలవాసులై యుండి సంపాదించిన హక్కుభుక్తములు కూడ వారికి లేకుండ తొలగింపబడుచున్నవి. ఆయా వలసరాజ్యముల లోని భారతీయులు అచటచేరి కృషిచేయుటవల్లనే ఆయా వలస రాజ్యములు నేడు సుభిక్షములై యుచ్చదశలోనికి వచ్చినవి. ఆవలస రాజ్యములందు పుట్టిపెరిగిన భారతీయులుకూడ అచటి పౌరులుగా పరిగణింపబడజాలరట. వారితో ఇక నక్కడ పనిలేదు. కనుక వారిని తిరిగి భారతదేశమునకు పొమ్మనుచున్నారు. బ్రిటిషుసామ్రాజ్యములో చేరిన ఏప్రాంతమునందును భారతీయులు వర్ధిల్లుట కవకాశములు లేవు. కాని, భారతదేశములోనికి విదేశీయులువచ్చి ఆస్తివసతులను సంపాదించి హక్కుసౌకర్యములను కలిగి సుఖముగా జీవింపవచ్చును. ఇటీవల జాంజిబారులోని భారతీయులకు అచట స్థావరము లేకుండ క్రొత్తశాసనములను వర్తింపజేసి అచటి భారతీయులను ఇరుకునబెట్టి నొక్కివేయుచున్నారు. జాంజిబారులోని సుల్తానుతోడను, అచటి మహమ్మదీయులతోడను భారతీయులు అన్యోన్యముగా వ్యవహరించి వృద్ధిలోనికి వచ్చుచుండిరి. కొన్ని క్రొత్తచట్టములు అవసరపడి అమలునకు తేబడినవి. ఈశాసనములవల్ల అచటిభారతీయులు అచట భూమిని సంపాదించుట కవకాశము తొలగింపబడెను. ఈ చట్టము క్రొత్తగా అరాబియానుండి అచటికి వచ్చెడి అరబ్బులకు వర్తించదు కాని అచట చిరకాలపు కాపులైయున్న భారతీయులకు వర్తించును. అయితే స్వదేశమైన భారతదేశములోనే భారతీయులకు పౌరస్వత్వపు ప్రధానస్వామ్యము లేకుండిన సందర్భములో, నేటి మన రాజ్యాంగ సంస్కరణవిధానములోకూడ యీ స్వామ్యములు ప్రసాదింపబడుటలేదను సందర్భములో ఇక ఖండాంతర భారతీయులకు అట్టిహక్కులు లేవనుట వింతకాదు. స్వదేశములోని భారతీయుల దుస్థితి తొలగినకొలదియును ఖండాంతర భారతీయుల దుస్థితికూడ క్రమేణ తొలగగలదనిమాత్రము దూరదేశీయులయిన మన భారతీయులకు అభయహస్తము నొసగగలము. తన శక్తికొలది ఖండాంతర భారతీయుల దుస్థితిని విచారించి వారిదుస్థితిని వారింపగల మార్గముల నాలోచించి వారికి చేదోడువాదోడుగా పనిచేయుచున్న దీనబంధు సి. యఫ్. ఆండ్రూసుగారికి మనకృతజ్ఞతాపూర్వక వందనము లాచరింపవలసి యున్నది.

## ద్వంద్వ వైఖరి

౧౯౩౧-వ సంవత్సరములో వైస్రాయి యగు ఇర్విన్‌ప్రభువు రౌండుటేబిలు సభాసమావేశావశ్యకతను వెల్లడించినప్పుడు ప్రభుత్వ ధోరణిని విశదపరచెను. ఆప్రభుత్వధోరణియందు రెండు ముఖ్యలక్షణములు కలవు వానినే విల్లింగుడన్‌ప్రభువు పలుమారు నొక్కి వక్కాణించెను. ఒకవైపున రాజ్యాంగవిధాన పురోభివృద్ధికై ప్రభుత్వము వారు పాటుపడెదరట. మరొకవైపున విప్లవోద్యమమును దేశములో తలయెత్తకుండ అణచివేయుదురట. మొదటివిషయమును సాధించుటకై రౌండుటేబిలుసభ జరుపబడెను. కొన్ని నిర్ణయములు చేయబడెను. భారతీయులతో సంప్రతింపు జరిగెను. ఆనిర్ణయమునుగూర్చి జాయింటు పార్లమెంటరీకమిటీ ఆలోచించుచున్నది. ఈనిర్ణయముల సంపుటీకరణమే శ్వేతపత్రము.

ఇక రెండవవిషయమును సాధించుటకై గవర్నమెంటువారు సత్యాగ్రహోద్యమమును నిర్దాక్షిణ్యముగా అణచివేయవలెనని పూనుకొనిరి. మొదటివిషయములో గవర్నమెంటువారి శ్రద్ధాసక్తు లెట్లున్నను రెండవవిషయములో వారి కార్యదీక్ష ప్రజలకు ప్రత్యక్షమైనది. వేలకొలది ప్రజలనేక హింసలపాలయిరి. దారుణమైన శాసనములు జారీచేయబడెను. విప్లవోద్యమమునే కాక సక్రమాందోళనమునుగూడ గవర్నమెంటువారు అణచివేయసాగిరి. ఇక, రాజ్యాంగ సంస్కరణప్రయత్నముల విషయములో వీరిమాటలు నమ్మి మోసపోయెడివారికి ఏవో కొన్ని పేరాసలుమాత్రము కలుగజేయబడెను. మొత్తముమీద మూడు రౌండుటేబిలుసభలు జరిగినవి. కొన్ని కమిటీలు, సబుకమిటీలు అంతులేకుండ సమాలోచనలు చేసినవి. ఆ సంప్రతింపులు చాలవని జాయింటుపార్లమెంటరీకమిటీ ఒకటి ఏర్పడి ఇంకను కాలక్షేపము చేయుచున్నది. రమారమి ఏడు సంల నుండి యును ఈ రాజ్యాంగ సంస్కరణముల ప్రణాళికనుగూర్చి వాక్యార్థములు జరుపుచునేయున్నవి. ఇంతటి దీర్ఘాలోచనవల్ల మనమితవాదుల కోరికలైనను ఈడేరుకో ఈడేరవో మున్ముందింకను చూడవలసియే యున్నది.

## శ్వేతపత్రము

ఈ శ్వేతపత్ర విధానము కేవలము ఆశాభంగకరమనియు, అసంతృప్తికరమనియు తజ్ఞులగు పెద్దలందరును నిరసించియేయున్నారు. సంపూర్ణస్వాతంత్ర్యమే భారతీయుల పరమావధియనియు, సైనికవ్యవహారములందును, ఆర్థికవ్యవహారములందును, విదేశములతో కూడిన రాజ్యాంగవిషయములందును, స్వదేశపరిపాలనావ్యవహారములందును భారతీయులకే సర్వాధికార ముండుట సంపూర్ణ స్వాతంత్ర్యమనియు వాదించెడి కాంగ్రెసుయొక్క కోరికలు ఈశ్వేతపత్రము వల్ల సఫలము కాజాలవు. పైజెప్పిన కోరికల నన్నింటిని త్రోసిపుచ్చుటకే శ్వేతపత్రము పనికివచ్చును. అట్టి కోరికలను కాలక్రమేణ

సఫలీకృత మొనర్చుటకుగూడ శ్వేతపత్రము సాధనభూతము కాదు. ఈశ్వేతపత్రములోని వరప్రసాదములనుగూడ తెగలాగుటకై ఇంగ్లాండులోని ప్రముఖులు ప్రయత్నించుచున్నారు. ఇంగ్లాండులోని కార్మికపక్షనాయకు లగు ఆర్థరు హెండర్సనుగారికికూడ ఈ శ్వేతపత్రప్రణాళిక వ్యర్థముగా కన్పించినది. భారతీయులకు స్వయం నిర్ణయాధికారము ఈషణ్మాత్రమైనను, లీలగానైనను ఈ శ్వేతపత్రములో నొసంగబడినట్లు ఆయనకు కన్పించలేదు. అట్టి శ్వేతపత్రము నిపుడు స్తనశల్యపరీక్ష చేయుట అనావశ్యక మని నాకు తోచుచున్నది. కాని అపారధనవ్యయప్రయాస ఫలితముగా ఈ శ్వేతపత్రము తయారుచేయబడియుండుటవల్లను, దానినే జాయింటు పార్లమెంటరీకమిటీవా రిప్పుడు పరిశీలించుచుండుటవల్లను, ఆశ్వేతపత్రప్రణాళినే మనకు గవర్నమెంటువారు చూపించి మన రాజకీయాభ్యుదయమునకు తోడ్పడుచున్నామని వాదించుచుండుటవల్లను ఒక్కమాటమాత్రము చెప్పెదను. కాంగ్రెసువారు కోరెడి సంపూర్ణ స్వాతంత్ర్యముమాట ఎట్లున్నను మితవాదులు కోరెడి అధినివేశప్రతిపత్తికూడ ఈ శ్వేతపత్రమువల్ల లభింపజాలదు. మీదుమిక్కిలి యిప్పుడు అమలులోనున్న మాంటుఫర్డు సంస్కారములకన్న అథోగతిలోనికిది మనల నీడ్చుకొనిపోవును.

శ్వేతపత్రములోని నూతనరాజ్యాంగాధికారములను నాలుగు ప్రధానాంశములుగా దృష్టియందుంచుకొని పరిశీలించెదను: (౧) క్రొత్తగా ఏర్పడనున్న శాసనసభలు భారతజాతి ప్రతినిధివర్గము లగునా? (౨) ప్రజాప్రతినిధులకు మంత్రులకు ఒప్పగింపబడు ప్రజాయత్తాధికారములు ఢిల్లీలోని కేంద్రశాసనసభయందుగాని, రాష్ట్రీయ శాసనసభలయందుగాని ఎంతవరకు నిజమైన అధికారములు? (3) ఖజానావ్యవహారవిషయములలో మనకు ఒప్పజెప్పబడు అధికారము లెయ్యవి? నూతనరాజ్యాంగవిధానము లభించుటవల్ల భారతదేశము భరింపవలసిన క్రొత్తవ్యయభారము లెయ్యవి? (౪) పురోభివృద్ధికిని భవిష్యదభ్యుదయమునకును అవకాశబీజము లేమైన యీప్రణాళికలో కలవా?

## ౧. ఫెడరేషనువల్ల ఏర్పడు శాసనసభలయందు సభ్యవర్గపద్ధతి

ఇప్పుడు అసెంబ్లీసభలో నామినేషనుచేయబడిన సభ్యవర్గము కొంత కలదు. ఆ సభ్యవర్గములో అధికారవర్గమువారును, అనధికారవర్గమువారును కూడ కలరు. ఈనామినేషనుసభ్యులందరు క్రొత్తఫెడరేషనులో ఉండరు. కాని వారిస్థానే స్వదేశసంస్థానముల తాలూకు నామినేటెడు ప్రతినిధులు ఉందురు. ఫెడరేషనులో చేరుట కంగీకరించిన స్వదేశసంస్థానముల తరఫు ప్రతినిధులే నామినేషను చేయబడుదురు. ప్రస్తుతమందున్న అధికారానధికార నామినేటెడు సభ్యులు ప్రజాక్షేమమునకు అనుకూలురు కాకపోయినను వారికి బ్రిటిషుయిండియాకు సంబంధించిన వ్యవహారపరిజ్ఞానము చాలవరకు కలదు. సంస్థానాధీశప్రతినిధులకన్న వారికి బ్రిటిషుఇండియాలోని ప్రజల పరిస్థితులు బాగుగా తెలియును. ప్రస్తుతమందున్న ప్రభుత్వనియోజిత (నామినేషను) సభ్యులకు ప్రజాభిమానమునకన్న ప్రభుత్వాభిమానమే హెచ్చుగా నుండినను ప్రభుత్వక్షేమము నైనను బాధ్యతగా ఆలోచించి కనిపెట్టగలరు. కాని, యీ సంస్థానాధీశ ప్రతినిధివర్గమునకు స్వదేశసంస్థానముల పరిస్థితులే తెలియగలవు కాని బ్రిటిషుయిండియాలోని వ్యవహారపరిస్థితు లేమైన తెలియగలవా? స్వదేశసంస్థానములందు గల నిరంకుశ పరిపాలనాధోరణికి అలవాటుపడి అసంప్రదాయములనే నేర్చియున్న సంస్థానప్రతినిధులు ప్రస్తుతమందున్న ప్రభుత్వనియోజకసభ్యవర్గమునకు బదులుగా అసెంబ్లీసభలో కూర్చుండినయెడల, మనకు బ్రిటిషు ఇండియాలో ఇదివరకెన్నడును అనుభవము లేని క్రొత్తనిరంకుశత్వము పరిపాలన వ్యవహారములందు అనుభవైకవేద్య మగును. ప్రజాభిప్రాయమును గౌరవించెడి పూర్వవాసన లన్నియు వారిద్వారా అడుగంటును. ఈ క్రొత్తనామినేషను సభ్యవర్గముయొక్క తత్త్వ మెట్టిదైనప్పటికిని ప్రస్తుతపు నామినేషను సభ్యవర్గమునకన్న క్రొత్తనామినేషను సభ్యవర్గము అధికసంఖ్యాకముగా నుండగలదు. ప్రస్తుతపు అసెంబ్లీసభలో ౧౪౫ మంది మొత్తము సభ్యులు కలరు. వీరిలో ౪౦ మందిమాత్రమే నామినేటెడు సభ్యులు. అనగా నూటికి ౨౭½ వంతున వీరిపుడు సభలో వెలసియున్నారు. రాగల అసెంబ్లీ సభలో ౩౭౫ మంది సభ్యులుందురు. వీరిలో ౧౨౫ మందికి తక్కువ లేకుండ స్వదేశసంస్థానముల తాలూకు నామినేటెడుసభ్యు లుందురు. అనగా నూటికి 33-౧/3 చొప్పున వెలసియుందురు. ప్రస్తుతమందుకన్న నూటికి ౬ గురు చొప్పున అధికముగనుందురు.

ప్రభుత్వ నియోజితులగు ఈ నామినేషను సభ్యులమాట యటుండనిచ్చి ప్రజానియోజితులగు సభ్యుల సంగతి ఆలోచింతము. మహమ్మదీయులు మున్నగువారు తమ ప్రతినిధులను ప్రత్యేకముగా ఎన్నుకొనుచుందురు. ఈప్రత్యేక నియోజకవర్గ పద్ధతి ఇప్పటివలెనుండుటయే గాక మరింత ఎక్కువమందిని ఆయా ప్రత్యేకనియోజకవర్గము లెన్నుకొనుట కవకాశ మొసగబడినది. ప్రభుత్వాభిమానము గలిగి వ్యవహరించగలవారి సభ్యవర్గము హెచ్చునట్లుగా ఈ ప్రత్యేక నియోజకవర్గముల ప్రాతినిధ్యప్రమాణము హెచ్చింపబడినది. ప్రస్తుతము అమలునందున్న పద్ధతి ప్రకారము ౧౦౪ గురు ప్రజానియోజిత సభ్యులలో ౪౧ మంది అనగా నూటికి ౩౯ వంతున ప్రత్యేక నియోజకవర్గ ప్రతినిధులు ఇప్పుడు ఉన్నారు. కాని రాబోవు అసెంబ్లీ సభలోని ౨౫౦ మంది ప్రజానియోజిత సభ్యులలో నూటికి ౪౩ వంతు మంది అనగా ౧౦౭ మంది ప్రత్యేక నియోజకవర్గములచే ఎన్నుకోబడినవారై యుందురు. కనుక నీవిధముగా శ్వేతపత్రప్రణాళిక ప్రకారము అమలులోనికి రాగల ఫెడరలు అసెంబ్లీ సభ

ప్రస్తుతపు అసెంబ్లీసభకన్న హీనమైనదై దేశపురోభివృద్ధి కింతకన్న తక్కువ ప్రయోజనకారియై మరింత నిరంకుశాధికారసంకలితమై వర్తింపగలదు. ఇక దీని కనుబంధితమై యుండు రెండవశాసనసభా వ్యవహారముల విమర్శింప బనిలేదు. ప్రజాప్రతినిధులతో కూడిన మొదటి శాసనసభయే యింతమాత్రమై యుండగా రెండవది యగు శిష్టసభ యింతకన్నను నిరంకుశముగా నుండగలదు. ఈ రెండు శాసన సభల సంయుక్త సమావేశము జరుగవచ్చునని కూడ శ్వేతపత్రములో కలదు. అట్టి సంయుక్తసమావేశమునం దుండగల ౬౩౬ సభ్యులలో ౨౩౫ మంది నామినేటెడు సభ్యులుగా నుందురు. అనగా నూటికి ౩౭ వంతున ఉండగలరు. బ్రిటిషుఇండియాకు సంబంధించిన పరిపాలనవ్యవహారలోపము నేదైన పురస్కరించుకొని ఎ మంత్రులయెడలనైనను విశ్వాసరాహిత్యతీర్మాన మొకటి ఆ సంయుక్త సమావేశములో ప్రతిపాదింపబడే యెడల సంస్థానముల నామినేటెడు సభ్యులు మంత్రివర్గాభిమానులై తీర్మానమును ధిక్కరించేయెడల అట్టి తీర్మానము నెగ్గుటకు మొత్తపు సభ్యవర్గములో మూడింట రెండు వంతులమంది అనుకూలురై వోట్లనిచ్చుట కేవలము అసంభవము.

రాష్ట్రీయశాసనసభలయందు నామినేషను సభ్యవర్గ మనునది పూర్తిగా ఎత్తివేయబడినది. కాని, బెంగాలు రాష్ట్రమునందును, బీహారు ఒరిస్సారాష్ట్రములందును, సంయుక్త పరగణాలయందును రెండేసి శాసనసభలు అంటగట్టబడినవి. ఇప్పుడు ఇంగ్లాండులో ప్రముఖులందరును తెలియబరచే అభిప్రాయధోరణినిబట్టి చూడగా తదితర రాష్ట్రములందుకూడ రెండేసిశాసనసభలు ఏర్పడవచ్చును. ఈపద్ధతిని జాయింటుపార్లమెంటరీకమిటీ కూడ అంగీకరించి సిఫార్సు చేయవచ్చును. ఢిల్లీలో రెండుశాసనసభలు అవసరమని ఏదోవిధముగా సమర్థించినప్పటికిని, రాష్ట్రీయప్రభుత్వములకు రెండేసి శాసనసభలుండుట అనావశ్యకమనక తప్పదు. రెండేసి శాసనసభలను ఏర్పాటుచేసి అనవసరమైన ధనవ్యయముతో వాటిని నిర్వహించుట కేవలము కూడనిపని. ఇప్పుడున్న రాష్ట్రీయశాసనసభలలో తీవ్రధోరణిగల ఏ రాష్ట్రీయశాసనసభనుబట్టిచూచినను ప్రస్తుత రాష్ట్రీయశాసనసభానుభవజ్ఞానముకూడ రెండుశాసనసభ లుండవలెనని సమర్థింపజాలదు.

## ౨. ప్రజాయత్తము లనబడు అధికారములు

దేశసంరక్షణార్థమైనను సైనికవ్యవహారములందును, విదేశములతో గల రాజ్యాంగ వ్యవహారవిషయములందును, మతవిషయములందునుగల అధికారము ప్రజాప్రతినిధులగు మంత్రులకు వశపరచక గవర్నరు జనరలునకే అట్టి వ్యవహారాధికారముల నన్నింటిని వశపరచిన యెడల, అట్టిరాజ్యాంగవిధానము స్వపరిపాలనమనికాని, బాధ్యతాయుతపరిపాలనమనికాని, అధినివేశప్రతిపత్తియనికాని యనిపించుకొనజాలదు. ఇక సంపూర్ణస్వాతంత్ర్యము అది కానే కాదు. పైజెప్పిన అధికారములమాట యటుండనిండు. ఇప్పుడు ప్రజాయత్త మొనర్చెదమని చెప్పెడి వ్యవహారశాఖలగూర్చి యోచింతము. ఈ ప్రజాయత్త వ్యవహారాధికారములవిషయము లేవైన, గవర్నరుజనరలుగారి వశమై యుండెడి ప్రభుత్వాయత్తవ్యవహారశాఖల కేమాత్రము అడ్డుకలిగినట్లు కన్పించినను సదరుప్రజాయత్తశాఖావ్యవహారములవిషయములో గవర్నరుజనరలుగారు జోక్యము కలుగజేసికొని, మంత్రుల నిర్ణయమును త్రోసివేయుటకు అధికారము కలిగియుందురు. గవర్నరు జనరలుగారికి వశమైయున్న ప్రభుత్వాయత్త వ్యవహారములకే కాక, వారి కొసగబడిన కొన్ని ప్రత్యేక బాధ్యతలకును, వారి కొసంగబడిన యదోచిత నిర్ణయాధికారములకును గూడ ప్రజాయత్త వ్యవహారవిషయములు అడ్డుతగులగూడదు. ఈఅధికార పరిమితులన్నియును అర్థబాహుళ్యముగల పదజాలముతో నిర్దేశింపబడియున్నవి. అందువల్ల గవర్నరు జనరలుగారు తమ యిష్టానుసారము యథేచ్ఛగా ఆటంకపరుపజాలని శాసనముగాని, అనుశాసింపజాలని చట్టముగాని ఉండజాలదు. గవర్నరుజనరలుగారికి ఒసగబడిన ప్రత్యేక బాధ్యతాధికారము లనబడునవి నిర్ధారణచేయుటకు వీలులేకుండ సర్వవ్యాప్తములై విస్తరించియున్నవి. ఈవిషయములో గవర్నరు జనరలునకు ఎంతటి సర్వాధికార మొసగబడినదో గవర్నరుకు కూడ అంతటి సర్వాధికార మొసగబడియున్నది.

కనుక గవర్నరుకుగాని, గవర్నరు జనరలుకు గాని అనిష్టుడై వ్యవహరించుమంత్రి ఎవరైనను ఎట్టి నిరుపద్రవకరమైన చిన్నివ్యవహారమును కొనసాగింప బూనుకొన్నను గవర్నరుగాని, గవర్నరు జనరలుగాని అడ్డమువచ్చి ఆవ్యవహారమువల్ల తనకు గల ౭ ప్రత్యేక బాధ్యతాధికారములలో దేనికైన నొకదానికి భంగము కలుగుచున్నదని వెంటనే తిరస్కరింపవచ్చును. రాష్ట్రీయస్వాతంత్ర్యమురాష్ట్రీయ స్వాతంత్ర్యము అని ఆడంబరముగా ప్రకటించుచున్న రాష్ట్రీయ స్వాతంత్ర్యాధికార మంతయును గవర్నరునకే గాని, మంత్రులకును ప్రజలకునుకాదు. ప్రజాయత్తశాఖలనుగూర్చిన అధికారమునుమంత్రులు చలాయింప యత్నించినను గూడ ఆవ్యవహారములు తనప్రత్యేక బాధ్యతాధికారములకు భంగకరములను మిషతో గవర్నరుగారు సర్వస్వతంత్రులై మంత్రులమాట త్రోసివేయవచ్చును.

గవర్నరు జనరలుగారి ప్రత్యేకబాధ్యత లనునవి ఏడు నిర్ణయింపబడినవి : (౧) భారతదేశమంతటనుగాని ఏ ప్రాంతమునందైనగాని ప్రజాశాంతికి భంగము వాటిల్లకుండ నివారించుట. (౨) పెడరేషను ప్రభుత్వముయొక్క ఆర్థికబాధ్యతను, పరపతిని కాపాడుట. (౩) అల్పసంఖ్యాకసంఘముల హక్కులను కాపాడుట. (౪) నూతన రాజ్యాంగవిధానచట్టమునందు పేర్కొనబడినట్టియు, న్యాయసమ్మతముగా నుండదగినట్టియు హక్కులను పబ్లికు సర్వీసులందుండు ఉన్నతోద్యోగీయుల కాపాడుట. (౫) వర్తకవ్యాపారరంగములో పక్షపాతము లేకుండ కాపాడుట. (౬) సంస్థానాధీశులు హక్కులను కాపాడుట. (౭) గవర్నరు జనరలుగారి అధికారమునకు లోబడి

యున్న ఏవ్యవహారశాఖకు సంబంధించిన ఏవ్యవహార విషయమున కైనను భంగముగాకుండ గాపాడుట. ఆయాసందర్భములలో తన ప్రత్యేక బాధ్యతకు దేనికైనను భంగము కలుగుచున్నదా, లేదా యని నిర్ణయించెడి అధికారముకూడ గవర్నరుజనరలుకే కలదు. ఇటువంటి అధికార బాధ్యతలే సందర్భానుసారమైన మార్పులతో గవర్నరుకు కూడ కలవు.

మొట్టమొదటి బాధ్యతను గూర్చి ఆలోచింతము. న్యాయపరిపాలన ప్రజాశాంతిసంరక్షణ (లా - ఆర్డరు) శాఖలు రాష్ట్రీయ ప్రభుత్వములందు మంత్రులవశ మొనర్పబడునని ఒకవైపున చెప్పుచు, మరొకవైపున ఆ ప్రజాశాంతిన్యాయపరిపాలనాధికార విషయము గవర్నరుగారి చేతిలోను, గవర్నరు-జనరలుగారి చేతిలోను రెండు తాళముల పెట్టెలో భద్రపరచబడిన రీతిగా ఆ రెండు అధికారములను ఒప్పజెప్పబడెను. ప్రజాశాంతిసంరక్షణ యను అధికారము ఈ దేశములో గవర్నమెంటువారిచే ఏవిధముగా అన్వయింపబడి అమలు పరచబడుచున్నదో అందరికిని తెలిసినవిషయమే. కాబట్టి ప్రజాశాంతిసంరక్షణాధికారము, న్యాయపరిపాలనాధికారము అనునవి (లా - ఆర్డరు) ప్రజాయత్తాధికారములుగా చేయబడి మంత్రులవశ మొనర్పబడినవనుట కేవలము బూటకము. గవర్నరుగారి కొసగబడిన ప్రత్యేకబాధ్యతాధికారము సర్వస్వామ్యసంకలితమై యుండగా మంత్రులకిచ్చిన యధికారము సున్నకు సున్న, హళ్లికిహళ్లి యగును.

ఇక రెండవ ప్రత్యేకబాధ్యతనుగూర్చి యోజింతము. మంత్రిగారు ఆదాయవ్యయముల అంచనా లెక్కలను తయారుచేసినప్పుడుగాని, ఏదైన ఋణము చేయవలయునని కోరినప్పుడుగాని గవర్నరుజనరలు వెంటనే అడ్డుతగిలి అట్టిఖర్చులను మంజూరుచేయుటవల్లగాని, ఋణములను చేయుటవల్లగాని భారతదేశపు ఆర్థికస్థితి చెడుననిగాని, పరపతిచెడుననిగాని వాదించి మంత్రిగారి కోరికలను త్రోసివేయవచ్చును. భారతదేశపు పరపతిని గవర్నమెంటువారు కాపాడుట యనగా వారియర్థమేమిటో, వారియుద్దేశ మేమిటో ఇదివరలో మనకు గల అనుభవజ్ఞానమునుబట్టి విదితము కాగలదు. భారతదేశపు ఆర్థికసుస్థిరత్వము భారతదేశపు పరపతి యనుమాటలకును, భారతదేశమును పీడించి బ్రిటిషువారు పొందే స్వలాభము, బ్రిటిషువారిక్షేమము అనుమాటలకును వ్యవహారములో అర్థభేదము లేదు. కాబట్టి భారతదేశపు పరపతి కాపాడుట అనుమిషతో బ్రిటిషులాభములే కాపాడబడుచుండుటవల్ల ఆమాటలకు మామూలు నిఘంటు నిరూపితార్థములను చెప్పి భారతీయులను మోసపుచ్చుటకు వీలులేదు. మనదేశపు ద్రవ్యపుచలామణీ వ్యవహారములన్నియు నీ బ్రిటిషులాభాపేక్షతోనే నిర్వహింపబడుచున్నవి. ఇది మనము చాలనష్టపడి అనుభవరీత్యా నేర్చుకొన్న విషయము. గవర్నమెంటువారు ఒక్కకలముపోటుతో పైకి నిరుపద్రవముగా కన్పించెడి ఒక్కచిన్న ఉత్తరువును జారీచేసి, కోట్లకొలది ద్రవ్యమును ఒక్కమారుగా భారతదేశమునుండి బ్రిటిషువారికి అందజేయుచున్నారు. భారతీయులకు తెలియకుండగనే ద్రవ్యమును ఈరీతిగా మటుమాయము చేయుచున్నారు.

ఇక మూడవబాధ్యతాధికారమును పరిశీలింతము. అనేకసందర్భావస్థలలో గవర్నమెంటువారి కిది తరణోపాయముగా నుండును. అల్పసంఖ్యాక సంఘముల హక్కులను కాపాడుటకు గవర్నరుజనరలుగారు పూనుకొన్నారని మనమహమ్మదీయసోదరులు ఉవ్విళ్లూరుచుండవచ్చును. కాని ఒక మతసంఘమునకును, మరొక మతసంఘమునకును పోరాటము పొసగించి మిత్రభేదమును కల్పించుట కిది అమోఘమైనఅస్త్రము. కాని నిజముగా ముఖ్యావసర మేదైనవచ్చినప్పుడు వ్యవహారములో మహమ్మదీయులవంటి అల్పసంఖ్యాక సంఘముల క్షేమమును గవర్నమెంటువారు యోజింపనే యోజింపరు. వేలకొలదిమైళ్లు దాటివచ్చి మనదేశములో ముసాఫరులవలె మకాముచేసి ఐశ్వర్యవంతులై వార్ధక్యమురాగానే స్వదేశములకు మరలి వెళ్లు యూరోపియనుల స్వామ్యసౌకర్యములను కాపాడుటకొరకే గవర్నరు-జనరలు ఈ బాధ్యతాధికారమును నిజముగా ప్రయోగించును.

ఇక నాల్గవబాధ్యతాధికారము చూడవలసియున్నది. రాష్ట్రీయస్వాతంత్ర్య మేదైన మనకు హస్తగతమై మిగిలియుండునెడల నీ నాల్గవబాధ్యతాధికార ప్రయోగమువల్ల అది అంతరించుచున్నది. పెద్దపెద్ద జీతములను తీసికొనుచున్న ఉన్నతోద్యోగులగు సివిలు సర్వీసు అధికారులకు పింఛనులను గారంటీగా యిచ్చుటకు అభయహస్తముల నొసగుచు వారికి కావలసిన సెలవుదినములను ఇచ్చుట కంగీకరించుచు వారిపైన అధికారము చలాయించుటకుమాత్రము మంత్రుల కిక స్వాతంత్ర్యావకాశము లుండవు. కనుక అట్టి సివిలు సర్వీసు ఉద్యోగులు (కలెక్టరులు మున్నగువారు) తమకు పైఅధికారు లనదగిన మంత్రుల మాటలను లక్ష్యముచేయజాలరు. మంత్రులు నిర్ణయించిన వ్యవహారపద్ధతిని కొనసాగకుండ సదరు ఉద్యోగస్థులు వ్యవహారములను స్తంభింపజేయగలరు. పరిపాలన చక్రమును సరిగా నిర్వహింపజాలని మంత్రులు అసమర్థులనియు, వారికి వ్యవహారాధికారములను ఒప్పజెప్పుటయే గొప్పపొరపాటనియు వాదింపబడును.

వర్తకవ్యాపారవిషయములలో పక్షపాతములేకుండ కాపాడవలెననుమిషతో బ్రిటిషువర్తకులకు నష్టము రాకుండ చేయబడును. బ్రిటిషువర్తకులతో భారతీయవర్తకులకు పోటీవచ్చినప్పుడు బ్రిటిషువర్తకులకే పక్షపాతము చూపబడి భారతీయులకు నష్టముచేయుట ఇదివరకు జరుగుచున్న విషయమే. ఇకముందుగూడ అట్లే జరుగును. గవర్నమెంటుతో జోక్యముగల వ్యాపారస్థుల కందరికిని ఇది అనుభవైకవేద్యమైన విషయమై యుండగలదు. అనేక సందర్భములలో వ్యాపారస్థులగు భారతీయులకు గవర్నమెంటువారివల్ల చిక్కులు కలుగుచుండును. కాని, బ్రిటిషువర్తకులకు కలుగవు. బొగ్గుగనులకు

వెళ్లి చూడుడు: భారతీయుని స్వాధీనమైయున్న బొగ్గగనుల వద్దకు వాగనులు వచ్చుటకు రైలుపట్టాలు వేయించుకొనవలెనంటే దుష్కరము. అతనికి వాగనులు సులభముగా సప్లయికావు. భారతీయునకంటె బ్రిటిషువర్తకునకు నిత్యకృత్యములో పక్షపాత మెక్కువ చూపబడును. మంచి బొగ్గపొరలుగల గనులన్నియు బ్రిటిషుకంపెనీలకు ఏవిధముగా లభ్యమై యున్నవో, రెండోరకం మూడోరకం బొగ్గగలగనులతోనే భారతీయు లేరీతిగా తృప్తిపడి వ్యాపారము చేయుచున్నారో, ఆ గనులైనను ఎంత శ్రమపడగా భారతీయులకు లభించినవో ఆవిషయము లిచట నేను వివరించుటలేదు. బొగ్గగనులుగల భూములు చాలవరకు భారతీయులవే అను మాటకూడ నేను మరచియుండలేదు. ఈవ్యాపారము లేరీతిగా నిర్వహింపబడుచున్నవో ముఖ్యముగా బొగ్గగనుల ఆసామీ కోర్టువారి అదీనములో నున్నమైనరై యుండినప్పుడు మనకు తెలియును. రైల్వేచార్జీలు వీలుకొలది మార్పుచేయుచుండుట యొక దివ్యమైనసులభోపాయము. నేను నా రాష్ట్రములో అఖిలభారత చర్కాసంఘ వ్యవహారములను చూచుచుండినకాలములో విరి గాప్రత్తిపండెడిసారన్ జిల్లాలోనున్న సేవాన్ పట్టణమునుండి దర్భంగాజిల్లాలో ఖద్దరు విరివిగా తయారుచేయబడు మధుబాణియను పట్టణమునకు ప్రత్తి ఎగుమతిచేయబడుచుండెను. ఈరెండు జిల్లాలుకూడ టిర్హాటు డివిజనులో చేరినవే; ఒక కమీషనరుయొక్క పరిపాలనలోనున్నవే. కాని, సేవాన్ పట్టణమునుండి మధుబాణిపట్టణమునకు ప్రత్తిఎగుమతి చేయుటకు అయ్యెడి రైల్వే ఛార్జితో బొంబాయినుండి జపానుకు ప్రత్తిని ఎగుమతిచేసి, జపానులో తయారైన గుడ్డలను తిరిగి బొంబాయికి చేర్చవచ్చును. కాని, ఈరైల్వేచార్జీలు ఇప్పుడేమైన మార్పునొందెనేమో నాకు తెలియదు. అదేరీతిగా దక్షిణాఫ్రికానుండి ఇండియాలోని నూలు నేతమిల్లులకు బొగ్గు రవాణాచేయుట కెంత రవాణాచార్జీ అగునో, అంత రవాణా చార్జి బీహారులోని బొగ్గగనులనుండి బొగ్గును ఆనూలునేతమిల్లులకు చేర్చుటకు అగుచున్నది. స్థాలీపులాకముగా నీకొలది యుదాహరణముల నొసగితిని. గవర్నమెంటువారి వ్యవహారధోరణినంతను పరిశీలించినయెడల భారతీయుల క్షేమలాభముల కెంతమాత్రమును గాక, విదేశీవర్తకుల లాభముకొరకే గవర్నమెంటువారు తమ కార్యకలాపమునంతను నడిపించుచున్నారని ఋజువుచేయుట కనేకోదాహరణములను చూపవచ్చును. ఒకవేళ ప్రజాహితాభిలాషియైన మంత్రియెవరైనను న్యాయబుద్ధితో ప్రవర్తింపజూచెయెడల అతడు బ్రిటిషువర్తకులకు ప్రతికూలముగ పక్షపాతబుద్ధితో ప్రవర్తించుచున్నాడని గవర్నరుగారో, గవర్నరుజనరలుగారో వాదించి తమ ప్రత్యేక బాధ్యతాధికారమును అమలుపరచి తమ యిష్టానుసారము జరుగవలసిన అన్యాయమును స్థిరశాసనముగా నిర్ణయించెదరు.

స్వదేశసంస్థానముల హక్కుసంరక్షణగూర్చి యొకింత పరికింతము స్వదేశసంస్థానములలోని ప్రజలు ప్రజాస్వామ్యాధికారములకును, అట్టి రాజ్యాంగవిధానములకొరకును చేసెడి ఆందోళనమును ఏవిధముగ తలయెత్తకుండ నొక్కివేయుటకు వీలుకలదో ఈవరకే మన కనేకసందర్భములయందు ఉదాహరణములు కన్పించియున్నవి. స్వదేశీ సంస్థానములలోని ప్రజలయందు ప్రజాస్వామ్యాధికార వాంఛలనెడి బీజములు మొలకలెత్తకుండ చేయుటకే గవర్నరుగారును, గవర్నరు జనరలుగారును తమకుగల యీప్రత్యేక బాధ్యతాధికారమును వినియోగించెదరు.

ఈప్రత్యేక బాధ్యతలుగాక గవర్నరు జనరలుకును, గవర్నరుకును యథోచిత నిర్ణయాధికారములు కొన్నిగలవు. ఇవి చాల దారుణమైనవి. ప్రస్తుత రాజ్యాంగ విధానమునందు శాసనసభవారామోదించిన చట్టమునుగాని, తీర్మానమునుగాని నిరాకరించుటకును, సభవారు నిరాకరించిన చట్టమునుగాని, తీర్మానమును గాని అమలుపరచుటకును గవర్నరులకు స్వతంత్రాధికారము గలదు. కాని శ్వేతపత్ర ప్రణాళికప్రకారము గవర్నరు శాసనసభయొక్క చర్యలను నిరోధించి నిగ్రహింపవచ్చును. ఏదేని యొక శాసనమును గూర్చి సభలో చర్చింపరాదని గవర్నరు ఉత్తరువు చేయవచ్చును. లేదా ఒక చిత్తుచట్టమునుగూర్చిన చర్చ తాను నిర్ణయించిన పద్ధతి ప్రకారము నిర్ణయించిన రీతిగ జరుగవలెనని ఉత్తరువుచేయవచ్చును ఏదేని యొకశాసనమును తాను నిర్ణయించిన తేదిలోపుగ సభవారిచే అనుశాసింపబడవలసినదిగ ఉత్తరువుచేయవచ్చును. ఏవైన కొన్ని చట్టములను శాసనసభవారు శాసింపకూడదని ఉత్తరువు చేయవచ్చును. తన ఉత్తరువులను శాసనసభవారు ఉల్లంఘించినయెడల వెంటనే గవర్నరుజనరలుగాని, గవర్నరుగాని స్వతంత్రాధికారముతో తానుకోరిన శాసనముల నమలుపరచవచ్చును. అట్టిశాసనము శాసనసభవారిచే అమలుజరుపబడినట్లుగానే భావింపబడును అట్టిశాసనము ఆర్డినెన్సు (జరూరుశాసనము)లవలె అపనింద పొందజాలదు ఆర్డినెన్సులకు ఆరునెలల ఆయుర్దాయముమాత్రమే కలదు. అంతకుమించి అది అమలులో నుండజాలదు. కాని యీనూతనరాజ్యాంగవిధానములో గవర్నరుగాని, గవర్నరుజనరలుగాని స్వతంత్రాధికారముతో అమలుపరచినశాసనము కాలనియమములేక చిరస్థాయిగ నుండగలదు. ఇట్టి వ్యవహారపద్ధతులతో నిండియున్న నూతన రాజ్యాంగవిధానమువల్ల భారతదేశము ప్రత్యక్షనిరంకుశాధికారమునకు లోనై యుండగలదు. ఈవిపరీతపరిస్థితులనేచర్చిల్ గారు కడు సొగసుగా నొకసందర్భములో నిట్లు వివరించియుండిరి:

"వైస్రాయి సర్వాధికారసంపన్నుడై హిట్లరువలెను, ముసోలినీవలెను అధికారము చలాయించగలడు. ఒక్క కలముపోటుతో పరిపాలనచక్రమునంతను తారుమారు చేయగలడు. తానుకోరిన శాసనమును అమలుపరచగలడు. సైనికచండశాసనమును సైతము అమలుపరచవచ్చును. కాని అది న్యాయశాసన మనిపించుకొనుటకు తగదు. ఈవిషయము లన్నింటిలో అతడే యుక్తాయుక్తనిర్ణయకర్త. అట్టి



౮ ఖాదీప్రదర్శన ప్రారంభోత్సవమున నుపన్యసించుచున్న శ్రీమతి సరోజినీదేవి



౯. కార్యనిర్ణయసభయం దుపన్యసించుచున్న మహాత్ముడు



౧౧. జాతీయపతాకారోహణము



౧౦. అధ్యక్షపీఠమునుండి యుపన్యసించుచున్న రాజేంద్రబాబు



౧౨. మహాత్ముడు నూలువడుకుచుండుట; అబ్దుల్ గఫ్ఫారుఖాను పరిశీలించుచుండుట



౧౩. విషయనిర్ణయసభయం దుపన్యసించుచున్న ప్రకాశంపంతులు

యున్నతాధికారి కేవలము నిరంకుశాధికారి. అతని చేతిక్రింద బలవంతమైన సైన్యముకూడ నుండును."

ఇట్టి సర్వస్వతంత్రాధికారము గవర్నరు జనరలునకే గాక రాష్ట్రాధిపతులైన గవర్నరులకుగూడ నొసగబడినది. గవర్నర్ల కిట్టి యధికారము నిచ్చుట కిదియే మొదటిపర్యాయము. దేశముమొత్తమున కంతకును వర్తించెడి విషయములలో గవర్నరుజనరలున కెట్టియధికారము గలదో అట్టి యధికారమునే తమ రాష్ట్రములకు సంబంధించినంతవరకును గవర్నరుల కొసగబడినది. గవర్నరులుకూడ ఆర్డినెన్సులను జారీచేయవచ్చును. గవర్నరులుకూడ స్వతంత్రముగా శాసనములనమలుపరచవచ్చును.

ఇదిగాక యిప్పుడు అసెంబ్లీ సభకు గల వ్యవహారావకాశములు కొన్ని నామమాత్రముగ నున్నను అవికూడ ఈ శ్వేతపత్రప్రణాళికయందు తొలగింపబడినవి. రైల్వేపరిపాలనవ్యవహారములను గూర్చి ప్రజలకష్టనిష్ఠురములను వెలిబుచ్చుటకు రైల్వేల సాలుసరి అంచనాలెక్కలను అసెంబ్లీసభలో చర్చించునపుడు సభ్యులకు కొంత అవకాశము కలదు. ఆ అవకాశ మిపుడు తొలగింపబడనున్నది. స్టాట్యూటరీ రైల్వేబోర్డు ఒకటి క్రొత్తగా ఏర్పరుపబడును. సదరు రైల్వేబోర్డుయొక్క వ్యవహారములనుగూర్చి అసెంబ్లీసభలో విమర్శించుటకు తగినంత యవకాశ మికముందుండదు. ఇది స్వల్పవిషయముకాదు రైల్వేలకొరకై మనదేశములో ౮౦౦ కోట్ల రూపాయిల పెట్టుబడిధనము వినియోగింపబడియున్నది. కొన్నిరైల్వేలు ఈవరకే ప్రభుత్వాధీనములై యున్నవి. మిగిలినవి కొన్ని రైల్వేకంపెనీలకు వశమైయున్నవి. కాని అవికూడ కొలదికాలములోనే ప్రభుత్వాధీనము కావలసియున్నవి.

## ఖజానా

ఖజానా వ్యవహారములసంగతి ఆలోచించినయెడల మనకొసగబడు నూతనాధికారములు కేవలము ఎండమావులవంటివని మరింత బాగుగా విశదముకాగలదు. ఢిల్లీ ప్రభుత్వముయొక్క ఆదాయములో నుండి నూటికి ౮౦ వంతులద్రవ్యము సైనికవ్యయమునకును, ప్రభుత్వ ఋణముల వడ్డీవగైరాలకును, గవర్నమెంటువారు పూచీపడిన పించన్లు, జీతములు, అలవెన్సులు చెల్లించుటకును సరిపోవును. కాని ఈ ఖర్చు మొత్తముల విషయములో అసెంబ్లీ సభ్యుల యిష్టానిష్టములతో గవర్నమెంటువారికి నిమిత్తములేదు. సభ్యులవోట్లతో పనిలేదు. ఇక గవర్నమెంటు రెవిన్యూలో మిగిలియున్న మిగతా నూటికి ౨౦ వంతు మొత్తముమాత్రమే మంత్రుల వశమైన వ్యవహారశాఖలకు వినియోగపడును. కాని ఈద్రవ్యములో మంత్రులు నిర్ణయించెడి ఈ ఖర్చు మొత్తముల విషయములో కూడ అసెంబ్లీసభకుపైనుండు రెండవ శాసనసభయందు (శిష్టసభయందు) ఆఖర్చు నిర్ణయములు ఆమోదింపబడవలెను. రెండుశాసనసభలసంయుక్తసమావేశములోనే ఆఖర్చుపద్దులు మంజూరు చేయబడవలెనని నిర్ణయించి అట్టి సంయుక్తసమావేశములోనే చిట్టచివరకు అవి మంజూరు చేయబడగలవు. ఒకవేళ ఏవ్యవహారశాఖకైనను మంత్రిగారు మంజూరు చేయదలంచిన మొత్తము, గవర్నరు జనరలుగారు తనకుగల ప్రత్యేకబాధ్యతలలో దేనినైన సరిగా నిర్వహించుటకు చాలదని భావించేయెడల, గవర్నరు జనరలు స్వతంత్రించి మొత్తమును హెచ్చింపవచ్చును. ఆరీతిగా గవర్నరు జనరలు హెచ్చించిన మొత్తమును కాదుకూడదని ఆక్షేపించుటకు ఆ విషయములో అసెంబ్లీసభకు వోటింగు అధికారములేదు. కనుక ప్రజాద్రవ్యవినియోగవిషయములో మంత్రులకు అధికారస్వాతంత్ర్యములు కేంద్రప్రభుత్వమునందు ప్రత్యక్షవ్యవహారములో శూన్యమని గ్రహింపవలెను.

ఈ నూతనరాజ్యాంగసంస్కరణముల క్రొత్తశాసనసభలు అమలులోనికి వచ్చేయెడల ప్రజల నెత్తిమీదకు వచ్చే క్రొత్తవ్యయభారమునుగూర్చి కూడ ఆలోచింపవలెను. ప్రమాణవాక్యములుగా అంగీకరింపదగిన ఉత్తమవ్యవహారవేత్తల అంచనా లెక్కలనుబట్టి, రాష్ట్రీయ స్వాతంత్ర్యవిధానము అమలులోనికి వచ్చేయెడల సాలీనా అందుకొరకై ౬½ కోట్లు మొదలు ౮ కోట్లవరకును ఖర్చు తగులుబడియగుననియు, ఢిల్లీ ప్రభుత్వమునందు ప్రజాప్రతినిధులగు మంత్రులకు బాధ్యతాయుతాధికారముల నొసగుటకు సాలీనా ౩ కోట్ల ఖర్చు తగులుబడి యగుననియు తెలియుచున్నది. ప్రపంచములోని దేశములలో కెల్ల దుర్భరదారిద్ర్యము ననుభవించుచున్న యీభారతదేశమునందు ప్రభుత్వనిర్వహణ వ్యయమును జనసంఖ్యాప్రమాణమును బట్టి భాగించి చూచినయెడల ఆ వ్యయము మొత్తము భారతీయుని సగటు సుమారుఆదాయమునకు పెక్కురెట్లుగా మించి మితిమీరియున్నది. ఇప్పటికే దుర్భరమైన పన్నులభారముతో క్రుంగి కృశించు భారతీయులకు మరొక నూతనవ్యయభారమును కల్పించుట దేశారిష్టసూచకమని భయము జెందకతప్పదు. కేవలము అద్దములోని లిబ్బివలె, నీటమూటవలె ప్రసాదింపబడుచున్న యీబూటకపు సంస్కరణముల కొరకును, మరింత నిరంతరదాస్యమునందు భారతదేశమును బంధించియుంచుటకై యుద్దేశించి మనకున్న అధికారములను మరింత తొలగించి వెనుక కీడ్చుటకై యుద్దేశింపబడిన యీ నూతనరాజ్యాంగ సంస్కరణముల నమలుపరచుటకొరకును ఇంతటి విపరీత ధనవ్యయమును మనదేశము భరింపవచ్చునని ఎవరైన చెప్పగలరా?

## భవిష్యదభ్యుదయము గగనకుసుమము

ఈనూతన రాజ్యాంగవిధానము స్వయంస్వతంత్రముగా లోపములను సవరించుకొని క్రమవికాసమును పొందుటకు అవకాశము లేవియును కల్పింపబడలేదు. ఈవిధానము మార్పు చెందవలెనన్న మరల పార్లమెంటుసభవారి అనుగ్రహమువల్లనే అది ప్రాప్తించగలదు. కాని, భారతీయులే స్వయంనిర్ణయము చేసికొనవచ్చునని

యీషణ్మాత్ర మయినను అవకాశ మొసగబడలేదు. అనేక సందర్భ పరిస్థితులు ఒనగూడిన పిమ్మటనే అమలులోనికి రావలయు నని నిర్ణయింపబడిన ఫెడరేషనువిధానముకూడ ఇంగ్లండులోని పార్లమెంటుసభలు రెండును ఆమోదించిన పిమ్మటనే మనకు లభ్యము కాగలదట.

పోనీ, యీ ఫెడరేషను ఎటువంటిది? ఇటువంటి ఫెడరేషను పద్ధతి ప్రపంచములో నెక్కడను లేదు. ఈ ఫెడరేషనులో (సర్వ రాష్ట్రి సమాఖ్యలో) స్వదేశసంస్థానాధీశ ప్రతినిధులు ప్రభుత్వనియోజితులై సమాఖ్యసభ్యుల మొత్తపుసంఖ్యలో మూడవవంతు మందిగా నుండి గవర్నమెంటువారికి దాసోహమ్మని జోహారులు చేయుచు, సమాఖ్యలో మిగిలియున్న మూడింట రెండువంతులమందిగా నున్న ప్రజానియోజితసభ్యుల యభీష్టముల కెదురొడ్డుచు ప్రజాభిమతము లీడేరకుండ యత్నించుచుందురు. స్వదేశసంస్థానములలోని ప్రజాసంఖ్య యావద్భారత దేశజనసంఖ్యలో మూడవవంతు మాత్రమే. కాని యీమూడవవంతు జనాభాకు ప్రతినిధులుగావచ్చి సమాఖ్యలో సభ్యులుగా సుఖాసీనులై యుండు ఈ ప్రభుత్వనియోజకసభ్యుల ద్వారా మూడింట రెండువంతులుగా మిగిలియున్న భారతీయుల పురోభివృద్ధివాంఛ లన్నియు వ్యర్థ మొనర్పబడును. స్వదేశసంస్థానాధీశ ప్రతినిధులు బ్రిటిషుఇండియాలో చేరిన భారతీయులకు సంబంధించిన సకలవ్యవహారములందును ప్రజానియోజితసభ్యులతో సరిసమానముగా వోటునిచ్చుటకు హక్కుకలిగి నిర్ణయాధికారులై యుందురు. కాని స్వదేశసంస్థానములలోని పరిపాలనవిషయములను నిర్ణయించుటగాని, ఆసంస్థానములలోని ప్రజలకుండవలసిన ప్రాతిపదికసార్వజనిక హక్కుల విషయములోగాని ఏవిధమైన నిర్ణయములజేయుటకును బ్రిటిషుఇండియా ప్రతినిధులకు అధికారావకాశములు లేవు. కనుక స్వదేశసంస్థానప్రతినిధులకును, బ్రిటిషుఇండియాప్రతినిధులకును ఈ సమాఖ్యసభలో పరస్పర సామాన్యప్రతిపత్తిలేదు. కనుక నిరంకుశాధికారమును నిరాఘాటముగా చలాయించెడి సంస్థానాధీశుల ప్రతినిధివర్గము ఈసమాఖ్యలో మూడవవంతు సభ్యత్వస్థానముల నాక్రమించి కూర్చుండి మూడింట రెండువంతులుగా మిగిలియున్న తదితర భారతావనియందు గూడ వీలయినంతవరకు అట్టి నిరంకుశాధికారమునే ప్రతిష్ఠింపజేసి ప్రజాభీష్టములను, ప్రజాస్వామ్య సంకల్పములను అణగద్రొక్కుటకు యత్నించుచుండును కాని సంస్థానాధీశులుకూడ ఇప్పటికన్న ఇకముందు దిక్కుమొక్కులేని దీనావస్థపాలగుదురు.

బ్రిటిషుఇండియాలో పరిపాలనాధికారములకై పోరాడు ప్రజల సహవాససంపర్కదోషమునుండి స్వదేశసంస్థాన ప్రజలను కాపాడి సర్వస్వతంత్రులనుగా చేయుటకే సంస్థానాధీశులకు ఈ ఫెడరేషనులో సభ్యత్వమొసగబడినదని సంస్థానాధీశులు ఉవ్విళ్లూరుచున్నారు. కాని సంస్థానాధీశులు వైస్రాయికి దాసానుదాసు లగుటయే యీ ఫెడరేషనువిధాన పర్యవసానముగా పరిణమించును.

## సత్యాగ్రహోద్యమ నివర్తనము, శాసనసభా ప్రవేశ సన్నాహము

ఇంతవరకు గవర్నమెంటువారి ద్వంద్వవ్యవహారధోరణిని విమర్శించితిని. ఇక మన కాంగ్రెసు వ్యవహారధోరణిని, కార్యసరణిని గూర్చి ప్రస్తావించెదను. ౧౯౩౨-వ సం. రమునందు ఒడంబడికకు భంగము జరిగిన నాటనుండియు గవర్నమెంటు వ్యవహారధోరణి యెట్లున్నను ఆ ప్రసక్తి కలుగజేసికొనకుండ మనము వ్యవహరింప మొదలుపెట్టితిమి సంగతిసందర్భములన్నియు తదనుకూలముగానే పరిణమించెను. ప్రభుత్వమువారు తమధోరణిని మార్చుకొన్న కారణమున సత్యాగ్రహోద్యమము మొదట విరమింపబడియుండలేదు. సత్యాగ్రహ మనునది కేవలము నీతికి నిలువబడెడి ఆత్మబలముతో సంబంధించిన దగుటవల్లనే ధర్మసంరక్షణార్థమయి విరమింపబడెను.

౧౯౩౪ సం. మేనెలలో పాట్నాలో జరిగిన నిర్ణయమునకు హేతుభూతమైన సందర్భకారణములను నేనిచట విపులముగా వివరింపనక్కరలేదు. హిందూసంఘశరీరమును రెండు ముక్కలుగా చీల్చివేయగల ప్రత్యేక ప్రాతినిధ్య ప్రణాళికను బ్రిటిషు ప్రధానమంత్రి ప్రకటించియుండినప్పుడు హరిజనులను ఆత్మసంఘమునుండి హిందువులు వెలివేయుట తొలగింపబడవలెననియు, వారికి ప్రత్యేక ప్రాతినిధ్య ముండుటగాని, ఉండవలెనని కోరుటగాని తాను సహింపరాని విషయమనియు ప్రకటించి ప్రాయోపవేశ మొనర్పదలచి ఆనాటి విఖ్యాత దీర్ఘోపవాసమును మహాత్ము డుపక్రమించెను. మహాత్ము డప్పుడు విడుదలకాబడెను. పూనానగరమందు హిందూ ప్రముఖులును, హరిజనప్రతినిధులును సమావేశమై కొన్ని నిర్ణయముల జేసిరి మహాత్ము డటుపిమ్మట నాసేతుహిమాచలము చేసిన హరిజన యాత్రసందర్భమున తానువినిన విషయములను, కనిన సందర్భములను బట్టి సత్యాగ్రహోద్యమమును విరమింపవలయుననియు, తానొక్కడే సత్యాగ్రహము నొనర్చుటకు ప్రత్యేకింపబడవలెననియు అఖిలభారత కాంగ్రెసుకమిటీవారికి సూచించియుండెను. వ్యవహారములన్నియు నేవిధముగా క్రమేణ మారుచుండినవో గాంధీజీ అప్పుడప్పుడు ప్రకటించుచు వచ్చిన అభిప్రాయసందేశములను విలోకించినచో నిది విదితముకాగలదు.

జనసముదాయముమీద సమష్టిగా సత్యాగ్రహమును సాగించుట ఇక నిలిపివేయవలెనని మహాత్ముడు చాటించుటకుగల సందర్భకారణములు స్థూలదృష్టితో వ్యవహారములను దిఙ్మాత్రముగా తిలకించువారికైనను తెలియగలవు రెండు ముఖ్యమైన దౌర్బల్యలక్షణములు మనలను మొదటినుండియు వెంటాడుచున్నవి.

ప్రథమలోపముగా పేర్కొనదగిన దొకటి కలదు. కాంగ్రెసు సేవకులు ధైర్యసాహసములతో, విశుద్ధత్యాగ బుద్ధితో శాసనధిక్కారమును చేయజాలక చాటుమాటు పద్ధతులకును, కుతంత్రములకును

దిగిరి; యుక్తివాదములతో ఎదురొడ్డసాగిరి కాని సత్యాగ్రహమను నది కేవలము ధర్మబుద్ధితో, ఆత్మబలముతో, ఆత్మానందముతో చేయవలసిన మహాత్యాగము కష్టముల కోడిగట్టి సంతోషముతో అనుభవింపగలసిన ఆత్మకైంకర్యము తన ఎదిరిపక్షమును సదుపదేశముల వల్ల సన్మార్గమునకు త్రిప్పవలెను కాని యుక్తులకు పైయుక్తులను పన్ని లొంగదీయుటవల్ల సత్యాగ్రహియే అధఃపతితు డగును

ఇక రెండవలోప మింకొకటి కలదు గవర్నమెంటువారొక ఆయువుపట్టును కనిపెట్టి గెల్పొంది మనపై ధ్వజమెత్తియుండిరి జనులు జెయిళ్లకైన వెళ్లి స్వేచ్ఛా స్వాతంత్ర్యములను గోల్పోవుటకు సిద్ధమైరి ప్రాణములు పోవుచున్నను వెరువరైరి కాని తమకు విధింపబడిన విపరీతమగు జరిమానాలను వసూలుపరచుటకై తమ ఆస్తిని సర్కారువారు వశపరచుకొనునప్పుడు జనులు దుర్బలహృదయులై వెనుకంజ వేయసాగిరి అన్నిటికిని తెగించినవారు అందులకు తెగింపజాలకపోయిరి కనుక సంపూర్ణత్యాగబలముగలవారు మాత్రమే సత్యాగ్రహమునకు పూనుకొనదగునని చాటింపబడెను. రహస్యపు యుక్తులను, మాయోపాయములను సత్యాగ్రహు లవలంబించి తమ ఆస్తివసతులను కాపాడుకొనుటకు యత్నింపకుండ సమర్థులైనవారే సత్యాగ్రహము చేయవలెనని చాటింపబడెను పూనా ఒడంబడికకును, పాట్నా తీర్మానమునకును గల హేతువులు పైసందర్భముల వల్ల బోధపడగలవు

ఉద్యమ క్షేమముకొరకును, దేశ క్షేమముకొరకును సత్యాగ్రహము విరమింపబడవలసివచ్చెను ముఖ్యకారణము మన ఆత్మదౌర్బల్యమే కాని మనమందులకై చింతచెంద బనిలేదు వివిధ మతముల కాలవాలమై, భిన్నభాషా ప్రయుక్తమై అతివిశాలమైయున్న యీభారతవర్షము విదేశదాస్యమునుండి విమోచనమొనర్చుటకే సత్యాగ్రహోద్యమము సంకల్పింపబడినది ఆసేతుహిమాచలము, ఆబాలగోపాలమునందరును కాంగ్రెసు సందేశమును శిరసావహించి బద్ధకంకణులై యుద్యమమునకు తోడ్పడిరి ఇంతటి మహాత్యాగమునకు మనమంకరమును ఉప్పొంగవలసి యున్నది కాని మనకర్తవ్యము మహోన్నతమైనది; అతి దుష్కరమైనది కనుక మనలోపములను, మనదౌర్బల్యమును వర్కింగుకమిటీయొక్కయు, అఖిలభారత కాంగ్రెసుకమిటీయొక్కయు అవలక్షణములను గాంధిమహాత్ముని సందేశప్రకటనలను పలువురు తీవ్రముగా విమర్శించుటకు అనేకసందర్భకారణము లేర్పడినవి మహాత్ముని ప్రకటనలు కొన్ని ముఖ్యసారాంశములను చర్చకు తీసికొనివచ్చినవి కడచిన ఏప్రిల్ నెల ౭ వ తేదీన పాట్నానుండి మహాత్ముడు తన మొదటిసందేశమును పంపెను సత్యాగ్రహమును కాంగ్రెసునాయకులు విరమింపవలసిన దనియు, తానొక్కడే సత్యాగ్రహమును సాగించెదననియు, శాసనసభాప్రవేశమునందు విశ్వాసము గలవారు అందుల కవసరమైన కార్యక్రమము నుపక్రమింపవలసిన దనియు తన సదుపదేశము నొసంగెను అటుతరువాత మే నెలలో అఖిల భారత కాంగ్రెసుకమిటీవారు పాట్నానగరమందు ఈవిషయములను సమగ్రముగా చర్చించి మహాత్ముని ఉపదేశమును స్వీకరించిరి అసెంబ్లీసభకు అభ్యర్థులనుగా కాంగ్రెసు ప్రతినిధులను ప్రతిష్ఠించుటకై కాంగ్రెసు పార్లమెంటరీబోర్డు తాత్కాలికముగా నెలకొల్పబడెను శ్వేతపత్రవిషయములోను, ప్రభుత్వమువారి నిర్దాక్షిణ్య నిరంకుశత్వవిషయములోను కాంగ్రెసువాదులు అసెంబ్లీసభయం దవలంబింపవలసిన వ్యవహారధోరణి ఏకగ్రీవముగా నిర్ణయింపబడెను అన్నిపక్షములవారును అందులకంగీకరించి తలయూచిరి కాని మన దురదృష్టవశమున ప్రత్యేక ప్రాతినిధ్యప్రణాళిక విషయములో సర్వపక్షసమన్వయము చేకూరలేదు రెండవ రౌండుటేబిల్ సభముగిసినపిమ్మట నూతనరాజ్యాంగ శాసనసభలయందు ఏవిధముగా ఆయా మత సంఘములవారికి ప్రత్యేక ప్రాతినిధ్యప్రమాణముండవలెనను విషయమును భిన్నసంఘముల ప్రతినిధులు సమాలోచించి నిర్ణయింపవలసినదని ఆంగ్లప్రభుత్వమువారు కోరియుండిరి కాని ఆ రౌండుటేబిల్ సభకు విచ్చేసిన భారతీయ ప్రతినిధులు తమలో తాము సంప్రదించుకొని సమాంగీకారయోగ్యమైన ప్రాతినిధ్యపద్ధతిని నిర్ణయింపజాలరైరి మనలోమనకు ఒడంబడిక కుదురకపోవుటవల్ల బ్రిటిషు ప్రధానమంత్రిగారే స్వతంత్రించి ఒక ప్రాతినిధ్యప్రణాళికను తయారుచేసిరి కాని యిది సర్వవిధముల ప్రజాక్షేమమునకు ప్రతికూలమై జాతీయైకమత్యమునకు అనర్థదాయకమై యున్నది ఇదిగాక కొన్ని అల్పసంఖ్యాక సంఘములు, అందును ముఖ్యముగా మహమ్మదీయులు ఈ ప్రాతినిధ్య ప్రణాళిక తమసంఘమునకు శ్రేయోదాయకమని భావించుచు దానిని తిరస్కరించుట కియ్యకొనుటలేదు హిందువులును, సిక్కులును, మహమ్మదీయులలో కొలదిమంది ప్రముఖులును ఈ ప్రణాళిక తమకు పనికిరాదని నిరాకరించుచున్నారు కాని మహమ్మదీయులలో నధిక సంఖ్యాకులును, ఇతరముల చిన్నసంఘములవారును ఈ ప్రణాళిక లెస్సగానున్నదని ఆమోదించుచున్నారు ఈ ప్రణాళిక విషయములో భిన్నభావము భేదాభిప్రాయము ప్రబలియుండుటచే సర్వజన సమ్మతమైన మరొక ప్రణాళిక తయారుచేయబడు వరకును, కాంగ్రెసువర్కింగుకమిటీవారు అసెంబ్లీసభ్యులు కాగల కాంగ్రెసు ప్రతినిధుల కర్తవ్యమును ఈ విషయములో నిద మిత్థమని నిర్ణయింపజాలకున్నారు కావున యీ విషయమై వాగ్వాదములను, తగవులను ఈ తరుణములో ప్రేరేపించుట అనుచితమని వర్కింగు కమిటీవారు తలచి తటస్థముగా నుండిరి

## మహాత్ముని ప్రకటన

కడచిన కొలదివారములలో వ్యవహారములు వేవేగము మార్పు జెందినవి మహాత్ముడు కడచిన ౫౦ సంవత్సరముల కాంగ్రెసు చరిత్రను పర్యాలోకనముచేసి దూరాలోచనతో రెండు ముఖ్యమైన సందేశములను తన దేశీయులకు ప్రకటించెను ప్రజాహృదయములోని అవలక్షణ మెక్కడనున్నదో ఆయన గురిచూచి గుర్తించెను మన

భవిష్యదభివృద్ధిని కోరి మనలను హెచ్చరించి మందలించెను ఆయన చేసిన ప్రకటనలను తీవ్రముగా విమర్శించిన పెద్దలుకూడ యీ నూతన పరిస్థితు లేర్పడినందుకు సంతసించిరి. మహాత్ముని విషయవిమర్శనము సరికాదని సవాలు చేయజాలక పోయిరి అనుకొనినంతపని అయిన వన్నట్లుగా ఆనందించిరి కాబట్టి ౧౫ సంవత్సరములనుండియు మనము సాగించుచుండిన ఈయుద్యమముయొక్క నిజతత్వము నిప్పు డైన మనము సరిగా గ్రహించుట యుక్తము మహాత్ముడు చేసిన మొదటి ప్రకటన కేవలము దేశమున కొకసవాలువంటిది ఆసవా లునకు ప్రజల ప్రత్యుత్తరఫలితమే మహాత్ముని రెండవ ప్రకటన మొదటిప్రకటనయందు మహాత్ముడు సత్యమును, అహింసను, ఖద్దరును తనప్రాణముకంటెను ప్రియతరములుగా భావించెను. హృదయ పరి వర్తనము సదుపదేశములవల్ల కలుగవలెనుగాని దౌర్జన్యవిప్లవములవలన కాదని వివరించెను దేశములోని కొందరు ఈధర్మములను ఆమో దించియు అనుష్ఠింపజాలకున్నారు. మరికొందరు ఈధర్మములను విడనాడి మరొకమార్గమును త్రొక్కుటకు యత్నించుచున్నారు ఇట్టి సందర్భములో కాంగ్రెసు సభనుండి తాను విరమించుటయే కర్తవ్యమని మహాత్ముడు నిశ్చయించెను ఇదియే ఆయన మొదటి సందేశము తాను కాంగ్రెసునుండి విరమించుట అనివార్యకార్య మనియు, కాంగ్రెసులో తాను చేరియుండక పోయినను వెనుకటి కంటె ఇతోధిక దేశసేవను తాను చేయుచుండగలననియు, కాంగ్రెసు సభ భిన్నభిన్నమై విధ్వంసము కాకుండుటకై కాంగ్రెసు నియమ నిబంధనలయందు చేయవలసిన మార్పులు కొన్ని కలవనియు మహా త్ముడు తెలియజేసెను

సర్దార్ వల్లభాయిపటేలు, డాక్టరు అన్సారీ, గఫూరుఖాను సోదరులు మున్నగు నాయకులు గాంధీజీయొక్క నిర్ణయమును ఆమో దించియుండిరి ఆయన కాంగ్రెసునుండి విరమించుటయందు గల గుణదోషములను చర్చించుచు కాలహరణము చేయజాలను నాసహ చరులగు నితర కాంగ్రెసు ప్రముఖుల యభిప్రాయములతో నేను ఏకీ భవించుచున్నాను మహాత్ముడు కాంగ్రెసునుండి విరమించుననుట తోడనే నామనస్సు కొంత తబ్బిబ్బయినను, ఆయన ధర్మబుద్ధితో దయాసత్యసంకల్పుడై యీరీతిగా కృత నిశ్చయుడయ్యెనని గ్రహించి మన యుత్తమాదర్శసాధనమున కది ప్రోత్సాహజనకమని సంతసించు చున్నాను తన జీవితసారమైన పరమధర్మముల విషయములో మహా త్ముడు కాంగ్రెసు సభామోదమునకై వేచియుండజాలడు కాంగ్రెసు సభామోదమును ఆయన కోరుటలేదను నెపమున ఆయుత్కృష్ట ధర్మ ములతో మనకు పనిలేదని త్రోసివేయవలదు ఆయుత్తమధర్మములను మీ వ్యవహారవిధానములయందు అవలంబింపవలెననియే నేను కోరు చున్నాను. మహాత్మునంతటి ధర్మదీక్షాతత్పరుడను నేను కాజాలక పోయినను ఆయన బోధించెడి పరమధర్మములే నా జీవితాదర్శము లుగా, నామతసిద్ధాంతములుగా ఆమోదించి హర్షింపగలను

## కాంగ్రెసు సిద్ధాంతము

కాంగ్రెసు మూలసిద్ధాంతమును సవరణచేయవలెనను విషయ ములో ఒక్కటే ప్రశ్న యడిగెదను సత్యసమన్వితమైన దౌర్జన్య రహితమైన మార్గమునకంటె భిన్నమైన వేరొకమార్గము "శాంతమైన న్యాయసమ్మతమైన"పద్ధతి యనుమాటలలో ఇదివరకెన్నడైన స్ఫురించి నదా? శాంతమైన, న్యాయసమ్మతమైన మార్గముల ననుసరించి స్వరా జ్యమును సాధించుటయే కాంగ్రెసుయొక్క మూలసిద్ధాంతమని మనము నిర్వచించినప్పుడు లోకమునకు "దౌర్జన్య రహితమైన సత్య సమ్మతమైన' మార్గమనియే అన్వయించెను గాని వరొకరీతిగా అన్వ యించి యుండెనా? అట్టి యుత్కృష్ట ధర్మమార్గము ను మన మవలం బించియుండుటవల్లనే మన స్వాతంత్ర్యోద్యమమునకు ప్రతిష్ఠాగౌర వము లభించినది అట్టి యున్నతాదర్శసరణి నవలంబించుటవల్లనే మన యాత్మబల మింకను పరిపూర్ణవికాసమును పొందలేదను పరి తాపము మనకు నేడు కలుగుచున్నది ఆపరమ ధర్మావలంబనము మనయందు విశుద్ధముగా లేనందువల్లనే మనలోపములను చూచి విమర్శకు లాక్షేపింపగల్గుచున్నారు ఇట్టి యుత్తమధర్మమార్గావలంబ నము మనయందు లేనియెడల, లోకము మనయుద్యమప్రయత్నము లను శ్రద్ధాసక్తులతో పరికింపదు మన సత్యాగ్రహమువల్ల మన పరి పాలకులను మనము సంస్కరించియుండజాలక పోవచ్చును కాని, యీ యుత్తమ-అహింసాధర్మమును మనమనుసరింపక యుండిన యెడల ప్రభుత్వమువారి చేతులలో మన మనుభవించియుండిన దారుణహింసలకన్న ఇతోధికమైన అమానుషరాక్షసనరకబాధలకు పాల్పడియుందుము

నూలునే చందాగా నిచ్చువిషయమును గూర్చియు, ఖద్దరు విషయమును గూర్చియు కొలదిగా చెప్పవలసియున్నది మన జాతీయ పతాకమున కన్న నుత్కృష్టధర్మ చిహ్నము లోకమునం దెక్క డను లేదు ఇది నేను సగర్వముగా చెప్పుకొన్నందులకు క్షమింప వేడెదను ఆధునిక నవనాగరికయుగమునందు అరిష్ట చతుష్టయ ముగా నున్న సామ్రాజ్యవిస్తీర్ణకాంక్ష, రణోత్సాహము, ధనాఢ్యుల ప్రాబల్యము, యంత్రాగార విజృంభణము - ఈ నాలుగును తుద ముట్టవలెనని మన జాతీయపతాకము చాటుచున్నది అగ్రజాతుల కును ఐశ్వర్యవంతులకును పేదలతో, పామరులతో సన్నివేశసాహ చర్యముల సంధింపగల మహిమ రాటమునందును, ఖద్దరునందును మాత్రమే కలదు దౌర్జన్యరహితమైన కార్యసాధనలవల్లనే సకలవిధము లగు ప్రజాపీడనమును, దేశైశ్వర్య సంగ్రహణమును నిరోధింపవచ్చు నని మన జాతీయపతాకము చాటుచున్నది. రాజకీయరంగమును, నిత్యకృత్య జీవితమునుకూడ పునీత మొనర్పగల క్రొత్త యుగధర్మ మును మన జాతీయపతాకము చాటుచున్నది ఖద్దరు ధారణమును గూర్చిన నియమమును మనము తొలగించునెడల పల్లెలకును, పట్టణ ములకును కల్పింపబడిన పరస్పరబాంధవ్యము విడిపోగలదు

కరాచీకాంగ్రెసులో నిర్ణయింపబడిన కార్యక్రమమునంతను గూడ సత్యసమ్మతమైన సత్యాగ్రహము, దౌర్జన్యరాహిత్యము, ఖద్దరు వస్త్రాభిమానము-ఈ మూడింటివల్లనే మనము సాధింపగలమని సానమ్మకము కరాచీసభలో మనము ప్రతినపట్టియుండినవాని నైన సాధింపక మిన్నకున్న మనదేశీయులు కొందరు ఇంకను ఏమేమో కావలయునని కోరుచున్నారు కరాచీకాంగ్రెసులో నిర్దేశింపబడిన అభీష్టములను మరింత తెంపొందించుటకు నేను సంసిద్ధుడనే కాని దౌర్జన్య రాహిత్యసిద్ధాంతశుద్ధత్వమును తగ్గించుట కెంతమాత్రము అంగీకరింపను కడచిన ౧౫ సంవత్సరములలో మనము చూపిన త్యాగ ప్రభావమును, సల్పినకృషిని మనము వ్యర్థ మొనర్పరాదు మనయం దెట్టి లోపములున్నను చాలదూరము ముందంజవేసి దేశమును నడిపి యుంటిమి పేదజనులను భాగ్యవంతులు పీడించుచున్నారనియు సకల విధములగు ప్రజాపీడనమును, ఐశ్వర్యాపహరణమును తుదముట్టించుటయే ముఖ్యకర్తవ్యమనియు, పరమధర్మమనియు సాంఘికసమత్వ సిద్ధాంతవాదులు వాదించుచున్నారు ఈయూహలు ఉత్సాహజనకములై యున్నవి అరచేతిలో వైకుంఠము జూపించినట్లున్నవి భూతల స్వర్గమున కిది మార్గమని భ్రమింపజేయును కాని సత్యము అహింస-ఈరెండిటికన్న నుత్తమోత్తమమైన సంకల్పోద్దీపనకర భావములు వేరేమియు లేవు ప్రజాపీడనకారణములైన దుస్సంకల్పములను, దుస్స్వభావములను మనము రూపుమాపవలెను గాని ప్రజాపీడన మొనర్చు మనుష్యులను కాదు పాపమును సంహరింపవలెను గాని పాపులను సంహరించుటకు పూనుకొనరాదు ఇదియే అహింసాతత్త్వము దౌర్జన్య బలాత్కారమార్గముల ననుసరించునెడల ఆదౌర్జన్యమే ఇను మడించిన శక్తితో మన కెదురుతిరుగగలదు సామోపాయమున సద్బోధచేయుటవల్లనే లోకమును సుకరముగా సంస్కరింపవచ్చును ఈసుబోధయే ధర్మశాసనమని లోకమునకు మనము చాటవలెను

కాంగ్రెసు సభావ్యవహారవిధాన విషయములో నొక మార్పును మహాత్ముడు తన రెండవసందేశమునందు సూచించెను కాంగ్రెసుసభా ప్రతినిధివర్గసంఖ్య చాలవరకు తగ్గింపబడవలెననియు దేశమున కంతకును తగినంతమంది ప్రతినిధులు సమావేశము కావలెననియు మహాత్ముడు కోరెను కాంగ్రెసుమహాసభ సమర్థముగా విషయములను చర్చించు నిమిత్తమై ప్రతినిధులసంఖ్య ౨ వేలుండరాదనియు వేయి మాత్ర ముండవలెననియు కోరెను కాంగ్రెసు ప్రతినిధి ఏప్రాంతము నుండి సభకు వచ్చునో ఆప్రదేశమునకుమాత్రమే అతడు ప్రతినిధిగా నుండరాదనియు, ఆప్రాంతమునందుగల కాంగ్రెసుసభ్యమండలికి కూడ అతడు నిర్ణీతప్రతినిధిగా నుండవలెననియు మహాత్ముడుకోరెను ఏరాష్ట్రములోనైనను ఎక్కువమంది కాంగ్రెసుసభ్యులుగా చేర్చుకొనబడి యున్నయెడల ఆరాష్ట్రముతరఫున ఎక్కువమంది ప్రతినిధులు ఎన్నుకొబడుటకై సభ్యవర్గప్రమాణమునుబట్టి అర్హత ఏర్పడవలెను కాంగ్రెసుయొక్క ప్రభావము ప్రతినిధుల సంఖ్యాప్రమాణమునుబట్టి యుండదు సభ్యులయొక్క త్యాగశీలములనుబట్టి యుండును కాంగ్రెసుయొక్క పరమావధిని సాధించుటకు వారుచేసిన కృషినిబట్టి యుండును

మహాత్ముడు కాంగ్రెసునుండి విరమించినంతమాత్రమున ఆయన తన సేవాదీక్షనే విరమించెనని మీరు భ్రమపడవలదు కాంగ్రెసుతో ఆయనకు సభ్యత్వసంబంధము లేనంతమాత్రమున ఆయన సహాయసంపద కాంగ్రెసుసభ కిక లభింపదని దురభిప్రాయపడవలదు ఆయన యీరీతిగా విరమించుట మనల నుజ్జీవింపజేయుటకే కాని మనలను స్తంభింపజేయుటకు గాదు మహాత్ముని కార్యక్రమము నంతను సంపూర్ణవిశ్వాసముతో స్వీకరింపజాలని కాంగ్రెసుసభతో మహాత్ముడు ప్రసక్తిని వీడి స్వేచ్ఛగా, స్వతంత్రముగా తాను సంకల్పించిన దేశసేవను జేయుటవల్లనే మన కెక్కువ క్షేమంకరము ఆయన తత్త్వోపదేశములందు విశ్వాసములేని అధికసంఖ్యాక సభ్యవర్గమును తన యనుచరవర్గముగా నిడుకొని మహాత్ముడేమియు సాధింపజాలడు కనుక మహాత్ముని కాంగ్రెససభాసంబంధవిచ్ఛేదము నాకొక విషాదకరవిషయముగా కన్పించుటలేదు కాని మీరందరును ఆయనయందు భక్తితత్పరులై, విశ్వాసప్రపూరితులై యున్నయెడల, ఆయన కాంగ్రెసుసభా బహిర్గతుడైనను అంతర్గతుడైనను మన కాయనవలన మహోపకారమే జరుగగలదు

## సమాప్తి

మనము క్రొత్తకథాకలాపమునకు పూనుకొనవలసి యున్నది మనమిపుడు పూనుకొనవలసియున్న కార్యక్రమము ఉత్సాహావేశములకు ఆటవాలమైనది కాదు స్థిరసంకల్పముతో చెక్కుచెదరక ఉక్కుకువక్కలవలె పనిచేయవలసి యున్నాము ముందున్నపని అపారము మనపరిపాలకులు తమ హస్తగతమైయున్న అధికారములను విడనాడుట కియ్యకొనుటలేదు ఆవిషయములో వారు వెనుకటికన్న మరింతపట్టుదలతో నున్నారు మనలో మనకు మిత్రభేదములను కల్పించుటలో గల్పొందినారు స్వాతంత్ర్యోద్యమమును వారెన్నిరీతుల నణగద్రొక్కగలరో కడచిన నాలుగు సంవత్సరముల మధ్యకాలమందు ప్రభుత్వమువారు జారీచేసి, అమలు పరచిన చండశాసనములవల్ల విదితమైనది బెంగాలురాష్ట్రమునందు అమలుపరచబడిన దారుణశాసనముల మూలమున ఉచ్ఛ్వాస నిశ్వాసములకుగూడ స్వేచ్ఛ లేక యున్నది సరిహద్దు రాష్ట్రములలో ప్రజ లేరీతిగా జీవించుచున్నారో నిజపరిస్థితు లెరుగుటకైనను అవకాశము లేకయున్నది.

బెంగాలులో దురంతములైన హత్యలు జరిగిన మాట వాస్తవమేకాని ప్రజలనందరిని పంజరమునం దుంచినరీతిగా బంధించుటవల్ల రోషావేశములు రెట్టించునేగాని అవిశ్వాసోద్యమమును శమింపజేయుట కది మార్గము కాజాలదు సరిహద్దురాష్ట్రములందు అబ్దుల్ గఫూరు

ఖానుగారు నిష్కళంక దేశాభిమానియై ధీరోదారులైన పఠానులకు నాయకుడై వారిని నడిపించెను కాని అగఫూర్ ఖానుగారి కారాష్ట్రము అడుగుపెట్టరాని అన్యసీమయని ఆంక్ష విధించిరి దేశాభ్యుదయకర కార్యవిధాన మెంతేని కలదు శక్తిసామర్థ్యములు కల వారికి చేతినిండ పని కలదు శుద్ధ స్వదేశివస్త్రమగు ఖద్దరు వస్త్రోత్పత్తివిషయమై మహాత్ముడు తనతెంపవసందేశములో చెప్పియుండెను ఈసంపూర్ణ స్వదేశివస్త్రవ్యాప్తివల్లనే మనకు సంపూర్ణస్వాతంత్ర్యము సిద్ధింపగలదు తక్కువజాతివారనబడు కోట్లకొలదిజనుల కష్టసుఖము లయందు ఉచ్చజాతు లనబడువారు సన్నిహితసంబంధము గలవారై ఇరువురకును సాహచర్య సమ్మేళనము కలిగిననేతప్ప సంపూర్ణస్వాతంత్ర్యము ప్రజలకు చేకూరజాల దని మహాత్ము డుపదేశించియుండెను

శ్వేతపత్రవిషయములోను, ప్రభుత్వనిరంకుశత్వము విషయములోను కాంగ్రెసు ప్రతినిధులు అసెంబ్లీసభలో న్యాయనిర్ణయము చేసి తీర్పుచెప్పగలందులకై కాంగ్రెసు అభ్యర్థులను అసెంబ్లీసభకు పంపవలెనని అఖిలభారత కాంగ్రెసుకమిటీ తీర్మానించియుండెను కాంగ్రెసుసభయందు ప్రజలకు గల దృఢవిశ్వాసమును భక్తిగౌరవములను ఈ యెన్నికల సందర్భములో ప్రజలు తమవోట్లను కాంగ్రెసు అభ్యర్థుల కొసగి వెల్లడించెదరుగాక శాసనసభలలో వాదించుట వల్ల స్వరాజ్యము లభించునని మనము భ్రమపడరాదు స్వాతంత్ర్యమును సంపాదించుటకై మనము కొంత త్యాగముచేసి ఆత్మసమర్పణము చేయవలెను దేశ మింతవరకును చూపిన త్యాగమునకు మన ముప్పొంగవచ్చును కాని మన యభీష్టసంసిద్ధికి ఈత్యాగము చాలదు ఎడతెగనిఓర్పు, వెనుదియ్యని పట్టుదల అంతులేని త్యాగము ఉండిననేతప్ప మనము సంకల్పించిన మహోత్కృష్టకార్యమును సాధింపజాలము కాలప్రవాహమున, ప్రపంచ పరిస్థితులును మనకు అనుకూలములుగానే యున్నవి మీదుమిక్కిలి భగవంతుడే మనకు తోడైయున్నాడు అహింసాసత్యములనెడి సత్యాగ్రహ సాధనములతో మనము ఘోరమారణయంత్రసాధన సంకలితులైన అత్యధిక బలవంతులగు పరిపాలకులతో ఎదురొడ్డి నిలచుచున్నాము వెనుదిరుగుట కికవీలు లేదు మనపరమావధి వనకండ్ల యెదుట నున్నది అది సంపూర్ణస్వాతంత్ర్యమేకాని అంతకు తక్కువైనదికాదు

దౌర్జన్యరాహిత్యమువల్ల సాధింపబడెడి మన దేశస్వాతంత్ర్యము ఆత్మలాభాపేక్షతో కూడిన స్వార్థపరత్వము కాజాలదు ఒకదేశ మింకొకదేశమును పీడించుటగాని, ఒక తెగవారు మరొక తెగవారిని పీల్చి పిప్పి చేయుటగాని రూపుమాయవలెను ఇదియే సంపూర్ణమైన దేశస్వాతంత్ర్యము ఇదియే ప్రజాస్వాతంత్ర్యము పరస్పర క్షేమాభివృద్ధికై సమైత్రి సద్భావములతో భారతదేశ మితర దేశములతో కలిసిమెలసి చరింపవలెను ఆత్మలాభమునకై పరపీడనము కూడదు ఇదియే సంపూర్ణస్వాతంత్ర్యతత్వము దౌర్జన్యరాహిత్యసిద్ధాంతమే యీ సంపూర్ణస్వాతంత్ర్య సంసిద్ధికి తిరమంత్రము అహింసాధర్మమునందు చైతన్యశక్తికలదు సర్వేజనాస్సుఖినోభవం తనెడి సత్సంకల్పమే ఆచైతన్యలక్షణము ఈయహింసాతత్వము లోకము నాకర్షించుచున్నది సంశయాత్ముల యవిశ్వాసము తొలగినప్పుడే యహింసాతత్వము అచంచలమై హృదయక్షేత్రములో నాటుకొనగలదు పరరాజ్యములపై దాడి వెడలవలె నను సంకల్పము భారతీయుల కుండజాలదు కనుక స్వదేశ సంరక్షణార్థమయిన కొలదిపటాలముతో స్వపరిపాలనా చక్రమును భారతదేశము సాగింపగల్గును ప్రజల పరస్పర సద్భావమువల్లనే దేశమునందు శాంతిసౌఖ్యములు వెలయగలవు పరరాజ్యములపై కుతంత్రములకు గడగని భారతదేశము పరదేశముల కుతంత్రములకు గురిగాక నిర్భీతిగా సర్వలోకాదరణమును బడసి సంరక్షింపబడగలదు ఇట్టి సూక్ష్మదృష్టితో విలోకించినయెడల భారతీయుల సంపూర్ణస్వాతంత్ర్యమునకు బ్రిటిషువారు వెరువవలసిన పని లేదు

మన సాధనోపకరణము కూడ నిష్కళంకమైనది అదియే దౌర్జన్యరహితమైన, సచేతనమైన సార్వజనికసత్యాగ్రహవ్రతము మన మొకమారు పరాజితులము కావచ్చును ఇంకొకమారు కూడ పరాజితులము కావచ్చును కాని విజయ మొకనాటికైన చేకూరక మానదు ఎందరెందరో తమ ప్రాణములను, తమ సర్వస్వమును గోల్పోయిరి

ఈస్వాతంత్ర్యసమరమున ఆత్మత్యాగము చేసినవారు అనేకులు కలరు విషాదహృదయులమై మనము వెనుకంజ వేయజనదు ఋజుమార్గమును వీడి దెబ్బలకు వెరచి దానములకు దోసిలొగ్గుచు మన కెగ్గు ఘటించును మన సాధనసంపత్తి యపూర్వమైనదగుటజేసి లోకమంతయును మనపై కన్ను వేసియున్నది మన విజయమున కెదురు చూచుచున్నది మన యహింసాధర్మసిద్ధాంతమున ధైర్యమువీడక యనుసరించి మొక్కవోవని, చెక్కుచెదరని పట్టుదలతో గట్టియత్నము చేయవలెను సత్యాగ్రహమునకు మధ్యమార్గమున విఘాతము లెన్ని పొడసూపినను, సత్యమే తప్పక జయించును అట్టి ధర్మమార్గమున కపజయము లేదని ఆంగ్ల కవిపుంగవు డమోఘవాక్యముల ప్రశంసించెను

"సత్యమున కురికంబ మాస్థానమెపుడు
అక్రమంబున కబ్బు సింహాసనమ్ము
భావియుగధర్మ మిది యంచు బ్రజలకెల్ల
జాటు నురికంబ మొక దివ్యశాసనమ్ము

అంధకార మె యంతట నావరింప
తెరువుగానని చీకటిమలుగునందు
దివ్యమంగళపరమాత్మ లేజ మొకటి
తనదు సృష్టిని పోషించి మనుపగలదు"

# ప్రస్తుత యూరపుఖండ పరిస్థితులు: మానవస్వేచ్ఛ - దానికి నిరోధములు

చా వెం హనుమంతరావు

ప్రస్తుతకాలములో యూరపుఖండమందు మానవుని స్వేచ్ఛకు విరుద్ధములగు పరిస్థితులు చాలప్రబలముగ నున్నవి ప్రపంచము మొదలుపెట్టినప్పటినుండియు స్వేచ్ఛకై మానవుడు ప్రయత్నించుచున్నాడనియే చెప్పవచ్చును దానికొరకై అనేకయుద్ధములు జరిగినవి అనేకమంది తమప్రాణములు కోల్పోయిరి కడచిన ఐరోపామహాయుద్ధముకూడ దీనికొరకైయే జరిగినదని చెప్పుట అతిశయోక్తికాదు కాని ఆయుద్ధానంతరము ౧౯ సంవత్సరములలో అంతవరకు సంపాదింపబడిన హక్కులు రూపుమాసిపోవుపరిస్థితు లేతెంచినవని చెప్పవలసియున్నది యూరపుఖండమం దేప్రక్కచూచినను ప్రధానముగ కాన్పించునవి స్వేచ్ఛానిరోధము నిరంకుశపరిపాలనప్రాబల్యము నైయున్నవి మానవజాతి ముందడుగువైచుటకు ముఖ్యముగకావలసినది మానవుని శరీర మానసికస్వేచ్ఛ దానిని ప్రతిఘటించునది నిరంకుశపరిపాలకుల పరిపాలన యూరపులో పెద్దవియు బలవంతమగునవియు నగు రష్యా జర్మనీ ఇటలీ టర్కీ మొదలగుదేశములలో అట్టిపరిపాలకుల అధికారము ఏర్పాటుకాబడి ప్రజాపరిపాలనాసూత్రము త్రోసిరాజనబడినది యూరపుఖండమందలి వివిధదేశములలో యుద్ధానంతరము ప్రబలిన ఆర్థికపరిస్థితులు ఈనిరంకుశపరిపాలనపద్ధతులకు మూలకారణములును వాటిప్రాబల్యమునకు ప్రధానప్రోత్సాహములును నైయున్నవి ఒకసారి తమఅధికారము నేర్పాటుచేసుకొనినతరువాత నియంతలు ఆయధికారములను నిలువబెట్టుకొనుటకు చేయవలసినప్రయత్నముల నన్నింటిని చేయుచున్నారు దానికొరకై తమకు వ్యతిరేకాభిప్రాయులుగా నున్నవారిని పూర్తిగ తమదారినుండి తొలగించుటకు వారు వెనుదీయుటలేదు దీనిఫలితముగ వివిధదేశములలో ప్రజాపరిపాలనాసూత్రములు పూర్తిగ నాశనముచేయబడుటయో లేక ప్రజాపరిపాలనాపద్ధతులు పేరునకు మాత్రము నిలువబడియుండుటయో జరిగినది వాటియందు స్వేచ్ఛయనునది మరల ఎప్పుడైనను ఏర్పాటుచేయబడునో తెలిసికొనుట కష్టము

మానవస్వేచ్ఛకు వ్యతిరేకములగు విధానములలో ప్రధానస్థానము నిరంకుశపరిపాలకుల కీయబడవలెనని పైన వ్రాసినదానినిబట్టి స్పష్టమగుచున్నది కాని దానితోబాటు ఇతరకారణములుకూడ కొన్నికలవు వాటియందు ముఖ్యమైనది యూరపుఖండమందంతటను కూడ జరుగుచున్న యుద్ధప్రయత్నములు ప్రతిదేశమందును యుద్ధసన్నాహములు విరివిగా సాగుచున్నవి, యుద్ధమనిన ఉత్సాహము ప్రజలలో పురికొల్పబడుచున్నది యుద్ధము వెంటనేవచ్చుటకు తగు అవకాశములు లేకపోవచ్చును కాని ఆమానసిక ప్రవృత్తి ప్రబలముగానున్నసమయములలో ఏసమయమందైనను ఆయుద్ధము బయలుదేరుటకు కావలసినన్ని అవకాశము లున్నవి ఇటలీ జర్మనీ పోలండు మొదలగుదేశములలో బాలురకు విద్యాశిక్షణయందు ప్రధానస్థానము యుద్ధశిక్షణ కీయబడుచున్నది యువకుల మనస్సులందు తమదేశమునుగురించి గొప్ప ఆలోచనలు పురికొల్పుట యుద్ధమనిన ఉత్సాహము కల్గించుట ముఖ్యావసరమని ఆయాదేశముల నియంతలు ఏర్పాటుచేసిరి ఇటలీదేశమందు బాలురకుమాత్రము యుద్ధశిక్షణ అవసరముచేయబడగా పోలండునందు స్త్రీలకుకూడ ఆశిక్షణ అవసరమని శాసింపబడినది యువకులమనస్సు లిట్లు యుద్ధపుతలపులతో నింపబడినప్పుడు యుద్ధము పొసగుటకు తగు పునాదులు వేయబడినవని గ్రహింపవలసియున్నది నిరంకుశపరిపాలకుల

బలము నెక్కువచేయుటకు ఈయుద్ధసన్నాహము ఒక ముఖ్యమగుసాధనము

ఈసందర్భములో జ్ఞాపకముంచుకోవలసిన ముఖ్య విషయమేమన స్వేచ్ఛాసూత్రమును ప్రధానముగ పరిగణించుదేశములందుకూడ దానిని బలపరుచుటకు నిలువబెట్టుటకుకూడ పట్టుదల చాలతగ్గిపోవుట ఇంగ్లండు దేశమునందు మానవస్వేచ్ఛ ఇతరదేశములన్నిటికన్న ఎక్కువగ పరిపాలింపబడునను అభిప్రాయము కలదు అట్టిదేశమందుకూడ ఈసిద్ధాంతము పలుకష్టములకు పాల్పడుచున్నట్లు ఆదేశపువిషయములను గమనించువారందరికి స్పష్టమగును ఆదేశమందుకూడ నియంతృపరిపాలనపద్ధతులపై మక్కువ హెచ్చుచున్నది ప్రజాపరిపాలనాపద్ధతికి పునాది ప్రతిసామాన్యమానవునికిని పరిపాలనలో ఏదో కొంతపాలు కలదని చూపుటయేయని ఎల్ల రంగీకరింతురు కాని సామాన్యమానవునికి ప్రభుత్వములోకల జోక్యము రోజురోజునకు సంకుచితమగుచున్నదని స్పష్టము ప్రజాప్రతినిధిసంస్థలకు పని ఎక్కువగుటతో మంత్రులకు అనుదినపరిపాలనవిషయములందు జోక్యముకలుగజేసుకొనుటకు తీరిక తగ్గిపోవుటతో ప్రభుత్వశాఖలకు ప్రభుత్వాధికారులకు వారి ఇష్టమువచ్చినట్లు ప్రజలహక్కులను తగ్గించుటకు అవకాశములు కలుగుచున్నవి ఈవిధముగ తగ్గిపోవుటకు ముఖ్యకారణము ఆయాదేశములలో ప్రజాభిప్రాయము యొక్కబలము క్షీణించుటయే ప్రజాసమూహమునందు స్వేచ్ఛా స్వాతంత్ర్యములనిన ఒకవిధమగు ఉపేక్షయు ఎవరోఒకరిఅధికారమునకు లోబడియుండుటకు అంగీకారమును ప్రబలుచున్నవి ఏదేశమందు కాని ప్రజలు తమ స్వాతంత్ర్యమును నిలువబెట్టుకోవలెననిన దానికి అవసరములగు కష్టనష్టముల కోర్చుకొనుటకు సంసిద్ధులై యుండవలెను నిరంతరజాగరూకతయేస్వేచ్ఛకు మూలసాధనము అని ఒక రాజకీయశాస్త్రజ్ఞుడు వ్రాసియున్నాడు దానియొక్క నిజము ఈకాలములో ఎక్కువగ మనకుస్పష్టమగుచున్నది ప్రజాబాహుళ్యములో ఎప్పుడు ఈజాగరూకత తగ్గిపోయిన అప్పుడే వారి స్వేచ్ఛకు స్వాతంత్ర్యమునకు భంగము కలుగు పరిస్థితులేర్పడును యూరపుఖండవాస్తవ్యులీనిజమును యుద్ధానంతరము మరచిపోవుటచేతనే ఆఖండమందు వివిధదేశములలో నియంతలపరిపాలన ఏర్పాటగుటకు వీలైనది ప్రజలలో ఎప్పుడు తిరిగి స్వేచ్ఛాభిప్రాయములు బయలుదేరి ఎప్పుడు తమస్వేచ్ఛకై వారు కష్టములకు సంసిద్ధులైయుందురో అప్పుడే పూర్వపుపరిస్థితులు తిరిగి ఏర్పడుటకవకాశములు కల్గును

ఎటుచూచినను ఆవరించుకొనిన నిరంకుశపరిపాలనవృక్షముయొక్క పెరుగుదలను అరికట్టవలెననిన కొన్ని ప్రధానవిషయములు జ్ఞాపకముంచుకోవలసియున్నది ఏప్రభుత్వమైనను ప్రజల ఇష్టముపైన ఆధారపడియుండినప్పుడే జయప్రదముగ సాగుననునది ఒకటి నియంతలు కొంతకాలము తమబలము నుపయోగించి ప్రజాభిప్రాయములను తమ కనుకూలముగ నుండునట్లు మార్చవచ్చును కాని చిరకాల మట్లుచేయుటకు సహజపరిస్థితులు అనుకూలముగా నుండవు కాన నియంతలు సొంతముగ వారిబాగు నాలోచించియే ప్రజలకు ప్రభుత్వవిషయములలో కొంతజోక్యము నుంచట ముఖ్యావసరము అదియుకాక ఒకనియంత కాలములో ప్రజాభిప్రాయమునకు వ్యతిరేకముగ ఆతడు పరిపాలింపగలిగినప్పటికిని ఆతనితరువాత వచ్చువారు అట్లుచేయుటకు తగిన శక్తి కల్గియుందురని తలచుటకు వీలులేదు చరిత్రములు దీనికి వ్యతిరేకముగా నున్నవి కాన ఎప్పటికైనను ప్రజలు తమ స్వాతంత్ర్యమును తిరిగి పొందుటకు అవకాశములున్నవి కాని దానికై వారు నిరంతరము కృషిచేయుచు తగుశక్తిని సంపాదించుటకు ప్రయత్నించినగాని జయముపొందలేరు స్వేచ్ఛనుసంపాదించుటకు సంసిద్ధులైయున్న ప్రజాసమూహములను స్వేచ్ఛనరికట్టుటకు ప్రయత్నించు నియంతలునుకూడ ఈ సంగతులు మనస్సునందుంచుకొనవలసియున్నది



విషయనిర్ణయసభయందలి స్త్రీమండలి



స్వచ్ఛందసేవికల శిక్షణము

# ప్రజాప్రభుత్వమున కపాయము

(Danger to democracy)

వల్లూరి సూర్యనారాయణరావు

ప్రజలకు రాజకీయస్వాతంత్ర్యములను ఇచ్చుచున్న కొన్ని నవనాగరిక పాశ్చాత్యరాజ్యములలో ప్రజాస్వామికప్రభుత్వము గొప్ప అపాయస్థితిలోనికి వచ్చి వ్యక్తిస్వాతంత్ర్యమునకు మిక్కిలి భంగము కలిగించుచున్నది. ఇటలీలో ముస్సోలోనిగారును, జర్మనీలో హిట్లరుగారును, రషియాలో స్టాలిన్ గారును నిరంకుశప్రభువులుగ తమరాజ్యములను పాలించుచున్నారు. పైకి మాత్రము తమ్ములను ప్రజాసామాన్యమే యెన్నుకొనినట్లు కనుపరచెదరు. ప్రజలలో మెజారిటీవోటు వీరి పక్షబలమువలననే వీరికి వచ్చుచున్నది. ఈ దేశములలో పేరునకు మాత్రము శాసనసభ లేర్పాటైయున్నను, నిరంకుశాధికారము డిక్టేటర్లకు ఒసగునట్లు చేయబడెను. ఇటులనే స్పెయిన్, ఆస్ట్రియా మొదలగు ఇతర పాశ్చాత్యదేశములలోకూడ ఈనిరంకుశత్వము ప్రవేశపెట్టబడపోవుచున్నది. ఇకముందు, పార్లమెంట్లపరిపాలనముకంటె ఈడిక్టేటర్లపాలనమే దేశములకు ఎక్కువమే లొనగూర్చునని యు, ఏ దేశములోగాని వివిధకక్షులు, వివిధాభిప్రాయములు ఉన్నపుడు వీనినన్నిటిని ఒప్పించి, వీరిలో మెజారిటీచేత, శాసనసభలగుండ పరిపాలన సాగించుట దుర్లభమనియు, ఒకవేళ కొన్నికక్షులవారు ఏకమై ఒకమంత్రివర్గము నేర్పాటుచేసికొన్నను, వీరిలో వీరి కితరవిషయము లనేకములలో భేదాభిప్రాయములుండుటబట్టి వీ రేర్పరుచుకొన్న మంత్రివర్గమును విశ్వాసరహితతీర్మానముతో వెళ్లగొట్టబడుచుండుటయు సంభవించునని కొందరు రాజకీయశాస్త్రజ్ఞు లభిప్రాయపడుచున్నారు. దీనికి ముఖ్యదృష్టాంతము ఫ్రాన్సుదేశము ఒకసంవత్సరములోనే అనేకమంత్రివర్గములు వచ్చుచుపోవుచునుండును. ఒకమాదిరి రాజకీయసూత్రముమీద ఏకక్షియు నాధారపడకుండ కొన్నికక్షులు తాత్కాలికముగ ఒకముఖ్యవిషయములోమాత్రము కలియుచు తమమెజారిటీవోట్లచేత అప్పటిమంత్రివర్గమును త్రోసిపుచ్చి, ఆమరునాడే మరియొకవిషయములో జగడమాడి, నూతనకక్షులలో చేరి ఆమంత్రివర్గమును వెడలగొట్టుట సంభవించుచుండును. ఇంగ్లాండులోకూడ ఈ శతాబ్దములో మూడునాలుగుకక్షులు నూతనముగా నేర్పడి పార్లమెంటరీపాలనము మునుపటివలె రెండుకక్షులతో నెమ్మదిగ సాగించలేక, తాత్కాలికముగ కొన్నివిషయములలో కలసి మెజారిటీయేర్పరుచుకొని రాజ్యపాలనము చేయుచున్నది. కాని యీనూతనపక్షము ఏర్పరచినమంత్రివర్గములో ఇతరవిషయము లనేకములలో భేదములేర్పడి మనస్పర్ధలు కలిగినవి. ఇట్లుండుట వలన నెమ్మదిసమయములలోను, యుద్ధసమయములలోను కార్యనిర్వాహకశాఖ బలహీనమగుచు, ఒక నైతికసూత్రముమీద నేకక్షియు మంత్రివర్గమును చాలాకాల ముంచుకొనలేకపోవుచుండును.

కాబట్టి యూరపుఖండములో, పార్లమెంటరీగవర్నమెంట్లకు బదులు డిక్టేటరుగవర్నమెంట్లు ఏర్పడుచు యుద్ధములకు డీకొనుచున్నవి. వ్యక్తిస్వాతంత్ర్యమును, ఆలోచనశక్తులను భంగపరచి, పైకి ప్రజాప్రభుత్వము పార్లమెంటు లనునవి యున్నను సమస్తాధికారములను అవి యెన్నుకొను ఒకడిక్టేటరుచేతులలో పెట్టుచున్నవి. మనమహాత్మాగాంధిగారిని కాంగ్రెసువారు డిక్టేటరుగా ఇంతవరకు యేర్పరుచుకొన్నట్లే ప్రజాస్వామికప్రభుత్వము సరిగా నడచుటకు డిక్టేట రుండుటే మంచిదని కొందరు తలచుచున్నారు. ఈవిధానము బలవంతముగా రషియాలో ప్రవేశపెట్టబడినది. అక్కడ

ముద్రణస్వాతంత్ర్యముగాని, వాక్స్వాతంత్ర్యముగాని, సంఘసమావేశస్వాతంత్ర్యముగాని మృగ్యమనియే చెప్పనగును. కాని యీవిధానమే ప్రజలసౌఖ్యమునకును, సంరక్షణకును అవసరమని అచ్చటి డిక్టేటర్లందరు వాదించెదరు. ఇప్పుడు యూరపుఖండములోని ముఖ్యరాష్ట్రములలో, పరిపాలనము ప్రజాప్రతినిధులస్వాతంత్రాలోచనమీద జరుగుచుండుటలేదు. దేశసంరక్షణకనేసాకుతో వ్యక్తిస్వాతంత్ర్యమును పూర్ణముగ నాశనముచేయుచున్నారు. సంఘక్షేమమే ప్రధాన మనుసూత్రము ఆచరణలో పెట్టబడుచున్నది. కాని యీ సమిష్టిసంఘపరిపాలనవిధానములో అనేకభేదములున్నవి. రషియాలోని కమ్యూనిజమునకును, జర్మనీ, ఇటలీ, ఆస్ట్రియా, ఇంగ్లాండులలోని సోషలిజములకును మిక్కిలి వ్యత్యాసము కనిపించును. రషియాలో ధనవంతులు, బీదలు అనుభేదము లేకుండజేసి, పనివాండ్రు, సేద్యగాండ్రు, యుద్ధభటులు అనుతరగతులనుమాత్రమే నిలిపి, దేశములోనివాణిజ్యము, సేద్యము, యంత్రములు, చేతిపనులు మొదలగునవన్నియు పరిపాలకులచేతులలో నుంచుకొని, ప్రజలచేత సమష్టిమీద పనిపాటులు చేయించి ప్రతివానికి తిండి, బట్ట ఇతరసౌకర్యములు పుష్కలముగ కలుగచేయవలెనని అక్కడిపాలకుల ఆశయము. పిల్లలకు ఉగ్గుపాలతో ఈరాజకీయసూత్రములనే బోధించుచున్నారు.

మనయిండియాదేశములో పార్లమెంటు, డిక్టేటరుషిప్పులలో ఏవిధానము మనకు అక్కరకువచ్చునో యిప్పటినుండి ప్రజలు ఆలోచించుకొనుచుండవలెను. ఆదర్శము నొకదానిని ముందిడుకొనినగాని కార్యాచరణలో దిగుటకు వీలుండదు. మన అఖిలభారతకాంగ్రెసులో సమష్టిపరిపాలనవాదులసంఖ్య క్రమక్రమముగా హెచ్చగుచున్నది. వీరివిధానము ఇంకను వీరికే స్పష్టముగా నుండకపోయినను, ప్రస్తుతసంఘనిర్మాణము కొంతవరకు తారుమారుచేసినగాని, మనగ్రామములలోని బీదజనుల ఆర్థికస్థితి బాగుపడనేరదని వీరితలపు. ముప్పదియైదుకోట్లప్రజలలో నూటికి తొంబదిమంది కడుబీదదశలో నున్నపుడు ఎప్పటికైనను రాజకీయ సాంఘికవిప్లవములు రాకతప్పదు. సంఘమంతయు తారుమారుకావలసియుండునని, కొందరు సాంఘికవాదులు అభిప్రాయపడుచున్నారు.

ఒట్టిమూకలప్రభుత్వముకంటె డిక్టేటర్లప్రభుత్వమే దేశమునకు ఎక్కువక్షేమకరమని మరికొందరు రాజకీయవేత్త లభిప్రాయపడుచున్నను ఇది వ్యక్తిస్వాతంత్ర్యమునకు తప్పక భంగము కలిగించును. పాశ్చాత్యనాగరికతకు ప్రధానమైన వ్యక్తిస్వాతంత్ర్యము ఈడిక్టేటరుపద్ధతివలన అపాయస్థితికి వచ్చుచున్నదని దక్షిణాఫ్రికామంత్రిగా నుండిన స్మట్సుసేనాని విలపించుచున్నాడు. ఈ నూతననిరంకుశప్రభుత్వములు దేశాభిమానమునే యెక్కువగా పురస్కరించుకొని యువకుల నందరను తమకు దాసులనుగా చేసికొనుచున్నవి. దానివలన వ్యక్తుల రాజకీయస్వాతంత్ర్యముతోపాటు వారిబుద్ధిస్వాతంత్ర్యముకూడ నాశనమగునట్లు కనుపడుచున్నది. ఈ గండమును తప్పించుకొనుట యెట్లనునదియే ప్రస్తుతము ఒకగొప్పసమస్య. కడచిన రెండువేలసంవత్సరములలోకంటె ఈకాలములోనే నిజమగు వ్యక్తిస్వాతంత్ర్యము తగ్గుచున్నదని చెప్పవచ్చును. ఒకానొకసమయములో తాత్కాలికముగ ప్రజాప్రతినిధిసంఘము ఒకరిని డిక్టేటరుగా నియమించుకొనవచ్చునుగాని, వారిని శాశ్వతముగ నుంచుకొని పరిపాలన జరిగించుటవలన ప్రతిదేశములోను తరుచుగా విప్లవములు రాకతప్పదు. ప్రజాపరిపాలనలో లోపములు కనుపడినపుడు మార్పులు చేసికొనుచుండవచ్చునుగాని వ్యక్తుల వాగ్లేఖనసమావేశముల హక్కుల నన్నిటిని కూలద్రోసి పాలితుల అనుమతి లేనిదే రాజ్యపరిపాలనము డిక్టేటర్లచేత సాగించుకొనెద మనుట వెర్రిమాట. అట్లెన్నడు జరుగకూడదు; జరుగదు. అజ్ఞానులగుమూకలచేతులలోనికి పోకుండ పార్లమెంటరీగవర్నమెంటు ఎట్లునడపగలమో మనమాలోచించుకొనుచుండవలెను. కాని, నిరంకుశప్రభువులచేతులలో మనప్రతినిధులు ఎన్నటికిని రాజ్యపరిపాలనము పెట్టకూడదు. అట్లు జరిగించినయెడల విప్లవములు, హత్యలు తప్పక బయలుదేరి ప్రజలు నెమ్మదిలేక అనేకకష్టములపాలగుదురు.

---

# సోషలిజమ్ - కమ్యూనిజమ్ - ఫ్యాసిజమ్

(Socialism — Communism — Fascism)

భావరాజు సత్యనారాయణ

ప్రతిదేశమునకును ప్రపంచసాంగత్యము అవసరము. అందు రాజ్యాంగసంస్థలయొక్క ముఖ్యాంశలను తెలిసికొనుట మిక్కిలి అవసరము. మనహిందూదేశమునకు ప్రపంచకమంటే అనుభవము చాలా తక్కువ. మనప్రజలు, పరిపాలనాక్రమ మేరీతిగా జరుగుచున్నదో, ఆప్రభుత్వమును నడుపుచున్నది ఎవ్వరో తెలిసికొనరు. ఇప్పుడు మహాత్ములు, దేశాభిమానులు బయలుదేరి, ప్రజలలో, కుతూహలము పుట్టించేరు. పౌరులకు ప్రస్తుతరాజకీయసమస్యలు కొద్దికొద్దిగా బోధపడుతున్నాయి. అంతటితో సరిపోదు. ఇతరదేశములందలి ప్రభుత్వములను, పరిపాలనాక్రమమును మనము తెలిసికొనవలెను; వాటి ప్రధానాంశములను గ్రహించుటకు ప్రయత్నించవలెను.

ఈ వ్యాసమునందు ప్రస్తుత రాజ్యాంగరంగమునలంకరించిన రాజ్యాంగవ్యవస్థలనుగూర్చి ప్రశంసించెదను. మన దేశమునందు ఆవ్యవస్థలననుసరించి ప్రభుత్వమును స్థాపింపవచ్చునా, స్థాపింపగలమా అని చర్చించుట కీవ్యాసమునకు పూనుకొనలేదు. సోషలిజమ్, కమ్యూనిజమ్, ఫ్యాసిజమ్ అంటేఏమిటో, వాటి సిద్ధాంతము లెట్టివో బహుసూక్ష్మముగా తెలుపుటకు ఈవ్యాసరచనమునకు బూనుకొంటిని.

ప్రస్తుతరాజ్యాంగవ్యవస్థలలో (Political Ideals) సోషలిజమ్, కమ్యూనిజమ్, ఫ్యాసిజమ్ యూరపురాజ్యాంగరంగంలో త్రిమూర్తుల స్థానములను అలంకరించినవని చెప్పుట అతిశయోక్తి కాదు. ఇయ్యవి అమోఘమైన సిద్ధాంతములని కొనియాడబడుచున్నవి. వీటిని ఆచరణలో పెట్టుచున్న నాయకులు ప్రతిదేశమును ఆకర్షించుచున్నారు. జర్మనీదేశమందు హిట్లరు (Herr Hitler), రష్యాదేశమునందు స్టెలిన్ (Stalin), ఇటలీదేశమందు ముస్సోలిని (Signor Mussolini) - వీరు ముగ్గురు అవతారపురుషు లనబడుచున్నారు. వీరు ఏమి పోసినా దీపమై వెలుగుతోంది. కారణమేమంటే— ఆసిద్ధాంతములయొక్క మహత్త్వము తప్ప మరేమియు కాదు. లియో టాల్‌స్టాయ్ (Leo Tolstoy), కారల్ మార్క్సు (Karl Marx) పండితులు వదలిన అమోఘమైన అస్త్రములమహిమ తప్ప మరియితర మేదియు కాదు. కాబట్టి యీసిద్ధాంతములను గురించి, పౌరుడు (Citizen) కాదలచిన ప్రతిమనుజుడును తెలిసికొనవలెను.

సోషలిజమ్ అనగా "సాంఘికస్వామ్యవాదము;" సహోదరమానవులకుగల గాఢానుబంధమును సంబంధమును గూర్చి ప్రశంసించు తత్త్వము. ప్రపంచమునందు నాగరకత (Civilization) కలిగి ప్రభుత్వమునకు (Government) లోనై యుండు జనబాహుళ్యమంతటియందును ఏ యేజాతులుగాని, తెగలుగాని కానిండు— ప్రధానధర్మములందు సమత్వము కలదు. "ప్రతివ్యక్తి ఆయురారోగ్యైశ్వర్యములతో క్షేమముగానుండవలెను. అతనిక్షేమలాభములు సంఘముమీద నాధారపడియున్నవి. సంఘాభివృద్ధియు వ్యక్తిమీద నాధారపడియున్నది. కాబట్టి సంఘాభివృద్ధికై వ్యక్తి పాటుపడవలెను" ఈధర్మమును, అన్నిదేశములు ఒప్పుకొనితీరవలయును. సంఘస్వామ్యవాదము ఈ ధర్మమును మిక్కుటముగా బలపరచి సంఘముయొక్క ప్రాముఖ్యమును కొనియాడునట్టి సిద్ధాంతము. 'వ్యక్తివాదము (Individualism) క్షేమకరము కాదు. సంఘముయొక్క

అనుజ్ఞప్రకారము వ్యక్తి పాటుపడవలెను' అని యీ సిద్ధాంతము వాదించును.

ఈసిద్ధాంతముయొక్క ఆశయములు ఎట్టివనగా—

1. ఆర్థికవ్యవస్థ, పారిశ్రామికపద్ధతులు (methods of Economic & Industrial Organization) పెట్టుబడిదారుల (Capitalists) చేతులలోగాక జనసామాన్యముయొక్క అధీనములోనే వుండవలెను.

2. జనసామాన్యముయొక్క సమిష్టిలాభము కొరకే ప్రధానపరిశ్రమలన్నియు నడుపవలెను.

3. జనసంఘము ప్రత్యేకముగా ఈపనులు నెరవేర్పజాలదు గాన, నిపుణులగు కార్యనిర్వాహకులను (Leaders) నియమింపవలెను.

ఈ ఆశయములను పార్లమెంటరీ ప్రజాప్రతినిధుల సంస్థలద్వారానే కొనసాగింపవలెనని యీసిద్ధాంతముయొక్క నియమము. ఈ ఆశయములను పాటించి, సంఘస్వామ్యవాదన అవలంబించిన పక్షీయులకు సోషలిష్టులు (Socialists) అనిపేరు.

"ధనవంతులయొక్క ప్రాబల్య ఆర్థికపారిశ్రామిక పద్ధతులు నశింపవలెను. వ్యక్తివాదము (Individualism) సాంఘికస్వామ్యవాదము (Socialism)నకు తావొసగవలెను. సంఘబలమే వ్యక్తిబలము. సంఘక్షేమమే వ్యక్తిక్షేమము" అను ప్రతిధ్వనులు మారుమ్రోగినవి, మ్రోగుచున్నవి. దానితోనే నూతన ఆర్థికరాజ్యాంగ వ్యవస్థల ననుసరించి రాజ్యాంగసౌధములు నిర్మింపబడినవి. మొనగాళ్ల అలజడి ఎక్కువయినది. స్వామ్యవాదమునే రష్యాలో బోల్షెవిజమ్, లేక కమ్యూనిజమ్ అనియు, ఇటలీలో ఫ్యాసిజమ్అనియు, జర్మనీలో జాతీయ సంఘస్వామ్యవాద మనియు (National Socialism) మారుపేర్లతో కొండెక్కించారు.

కమ్యూనిజమ్ అనగా "సర్వసమానసంఘ స్వామ్యవాదము." సోషలిజమునకును, ఈకమ్యూనిజమునకును భేదము గుర్తింపవలెను. సోషలిష్టుఆశయములను, సంబంధములను న్యాయమైన మార్గములవల్లగాని (Constitutional means), మరి శాంతిసూత్రములవల్లగాని (Peaceful methods) స్థాపింపక, విప్లవమార్గముల ద్వారానే (revolutionary methods) స్థాపింపగోరునది సర్వసమానసంఘస్వామ్యవాదము. ఈవాదము వారికి కమ్యూనిష్టులు, లేక సర్వసమానసంఘస్వామ్యవాదులు అనిపేరు. వీరినే బోల్షెవిష్టులుఅనికూడఅందురు. ఇయ్యది ప్రస్తుతము రష్యాదేశపు రాజకీయవిధానము.

ఈరాజ్యాంగమందు వ్యక్తు లెవ్వరికిని ఆస్తిహక్కులులేవు. ప్రజాప్రభుత్వమే సమస్తమునకు హక్కుదారు. ఇందు ఆర్థికతారతమ్యములు లేవు. జనులందరియొక్క సమానక్షేమఐశ్వర్యములకు వినియోగించు పరిపాలన ఈరాజ్యాంగమందు కలదు. దీనికే జనసామాన్యజనాధిపత్యము (Dictatorship of the Proletariat) అని చెప్పిరి. "ఆర్థికపారిశ్రామికపద్ధతులు ధనవంతులగు పెట్టుబడిదారుల ప్రాబల్య అధికారమునకు లోనైయుండుటవలన జనసామాన్యమునకు క్షేమసౌకర్యములు కలుగనేరవు" అను వాదనను ప్రబలపరచి, రష్యాదేశములో భిన్నాభిప్రాయములు లేకుండజేసి, జాతులకు భేదవైషమ్యములులేని రాజ్యమును (Classless State) స్థాపించిరి. ప్రతిపల్లెయందును, పట్టణమందును జనసంఖ్యకు తగినట్లుగా జనసంఘములను (Soviets) స్థాపించిరి. ఈ సంఘములన్నియు కలిసి సోవియట్ రిపబ్లికు కాంగ్రెసునకు (The Congress of the Soviet Republics) ప్రతినిధులను పంపును. దీనికి అభ్యర్థులు (Members) అప్రత్యక్షపునియోజనపుపద్ధతి (Indirect Election) ప్రకారము ఎన్నుకొనబడుదురు. ఈసభకు నిర్మాణవిధానము ప్రకారము సంపూర్ణముగుబలము కలదు. కాని ఆచరణలో ఆశక్తి, ఆబలము అంతయు అధికార కార్యనిర్వాహకవర్గము (Executive) చేతిలో చిక్కినవి. అధ్యక్షుడు సర్వాధికారియై (Dictator) కార్యములన్నిటిని నిర్వహించును.

ఈసర్వాధికారి కార్మిక (అనగా పారిశ్రామికుల క్షేమలాభములనుగూర్చి చట్టములను నిర్మించవలెను;) వారిహక్కులను కాపాడవలెను. దేశాభిమతము ననుసరించి దేశముయొక్క యావత్తుక్షేమమును కాపాడవలెను. దేశములోని పరిశ్రమలనన్నిటిని జాతీయతకు జెందునట్లుగా జేయవలెను. ఇతనితోకూడ పనిచేయువారు 17 గురుమంత్రులు కలరు. ఈమంత్రివర్గమునకు "పీపుల్సు కమెస్సార్సుసభ" (Council of people's Cemmessars) అనిపేరు. అధికారవర్గము యావత్తునకు 200 మంది ప్రతినిధు లుందురు. ఈసభకు 'ది ఆల్ సెంట్రల్ రషియన్ ఎక్సిక్యూటివ్ (The all Russian Central Executive) అనిపేరు.

రష్యాదేశమునందు గమనించవలసిన ముఖ్యమైన విషయము లేవనగా:

1. అందు పరిపాలనావిధానము ప్రజాప్రభుత్వము కాదు. ప్రజలందరకు వోట్లులేవు. ఉత్పాదకులకు (Producers) మాత్రమే ప్రభుత్వమునందు పాల్గొనుటకు హక్కుగలదు. అనుపార్జితాదాయమువలన (Unearned incomes) జీవించువార్లకు, మతాధికార్లకు (Clergy) వోట్లులేవు. కాబట్టి రష్యాదేశపు పరిపాలనా పద్ధతిని సర్వసామాన్యజనాధిపత్యము (Dictatorship of the proletariat) అందురు.

2. అధికారవిభజన ఏమాత్రమును లేదు (No separation of powers). అనగా శాసననిర్మాణసభకు (Legislature) కార్యనిర్వాహకవర్గమునకు (Executive) న్యాయపరిపాలకవర్గమునకు (Judiciary) నియమములు లేవు. ఎవరిస్థలములందు, హద్దులందు అనగా శాసన నిర్మాణసభయొక్క అధికారము చట్టములు నిర్మించుటకును, ఆచట్టములను అమలులోపెట్టు అధికారము కార్యనిర్వహణమునకే చెందునట్లుగాను, ధర్మమును నియమించు అధికారము న్యాయపరిపాలక వర్గమునకు చెందునట్లును అధికార విభజన లేదు. అందుచే ప్రజల స్వాతంత్ర్యమునకు, స్వేచ్ఛకు భంగము కలుగుచున్నది.

3. రాజకీయమునందు కమ్యూనిష్టుపార్టీ సర్వాధికారి ఆధిపత్యముతో సర్వాధికారము చలాయించుచున్నది (Dictatorship of the communist party). కాబట్టి రష్యాదేశపు రాజకీయసిద్ధాంతమందు ఆవిషయములను గ్రహించవలెను.

ఇంక ఫ్యాసిజమ్ (Fascism) సిద్ధాంతముయొక్క ప్రధానాంశములను గమనింతము. ఈసిద్ధాంతము సంఘస్వామ్యవాదము (Socialism) కాదు. అసలు, ప్రథమమునందు సంఘస్వామ్యవాదమును ప్రతికూలించి యెదుర్కొనుటకే యీ సిద్ధాంతమును ఇటలీలో స్థాపించిరి. లెనిన్ మహాశయునకును ముస్సోలినికిని విరోధభావములు హెచ్చయినవి. లెనిన్ ఇటలీలో సంఘస్వామ్యవాదమును స్థాపించుటకు యత్నించుచున్నాడనియు, అట్టిది ఇటలీకి అనర్థకమనియు, పెట్టుబడిదారులను నిర్మూలనము చేయకూడదనియు, పెట్టుబడిదారులకు కష్టజీవులకు ఐకమత్యము కుదురునట్లు చూచి, జాతిమొత్తముయొక్క క్షేమములే ముఖ్యమనియు ముస్సోలినిగారు లెలిన్‌భావముల నెదుర్కొని, యీ ఫ్యాసిజము సిద్ధాంతమును స్థాపించి, ఇటలీయందలి విప్లవముల నణచివైచి శాంతినెలకొల్పి నోబెల్ బహుమానమును బడసిరి. ఈసిద్ధాంతము సంఘస్వామ్యవాదము కాదని గుర్తింపవలెను. ఫ్యాసిజము అనగా (Latin: Fasce (V)-to bind) ఐక్యవాదసిద్ధాంత మగునేమో! ప్రస్తుతము ఇది ఇటలీదేశపు రాజకీయసిద్ధాంతము. దీనిని 'నవీనరాజ్యాంగవ్యవస్థ' అని చెప్పవచ్చును. దీనికి జాతీయౌన్నత్యము, సౌభాగ్యము, మంగళము లక్ష్యములు. జాతీయాభివృద్ధినే యిది ముఖ్యముగా గమనించును. రష్యాదేశపు రాజకీయవిధానమునకును, ఇటలీదేశపు రాజకీయవిధానమునకును, అనగా కమ్యూనిజమునకును, ఫ్యాసిజమునకును లక్ష్యములలోనే భేదము గాన్పించుచున్నది. రష్యాలో కేవలము కష్టజీవుల సంఘముయొక్క క్షేమసౌకర్యములనే ప్రధానముగా గైకొనును. కాని ఇటలీదేశమందు జాతియావత్తుయొక్క

క్షేమఐశ్వర్యములను ముఖ్యమైన లక్ష్యములుగా గై కొనును. జాతీయకల్యాణము ఫ్యాసిజమునకు పరమ లక్ష్యము.

ఈఆశయమును నెరవేర్చుటకు అందరు వ్యక్తులు, ప్రజలు ప్రభుత్వముయొక్క ప్రత్యక్షపు తనిఖీక్రింద (Direct control) పాటుపడవలెను. 'అందరు పాటుపడవలెను' అనునది ప్రభుత్వసూత్రము. ప్రజలుగాని, యితర సంఘములుగాని పరదేశపక్షపాతులుగా నుండుటకు వీలులేదు. ఇతరరాజకీయాభిప్రాయములు కలిగియుండరాదు. అట్టివికారము లన్నింటిని ప్రభుత్వము అణచివేయును. ("Fascism is a Government by a small efficiently organised party with its strength based on a trained militia absolute dictatorship, use of force and violence.") ఈసిద్ధాంతమును ఆమోదించువారికి ఫ్యాసిస్టులు (Fascists) అనిపేరు. ఈనవీనరాజ్యాంగముయొక్క పరిపాలనావిధానము చిత్రముగా నుండును. ఇటలీలో ఇంగ్లాండువలెనే ధర్మమునకు బద్ధుడగు రాజు (Constitutional monarch) కలడు. ఇంగ్లాండులో వలెనే ప్రజాసభలు కలవు. వీటికి గ్రాండ్‌కౌన్సిల్సు (Grand councils) అనిపేరు. ఇంగ్లీషు కేబినట్ (Cabinet) వంటి మంత్రిపరిషత్తుకూడ కలదు. ఇవియన్నియు ప్రస్తుతము, అనగా 1922 సం. మొదలు—ఫ్యాసిజము విప్లవము (Fascist Revolution) వచ్చినప్పటినుంచి—ఫ్యాసిస్టుపక్షమువారి అధికారమునకు లోనై ప్రజాప్రతినిధి ప్రభుత్వపద్ధతులు (Methods of Representation in Parliament) బాగుగా మారిపోయినవి. దేశములోని ఎన్నికదారులందరిని సంఘములుగా విభజించిరి. అట్టివి 13 నియోజనసంఘములు (Corporations) గలవు—1 వృత్తిపనులు చేయుసంఘమును, 6 కార్మికసంఘములును, 6 వ్యవసాయసంఘములును. ఈ సంఘములు ఫ్యాసిస్టుగ్రాండ్ కౌన్సిలుకు 400 మంది అభ్యర్థులను ఎన్నుకొనును. ప్రతి అభ్యర్థికి అధిక సంఖ్యవోట్లు రావలెను. ఈ గ్రాండ్ కౌన్సిలు స్థాపించిన తరువాత ప్రధానమంత్రి, తక్కినమంత్రులు ఎన్నుకొనబడుదురు. శాసననిర్మాణసభను రెండుభాగములుగా జేసిరి (Two Chambers). సెనేటు (Senate) సభకు అభ్యర్థులను ప్రధానమంత్రి సలహానుపొంది, రాజు నియోగించును. వారు బ్రతికియున్నంతకాలము అభ్యర్థిపదవిని స్వీకరింతురు. శాసననిర్మాణసభయందలి అభ్యర్థులుకూడ 1927 సంవత్సరము ఎలెక్టరల్ లా ప్రకారము గ్రాండ్‌కౌన్సిలువల్ల నియమింపబడుచున్నారు. 1922-వ సంవత్సరము మొదలు నేటివరకు ముస్సోలినీ (Mussolini) ప్రధానామాత్యుడుగా నున్నాడు. ప్రతి విషయమునందును ఆయన సర్వాధికారము ప్రతిఫలించుచున్నది. అందుచే ఈయనకు 'డిక్టేటరు' పదవినిఇచ్చిరి. ఫ్యాసిజముయొక్క ప్రధానవిషయము లేవనగా :

1. ప్రజాప్రభుత్వమును ఈసిద్ధాంతము హర్షించదు. "Democracy is rule by majority; Majority have no brains." కేవలము దండనసూత్రముమీద (Principle of Force) నాధారపడియుండు విధానము. "It regards that the state is force and an end in itself."

2. ఫ్యాసిస్టుపార్టీకివాదనలందుగాని(Reasoning), చర్చలందుగాని (Arguments), ప్రోత్సాహపఱచుటయందుగాని నమ్మకము లేదు. సర్వాధికారిచిత్తము ప్రకారము పరిపాలన జరుగును.

3. ఈ రాజ్యాంగవిధానమునందు వ్యక్తులకు స్థానములేదు. నియోజకసంఘములే(Corporations) ఆదర్శభూతములు. అందుచేతనే ఇటలీకి నూతననామకరణము కలిగినది. కార్పొరేట్ స్టేట్ 'Corporate state' అని దానిని పిలుచుచున్నారు.

4. జాతీయసైన్యము దేశములో శాంతిని నెలకొల్పును. దీనిఅధికారమునకు మితిలేదు. అందుచే ప్రజలకు స్వేచ్ఛయనునది గాని, స్వాతంత్ర్యమనునది గాని లేదు.

ఈ సిద్ధాంతములందలి రాజకీయతారతమ్యము లను (Political Comparisons) ప్రత్యేకముగా రష్యాయందును, ఇటలీయందును) గ్రహించినాము. సంఘాచారములు, సంఘభావములు మరియొకవ్యాస మున తెలుపుదును. ఈసంస్థలయొక్క భావములు రాజ్యాంగశాస్త్రమునకు ఎంతవరకు వినియోగింపవలెనో యోచింపవలయును.

ప్రపంచమునందు సంఘాభివృద్ధికొరకై 'సాంఘిక స్వామ్యవాద' సిద్ధాంతమును ఆదర్శముగా గైకొనవలె నని కారల్ మార్క్సు (Karl Marx) పండితుడు నుడివి నాడు. సంఘాభివృద్ధి నపేక్షించుభావములు ఏజాతిలో మిక్కుటముగా ప్రబలునో ఆజాతి (Nation) యందలి స్త్రీపురుషులకు స్వేచ్ఛ (Freedom), స్వతంత్రత (Independence), మానవత్వము(Humanity) మిక్కుటముగా ప్రబలునని దాస్ కాపిటల్ (Das Capital) అను పుస్తకమునందు మార్క్సుపండితుడు వ్రాసినాడు. ఆయన గొప్పమేధావి.

ఇంకను "సామాన్య కష్టజీవుల జనసంఘము యొక్క ఆధిపత్యము ప్రస్తుత సంఘములందు అవసరము — ముఖ్యము. పెట్టుబడిదారులు వారిని వేధించు చున్నారు. వారికి క్షేమసౌకర్యములు కలుగజేయుట లేదు. కాబట్టి యిదిముఖ్యము" అని కూడ పలికెను. ఆమాటలయం దసత్య మేమియును లేదు. కాని — సోషలిస్టిక్ స్టేట్ (Socialistic state) యితరరాజకీయ సంస్థలను, యితరసంఘములను సహింపనేరదు. వాటిని నిర్మూలనము చేయుటకు యత్నించును; మిగిలినజాతులతో ఆజాతికి సఖ్యము అనవసరమని భావించును. కొలదికాలములో ఎప్పుడోఒకప్పుడు ఆ సంఘమునకును, తదితర సంఘములకును పోరాటము (War) సంభవించును. ప్రపంచశాంతికి (World Peace) భంగము కలుగును. కాబట్టి కట్టిన మేడలను పడగొట్టి ధనవ్యయము చేయుటకంటె పాతమేడలను బాగుచేయుటయో, నూతనముగ మేడలను వాటిప్రక్కనే కట్టుటయో శ్రేయోదాయకము; శాంతికి మూలము. కాబట్టి ఏరాజ్యాంగవిధానము స్థాపించినను అయ్యది ప్రపంచమునందు శాంతికి భంగముకాకుండ స్థాపింపవలెను. విప్లవమార్గములు శ్రేయోదాయకములు గావు.

• అంతర్జాతీయ సహోదరత్వము (Ideal of International brotherhood) ప్రతిజాతికి ముఖ్యము. హిట్లరుగాని, ముస్సోలినిగాని విశ్వమానవహృదయము లందు తళతళమెరయు రాజ్యసౌధములను నిర్మింపలేరు. "* జూలియస్ సీజరుగారు నిర్మింపలేదు. నేపోలియన్ స్థాపింపలేకపోయినాడు. వీరా ఆచంద్రార్కము వర్ధిల్లు శాంతిసౌధములను మానవహృదయముల నిర్మించునది? అట్లు నిర్మించినవారు లేకపోలేదు. మాకు పక్షపాతమువలదు. జీసస్సుక్రైస్తుగారిని తిలకింపుడు; బుద్ధుని చూడుడు. వారితేజోమహిమ నేటికిని సూర్యచంద్రులవలె వర్ధిల్లుచున్నది. పోనీ! రెండువేలసంవత్సరములైనది. నేడు! ఇప్పుడు! మనదేశములో అవతరించిన గాంధిమహాత్ముని సిద్ధాంతమును చూడుడు... శాంతి, అహింస (Peace and Non-violence), సత్యము (Truth)-ఇవి ఆయన సిద్ధాంతములు. శాంతి మార్గములవలననే హిందూదేశమునకు స్వేచ్ఛ, స్వతంత్రత తెచ్చెదనని కంకణము కట్టుకొన్న మహాత్ముడు. ఈసిద్ధాంతము "గాంధీసమ్" (Gardhism) అనబడుచున్నది." ఫ్యాసిజము కంటెను కమ్యూనిజమ్ కంటెను, వేయిరెట్లు జవముతో, బలముతో, తేజస్సుతో ప్రపంచమంతటిని నిమిషమాత్రమున, నెన్నియోసార్లు చుట్టి వచ్చుచున్నది ఈ గాంధీసమ్. ఆగాంధీసమునకు అనేకనమస్కారములు.

సోషలిజమ్, కమ్యూనిజమ్, ఫ్యాసిజములను ఆయా దేశములవారు మనము గాంధీసమును

* Ref. Dr. Pattabhi S taramiah's lecture "Is Gandhiji played out?"

పూజించునట్లే ఆరాధించుచున్నారు. కాబట్టి గాంధియిజము మనకు ఎంత అవసరమో, అదియు అంత అవసరము. మనము హిందూ దేశపు పౌరులము. మనకు గానున్నది స్వేచ్ఛ-స్వాతంత్ర్యము. కాబట్టి ఈప్రధాన సిద్ధాంతములను సావధానచిత్తముతో, పౌరులు (Citizens) కాదలచిన హైందవులెల్లరును విమర్శనదృష్టితో, పరిశీలన బుద్ధితో, కుతూహలముతో విషయములను గ్రహించుటకు పాటుపడవలెను.

---

## నే నోః దావా దాఖలుచేశాను





ఆండాళు దేవాలయ గోపురము, శ్రీ విల్లి పుత్తూరు K. P. S.



పక్షిభోజనము-పక్షితీర్థము

J. K. C



కొండ అడివారము-పక్షితీర్థము

# గోవర్ధనాచార్య సప్తశతీసారము

శిరోమణి సన్నిధానము సూర్యనారాయణశాస్త్రి

మలపట్టి కేలిఁ బట్టఁగఁ
 బులకించుచు బూదెఁగ్రాలు ముక్కంటి [యొడల్
వెళ్లిమిడియయ్యె మనోజుఁడు
మొలకెత్తినసొంపు మెఱసి ముచ్చటగొలు [పున్.

వెలికిఁ గ్రక్కవలదు విసము మ్రింగుమటంచుఁ
గలఁతపడుచుఁ దాశగారు పలుకఁ
గాంచి తనదుమోవిఁ గాటుకం బ్రొద్దుట
సిగ్గుగొన్నహరుఁడు శివములిచ్చు.

గిరిజాపదములవ్రాలిన
గరళగ్రీవేయుఁడైన కామారి మహ
త్తర విషమబాణు గళమునఁ
గరవాలముఁ దాల్చి శరణుఁగన్నట్లలరున్.

అవ—నాయకుని పరిహాసోక్తుల కలి
గిననాయికతోఁ జెలికత్తె యనుచున్నది:

పరులు పలికిన నేమాట వాదులాట
అదియె ప్రియునోట రాఁగ సయ్యాటసుమ్ము!
కామినీ, కట్టెలంబుట్ట ధూమమందు
రగురునంబుట్ట ధూపమం డ్రదియె జనులు.

అవ—ఒకతె యొకదాని ముచ్చటను
దెలుపుచున్నది:

నవకేళీరుచి మఱఁగిన
జవరా "లిన్నాళ్లు వృథగ జరిపితి లజ్జా
వివశత వంచించిరి నను
వివరింపక" యనుచుఁ గివిసె బిట్టుఁ జెలులపై.

అవ— ఒకఁడు తన ప్రియావిలోకన
సుఖమును దెలుపుచున్నాఁడు:

తెరచినుంగులనుండి వెల్వఱచుచున్న
యాచిగురుఁబోఁడిమిన్న తియ్యంపుఁ జూపు
అమలినంబుగ వడిగట్టి నట్టి యమృత
ధారయుంబోలె మిగుల స్వాద్యముగ నుండె.

అవ—ఒకఁడు తనయవస్థను వయస్యు
నితోఁ దెలుపుచున్నాఁడు:

చోఱఁబడి కిటికింబడి నా
కరంబు ప్రియురాలిపడకగది నచ్చట నా
తరుణీపాణిస్పర్శలఁ
గరము బలిసి యిఱికికొనియెఁ గ్రమ్మఱక సఖా!

అవ—ఒకానొక విరహి యనుకొను
చున్నాఁడు:

వెలిచవులు గలది చదురా,
ల్కులవతి, పొరుగింటి క్రొత్తకోడలు నన్నుం
గలసిన బ్రహ్మానందముఁ
దలఁతుఁ దృణప్రాయమని యెద యథార్థ
 ముగన్.

అవ—నాయకుఁ డనుచున్నాఁడు:

అలకలు సెదరఁగఁ బెనువే
నలి విఱియఁగ, నూర్పులకు స్తనద్వయ
 మెగయన్,
వలువ ప్రిదుల, నెదఁ గేలిడి
చెలి రతివివశతఁ బరున్న చెలువముఁ దలఁతున్.

అవ—పొలయలుక గొన్న నాయికను గాంచి నాయకుఁడు కుతూహలముతో ననుచున్నాఁడు :

సెలవేయుఁ జెఱకుతుంటయుఁ
బలయలుక బిగింపు, నెత్తమును, నీ కనుబొ
మ్మలు రసమునోల్కఁ మిక్కిలిఁ
గలికీ! భంగంబుఁ బొందికాదె! సతంబున్.

. అవ—చెలికత్తె నాయికతో ననుచున్నది :

సరిచేయుదు వీప్రొద్దుటఁ
దరుణీ! జందియముపోలెఁ దాల్చిన ముక్తా
సరముం, దెలుపకయున్నను
బురుషాయితపాండితీప్రపూర్ణత తెలిసెన్.

అవ—ఒకఁ డొకముచ్చటను దెలుపుచున్నాఁడు :

తనదు నెచ్చెలిఁబోలెఁ బాన్పునకుఁ జేరఁ
దానయి నవోఢ ; ననుఁగూడఁ దానురాదు
తన్ను మాలినధర్మ మీతరుణిదని యొ
కండు సతి మెచ్చ దానిమిండండు నవ్వె.

అవ—పార్వతీదేవి చెలికత్తె మఱొక్కతెతో ననుచున్నది :

పాముపేరు విన్నఁ బడియామడలుపాఱు
యువతి నిద్రవోవుచున్న దిపుడు
మృడుని చేతిపాఁప పడగతలాడపై
వలపువేఁడి నేదినలుప రాదు !

అవ— ఒకనాయకునితోఁ దార్చుటకై దూతి నాయికతో ననుచున్నది :

తాళఁజాలక క్రేగంటి తాఁకుదలకు
సొమ్మసిల్లె నతండు మార్గమ్మునందె
జందెపుంబోగు వానివంశంబుఁ దెలిపె
రమణి, నినుఁజుట్టుకొన్నది బ్రహ్మహత్య.

అవ—ప్రణయకోపముఁ దాల్చునాయికతో సఖి పలుకుచున్నది :

సతులధర్మంబు లంద్రు ప్రసన్నభావ,
మూడిగము, లొంగుబాటును నుర్విఁ గాని
వెలఁది యలుకయు, రాచఠీవియును, బెంకె
తనమును విభూషణమ్ము సుందరులకెపుడు.

అవ—నాయికాసక్తిని దూతి నాయకునితోఁ దెలుపుచున్నది :

పల్లవిగఁ గూర్చి వర్ణంబుఁ బాడు ; వేణు
వల్లి వాయించుఁ; బల్కించు వల్లకిపయిఁ
జిలుక మొకరికిఁ బాఠంబుఁ జెప్పుచుండు
నీదు నామాక్షరంబు లానెలఁతమిన్న.

అవ—దరిద్రుని వరించితివని పరిహసించునాయికతో వేరొక నాయిక పలుకుచున్నది :

చెఱకుతుంటకుఁ గనుపున్నఁ గొఱఁతయున్నె?
చవులు దగ్గునె? శబ్దదోషమునఁ బాటఁ;
దఱఁగునే వంపుచేతఁ జందురుని సొంపు?
బీదతనమునఁ బ్రియునంద మేఁదునొక్కొ?

అవ—పరపురుష సంయోగాభిలాషిణియగు నొకయువతి యిట్లనుచున్నది :

కటికిచీఁకట్ల దొలకుం గానిపించుఁ,
గౌఁగిళులఁ గర్కశముగ మైఁ జేఁగ కొరయు,
వదరుమరునేఁత, నాశంఖవలయపంక్తి
చితుకుఁగావుత నాపతి శిరసుతోడ.

అవ— చెలికత్తె నాయికతో ననుచున్నది :

నిలుతువు కొయ్యఁ బాఱి పయి
నింపక తొట్రిలుచుందు, వంగ సం
ధులు సడలంగ నేలపయిఁ
దూలుదు పట్టువడంకుచుందు వ

చ్చెలువుని నాత్మఁజింతనము
సేయుచు రిత్తబయల్ తమిం గవుం
గిలిఁ గొనుచుందు వీగతి స
ఖి ! యభిసారగుణంబు లివ్వియే ?

అవ—ఒకతె యొకనితో ననుచున్నది:

తనదుయువతిని నాగరుల్ తడవుచుంట
నింతభూలోకసుందరి యిదియ యంచు
విఱ్ఱవీఁగుచుఁ దనజ్ఞాతివితతియెదుట
నేలఁ గాలూనక చరించు సాలె యొకఁడు.

అవ—గోరంటపూలసెజ్జయందు రతిఁ దేలివచ్చిన నాయికతోఁ జెలికత్తె యనుచున్నది :

గంట్లువడె గోటినొక్కుల గబ్బిగుబ్బ;
లంటుకొనె వీపునందు గోరంటపూలు
ఎడఁద నాఁటియు నుబ్బిపోయినవా ? కఱకు
మరుని పూఁదూపు ? లనఁ జేలీ ! మెఱపి తీవు.

అవ—నాయకుఁడు వయస్యునితో ననుచున్నాఁడు :

అతిపరుషమందు " ఏమండి" ! యన్న పిలుపు;
ఉచిత " మేమోయి! " యన్నచో; రుచి
[తనర్చు
"నేమిరా" ! యన్న; దాంపత్య మిదియె;
[యన్య
మతివ త్రాడును బసరంబు పతియుఁ జుమ్ము !

అవ—నాయికచెలికత్తె నాయకునిదూతితో ననుచున్నది :

కనులకద్దును, ముద్దాడుఁ, గౌఁగిలించుఁ,
బోఁగడుఁ, బ్రణమిల్లు నోడలెల్లఁ బులకరింప,
మాచెనెచ్చెలి ప్రియసంగమమున కదరు
తనదుడాకేలుఁ దీవ సంతసమెలర్ప.

అవ—జూద మాడఁగోరు నాయికతో నాయకుఁ డనుచున్నాఁడు:

చిలుక పూఁటకాఁపు; శృంగారసంకథా
శ్రావణంబు శిక్ష; ప్రతిన దప్ప
గురుసమీపమందుఁ; బురుషాయితము పందె
మట్లయేని నెత్తమాడు మబల !

అవ—చెలికత్తె నాయకునితో ననుచున్నది :

తొలుతటెక్కంబెఁ గడుంగడు
వలపులు ,మచ్చికలు, నాటపాటలు, మరియూ
దలునుం గనఁబఱతువు నీ
లానపయిం, దెలిసె ధూర్తలక్షణ మిదియుజా.

## చాటువులు

దీపాల పిచ్చయ్యశాస్త్రి
(సంపాదకుఁడు)

### ౧. చలి

ప్రాకటమైన దోమతెర పందిలిమంచము దూదిపానుపుల్
కోకలు పచ్చడంబు లనుకూలవధూస్తనతాడనంబులన్
వేకువదాఁక మారసుఖ విభ్రమ మందెడువారి... మున్
బీకగలేక యిట్లు నిఱుపేదల నేఁచుట న్యాయ్యమా చలీ!

ఇరుగడల నిద్దరాంధ్రుడును - కుఱుచంగియు గూర్పణంబు కుంపటి గల యూ
పురుషులఁ జేరగనేరక - కఱవునబడ్డట్లు నన్ను గఱచెదవు చలీ!

### ౨. పొగాకు

సన్నంబై, కుఱుమట్టమై, పలుచనై, జాపత్రితో సాటియై
... ... ... ... ...
గన్నేరాకువయై, సదాప్రజకు సౌఖ్యంబుల్ ప్రసాదించుచున్
వన్నెల్‌గుల్కు పొగాకుముచ్చటలు విన్నావా రమావల్లభా!

జారుల కీవిమ్రాకు, విలసన్మలబద్ధవినూత్నపల్లికిన్
గ్రూరపుఁజాకు, సంతతశిరోవ్యధకృన్మహితోగ్రశైత్యపున్
భారముఁ దీరుగాఁ దఱిమివైవఁగఁ గంబళిరేకు, రాజకం
తీరవుపాలికిం జెడని తీకు, పొగాకు నుతింపశక్యమే.

### 3. నస్యము

నస్యమా యిది! హేమనళినపంక్తులమీఁద రంజిల్లుచుండెడి రజముగాని
రజముగా దిదిచూడ రతియురస్స్థలమందు దళమయియున్న చందనముగాని
చందనమా యిది! జంభారిపురిలోని రంభాదికాంతల రంగుగాని
రంగుగాదు భుజంగరమణుల కెమ్మోవితేనియలో మించు తేటగా
తేటగాదు చూడఁ దేఱిన చొక్కంపు - నీలమణులమీఁది నిగ్గుగ
నిగ్గుగాదు; ఆత్మనిర్మలంబైనట్టి - బుధుల కమృతరసపు బుగ్గగాని.

కనకపుడబ్బిలోపలఁ జొకాటపు మామిడిపండువంటి వా
సనగల చేల్పొగాకు ఘనసారమృగీమదగంధసారమున్
గనుపదున న్మథించి, జతనంబుగ నించియు, నస్య మాప్తులన్
మునుకొననిచ్చి పీలువని ముక్కొకముక్కె ధరిత్రిలోపలన్.

# కవిత్వతత్త్వవిచారము

జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి

కవిత్వముగాని, కవిత్వతత్త్వముగాని, కవిత్వతత్త్వవిచారముగాని తెలుగునేలలో అంతగాలేదు.

కొరకంచువంటి లోకానుభవము, రసబంధురమైన హృదయము, కన్నుకలిగి చరించుచిత్తము, గంభీరమైన భావపథనము కవిత్వమునకు అనివార్యమైన గొనములు. వైదుష్యము కవిత్వమునకు సౌందర్యమీయదుగాని లోతు నిచ్చును. సహజసౌందర్యముతో శోభిలుహృదయమునందే కనులు కోరగించుభావపల్లవములు చిగిరించును. తనభావమందే మునిగియుండువాడు కావున, చేతులుకట్టుకొని ఒరులప్రోల నిలుచుట నీత డెఱుగడు. కవి స్వాతంత్ర్యమును కాంక్షించువా డనను—కవియే స్వాతంత్ర్యమందును. అనుకరణముగాని, అనుసరణముగాని, అనువాదముగాని, గట్టికట్టుబాట్లుగాని, ఒకరిచెప్పుచేతలుగాని కవికి గిట్టవు. ఆత్మభావమున తన్మయుడై యుండువాడు నిర్బంధవిధానమునకు బానిసయై యెట్లుండజాలును? "కవులందు అనువాదకులు లేరా?" అందురా? లేరని మున్మాఱు తెలుపుదును. తర్జుమాపనిలో గట్టిచేయి పండితుడు. ఈపనిని కవిచే చేయించుటకు బ్రహ్మకైన తలముకాదు. అనువాదక్రియ అంధప్రక్రియ కావచ్చును. కవి చేబూనుఅనువాదము అనువాదము కాదు. స్వాతంత్ర్య సౌందర్యములతో తొలుకాడు వేఱురూపు. పండితుడైన అనువాదకుడు బానిస. కవియైన అనువాదకుడు ప్రియురాలు. హృదీశుడుచూపు అనురాగమును ప్రియురాలును చూపును. ఈముద్దియచూపు ప్రేమ ఆతనిప్రేమకు ఛాయాచిత్రము కాదు; అది గ్రుద్దిన అచ్చుకాదు; వేసిన వ్రేలుముద్రకాదు; ఆదేశించిన తర్జుమా కాదు—భావస్పర్శచే సుప్పొంగిన హృదినుండి వెడలు అనురాగాంకురములు అనువాదములు కావు. అందుండిపుట్టినవేయయ్యు, వీనికి సహజమైన చక్కందన ముండును. తిక్కనను చూడుడు. తన హృదయకవాటమును బిగించుకొని వ్యాసున కీత డూడిగము చేయలేదు. భారతమందు హైదీయై, వ్యాసుడను వార్డరు (Warder)ను జూచి 'చిత్త'మని, స్వాతంత్ర్యమునకు కత్తిరివేయనిచ్చి పుట్టలాగు తొడుగుకొనలేదు. ప్రభాకరునిచూచి, మధురగీతము పాడుచు కనకమరీచులందు రివ్వురివ్వున నెగయు విహంగమట్లు కృష్ణద్వైపాయనుని జూచి తిక్కన నృత్తగీతముల దేలినాడు. వ్యాసుడు దినమణియనుడు — తిక్కన సరోజమనుడు. మిహిరకాంతిని గ్రోలియేకదా కమలము సొగసుకత్తె యగును. పువ్వు నవ్వుదీపించునది దేనివలన? అర్కమరీచివలన కాదా? అగుటయు దీని కది అనువాద మందుమా? రవికాంతి నారగించిన కవి, తన కలమునుండి భాస్వద్భావరుచులను వెడలించె నని ఈతడు అనువాదకు డందురా? మనము గ్రోలు దుగ్ధము మనయందు రక్త మగుచున్నది. క్షీరమువలన రుధిరము జనించినను, ఇది దాని కనువాదమగునా? అగునందురేని, కవికథనమును అనువాదమనుడు. తిక్కనభారతమున దీపించునది తిక్కనకవిత్వమును, తిక్కనమహత్త్వమును గావా? కాళిదాసును తెలిగించుట కాళిదాసువంటికవికే సాధ్యము. "శాకుంతల"మందలి అద్భుతభావములను తీయని రసగుల్లలట్లు మఱిమఱి మురియుచు నారగించి, కాళిదాసుహృదయమం దీదులాడి, భావోద్రేకమందినవారే అచ్చట్టిదో అన్యులకు దెలుపజాలుదురు. ఈశక్తి ఆదర్శకవికి సహజమైనశక్తి. ఈశక్తియే అనువాదమునకు వేఱురూపును, వేఱుపేరును ఇచ్చును. ఆప్టె (Apte) మల్లినాథుల నాశ్రయించి కాళిదాసును గుర్తింపదలచువారు కవులు కారు. కవిశక్తి సహజమైనది, స్వతంత్రగమనిక కలది యని తెలుపుట నా ఆశయము. కవిత్వమున్నయెడ గవిత్వతత్త్వమును నుండును. తత్త్వమునకును కవిత్వమునకును అవినాభావసంబంధము కలదు. తత్త్వరహితమైన కవిత్వము జీవములేని కట్టె. కవిత్వమేలేనపుడు కవిత్వతత్త్వమెందుండివచ్చును? కవిత్వతత్త్వవిచార మెందుండివచ్చును?

కయితనుగుఱించి వెఱ్ఱిఅపోహలు చాలకాలమునుండి మన సీమలో తలసూపుచున్నవి. ఈ యపోహలే పెక్కుంద్రకు మేలుబంతులైనవి. గొడ్డువ్రాతలును, మోటుపాటలును ప్రబంధపు నాటి పుంతనుండి వ్రాలినవి. భావశూన్యమైన రచనము హృదయరహి-

తుడైన ఏలికయట్లు సాహితీవసుంధరయందు నిరంకుశత్వమును చలాయించుచున్నది. ఈదౌష్ట్యమును పోద్రోలుటకు నిశితవిమర్శనము లెన్నేని అనివార్యములై యున్నవి.

హృదయతంత్రులను మీటి మాధుర్యమును చిలుకువాడు కవి. మీన మేషములు లెక్కించి గుణకారములం దారితేటి, చెమ్మట లోడ్చి, పంక్తులు వ్రాయునాతడు భౌతికశాస్త్రజ్ఞు డేమోకాని కవి కాడు. భౌతికశాస్త్రజ్ఞుని యోచనాశక్తిని, కవిభావనాశక్తిని, ఈతని రసజ్ఞతను ఆతని పాండితిని, ఈతని ఉత్సాహమును ఆతని పరిశీలనా కౌశలమును తనవి కావించుకొనినవాడే విమర్శకుడు కాగలుగును. కవి కాలసంప్రదాయపరిజ్ఞానమును, కవిని గుర్తింపగల విజ్ఞానమును సద్విమర్శనమున కక్కరలైనవి. నేటి తెలుగువాఙ్మయమును దివ్వెబట్టి వెతకుడు. విమర్శనము బండిసున్న. బండమాటలును, కోర్టుల కెక్కించు ప్రలాపములును కొందఱను ప్రజాదృష్టిలోని కీడ్చినవి. రోత పుట్టించు ఈదృశదృశ్యములను రూపఱజేయునది సద్విమర్శనమే.

కవికులమును పెంపొందించువారు విమర్శకులు. వీరు లేని చోటులందు వాతూలము నెఱుగనిపుష్పమట్లు కవిత్వమహత్త్వము మూలబడి ముక్కిపోవలసినదే. కవివిమర్శకులు దంపతులవంటి వారు—వీ రొకరికొకరు దిక్కు. భావిసారస్వతసేవకులకు వీరు తలిదండ్రులు. ఆంగ్లవంగసాహిత్యములు నేడు గణుతికెక్కుటకు హేతువు కవితావిమర్శనములు చేతులు కలపుకొనినడచుటే. కనుల పండువొనరించు నిట్టిదృశ్యమును ఆంధ్రావనిలో కానము—కనదురు సాహిత్యమునూ కానము.

కేవలము విమర్శకుడేకాకున్నను, విమర్శకున కుండవలయు లక్షణములన్నింటిని గుండెయందు గుదియించుకొనిన ప్రజ్ఞాధురీణుడు కార్లైలు అని నా యభిప్రాయము. జాన్సన్ (Johnson), బర్న్స్ (Burns) ల నీతడు గుర్తించినట్లు ఇతరవిమర్శకులు గుర్తింపలేదు. క్రోకర్ విమర్శనమునకు కార్లైలుకలముపోటు కత్తిపోటాయెను. సాహిత్యసింధువున మునుగీత నేర్చినవాడై పెక్కండ్ర కవితాజీవితములనుండి ఈతడు రత్నము లేటి ప్రజల కొసగెను. గ్రంథమును, గ్రంథకర్తను విమర్శించుటలో ఇంచుమించుగ కార్లైలునకు సరిపోలుబుద్ధిశాలి శ్రీరామలింగారెడ్డి అని "కవిత్వతత్త్వవిచారము" నొక్కిచెప్పుచున్నది.

పండితుడనిన గ్రామఘోషని అర్థము చెప్పితిమేని రామలింగారెడ్డి పండితుడు కాడనవలెను. పెక్కుసంబారములను తనయందు నిల్వవేసికొని వానినే ఒరుల కందించు 'కొట్టుగది' పండితు డంటిమేని రామలింగారెడ్డి పండితుడు కాడని తెలుపుదును. భావమున్నను లేకున్నను, పదములందు జీవమున్నను లేకున్నను, పద్యములను దొరలించు డిల్లురచయితలు శాల్వలుదాల్చి చవుకబిరుదములను (కర్మధారయసమాసములు చల్లగనున్నంతకాల మీబిరుదులకు లోపములేదు) దగుల్చుకొని, ఎరుపుపింఛములెత్తి యాడుచు కవులమని కూయుచున్నారు కావున రామలింగారెడ్డి కవియుకాడని పలికెదను. నూది మొనలుపోలు చూడ్కుల నీతనియందు చొప్పించి, పరిశీలించితిమేని, కవిత్వపాండిత్యపటుత్వము దృగ్గోచరమై ఈత డాంధ్రుడని మనలను గర్వింపజేయును. గ్రంథమందలి నీరమును క్షీరమును వేఱుచేయగల మానసౌకము రామలింగారెడ్డి యని "కవిత్వతత్త్వవిచారము" జలదగంభీరస్వరమున దెలుపుచున్నది.

ఈ విమర్శకుడు స్వతంత్రబుద్ధి గలవాడు,—భళాభళి బ్రదుకీడ్చుట కిష్టపడని,—యంత్రమై పడియుండనొల్లని మనుష్యుడు. విమర్శనమునకు వలసినవి స్వాతంత్ర్యమును, నిష్పక్షపాతబుద్ధియును. అనురాగమునకుగాని ఆగ్రహమునకుగాని విమర్శనమందు తా వుండరాదు. ప్రియమైనదైనను, అప్రియమైనదైనను సత్యమును ముంగలబెట్టువాడే విమర్శకు డగును. చూపుగల కన్నుకలవాడు విమర్శించుట కర్హుడు. పింగళి సూరనార్యుని గుణదోషములను 'శభాస్' అను లీల నీవిమర్శకుడు చేరొక్కనినాడు. కవి నెదుటబెట్టుకొని చివాలున "దేవా!" యని ఇతడు నేల సాగిలపడలేదు. కవి సాక్షాత్కరించినంతనే "మహాప్రభో!" యని చెవులు నులుముకొని పిప్పిగంతు లిడువాడు భక్తాగ్రేసరు డగు కోతి కావచ్చును కాని విమర్శకుడు కాజాలడు. కవిమోమున తోచునది కళాయిపూతా? లేక కళామరీచికా? యని ఈవిమర్శకుడు తీక్ష్ణపరిశీలనము సలిపినాడు. కావుననే భావసంపదతో నిండురచనమునకు దారిసూపు గ్రంథరాజమైనది "కవిత్వతత్త్వవిచారము." ఇట్టిగ్రంథములు బహుళముగ గోచరించినగాని ఆంధ్రసాహిత్యమునకు ఉద్ధరణము లేదు. గ్రంథపఠనముతోబాటు గ్రంథవిమర్శనపఠనము ఆవశ్యకమైనదని ఆంగ్లసారస్వతసేవకులు గుర్తించినట్లే ఆంధ్రసాహిత్యోపాసకులును గుర్తింపవలెను. ఇందుల కనుకూలమైన వాతావరణమును పుట్టింపగలుగునది విశ్వకళాపరిషత్తు. ఈగ్రంథ మిపు డీపరిషత్తుచేతులం దుండుట సంతోషకరము.

అధునాతనసాహిత్యసంప్రదాయములను గుర్తించుటకు ఆంగ్లసాహితీపరిజ్ఞానము తప్పనిసరియైనది. రూపులందు వేఱుతీరులు కలవియయ్యు, ఆత్మలందు సాహిత్యములు భేదరహితములై యుండును. సారస్వతవృద్ధికై వలసిన జీవనసంచలనముగలదియై ఆంగ్లసాహిత్యము ఆత్మవికాసమందినది. మాతృభాషావాత్సల్యమున భూతలమున నెవ్వరికిని దీసిపోని వంగీయు లీవిషయమును గుర్తించి, ఆంగ్లసారస్వతసంప్రదాయముల కంజలెత్తి, చూచుచుండగ జువ్వవలె తాము లేచి, తమవాఙ్మయమునకు ఎనలేని సహాయులు తెచ్చిరి. మనకవులో—యీమహనీయులలో పల్వురు ఆంగ్లసాహితికి చండాలత్వమును ఆపాదించిరి; దానిని తాకక పునీతులమైతిమని వాకొనిన 'శతావధానుల' వ్రాతలను బయటబెట్టగలను. ఛాందసమనుడు, అభివృద్ధియెడల విముఖత్వమనుడు, ఈకవిశార్దూలముల వ్రాతలును, వీరిశిష్యుల వ్రాతలును భావవిభూతితోగాక, పిడకకచికతో నిండియున్నవి! ఆంగ్లసాహిత్యమం దారితేటి, అందు తానందినఆలోకమును, భాస్వంత

విజ్ఞానమును తల్లిమాటపై ప్రసరింపనెంచియే రామలింగారెడ్డి ఈ గ్రంథమును వ్రాసినట్లు తోచుచున్నది. విద్యార్థులమాటటుండ మన పండితప్రకాండులును, మన "కవిసార్వభౌములు"ను కోపఘూర్ణిత మనస్కులుకాక ఈ పుస్తకమును పఠించిరేని, కానితెరువులనుండి తరలి ఆంధ్రభాషకును, ఆంధ్రజాతికిని సముచితమగుసేవ సలిపి ప్రశ్నముగట్టుకొనినవారగుదురు. "కవిత్వతత్త్వవిచారము" ఇంతవఱకు మననేలయందు గుర్తింపబడలేదు. ఏవంగసీమయందో ఇది పుట్టియుండినచో, ఎల్లరప్రశంసలయందు నిది మధురమాల్యమై యుండెడిది. అధునాతనాంధ్రగ్రంథములలో నీగ్రంథము అగ్రగణ్యమైనది. పుస్తకముపుట్టి చాలకాలమైనను, ఇది ఇట్టిదని నిరూపించుటకు తగు తరుణము నేటికి నాకులభించుట నాభాగ్యము.

"కళాపూర్ణోదయప్రభావతీప్రద్యుమ్నముల"కే మనసిచ్చి గ్రంథకర్త ఈపుస్తకరచనమునకు దొరకొనెనని తలపజెల్లదు. ఈ రెండుకావ్యములకును గ్రంథమందు ప్రాశస్త్యముండుట నిక్కమే. కాని, గ్రంథమునకు వన్నెదెచ్చినవి ఆదర్శసాహితీలక్షణములను గుణించి విమర్శకుఁడిందందు విరియబోసిన బహుళసూత్రములని నాయభిప్రాయము. తర్కశాస్త్రనిబంధనల నెఱిగినదిట్టయై, అంగప్రత్యంగసౌష్ఠవముపై కన్నుకలశిల్పి కావున గ్రుడ్డియేటుగ గ్రంథకర్త కలమును సాగింపలేదు. పుస్తకమునకంతకు నీతఁడు తొలిప్రకరణమును పునాదిగానించినాఁడు. ఇది లేనిచో, కట్టుదిట్టము నెఱుఁగక గ్రంథము కూలబడవలసినదే. గ్రంథమునకు ఈ ప్రకరణము హృదయకోశమని నను అనవచ్చును. ఆయువుపట్టు చిన్నదే. అయినను ఇదిలేనిదే గ్రంథమునకు బ్రదుకేయుండదు. ఉత్తమసాహితీ నియమములేమో తొలుతదెలిపి, ఆకొలబద్దలను చేతులబూని ఈతఁడు ముందులకు సాగినాఁడు. సాహితి మనుష్యజీవనముపై దేలియాడు నురుగు కాదు. లోగలశక్తిని కనులెదుట బెట్టునదే ఉత్తమసాహిత్యము. మనశ్శాస్త్ర పరిజ్ఞానము లేనికవి గొడ్డుగేదెవలె అరువకలఁడుగాని అంతరంగ కుంజమునుండి మధురగీతికల నాలాపింపనేరఁడు. ఈ శాస్త్రమందలి అభిజ్ఞతను సందర్భశుద్ధికనుకూలమగులీల విమర్శకుఁడు సూపినాఁడు. రచనాతత్త్వము నెఱుఁగగాంక్షించువారికి ఈప్రకరణము అమూల్యమైనది. గ్రంథరచనయందు సిద్ధహస్తులు విషయపరిశీలన మొనరించి ప్రత్యేకములనుండి ప్రధానమైన సాధారణాంశమును కన్గొని, అమూల్యములై అనారతము చెల్లుసిద్ధాంతములను చదువరుల కనులెదుటబెట్టి, సత్యముతో తొలుకాడు మీగడతఱకను (Induction) తమవ్రాతలందు నింపుదురు. విమర్శకుఁడిట్టి కౌశలమును జూపెనని తెలుపుపుటలందందు కలవు. ఈపుటలను చదువుతటి 'ఇసీ!' అని ప్రతికూలాభిప్రాయములను వ్యక్తీకరించువారుందురు. ఉండుచో, వీరు సాహితీరుచి నెఱుఁగని పెద్దమ్మలనజెల్లును. ఈపుటలపై నౌత్సుక్యముతో దృష్టినిబద్ధమొనరింపగల రసజ్ఞులు "కవిత్వతత్త్వవిచారము" ఆంధ్రమున నద్వితీయగ్రంథమని ఒప్పుకొనకమానరు.

ఉత్తమసాహితీనియమములేమో తొలిప్రకరణమున నిందందు విమర్శకుఁడు విరజిమ్మినాఁడంటినిగదా! సాహితీహృది నెఱిగి, మాతృసేవ సలుపదలచినవారీవాక్కులను తనివారఁ జుఱ్ఱుదురుగాక.

"కృత్రిమములసయితము మూర్తీభవింపజేయువారే మహాకవులు...కేవలకల్పితములైనవానింగూడ సాక్షాత్కారముం దాల్చిన చేతనములం జేయంజూచునది కావున భావనాశక్తి నాటకకౌశలముతో ననుసంధించియుండును... భావనాశక్తి నుద్దీపింపఁజేయు ప్రకృతి భావతైక్ష్ణ్యము... మనుష్యులమనంబులలో నితరసంయోగముం దాల్చినప్రకృతులు మూఁడుగలవు (౧) ఆలోచనములు, (౨) భావములు (౩) సంకల్పములు (Psychology లో చేర్కొనబడు Thinking, Feeling and Willing లకు నీపదములు అనువాదములు). ఈమూఁడుశక్తులలో భావనాశక్తి నధికంబుగ విజృంభింపఁజేయునవి భావములు. ఏవృత్తాంతమునైనఁ జూచునట్లు వర్ణింపవలయునన్న దానియొక్క స్థితిగతులను అందలి పాత్రముల సుఖదుఃఖములను రోమరోమమునకును దానే మనఃపూర్వకముగ ననుభవించినందప్ప తద్రూపముగ నభినయింప నెవరికిని దరముగాదు...భావనాశక్తి సంఘటనోత్సాహము. ఇవి పరస్పరమిత్రములనుట విమర్శనశాస్త్రమునందలి యాదిమతత్త్వము. ఉద్రేకమేకదా కవితాశక్తికి ప్రాణాధారమైనకారణము. కథాంశము సాక్షాత్తుగ సమీపమున నడచినట్లు భావనాశక్తి బలంబుచే స్ఫురించెనేని దూరపుసంబంధముగల బలాత్కృతాలంకారములకు తావుండదు. అలంకారములు ప్రయత్నములేకయ వచ్చినంత సహజముగ నుండుట వానింగూర్చిన ముఖ్యపద్ధతి. భావములు మహోజ్జ్వలములుగ రేగునపుడు ప్రకృతమునందే యవధానము నింపుట మంచిది. విషయముచే రసము తప్పక కలుగుననుట తప్పు...కవియైనవాఁడు తనభావముప్రకారము వ్రాయవలయును; భావముప్రకారము వ్రాసినవారందఱు కవులు కారు...ఉత్కృష్టమైన భావములేని నీరసమానసులు కవిత్వము జేయఁబూనుట వారియొక్కయేకాదు మనయొక్కయు దురదృష్టము. కట్టెవారిన కోవిదులకన్న లోకవాసనల ననుభవించి యానందించువారు మేలు...ఏవిధమైన పదములచేరికయు లేని యాలోచనలఁ జేయుట సాధ్యము కాదు. (ఇది Logic, Psychology లలోనుండి ఎత్తబడినముక్క)...భావపుష్టిలేని పదపుష్టికి బడాయిశైలి యని పేరు. పసిపిల్లలేగాని దీటులెవరును దీని నొకయెత్తుగ బాటింపరు...ఒకరు సృజించినశైలి, విషయము, రీతి ఇత్యాదిబింబములకు ప్రతిబింబములరచింపఁజూచుట మంచిదిగాదు...ప్రాణము అనుగుణము లేనిపాత్రములు రిత్తలు...వర్ణనములకన్న ముఖ్యమైనవిషయమేదనగా కావ్యమునందలి యంగాంగములకుం గల కలయిక...పొత్తుపొసగనివర్ణనలు రసమునకుం బ్రతికూలములు...చెలువంపుఁదనమునకు జీవనమైన లక్షణము అంగములసాంగత్యము...కడయునునిండుటాకృతిని దీర్పఁజాలని కవియంగములనంటి వర్ణనములఁ దీర్పనేర్చు నను పిచ్చికూత.

కథయొక్క గమనమునకు విరోధమైన దీర్ఘవర్ణనముం జేయుట రసవిహీనభావమున కొకగుఱుతు. వస్తువుల నిజస్థితి నిర్దేశించుట శాస్త్రముల యీాప్సితము. కళలయొక్క కాంక్ష యది కాదు. ఎట్లన కళలలో ప్రధానమైనపురుషార్థము రసము. రసము భావమునకు సంబంధించినది. భావములపరమైనదృష్టితో గణించి వర్ణించుటయే కళయందు శ్లాఘనీయమైనపద్ధతి ...భావముతో జూచుటకును, భావములేక చూచుటకును నెంతో భేదము. భావముయొక్క దృష్టికిని ఆలోచనాశక్తియొక్క దృష్టికిని ముఖ్యమైనభేద మేమనగా: యోజనాశక్తిం బట్టి నిరూపించితిమేని, సత్య మొక్కటియే. అనఁగా సిద్ధాంతీకరింపబడిన తత్త్వము సర్వజనులచే సరియని యొప్పుకొనఁబడియే తీరవలయును... గోచరములయెడ భిన్నభావములున్న నది ప్రకృతి విరుద్ధమని యెవరు జెప్పరు... శాస్త్రములలో నేకకంఠముగ నెల్లరును ఇదిసత్యము తక్కినవి మిథ్యలు అని స్థిరీకరించినట్లు కళలలోఁ జేయఁజూచిన రసాభాసము నిత్యము...ఒకేవస్తువు మానవులప్రకృతులం బట్టి యనేకులకు ననేకభావముల కాస్పదము గావచ్చును. మఱియు భావములం బట్టి కొంతవఱకును రూప మేర్పడునుగాన ననేకరూపములం దాల్చినదియు నగును...నానారూపములం జెందియుండుట యొక్క భగవంతునకే చెల్లినభాగ్యము గాదు. అతనిసంతతివారము గాన మనకును నందు భాగము గలదు. ...భావంబులు ప్రసిద్ధిగనుండు నీలోకములో నానావతారసిద్ధియు, విశ్వరూపప్రదర్శనశక్తియు సర్వవస్తువులకు సామాన్యములు, సహజములు నైనలక్షణములు... ఆలోచనశక్తిచే నుత్పాదములైన శాస్త్రములయొక్కయు, భావబంధురములైన శిల్పములయొక్కయు దృష్టులు వేఱు. గోచరించుపదార్థములతీరులును వేఱు. కావుననే శిల్పములు రచించుటలో స్వప్రతిభప్రకారము పోవలయును... కళలలో సుపజ్ఞ లేనిది సారస్యముండదు ...భావముల ననుసరించి యాకృతులు వివిధభంగులఁదోఁచుననుట స్ఫుటముగదా! అనగా శిల్పులచే నారాధింపబడుసిద్ధి యేదన నున్నదియున్నట్టు ప్రదర్శించుట గాదు. మఱి కన్నది కన్నట్టు ప్రదర్శించుట. ఉన్నదియున్నట్టు అనగా వస్తుస్వభావ మేర్పడియున్నభంగి యనుట. ఇక కన్నది కన్నట్టన్నచో మనభావముచే దాని స్వభావము చెందినవికారములప్రకారము అనుట. అనగా నిరవధికస్థితి గాదు. మఱి భావమున అవధిచే నిర్ధారితమైనస్థితి ...ఏభావము మనస్సున నుచ్చస్థానమునధిష్ఠించియుండునో యాభావమునకు సమ్మతములు, రుచికరములు, చింత్యములు నైనగుణములుమాత్రము మిక్కిలి ప్రకాశమానములుగ నగపడును. తక్కినవి మసఁరుగ్రమ్మినట్లు వెనుకబడినవో యనుగతి, దూరస్థములైనవా యనుమాడ్కి స్ఫుటములుగా నుండవు. మఱి మాసువాఱినయవిగానో, ఆసమయమున నేమాత్ర మెఱుకకురానివిగానో యుండును తొలిభావముపోయి వేఱొకభావము మనస్సు నాక్రమించెనేని మునుపు తేజోవంతములుగా నుండినభాగము లంతర్ధానమై, యప్పుడు గ్రహణము సోకినట్లు మఱుగుపడియుండిన భాగములు ప్రజ్వలితమైన యుదయముం దాల్చునవి యగును. భావముల ప్రసిద్ధి ననుసరించి విశేషముం దాల్చిన గుణముల నధికముగను, సంక్షేపము బూనినవానిని కొలదిగను వర్ణించి, నిక్షిప్తములైనవానిం జేర్కొనక విడుచుటయ కళకు శోభ... భావములను వికాసమునకుం దెచ్చుట కవిపని. గద్యమైననుసరే పద్యమైననుసరే, కావ్యముల వర్ణింపదగినవి భావోదయముచే ప్రకాశమునకు వచ్చువస్తువుల కొన్నికొన్ని రేఖలు, కళలు, పక్షములు మాత్రమే. భావములన్నియు నేకకాలమున నుజ్జ్వలములు గావు. కావున నన్నిలక్షణములును ఏక్షణముననైన భావపరమైన చింతతో జూచువారికి గానబడవు...కళలయందు సర్వపదార్థములకును పార్శ్వగ్రహణము నిత్యము. అట్లగుట ప్రత్యక్షమైనరేఖలమాత్రము వివరించుట భావస్వభావములు రెంటికి ననుగుణమైనరీతి. తక్కినవర్ణనములు మనుష్యస్వభావములకు విరుద్ధములు. రసమునకు నాభాసకరములు—కవితయొక్కరూపు నెఱుంగగోరిన మనసుయొక్క రూపము నెఱుంగవలయును...కళారచనలో గమనింపవలసినవిషయ మేమన రసాభాసమేమాత్రము గలుగనంతవఱకు యున్నదా లేదా యనుట. విషయము ప్రకృత్యతీతమైననేమి, ప్రకృత్యధీనమైననేమి? విషయముకన్న రీతి శిల్పములం బ్రధానము. ఎంతో శిల్పనైపుణ్యము లేనిది కృత్రిమములు నిక్కములట్లు భ్రమగొల్పజాలవు...భావనాశక్తి యనేకమాయలం బన్నులీలావినోదిని. ఈమాయలకన్నింటికి సామాన్యలక్షణ మొక్కటియే...ఏరసము నుత్పాదింపజూచునో దానిని కవియే మనఃపూర్ణముగ దాల్చినగాని చదువరులయందు అభిమతమగు చిత్తవిభ్రమము గలుగనేరదు. భావముల నంతములు నగాధములుగా ప్రభవిల్లిన గవియు నమోఘుడగును...శైలి భావప్రకాశకము. శైలి, భావము ఇవి వియోగములేని ద్వంద్వంబులు...కన్నులగట్టినట్లు కలగాంచినరూపము ముందు నిల్చినట్లు చేయుట కవితాలక్షణము. ఈ మహేంద్రజాలకౌశల్యమున కాధారమైన గుణము భావనాశక్తి. విషయముల మనసులో ప్రతిబింబించునట్లు చేయుసామర్థ్యము భావనాశక్తి. ఒక్క ప్రతిబింబించుటయే యననేల, ప్రత్యక్షముగ నవతారమెత్తునట్లు చేయుట." రూపము కన్నులగట్టినట్లు చేయుటందు ఆంగ్లకవి టెన్నిసన్ మిగుల నారితేఱియుండెను. ఈతనిశబ్దములు మానసయవనికపై విద్యుత్వేగమున నద్భుతరూపములను తళుక్కొత్తించును.

విమర్శకుడు గ్రంథమందు విరియబోసిన కవితాసూత్రములను, ఆధారతత్త్వములను, ఆదర్శసాహితీలక్షణములనుకూడ గమనింపుడు. "సామ్యశక్తి భావనాశక్తివలె గవితకు ప్రాణంబు గాకపోయినను, సమర్థ్యముళైన శక్తులలో నొక్కండు (పుట ౭౦) కళలయందు రెండుగుణములు జూపించవచ్చును. సుఖము, చమత్కారము. శిల్పముయొక్క యభిమతము సుఖముగాని చమత్కారముగాదని వేఱచెప్పనేల? (పుట ౭౦) కేవలచిత్రకవిత్వము భావతోజేయు కుస్తీవంటిది.



సెంటుథామస్ మౌంటు, మదరాసు J. K. C.



సెంటుథామసుమౌంటులోని పోర్చుగీసు చర్చి J. K. C.

(పుట ౬౦) 'సర్వజనవేద్యములగు సామాన్యములైన ఈ సంగతులు పదములు ఇత్యాదిసామగ్రుల గొని యెంతయాహ్లాదకరమైన కృతిగా గూర్చినాడు! మనకు నాపదములు తెలియుగదా! సంగతులును దెలియునుగదా! తెలిసి యేమికట్టుకొంటిమి' అను చింతను విస్మయమును గలిగించునది నిజమైనకవిత (పుట ౬౧) భావనాశక్తి స్వచ్ఛంద ప్రచారములలో నొకటి. అట్లగుట దానిని సమగ్రముగ దాల్చిన కవులకు నది యొక గొప్పవరముగా దోపదేమో! కావుననేకదా మహాకవులును శిల్పులును హనుమంతునివలె దమ యౌన్నత్యమును దామెఱుంగకుండుట!" (పుట ౭౨) మొదటినుండియే యీయీరసములు తప్పకయిచ్చెదు దానిని గల్పించెదను అని సంకల్పించుకొని పిమ్మట దానియుత్పత్తిజేయజూచుట మేలా?...భావనాశక్తి కారణశక్తియొక్క సేవనమునకు నిల్చిన మహత్తుగాదు. మఱి స్వైరిణి. గుఱ్ఱముల నడిపినట్లు గతివేగముగుదించి త్రిప్పి కొంతకుగొంత వశ్యము చేసికొననగుగాని, యపరిమితముగా దాని స్వేచ్ఛావిహారమును నివారించితిమేని అది చెడును. పరిశ్రమము తగినంతలేమి మందమగును. కృశించి నశించినను నశించునేమో! సకలలక్షణలక్షితములు ఐహిక సంప్రదాయములప్రకారము నిర్లక్ష్యములు. నిర్లక్ష్యములుగాకున్నను నిర్దోషములు గావు. (పుట ౭౫) కవిత్వము భవ్యంబగుటకు భావము, భాష రెండును గలసి మెఱయవలయుట నిత్యసమయము. (పుట ౭౭) నేరుగా కవియే కథలో మాటాడుట కథయందు మనకుండవలయు నవధానమునకును, దానిచే గలుగు మైమఱపునకునకును విచ్ఛేద హేతువు. ...కవిబోధనలు సైతము పాత్రములమూలమున బ్రచురించుట నాటకసందర్భమునకు బోషకము... కావ్యమనునది జగత్తురీతి నుండవలయును. ఎట్లన, జగంబు మనయెదుర నున్నది. దానిమీద దృష్టి చెదరకుండుటకోయన జగత్కర్త యదృశ్యభావు డయియున్నాడు. కావ్యమును జదివి యానందించుచు గవిని మఱచితిమేని యది కృతఘ్నతయేమోగాని, యదియే కవియొక్క కృతార్థతకు గుఱుతు. మఱియు పాత్రలనుఱుగుననుండి వారిచే జెప్పించిన దనకు గర్వము. ఆత్మస్తుతి మొదలగు నేరములు మోపబడవు. (పుట ౮౦) కావ్యము శిల్పము, నీతిశాస్త్రముగాదు. ధర్మశాస్త్రము గాదు. శిల్పముయొక్క యుత్కర్షనికర్షముల నేర్పఱుపవలయునన్న దాని రచనాసంవిధానములబట్టి నిరూపింపనగునేగాని 'భగవద్గీతల యంత పారిశుభ్ర్య మిందులో లేదు. రామానుజభాష్యమువలె ముక్తిదాయకముగాదు' అని వాపోవుట నిర్నిమిత్తప్రలాపము. రసభంగమా కాదా యనుటయే శిల్పవిమర్శనముయొక్క ఒక్కపరీక్ష...శిల్పముయొక్క ముఖ్యోద్దేశము మనసును హరించుట (పుట ౧౧౬) కవి బహుచమత్కారముగ మాటమీద మాటవచ్చి విషయము విశదమగునట్లు సంభాషణ లేర్పఱచును. నాటకకౌశలమని పేర్కొనబడినప్రతిభలో నిదియొక కళ. (పుట ౧౨౧) మాటమీదుగా మాటవచ్చిననే యందము. బడిపంతులవలె అరగంట వ్యాఖ్యానము జేసిన నాటకసరణి చెడును. (పుట ౧౩౨) అత్యుక్తియుండిన శుద్ధముగ నసాధ్యమని తోపగూడదు. మఱి యపురూపములైనను భావ్యములుగ నున్న స్వారస్య మెక్కువ. (పుట ౧౩౩) స్వభావమును మఱపింప జేయునట్టి శిల్పము శిల్పముగాని యన్యము కృత్రిమము. ప్రకృతి ననుసరింపనిచో గళకు సత్యమురాదు. మఱి యనుసరించుటదప్ప నింకే విశేషము లేకున్న సత్యమున్నను సొగసుండదు. అనుసరించినట్లే పోవుచు గ్రమక్రమముగ మీఱిమెఱయుట కళాసామ్రాజ్యము. ఒకానొకరు చెప్పినరీతి ప్రకృతి యాకారము. ఆయాకారమును చక్కగా నలంకరించి మెఱుగుపెట్టినరీతిని తగినవిషయముల సంగతిని బొదిగి సజీవమై లేచివచ్చునట్లు చేసిన నయ్యది కళ. (పుట ౧౪౫) కావ్యములయందు దత్త్వముగాదు ప్రధానము; మఱి రసము. అట్లగుట మొత్తముమీద గాలక్రమమును విసర్జించిన బాగు. (పుట ౧౫౫) ముఖ్యాంశములను, వానితో గాఢమగు చెలిమిజెందిన విషయములనుమాత్రము ప్రచురించిన రసము సాంద్రముగ నుండును. లేనియెడ బానెడు నీళ్లలో వైచిన గచ్చకాయంత బెల్లమువలె నది హీనమగును. (పుట ౧౫౬) కవిబ్రహ్మ లిడిన యారగింపుతో రక్తిపూర్తియై యంత మొందదు. మఱి యారగింపనారగింప నింకను గావలయునను స్పృహ ప్రజ్వరిల్లును. ఆత్మకేళియందు విరతి కాస్పదమైన రతి యెక్కడిది? (పుట ౧౫౮) కావ్యములలో నేకీభావమనబడు గుణముండవలయును. అనగా నొకపట్టున నొకగ్రుక్కగా సర్వము గ్రోలమేని దనివినీయమి భాగభాగముగా జదువబోయిన దృప్తిలేదు. ఏలన సమాప్తివఱకు నేభాగము నఖండముగా దెలియబడమిచే. (పుట ౧౬౫) మనల నేకాగ్రావధానులం బరవశచిత్తులం జేయుటకంటె శిల్పసౌభాగ్య మెయ్యది? కల్పనయనగా నిట్లుండునదే కల్పన. ఊపిరియాడకుండునంత యుద్వేగముం గల్గించునది (పుట ౧౬౭)కవియే నేరుగ వర్ణించునట్లు వ్రాయుట యొకదోషము... కార్యమున నేయేపాత్రములు వచ్చునో వానినిమాత్ర ముచితస్థలముల వర్ణింపవలయునేగాని, కథారంభమున నిష్ప్రయోజనవర్ణనములం జేయుట యసంగతి యనువికారము. (పుట ౧౬౮) కథాంగము లేక భావముం దాల్చి యొకశరీరముగా నేర్పడియున్న గళకు ప్రాశస్త్యము. (పుట ౧౭౦) లోకములో నదృష్టములు, నిర్హేతుకములు నైన యాకస్మికములు లేకపోలేదుగాని, పదేపదే వలసినచోట్లనెల్ల గాకతాళీయన్యాయముల నాశ్రయించుట కల్పనకు మిక్కిలిగొఱంత. కామరూపములు, దివ్యదృష్టి ఇత్యాదులు అన్నికష్టములకు ననుకూలించు సాధనములు గాన బ్రశస్తములుగావు. (పుట ౧౭౩) కథలో నాయకుండొనర్చు కృత్యములచే నతని శీలము తెఱంగు మనకు బోధయగునట్లొనర్పనగునుగాని, ప్రత్యేకముగ ధర్మములజాబితా నొకటి వ్రాసి, యతనిమెడగట్టిన గవియొక్క బుద్ధిలేమిదక్క నింకేద్దియు దెల్లంబు గాదు. అనేకకార్యములతో నిండినట్లు కథం గల్పింపలేనివారికి జాబితాపద్ధతియే గతి. దుర్గతి (పుట ౧౭౫) ప్రదర్శింపబడు కార్య

జాలములతో సంబంధములేని గుణముల వర్ణించుట పనికిమాలిన పెత్తనము. సంబంధముగల గుణములమాత్రము వర్ణించుట కర్తవ్యమేని కార్యసంబంధములచే నవి యొకరు చెప్పక చూపకయ తమంత దేటపడవా? (పుట ౧౯౬)...పాత్రములమూలమున జేయంబడిన గథ నెఱ్ఱిలువాఱని యైక్యమును వహించి స్వారస్యముగ నుండును. మాట మాటకును గథ పెరుగునట్లు చేయుట ప్రజ్ఞ. (పుట ౧౯౯) ఐక్యమును కథాలక్షణమును బరీక్షించుపద్ధతియేదనగా, ఉన్నభాగముల దీసివేయవచ్చునా, క్రొత్తవి యేవైన జేరవచ్చునా యని విమర్శించుట. ఈ కార్యములు పొసగనివైన నైక్యము స్ఫుటము, సాధ్యములైన నైక్యభావ మపక్వము. (పుట ౧౫౧) శృంగారమును నాయికానాయకుల చిత్తప్రకృతుల ననుసరించి యనేకరీతుల నుండును. (పుట ౨౧౨) శృంగారము శాస్త్రప్రకారముగా దీర్పబడు విగ్రహము గాదు. (పుట ౨౧౩) శృంగారమునకు శుచిత్వమునకును బరస్పరశత్రుత్వ మాపాదింప జెల్లదు. (పుట ౨౩౦) పూర్ణోపమలకన్న లుప్తోపమలు రసవత్తరములు, భావానుకూల్యములు (పుట ౨౩౯)... కవిచూపించిన పోబడింబట్టి యింకను గొన్నిసామ్యములను మనమే యేర్పఱుచుకొనుటకు నవకాశముండుటచే బుద్ధికి బనులును, దాన జొఱవయు గలుగును. ప్రతిపదటీకగా బాకీ యేమాత్రములేక యంతయు విశదపఱచిన మన మనఃపరిశ్రమకు వీలుండదు. కొంతవడికి మాంద్యము విసుగును జనించును...సమష్టిగా వ్రాయుట నిఘంటుకారులపని. వ్యక్తి నొకదాని హృదయమున సాక్షాత్కరింప జేయుట కవి యొక్క ముఖ్యోద్యమములలో నొండు. ఇది చేయంజాలనివాడు పండితుడు గావచ్చునేగాని కవి గానేరడు. తన మనసులో నేదేనొక యాకృతిని చక్కగ నేర్పఱచి, పదముల మూలముగ దానిని రసికులకు వ్యక్తపఱిచిన నదియ కవిత్వము. నదిని వర్ణించిన నన్నినదులకుం జెందినతీరున జేయుట కళగాదు. మఱి యేదే నొక్క తెఱంగగునది దోపవలయు. అట్లే సరస్సులు మొదలగు ప్రకృతిమూర్తులంగూర్చియు.పాత్రములవర్ణించునపుడును ఈతత్త్వము నేమాత్రము మఱవరాదు. (పుట ౨౩౬) కవులువర్ణించిన ప్రకృతులు, పాత్రములు సత్కృప్తములాయని శోధించుట కొకయుపాయమున్నది. ఏదన, ఆవర్ణనల జదువుటచే చిత్రకారుడు విస్పష్టము, అనన్యము నైన ప్రతిమను వ్రాయగలడాయని వితర్కించుట. (పుట ౨౩౬) జగత్ప్రధానసందర్భంబుల బ్రకృతియు మనుష్యమాత్రుల రీతిని సుఖదుఃఖాదివికారములందాల్చిన నట్లుత్ప్రేక్షించుట సమంజసముగాని, చీమకు దోమకు నాసియైన నాయికానాయకుల పాటులంగూర్చి లక్షించునదిగా వర్ణించుట గాంభీర్యమునకు గొఱత. వస్తువులకాలందులు గణింపక వర్ణించిన నగుబాట్లగును (పుట ౨౪౫) కలయికలేని రసముల గలుపజూచిన నరుచి. పాలలో చక్కరవేసిన నిర్దోషము. ఉప్పువేసినచో! (పుట ౩౨౧) భావనాశక్తిచే ననర్గళముగ ప్రభవిల్లు భాగములయొక్క చక్కందనము పాండిత్యబలంబుమై నేర్పడినవానికి రావు. (పుట ౩౨౨) రసములలో శోకము నొక్కటి. ఇదిమాత్రము నిషేధ్యమననేల? శోకప్రధానముగా వ్రాసిన గవిత్వము మొక్కపోవునా?" (పుట ౨౮౬)

గ్రంథకర్త సాహితీవిమర్శనము (కొలదిమాత్రపు లోపములను గలదియయ్యు) అద్భుతమైనది. పుస్తకమునకు గొప్పందనమిచ్చిన దీభాగమే. తన విమర్శనమున నొకసందర్భమున గ్రంథకర్త "పాత్రములచరిత్రములు శుద్ధముగ మంచివిగనో శుద్ధముగ జెడ్డవిగనో యుండునట్లు దీర్చుటశిల్పదోషములలో నొకటి. ఏలోపమును లేని స్త్రీపురుషు లుండరు. మఱి కేవలము దుష్టులైన మానవులును గంటికి గానరారు" అని తెలిపెను. ఈనుడువులందు కొంత సత్య మున్నది—కాని, యివి సంపూర్ణసత్యములని ఊహింపరాదు. వీనిని ప్రతిఘటించు సంఘటనములు ప్రత్యక్షప్రపంచమందును, సాహితీ ప్రపంచమందునుకూడ కలవు. ఆంధ్రసాహిత్యమున విమర్శకునకు ప్రియముగూర్చుగ్రంథము మహాభారతము. ఆంగ్లసాహితీచక్రవర్తి షేక్స్పియరు ఈతనికి మిగులగూర్చు శిల్పి* భారతమండలి సుప్రసిద్ధపాత్ర యుధిష్ఠిరుడు పొకడలు కావలయునన్న, మన మింగ్లీషునుండి తొలగరాదు. సత్తువగలసూత్రముల నభివర్ణించునపుడు, దృష్టాంతములుగా సూచింపబడిన కథాంశము లెల్లఱకును సమగ్రముగ నవగాహనముకాకున్నను, సూత్రవివరణమువల్లను, వ్యాససందర్భమువలనను ఉదాహృతకథాహృదయము వారికనులెదుట విప్పారియుండును. బట్టబయలుగగాక కావ్యోచితరీతి నీదృష్టాంతములు గ్రహణసాధ్యములై యుండును. ఆంగ్లకవుల వ్రాతలను తెలిగించి, తదుపరి ఇట్టిదృష్టాంతములను తీయవలెననిన, తెలుగునటుంచి ఎంతోకాలము తెలుగులు (సమగ్రఆంగ్లసాహిత్యముమాట దేవుడెఱుగును) ఈచదువునకై వెచ్చముచేయవలెను. ఈకాలముతీరినను, ఆంగ్లసాహిత్యాంశములన్నియు వీరి నఖదర్పణములం దుండజాలుననుట విచార్యము. ఈ కాలహరణము భాషాభివృద్ధికి అడ్డుగట్టు. ఆంగ్లదృష్టాంతములనుచూచి ఉలికిపడక

* ఆంధ్రవ్యాసములను వ్రాయుతఱి ఆంగ్లసాహిత్యాంశములను గుఱించిన ఘోష యేలయని కొంద ఱందురు. ఉత్తమసాహితీసూత్రములను ఉల్లేఖించుపట్ల అన్యభాషలనుండి ఉచితమైన ఉదాహరణములను పేర్కొనుట అనుచితముకాదని నాతలంపు. ఆదర్శసాహితీలక్షణములను జూపు గ్రంథములు మనతెలుగున లేనేలేవు. ఈలక్షణములను విమర్శించునపుడు అక్కరైన ఉదాహరణములను తెలుగునందు నెమకినెమకి మనము నిట్టూర్పులు విడువవలయును. వీనికై సంస్కృతమును, ఆంగ్లమును బట్టవలెను. మనవారిలో సంస్కృతము నేర్చినవారికంటె ఆంగ్లమందారితేరినవారే అధికముగానున్నారు. ఆంగ్లమువెస గఱ్ఱియెత్తు హేతువాదము సంస్కృతముపట్ల మఱింతతీవ్రమై యుండును. సంస్కృతసాహితి మహత్తరమైనదే అయినను, అది నేటిదికాదు. వాఙ్మయప్రపంచమున క్రొత్త

ఏలోపములేని పురుషుడనజెల్లును. 'ఒకమాటితడు అనృతముచెప్ప లేదా' అని యందురేమో! అబద్ధమాడినవాడు ధర్మజుడుకాడు—ఈతనినోరు ఎరుపుదీసికొనిన శ్రీకృష్ణుడు అప్పుడైనను, యుధిష్ఠిరుని గుండెలు తటతట గొట్టుకొనలేదా? అంతయు ముగిసినపిదప విజయుండ నైతినని ఆతడు ఎగిరిగంతువేసెనా? ఆ యనృతమునకై ఎంత ఆరాటపడలేదు?—షేక్స్పియరు చిత్రించిన డెస్డిమోనా అయాగోపాత్రలను విలోకింపుడు. సూర్యునకైన నల్లమచ్చ లున్నవి కాని డెస్డిమోనాచరిత్రకు లేవు. తుదిసీనులోకూడ,—పెనిమిటికనుల నుండియు, నోటినుండియు అగ్నికణములు పిడుగునెరసులట్లు తలపై రాలునప్పుడుకూడ కేషియోయెడల నీమెచూపిన కరుణ ఈమె అమాయకత్వమును, కుసుమదళసదృశమైన ఈమెహృదయనైర్మల్యమును వ్యక్తీకరించెను. హంతకుడైన భర్తకు భక్తిపుష్పాంజలి యొసగుచు, తన యసువుల నామె ఆతని కప్పనమొనరించుతఱి, విశాలభావబంధురమైన వియత్తలముకూడ భయదమును, పునీతమునుగూడ నైన ఆయాగారమునెట్లో ప్రవేశించి, ఆపెచరణములమ్రోల మోకరించలేదా? ఇక నయాగోను పరికింపుడు. ఇతడు ఊహాప్రపంచమున గ్రిమ్మరు మెఫిస్టఫలీస్ (Vide : Goethe's "Fawst") కాడు; రాబరును (Vide . Schiller's "Robber") గాడు. ప్రత్యక్షప్రపంచమందు మనియుండి, తనసంతును తామరతంపరజేసిన మనుజుడు. ఇతడు సంపూర్ణదుష్టుడు కాడని విమర్శకుడు తెలుపగలడా? దుర్మతియైన గ్లస్టరునకు (Vide : Richard III) అంతరాత్మయనున దొకటి కలదని షేక్స్పియరు సూచించినాడు (Vide: Gloucester's Soliloquies). ఇక నయాగోకో! — ఈపిశాచమును చూచి, పిశాచములు పటాపంచలుకాలేదా? యముడును, గిముడును తోక ముడుచుకొని తుఱ్ఱుమనలేదా? "అమ్మో!" అని యమలోకమెందో ఎగసిపోలేదా?

"విషయము ప్రధానమైనది గద్యము. రసప్రధానము పద్యము" అని గ్రంథకర్త తెలిపెను. ఇది సారస్వతసేవకు లెఱిగిన సాధారణాంశమే. ఇందును సమగ్రమైన సత్యములేదు. గద్యయనుడు, పద్యమనుడు లేఖకుని హృదయమునుబట్టియుండును. రసరహితుని పద్యము చొప్పదంటుగను, రససహితుని గద్యము చెఱకుగడగను నుండు టెఱుగుదుము. షెల్లీ, మిల్టన్, బర్క్, రవీంద్రసరోజినుల వచనరచనము రసబంధురమైయుండును. నీరసపద్యములను వెతకుటకు తెలుగునేలనుండి మన మెందో అరుగనక్కఱలేదు. విషయము ననుసరించి పొంగుభావములు రచనరీతిని నిర్ధారణమొనరించుట మనకు తెల్లము.

"రాగాదుల విజృంభణములేనిది భావనాశక్తి యడర నేర్చునా? (పుట ౯౩)......శమదమాదిసత్త్వగుణములు పట్టువడిన యెడల కైవల్యప్రాప్తి యెట్లోగాని కవితాప్రాప్తి నిండుసున్న. రాజసతామసగుణములు కవితయనుమందాకినీమనోహరప్రవాహమునకు జన్మస్థానములైన మహోన్నతభావములు (పుట ౪౫ Foot-note) ......మగవారిచే గర్హింపబడు పేడివారితెగకు జేరిన మన వేదాంతులు (పుట ౧౩)"

వేదాంతమునుగుఱించియు, సత్త్వగుణమునుగుఱించియు విమర్శకునకు వెఱ్ఱివెఱ్ఱిఅపోహలు కలవు. 'వేదాంతము' కావ్యమందు గూడదనియు సత్త్వగుణము యోగికిగాని కవికిగాదనియు ఈతడు వాదించును. పంచభూతములట్లు సత్త్వరజస్తమోగుణములు అవినాభావసంబంధముకలవి. వీనియందు హెచ్చుతగ్గు లుండును. మహాత్ములందు రాజసతామసగుణములు సత్త్వగుణమునకు లొంగియుండును.—"నిస్త్రైగుణ్యో భవార్జున" (భగవద్గీత; అ ౩; శ్లో ౪౫) అను నాశయము ఆరితేఱిన నిర్గుణోపాసకునకే సాధ్యము. సత్త్వగుణమును అణచియుంచి, రాజసతామసగుణములకు పట్టాభిషేకముచేయు నాతడు కవియగునో కాడో ఎఱుగనుగాని దారులుగొట్టు కిరాతుడగుటతథ్యము. దారులుగొట్టు కిరాతుడు సత్త్వగుణము నలవఱచికొనియే రామాయణమును వ్రాసెను. వ్యాసుడు సత్త్వగుణమును పోద్రోలియే మహాకావ్యమును వ్రాసెనా? వ్యాసవాల్మీకులు "ఇనుపకచ్చడాల్ కట్టు మునిమ్రుచ్చులై" తమ యుద్గ్రంథములను వ్రాసిరా, నిలింపారాధ్యులై అట్లొనర్చిరా? "భావాంబరవీధి" యందైనను కవి విచ్చలవిడిగ నెగిరి నేలబడి శిథిలకాయుడు కాడు. ఈతనికి స్వేచ్ఛ కలదు—ఈస్వేచ్ఛ హద్దుపద్దులెఱుగని గంతులాటకాదు. రాజసతామసముల ఒడుదొడుకునడకను కళాయుక్తనృత్యము సేయునది సత్త్వగుణము. కావ్యమునకు మహత్త్వగభీరత్వముల నొసగునది సత్త్వగుణమని నాతలంపు.

"అరణ్యరోదనమట! దానికంటె దిక్కులేనిది కావ్యములలో వేదాంతరోదన! ఆధర్మరాజు శుద్ధముగ వదరుబోతు! ఋషులను జూచినదే దండముబెట్టి దూరముగా దననీడయైన వారికి సోకనట్లు తొలగిపోవుచుండిన నెంతపుణ్యముగా నుండును! కాలక్షేపార్థము అడిగినప్రశ్నలే యడుగుచు, నుత్తరము లెంతవిరుద్ధములుగనున్నను గంగిరెద్దురీతి దలయూచుచు నాయన సల్లాపములు సలిపె! మన కవి ప్రలాపములు!" (పుట ౧౪౧) అని విమర్శకుడు సెలవిచ్చినాడు. ఇది "కావ్యశోభ నాపాదించు దుర్వ్యుత్పత్తి" యట; "రసికులపాపఫల" మట, "వైరస్యములేని కావ్య

తొలినుండియు వంగీయులు వానిని విరివిగానే ఉపయోగించుచున్నారు. ఉదాహృతాంశములు సాధారణముగ ప్రసిద్ధికెక్కినవిగనే యుండును. వానినెఱిగినవా కవి నిండుపువ్వులై యుండును. ఎఱుగనివారికి సందర్భశుద్ధింబట్టి మొగ్గలై యుండును. కొందఱికి నిండు మేలును, మఱికొందఱికి కొంతమేలును ఒసగుట నిక్కము. ఎవ్వరికిని ఇవి ఎగ్గుచేయవనుటయు నిక్కమే. కావున, ఇంగ్లీషులోనివని ఉత్కృష్టదృష్టాంతరములకు దిగదుడుపని వ్యాససందర్భమును చప్పిడిచేసి వదలుటకంటె వానిని తెలుపుట మేలని నామనవి.

శ్రవణానందముగల బ్రదుకుదప్పి"నదట. కావ్యమయమైన మనుష్య జీవనమునుండి విమర్శకుడు "వేదాంతము"ను తరిమివేయగలడా? సామాన్యులకు దురూహ్యములై, ఊర్ధ్వప్రపంచమందును, తర్క వితర్కముల మిట్టపల్లములందును దొరలు అసాధారణవేదాంతము భారతమందు లేదు. జటిలవేదాంత సూత్రములను ఉన్నత మేధస్సునుండి విసరి పండితుడు సామాన్యులకు వెఱ్ఱెత్తించును. కవియైనవాడు రక్కసులను సుందరాంగనల గావింపగలడు;—క్లిష్ట వేదాంతసూత్రముల నాతడు హృదయకల్హారమందు మంచి క్రొత్త రూపుల శోభిలువానిని ప్రజల అక్కున జేర్చును! ఆదర్శకవి తల్లి వంటివాడని తెలుపుచుందును. తల్లి తనయునకు వేదమును తెలుపకయే వేదమును దెలుపును—ఈమె తెలుపునది వేదాంతమే యయ్యు, వేదాంతమట్లు తోపక తనయుని జీవనమున జొచ్చి దాని కది "మహత్త్వకవిత్వ పటుత్వ సంపద"నొసగును. పోతన వెఱ్ఱివాడై "ముగురమ్మల మూలపుటమ్మ"కు బ్రణమిల్లలేదు, గోరుముద్దలు కుడువబెట్టునప్పుడును, "దాయి! దాయి!!" పాడునపుడును తల్లి తెలుపు అద్భుతవేదాంతసూత్రముల నే పండితుడు తెలుపగలడు? పండితుడును, కవియు బేర్కొను విషయములు విభిన్నములు కాకపోయినను, వాని తీరులును రూపులును వేఱు. శ్రీకృష్ణుడెవ్వరు? కవియు, వేదాంతియు, మానవుడును, జగదీశుడును, భర్తయు, నాచార్యుడును కూడ కాడా? యోగులును పూబోడులును కూడ శ్రీకృష్ణునియెడల నేల మిక్కిలి మక్కువపడిరి? వేదములును ఉపనిషత్తులునుకూడ గీతాచార్యుని మధుర వాక్కునందు లేవా? ఆమ్నాయముల తలకయైన గీతయొక్క మాధుర్యమును గ్రోలుట కెందఱెందఱు ఆతురపడుట లేదు? గీతయొక్క కవిత్వమాధుర్యము ఎమర్సన్ కార్లైలులను తనుపలేదా? ప్రఫుల్లమైనపద్మకళయందేకదా నాల్గువేదముల సృష్టి గోచరించెను! వివిధకళలు వివిధరేఖలై నిగమాధినాథుడగు శ్రీకృష్ణుని హృదయమందు ప్రస్ఫుటించినవి! కృష్ణజీవనము కవితామధువుతో తొలుకాడు కమలము. సుధను గ్రోలుటకై గోపికాభృంగము లీసరోజము నాశ్రయించినవి! రాసక్రీడ ఏమి? — చక్కనికైత. కృష్ణజీవనము వేదాంతగర్భితమహాకావ్యముకాదా? మోటుసరిగమలు వీణాతంత్రులపై గంతులిడినపుడు, మధురరవము తలసూపి, శ్రోతలహృదయమున భావతరంగములను పొంగింపవా! ఎట్టిమోటుసూత్రములైనను కవి హృది జొచ్చి రసబంధురములు కావా? ఏవో బండభావ్యములను దెచ్చి, వ్యాసుడు భారతమందు దూర్చెనా? చెమ్మటలను, ఉస్పురస్సులను పుట్టించు కటికిపాండిత్యమును ఆతడు ప్రదర్శించెనా? రాళ్లవంటి నియమములుగాని, పిష్టముగట్టిన సూత్రములుగాని భారతమందున్నవా? దైనికజీవనమున నల్లుకొనియుండు బహుళాంశములనేగదా కృష్ణద్వైపాయనుడు యుధిష్ఠిరునకు దెలిపినాడు! చక్కనైన నందనిజడయందు తల్లి పూవులుదురిమినట్లు మృదుల తత్త్వసూత్రప్రసవములచే వ్యాసభట్టారకుడు తనకావ్యపుత్రిక నలంకరించెను. ఉన్నతాశయములును, ఉత్తమనియమములును వెఱ్ఱిముఱ్ఱి వేదాంతఘోషగాక కావ్యములకు కనదురురూపునొసగు దివ్యరుచులని నాయభిప్రాయము. ఇవిలేని కావ్యములు పనికిమాలినపందలకు జెల్లునుగాని వ్యాసునివంటి ఆదర్శకవికి జెల్లవు. అద్భుతజీవనసూత్రములను తెలుపుతఱి, అన్యునిగాక యుధిష్ఠిరునే మ్రోలనిలుపుకొనిన వ్యాసుని చిత్తవిజ్ఞాన మెంతయద్భుతమైనదని కొనియాడను! కృష్ణుడును, యుధిష్ఠిరుడును అను కండెకదురులతో నల్లుకొనిన మహాకావ్యము భారతము. ఈమహాపురుషులు వేదాంతులకు పూజనీయులు; కవులకు పట్టుగొమ్మలు. కృష్ణుని గుర్తింపనివారు అతనిని పోకిరియనిరి. ధర్మజుని గుర్తింపని రామలింగారెడ్డి ఆతనిని "గంగిరెద్దు" అనెను! విమర్శకుడు భారతమును పలుమాఱుచదివిన విద్వాంసుడు. రామాయణమును చదివిచదివి రామునకు సీత ఏమగునని ఎవరో అడిగిరట. భారతమునుపఠించిన మన గ్రంథకర్త ఈబుద్ధిమంతునకు దగ్గఱచుట్టముకాడుగదా!

"ఆభీష్ముడు పెద్దమనుష్యునిరీతి గుటుక్కుమనిచచ్చి జన్మసాఫల్యము నొందక కొన్నినెలలు క్రిందబడియునికి! మన గ్రహచారముగాకున్న భారతవీరులనెల్ల నుత్తముడని పొగడ్తగన్న యాతడు పరస్పరాసంగతవిచారములనెల్ల మననెత్తిని గట్టియుండునా?" (పుట ౧౭౧) భారతమహాకావ్యమునకు శోభనాపాదించు రెండవ "దుర్విపత్తు"ను దెలుపుచు విమర్శకుడు విసరిన ముక్కలివి. గ్రంథకర్త అభిలషించినట్లు భీష్ముడు, గుటుక్కన చచ్చినచో, భీష్మజీవనము పూర్ణిమచంద్రునట్లుగాక సప్తమచంద్రునట్లు శోభిల్లెడిది. భీష్ముడు అసాధారణపురుషులందు అసాధారణపురుషుడు. చెప్పినది చేసి తీరువారు అసామాన్యులు. చేసిచెప్పుట అసామాన్యులలో నసామాన్యుల పని. ఒకడు కర్మవీరుడైనంతన, పరిపూర్ణత్వము చేతికందిన పండుగాదు. జ్ఞానోపాసనము, భక్త్యుపాసనమును కర్మయోగమునకు తోడుపడవలెను. కర్మవీరుడై భీష్ముడు రణోర్వి నలంకరించెను. అంపశయ్యమీది భీష్ముని వాక్కులనుండి అనంతకాలము జ్ఞానులను, భక్తులను, గృహస్థులను తనుపు మహత్తరసత్యములు వెడలినవి! దేవదేవుండైన శ్రీకృష్ణుడే ఈతని నుడువులను తన మానసమంజూషమున దాచుకొని వానినే పదంపడి ఉద్ధవునకు ప్రసాదించి తనభక్తునెడల అనూనమైన గౌరవమును జూపినాడు. అంపశయ్యమీది భీష్ముడు, మూల్గుచు, తీసుకుతీసుకుచస్తూ, పరిచర్యచేయువారిని చంపు ముసలిదయ్యమగుచో ఆపరిచర్యచేయు అభాగులందు మన విమర్శకుడొకడై యుండుచో, "గుటుక్కుమని చచ్చి జన్మసాఫల్యమొందరాదా?" అని యాతడు ముదుసలిని తిట్టిపోయవచ్చును. దేవతలకుగూడ నోరవడియైన అద్భుతజీవనమున శోభిలిన భీష్మదేవ్వరో ఎఱుగక టుప్పటుప్పన నాతనిపై తూపులువదలజెల్లునా? తూపులకు లొంగనిది భీష్మజీవనమని విమర్శకు డెఱుగకుంబోవు!

మరల, విమర్శకుడు విధియబోసిన చక్కని సాహితీలక్షణము లను విలోకింపుడు. "శుచిసౌందర్యములు నిత్యసంయోగములు. (పుట ౩౦౯) కష్టతరముగానున్నట్లు వ్రాసిన మనోజ్ఞమని తలప జెల్లదు. (పుట ౩౧౨) ఆశ్చర్యమునకును నామోదమునకును వ్యత్యాస మున్నదికదా? భావనాశక్తిమై వ్రాయువారలకు మనసు పాత్రముల యందు లీనముగ నుండు గావున సహజరోగములుదప్ప నితరములు దట్టవు (పుట ౨౬౬). అపురూపమే సురూపమని యెంచుట భ్రాంతి. ఎంతక్లేశపడి సంపాదింతుమో యంత సుఖమని యెన్నుట తగదు. (పుట ౩౧౩). పాశ్చాత్త్యులు మనుష్యజీవిత పరిశీలన సమర్థులగుటను, స్వయంవిమర్శమై వ్రాయువారు అగుటను, కాలస్పృష్టపరిణామముల వర్ణించుటలో నద్భుతచరిత్రులు! కాలౌచిత్యమున నర్థములు రెండు. ప్రతిపాదమును కాలానుగుణ పరివర్తనములకుం బాత్రమైనట్లు వర్ణించుటయు కథలోని వివిధసందర్భములు కాలముతో జేరిక కలవిగా నుండునట్లు గల్పించుటయు ననునవి (పుట ౩౧౫). యోచనాశక్తికిం జేరిన చమత్కారమునకును, భావముల నలరించు శక్తికిని యెంత భేదము? (పుట ౩౧౩) ప్రపంచఖ్యాతములగు కథలతో విరోధించి నట్టి కల్పనలు అయోగ్యములు (పుట ౩౧౬).

సాహిత్యవిమర్శనమేకాక సంఘవిమర్శనముకూడ పుస్తక మందు ప్రవేశము నందినది. సాహిత్యవిమర్శనము చాలవఱకు నిర్దుష్టమైయున్నది. సంఘవిమర్శనమో తప్పులకుప్పతో నిండియున్నది! గ్రంథము ముండ్లులేని గులాబియై గోచరించుట లేదు. రెడ్డిమహాశయుడు విసరిన ఈమాటలను గమనింపుడు:

"పూర్వము కన్యామణులు కోకలువిప్పి తాండవమాడుచుంట గలదా! లేక యందఱికిని వస్త్రములను మానమును వ్యర్థము చేయు దివ్యదృష్టి యుండెనా? (పుట ౧౨౦). పూర్వము అవికలధారణమే యున్నట్లులేదు. (పుట ౧౨౨) మనదేశములో నెవతెయైన నొకస్త్రీ నాగరికతగలయది వీథిలో బోవునేని, ఆయూరివారి కన్నులన్నియు బిఱ్ఱబిగిసి యామెపై బడుట మీకు దెలియదా? (పుట ౧౧౧) మనవారిలో స్త్రీలకు మనోవికాసములేని గతి పట్టినది. కావున రూపమొక్కటియె మోహమున కాలంబనము. పశుప్రాయకృత్యమే కామితార్థము. (పుట ౧౧౩) పురుషులకును వారికిని (హిందూ స్త్రీలకు) దేహసాంగత్యమే కాని మనస్సాంగత్య మెక్కడిది? (పుట ౧౧౩) మోహమనగా వీరికి దేహక్రీడయేకదా! (పుట ౧౨౩) కామినులు గర్హణీయులనియు నికర్ష హేతువు లనియు విరక్తివ్యాఖ్యానము లెన్నియో యున్నవి. తొలుత మగవారు మగతనముగోలు పోవుటచేగదా యాడువారీపాడుస్థితికి వచ్చిరనుట మఱచి తమదోషములచే దప్పులై, కీడ్వడినవారిని దామే దూషించుటంజూడ మనవారు మనుష్యులా కారా యనుసంకోచము రాకమానునా? (పుట ౧౧౫) అశ్లీల దోష మటుండనిండు. అది మన సదాచారములలో నొకటి (పుట ౧౨౦). ఐరోపావారు శృంగారవర్ణన మెంతో దివ్యముగ జేసియున్నారు. వారు రాజసతేజులు. మనలో నాలుంక బట్టినది సత్త్వగుణము. మనసుంబట్టినది తమోగుణము. (పుట ౧౧౦) భార్యకు పురుషునిపడుకలోనేగదా పాలు! మనసులో లేదు గదా (పుట ౨౮౭) సౌమనస్యమున బుషులకు, బాళయగాండ్రకు, మృగములకును భేదము శూన్యము. (పుట ౨౫౭) సనాతనధర్మ గ్రస్త మీదేశము! ఐరోపావారు తఱచు హేతువాదులు. పరముం గూర్చి పెదవులచేటుగా జపించువావారము మనము. ఇహమునం దాసక్తులు వారు. అట్లుండియు నాజనములలో నుండునంత యింద్రియనిగ్రహ మిక్కడ నున్నదనుటకుగాదు. (పుట ౨౧౮) భయము శోకము మొదలగువానిచే వికలితస్వాంతలై యుండు స్త్రీలమూర్తులు కొందఱకు నాపరాని మోహాతిరేకము గలిగించును. శాస్త్రదృష్టితో గాక దేవుడిచ్చిన సొంతపుగన్నులతో జూచువారికి నిట్టి విశేషములు సులభముగ గోచరింపగలవు. (పుట ౨౧౫) మనలో బెండ్లికి మనసునకును సంబంధములేదు. పరిణయము వ్యవహారములలో నొకటి. చిత్తజము గాదు. మఱి పితృపితామహజము. మనసును నిరోధించి పీడించు వర్గములలో ముఖ్యములు జాతిభేదములు. తమతమ యుపశాఖలను మీఱి హృదయము వ్యాపింపగూడదట. దీనివలన గలుగు ఫలమేమనగా, అమనస్కవివాహములు. అనగా దేహ మొకచోట. చిత్త మింకొకచోట. మాట లిక్కడ, తలపు లక్కడ. చిత్తము శివునిమీద, భక్తి రంకులాడిమీద! (పుట ౨౧౩). పెండ్లిలో నన్ని మంత్రములు దంత్రములు నుండును. ఒకటిదప్ప! ఎయ్యది? ఆత్మతంత్రము. వివాహము సంస్కారమట! హృదయబహిష్కార మన గూడదేమో! (పుట ౨౧౮) ఇంటిలోనుండు రసములు జిహ్వకేగాని మనసునకు వికాసమునిచ్చునవిగావు (పుట ౨౭౩) హిందూదేశీయులు మనసుమెత్తనివారు. కాయము లంతకంటె మెత్తన! సత్త్వగుణమను సాకు పెట్టుకొని యెన్ని దెబ్బలు పడినను, "నావిగావివి పరమాత్మకుం జేరినయవి" యని యపహాసమునకుం బాత్రములగు వింతకారణముల గొణిగికొనుచు వంచినతల యెత్తక, వణకెడు నోడలు నాపక, పాఱెడుకాలు నిలుపక పోవుచుందురు! (పుట ౩౨౧) మనుష్యభావములనెల్ల నుత్కృష్టతరమగు మోహమున కట్టి జడసంప్రదాయము శక్యమా? యోగ్యమా? మనకవు లీసంగతి నెఱుంగక కామమునకు నాచారముల దీర్చియుండుటకు గారణములు వారి మౌఢ్యము, హిందువుల జీవితముయొక్క రీతియును." (పుట ౨౧౩)

ఈ యభిప్రాయములందు విమర్శకునితో నేకీభవించునాతడు విమర్శకు డొక్కడే.

గ్రంథకర్త మనువుపై కారములు, మిరియములు నూరిపోసినాడు, వర్ణాశ్రమధర్మములను చూచి కనులెఱ్ఱజేసినాడు. చూడుడు, "అరణ్యప్రవేశముకన్న నెన్నియోమడుంగులు క్లేశకరమగు వర్ణాశ్రమాది ధర్మములంగూర్చిన మతివిహీన దీర్ఘప్రసంగప్రవేశము (పుట ౧౪౧) హిందూదేశములో మనుస్మృతిదెబ్బ దగిలిననాటినుండి ప్రజ

యావఱకును లేవలేక పడియున్నది. దానిది పరాశ్రయమైన బ్రదుకు! (పుట ౬౭) "మనువునోటిలో మన్ను" గొట్టుట సామాన్యసాహసముకాదు. మనుశాసనము నేడు మనకు 'శఠగోప' మగుటకు తగినదై యుండవచ్చును. నేటి ముక్కుద్దములతో శతాబ్దులనాటి పరిస్థితులను పరికించి, నాటి శాసనకర్తముక్కునకు సూటిగా ముష్టినెత్తుట తగునా?

గ్రంథకర్త సంఘవిమర్శనము పుస్తకమునకు రాచపుండగుచున్నది. ఈబుద్ధిమంతుడు తనపని తాను చూచుకొని తనతెరువును బట్టి తాను నడచియున్నచో సాహితీసేవకుల పూవుచెండులను తలదాల్చియుండువాడు. "కవిత్వతత్త్వవిచారము" నే దృష్టియందుంచుకొని, ఈతడగ్రసరుడై యుండినచో ఈతని వాక్కులు "సానదీఱిన జాతిరత్నములై" యుండెడివి. తనలక్ష్యమునకు అక్కఱగాని, తనకన్నుల కేలనో వంకరటింకరై, తానుతెలుపు దేశకాలముల నిశ్చితసంబంధము సూచింపజాలని తెన్నునబడి విమర్శకుడు భాస్వంతరుచుల నీను తనకలమునకు బురద పట్టించుకొన్నాడు. ఇందును అందును ఇంకను ఈతడు విసరిన ఈమాటలను గమనించుడి. "ఎట్టి హీనలయ్యు గులకాంతలకన్న మేలగుటం బట్టియేమొ వారికి 'భోగమువారు' అనుపేరు గలిగె. తక్కినయాడువారు భోగమున కుందగరు. వారిం బ్రేమించుట దానధర్మము. జన్మపరిత్యాగతుల్యము." "సంసారికి నీగృహకృత్య పతివ్రతలకన్న నైరోపామొదలగు వృద్ధిభూములలోని పలుగాకులు మేలు." "జారస్త్రీలెల్లఁ జెడ్డవారయట! కండకావరముచే నన్యులగోరువారట! ప్రబంధములలోని పతివ్రతలుమాత్రము కండకావరముచే గోరువారుకారా? ఇంకేవరము వారికున్నది? శృంగారము నీచశృంగారము. దానికి దగినట్లు జారత్వమును నీచముం జేసి జతగూర్చిరి." "పురుషులకు వారికిని దేహసాంగత్యమేకాని మనస్సాంగత్య మెక్కడిది?" "ఈపాడు పాతివ్రత్యము నుద్ధరించు ప్రకృతి యొక్క గృహముమాత్రమె." "వేశ్యయైన కలభాషిణి రాజకులములో బుట్టినందున నెట్టియపభ్రంశములకుం బాలాయెనో! మన దేశములో గులస్త్రీలకన్న వారకాంతలే యుత్తములనుటకిది యొక తార్కాణము. మనయిల్లాండ్రు ఏకత్తెలుం గారు—వంటకత్తెలుదప్ప." "మనవారిలో మాటలు వేదమయములు. చేతలు బూతులు." "కామమునకు నాచారముల దీర్చియుండుటకు గారణములు వారిమౌఢ్యము, హిందువుల జీవితముయొక్క రీతియును." "మనవారిలో సంఘచరిత మను భావమే యున్నదో లేదో! భావమే లేనిది ప్రవృత్తి యెక్కడిది?" "కవిత్వతత్త్వవిచారము"నకు జోహారులు. ఉత్కృష్టమైన ఈగ్రంథమున విమర్శకుడు "పచ్చిపచ్చి" మాటలను దూర్చుట పుస్తకముయొక్క ప్రారబ్ధము! సాహితీవధూటిగ్రహచారము!! గ్రంథకర్త బండమాటలకాధారము లెవ్వి? ప్రబంధకవుల ధోరణియా? ఈకవులవర్ణనలు కొన్ని జంతువులకుకూడ జోకుపుట్టించునవియే. విమర్శకుడీకవులను గొఱ్ఱెలమందకు పోల్చినాడు. (ఈతని నుడి కార్లైలుయొక్క "Mankind is a flock of sheep" అను వచనమున కనువాదము!) గొఱ్ఱె అలుపులకు విలువగట్టి ఈమాదిరిసరుకును పూజాగృహమున చొప్పించుటేటిపాడి? గొఱ్ఱె అలుపులసాక్ష్యమైనను ఈమాటల కాధారమాయెనని విమర్శకుడు ఋజువుచేయగలడా? ఉలిబాడిసలను, రంపముగొడ్డళ్లను చేతబుచ్చుకొని ప్రబంధకవుల వెఱ్ఱిమొఱ్ఱివ్రాతలను గ్రంథకర్త ముక్కముక్కలు చేసినను సంతసింతును. సందర్భశుద్ధి లేని మాటల నెట్లో నడుమ దొరలించి కులస్త్రీలపేరున కగ్గిపుల్ల వెలిగించుట ఏమిధర్మము? సూర్యచంద్రుల తేజము నడ్డుటకు రేబవళులున్నవి; రాహుకేతులున్నారు. కాని భారతకులస్త్రీల భవ్యభాస్వంతచరిత్రలపై చీకటిపోసిన విపరీతము లెవ్వియు లేవు. చేతులు జోడింపవలయు నవసరమున తాలురువ్వుట ఎట్టివారికి తగును?

విమర్శకుడొకచో "రుష్యావారికిని, జపానువారికిని కొన్నియేండ్లక్రింద ఘోరయుద్ధము ప్రాప్తమైనపుడు, రుష్యావారి రణసన్నాహములయొక్కయు, కోటలయొక్కయు, సైన్యములయొక్కయు మర్మముల నెఱుంగ జపానురాజ్యములోని నారీమణులు కొందఱు బుద్ధిపూర్వకముగ వేశ్యపనికిఁ బూనినవారై, తరుణములందు శత్రుసేనానాయకుల పరిరంభణములకుంగూడ సమ్మతించి, యమూల్యవృత్తాంతములను దేశమునకు దానముచేసి యుపకారరాజ్య పట్టమహిషులైరని వినియున్నాము గాదె! వీరిని నీచచరిత్రలని భావింప నొప్పునా?" అని వ్రాసియుండెను. భారతస్త్రీలకు దేశధర్మ మెంత పవిత్రమైనదో, గృహధర్మమును నంత పూతమైనదే. ఒకవేళ దేశధర్మనిర్వహణ మొనరించుపట్ల గృహధర్మమునకు భంగపాటు కలుగునవస్థ పట్టినచో, నీధర్మమును నష్టపెట గలుపక వారు ప్రాణముల నర్పించియే దేశధర్మమును నెరపుదురు. దేశమాతకు నిజాసువులను నివాళియిచ్చిన మహిళామణుల దివ్యచరిత్రలు రాజస్థానవాలు స్తూపములను సయితము పౌరుషేయముల నొనరించెనని విమర్శకుడెఱిగియేయుండును. మానరక్షణమునకై మనతల్లులు తమప్రాణముల నొరులకు భక్షణముల జేసిరని గ్రంథకర్త యెఱిగియేయుండును. ఐహికమగు అభ్యుదయము నటు నిలువంబెట్టుడు, స్వర్గము దిగివచ్చి ఊడిగముచేయుదుననినను, భారతమహిళామతల్లులు తమమానము నమ్ముకొనుటకు సమ్మతింపరు. సత్క్రియను తెలుపుపట్ల అవలంబింపబడు ఉపాయము నీతిబాహ్యమై యుండరాదని నైతికశాస్త్రము తెలుపుచున్నది. విమర్శకుడు **Psychology, Literature** లను నెమకినట్లు **Ethics** ను నెమకి నైతికనిబంధనములను పిడికిలియం దుంచుకొనలేదేమో? **Intention** యొక్క బాగోగులను గుర్తించుటెట్లు? **Motive + Means = Intention. Motive** మాత్రమేకాక **Means** కూడ ఉచితమైనపుడే **Intention** సరియైనదగును. ధనికుల కాలిజోళ్లను దొంగిలించి, క్రిస్పిన్‌సన్యాసి నిరుపేదలకు దానమొనరించువాడట. ఈకృత్యము

యొక్క నైతికమూల్య మెంతో Ethics ను నంజుకొన్న ఏపెద్ద మనిషియైన చెప్పగలడు. గృహధర్మమును అపవిత్రక్రియసందిట దూర్చి వేఱొక ధర్మమును నెరపవలయునట! భేష్!

సాహిత్యాంశములను విమర్శించుపట్ల కలమును, సంఘాంశములను పరిశీలించుతఱి కొరడాను విమర్శకుడు పట్టినాడు. ఈకొరడాను బడిపంతులువలెనైనను బట్టలేదు. ఇవేవల ప్రసిద్ధికెక్కిన పోలీసులాటీవలె దీని నీతడు ప్రయోగించినాడు. వెనుకముందు తెలియని ఈబజాయింపులో నిర్దోషులతలలుకూడ బొప్పిగట్టినవి.

విమర్శకుని వాక్కులు అందందు చిత్రమైనరంగును దాల్చినవి. ఈ మాటలను పరికించండి. "కలియుగాదినుండి—" అయ్యో! పాపము! చిత్తగించండి విమర్శకుడెట్లు జాలిపడుచున్నాడో!— "కలియుగాదినుండి యింతదాక జమకు ఖర్చునకు రాని సాధారణ జనులు నేటికికదా గణ్యులైరి!......" "బ్రిటిష్‌వారి పరిపాలన మహాత్మ్యమును దానిచే మనయందు ప్రభవిల్లిన వృద్ధి నతిశయముగ జెందుద మను నుత్సాహము" నట! "బ్రిటిష్ గవర్నమెంటువారు మనకు మనసార నిచ్చిన విద్యాప్రభావము"ట! "మనకు బట్టిన వేదాంతపిశాచిని అట్లట్లు పారదోలినందులకు నింగ్లీషువారు స్వభాషాభిమానులమగు మనకెల్ల బూజనీయు" లట. విమర్శకుని 'భట్టు' మూర్తిజేసి వదలివైచిన "మాహాత్మ్యము" ను గుఱించి, తదితరవిషయములను గుఱించి, ఇచట జర్చించుట అప్రస్తుతము. విమర్శనమునకు ప్రతివిమర్శనమును తయారొనరించుట నాయాశయముకాదు. రెండవ ముద్రణమునకు ముందు గ్రంథకర్త తనపుస్తకమును ఒకపరి చూచుకొనలేదేమో! "కలియుగాదినుండి జమకు ఖర్చునకు రాని సాధారణ జను" లట! "బ్రిటిష్‌వారు మనసారనిచ్చిన విద్యాప్రభావమట!" సుప్రసిద్ధదేశసేవకునియొద్దనుండి ఉబికినముక్కలివి! ఇవి వర్ణించవలసిన 'చణుకులు!' కనులుమూయక చరిత్రలను చదువువారికిని, దేశపరిస్థితులను గమనించువారికిని తోచుదృశ్యము వేఱు. సాధారణ జనులు జమకుఖర్చునకు రాకపోయినది నేడు! "నేడు" అని ఎన్నిమాఱులు గొంతెత్తి చెప్పినను చెప్పవచ్చును. నేడున్న దురాచారములును, నేడున్న దుఃఖదారిద్ర్యములును ఈవఱలో నెన్నడును లేవు. నేడేదోవృద్ధి ప్రభవిల్లినదని తెయితక్కలాడి, నేటి దురంతదుస్థితిని నాటి సంఘముతలకు గట్టి కనులెఱ్ఱజేసి కవిసీకట్టి పుచ్చుకొనుట శ్లాఘనీయమైన పనియా? నేడు తలసూపిన భావోద్రేకము జాతీయోద్యమమునుండి పుట్టినది. ఐగోపాయం దపుడపుడు శిరమెత్తిన చరిత్రసందర్భములు నేడు మన సీమయందు గోచరించి పాంచజన్యమును పూరించి, దుఃఖమందు మన కుత్సాహము గొలుపుచున్నవి. ఈయుత్సాహమునుండియే నూతనసాహితి చిగిరించుచున్నది.

రమ్యమైన ఉద్యానమట్లున్న ఈగ్రంథమందు జిక్కుకొనిన ముండ్లపొదలను మూడవముద్రణమున గ్రంథకర్త ఊడపెఱికి, సాహితీహృది జూపు గ్రంథములను బహుళముగ వ్రాసి, భాషాంగణమున తనకుగల అద్భుతప్రజ్ఞను ఆంధ్రసాహిత్య పునరుద్ధరణమునకై వినియోగించుగాక!

ధిషణాధురంధరుడగు గ్రంథకర్తగుండెయందు కవియున్నాడు. గద్యమ్రాసిననేమి, పద్యమువ్రాసిననేమి రామలింగారెడ్డిరచనము హృద్యమై, రసయుక్తమై యుండును కైతకైనేతలేమియు వాఙ్మయవధూటి కీయకున్నను, "కవిత్వతత్త్వవిచారము" ను గనిన యశస్తిలకుడు గొప్పకవి. ఈతని హృదయవాటికయందు వేడుకలదేలు కవియల్లిన మధురోక్తిసూత్రములు చక్కని శైలియై ఆనందమునుగూర్చుచున్నవి. ఒకరిపిలకల నొకరు చేబూని హుమ్మని యుఱుకుమన శైలివాదులు శ్రీరామలింగారెడ్డిశైలి నొరవడిచేసికొన్నచో తెలుగుతల్లి సంతసింపదా?

---



# ప్లేటో అరిస్టాటిలులకు వాదోపవాదములు

(వ్యాసుని మాధ్యస్థ్యము)

పానుగంటి లక్ష్మీనరసింహారావు

ప్లేటో—నాశిష్యుడవై యుండియు నా నిర్వచనము తప్పనుటకు సాహసించితివిగా!

అరిస్టా—అనవలసి వచ్చినప్పుడు తప్పదయ్యా! సాక్రటీస్ చెప్పినవి కొన్ని సరిపోవని నీకు తోచుటచేత నీకల్పనలుకొన్ని వానికిజేర్చి అవియన్నియు సాక్రటీసే చెప్పినట్లుగా నీవు ప్రకటింపలేదా? "అవి నాయభిప్రాయము లెంతమాత్రము కావయ్యా" అని సాక్రటీస్ నీయెదుట, అనేకజనసంఘమునెదుట, ప్రత్యక్షముగా ఘోషింపలేదా? అంతకంటె నేనుజేసినది తప్పా గురూజీ! నేనేమంటి ననగా, కవిత్వస్వభావము కేవలమనుకరణము. ప్రపంచమును కవిత్వమను అద్దములో ప్రతిఫలింపజేయుటయే కవితాప్రయోజనము. వర్ణ్యవస్తువు దృష్టవస్తువువలెనే ఉండవలయును. కవిత్వమునకు, చిత్రలేఖనమునకు చాలసామ్య మున్నది. ప్రపంచమునకు బొమ్మగీయుటయే చిత్రలేఖకునికి వృత్తి. సరిగా నదియే కవియొక్క వృత్తికూడను. చిత్రలేఖకుడు లొట్టిపిట కుచ్చులతోను, రంగులతోను స్వప్రయోజనమును నిర్వహించుకొనును. కవి చిత్రములైన మాటలతోను, శబ్దార్థాలంకారములతోను తనవృత్తిని నిర్వహించుకొనును. తనకవిత్వమువలన వినువారికి సంతోషముగలిగిన సరే, దుఃఖముగలిగిన సరే, నీతిగలిగిన సరే, అవినీతిగలిగిన సరే, ప్రపంచమున కచ్చుగ్రుద్దుటయే అతనిపని. మరి నీ వేమందువయ్యా!

ప్లేటో—నీదంతయు తప్పందును. కవిని నీవు నిర్జీవమైన ఛాయాగ్రాహియంత్రమును జేసిపారవేసినావు. కవికి భావనాశక్తి, కల్పనాశక్తి ముఖ్యములు. అవి అతనికి ప్రాణములు. ప్రపంచపుబొమ్మనుజూచి సరిగా బొమ్మగీయుటయే కవికి కార్యమైనప్పుడు భగవంతు డతనికిచ్చిన కల్పనాశక్తియుపయోగ మేమున్నది? ఆతడు కల్పింపవలెను. ఆతడు భావింపవలెను. ఇదివఱకున్నదానిని కల్పించుటఅనగా అర్థమున్నదా. లేనిదానిని భావించుటయే భావనాశక్తిప్రయోజనముకాదా. నీ వీరెండుశక్తులను ఊడ్చివేయుటకు బ్రయత్నించినావు! అవి నీవ్రాతలవలన బోవునవికావయ్యా!

అరిస్టా—నీవు నాఅభిప్రాయము కాదంటివికాని, నీదేదో చెప్పవేమి?

ప్లేటో—కవిత్వమునకు ప్రపంచముతో సంబంధముండగూడదు.

అరిస్టా—అయ్యయ్యో! ప్రపంచములోనున్న కవి కవిత్వము జెప్పునప్పుడు ప్రపంచసుఖదుఃఖములు లేకుండజేయుట సాధ్యమగునా? అత్తరులను జేయువానివృత్తి నవలంబించుచు, ఎక్కడను వాసనగొట్టుట పనికిరాదని అనగ నెట్లు? పాటలుపాడుకార్య ముద్యమించిన గాయకుని ధ్వనికాగూడదని నిరోధించుట తగునా?

ప్లేటో—నీబుద్ధిహీనమైన మాట లావలబెట్టుము.

అరిస్టా—బుద్ధిగలిగినవాడవు నీవు చెప్పరాదా.



పళని కొండ, కోవెల — K. P. S.

ప్లేటో—చెప్పెదను. ప్రపంచము కష్టభూయిష్ఠమని అందరొప్పుకొనినదే కాదా. వానిని విడనాడి సౌఖ్యపడుటకే అందరు మార్గములను జూచుచున్నారు కాదా. ఆమార్గములను, వానివిభేదములను చెప్పుటయే కవిత్వము.

అరిస్టా—ఆపని వేదాంతము చేయుచున్నదికాదా. అందులకు కవిత్వ మెందులకయ్యా!

ప్లేటో—రా! ఆలాగున దారిలోనికి రా! కవిత్వము గళబద్ధమైన వేదాంతము. "Poetry is the versified philosopy of life" అని నామతము. సరిగా నీమాటలే నీవనినట్లు నాకు జ్ఞప్తియున్నది. ఇప్పుడు పెడదారిద్రొక్కెద వేల?

అరిస్టా—ఎప్పుడంటినో, యేసందర్భమున నంటినో నాకు జ్ఞప్తిలేదు.

ప్లేటో—పోనిమ్ము. సాదీ ఏమనిచెప్పినాడో, తెలుగుదువా?

జహా, అయిబిరాదర్, నమానద్ బక్ కస్, దిలందరెజహాఫరీన్-బందోబస్ మకున్ తెక్యాబర్ముల్కె, దున్యాఒపుష్త్ కెబిస్యార్ కస్చాతో పర్వర్దొకుష్టుఛో ఆహంగే రఫ్తన్ కునద్ జాన్ యేపాక్ చెబర్ తష్తాముర్దన్, చబర్ హూర్ మెఖాక్.

సోదరుడా! ప్రపంచ మొకనికొఱకు నిలుపబడునా? మనస్సును భగవంతునందు గట్టిగా లగ్నమొనర్పుము. ప్రపంచసంబంధమైన సుఖరాజ్యభోగ్యభాగ్యాదులను, ఎంతమాత్రమును నమ్మకుము. ఏలననగా నీవంటివారి ననేకులను అది హతమార్చినది. స్వచ్ఛమైన ప్రాణి స్వర్గయాత్రకు బయలుదేరునప్పుడు, సింహాసనముపై జచ్చిన నొక్కటి—భూమిమీద జచ్చిన నొక్కటియు గాదు. ఇది దానికర్థము.

ప్రపంచమును విడువు-విడువు-విడువుమని చెప్పినాడు. దేనితో జెప్పినాడు—కవిత్వముతో జెప్పినాడు. ఇంకను ప్రపంచమునుగూర్చి యుండవలెనని నీవు చెప్పుటేల?

అరిస్టా—అందుచేత కవిత్వ మెప్పుడు మతముతో—

ఇంతలో నొకడు మహాతేజశ్శాలి, కమండలధారి, జటాధారి, దాడీవాలా, మృగచర్మధారి, పింగాక్షుడు, ద్రాఘిష్ఠస్వరూపుడు, అసితదేహమున విభూతిని ధరించి అచ్చట దిగెను. 'నమస్తే! నమస్తే!' యని వ్యాసమహర్షిని వారు గౌరవించిరి.

ఇద్దరు—తమరాకకు గారణ మేమి?

వ్యాసు—ఇద్దఱు మాటలాడుకొను మాటలు రహస్యములై ఉండవలెనే! అట్లుగాక మీ కేకలు నా తపోభంగ మొనర్చుటచేత ఇక్కడ నేమిజరుగుచున్నదో యని వచ్చితిని.

ప్లేటో—గురుశిష్యుల మైన మా కొక్కవిషయమున తగవు గలిగినది. మీరు పెద్దలు. తీర్పు చెప్పదగుదురు. మిమ్ము మాధ్యస్థ్యముగా నంగీకరించిరి. ఏమీ అరిస్టాటిల్!

అరిస్టా—అది నాకును సమ్మతమే.

అప్పుడు వారి కిదివఱకు గలిగిన వాదప్రతివాదములు వ్యాస మహర్షికి నివేదించిరి. ఆయన విని నవ్వెను.

వ్యాసు—ఇంతయేనా? ఈమాత్రమున కింత రాద్ధాంతపూర్వపక్షము లేల? ప్లేటోగారూ, మీ మాటలు సత్యమే. శాబూ, అరిస్టాటిల్, !మీమాటలు సత్యమే.

ప్లేటో—అదెట్లు? వాద మన్నతరువాత ఏదియో ఒక్కటి సత్యము, మరొక్కటి యసత్యము కావలెనుగాదా!

వ్యాసు—అది అట్లుండనక్కఱలేదయ్యా! రెండును సత్యములు కావచ్చును, రెండు నసత్యములు గావచ్చును. మహా తార్కికుడవే!

ప్లేటో—మావాద విషయ మట్టిది కాదు.

వ్యాసు—అట్టివిషయమును జూచుకొంటిరి. నే నందుల కేమి చేయ గలను? దూరపుపట్టుబట్ట-నీవు పచ్చగా నున్నదంటివి. ఆత డెఱ్ఱగా నున్నదనెను. నేను నల్లగా నున్నదంటిని అన్నియు సత్యములే కావా? అది అటుండనిమ్ము ఈప్రాకునది తేలంటివి. జెఱ్ఱి యని నే నంటిని. రెండును గాకుండ ఫురికోస కాకూడదా? అందుచే నేను తప్పమాటలాడలేదయ్యా!

ప్లేటో—నాకు మీరుచెప్పినది నచ్చలేదు. మీరు చెప్పిన ఉభయసత్యములు - ఉభయాసత్యములకు - ఎప్పుడో ఒకప్పుడు సిద్ధించునుగాని - సర్వసాధారణ ముగా ఒకటి సత్యము, ఒకటి యసత్యమగుట ప్రపంచ ములోనేమి, ప్రపంచేతరలోకములోనైననేమి జరుగు చున్నవికాని వేరుకాదు నీవుచెప్పినమాటలు పురస్క రించుకొనిన ప్రపంచమున నొక్కకేసైన విచారణచేయ సాధ్యమగునా? ఒక బలాత్కారపుకేసులో ముద్దా యిని ఫిరియాది బలాత్కరింపను బలాత్కరించినాడు. లేనూలేదు. బందిపోటుకేసులో — బందిపోటు సత్య మగును. బందిపోటు లేకపోవుటయు సత్యమగును. అని చెప్పుట ధర్మమగునా? నిన్ను మధ్యస్థునిగా గైకొని నప్పుడు, నీవేమో పరిహాసముగా బలుకుచున్నావు. మా యిద్దఱికన్నులు దుడుచుటకు యత్నించుచున్నావు.

వ్యాసు—(పెద్దనవ్వు నవ్వి) అంత యేడ్పువఱ కేలవచ్చినదయ్యా! ఎంతమాట! ప్రపంచములో ఏడువ వలసినన్ని యేడ్పుల నేడ్వనే యేడ్చినాము. ఇక్కడకు సుఖముకొఱకు వచ్చి నిత్యమహానంద మనుభవింపవలసి యుండగా ఇంకను ప్రపంచమును దలచుకొని యేడ్తురా నాయనా, క్రోధము, మమకారము, వెఱ్ఱికట్టుదల మనకు ప్రపంచముననున్నంతకాలమేగాని యిక్కడకు వచ్చినగూడ నవియేనా? మీరింక సఖ్యపడుడు.

ప్లేటో—ఇందువలన మాసఖ్యము చెడునది కాదు.

వ్యాసు—సంతోషమే! నాయనలారా! కల్ప వృక్షముక్రింద గూరుచుండి సుఖముగా మందారపారి జాతాదిసౌరభములను సురనదీమందవాయువులను ననుభ వించుచు బ్రహ్మానందానుసంధానమును జేసికొనుచు నుండక యీతగవు లెందులకు? సర్వసాధారణముగా మనము ప్రపంచములో భజియించుచున్నప్పుడు విస్తరి లోనిది కందిపప్పా, పెసరపప్పా, అది యిది కలగలుపా యని గుంజాటనపడి సుఖభోజనానుభవమును మానుకొనువా డుండునా?

ప్లే—మమ్ము జీవాట్లుపెట్టుటయే కాని కవిత్వ మునుగూర్చి మీ నికరమైన యభిప్రాయమును జెప్పి నారు కారు.

వ్యా—అయ్యా, మీకిద్దఱకంటె కవిత్వపుబాధ నాకు బహుళతరముగా భూలోకమున నుండెడిదికాదా! అది యేదో వదలిపోయినది. ఇక దానిని జ్ఞప్తి చేయ కయ్యా!

అ—మీ రెన్నిచెప్పినను గవిత్వ మనుకరణమే కాని వేరుకా దని నేను ఘంటాపథముగా జెప్పు చున్నాను.

ప్లే—అది తప్పని నేను మఱింత ఘంటాపథ ముగా జెప్పుచున్నాను.

వ్యా—అరిస్టాటల్! నీవు ప్రపంచమున బహు భాగ్యవంతుడవు. సర్వసౌఖ్యముల నెఱుగుదువు. అలె గ్జాండరును శిష్యునిగా జేసికొని మహాసుఖముల ననుభ వించినావు. ఏవో ప్రకృతి ననుసరించి కొన్నికష్టముల గూడ బడినావు. నాయనా! ఇంకను జాలదా? స్వర్గము నకు వచ్చినావు. ఇంకను బ్రాపంచికపు సొంటు వదలక భూలోకచింతనాలంపటుడవై యుండుట యెంతమాత్రము బాగుగానున్నదికాదయ్యా!

ప్లే—వ్యాసమహర్షీ! అతనిని బాగుగా జీవాట్లు పెట్టినారు.

వ్యా—ప్లేటో! ఉండవయ్యా. నిన్నుగూర్చి రవంత చెప్పెదను.

నీవు భూలోకమునందుండి మహాగురుడైన సాక్రెటీసు నొద్ద విద్య నేర్చుకొని యెందఱనో వాదముల నోడించి దిగ్విజయములను సంపాదించియుంటివే. నీ కట్టి భూలోకసంబంధము చేతనే కదా నీ వింతవాడగుట సిద్ధించినది. ఇంత జ్ఞానము కూడ నీవు భూలోకమున సంపాదించిన విద్యవలననేగదా కలిగినది. అట్టితల్లి, కల్పవల్లి యైన భూదేవిని నేటికాలమునకు స్వర్గమునకు వచ్చినకారణమున తృణప్రాయముగా జూచుట ఛీ! యెంత విశ్వాసహీనతయో కనిపెట్టకపోయితివి కదా!

అ—వ్యాసమహర్షీ, ప్లేటోను బాగుగా జీవాట్లు పెట్టినారు!

ప్లే—(కోపముతో) ఊకదంపుతో పనియేమయ్యా! నీనికరమైన యభిప్రాయమును జెప్పరాదటయ్యా.

వ్యా—చెప్పెదనుగాని ముందుగా గోపమును విడువుము.

ప్లే—క్షమింపవలెను.

వ్యా—నేను భూలోకమందుండగా నాకొడుకగు శుకుడు కాననములవెంట పోవోగా, "వలదు నాయనా, వలదునాయనా యనుచు బర్వతములు పరికంపించున ట్లేడ్చుచు నాతనిగూడ బోతిని. నేనెంత ప్రపంచలంపటుడనో కనిపట్టితిరా. శుకు డప్పుడు చాలమంచిపని చేసినాడని నేనిప్పుడు గ్రహించితిని. నేనెంత మూఢుడనో యిప్పటికి నాకు దెలిసినది. అదిగాక అనేకపురాణములు చెప్పితిని. నావంటికవి ప్రపంచమున లేడు. Homer Virg l ను అవల బెట్టుడు. వాల్మీకికవిత్వము నాకవిత్వముకంటె మంచిదని యెవడో "సాక్షి" యనుచున్నాడని యీనడుమ నెవ్వడో నాయొద్దకువచ్చి చెప్పినాడు. ఆతనిమాట గణనలేదు. ఇంత విశేషకవిత్వమును జెప్పినను నాకేమోకాని మనస్సునకు సంతోషము లేనేలేదు. నాజిహ్వకేమో యరుచి యను దోషము తగిలినది. ఎంతసేపు వారు వీరు కొట్టుకొని చచ్చినారని, ఉుట్టుదానిగుడ్డ విప్పివేసినారని యమవాయ్వింద్రాదులకేని ధర్మాదులు పాండురాజునకు బుట్టలేదని, ఒక్కదాని కైదుగురు మగలని, యేమేమో అనగూడని, విన గూడని యవకతవకవ్రాత లెన్నియైన వ్రాసితిని.

ఈమహాపాపముచేతనే నా కిట్టి జిహ్వారోగము సిద్ధించినదని గ్రహించి భాగవతమును రచియించి నందనందన పాదారవిందామృతాస్వాదనమును నిరంతరము చేసి జిహ్వారోగము వదలుచుకొంటిని. ఇంక నెప్పుడు ప్రపంచచర్యగూర్చి కవిత్వము చెప్పగూడ దని యొట్టు పెట్టుకొంటిని అరిస్టాటిల్ కవిత్వ మనుకరణమని చెప్పిన మాట సత్యము. ప్రపంచసుఖముల నపేక్షించుచు దుఃఖముల కేడ్చుచు పిల్లలగని సంతోషించుచు వారి చావులకై తలగొట్టుకొనుచు ధనముండినయెడల దెగనీల్గుచు లేకున్నయెడల హోరున నేడ్చుచు నుండదలచిన మనుజులకు ఆరిస్టాటిల్, నీవు చెప్పినకవిత్వము, అనగా అనుకరణకవిత్వ మావశ్యకము. ప్లేటో, ప్రపంచలంపటత వీడి దుఃఖరాహిత్యమునకు మతమే మూలాధారమని గ్రహించి వేదాంతజ్ఞానసంపాదనకు బ్రయత్నించుచున్న లంపటతా శూన్యులకు నీవు నిర్వచించిన కవిత్వమే యుండవలయును. అనుకరణకవిత్వ మిక్కడపనికిరాదు నాయనలారా, అందఱు ప్రపంచలంపటులుండరు. అందఱు వైరాగ్య సంపన్నులుండరు. అందుచేత రెండువిధములైన కవిత్వములు గూడ నావశ్యకములే. అవి రెండు నావశ్యకములని చెప్పకుండ చెప్పుటకే పురాణములును, భాగవతేతిహాసమును నేను రచించితిని. అందుచేత నాయనలారా, మీరిద్దఱు సత్యమునే పల్కితిరి.

ఇంతలో ఓమ్మని ధ్వని వినబడినది. నారద మహర్షి వచ్చుచున్నారాతని కెదురుగ బోవుద మని యందఱు పోయిరి.

---

# నన్నెచోడుఁడు నన్నయభట్టునకుఁ బూర్వుఁడే

కుందూరి ఈశ్వరదత్తు

నన్నెచోడుని కుమారసంభవము శ్రీమానవల్లి రామకృష్ణకవిగారు ప్రచురించినతరువాతఁ గవికాలనిర్ణయమునుగూర్చి యాంధ్ర పండితులు పెనఁగులాడుచు నేయున్నారు ఆంధ్రచరిత్రచతురానన బిరుదాంచితులగు శ్రీవీరభద్రరావుగారును, కుమారసంభవగ్రంథసంపాదకులును నన్నెచోడుఁడు నన్నయభట్టునకుఁ బూర్వుఁడేయను వాదములోనివారు శ్రీ బుర్రా శేషగిరిరావుగారును, కీర్తిశేషులైన శ్రీవీరేశలింగముపంతులవారును నన్నెచోడుఁడు నన్నయకుఁ దరువాతివాఁడనువాదమునకుఁ జెందినవారలలోఁ బ్రముఖులు ఈమధ్య శ్రీపాద లక్ష్మీపతిశాస్త్రిగారు మదరాసులో నుపన్యసించుచు నన్నెచోడుఁడు నన్నయకుఁ దరువాతివాఁడనువాదమె సమంజసమని సెలవిచ్చిరి

నన్నెచోడుఁడు నన్నయకాలమునకును, దిక్కనసోమయాజి కాలమునకును మధ్యనుండిన కవియని వీరిమతము. శ్రీ వీరేశలింగము పంతులవారు కవికాలనిర్ణయమును జేయుచు నాంధ్రకవుల చరిత్రములో నిట్లు వ్రాసిరి "ఈ నన్నెచోడకవి మనవా రనుకొన్నంత పూర్వుఁడు కాకపోయినను గొంతపూర్వుఁడేయయి నన్నయభట్టునకును తిక్కనసోమయాజికిని నడిమికాలమునం దుండినవాఁడయి నన్నయభట్టారకుఁడు బ్రాహ్మణకవులలో నగ్రగణ్యుఁడైనట్టే రాజకవులలో నగ్రగణ్యుఁ డయియున్నాఁడు ఇతఁడు ౧౧౫౧ - వ సంవత్సర ప్రాంతమునుండి దాదాపుగా ౧౧౬౦ - ౭౦-వ సంవత్సర ప్రాంతములవఱకు నుండియుండును' (ఆంధ్రకవులచరిత్రము, పుటలు ౨౧౦ - ౨౧౧)

శ్రీ వీరేశలింగముపంతులువారు వాదప్రతివాదములను సమన్వయించి, తుదకు నన్నెచోడకవిరాజశిఖామణి నన్నయకుఁ దరువాతివాఁడని పైవిధమున వ్రాసిరి ఈకాలపుపండితులలోఁ గొందఱు పైసిద్ధాంతమునే నమ్ముచున్నారు

నన్నయకుఁ దర్వాతివాఁడను వాదముల నొకటి పిమ్మట నొకటి చెప్పి, యవి సమంజసము లవునో కాదో విచారింతము మొదటిది. సత్యాశ్రయ, చాళుక్యరాజుల ప్రశంస

క. మును మార్గకవిత లోకం
బునవెలయఁగ దేశికవితఁబుట్టించి తెనుం
గునిలిపి రంధ్రవిషయమున
జనసత్యాశ్రయునిఁదొట్టి చాళుక్యనృపుల్.

దీని పాఠాంతరముగా నున్న రెండవపద్యము :

క మును మార్గకవిత లోకం
బున వెలయఁగ దేశికవితఁ బుట్టించి తెనుం
గును నిలిపి రంధ్రవిషయం
బునఁ జనఁ జాళుక్యరాజు మొదలుగఁ బలువుర్

మొదటిపాఠమునుబట్టి సత్యాశ్రయుఁడు రాజరాజుకాఁడు ఈవిషయము ప్రతివాదు లొప్పుకొందురు రెండవపాఠమునను సరించి చాళుక్యరాజె రాజరాజనరేంద్రుఁడని వీరు చెప్పుచున్నారు సత్యాశ్రయుఁడుమాత్రము చాళుక్యరాజు కాఁడా? విష్ణువర్ధనునిమొదలు రాజరాజువఱకు వేంగీదేశమేలిన రాజవరేణ్యులు చాళుక్యవంశదీపకులు గారా? ఈసంశయమున కాస్పదులై కాఁబోలు, శ్రీవీరేశలింగము పంతులవారిక్రిందివిధమున వ్రాసిరి :

"మొదటిపాఠమునుబట్టి సత్యాశ్రయకులతిలకుఁడైన రాజరాజనరేంద్రుఁడు సత్యాశ్రయుఁడు కాకపోవచ్చునుగాని యీపాఠమును బట్టి చాళుక్యరాజు నిర్బాధకముగా రాజరాజనరేంద్రుఁడు కావచ్చును అట్లయినచో నన్నెచోడుఁడు నన్నయభట్టునకుఁ దరువాతి వాఁడయి యుండవలెను' (ఆంధ్రకవుల చరిత్రము, పుట ౧౯౦)

అధోరేఖాంకితములగు మాటలవలన వారికి వారివాదమునం దంతబలము లేదని విశదముకాఁగలదు నన్నయభట్టునకుఁ బూర్వమున వెలసిన పాండురంగనియొక్కయు, యుద్ధమల్లునియొక్కయు శాసనములలో దేశికవిత కలదని యందఱెఱింగినవిషయమె అవి చాళుక్యరాజసంబంధములగు శాసనములుకావా? అందలికవిత ఆంధ్రవిషయమున సత్యాశ్రయాదిచాళుక్యనృపులు నిలిపిన దేశికవిత కాదా? పాండురంగని అద్దంకిశిలాశాసనమును బ్రకటించుచు కీర్తిశేషులైన శ్రీలక్ష్మణరావుగారును, యుద్ధమల్లుని బెజవాడశాసనమును బ్రకటించుచు శ్రీజయంతిరామయ్యగారును వ్రాసిన విషయమును గమనింపుఁడు :

"చాళుక్యరాజులకాలములో సంస్కృతముతోఁబాటు దేశభాషలకుఁగూడ గౌరవము హెచ్చినది

కం మును మార్గకవిత లోకం
బున వెలయఁగ దేశికవితఁ బుట్టించి తెనుం
గు నిలిపి రంధ్రవిషయమునఁ
జనసత్యాశ్రయుని దొట్టి చాళుక్యనృపుల్.

అని నన్నెచోడుఁడు చెప్పినది సత్యమే. చాళుక్యరాజ్యముతోడ నాంధ్రభాషయు దినదినప్రవర్ధమానమై రాజరాజుకాలమునాఁటి కున్నతస్థితికి వచ్చినది." (యుద్ధమల్లుని బెజవాడశాసనము, పుట ౨౫)

శ్రీ రామయ్య పంతులుగారి యభిప్రాయానుసారముగఁ జాళుక్యరాజుల కాలములోనే దేశికవిత యావిర్భవించెనని స్పష్టము గదా. ఇఁక శ్రీ లక్ష్మణరావుగారి యభిప్రాయమును గమనింపుఁడు:

"This inscription is very important to the students of Telugu Literature, as it furnishes a positive evidence of the existence of Telugu poetry in the middle of the 9th century A. D. The oldest Telugu work now extant is the Mahabharata of Nannayya Bhatta, the poet laureate in the court of the Eastern Chalukya Rajarajah I (A. D. 1022-1063) of Rajahmundry. It was therefore believed by many Telugu scholars, that the beginning of the Telugu poetry could not go to a period earlier than the eleventh century of the Christian era. But the Bezawada Pillar inscription of Yuddhamalla took it a century back The present inscription takes it a century still."

Epigraphia Indica, Vol XIX, page 273

కాఁబట్టి "మునుమార్గకవిత" యను పద్యములోని నాల్గవ పాద పాఠభేదములు నన్నెచోడ కవిరాజశిఖామణిని నన్నయకుఁ దరువాతివానిగఁ జేయలేవు.

రెండవది: నన్నెచోడుని కాలములో జంగమ మల్లిఖార్జునుఁ డుండుటకును, తండ్రి బల్లిచోడుఁడనుటకును, తల్లి శ్రీదేవియనుటకును గావలసిన యాధారములు.

ఈయాధారములఁ గల్పించుకొని శిలాశాసనములను జూపి నన్నెచోడుని నన్నయకుఁ దరువాతకాలమునకుఁ దీసుకొనివచ్చిన వారు విజయులు కాకపోయిరి. వీరేశలింగముపంతులవారు జూపిన కొప్పరపుశాసనములోఁ జోడబల్లియు, మల్లిఖార్జునయోగియుఁ జెప్పఁ బడియున్నారు. కాని పైశాసనమునందు నన్నెచోడుని తల్లి మాబలదేవియని యున్నది. చెన్నుపల్లి యగ్రహారశాసనములో నన్నెచోడుని తల్లి మాచలదేవియని యున్నదని వారే సెలవిచ్చిరి. శ్రీసతియే మాచలదేవికాని, మాబలదేవికాని కావచ్చునని వారు చెప్పిరి. ఈవాదబలమునందు వారికే ధైర్యము కలుగలేదు. వారేమివ్రాసిరో చూడుఁడు, "కవి తాను రచించిన చంపకమాలలో గణసౌలభ్యార్థము మాబలార్థబోధకమయిన శ్రీసతిపదమును ప్రయోగించి యుండును. ఇది తృప్తికరమైన సమాధానము కాకపోయినను, ఇంతకంటె మంచి యాధారము దొరకనప్పుడు దీనినే సరిపెట్టుకోవలెను." (ఆంధ్రకవుల చరిత్రము, పుట ౧౯౬) అంత సరిపెట్టుకోవలసిన ప్రారబ్ధ మేమివచ్చినది? ఇంతవఱకు మనము వాదిబలమె కాని, వాదబల మేమియు లేదని గ్రహించుకొంటిమి. పైరెండువాదములు సంశయాస్పదములయ్యెను.

మూఁడవది: గ్రంథశైలి

కుమారసంభవమును జదివినవారికి తద్గ్రంథములో కర్ణాటక పదబాహుళ్యమును, తద్భాషాకవిత్వసంప్రదాయములును మొదటి నుండియుఁ గన్పట్టును. గ్రంథశైలి ననుసరించి కుమారసంభవము నన్నయమహాభారతమునకుఁ బూర్వమే విరచింపఁబడెననుటకుఁ బ్రబల ప్రమాణము లున్నవి.

ప్రథమప్రమాణము: ప్రాచీనాంధ్ర క్రియాస్వరూపము

కేతనరచించిన ఆంధ్రభాషాభూషణములో నాంధ్రక్రియాస్వరూపము నిట్లు వచించెను:

క. ఉటపరపదములె క్రియలగు
చుట లొక్కెడ యుటలు వుటలు చుట్టంబుల ద్రో
వుట ద్రోయుట యన చుటలుఁ
బుటలును నగు సంస్కృతంబు పొందినచోటన్.

క. వుటచేతనైన నెరుఁబం
పుట చుటచేనైన నొరులఁ బుత్తెంచుట చే
యుట యుటచే నగునని యా
పటుమతియగు నూత్నదండి ప్రకటముచేసెన్.

ఉటపరమైన పదములె క్రియలని యభినవదండి చెప్పెను. చేయుట, కొట్టుట, తినుట-ఇవియె భావార్థకములు. నన్నయ, తిక్కన, యెఱ్ఱాప్రెగ్గడ భావార్థకమునందు ఉటపరమైన పదములు గానె క్రియలను బ్రయోగించిరి. కాని ప్రాచీనాంధ్రభారతములో భావార్థకము ఉడుపరమైన పదముగా నున్నది. ఈవిషయము ఆంధ్రభాషోత్పత్తివికాసములనుగూర్చి పరిశోధనచేయు విశారదులు గమనించినట్లు తోఁచదు. శ్రీరామకృష్ణకవిగారు కుమారసంభవ పీఠికలో నొకచోట 'సేయుడు = సేయుట, ఇది భావార్థకము' అని భావార్థకమునందు నన్నెచోడుఁడు ఉడుపరమైన పదముగాఁ గ్రియను బ్రయోగించెనని చెప్పిరి. నే నీమధ్య అహదనకరశాసనము నాంధ్రసాహిత్యపరిషత్పత్రికలోఁ బ్రకటించుచు నత్యంతప్రాచీనమైన యాంధ్రశాసనములలో నొకటియైన యాశాసనములో నట్టిభావార్థక క్రియాప్రయోగమును జూపితిని.

(ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక, సం ౧౨. సంచిక ౮)

ఈవిషయ మాంధ్రవ్యాకరణజ్ఞుల కత్యంతోపయుక్తమైనది. అహదనకరశాసనములో నిరువదిరెండవపంక్తిలో నీవాక్య మున్నది: "విరిపయినాడువరొగ్గిన ఎళెములచేసిన సేయుడుసను" ఇచ్చట 'సేయుడుసను' అనుపదముల కర్థముచేయుట చెల్లుబడియెనని. ఇట్టి ప్రయోగము నన్నెచోడుని కుమారసంభవమున నున్నది.

క. వేదాంతభారతపురా
ణాదులు సేయు డొకపేర్మియనుచుం బొగడం
గాదెద్ద నజుండు నోపని,
వేదము లేర్పఱిచె వేదవ్యాసుఁడు.

(ప్రథమాశ్వాసము, పద్యము ౧౮.)

ఈపద్యములో 'సేయుడు' అనఁగా సేయుటయనియె యర్థము. అహదనకరశాసనము క్రీ. శ. ఎనిమిదవశతాబ్దమునాఁటిదని పెద్దలు నిర్ణయించిరి. శాసనభాష ఆంధ్రము. వచనములో వ్రాయఁబడియున్నది. అక్షరము 'డు'గానే యున్నదికాని 'ట'కాదు. నన్నయకాలమునాఁటికి కేతన వ్రాసినట్టి క్రియలు 'ఉట'పరమైన పదము లయ్యెను. కావుననే నన్నయతరువాతి కవులలో నిట్టిప్రయోగ వైపరీత్యము కనఁబడదు. ఇఁక నన్నెచోడుని కుమారసంభవములో నిట్టిభావార్థకక్రియాప్రయోగములు బహుళముగ నున్నవి. ఇట్టి ప్రయోగములఁజూచి, యావైఖరి నవీనాంధ్రభావార్థకక్రియారూపమునకు భిన్నముగా నుండుటచే వెగటుచెంది, ప్రాచీనాంధ్రభాషలో భావార్థకక్రియ 'ఉడు'పదమైన పరముగా నుండెనని వృత్తాంతము నెఱుంగక శ్రీవీరేశలింగముపంతులుగారు కుమారసంభవములోని పైప్రయోగముల నాధారములుగఁ గైకొని శ్రీమానవల్లి రామకృష్ణకవిగారిని, తంజావూరులోని యరవవాండ్రను బరిహసించిరి. వారి ఆంధ్రకవుల చరిత్రలోని యీక్రిందివ్రాఁతను మాచదువరులు పఠింతురుగాక.

చ. బెదరుచు నంతరంగమున భీతికిగండపడంబు సుట్టిప
లెక్కుదు పారపొచ్చెమున్ వెఱపుఁగేనముఁ జెయ్యులకోలి నెత్తువె
ట్టెదు వదిమోపియుఁగరువటిల్లెదు నీమది నింత తల్లడం
బొదవు డిదేమి కారణము యుగ్మలి నాకెఱిగింపు మేర్పడన్.

ఆ ౪. ప. ౪౧౫.

'బెదరుచు' నన్న పయిపద్యమునం దింకొక విశేషప్రయోగము కూడఁ గానంబడుచున్నది. 'ఒదవుటిదేమి' యనుటకు మాఱుగా 'ఒదవుడిదేమి' యను రూపము వాడఁబడినది. ఈపుస్తకమును వ్రాసిన తంజావూరిలోని యఱవవాండ్రకు ట-డ భేదము చక్కఁగాఁ దెలియకపోవుటచేత వ్రాఁతలో నిట్టిరూపములు పడియుండవచ్చును. అట్టివి పూర్వకాలపురూపములనీ భ్రాంతిచెంది ముద్రాపకులు వానినట్టే యుంచియుందురు. ఇట్టిరూపము లీపుస్తకమునం దిరువది ముప్పదిచోట్ల వేయఁబడి వానిక్రింద 'ఒదవుడు = ఒదవుట' యను నట్లు టిప్పణములు వ్రాయఁబడినవి. డకారమున్నచోట్ల టకారము వేసిన నీ యాయాసమంతయు తప్పిపోయియుండును. ఈయన్నిస్థలములలో డకారమును టకారమునుగా మార్పఁగూడని స్థల మొక్కటియులేదు, అపూర్వరూపములను వేసినంతమాత్రముచేత క్రొత్తకవి ప్రాఁతకవి కానేరఁడు. ఈకవి భావార్థకమునందు టకారము వాడ్డనుట కొక్కయుదాహరణమును కుమారసంభవమునుండి చూపెదను.

కం. దొనఁగోలఁ గోలవేగం
బున నరిగొల్పుటయుఁ దిరుపుఁబొరిఁబొరి విడుపుం
జనుటయు దనుజులఁ గొనుటయు
ననిమిషులకునైనఁ గాంచు డరుదయ్యెన్.

అరిగొల్పుట, చనుట, కొనుట, అని మొదట మూఁడుచోట్ల టకారము వేసినవారు కడపటకూడ 'కాంచుట' యని టకారమును వేయక కాంచుడని డకార మేలవేయవలెనో దురూహ్యముగా నున్నది............ఇచ్చుట యన్నదే పూర్వకాలరూపము గాని యిచ్చుడన్నది కాదు." (ఆంధ్రకవుల చరిత్రము, పుటలు ౨౦౩-౨౦౫).

శ్రీ వీరేశలింగము పంతులవారు ప్రాచీనాంధ్ర క్రియాస్వరూప తత్త్వమును గ్రహింపనేరక వ్రాసిన వ్రాఁతలు నిరాధారములు. భావార్థకము 'ఉడంతమె' కాని 'ఉటాంతము' కాదు. నన్నెచోడుఁడు నన్నయభట్టునకుఁ బూర్వుఁడనువాదమున కిది యత్యంత సహకారియని చదువరులు గ్రహించెదరుగాక.

మఱియొక విషయము:—కుమారసంభవకావ్యములోఁ గల కర్ణాటకభాషాపదబాహుళ్యమును, కర్ణాటకవితాసంప్రదాయమును బండితు లందఱు గ్రహించినవిషయమె. అది కాదనలేదు నన్నయభట్టు మహాభారతమునఁ గన్నడపదముల నక్కడక్కడ ప్రయోగించెను. ఇవి నాచనకవిత్వమునందుఁ గొంచె మెక్కుడున్నవి. ఆంధ్రకర్ణాటభాషాయోష లక్కసెలియండ్రవిధమున సాహచర్య సంపర్కముచే వర్ధిల్లి, ప్రథమమున కర్ణాటభాష పశ్చిమచాళుక్యుల యాదరణచే బెంపొందెను. కర్ణాటదేశమును పశ్చిమచాళుక్యులు పరిపాలనమొనర్చి, కన్నడభాషను వర్ధిల్లఁజేసిరి. ఆంధ్రదేశము పూర్వచాళుక్యులపాలనమునకు వచ్చినపిమ్మట ఆంధ్రభాష క్రమక్రమముగా వృద్ధినిగాంచి రాజరాజుకాలమునాఁటికి నిప్పటిరూపమును దాల్చెను. రాజరాజునకుఁబూర్వము ఆంధ్రభాషకుఁ గర్ణాటభాషా సంబంధము గలుగుచునేయుండెను. అహదనకరశాసనమును జనవువారికి ఆశాసనములోసహితము కన్నడపదములు పెక్కులున్నట్లు గనవచ్చుకలదు. ఆంధ్రవిషయము పూర్వచాళుక్యులపాలనమునకు వచ్చిన తరువాత భాషకుఁ గ్రమక్రమముగాఁ గర్ణాటభాషాసంబంధము వదలి, నన్నయభట్టుకాలమునాఁటికి సమగ్రముగా నిప్పటిరూపము కలిగెను. ఆంధ్రలిపిని, ఆంధ్రభాషను సంస్కరించి భాష కొకప్రత్యేక వ్యక్తిత్వమును దెచ్చుటచేతనే రాజరాజ జాతనిని 'విపులశబ్దశాసనుఁడ'ని వక్కాణించెను. నన్నయభట్టునకుపూర్వము వేంగీవాసులైన పంపకవియు, నాగవర్మయుఁ గర్ణాటకదేశమునకుఁ బోయి యచ్చటనే కావ్యములు రచించిరి. వారు వేంగీవాసులైనట్లు వారే చెప్పుకొనిరి. మహాభారతరచనమునందు నన్నయభట్టునకు సాయపడిన నారాయణభట్టు నందమపూడిశాసనమున నిట్లభివర్ణింపఁబడెను:

"యః సంస్కృతకర్ణాటప్రాకృతపైశాచికాంధ్రభాషాసు కవిరాజశేఖరఇతి ప్రథితః సుకవిత్వవిభవేన."

(ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక, సం ౧. సంచిక ౧.)

ఇట్టి యన్యోన్యమైత్రిగలభావలు నన్నయభట్టుకాలము నాఁటికి విడిపోయెను. నన్నెచోడునికాలము నాఁటికిసంపర్కము పూర్తిగా వదలలేదు. కావున నన్నెచోడుఁడు నన్నయభట్టునకుఁ బూర్వుఁడై యుండి "అన్యభాషాపదమాంషితమై"న కుమారసంభవమును రచించి యుండును.

నన్నెచోడుఁడు కుమారసంభవములోఁ జెప్పిన చరిత్రాంశములు నిర్ధారణచేయుటకు వీలులేకున్నది. తా నొరయూరిపురాధీశ్వరుఁడనుటయు, తనతండ్రి చోడబల్లి పాకనాఁటి నేలుటయు, కరికాలచోడుని తర్వాత చోడరాజ్య మేలినరాజుల పేర్కొనక, తానొక్కనియే చెప్పుకొనుటయు సమన్వయించి చూడ, ప్రాచీనచోడులలో కరికాలునిపిమ్మట చోడరాజ్య మేలినవారలలో నన్నెచోడుఁడొక ప్రతిభాశాలియైన చోడరాజని తెలుసుకొనవచ్చును. కావ్యములలో కవులుచెప్పిన చరిత్రాంశములకు వ్యాఖ్యానములు కల్పించి, అవి యూహలనియు, నిజములుకావనియు చెప్పినంతమాత్రమున విమర్శకులు, గ్రంథసంపాదకులు తమధర్మమును నిర్వహింపనేరరు. తా నొరయూరి కధిపతినని నన్నెచోడుఁడు వ్రాసినవ్రాఁత యబద్ధమనియు, నొరయూరేలినను, ఏలకున్నను చోడరాజులు తమశాసనములందు ఒరయూరిపురాధిపతులమని చెప్పుకొనుట యాచారమయ్యెనని చెప్పి, సమర్థించుట సాహసకృత్యము. నన్నెచోడుఁ డొరయూరేలిన చోడవంశాంబుధిరాజని చెప్పనొప్పును. అందులకే కవిత్వమం దాంధ్రేతరభాషాపదజాలము బహుళముగా నుండెను.

కాఁబట్టి కావ్యములోని చరిత్రాంశము లిదమిత్థమని నిర్ణయించుకొనలేనప్పుడు, కావ్యశైలి ననుసరించియే మనము కవికాలము నిర్ణయముచేయవలెను. కావ్యశైలి ననుసరించి, యీ యుత్తమాంధ్రకావ్యము నన్నయభట్టునకుఁ బూర్వమే రచింపఁబడెననుట కెట్టిసంశయమును లేదు.

ఆంధ్రవిశ్వవిద్యాలయమువారు కాని, మదరాసు విశ్వవిద్యాలయమువారుకాని కుమారసంభవకావ్యమును వ్రాఁతప్రతులన్నిఁటిని సంపాదించి, పరిశోధించి, నిర్దుష్టమైన గ్రంథమును సవ్యాఖ్యానముగాఁ బ్రకటించి, యాంధ్రుల కృతజ్ఞతకుఁ బాత్రులయ్యెదరుగాక.






కిళాంబి రాఘవాచార్యులు

ముద్రారాక్షసకర్త యగు విశాఖదత్తుఁడు జగద్విఖ్యాతయశస్కుఁడు. నాటకప్రస్తావనయం దాతఁడు వటేశ్వరునిపౌత్రుఁ డనియు, పృథువునకుఁ గుమారుఁ డనియుఁ దెలుపఁబడినది.

'సామంతవటేశ్వరపౌత్రస్య మహారాజపదభాక్ పృథుసూనోః కవే ర్విశాఖదత్తస్య.......'

ఇట 'వటేశ్వర' యనుటకు 'వత్సేశ్వర' యనియు, 'పృథుసూనోః' యనుటకు 'భాస్కరదత్తసూనోః' యనియు, 'విశాఖదత్తస్య' యనుటకు 'విశాఖదేవస్య' యనియుఁ బాఠాంతరములు గలవు. విమర్శకులు విశాఖదత్త విశాఖదేవు లొకరేయని యంగీకరించియున్నారు. ఇరువురును వేర్వేఱువ్యక్తులనువాదమును గలదు.[1] గ్రంథమున విశాఖదత్తుని గూర్చి మరేమియును దెలియవచ్చుటలేదు. భరతవాక్యమున 'పాతు వో ఽవంతివర్మా' అని కొన్నిప్రతుల యందును, 'పాతువ శ్చంద్రగుప్తః' అని కొన్నిటి యందును గన్పడుచున్నది. దంతివర్మయగునని కొందరి వాదము. ముద్రారాక్షసమును బ్రకటించిన తెలాంగు మున్నగువా రీవిషయముల విమర్శించియున్నారు.

(a) పల్లవరాజగు దంతివర్మ శైవుఁ డనియు, 'మ్లేచ్ఛైరుద్విజ్యమానా' యను ముద్రారాక్షసవచనమీతనియెడ వర్తించదనియు వీరు స్థిరపఱచియున్నారు. ఈవాదము రంగస్వామిసరస్వతిగారిచే మిథిక్ జర్నలు నందుఁ జర్చింపఁబడినది.[2]

(b) చంద్రగుప్తుఁ డనుపాఠము ధుండిరాజకృతమగు ముద్రారాక్షసవ్యాఖ్యానమున నంగీకరింపఁబడినది. కాని యట మౌర్యవంశీయుఁడని కైకొనఁబడినది. భరతవాక్యమున మౌర్యచంద్రగుప్తుని పేర్కొనుట యసంభవము. గుప్తసామ్రాజ్యాధీశ్వరుఁడగు చంద్రగుప్తుఁడగుచో (క్రీ. శ. 375-413) మాఘునికిని భారవికిని నడుమనుండిన విశాఖదత్తునికాలము రెండుశతాబ్దములు వెనుకకుఁ బోవుచున్నది. ఇదియుఁ బలువురచే నిరాకరింపఁబడినది.

(c) దేశచరిత్రమున నవంతివర్మలు పెక్కురు గలరు. విశాఖదత్తుఁడు గౌడీయపద్ధతిని ముద్రారాక్షసమును రచించియుండుటచేతను, ఇంకను పెక్కువిషయములవలనను కాశ్మీరరాజగు అవంతివర్మ యాతని ప్రభువుగాఁడనియు, నేడవశతాబ్దమువాఁడును, మౌఖరివంశజుఁడును, కాన్యకుబ్జాధీశ్వరుఁడును నగు అవంతివర్మ యగునని తెలాంగుగారు తమపీఠికయందు నిర్ధారణమొనర్చిరి. దీనినే మిగిలిన విమర్శకు లంగీకరించియున్నారు. ఈ యవంతివర్మకుమారుఁడగు గ్రాహవర్మయే హర్షవర్ధనుని సోదరియగు రాజ్యశ్రీని బెండ్లియాడెను.

మఱియు ముద్రారాక్షసప్రశంస దశరూపకమునందును, సరస్వతీకంఠాభరణము, సూక్తిముక్తావళి మున్నగువానియందును గలదు. కాశ్మీరరాజగు లలితాదిత్యుఁ (క్రీ. శ. 726-753) డీ నాటకమునందలి యొకశ్లోకము ననుకరించినటుల శార్ఙ్గధరపద్ధతిలో నుదాహ

1. Dhruva's Introduction to *Mudrarakshasa*. 2. *Mythic Journal* 1923. p 686 - 687.

# కాంగ్రెసు కార్యనిర్వాహకవర్గము



డా. అన్సారిగారు



బాబు రాజేంద్రప్రసాదు
(అధ్యక్షుడు)



జవహరిలాలు నెహ్రూగారు



సర్దారు వల్లభాయి పటేలుగారు



సి. రాజగోపాలాచారిగారు



జమ్నాలాలు బజాజుగారు



మౌలానా అబ్దుల్‌కలాం అజదుగారు

## కాంగ్రెసు కార్యనిర్వాహకవర్గము



కె. ఎఫ్. నారిమనుగారు



డా. సయ్యాదు మహమ్మదుగారు



శ్రీమతి సరోజిని దేవిగారు



డా. బి. సి. రాయిగారు



ఆచార్య క్రిపాలినిగారు



గంగాధరరావు దేశపాండ్యాగారు



డా. పట్టాభి సీతారామయ్యగారు



సర్దారు శార్దూల సింగుగారు

రింపఁబడిన లలితాదిత్యుని శ్లోకమువలనఁ దెలియు చున్నది. ఇదియు పైవాదమునే బలపఱచుచున్నది.

విశాఖదత్తుని కృతులు

వల్లభ దేవుని సుభాషితావళియందు విశాఖదత్తుని వని యీ రెండుశ్లోకము లుదాహరింపఁబడినవి:

శ్లో. త త్త్రివిష్టప మాఖ్యాతం తన్వఙ్గ్యా య ద్వళిత్రయమ్,
యేనానిమిషదృష్టి త్వం నృణా మప్యుపజాయతే. 1548

శ్లో. సేంద్రచాపైః శ్రితా మేఘై ర్నిపతన్నిర్ఝరా నగాః,
వర్ణకంబళసంవర్తా బభు ర్మత్త ద్విపాఇవ. 1728

సుభాషితావళిగ్రంథమునకుఁ బీఠికవ్రాసిన పీటర్సనుగారు విశాఖదత్తుఁ డితరగ్రంథముల రచియించి యుండవోపునని యభిప్రాయపడియున్నారు. అలంకార గ్రంథములఁ బరిశోధింప సుప్రసిద్ధమగు ముద్రారాక్షసము గాక విశాఖదత్తుని కృతులు మూఁడు బయలువెడలినవి. అవి (1) రాఘవానందము, (2) అభిసారికావంచితకము, (3) దేవీచంద్రగుప్తము. ఇవి మూఁడును రూపకములే.

(1) రాఘవానందము :—శ్రీధరదాసుని సదుక్తికర్ణామృతమునం దీశ్లోకము గలదు (1-46-5):

'రామోఽసౌ భువనేషు విక్రమగుణై ర్యాతః ప్రసిద్ధిం పరా
మస్మద్భాగ్యవిపర్యయా ద్యదిపరం దేవో నజానాతి తమ్,
బందీవైష యశాంసి గాయతి మరు ద్యస్యైకబాణాహతి
శ్రేణీభూతవిశాలతాలవివరోద్గీర్ణైః స్వరైః సప్తభిః.'

ఇది కావ్యప్రకాశిక (4-109) యందును గలదు.

దీనిపైన వ్యాఖ్యాన మొనర్చుచు ఝల్కికరుగారు 'రాఘవానందనాటకే రావణముద్దిశ్య విభీషణోక్తి రియ మితి చంద్రికాదౌ స్పష్టమ్.' అని వ్రాసియున్నారు.

(2) అభిసారికావంచితకము :—గ్రంథనామమును గూర్చి ప్రాచ్యపరిశోధనా (Oriental Research) పత్రిక యందు 'అభిసారికయా సత్యా, శబరీవేషేణ పద్మావత్యా, వంచితః ఉదయనో యస్మిన్ త దభిసారికావంచితకమ్' అని ఆర్. రామమూర్తిగారు వ్రాసియున్నారు. అభినవభారతియందును, శృంగారప్రకాశమునందును ఈనాటకప్రశంస గలదు.

అభినవభారతియందు—

కదాచిత్స్వామోఽనుత్పాద్యమానః అఙ్గలీలాలక్షణాత్ విచేష్టితాత్ ఉపజాయతే. నష్టరాగప్రత్యానయనం ప్రా తతో భవతి. యథా విశాఖదేవకృతే అభిసారికాబంధితకే వత్సేశస్య పద్మావతీభట్టశబరీవేషాద్వ్యాచరణరూపాత్ లీలాచేష్టితాత్ కామః ప్రత్యానీతః—ఇందు గ్రంథనామము కొలఁది మార్పును జెందియున్నది.

శృంగారప్రకాశమునందు—

క్రోధో యథా—(శ్రీ)విశాఖదేవకృతే అభిసారికావంచితే వత్సరాజః సంభావితపుత్రవధాయై పద్మావత్యై క్రుద్ధః. తథాచ అభ్యధాత్.

ప్రఘుష్టోగ్రగ్రాహం సరిత మవగాఢః శ్రమవశా
దుపాలీవ శ్శాఖాం ఫలకుసుమలోభా ద్విషతరోః,
ఫణాలీ......నార్భిత్యృత పరిచయాం క్రౌర్యనితరాం
విషజ్వాలాగర్భాం చిర మురగకన్యా మనుసృతః.

దీనివలన వత్సేశుఁడు వాసవదత్తయందు దనకుఁ గల్గిన సుతుని పద్మావతి జంపించెనని యామెపై క్రోధము వహించెననియు, పద్మావతి శబరీవేషమున నాతనియనుగ్రహమును మరలఁ బొంది తన నిర్దోషిత్వమును బ్రకటించుకొనెననియుఁ దెలియుచున్నది.

(3) దేవీచంద్రగుప్తము:—విశాఖదత్తుని కృతులలో (ముద్రారాక్షసముదక్క) నిది యగ్రస్థానమును వహించుచున్నది. రామచంద్ర గుణచంద్రుల నాట్యదర్పణమును బ్రకటించి, యందలి యుదాహరణాదుల వలన విశాఖదత్తుఁడు దేవీచంద్రగుప్తమును రచించెననియు, నది గుప్తసామ్రాజ్యాధీశ్వరుఁడగు ద్వితీయ చంద్రగుప్తునికి సంబంధించినదనియు ప్రొఫెసరు లెవీ గారు 1923-వ సంవత్సరమున నిర్ధారణ మొనర్చిరి. ఈ నాటకము సంస్కృతవాఙ్మయమునకే కాక దేశచరిత్రమునకును మిక్కిలి ప్రధానమగుట దీనినిగూర్చి బెనర్జి, అల్టేకరు, భండార్కరు (D. R) మున్నగువారు వ్యాసములఁ బ్రకటించియున్నారు. ఈనాటకము మనకు సంపూర్ణముగ లభించుటలేదు. నాటకదర్పణముననేకాక

శృంగారప్రకాశమునఁగూడ దీనిప్రశంస గలదు. వీనివలన మనకు గుప్తసామ్రాజ్యమునుగూర్చి నూతనముగఁ దెలిసిన విషయము లివి :—

సముద్రగుప్తునియనంతర మాతని జ్యేష్ఠపుత్రుఁడగు రామగుప్తుఁడు సింహాసనము నధిష్ఠించెననియు, నాతఁడు బలహీనుఁడగుటచే శకాధిపతిచే వోడింపఁబడి తనభార్యయగు ధ్రువదేవి నాతని కొసఁగ నంగీకరించెననియు, వీరుఁడగు చంద్రగుప్తుఁ డిది సహింపనేరక ధ్రువదేవీవేషధారియై శత్రుశిబిరమును బ్రవేశించి శకాధిపతిని సపరివారముగఁ జంపెననియుఁ, దరువాత సోదరులిరువురకు వైరముగలుగ రామగుప్తుని జంపి, ధ్రువదేవిని వివాహమాడి, చంద్రగుప్తుఁడు గుప్తసామ్రాజ్యమును బాలించెననియుఁ దెలియుచున్నది.

ఈవిషయములు యథార్థములని మనకు గ్రంథాంతరప్రమాణములవలన స్పష్టపడుచున్నది.

(A) బాణుని హర్షచరితమున

'అరిపురేచ పరకళత్రకాముకం కామినీవేషగుప్తశ్చంద్రగుప్తః శకపతి మశాతయత్' అని యున్నది. దీనికి శంకరార్యుని వ్యాఖ్య—

శకానా మాచార్యః శకాధిపతిః చంద్రగుప్తభ్రాతృజాయాం ధ్రువదేవీం ప్రార్థయమానః చంద్రగుప్తేన ధ్రువదేవీవేషధారిణా స్త్రీవేషజన పరివృతేన వ్యాపాదితః.

(B) రాజశేఖరుని కావ్యమీమాంసయందు

దత్త్వా రుద్ధగతిః ఖసాధిపతయే దేవీం ధ్రువస్వామినీం
యస్మాత్ ఖండితసాహసో నివవృతే శ్రీశర్మగుప్తో నృపః,
తస్మిన్నేవ హిమాలయే గురుగుహాకోణక్వణత్కిన్నరే
గీయంతే తవ కార్తికేయనగరస్త్రీణాం గణైః కీర్తయః.

ఇందు 'ఖసాధిపతయే' యనుచో 'శకాధిపతయే' యని యుండవలయును. శర్మగుప్తుఁడనుటయుఁ బ్రమాదపతితము.

(C) అమోఘవర్షుని సంజాన్ తామ్రశాసనమునందు

(శక 795 సంవత్సరమున Ep. Ind. Vol. 18, p 248)

హత్వా భ్రాతరమేవ రాజ్య మహరద్దేవీంచ దీన స్తథా
లక్షం కోటి మలేఖయన్ కిల కలౌ దాతా స గుప్తాన్వయః,
యేనాత్యాజి తను స్స్వరాజ్య మసకృద్బాహ్యార్థకైః కాకథా
హ్రీ స్తస్యోన్నతిరాష్ట్రకూటతిలకో దాతేతి కీర్త్యామపి.

అని యున్నది. ఇదియు గుప్తాన్వయుఁడగు చంద్రగుప్తుని పూర్వచరితమును బలపఱుచుచున్నది. పాఠకులు నాట్యదర్పణశృంగారప్రకాశములందు ఉదాహృతములగు దేవీచంద్రగుప్తభాగములకై యీ క్రింది వ్యాసములఁగూడ జూడనగును.


A. S. Altekar - A new Gupta king - Journal of Bihar and Orissa Research Society 1928 June.

D. R. Bhandarkar - New light on early Gupta History. Malaviya Commemoration Volume p 189 - 211.

# ‘నవికృతిశబ్దాత్పరతస్సాంస్కృతికానాం భవంతి గసడదవాః’

వఝుల చినసీతారామస్వామిశాస్త్రి

గసడదవాదేశవిషయము విమర్శకలోకమును నేఁటికిని దోలాందోలితముఁజేయుచున్న విషయ మెల్లరకుఁ దెల్లమెగదా! “నవికృతిశబ్దాత్ పరత స్సాంస్కృతికానాం భవంతి గసడదవాః” అనే సూత్రమునకు ఆధారముగా నన్నయాదిప్రాచీనకవుల ప్రయోగ మేదీ కనబడలేదు. అంతేకాదు. ఈసూత్రమునకు విరుద్ధముగా సర్వలక్షణసారసంగ్రహము (పు. ౫౩) లో తిమ్మకవి చూపించిన శ్రీనాథుని కాశీఖండములోని “ఎవ్వం|డువతియించు”, తిక్కనఉత్తరరామాయణములోని “ఇట్లుదపంబు”, వసుచరిత్రలోని ‘పెం, పువరీక్షింప’ అనేప్రయోగాలేకాక యుద్ధమల్లుని శాసనమందు “ఇందుప్రత్యక్షమై” అనిన్ని, నాచనసోముని ఉత్తరహరివంశమందు (IV, ౫౩) “ఆశ్రమం| బుల్ కైవల్య...వీరఁ గోపించిన” అనిన్ని ఉన్నది.

(బాలకవిశరణ్యము, ౩౧౭ పుట).

“ప్రాసస్థలములఁ జూచి వీనిని నిర్ణయింపవలెను. అట్లుచూడఁగాఁ గొన్నియవ్యయములపై నిత్యముగా రాకపోవుట కానవచ్చును. కొన్నిక్రియలపై నవ్యయములపైఁ గొందఱుకవు లాదేశముచేసియుఁ జేయకయునుఁ బ్రయోగించిరి సంఖ్యాపరిమాణవాచకములపై మాత్ర మీయాదేశము నిత్యముగాఁ గానవచ్చును. ప్రథమాంతములమీఁదఁ గూడఁ గొందఱు వికల్పముగా నీయాదేశమును బాటించిరి. ఆంధ్రశబ్దచింతామణ్యాదుల విశ్వసించి వ్యాకరణకర్తలు గొంద ఱాచ్ఛికముల మీఁది తత్సమములకుఁ గలదని, తత్సమములమీఁది యాచ్ఛికములకుఁ గలదని యింకేమోయని వ్రాసిరిగాని యదియెల్లఁ ద్రోసిపుచ్చఁదగినది. ....... ...ప్రాచీనకాలముననే యీయాదేశము సునిశ్చితముగా నుండలేదు.” (బసవపురాణపీఠిక, ౧౦౫, ౧౦౬ పుటలు).

పయిరీతి ననేకులు విమర్శకు లాంధ్రశబ్దచింతామణిలోని “నవికృతిశబ్దా” దిత్యాదిసూత్రము నాక్షేపించియున్నారు. ఇంతయేల? ఆంధ్రశబ్దచింతామణిని సవరించుచున్న వికృతివివేకమే పైసూత్రము ఫలికాదనియు, వికృతిమీఁది సాంస్కృతిక పరుషములును గసడదవలగుచున్నవనియు “వికృతా త్పరుషాశ్చ స్యుస్సత ఆద్యపదాదిగాః” అని వక్కాణించుచున్నది.

“వికృతిశబ్దా త్పరతః = వికృతిశబ్దముమీఁద నుండునట్టి, సాంస్కృతికానాం = సంస్కృత సంబంధములైన కచటతపలకు, గసడదవాః = గసడదవలు, నభవంతి = కావు. ఉ. దొర కరుణించె” అని బాలసరస్వతి, పై “నవికృతిశబ్దా” దిత్యాది సూత్రమునకు వ్యాఖ్యానము చేసియున్నాఁడు. ఈ వ్యాఖ్యనే తరువాతివారెల్ల ననుసరించియున్నారు. తుదికి బాలవ్యాకరణ ప్రౌఢవ్యాకరణకర్తలును నీమార్గముననే సూత్రించిరి.

“తెనుఁగులమీఁది సాంస్కృతిక పరుషములకు గసడదవలు రావు” (బాల. సంధి ౧౮ సూ.)

“కొన్నియెడలఁ దెనుఁగులమీఁది సాంస్కృతికకతపలకు గదవలు గానంబడియెడి” (ప్రౌఢ-సంధి ౫ సూ).

పయిరీతి నాంధ్రవ్యాకరణకర్త లనేకు లాంధ్రశబ్దచింతామణి ననుసరించియు, దానిని విమర్శించియు నున్నారు. తిక్కయజ్వాది మహాకవి ప్రయోగములు సైతము నవికృతీత్యాదిసూత్రమునకు విరుద్ధముగనే యున్నవి. తుదికి నన్నయభట్టారకుని భారతభాగమందైనను నీసూత్రమునకు సమూలకత్వమును సమర్థించు ప్రాసాదిస్థలనిబద్ధప్రయోగ మగపడదు.

నన్నయభట్టారకునకు ముందటి శాసనములందును, నాతనికాలమందలి శాసనములందును “నవికృతిశబ్దా” దిత్యాదిసూత్రమును సమర్థించు ప్రయోగ మగపడదు సరేగదా దీనికి విరుద్ధములగు “ఇందుప్రత్యక్ష” ప్రయోగములును వెలయుచున్నవి. ఇట్టిస్థితిలో నిర్మూలమును, ప్రయోగ విరుద్ధమును నగు నీసూత్రమును జింతామణికర్తవంటి వైయాకరణాగ్రగణ్యుఁడు రచించియుండునా యని యాలోచింపవలసి యున్నది.

ఆంధ్రశబ్దచింతామణి నన్నయభట్టుచే నాతనిభారతభాగరచనమునకుఁ బూర్వమున రచింపఁబడెననియు, నక్కారణమున నాంధ్రశబ్దచింతామణి కావఱకుఁ బండితసమ్మతములయియున్న నియమములె మూలములనఁదగుననియు, నట్టి వావఱకున్న శాసనాదులలోఁ గొన్ని వెలయుచున్నవనియు నారచించిన ‘చింతామణివిషయ పరిశోధనము’ నందు విశదపఱిచితిని. నన్నయభట్టునకుఁ బూర్వకాలమునందలి శాసనములందును, నాతనికాలమునందలి శాసనములందును గసడదవాదేశవిషయమునఁ గొంత వ్యవస్థ యగపడుచున్నది.

నన్నయభట్టారకునికిఁ బూర్వకాలమందలి వనఁడుగు పండరంగుని యద్దంకిశాసనమును, యుద్ధమల్లుని బెజవాడశాసనమును బరిశీలింపఁగాఁ దెలుఁగుప్రథమావిభక్తిప్రత్యయములమీఁదను, లుప్తప్రథమా

విభక్తికములను నాచ్ఛికశబ్దములమీఁదనుమాత్ర మీ గసడదవాదేశము నిత్యముగావచ్చుట నియతముగ నగపడుచున్నది.

"పట్టంబుగట్టిన; పట్టంబుగట్టిఇచ్చి; కొట్టంబుల్పండ్రెణ్డుగొణి; బయల్సేసి; దుర్గ్గంబుగడు"

(అద్దంకిశాసనము. శాసనపద్యమంజరి ౧ శాసనము)

"రాజాశ్రయుణ్డుద్రిభునాథరనుణ్డు;
బ్రన్దంబుగొని; పాపంబుగొణ్డు;
పట్టంబుగట్టిన; పాపంబుదనుకు;

ఒణ్డుసోటు; (ఇందలి డుజ్ప్రథమాప్రత్యయము) అనఘుణ్డు సేకొని; యిన్దుప్రత్యక్షు; అఱపుటవాపంబుగాన; మల్లపరాజువేరెఱు; (ఇచటి రాజుశబ్దము తద్భవముతాలవ్యము దంత్యమగుటయే యిచటి వికృతి - మంచము—మంచము. ము) ఇడ్డట్లుగా."

(యుద్ధమల్లుని బెజవాడశాసనము. శాసనపద్యమంజరి౨శాసనము.)

ఈకాలమునకింకను లుప్తప్రథమావిభక్తిప్రత్యయకము లగు సంస్కృతసమశబ్దములమీఁద నీయాదేశము వచ్చెడి సంప్రదాయము లేదు.

"సేనపట్టంబు" (అద్దంకిశా. శాసనపద్య. ౧. శాస)
"విఖ్యాతకీర్తిఃప్రస్తుత." (యుద్ధ. బెజ. ౨. శాస)

యుద్ధమల్లుని బెజవాడశాసనమున 'రాజువేరెఱు' అనుచోటి రాజుశబ్దము తద్భవమగుటంజేసి యది సంస్కృతసమముగాక సంస్కృతభవమె యగుచున్నదిగాన నట్టి యచ్చతెనుఁగుశబ్దముమీఁద నాదేశమువచ్చుట శంకాస్పదముకాదు.

"తేజుణ్డు తనధర్మ్మఃవు" అనుచోఁ బద్యాంతము గాన తెలుఁగుప్రత్యయముమీఁదనైతె నాదేశము రాదయ్యెను.

ఇంక నన్నయభట్టుకాలమునాఁటిదగు సోమలదేవిశాసనమునం దన్నను లుప్తప్రథమావిభక్తిప్రత్యయక మగు సంస్కృతసమశబ్దము మీఁదనైతె మీగసడదవాదేశము ప్రాచీనసంప్రదాయమునకన్న విశేష ముగ నగపడుచున్నది.

"మందగమనదొల్లి"
"సరసిజాస్యగనక"

(శాసనపద్యమంజరి. 3 నెం. శాసనము. సోమలదేవిశాసనము).

పయి శాసనప్రయోగములనుబట్టి చూడఁగాఁ గేవలప్రాచీన కాలమునాఁడు తెనుఁగుప్రథమావిభక్తిప్రత్యయములగు "డు, ము, వు, లు" అనువానిమీఁదను, లుప్తప్రథమావిభక్తి ప్రత్యయకములలో నాచ్ఛికములమీఁదనుమాత్రమె యీ యాదేశము వచ్చుట సంప్రదాయమైయుండెడిదనియు, నన్నయభట్టునాఁటి కట్టినియమము లేకుండ లుప్తప్రథమాప్రత్యయకములగు సంస్కృతసమశబ్దములమీఁద నైతె మీయాదేశము వచ్చెడి సంప్రదాయ మారంభించెననియు విశదముకాక మానదుగదా! అట్టియెడల నన్నయభట్టారకుఁ డందలి కేవలప్రాచీనసంప్రదాయము నుపేక్షించి సోమలదేవిశాసనపద్ధతినే యనఁగాఁ దనకాలమున కేర్పడియున్న పండితకవిసంప్రదాయమునే 'గసడదవాస్యు'రిత్యాదిచే సూత్రించెనని యెన్నవలయును.

శ్లో. గసడదవాస్యుః ప్రథమామాత్రాదాత్మస్మదో ర్విన్నై నై తే, నవికృతిశబ్దా త్పరతః సాంస్కృతికానాం భవంతి గసడదవాః.

టీ. ఆత్మస్మదోః=తా-నా-శబ్దములయొక్క ద్రుతాంతప్రథ మావిభక్తిరూపములను వినాగా, ప్రథమావిభక్తిసూత్రమునకం టెఁ బరమైన, ఏతఏవ=ఈకచటతపలె, గసడదవాః స్యుః=గసడదవలుగా మాఱుచున్నవి. సాంస్కృతికానాం = సంస్కృతసమశబ్దములలో, నవికృతశబ్దాత్ పరతః=వికృతిచిహ్నములను 'డు-ము-వు-లు' అనెడి ప్రథమాప్రత్యయములు లేని శబ్దమునకన్నఁ బరమైన కచటతపలకు నైతము, గసడదవాః=గసడదవలు, భవంతి=అగుచున్నవిగదా!

ప్రాచీనతమకాలమందలి "యాచ్ఛికశబ్దముమీఁదను, తెలుఁగు విభక్తులమీఁదనుమాత్రమె యీయాదేశము వచ్చు"ననెడిసంప్రదాయము మాఱి లుప్తప్రథమాప్రత్యయక సంస్కృతసమశబ్దప్రథమారూపముల మీఁదనైతె మీయాదేశము వచ్చుట తననాఁటికి నెలకొనియుండుటచేఁ బ్రథమాప్రత్యయము కలదా, లేదాయనువిచారణ మక్కఱలేకయే, సాంస్కృతికమా, యాచ్ఛికమా యనువిచారమును నక్కఱలేకయే ప్రథమావిభక్తిమాత్రముమీఁదనే గసడదవాదేశము నిత్యముగావచ్చు నని నన్నయభట్టు సూత్రించినవాఁడయ్యెనని యెఱుంగనగును. సంస్కృతసమశబ్దములమీఁదఁ దెలుఁగువిభక్తులు నిలిచియున్న ప్పుడేగాని యీ యాదేశము రాదనెడి ప్రాచీనతమకాల నియ మము మాఱిపోయిన దనువిషయమును 'ప్రథమామాత్రా'త్తనుచోటి మాత్రాశబ్దముచేతనే వ్యక్తపఱిచియు నట్టియర్థమును స్పష్టతాప్రతి పత్తికయి 'నవికృతిశబ్దా'దిత్యాద్యుత్తరార్థముతో విశదీకరించినవాఁ డయ్యెను. తా నాశబ్దములు ప్రథమాంతములయినను ద్రుతప్రకృతి కములగునపుడు వానిమీఁది కచటతపలకు "పరుషాద్రుతప్రకృతికా" దిత్యాది పూర్వసూత్రముచేత గజడదబాదేశాద్రుతసంధికార్యము లె వచ్చునవియు, దానికిఁ బ్రకృతసూత్రము బాధకము కానేరదనియు విశదీకరించుటకయి "ఆత్మస్మదో ర్వినా" అని యిట్లు పర్యు దాసించెనని గ్రహింపనగును.

ఆథర్వణాచార్యునినాఁటి కాంధ్రవాఙ్మయము విస్తరించి యుండుటచే నాతఁడు శాసనాదిస్థితప్రాచీనసంప్రదాయముల నర యకయే వాఙ్మయస్థప్రయోగములనుమాత్రమె చూచికొని వ్యాకరణ రచనముచేసినవాఁ డగుటంజేసి యాతఁడు పై నన్నయాభిప్రాయమును గ్రహింపనేరక వేఱువిధముగ నన్నయభట్టారకసూత్రమున కర్థము చేసికొని వేఱు తెలుఁగున దానిని దనకాలపు మహాకవిప్రయోగముల

చెప్పిన సవరించి "వికృతాత్పరుషాశ్చ స్యుః" రిత్యాదిసూత్రము నుపదేశించినవాఁడయ్యెననియుఁ, దర్వాతివారును దన్మార్గగాములై యిరనియు గ్రహింపవలయును.

నన్నయభట్టారకుని భారతభాగమందు సైతము ప్రథమావిభక్తిమీఁద నియతముగా గసడదవాదేశము చేయఁబడినదని యందలి యీ క్రింది ప్రాసస్థలప్రయోగములు విశదీకరించుచున్నవి.

"చం... "గగనమునందు ... జగతి ... తను... మానుగ ..." (ఆది. ౭ ఆ. ౬౯ ప)

"ఉ. "తగిలి...గోచర, నును...ఇ, మ్మగ... మిగిడిరి..." (సభా. ౨-౮౫)

క. "చేసమరికొంచుఁ బోడువఁగ, డాసిన...జయో, ద్భాసి ...మ, హాసత్త్వుఁడు..." (ఆది. ౬ ఆ. ౨౦౬)

ఇంకఁ బ్రథమేతరవిభక్తీతరములగు కళాశబ్దములమీఁదనయిత మీ యాదేశము వచ్చెడి యర్వాచీనసంప్రదాయము నన్నయభట్టునకుఁ బూర్వపుశాసనములందేకాక నన్నయభారత భాగమునందు సైతము లేదు.

అవధారణార్థకములమీఁద

"డాలికకలశబు" (యుద్ధ-బెజ. శాస ౧ నెం)

"పర్వంబ కడునేర్మలనఁగ" (ఆదిపర్వ ౧ ఆ ౫౯)

క్త్వార్థకములమీఁద, వ్యతిరేకక్త్వార్థకములమీఁద

"కట్టిచ్చిప్రభు; నిల్పికట్టెపు; చేసికణ్ణుహార్; (అద్దంకి. శాస ౨ నెం.)

"వచ్చిత్రిణయుర; మెచ్చకతినితి; ఒడబడికాచు;" (యుద్ధ బెజ. శాస. ౨ నెం.)

త్రికసర్వనామములమీఁద

"ఆత్రిభువనాంకుశ;" (అద్దంకిశాస. ౧ నెం.)

ప్రశ్నార్థకావ్యయముమీఁద—"సరియకాంతలు"

సంబోధనార్థకావ్యయములమీఁద

"ఓ! హోతకుక" (ఆదిపర్వ. ౧ ఆ. ౨౩౫)

ధాతుజవిశేషణములమీఁద

"కట్టినప్రదమంబు;" (అద్దంకిశాస. ౨ నెంబరు) "కలతాన పతులు; కట్టినపతియు; అలసినపాపంబు;

'చేకొను' మున్నగుజంటశబ్దములమీఁద

'చేకొని' (యుద్ధ-బెజ-శాస. ౧ నెం) "చేకొను...... ప్రాకట......" (ఆది ౨ ఆ ౫౧ ప)

శేషషష్ఠిమీఁద

"రాజు పట్టంబుగట్టినపతియు(రాజు యొక్క పట్టమని యర్థము గాన నిది ప్రథమకాదు. ప్రదమయగునపు డీశాసనమునందె 'రాజు వేతెఱు' అని యాదేశమువచ్చినది.) (యుద్ధ-బెజ-శాస. ౨ నెంబరు).

"కం. సీకతమున... ప్రాకట... (ఆది ౨ ఆ ౫౧) "బెజయితదేవనిహూంతు; రేవలదేవికనిన సోమలదేవి;" (సోమలదేవిశాసనము. శాసనపద్యమంజరి. 3 నెం)

ఇందు 'రేవలదేవి' అనునది 'నాకన్నకొడుకు' మున్నగురీతిని బ్రాచీనసంప్రదాయము చెప్పిన షష్ఠ్యంతమని గ్రహింపక కీర్తిశేషులగు కె. వి. లక్ష్మణరావుగారీప్రయోగమునె చూపి "ప్రాచీనకాలమందును నీగసడదవాదేశము వికల్పమె" అని వ్రాయుట పొరపాటనక తీరదు.

నన్నయకుఁ దర్వాతిమహాకవుల గ్రంథములలోఁ బైనియమములు కానరావు. తుదికి క్త్వాంతముమీఁదసైతము తిక్కయజ్వ గసడదవాదేశమును బాక్షికముగాఁ జేసినట్లు సూచిమంచి తిమ్మకవి యుదాహరించి యున్నాఁడు. అట్టిప్రయోగములనుబట్టియే యథర్వణుఁ డీయాదేశమును బాహుళకముగాఁ దలంచెను.

మొత్తముమీఁద నన్నయభట్టుకారికకు నాచేసిన వ్యాఖ్య యథర్వణాహోబలాదివివరణములకు విరుద్ధమేయయ్యుఁ బ్రాచీన సంప్రదాయసిద్ధమును, సహజమును, నన్నయాభిప్రేతమని విశ్వసింపఁ దగినదియు నని తలంచి యిట్లు ప్రకటించుటకు సాహసించినవాఁడ నయితి. విమర్శకులగు విద్వాంసులు నాయీవ్యాఖ్యను బరిశీలించి నన్నయభట్టారకుని "నవికృతిశబ్దా త్పరతః సాంస్కృతికానాం భవంతి గసడదవాః" అనుసూత్రముపై వచ్చియున్న నిర్మూలకతారూపాసంగతిదోషమును నిరాకరింతురని విశ్వసించుచున్నాను.






# పాలకురికి సోమనాథకవి; బసవరగడ

బండారు తమ్మయ్య

గడచిన నాలుగుసంచికలలోను సోమనాథుని పంచప్రకారగద్య, నమస్కారగద్య, అక్షరాంకగద్య, అక్షరాంకపద్యములను వరుసగఁ బ్రకటించియుంటిని. వానినిబట్టి ప్రాచీనాంధ్రవాఙ్మయము నందలి గద్యకృతుల స్వరూపలక్షణాదికములను పాఠకులు గ్రహించియుందురు. ఇప్పుడు ప్రకటించునది బసవరగడ. పిడుపర్తి సోమనాథుని పద్యబసవపురాణావతారికనుబట్టి మన పాలకురికిసోముఁడు బసవరగడ, బసవాద్యరగడ, సద్గురురగడ, గంగోత్పత్తిరగడ మున్నగు కొన్నిరగడకృతులను రచించినట్లు కానవచ్చును. వీనిలో బసవరగడ మాత్రమే నాకుఁ బ్రస్తుతము లభించినది. ప్రాచీనాంధ్రవాఙ్మయములో జాతీయగేయకృతులలో రగడలకు విశేషప్రచార మున్నట్లు కాన్పించును. ఛందోగ్రంథకర్తలు కందములు, అక్కరలు, ద్విపదలు మున్నగువానితో నీరగడలనుగూడ జాతులుగాఁ బరిగణించిరి. నన్నయభట్టారకుని భారతభాగములో అక్కరలు, తరువోజలు కానవచ్చునుగాని యీరగడకృతులు కానరావు. తిక్కన, ఎఱ్ఱాప్రెగ్గడ, నన్నెచోడుఁడు, శ్రీనాథుఁడు మున్నగువారి కావ్యములలోఁగూడ నివి యుపయోగింపఁబడినట్లు కానరాదు. ప్రబంధయుగమునుండి బయల్వెడలిన ప్రబంధములలోమాత్రము తఱుచు పుష్పాపచయ వర్ణనాదికసందర్భములలో నీరగడ లుపయోగింపఁబడుచువచ్చినవి. మన కుపలబ్ధములయిన రగడలలో నేనెఱిఁగినంతవఱకుఁ బెద్దనార్యుని మనుచరిత్రమునఁ గానవచ్చునదియే మొదటిదిగాఁ జెన్నఁదగును. ఇట్లగుటఁ బ్రస్తుతము ప్రకటింపఁబడు నీబసవరగడ నన్నయకాలము నాఁటికి మనభాషలోఁ బ్రచారమందున్న ప్రాచీనరగడకృతుల స్వరూపమును దెలియుట కుపకరింపనేర్చునని నాయాశయము:

కన్నడములోఁ గేవలము తెలుఁగుబాసలోవలెఁగాక యించుక విలక్షణముగ నీరగడకృతులు మాత్రాగణబద్ధములుగ నున్నవి. నాగవర్మ తన ఛందోంబుధిలో రఘటాలక్షణము నిట్లు వివరించినాఁడు.

క. గణనియమవిపర్యాసదొ
ళెణెవడె దొప్పెదుమాత్రె సమనాగెగణా
గ్రణియమతదిందె తాళద
గణనెగొండంబట్టుదదువె రఘటాబంధం.

దీనికి శ్రీ కిట్టెలుదొరగారి వివరణము—

**The Raghate is neither built on the system of syllable feet nor on that of a mere number of moras but on an equal number of moras (matras) included within certain feet (gana) and harmonises with beating time in music (తాళ).**

మఱియు మనతెనుఁగులోఁ బలుతెఱంగుల రగడకృతు లుండఁగాఁ గన్నడములో మందానిలము, లలితము, ఉత్సవము అని ముఖ్యముగ మూఁడువిధములగు రగడలుమాత్రమే యున్నవి:

క. మందానిల లలితోత్సవ
వెందె రగళెగళనామ, మక్కుం క్రమదిం
దొందకె పదినాఁకెర్ప
త్తొందక్కిర్పత్తునాల్కు మాత్రెగళ బలే.

మందానిలమునకుఁ బాదమునకు నాలుగేసిమాత్రలు గలిగిన గణములు నాలుగు, లలితమునకుఁ బాదమున కయిదేసిమాత్రలుగల గణములు నాలుగు, ఉత్సవమునకుఁ బాదమునకు మూఁడేసిమాత్రలు గల గణము లెనిమిదియు నుండవలెను. ఈమందానిల లలితోత్సవరగడలు క్రమముగ మనభాషయందలి మధురగతి, ద్విరదగతి, తురగవల్గనరగడలతో సరిపోవును. మఱియు, ఉత్సవరగడ యొకమాత్రతగ్గించినచో మన భాషలోని యుత్సాహవృత్తముతో సరిపోవుచు నందుచేతనే కాఁబోలు, దానితో నామసామ్యమునుగూడఁ గలిగియున్నది. మన బసవరగడ కన్నడమందలి యుత్సవరగడకును, తెనుఁగునందలి తురగవల్గనరగడ (పాదమున కెనిమిదేసి సూర్యగణములుగలది) కును సరిపోవుచున్నది. రగడకుఁ బ్రారంభమున ఉత్సాహవృత్త ముంపఁబడినది. ఇది ప్రతిపాదాంతమునను "శరణుబసవ" యనుమకుటముతో ముగియుచుండును. కర్ణాటకవిచరిత్రకారులు దీనిని కర్ణాటకృతిగా గ్రహించి "శరణుబసవరగళె" యని తమ గ్రంథమునఁ జేర్చినియున్నారు. కాని యిది పొరపాటు. కన్నడమునకు విలక్షణమగు యతినియమ మిందుఁ బాటింపఁబడుటచే నిది యాంధ్రభాషాకృతిగనే గ్రహింపఁదగునని నాయభిప్రాయము. సోమనాథుఁ

డీరగడకు "బసవాష్టోత్తరశతనామములు" అను నామాంతరముగూడ నుంచినట్లు రగడ చివరనున్న కన్నడకందపద్యమువలనఁ దెలియనగును. బసవపురాణములో సోమనాథుఁడు తద్గ్రంథశ్రోతయగు గొబ్బూరి సంగనామాత్యుని "బసవనామావళిపాఠకాసక్త", "బసవనామావళి పఠనానురక్త" అని సంబోధించుటచే నం దుదాహృతమయిన 'బసవనామావళి' యీ బసవరగడయే యైయుండుననియు, అది యప్పుడు భక్తులపఠనపారనప్రచారములో నుండియుండుననియుఁ గూడ గ్రహింపనగును. దీనిలో ౧౦౮ పాదము లున్నవి. రగడలు ద్విపదలవలె ద్విపాదనియమముగలవి. కాని ద్విపదలవలె నొక్క యాది ప్రాసనియమమే గాక వీని కంత్యప్రాసనియమముకూడ విశేషముగ నున్నది.

క. ఆద్యంతప్రాసంబులు
హృద్యంబుగ రెంటరెంటనిడి పాదములు
ద్వ్యద్యతులఁ గూర్పఁ దగు నవ
పద్యంబుగ రగడలందు వారిజనాభా.

అని యనంతుఁడు తన ఛందోదర్పణమున వివరించినాఁడు. అప్పకవికూడ నట్లే యనువదించినాఁడు. కాని మనసోమనాథునికృతి యీలక్షణమునకుఁ గొంత వైలక్షణ్యమును గలిగియున్నది. ఈ ద్విపాదైకాంత్యప్రాసనియమము నాతఁడు మొదటి ౭౮ పాదములవఱకు మాత్రమే యనుసరించినట్లు కానవచ్చును. తరువాతిపాదములలో ద్విపద పంక్తులలోవలెనే యచ్చటచ్చటఁ బ్రాసయతినిగూడ నంగీకరించుచు ౧౪ పాదములవఱకు, ఏపాదమున కాపాదమునందే పాదమున కొక్కొక్కప్రాసముచొప్పున నీ యంత్యప్రాసనియమమును బాటించి నట్లును, అటుతరువాత మఱి ౮ పాదములలో నిట్టినియమమునే మఱి కొంతవిలక్షణముగఁ బ్రదర్శించినట్లును గోచరించును.

ఈకృతికి నాకు దొరకినప్రతులు రెండుమాత్రమే. ఒకప్రతిలో ౧౦౦ పాదములుమాత్రమే యున్నవి. మఱొకప్రతిలో "శరణు శరణు శరణుబసవ - శరణు శరణు శరణుబసవ" అనుపాదము లెనిమిది చివర నెక్కువగానుండి మొత్తము ౧౦౮ పాదము లున్నవి. ఇది వఱలోఁ బ్రకటించిన గద్యకృతులవలెనే యిదికూడ లేఖకదోషములతో నిండియున్నందున నర్థము సుగమముకానిపట్టులను, గ్రంథపాతములున్నచోటులను నాసవరణలను, పూరణములను గుండలీకరణములలోఁ గనఁబఱిచి యసలుపాఠములను, పాఠభేదములను దిగువను బ్రకటించితిని. విజ్ఞు లిందలిలోపములను మన్నింతురు గాక.

బసవరగడ (బసవాష్టోత్తర శతనామములు)

శ్రీవరాజదేవరాజ - సిద్ధసాధ్యయక్షుర
శ్రీవిహంగరాట్ప్లుతంగ - సోమధూమకరమరు
జ్జీవితేశవిధృతపాశ - సేవితోద్యవంఘ్రిరా
జీవనిమ్మనాంపాగశ్వే - శ్రీవృషాధినాయకా.
శ్రీవృషాధినాయకప్ర - సిద్ధభావశరణుబసవ
తావకాంఘ్రిసేవకాఘు - దావ (దావ)[౧] శరణుబసవ
నందిత ద్వితీయశంభు - నామధేయశరణుబసవ
వందితత్రిలోకవిబుధ - వరనికాయశరణుబసవ
అచలశైవధర్మనిర్మ - లావతారశరణుబసవ
ప్రచురయుగమితాంఘ్రిధర్మ - పథవిహారశరణుబసవ
ప్రమథగణ (పతి)[౨] ప్రసిద్ధ - పట్టభద్రశరణుబసవ
ప్రమథశాశ్వతప్రభావ - (భవసముద్ర)[౩] శరణుబసవ
సురవినుతశిలాదలబ్ధ - సుకృతరూపశరణుబసవ
హరగణాభిజాతచిన్మ - యప్రదీపశరణుబసవ
కమలభవశిరః (కపాల)[౪] - కాలరుద్రశరణుబసవ
సుమహదంబుజాక్షు (మకుట)[౫] - శూలరుద్రశరణుబసవ
నీతవిష్ణుశల్యహార - నీలరుద్రశరణుబసవ
ఖ్యాతభూతపంచ (కాంత)[౬] - కాలరుద్రశరణుబసవ
నారసింహదళనశరభ - నామరుద్రశరణుబసవ
భూరిమత్స్యకూర్మహరణ - భూమరుద్రశరణుబసవ
హరిసమేతదక్షయజ్ఞ - హరణరుద్రశరణుబసవ
కరివిదళనతాండవప్ర - కరణరుద్రశరణుబసవ
దర్పితత్రిపుర (మదా)[౭]ప - దానరుద్రశరణుబసవ
దర్పకాంగదాహకాభి - ధానరుద్రశరణుబసవ
కాలకూటవిధృతనీల - కంఠరుద్రశరణుబసవ
(కాలగర్వహరణగరళ - కంఠ)[౮] రుద్రశరణుబసవ
అమరగణమదాపహరణ - యక్షరుద్రశరణుబసవ
యమమదోన్మదాప(హరలి - కాక్షు)[౯] రుద్రశరణుబసవ
విముఖమునికృతా(వమాన - వీత[౧౦]) రుద్రశరణుబసవ
ప్రముదితేంద్రకీలచరకి-రాతరుద్రశరణుబసవ
అంధకాసురోన్మదాప-హరరుద్రశరణుబసవ
బంధురేందుసింధుజూట - భారరుద్రశరణుబసవ
జలజనేత్రనేత్రచరణ - జలజరుద్రశరణుబసవ
జలజజాతమస్తపాణి - జలజరుద్రశరణుబసవ
జలజ(సఖముఖానతాంఘ్రి)[౧౧] - జలజరుద్రశరణుబసవ
జలజరిపునిపీడనాంఘ్రి - జలజరుద్రశరణుబసవ
వికచబసవనామ(మర్త్య)[౧౨] - వినుతరుద్రశరణుబసవ
సకలభక్తజనహితార్థ - జనితరుద్రశరణుబసవ
పరమవీరభక్తిపట్ట - (బద్ధ)[౧౩]రుద్రశరణుబసవ
చిరమనోరథప్రదప్ర-సిద్ధరుద్రశరణుబసవ

---

౧. దాహ ౨. పద ౩. భావశుద్ధ; భవసమృద్ధ ౪. కరాబ్జ. ౫. కుణప ౬. కాత్మ ౭. హరా ౮. కాలహరణయుగళయాపకంఠ. ౯. హరలాక్షు; హావలక్షు, ౧౦. కృతాహిపతినివినుత, ౧౧. నఖకరాంగుళాంఘ్రి, ౧౨. మాత్య, ౧౩. భద్ర.

మాను(పాఠార్చ)[౧౪]నాదృతాస-మానరుద్రశరణుబసవ
ఆనతజనరక్షణమహి-(మాధ్య[౧౫])రుద్రశరణుబసవ
అధిగతప్రమథగణాప - రావతారశరణుబసవ
విధినిషేధపుణ్యపాప - విపరదూరశరణుబసవ
వినుతకలియుగప్రసన్న - వీరభద్రశరణుబసవ
అనవరతకటాక్షచిరద-యాసముద్రశరణుబసవ
ప్రమథగణపురాతనగణ - భక్తసద్మశరణుబసవ
అమరదనుజమనుజగణన - తాంఘ్రిపద్మశరణుబసవ
భువనపరిషదవనసుచిర - పుణ్యతీర్థశరణుబసవ
శివగణాపచారవిహిత - జీవనార్థశరణుబసవ
తామసాదిగుణరహితని-తాంతకరణశరణుబసవ
కామచాపమస్తలస్త-కప్రహారణశరణుబసవ
సారవీరశైవసమయ - చక్రవర్తిశరణుబసవ
తారహారశారదాభ్ర - ధౌతకీర్తిశరణుబసవ
చారులైంగ్యగౌరవప్ర-సాదపుణ్యశరణుబసవ
దీరవీరభక్తి(పథసు)[౧౬]-ధీవరేణ్యశరణుబసవ
నతజనాంగదీప్తపాద - నఖరముకురశరణుబసవ
కృతమతిప్రబోధనార్థ - గీతనికరశరణుబసవ
సస్మితాననాబ్జరుచిది-శాప్రపూరశరణుబసవ
విస్మ (యాది[౧౭]) జననహేతు - విషయమారశరణుబసవ
అకుటిలస్వసమయపాల - (అనైకవివశ[౧౮]) శరణుబసవ
సకలజైనబౌద్ధసాంఖ్య - శైలకులిశశరణుబసవ
స్వైరవాదమాషమదని-వారణాద్యశరణుబసవ
క్రూరతరభవప్రపంచ - రోగవైద్యశరణుబసవ
కుటిలభవవిషయవిశాల - కుజకుఠారశరణుబసవ
చటులభవబలాహకప్ర - చయసమీరశరణుబసవ
ప్రకటభవలతావితాన - పటులవిత్రశరణుబసవ
వికటభవి[౧౯]సమిత్సమూహ - వీతిహోత్రశరణుబసవ
ప్రకృతిబీజభవమదేభ - పంచవదనశరణుబసవ
వికృతివిషయభవవిపక్ష - విజయకదనశరణుబసవ
ప్రకటతరభవార్ణవోత్త - రణవహిత్రశరణుబసవ
సకలవైదికాప్రశస్త - సమయజైత్రశరణుబసవ
కలితలలితభసితనిసిత - కనదురస్కశరణుబసవ
మిలితఫలితదశదిశాభ్ర-మితయశస్కశరణుబసవ
పరమపరమహత్త్వతత్త్వ - పాత్రశీలశరణుబసవ
సురవిసరవిరచితనిచిత - సూత్రలోలశరణుబసవ
శౌర్యచర్య (శూర్యవర్య-౨౦) జగదవార్యశరణుబసవ
అర్యవార్యధైర్యధుర్య - యసమవీర్యశరణుబసవ
సుజనకుజనసుపథకుపథ- సుముఖవిముఖశరణుబసవ
వృజినయజనవికృతసుకృత - విముఖసుముఖశరణుబసవ
కోపతాపపాపలేప - గుణ (దురాప-౨౧) శరణుబసవ
(గోపరూపకోపదహిత - కుసుమచాప-౨౨) (౧-౪౮) శరణుబసవ
స్మరవిపక్షహారసదృక్ష - విరదయాక్షశరణుబసవ
పరమపుణ్యసురవరేణ్య - (భక్తగణ్య-౨౩) శరణుబసవ
(చరణనిరతతరితదురిత - పరమచరిత-౨౪)శరణుబసవ
(భరితరుచిరభువననికర - భక్తసుకర-౨౫)శరణుబసవ
దురితమారదరితఘోర - భరితవీరశరణుబసవ
నరవిచిత్రతపపవిత్ర - వరచరిత్రశరణుబసవ
అహితహీనమహితయాన-౨౬ - విహితదాన-౨౭శరణుబసవ
రహితకాలమహితశీల - సుహితలీలశరణుబసవ
ప్రకృతివరణవికృతిహరణ - సుకృతిభరణ-౨౮శరణుబసవ
సుకరనాద-౨౯నికరవేద - ముకురపాదశరణుబసవ
బాఢశౌర్యగాఢధైర్య - రూఢవీర్యశరణుబసవ
వ్యూఢకీర్తిరూఢమూర్తి - ప్రౌఢవర్తి[౩౦]శరణుబసవ
వ్యక్తవేదయుక్తనాద - శక్తిమోదశరణుబసవ
శక్తిజైత్రయుక్తిపాత్ర - భక్తిగోత్రశరణుబసవ (౪౯-౯౨)
ధర్మరూపశరణుబసవ - దమితపాపశరణుబసవ (౪౯ - ౯౩)
నిర్మలాంగశరణుబసవ - నికృతభంగశరణుబసవ
సత్యశుద్ధశరణుబసవ - సత్ప్రబుద్ధశరణుబసవ
నిత్యభాగ్యశరణుబసవ - నిఖిలమృగ్యశరణుబసవ
ప్రమథలౌల్యశరణుబసవ - భక్తిమూల్య[౩౧]శరణుబసవ
శమగుణాఢ్యశరణుబసవ - శమితమాఢ్యశరణుబసవ
అసమగానశరణుబసవ - ఆద్యమాన౩౨శరణుబసవ
రసికముకుర[౩౩]శరణుబసవ-రాగసుకర[౩౪]శరణుబసవ(౯౩-౧౦౦)
శరణుశరణుశరణుబసవ - శరణుశరణుశరణుబసవ

” ” ” ” ” ” ” ”
” ” ” ” ” ” ” ” (౧౦౧-౧౦౮)

క. శరణస్తవకల్పకుజాం
కురపదశాఖాభిజాత నవకుసుమాష్టో
త్తరశతనామంగళ బస
వరసంగర్పిసిదపాల్కురికి సోమాంకం.

బసవాష్టోత్తరశతనామములు సమాప్తము
ఇతి శ్రీబసవేశ్వరార్పణమస్తు

---

౧౪. పాఠ, ౧౫.మాది; మాన, ౧౬. పథిక, ౧౭. యాభి, ౧౮. నాగ్రగణ్య, ౧౯. భవ, ౨౦. తూర్యపూర్య, ౨౧. విలాప, ౨౨. ధూపగోపవదకలాపమదదురాప, ౨౩. గ్రంథపాతము. ౨౪. చరణకిరణతరితదరితభరితచరిత, ౨౫. త్వరితదురితచరణకిరణశరణుశరణు, ౨౬. మాన, ౨౭. జ్ఞాన, ౨౮. సుకృతకరుణ, ౨౯. వాద, ౩౦. వార్తి, ౩౧. మాల్య, ౩౨. అప్రమాణ, ౩౩. ముఖర, ౩౪. ముఖర.



కొండపైన దేవాలయము–తిరుత్తని K. P. S.



తిరుత్తని పుష్కరిణి K. P. S.

# కుంతీసందేశము

DPR

నండూరి బంగారయ్య

మనవాఙ్మయమున వీరయుగ మంతరించి చాలకాలమైనది. నవీనకవుల యుద్ధవర్ణనలు ప్రాచీనగ్రంథములనుండి పరిఘపట్టిసముసలకుంతాద్యాయుధములతో సహా సంగ్రహింపఁబడుచున్నవేగాని స్వానుభవజనితములు గావు. దక్షిణహిందూదేశమునంతను ఆంధ్రులేకచ్ఛత్రాధిపత్యముగ నేలిన విజయనగరయుగమునకూడ మనదురదృష్టవశమున మనకవుల ప్రతిభయంతయు పడకటింటికి విజృంభించినదిగాని వీరపురుషుల చరిత్రములను పిల్లలకు తల్లులుగ్గుపాలతో నూరిపోయు సన్నివేశములను వర్ణించుట కియ్యకొనలేదు. బిచ్చగాండ్రు పాడుకొను ఏబొబ్బిలిపాటనో జానపదుల యధీనమందున్న ఏపల్నాటి వీరచరిత్రమునో ఆశ్రయించుకొని ఆంధ్రుని ప్రాచీనపౌరుషము జీవము నిల్పుకొనుచున్నది. కాని మనభాగ్యవశమున ఆంధ్రమహాభారతమున, ముఖ్యముగ తిక్కనరచనలలో, కావ్యవస్తువాంధ్రపరాక్రమము కాకపోయినను ఉడుకుదాల్చిన భారతవీరుల యుద్ధవర్ణనలనుండి ఆంధ్రుని శౌర్యోద్రేకము, యుద్ధప్రీతి తొంగిచూచుచున్నవి. అందు ముఖ్యముగ నుద్యోగపర్వమున పాండవులకు కుంతి యొసగిన సందేశము ప్రత్యాంధ్రకుమారుడును సువర్ణాక్షరములతో నచ్చొత్తించుకొని పటముగట్టించుకొనఁదగియున్నది.

అగ్నివర్షముకురియు కుంతీసందేశము నొక్కుమ్మరుగ విజృంభింపనీయక మహాభారతకవి దానికొక రమణీయమగు బ్యాకుగ్రౌండు (Back ground) కల్పించినారు. పాండుపుత్రులకు కుంతియెడఁ గలిగిన భక్తియు, కుంతికి పాండుపుత్రులయెడఁగల యనురాగమును బ్రకటింపకున్నచో నీకుంతీసందేశము సమగ్రము కాఁజాలదని యాతని యభిప్రాయము. ఏలయన పాండుపుత్రుల కామెయెడ నిక్కమగు గౌరవప్రపత్తులు లేనినాఁడు ఇప్పటి కొందరి నాయకుల సందేశములవలె కుంతీ సందేశము నిరర్థకముకాదా! వినువారు లేనప్పుడు సందేశమెవరికి? ఇఁక రెండవయంశము. వినువారున్నను సందేశముచెప్పువారి కొకయధికార ముండితీరవలయును గదా! ఈ యధికారము ద్వివిధము. సందేశమిచ్చువారికడ నిజమైన మాహాత్మ్య మున్ననేకాని సందేశమునకు గౌరవము లభింపదు. మరియు నది ప్రేమసంజనితమై యుండవలయును. పాండవులను కుంతి యుద్ధములోని కురుకుమన్నది. ఈ సందేశమితరు లెవ్వరైన నిచ్చినచో "కన్నకడుపుగాకపోయినపు డెన్నియైనను జెప్పవచ్చు" నని త్రోసివేయుటకు వీలుండునుకాని కడుపార గని యష్టకష్టములకోర్చి పెంచిన కుంతియే ఈ సందేశము నిచ్చినదనినచో దానివిలువకు మేర యుండునా? అందుచే నీమూఁడు సాధనములచేతను, అనఁగా పాండవులకు కుంతియెడగల గౌరవమును ప్రకటించియు, కుంతికి పాండవులయెడఁ గల యనురాగమును ప్రకటించియు, కుంతీదేవిచారిత్రమామాహాత్మ్యమును ప్రకటించియు కుంతీసందేశమునకు కవి గౌరవమును కల్పించుచున్నాఁడు.

రాయబారమునకు బంపుసందర్భమున రాజకార్యములను గూర్చి కృష్ణునితో నేమేమిచెప్పవలయునో అన్నియు ధర్మరాజు చెప్పినాఁడు. కృష్ణుఁడు ప్రయాణోన్ముఖుఁడయ్యెను. ఏనుఁగులమీఁద, గుఱ్ఱములమీఁద, రథములమీఁద ఆతనిపరివారమంతయు బయలుదేరినది. అప్పు డాతని కొంతదూరమువఱకు సాగనంపవచ్చిన ధర్మనందనుండు కనరథము హరిరథమునకు దగ్గరగాఁ బోనిచ్చి యిట్లు పలికెను:

ఉ. వచ్చె జనార్దనుండనిన
వార్తకు ప్రాణము మేనికంతకుఁ
వచ్చిన సేదదేఱఁగురు
వంశపవిత్రచరిత్ర గొంతి నీ
వచ్చటి కేఁగి పాండవుల
యందఱమాఱని చెప్పిమ్రొక్కుచుఁ
గ్రుచ్చియ కౌఁగిలించుకొని
కుందినచిత్తము నొప్పిదీర్పుమీ.

చ. అడవికి నేఁగునాఁడు మము
నంపఁగ నెంతయు దవ్వువచ్చిన
ప్పుడు దనమోము దైన్యమునఁ
బొందెడు నశ్రులు చూచిచూచి య

ట్లోడఁబడి డించిపోవలసె
నుమ్మలికమ్మునఁ గొంతి యింతకున్
బడుగయి పాలలోఁబడిన
బల్లివిధంబున నుండకుండునే!

క. లక్కయిలు గాలినది మొద
లక్కట మాతల్లి మాకునై నెవ్వగతోఁ
బెక్కిడుమలఁ బడుచున్నది
దిక్కెవ్వరు లేనియట్లు దీనత్వమునన్.

క. ఏననుటగాఁగ దుఃఖము
లైనవి తెగుసమయ మయ్యెనని చెప్పుము మా
మేనత్త నూఱడింపుము
తా నెప్పుడు నీవు గలవు తన కనుచుండున్.

ఇక్కడ "మేనత్త" అనుపదము నుపయోగించి కవిబ్రహ్మ ఎన్నివేలయేండ్లకో పూర్వము ఉత్తరహిందూస్థానమున నివసించిచన్న కుంతిని, పాండవులను, శ్రీకృష్ణుని ఒక్కమారుగ నాంధ్రావని నవతరింపఁజేసినాఁడు. మఱియు, పైపద్యములలోని వాక్యములన్నియుఁ గుఱుచలు. పదములుకూడ చాలవఱకు దేశ్యములే. శైలిలో నిట్టి మార్పును కలుగఁజేయుటకు కళాసంప్రదాయమునుబట్టి కారణమేమైయుండవచ్చును? ధర్మరాజు ఇడుమలపాలైన తల్లినిగూర్చి మాట్లాడుచున్నాఁడు. అందుచే నాతనిమనస్సుకూడ పురుషునికి సహజమగు కాఠిన్యమును వీడి తాత్కాలికముగ స్త్రీజనోచితమగు మార్దవమువహించినది. ఈమార్దవమునకు పైపద్యములలోని శైలి ప్రత్యక్షరమును సాక్ష్యమిచ్చుచున్నది. "కురువంశపవిత్రచరిత్ర" యను నొక్కవిశేషణమువలననే పాండవులకుఁ గుంతియెడఁగల గౌరవప్రపత్తులను కవి సంపూర్ణముగ ధ్వనింపఁజేసినాఁడు.

"చ. సుగుణవుపుట్టినింటికిని
జొచ్చినయింటికి తేజమెక్కఁగాఁ
దగుచరితంబునన్ మెలఁగు
ధన్యవు ధీరవు"

అని యీవిశేషణమునకే శ్రీకృష్ణుఁడు దీర్ఘవ్యాఖ్యానమొనర్చినాఁడు. పురుషుఁడగు ధర్మరాజునొద్దనే యింతమార్దవమున్నపుడు స్త్రీయగు కుంతికడ మార్దవము లేకుండునా? ఆమెకుకూడ శ్రీకృష్ణునిఁ జూడఁగనే యాతని తోడినీడలవలె సంచరించు తనకుమారులు జ్ఞప్తికివచ్చినారు. అందుచే నామె యాతనికొడ పట్టుకొని యెలుంగెత్తి యేడ్చినది.

"ననుబెట్టి నాయెద గొనుచుఁ జనిరి
యేను వడ్డింపంగ నింపారఁ గుడిచి మె
త్తనిశయ్య నిద్రించి వినుతభద్ర
తే. గానకరిబృంహితముల మేల్కాంచునట్టి
వారు కందమూలంబు లాహారములుగఁ
బొదలఁ బుట్టలఁ బడియుండి పులుఁగుమెకము
లఱవ మేల్కనుచుండిరే యక్కటకట.

ఆ. తండ్రిలేని ప్రజలు దల్లినిబాసి పె
ద్దయునుగాల మివ్విధమునఁ బడిరి,
భంగపాటు దుఃఖపాటును సంకట
పాటుఁ గలిగె విరటుపాలఁ బిదప.

ఈ యనురాగము పామరజనసామాన్యము గాదనియు, పాండవుల మాహాత్మ్యమును బాగుగ గ్రహించినదగుటచే కుంతికి వారియెడల వివేకసమన్వితమగు ననురాగముండెననియు చూపుటకు కవి యీమెచే నిట్లు కుశలప్రశ్నము చేయించుచున్నాడు.

ఉ. దానదయాపరుండయిన
ధర్మతనూభవు సేమమెట్లు? పం
చాననవిక్రముండగు బ
కారికి భద్రమె? అస్త్రశస్త్ర వి
ద్యానిపుణుండు క్రీడి సుఖి
యా? వినయాభరణుల్ గవల్ సమా
ధానసమేతులే యకట
ద్రౌపది సాధ్వి సుఖంబె దానికిన్.

పాండవులలో నామె యొకరికుంచిన విశేషణ మింకొకరికుంచలేదు. మరియు ఆయావిశేషణము లాయావ్యక్తుల వ్యక్తిత్వమును సంపూర్ణముగ స్ఫురింపఁజేయుచున్నవి. ఇంకొకవిశేషము. "వినయాభరణుల్ గవల్ సమాధానసమేతులే" యనువఱకు పద్యము నడచిననడకకు ద్రౌపదిపేరు వచ్చినంతనే పద్యము నడచిన నడకకును భేదము గోచరించుచున్నది. వీరందరు నొకయెత్తు. ద్రౌపది యొక్కతెయు నొకయెత్తు.

చ. కొడుకులకంటె నయ్యనుఁగుఁ
గోడలి కెక్కుడుగూర్తుఁ గోడలుం
గొడుకులు సేయుభక్తికట
కోటిమడుంగులు భక్తి నాకు నె

ప్పుడుఁ దగఁ జేయుచుండు నది
పుణ్యచరిత్ర కులాగ్రగణ్య క్రొ
త్తడి సకలంబుఁజూడసభ
దైన్యముఁబొందుట సూచి పొక్కితిన్.

తే. నాఁడు ద్రౌపది వడిన బన్నములుచూడ
నోర్చినప్పుడ యెంతకు నోర్వఁజెపుమ
అంతగడచిన దుఃఖంబు లనుభవింపఁ
గలవె లోకంబు వారికిఁ గమలనాభ.

ఈరెండుపద్యములును పైపద్యములోని తుదిభాగమునకు వ్యాఖ్యానప్రాయములు. ద్రౌపదిపే రుచ్చరించునపుడు ఆమెకు తన యెడలగల భక్తి, ఆమెపవిత్రచరిత్రము, నసన్యదుస్సహములగు నామె కష్టములు ఒక్కమారుగ కుంతికి జ్ఞప్తికివచ్చి యామెకన్నులు చెమ్మగిల్లినవి. స్వరము గద్గదమైనది. ద్రౌపదికి సుఖంబెయనుటకు మారుగ "అకట" అని ముందుపయోగింపవలసివచ్చినది. దీనివలన పద్యము నడక కుంటువడి స్వరగాద్గద్యముపద్యపుశైలిలోఁగూడఁబ్రతిఫలించుచున్నది

పాండవులక్షేమమునుగూర్చి ప్రశ్నించునపుడు కుంతి యెంత మెత్తనిహృదయమును బ్రచురించినదో వారికిఁ గర్తవ్యోపదేశమొనర్చునపు డామె యంతకంత కఠినహృదయము వహించినది. ఇంగితజ్ఞయగునామెకు శ్రీకృష్ణునియాగమనకారణ మాతడు చెప్పకుండగనే తెలిసినది. అన్నికష్టములు తనకుఁ గలుగజేసిన శత్రువును రాజ్యభాగమిమ్మని వేడికొనుటకై పంపిన ధర్మరాజు కార్పణ్యతచూడగ నామె దోషవివశయై అగ్నిపర్వతమువలె నిప్పులుగురియు సందేశ మిచ్చినది —చూడుడు.

యుధిష్ఠిరునితో నిట్లనుము.

క. వేఁడికొని కృపణులై కను
పోఁడిమి యదియేల రాజపుత్రులు దమమై
వాఁడిమిదప్పిననిప్పులు
వేఁడిమి సెడినట్లు జనులు విని యులుకుదురే.

భీమార్జునుల కిట్లని చెప్పుము.

ఆ. కొడుకుఁ గాంచు రాచకూఁతు రెద్దానికి
నట్టిపనికి నుచితమైనసమయ
మొదవెఁ దడయు టింక నొప్పదు జనములు
నట్లుగాని పురుషు లనరు మిమ్ము.

క. భుజబలమునజీవించుట
నిజధర్మము, మెత్తఁబడుట నింద్యము మాద్రీ
ప్రజలకుఁ జెప్పుము, ద్రుపదా
త్మజఁ గార్యం బడుగు మనుము దగ నందఱితోన్.

వామనమూర్తి మూఁడుపాదములు త్రిలోకము లాక్రమించినట్లు ఈమూఁడుపద్యములును త్రికాలముఁ కుఁ దగియున్నవి. ఈకుంతీసందేశ మొక్కపాండుపుత్రులకేయని మనము భ్రమయరాదు. భూతభవిష్యద్వర్తమానకాలములందున్న భారతపుత్రు లెల్లరు శిరసావహింపఁదగిన యోగ్యత వీనియందున్నది. ఈమూఁడుపద్యములు నొక్కమాదిరిగానే కానవచ్చుచున్నను అవియుద్దేశింపఁబడిన వ్యక్తులనుబట్టి ధ్వనిభేదము, గతిభేదము (flow) లేకపోలేదు. ధర్మజుఁడు పాండవాగ్రజుఁడు, పాండుపుత్రులనందఱను ఒకత్రాటిమీఁద నడుపవలసినభార మతనిది, అందుచే ఈపద్యమున సమూహముమీఁద పాండవు లవలంబించు నీతిపద్ధతి (General Policy)ని విమర్శించుచు యుధిష్ఠిరునివేడికోలు మార్గమునుండి విముఖునిజేయుటకు యత్నించినది. అయితే సామమా దండమా ఏనీతి అవలంబింపవలెనో నిశ్చయించువఱకే యుధిష్ఠిరుని భారముగాని తీర యుద్ధము నిశ్చయించినవెనుక దానిని జయప్రదముగా కొనసాగింపవలసినవారు భీమార్జునులు. అందుచే వారికిచ్చిన సందేశములో నించుకధ్వనిభేదమున్నది. ఈపద్యముమూలమున కుంతి కారణజన్ములగు భీమార్జునులకు వారివారిజన్మప్రయోజనములనుగూర్చి జ్ఞప్తి యొనర్చుచున్నది. భీమార్జునుల జన్మకాలమున నశరీరవాణి పలికిన పలుకులనుగూడ నీసందేశమున ద్విరుక్తిదోషములేకుండా పునరుద్ధారణము నందినవి. యుద్ధనిర్వహణమున మాద్రీప్రముఖులుకూడ ధర్మనందనునికంటె నెక్కుడుగఁ బనిచేయవలసినవారే. కాని వారు చేయుపనికిని భీమార్జునులు చేయుపనికిని తారతమ్యమున్నది. అందుచే వారి కుద్దేశించినపద్యము స్థాయికొంతతగ్గి తారమునుండి మధ్యమమునఁ బడినది. అన్నిటికంటెను ద్రుపదాత్మజను కర్తవ్య మడుగుమని యుపదేశించుటమాత్రము అత్యంతరమణీయముగ నున్నది. అందు మూఁడుభావములు గర్భీకృతమైయున్నవి. "మీ రందరును యుద్ధమునుగూర్చి జంకుచున్నచో ఒక్కమారు ద్రౌపదికి కౌరవులొనర్చిన పరాభవమును తలంచికొనుఁ" డనుట మొదటిభావము. "మీరు పురుషులైనను ఆఁడుదానికున్న కర్తవ్యనిశ్చయము మీకు లేదు. తెగించుటలో మీకంటె ద్రౌపదియే మేలుచేయి" అనుట రెండవభావము. "నాది మాతృస్థానము. ఈకార్య మిట్లు చేయుఁడని మీకాజ్ఞాపింపఁగలశక్తి నాకున్నది. అయితే నేనును మీరును విపులముగ ముచ్చటించుకొని కర్తవ్యనిశ్చయ మొనర్చుటకు తగిన యవకాశ మిప్పుడులేదు. కాని నాస్థానమున నాకోడలచ్చట నున్నది. ఆమెచెప్పినట్లు కర్తవ్యనిశ్చయ మొనర్చికొనుఁ" డనుట మూఁడవ భావము. ఈపద్యములశైలిని బరికించిన నన్నియు చిన్నచిన్నవాక్యములే. కరుణమేకానిండు, రౌద్రమేకానిండు ఏదైన నుచ్చస్థితి నందినపు డది చిన్నచిన్నవాక్యములలో వ్యక్తముకాకతప్పదు. కాని యీచిన్నవాక్యములకును "వచ్చెజనార్దనుండనినవార్తకు" ఇత్యాది

పద్యములలో చిన్నవాక్యములకును ఎంతో తారతమ్యమున్నది. భావమునుబట్టియేకాక భాషనుబట్టికూడ నీపద్యములలో గ్రీష్మభానుని ప్రచండతయున్నది. ఆపద్యములలో శ్రావణమేఘుని యార్ద్రత యున్నది. ఆపద్యములు శిరీషకుసుమపేశలములు. ఈపద్యములు అశనిపాతకర్కశములు.

ఇట్లు కుంతీసందేశమంతయు కుంతీకృష్ణుల యభ్యంతరసమావేశముననే ముగిసినది. కాని రాయబారము ముగిసినవెనుక కృష్ణుఁడు మరల నామెతో కౌరవసభలో నడచిన యావద్విశేషములను వాక్రుచ్చి "పాండుకుమారులకు తగినబుద్ధు లానతిమ్మని" కుంతిని గోరినాఁడు. అప్పుడు కుంతి సకలకౌరవపక్షవీరసమక్షమున మరియొక సందేశ మిచ్చినది. ఈ ద్వితీయసందేశమునఁ గవిచూపిన ప్రత్యేక ప్రయోజన మేద్ది యనుప్రశ్న వచ్చుచున్నది. కౌరవసభలో జరగిన వృత్తాంత మంతయు విన్నమీఁదట తాను మొదటనిచ్చిన సందేశమేమైన మార్చుకొనవలసియుండునేమోయనికృష్ణుఁ డామెనుండి పునస్సందేశము నర్థించియుండవచ్చును. అంతేకాక ఈప్రశ్నలో మరియొకగూఢార్థముకూడ గోచరించుచున్నది. తనతోవచ్చిన కౌరవపక్షవీరులకెల్ల పాండవమాతృసందేశమును ప్రకటించి వారిని భయకంపితులనుగా చేయవలెననికూడ కృష్ణునియభిప్రాయమై యుండవచ్చును. అందుచే నామెచే "ఎల్లవారునువినుచుండ" నీపునస్సందేశము నిప్పించినాఁడు. ఇప్పటిపద్యములు వెనుకటిపద్యములకంటె హెచ్చుస్థాయిని బడ్డవి. వెనుకటిది ప్రత్యేకవ్యక్తుల కుద్రేకము పుట్టించుట కేర్పడిన రహస్యసందేశ మగుటచే పద్యములు చింతనిప్పులవలె కనకనలాడుచున్నవి; ఇది సభాముఖమున నొనర్చిన గంభీరగర్జన మగుటచే పద్యములు మెఱుపుతీగలవలె మెఱసిపోవుచున్నవి. అందు వేడిమి యధికము. ఇందు వెలుఁగెక్కువ. చూడుఁడు:

రాజులకెందునారయఁబ
　　రాక్రమజీవనవృత్తి తక్కనోం
డోజ నిషిద్ధమండ్రు ముని
　　లుత్తమసత్త్వులు వంశధర్మముల్
పూజితభంగిఁ జేయుదురు
　　బుద్ధివిహీనులు వానిదక్కని
స్తేజపుఁగూటికియ్యకొని
　　దీనతఁబొందుదు రంబుజోదరా.

నిజవంశోచితవీరవృత్తమున కు
　　న్మేషంబుగా నాకపి
ధ్వజుఁ డుత్సాహముసేయకున్న నకటా
　　దైన్యంబువాటిల్లదే
భుజదర్పోద్ధతుఁడైనభీమునకు నీ
　　పొం దొప్పునే నీవు స
ర్వజగన్మాన్యుఁడవిందురాఁదగునె దై
　　వం బిట్లుదప్పించునే.

మహాకవి విషయానుకూలముగ వృత్తములమార్చినందులకు రసజ్ఞులానందింపఁదగును,

కుంతీమహాదేవివాక్యములను శ్రీకృష్ణునివాక్యములతో సరిచేసి వయోవృద్ధులగు భీష్మాదులు కొనియాడిరి. పాండవులు యుద్ధనిశ్చయ మొనర్చుటకుఁగల ముఖ్యకారణములలో నీకుంతీసందేశ మొకటి.

హితమును ధర్మముం దగవు
　　నిట్టిది నామన మేమినేర్తు న
చ్యుతుఁడు, సమస్తధర్మపరి
　　శోధకుఁ డావిదురుండు, పాండుభూ
పతిసతియుం దగంబలుకు
　　పల్కుల సంశయమెల్లఁ బాసె ని
ట్లితఁడు రణంబుసేయుఁ డన
　　నింకవిచారములెల్ల నేఁటికిన్.

అనఁగా కురుక్షేత్రమున నర్జునుఁడు పూరించిన దేవదత్తములో నీకుంతీసందేశము కృష్ణునిగీతావాక్యములతోఁబాటు మారుమ్రోఁగినది. అంతియేకాదు. ఆంధ్రదేశమునకూడ నీకుంతీసందేశ మెంతసంచలనము గలిగించినదో యెవ్వరు చెప్పఁగలరు. సాక్షాన్మహిషాసురమర్దనివలె రణరంగమున విహరించి సర్వజనానురంజకముగ రాజ్యపాలన మొనర్చి యాంధ్రరమణీమణుల మేలుబంతియైన రుద్రమదేవి యీకుంతీసందేశము నెంతగా జపించియుండునో! తిక్కనసోమయాజియనుగ్రహము వడసి యాతనినోట భారతమువినిన ధన్యమూర్తికుమార్తె కామాంబయు సాహిత్యజ్ఞాన మాపాదించుటలో సాహసముండదుగదా! మఱియు కన్నకుమారుఁడు ప్రాణముతో వచ్చినాఁడుగదా 'బ్రతికియుండిన బలుసాకుదినవచ్చు' ననుసామెతగ తనకడుపుచలువ నభినందించుకొనక రణమున పగరకు వెన్నిచ్చిన పిఱికిపంద మొగముచూడనని వ్రతముబట్టి కోడలిచే

ముగురాఁడువార మైతిమి
వగపేటికిజలకమాడ వచ్చినచోటన్

అని కొడుకును శూలపుఁబోటులు పొడిపించిన వీరమాత ఈకుంతీసందేశమునకు స్వీయజీవితముచే నెట్టిమహోన్నతవ్యాఖ్యానము రచించెను! భావ్యాంధ్రాభ్యుదయము నాశించువారెల్లరు నీ కుంతీసందేశమును లెస్సగ నారాధించుటకంటె కర్తవ్య మింకొకటియుండదు.

# ‘ప్రపన్నాత్మ’

ఇంద్రకంటి హనుమచ్ఛాస్త్రి

౧

ఎపుడు విడిపించుకొన్నావో యేమొతండ్రి!
దివ్యతులసీసువాసనా* భరితగళము
లేత చేతుల నిడి కౌగలించు నన్ను
పసియెడంద చిదానంద పడెదు నన్ను

౨

ప్రాకికొనివచ్చినాడ విశ్వాంగణమున
కీసుదూరభారమ్ము సహించుకొంచు
నీమధురహాసమురళి విన్పించునంత
నీసుమామోదభరము వాసించునంత

౩

ఈప్రపంచమ్ము పరమమోహాంకితమ్ము
కలుషహృదయాల గర్వాల కాంక్షితాల
నిత్యకోలాహలాతిభుగ్నీకృతమ్ము
తీసికొనివచ్చి నన్నిట దింపినావు.

౪

ఆ జుగుప్సితరక్తకటాహమందు
పచ్చిచీకటు లేలిన మారుమూల
ఎవరు బంధించిరో నన్ను అప్పుడపుడు
వినబడును క్రొత్తలోకాల వెకిలినవ్వు—

౫

ఎవరి యాదేశ మిది చెప్పవోయి దేవ!
నేనొక అదృష్టహీన పాంథుడను; నడచి
నడచి, బడలి, గంతవ్యమ్ము తడవుచుండ
ఎవ్వరో వీరు నన్ను బంధించువారు

౬

భవజటాజూటగళిత గంగాప్రవాహ
వేణికల గలుపుకొంటిని హాలహలము
విమలశారదశుభ్ర కౌముదులయందు
పూసికొంటిని స్నిగ్ధ జీమూతపాళి

౭

నారకోజ్జ్వలకీల నందనసుమమ్ము
వేర్పరుపలేక చెయిసాచు వెర్రితనము
చూచి యేమనుకొంటివోయీమహాత్మ!
ఆచి యెంతని నవ్వుకొంటివో కృపాళు!

౮

ఓ ప్రభూ! పూతనవనీత జీవితములు
అర్థమేకాని పరమ నిర్భాగ్యులందు
వేగలే నాగలేనింక వెడలివత్తు
తీసికొనిపొమ్ము నీ శాంతిధామమునకు.

---

* యతిప్రాసలు శబ్దాలంకారశాఖలోనివి. ఏకవిత్వనిర్వచనమూ అలంకారములకు నిత్యత్వం చెప్పదు. తత్రాపి—శబ్దాలంకారములు ‘కావ్యాంగ గడుభూత’ ము లని సాహిత్యవేత్తలచే తిట్లు తిన్నవి. కావుటంబట్టి సంస్కృతకవులు యమకాదులనువలె మనం వీటిని ఐచ్ఛికంగా వాడడం వివేకం. ఈ అంశమును నా వ్రాయు ‘అఖిలాంధ్ర యతిప్రాసమహాజనసభ’ అనేవ్యాసంలో సువ్యక్తం చేస్తాను. —ఇ. హ.

## రావణోపదేశము

శ్రీ విక్రమదేవవర్మ

బ్రహ్మ మార్గణవిద్ధుఁడై రావణుండు
పడుటఁ గనుఁగొని శ్రీరామభద్రుఁ
డనుజుఁ
జేరఁ జీరి యిట్లనె "నీవు శీఘ్రముగను
రావణుని చెంత కేగి యారాజవర్యు
నడుగు మేలిక నెట్టన యాచరింప
వలయు కర్జంబుల; నతండు పలుశతాబ్ద
ములు ధరాదేవిఁ బాలించెఁ బాలుపుగాను;
గాన నతఁ డినకర్తవ్యకార్యములను
జెప్పఁగలవాఁడు; గటకటా! యిప్పుడ మృతి
నొందు; నాతండు మరణంబుఁ జెందునేని
యిల నృపతిధర్మమర్మంబుఁ దెలియకుండుఁ;
గనుకఁ దడయక వేవేగ చను." మనంగ
రావణుని జేరఁగా సుమిత్రాసుతుండు,
దనుజపతి భక్తిమీఱ నాతనికి మ్రొక్కి
"నేను ధన్యుండ నిప్పుడు నిన్నుఁ గనుట"
ననఁగ సౌమిత్రి యిట్లనె "దనుజనాథ
యీవు సర్వదా ధన్యుండవే యగుదువు;
ఱేనికర్తవ్యకర్మము లవ్వాని నీదు
వదనమున వినఁబంపె నాభ్రాత నన్నుఁ;
గానఁ గృపతోడ వివరించి వానిఁ దెలుపు."
మనిన నిట్టూర్చి రావణుం డనియె నిట్లు:

"రాముఁ డఖిలేశ్వరుండు సర్వజ్ఞుఁ డగుట
నతనికిం దెలియని విద్య లవనిఁ గలవె?
నాయెడం గలప్రేమచే నన్ను నడుగ
నతఁడు ని న్నంపెఁగాక యాయతులశౌర్య;
యేలిక యొనర్చు చేఁత లనేకము లగు
వాని నన్నింటి నిపుడు చెప్పంగఁజాల;
నపుడె నాలుగుప్రాణంబు లంతరించెఁ
గాన నొకదానినే చెప్పఁగలను వినుము:
నీరు మూఁడుభాగంబులు నేల యొక్క
భాగ ముండుట జగమునఁ బాడిగాఁ
గడలి మూఁడవపా లగు జడము నార్ప,
నరకబాధలఁ బ్రాణులు నోరయకుండ
శమనపురనరకాళి నాశంబునేయ,
మఱియు నిర్జరపురికి నందఱును సుకర
ముగఁ జనం దృఢసోపానముల ఘటింప
నిశ్చయించితిఁ; గాని వాని నెఱవేర్ప
కేను గాలంబును గడపి మృతినిబొందు
చున్నవాఁడను; గావున నొడయుఁ డెంచు
పనుల సత్వరంబే చేయవలయుఁ జుమ్మి."
యనుచు నింతవట్టు వచింప నంత నతని
ప్రాణమేగె దివికిఁ గళేబరముఁ బాసి.

---

## రసిక విభుడు

జనమంచి కామేశ్వరరావు

విభు డొచ్చు వేళ యని
నిల్చితిని దేహళిని,
ఎండ రెన్నో విధాల
ఎగతాళి చేసినను.

అతివ లందరిమగలు
వేళకే వచ్చారు:

నావిభు డదేలనో
ఎంతకీ రాడు!

చుక్కైనకులకనీ
కాటుకాచీకటి;
కోసినా తెగిపోని
ఒత్తైన చీకటి.

దిగులుతో పోయాడు
దారి తప్పినో యేమొ!
ఎవరి నడిగిన యేమి
ఎవరు చెప్తారు?

ఏ దారిజూచినా
గాఢాంధకారమే!
విభునితుందురు
నడల అలికిడే లేదు

పున్నమైతే యేమి
నా పున్నె మిట్లుండ?
పురుగు మిణ్గురుగూడ
పగబూనె నీవేళ!

తోడిచెలులందరూ
పకపకా నవ్వారు
నీవెర్రికూల యని
పరిహాస మాడారు

మనవీథిలోకొస్తె
లోని కేరాడ!
వీథి ఘుమ్మంలోన
నిల్చిపోతాడ!

మగవారు నడయాడు
నడివీథిలోన
నిల్చి పుల్కనిజూడ
నగుబాటుగాదె?

ఆరాటపడ నీకు
ఆయాసమే కాని
ఏమిలాభం చెల్లి?—
రమ్మ లోపలికి!

*

ప్రావృట్ మేఘుడు
ప్రళయార్భటితో
ఉరుముచు మెరయుచు
కుంభించె

కుటిలాలకలను
వెనుకకు తోసుకు
ఫక్కన నవ్వెను
పూర్ణశశి

*

కుముదినీకన్యతో
కులికేటి చంద్రుడే
కనులొత్తి కర్గమీని
కదలనే కదల

అన్నెమూ పున్నెమూ
ఏమి ఎరుగని నన్ను
అడియాస గొల్పగానేల?
ఆరాట పెట్టగానేం?

*

మగలపొత్తిళ్లలో
నొరిగి నిద్దుర జెంది
కలల మబ్బుల తేలి
కలవరించిరి చెలులు

కౌముదీకాంతిలో
దారిమసకలు తీరె,
విభుడు తప్పకవచ్చు
వచ్చి నాకేల్వట్టు

అనుచిట్లు తలపోసి
తలపులో మునిగి నే
తరితీపినుండగా
నడల చప్పుళ్లెవో

వీథంత ఘల్లురనె
మాటలో విభుడొచ్చె
వచ్చి నన్నెద గ్రుచ్చె
మోము నెత్తకెనన్ను

క్షమియింపు 'మని వేడె
ఎకసక్కెమేల యని
మోమెత్తిచూడ, సరె!
సర్వమూ బోధపడె

ప్రభువు గడుసరె, కాని
పెదవికాటుకమసిని
నుదుటి ముద్దులతడిని
చెరుపుకొన మరచాడు.

దారితప్పెనో, ఏమొ!
అనుకుంటినేకాని,
విభు డింత రసికుడని
నేనేమి ఎరుగుదును!

---

# అరణ్యరోదనము

సండూరి వేంకటేశ్వరరావు

ఎల్లయెడలను నెంత ఘోషిల్లుచున్న
నరయువారలు లేక నామొర యరణ్య
రోదనంబాయె నకట యీలోకమందు
ఆలకింపవె తండ్రి నీవైనగాని?

ఎటులొ కష్టమో సుఖమొ యే నీ ధరిత్రి
బ్రభవమంది యష్టాదశాబ్దములు గడిచె:
అనుభవించిన భూతజీవనమె చాలు,
దీని నింత సమాప్తి జెందింపు దేవ.

బహువిధంబుల దుఃఖసంభరిత మగుచు
విసువుగల్గించు వ్యర్థజీవితము నాది
దీన నెవ్వారికేమి సిద్ధించునంచు
నిలనిరర్థకముగ సృజియించినావు?

ఆర్థికస్థితిగని ముదమందు దనిన
పరమనిర్భాగ్యునిగ జేసి వదలినావు.
విద్యనూహించి హృదిని గర్వింతునన్న
జ్ఞానలవదుర్విదగ్ధుని జలిపినావు.

బాహుబలమున దలయెత్తి బ్రతుక, సర్వ
విధుల నది యసంభవ మనిపించినావు;
కాయసౌందర్యవిభవంబు గనగ, కపినె
యెంచ నాకన్న నే లనుపించినావు.

జీవితం బింక నాకేమి శ్రేయమనుచు
మరణమునుగూర్చి దేవ నే వెరవవలయు?
దీనియం దెట్టి సౌఖ్యాబ్ధి దేలుదనుచు
వలదనుచు దాని నిరసింపవలయు స్వామి!

* * * *

ధనము నాశింప; నెట్టివిద్యయును వలదు
వలదు భుజపరాక్రమ రూపములునుగూడ
సన్యసించి విరాగినై చనెదననిన
తెగని ప్రేమపాశముల బంధించినావు.

అవని పదుగురిగతి దేహయాత్రగడుప
నెట్టి జీవనోపాధి నా కీయవైతి:
రిత్త యైహికసుఖము పరిత్యజింప
స్థితమనోధృతియును ప్రసాదింపవైతి.

ఏమి రానున్నవో కద యిడుమలనుచు
నెల్లకాలములోన చింతిల్లవలసె:
తెల్లవారెడుననగ భీతిలుచు నెడద
జీవనాజ్ఞాతవాసంబు సేయవలసె.

పాడియే నీకు కీటకప్రాయు నొకని
నీవిషాదనాటక మాడ నేర్పరుపగ?
ఈవృథారూపకంబున కింతకన్న
భరతవాక్యంబు వెంటనే పలుకరాదె?

యంత్రతుల్యములగుట యీయవయవములు
జీవితాధ్వం బదృష్ట మజేయమాయె.
ఎంత స్వాగతంబనిన రానీవదేమి?
జీవనార్తికి మృతియె సంజీవకరణి.

పావనంబైన నీయంఘ్రిపద్మములకు
ప్రణతిసల్పుచు ప్రార్థింతు పవలురేలు
నామొరాలింపరావె యనాథనాథ,
ఆదరింపగదయ్య దీనార్తిహరణ.

---

# ది లక్ష్మీ యిన్సూరెన్సు కంపెనీ, లిమిటెడ్., లాహోరు.

మదరాసు బ్రాంచి:

**334, తంబుచెట్టి వీధి,** (షావాలెస్ కంపెనీకి యెదుట).

## అభివృద్ధి నడక

| 1924 మొదలు | | 1934 వరకు |
|---|---|---|
| ఏప్రిల్ 30 తో అంత్యమైన | అమలులోనున్న వ్యాపారము | జీవితనిధి |
| 1925 | రు. 21,24250 | రు. 500 |
| 1929 | రు. 1,66,18620 | రు. 9,32,900 |
| 1934 | రు. 3,50,00000 | రు. 49,00,000 |

$8\frac{1}{2}$ లక్షలరూపాయలకు పైగా క్లెయిములు చెల్లించబడెను.

ఆస్తులు - - - రు. 57 లక్షలు

1933-34 సం. నకు జారీచేసిన పాలిసీలు - రు. 1,00,00,000

కావలెను. ప్రాతినిధ్యములేని తావులందు పలుకుబడి గల యేజంట్లు కావలెను.

---

## యస్. వి. రామానుజంశెట్టి

12 బ్రాడ్వే, అండ్ కో., మద్రాసు.

(స్థాపితము 1863)



తోటాతుపాకులు

లోడింగు తుపాకులు

రివాల్వరులు, Etc.

తోటాలు నానావిధములు

ధరలు సరసము

| | | |
|---|---|---|
| రివాల్వరులు — జేబుసైజులు | | రు. 10-0-0 |
| వాటితోటాలు — 100-కి | | రు. 2-0-0 |

---

## గ్రీఫ్ డూప్లికేటర్లు

దృఢత్వము, మితవ్యయము గలిగి, త్వరితముగను, సులభముగను పనిచేయగలిగి యున్నవి.

సోల్ ఏజంట్లు :—

### గ్రీఫ్ ప్రాడక్ట్సు (ఇండియా) ఏజెన్సీ

హాస్సాంబిల్డింగ్, చర్చిగేట్ వీధి, ఫోర్టు, బొంబాయి.



మెర్సీ
డెస్ స్టాం
డర్డు, పోర్ట
బుల్ టైప్
రైటర్లకు
సోల్ ఏజం
ట్లు. టైప్ రైటర్లకు, డూప్లికేటర్లకు వలయు అన్ని పరికరములు చౌక ధరలలో దొరకును.

ఇతర డూప్లికేటర్లు రు. 17/8 మొదలు 1200/- వరకు గలవు.

ఈ (ఫూల్స్కాప్సైజు) మెషిన్ వెల రు. 300 గలిగి గంట 1-కి 3000 కాపీలు తయారుచేయును. కాకితము, సిరా, లెక్కించుట వగైరాలు స్వయముగానే జరుగు నేర్పాటులు దీనియందు గలవు.



వేంకటేశ్వర దేవాలయము, రాయదుర్గము J. K. C.



దీపగోపురము, చెన్నపురి J. K. C.



సముద్రదృశ్యము-మహాబలిపురము **J. K. C.**



శరవణ సరోవరము-తిరుప్పరంకుండ్రం **K. P. S.**

## అమృతాంజనము

వనమూలికలచే తయారైనవాడు, ఎట్టి బాధల నైనను తొలగజేయగలదు కంటికి కందమగు డబ్బీలో నుండగలదు, వెలుపలికి వచ్చిన నొప్పిని ఉపచరింపగలదు, అన్ని చోట్లను దొరకగలదు. చక్కని డబ్బీతో సహా సీసా 1-కి అ. 8.

## తామర తైలము

త్రివర్ణము గల "సూర్యోదయము" గుర్తు గల తామరతైలము, పూతినాశకములగు చాల మంచి మందులతో తయారుచేయబడి ప్రఖ్యాతిగాంచినది.

డబ్బీ 1-కి అణాలు 6.

## మోహిని తైలము

స్త్రీ, పురుషులు వాడుటకు యోగ్యమైనది.

మెదడునకు, కంటికి చలువయిచ్చి సౌందర్యమును సంపాదించి కురులను పెంచును. సువాసన గలిగించి మనోహరముగా నుండును. సుఖనిద్ర, విశ్రాంతుల నిచ్చును. సీసా 1-కి అణాలు 12.

## దంత చూర్ణము

పంటిపోటును బాపి, నోటి దుర్గంధమును బోగొట్టి పండ్లు తోముటకు బాగుండును. చిగుళ్లనుండి రక్తము కారకుండజేయును. డబ్బి 1-కి అణాలు 2

## గజ్జికి తైలము

గజ్జి, చీడ శరీరమంతట వ్యాపించి ముఖ్యముగ చిన్న పిల్లలకు విశేషబాధను గలిగించుచున్నవి. ఈ తైలమును నాలుగుపూటలు రాచిన గజ్జి, చీడ, చిలుము, జిల మొదలగునవి నశించును. తప్పక పనిచేయును. డబ్బీ 1-కి వెల. అ. 4.

## తేలు మందు

కుట్టినచోట కొంచెము మందు పోసిన, బాధ మాయమగును. మందును గలిగియున్న, తాము బాధపడక ఇతరులకిచ్చి పుణ్యము గట్టుకొనవచ్చును. ప్రతి యింట నుండదగినది. సీసా 1-కి వెల అ. 8.

## అమృతాంజనం డిపో.,

బొంబాయి, మదరాసు, కలకత్తా, రంగూను.



రేణుక
**(Renuka)**

—S. V. S. Rama Rao



డెబ్బదినాలుగేండ్ల
పండిత మదనమోహనమాలవ్యా



మారేపల్లి రామచంద్రశాస్త్రిగారు
(వీరి షష్టిపూర్త్యుత్సవమునకై యేర్పాట్లు
జరుగుచున్నవి)



శ్రీ శ్రీ శ్రీ విక్రమదేవవర్మ మహారాజులుంగారు
(జయపురాధిపతి)
ఆంధ్రవిశ్వకళాపరిషత్తువారిచే
డి. లిట్. బిరుదమున సత్కరింపబడిరి.



విమర్శకాగ్రేసర
వాగపూడి కుప్పుస్వామయ్యగారు
ఆంధ్రసారస్వతపరిషత్తువారిచే
'విమర్శకాగ్రేసర' బిరుదము నందిరి.



మార్దంగికాగ్రేసర
పొట్లూరి వీరరాఘవయ్యచౌదరిగారు, బెజవాడ
ద్వితీయాంధ్రసంగీతపరిషత్తువారిచే
'మార్దంగికాగ్రేసర' బిరుదము నందిరి.



మహోపాధ్యాయ
మేడేపల్లి వేంకటరమణాచార్యులుగారు
ఆంధ్రసారస్వతపరిషత్తువారిచే
'మహోపాధ్యాయ' బిరుదమున సత్కరింపబడిరి



మహాకాయ (640 పౌనులేయటు బరువు !)



ఇంగ్లండు ఆస్ట్రేలియా విమానపుపందెములలో గెలిచినవారి కుద్దేశింపబడిన 650 పౌనుల కిమ్మత్తుగల బంగారుకప్పు



ఒకేకాన్పుబిడ్డలు
(రూపరేఖాదుల నన్నిటను ఇంచుకంతయయిన భేదములేక చూపరకు విభ్రాంతి గలిగించుచున్నారు)



క్యాండి సింహాసనము

# లక్ష్మీదేవి

గుళ్లపల్లి నారాయణమూర్తి

### ౧-వ అంకము

[పాత్రలు: సీతమ్మ—వితంతువు
నరసింగరావు—ఆమెకొడుకు
లక్ష్మీదేవి—ఆమె కోడలు
చిన్నసీత—మనుమరాలు
రాంబాబు—మనుమడు
సన్యాసిరాజు—నరసింగరావుస్నేహితుడు
రామలింగం—అతని తోడిగుమాస్తా]

(కాలము—మాఘమాసపు ఆఖరువారం)

[సీతమ్మఇల్లు; రాత్రి ౮½ గంటలు కావచ్చింది. సీతమ్మకు ౫౦ సం. వయస్సు. వరండాలో కుంపటి కాచుకుంటూ కూచుంటుంది. లక్ష్మీదేవి-౨౬ సంవత్సరాల వయస్సు, చామని చాయ; చదువుకొన్నాది; సాధారణమైన వేషం. హరికేన్ లాంతరు దగ్గర పెట్టుకొని నవలచదువుకుంటూ ఉంటుంది. ఆదీపం దగ్గరే, చీట్లపేకతో మేడకడుతూ పిల్లలు ఆడుకుంటూ ఉంటారు. ముసలమ్మ వాళ్ల ఆట చూస్తూ ఉంటుంది. చిన్నసీత వయస్సు తొమ్మిది ఏండ్లు. రాంబాబువయస్సు ౬ సంవత్సరాలు.]

సీత—ఏమి చెప్మా! వీ ఢింకారాలే దెంటికీ?

లక్ష్మి—ఇంకా పనిఅవలేదు కాబోలు.

సీ—ఎప్పుడూ పనే! ఇంతసేపు పనేమిటి చెప్మా, నా కేమీ బోధపడదూ! వీడికింత శ్రద్ధ ఎలాగుపుట్టింది? ఒళ్లువంచి పనిచేయడమంటేనే వీడికి కిట్టదూ!

ల—మార్కెట్టులో పనంటే ఆఫీసుపనిలాగు గంటల ప్రకారం చేయించి విడచిపెడతా రనుకొన్నావేమిటి? సాయబులదగ్గరపని మరీ కష్టం. నిశాచరుల్లాగు రాత్రంతా దీపంపెట్టుకొనికూర్చుంటారువాళ్లు!

సీ—అయినా, ఇంతచేటుపని కూడదే! అది వంటి కెంత కాకో తెలుసునా? అందులో మావాడి వంటి కసలు వేడిపడదు.

ల—అందరికీ ఒక్కలాటిపను లొస్తాయా! ఏదో పనంటూ దొరకడం, ఈయన శ్రద్ధగా చేయడం, ఇన్నాళ్లకు చూస్తున్నాం.

సీ—నీకు మరీ కనికరంలేదే! వాడలాగ నలిగిపోయి గుండా పిండీ అయిపోతూంటే సంతోషిస్తున్నావా? మధ్యాహ్నం రెండు గంటలకీ, రాత్రి పదిగంటలకీనా తిండి? వెధవపని లేకపోతే ఆట్టే పోయిందికాని—

లక్ష్మి—కూర్చుని తిందుగాని, పనిలేకపోతే!

సీత—లేకపోతే, ఇన్నాళ్లూ నువ్వే పోషించేవేమిటి?

లక్ష్మి—మరిప్పు డెవరు పోషిస్తున్నారు?

సీత—ఇప్పుడంటే మీనాన్న అయినువంపిచ్చేడు. మావాడొకపాతికరూపాయలు తెస్తూంటే పైగా నువ్వొక పదిరూపాయలు ఖర్చుపెడుతున్నావు నెలకి; ఈపాటిదానికే దెప్పు?

లక్ష్మి—ఇంటిక్రింద ఖర్చుపెట్టుకోడానికా ఇచ్చేడు మా నాన్న? వడ్డాణం చేయిస్తానంటే నేనే ఇక్కడ చేయించుకుంటానని పుచ్చుకొని నాపేర పోస్టులో వేయించుకున్నాను. దెప్పడమంటావు కాని, ఇదివరకు నీబంగారంతాలూకు రెండువేలరూపాయలూ పత్రం మీద ఉంటే, అప్పుడొక పాతిక, అప్పుడొక యేభయితెచ్చి మామగారు పోయేక, ఈమూడేళ్లకి కడతేర్చేసేరు...ఇప్పుడాపని అంటూ ఉండబట్టిన్నీ, మానాన్న కొంతడబ్బు ఇవ్వబట్టీనా, కాలక్షేప మవుతూంది? వెధవపని పోతేపోయిందని ధీమాగా అంటున్నావుకదా!

సీత—ఏమయినా, మీనాన్నదగ్గర డబ్బుందని నీకెంతేనా గర్వముంది!

లక్ష్మి—మానాన్నఅయితే మీఅన్న కాడేమిటి? నువ్వూ గర్వపడు!

రాంబా—చూడవే, అమ్మా! నేను మేడకడుతూంటే అక్కయ్య ఏలాగు పాడుచేస్తూందో?

సీత—ఏమిటి నాయనా ఆటా!

రాంబా—ఆడుకుంటున్నానే!

సీత—ఆడుకుంటున్నావులే! ఏమిటా ఆట?

రాంబా—నేనురాజునటే! మేడకడుతున్నాను. అక్కయ్య చూడవే ఏలాగు పాడుచేస్తూందో?

లక్ష్మి—ఏమిటి చిన్నతల్లీ అల్లరా!

సీత—వాడు రాజుగారట! వాడిజోలి కెళ్లకే!

చిన్నసీత— వెధవ! వీడురాజొకటి! ఓ! ఏంగొప్ప!

లక్ష్మి—ఆఁ! ఆఁ! ఏమిటానోరు? నోటంట తిట్లు రానీవద్దని చెప్పలేదూ? వెళ్లి పడుకో నీపక్కమీద! రామం! నువ్వూ వెళ్లిపడుకో!

సీత—వాళ్లు ఏంజేసినా నువ్వు ఊరుకోబట్టే వాళ్లకంత పెంకితనం!

చిన్న—అమ్మా!

లక్ష్మి—లేవవేం! ఇంకా!

చిన్న—అమ్మా! నే నల్లరిచేయ లేదే!

రాంబా—ఆఁ! చెయ్యలేదూ! అన్నీ అబద్ధాలే! అమ్మా! చేసిందే!

లక్ష్మి—లెండి! వెళ్లి పడుకోండి.

రాంబా—అమ్మా నేనింకా ఆడుకోవద్దే!

లక్ష్మి—వద్దు! ఇద్దరూ వెళ్లి పడుకోండి!

చిన్న—అమ్మా! ఇద్దరం ఒకమంచంమీదే పడుకొంటామే!

రాంబా—అమ్మా! అక్కయ్యని కథ చెప్పమనవే!

లక్ష్మి—అలాగేలే! కొంచెంసేపు చెప్పుకొని వేగం పడుకోండి! దొంగాళ్లకథలు చెప్పుకోకండి! భయపడతారు!

రాం—రావే! అక్కయ్యా! (ఇద్దరూ వెళతారు).

సీ—నాన్నా! మరిచిపోయి వెళ్లిపోతున్నావా?

లక్ష్మి—మామ్మ పిలుస్తోందిరా చిన్నవాడా?

రాం—ఇంకా వెళ్లిపోలేదే! (వచ్చి సీతమ్మఒడిలో కూర్చుంటాడు)

సీ—ఏదీ! నావరహాలకుప్ప! ఏదీముద్దు!

రాం—(ముద్దిచ్చి) రేపు కానీ ఇస్తావా?

సీ—అలాగేలే! వెళ్లి పడుకో! నన్ను రమ్మన్నావేమిటి జోకొట్టడానికి? (రాంబాబువెళ్లతాడు).

ల—వెళ్లేవాడిని వెళ్లనివ్వదూ! నువ్వు వాళ్లకి దొంగాళ్లకథలు చెప్పి పాడుచేయడానికా?

సీ—ఇదేమి చోద్యమే! కథలుచెబితే పాడయిపోతారే ఎక్కడేనానూ?

ల—మరేమవుతారు? లేతవయస్సులో దొంగాళ్లకథలు చెబితే పెద్దయేక పాడవరూ?

సీ—ఇది మరీచోద్యం! మావాడికి చిన్నప్పుడు ఎన్నికథలు చెప్పేదాన్ని! వాడేమి పాడయిపోయేడే!

ల—ఇదివరకయింది చాలదూ! సూరమ్మతో ఇప్పటికి మాటలు లేకుండా పోయేయి కావూ? ఆవేళ, ఆవిడ కూతురుని వెనకేసుకొనివచ్చి ఎంత అల్లరి చేసింది? తల్లిలేదా, తోడులేదా, అక్కలేదా, చెల్లెలులేదా అంటూ శుభ్రంగా నడివీధిలో పెట్టి భవిష్యం తీసేసిందికాదూ!

సీ—సూరమ్మమాటలకి శుద్ధీ బద్ధం ఏమిటి? నాకు వంట్లో ఓపికుంటే కొప్పట్టుకుని ఈడ్చేసి కప్పెట్టేదును. నువ్వు నోరుమూసుకొని ఊరుకున్నావు కాని—

లక్ష్మి— ఏమయినా కొడుకుని వెనకేసుకుని మాట్లాడడం మానవు! ఈయనవెళ్లి ఆవిడకూతురికి ఉత్తరం వ్రాయడమ్మేమిా?

సీ—నీ కెలాగయినా మావాడంటే నిర్లక్ష్యం పుట్టింది. ఇన్నాళ్లూ ఇలాంటి వెరగవు! మారోజుల్లో మొగాడుపేరు తలుచుకుంటే ఎంత గడగడవాటు! ఎంతభయం! ఎంతభక్తి! పుస్తకాలు చదువుతూంటే ఇలాంటిబుద్ధులు పుడతాయి కాబోలు!

ల—లేకుంటే రాతిక్రింద కప్పలాగు కూచోవాలి కాబోలు, నీలాగు ప్రపంచం తెలియకుండాను!

సీ—జోడు చప్పుడయింది. నాయన వచ్చేడుకాబోలు!

(నరసింగరావు తలుపుతోసుకుని ప్రవేశిస్తాడు; ౩౦. సంవత్సరాలవయస్సు; చామనిచాయ; సన్నంగా పొడుగ్గాఉంటాడు; వీధి తలుపుదగ్గర జోడువిడిచి కోటువిప్పుకుంటూ వస్తాడు.)

సీ—ఏమిరా నాయనా! రోజూకంటె ఆలస్యమయిందివాళ?

నర—బెల్లము ఖరీదు చెయ్యవలసివచ్చింది! ఎంతకీ తెగింది కాదు.

లక్ష్మి—(మెల్లిగా అయిష్టంగా లేచి నిలబడుతుంది) ఏదో ఉత్తరం వచ్చింది. (ఒక కవరు ఇస్తుంది)

నర—(అడ్రస్సుచూసి) ఇదేమిటి షావుకారు ఉత్తరం నాకిచ్చేడు. ఈపోస్టుబంట్రోతు ముసిలాడయిపోయాడు. మతిపోయింది.

ల—షావుకారు ఉత్తరాలకి మనిషినిపంపించి తెప్పించుకోరు?

నర—ఈఉత్తరం ఉండిపోయింది కాబోలు! ఎక్కడయితేనేమని ఇక్కడిచ్చేసేడు. (కవరు చింపి చూసి) దీనిలో చెక్కు ఒకటి పెట్టేడా! జాగ్రత్తగా ఉంచాలి. (చొక్కా జేబులో పెట్టుకొని) మడి కట్టుకునేదా?

సీత—వంటంతా చల్లారిపోయింది. వేగంలే!

నర—అబ్బ! చంపేస్తున్నారే! వీళ్లపనికాదు కాని;

సీత—నాయనా! ఇంతచేటుపని నీవంటికి పడదురా!

నర—అదే నేనూ ఆలోచిస్తున్నాను! (భోజనానికి వెళతాడు; లక్ష్మీదేవి వడ్డిస్తూ ఉంటుంది.)

సీత—ఇంతకంటె సుళువైన పనేదేనా దొరికితే బాగుండును. చూడూ ఎందునక్కలాగు మరీ ఎలా గెండిపోతున్నావో? చిన్నప్పుడూ ఇలాగే ఉండేవాడివి. అమ్మమ్మ నిన్ను బాజాక్కర అని పిలిచేది; నీకు జ్ఞాపకం ఉందోలేదో! ఈమధ్య కాస్త బాగున్నావంటే మళ్లీ ఈపనొచ్చి ఎండబెడుతూంది. (కొంతసే పూరుకొని) అవున్నా! అబ్బాయీ! కోటలో ఎవరేనా పని ఇప్పిస్తే బాగుండునురా!

నర— పాతిక రూపాయల ఉద్యోగాలకి బియ్యేలంతా దరఖాస్తులు పెడుతూంటే, తర్డుఫారంఅనర్సువాడికి, నా కెవడిస్తాడు పని!—మూడునాలుగు నెలలపాటుఆశ్రయిస్తే దొరకకపోదు కాని.—

సీ—అలాగయినా చేద్దూ! ఈశ్రమ పడలేకుండా ఉన్నావు! ఆనాలుగునెలలపాటూ, కావలిస్తే నీపెళ్లాం డబ్బులోంచి ఇంటిఖర్చు పెడుతుంది.

నర—ఈవిడిస్తే ఇంక లేనిదేమి? అదే పతకమయితే అమ్ముకొని బ్రతకనాఅని!

ల—ఇంకో రెండు పచ్చడిబద్దలు వేసేదా?

నర—అక్కరలేదు. (భోజనంముగించి, లేచి, చెయ్యికడుక్కొని, చుట్టా, అగ్గిపెట్టా తీసుకొని వరండాలో పడకకుర్చీమీద కూర్చుంటాడు.)

సీత—(లేచి, గదిలోకివెళ్లి తలగడాతెచ్చి) తలక్రింద తలగడాపెట్టుకో! ఒత్తుతుంది. (అట్లుచేస్తుంది.)

నర—(చుట్టకాలుస్తూ) దానిదగ్గరున్న డబ్బునాకిస్తే, హాయి హాయి! ఈపాటి దాని నెంతవృద్ధిలోకి తెస్తును!

సీత—అవును, నిజమే! నేనిదివరకే చెప్పేను ఆమాట దానితోను! లక్ష్మిందేవమ్మా! నీతో ఇదివరకు చెప్పలేదే నేనీమాటా!

లక్ష్మి—(సున్నంరాసి ఈనెలు తీసిన ఆకులు, వక్కలు తెచ్చి భర్తకిస్తూ) అవును, చెప్పేవు! అయితే?

సీత—చూసేవా! దానికెంత నిర్లక్ష్యమో? నీచేతికిస్తే తగలేస్తావని దానికి భయంరా!

నర—నేను తగలేస్తానా?

లక్ష్మి—తగలేస్తారనలేదునేను; క్లుప్తంగా ఖర్చుపెట్టరన్నాను.

నర—నీకేం తెలుసునూ?

లక్ష్మి—నాకు తెలుసునూ!

నర—ఏమయినా మొగుడంటే లక్ష్యపెట్టని పెళ్లాం దొరకడం కూడా ఒక అదృష్టమే!

లక్ష్మి—ఇంకా ఎలాగో లక్ష్యపెట్టడము, చెప్పకూడదూ?

నర—మరీ, ఆరూపాయలు నాకిస్తే, ఈపాటి వాటిని పదింతలు వృద్ధిలోకి తీసుకురానూ! దానికంతా ఒకప్లాను వేసాను; పోనీ అందాకా రెండువందలేనా ఇయ్యి!

లక్ష్మి—ఏమిటి, ఆప్లాను చెప్పండి.

నర—ఎలాగుచెప్పడం! ఒకస్నేహితుడూ, నేనూ ఒక వ్యాపారం గురించి ఆలోచించేము; నీతాలూకు డబ్బున్నాదని, ఆడబ్బు నేను తేగలనని వాడికి తెలుసును; మాఆవిడదగ్గర డబ్బున్నాది; అది నేనడిగినా ఇవ్వదు అని చెప్పుకుంటూ ననుకొన్నావేమిటి తెలివితక్కువ పెద్దమ్మలాగు. అసలువ్యాపారానికున్నదే రహస్యం; ఆగుట్టు కాస్తా తెలిసిపోతే దానిలో సాగునే లేదు.

సీ—పోనీ చెప్పకూడదురా నాయనా! నీపెళ్లానికి చెప్పడానికేమి?

లక్ష్మి—పోనీలెండి! చెప్పక్కరలేదు. అలవాటులేనివాళ్లకి అనవసరంగా అసత్యదోషం కూడాను. ఇలాంటిస్నేహితులు దొరుకుతారనే మానాన్న నాసరుకులన్నీ తీసుకున్నాడు. మర్రాళ్లకి చొక్కాగుడ్డలేనా కుట్టించుకోడానికి లేకుండా ఈకాస్తడబ్బు మీ స్నేహితుడికిచ్చేస్తే ఎలాగు?

నర—సరుకులన్నీ తీసుకున్నవాడు మళ్లీ ఈ డబ్బెందుకిచ్చాడు?

లక్ష్మి—ఎందుకో చెప్పేదా? మునుపటికంటె మీరుబుద్ధిగా ఉన్నారేమో అనుకుని, వడ్డాణం నేనే చేయించుకుంటానంటే నమ్మి ఇచ్చేడు. ఇంట్లో ఇబ్బందిగా ఉంటే వడ్డాణంమాట తరువాతమాసుకోవచ్చునని అప్పుడొక పది, అప్పుడొకపదీ తీసి ఇంటిక్రింద ఖర్చు పెడుతున్నాను. అవీ తరిగిపోతూనే ఉన్నాయి. అప్పుడే ఏభయి రూపాయ లయిపోయేయి కావూ?

నర—అయితే నాకు బుద్ధిలేదనికూడా అన్నావు? (కుర్చీ మీదనుండి లేచి ధుమధుమలాడుతూ పచారు చేస్తూ) చూసేవా అమ్మా! చేసేవు మేనరికం!

సీత—ఈపోరు పడలేను నాయనా, నేను.

నర—నోరుమూసుకో! నేనా పోరుపెడుతున్నాను? చేసేవు ప్రతాపం!

సీత—ఔరా! ఔరా! ఏమిరా నీకొచ్చిన...... ఔవ్వ! నోరు మూసుకోమంటావూ? కళ్లురెండు పోతాయిసుమా!

నర—పోనీలే! అప్పుడుచూసి సంతోషిద్దువుగాని!

సీ—(కంట నీరుపెడుతూ) పోనీరా నాయనా! ఎమిట్రా నీమాటలూ! నాదిశం ఇలాగు తిరగబడనియ్యవూ? ఇట్లాంటివాడవు పుట్టేవేమిరా నాకడుపునా!

ల—అత్తా! నువ్వుపోయి పడుకో! ఇంకా నిద్దర రాదూ?

సీ—నిద్దరేమిటి నావల్లకాదు! విన్నావా? ఎంతమాట అన్నాడో!

నర—నన్ను అది అన్నమాట నువ్వు విన్నావా? అయిదు వందలు దగ్గర పెట్టుకొని అందాకా రెండువందలు బదు లిమ్మంటే ఇవ్వదు! బదులుసుమా అడిగినది. ఇంకొకర్తె అయితే ఆసొమ్మంతా మొగుడిచేతిలోపెట్టి మీయిష్టంవచ్చినట్లు చేయండని చెప్పునన్నమాట!

సీత—నిజమే! దానిసొమ్ముకీ నీసొమ్ముకీ భేద మేమిటి?

ల—అత్తా! వెళ్లి పడుకోమంటే నువ్వెందు కింకా నిద్దర మానుకొని.

సీత—మధ్యని నీఅధికారమేమిటే? నా కొడుకుదగ్గర నేను కూర్చుంటాను.

లక్ష్మి—నేనేమీ అధికారం చేయలేదమ్మా! తెల్లారిందాకా కూర్చోతల్లీ! నాకు నిద్దరొస్తూంది. ఎంగిలెత్తేసి పడుక్కుంటాను. (వెళ్లుతుంది.)

సీత—నీ భోజనమో?

లక్ష్మి—భోజనమూ అక్కరలేదు, బొగ్గులూ అక్కరలేదు!

(వీథితలుపు తోసుకొని సన్యాసిరాజు ప్రవేశిస్తాడు. నరసింగరావుఈడే! సాధారణమైన వేషం.)

సన్యాసి—నరసింగరావూ?

నర—ఏమిరోయి రాజూ!

సన్యాసి—లోపలికి రావచ్చునా?

నర—ఉండు నేనేవస్తున్నాను; వీథిఅరుగుమీద కూర్చుందాము. చుట్టలున్నాయా? తెచ్చేదా?

సన్యాసి—అక్కరలేదున్నాయి.

నర—అమ్మా! నువ్వుపోయి పడుకో చాలరాత్రయింది.

సీత—అట్టేసేపు మేలుకోకు నాయనా! వేడిచేస్తుంది.

నర—(వీథిలోకి వెళతాడు).

సీత—అప్పుడేవెళ్లి పడుక్కున్నా వేమిటే! ఉండు నేనూ వస్తున్నాను. కాస్త మజ్జిగా అన్నమేనా తిన్నావుకావూ? (భోజనాలగదిదగ్గరకు వెళ్లిచూసి) అమ్మదొంగా! కిక్కురుమనకుండా ఇక్కడ కూర్చొని తినేస్తున్నావా?

౨-వ స్థలం. ఆయింటివీథిఅరుగుమీద.

(నరసింగరావు, సన్యాసిరాజు చుట్టలుకాల్చుకుంటూ.)

నర—ఏమిట్రా సంగతి! ఇంతరాత్రప్పుడు వచ్చేవేమిటి?

సన్యాసి—ఏమిచేయమన్నావు? ఇంతసేపు ఆదినారాయణ వచ్చి అల్లరపెట్టేడు, ఆడబ్బుతెమ్మని! రేపు తప్పకుండా ఇస్తానని వప్పించేసరికి తలప్రాణం తోకకి వచ్చింది. ఎలాగయినా ఇప్పుడిస్తే కాని మాటపక్కదురా!

నర—చంపేసేవే! ఒక్కదమ్మిడీ లేదు దగ్గర!

సన్యాసి—మళ్లీ పాడినపాటే! ఎప్పుడూ ఒక టేకథా!

నర—అయితే కథ మార్చమంటా వేమిటి?

సన్యాసి—నీకేమీ! రాజాపోతులా వున్నాడనీ! మధ్యని నే నేలా చస్తే నీకేమి?

నర—ఏమంతచావు వచ్చిందిరా నీ కిప్పుడు?

సన్యాసి—అసలు రొక్కం పుచ్చుకొన్నది పాతికరూపాయలు! పేకాటలో బాకీ పాతిక! ఏభయిరూపాయ లివ్వాలి! ఒకనాడు కాదు, రెండునాళ్లు కాదు! నువ్వుపెట్టిన గడువు దాటి మూడునెలలయింది. నీకు చీమకుట్టినట్లేనా లేదు! ఒక్కడిచేత నయినా అడిగించుకోకుండా, అన్ననాటికి సరిగా ఇచ్చేసి మర్యాద కాపాడుకుంటున్నవాడను నేను. నీకు డబ్బు ఇచ్చుకోడమేకాకుండా, చెడ్డపేరుకూడాఎక్కడ తెచ్చుకోను!

నర— మరి, నాదగ్గర లేనప్పుడు బలవంతపెడితేమాత్రం వస్తుందట్రా!

స—పోనీ రేపిస్తావా?

నర—రేపుమాత్రం ఎక్కడనుండి వస్తుంది?

స—అయితే ఎప్పు డిస్తానంటావు?

న—ఎప్పుడో దగ్గరున్నప్పుడు చూసి—

స— ఇంకా ఎప్పుడో దగ్గరున్నప్పుడు చూస్తావా? నీకు సాయంచేసినందుకు ఇదేకాదూ నువ్వు చేసేఉపకారం! నీ భార్యా దగ్గర డబ్బున్నాదన్నావు!

నర—అవును.

స—అదేం జేసేవు?

నర—ఏమీ చేయలేదు.

స—ఆపుప్పవనమో! ఇంకేవనమో! దానిక్రింప తగలేస్తున్నావు కాబోలు!

న—ఓరుముయ్యరా! గట్టిగా మాట్లాడుతావేమిటి. ఇంట్లో మావాళ్లున్నారని తెలుసునా?

స—అయితే లోకమందరికీ తెలిసినది ఇంకా మీవాళ్లకి తెలియకుండా వుందా? (నవ్వును.)

నర—ఏమిట్రా నీనవ్వు! నన్ను చంపేసేలాగున్నావు కాని!

స—పోనీలే! నువ్వు గోలపెడుతూంటే నేనెందుకు నిన్ను బయటపెట్టడం!

న—ఒరే! చెబితే నమ్మవుకాని, నాపని చాలా అవస్థగా ఉందిరా! నాపెళ్లాం నామీదే సవాలవుతుంది! మేనరికం అవడం చేత చిన్నప్పటినుండీ చనువెక్కువ! అందులో కాస్త డబ్బు దగ్గరుండగానే ఆడదానికి ప్రపంచం కనబడదు. ఇంట్లో ఏనెలజీతం ఆనెల తెచ్చిఇవ్వకపోతే పిల్లు అనుమానపడతారు. సరుకులన్నీ మామగారు లాగేసేడు. అల్లర పడదామన్నా అల్లరే మిగులుకాని అనుభవం తక్కువ. ఇల్లుఒకటి అప్పులేకుండా ఉందంటే అది మా అమ్మపేర నుంది......అవతల ఆమనిషి డబ్బుకోసం చంపేస్తూంది. అసలు మనకి రోకు అక్కడా. పైగా ఈమధ్యను దాన్ని డాక్టరు దగ్గరకు పంపి ఇంజక్షన్లు చేయిస్తున్నాను. ఆడాక్టరింకా మర్యాదకు కట్టుబడి డబ్బడగలేదు. మెల్లగా గమ్మత్తుచేసి ఆడబ్బు ఎగేయాలి. అదొక ఆలోచనా!

స—భార్య డబ్బు సంపాదించలేవు! నీమగతనం ఎందుకోరే!

న—నాడబ్బా ఏమిట్రా! ఆఖరికి రెండువందలు బదులిమ్మన్నాను! బదులుసుమా! ఇవ్వందే!

స—ఆహాహాహా! మొగుడికి పెళ్లాం ఇవ్వనని చెప్పడానికి సాహసించడమా!

న—ఇంకా ఏమిచెప్పమన్నావు? అవస్థ! ఒక్కొక్కనాడు తలుచుకుంటే ఏరంగమో పారిపోదామా అనిపిస్తుంది!

స—కొంపతీసి అలాగ చేస్తావేమిటి? నాడబ్బు మందిచ్చి మరీ వెళ్లిపో!

న—అదీ! అంతలో ఉంది నీస్నేహం. ఎప్పుడో ఒకనాడు నాబ్రతుకు నడివీథిలో పెట్టేస్తావు నువ్వు.

స—అసలుసంగతి, ఆముండని మరిగి నీపెళ్లాన్ని చూడడమే మానేసేవు కాబోలు. కాస్త గమ్మత్తు చేస్తూండాలి. మంచిమాట లాడాలి, లాలించాలి, బుజ్జగించాలి! నీకు మాత్రం తెలియదా ఏమిటి, రసికాగ్రేసరుడివి?

న—నాకూ నీడబ్బు సాధ్యమయినంత త్వరలో ఇచ్చేయాలనే ఉంది! కాస్త వెనకాముందూ కాని, ఎగేయడమనేమాట ఈకంఠంలో జీవుడుండగా జరగదనుకో!

స—ఏమో! వేగము ఇచ్చేసేవంటే నీమర్యాదా, నామర్యాదా దక్కుతాయి! లేకపోతే ఆసాధకబాధకాలు ఆలోచించుకో! పోతాను. (లేచివెళ్లును.)

(నరసింగరావు తలుపు గడియవేసుకుని లోపలికి పోతాడు.)

## ౨ వ అంకము

(సీతమ్మ ఇల్లు; సాయంకాలము ఏడుగంటలయింది; పిల్లలు దీపందగ్గర పుస్తకం చదువుతున్నట్టు కూర్చుంటారు. సీతమ్మ ఉప్పుపిండి "ఫలహారం" చేస్తూంటుంది. లక్ష్మీదేవి వంటచేస్తూంటుంది.)

చిన్న—ఆమిడతను పట్టుకొని చంపేస్తావేమిటిరా! అమ్మా! చూడవే తమ్ముడూ!

రాం—చూడవే! ఎంతబాగా ఎగురుతూందో?

చిన్న—మిడత లీదీపంమీద కెగిరితే కాలదే మమ్మా!

సీ—దీపాన్ని ఏదో పండనుకొని ఎగురుతుంది! ఎగిరెగిరి దీపంలో కాలిపోతుంది!

రాం—ఇంకా కాలిపోలే దేమి?

సీ—ఇంకా ఎగిరెగిరి కాలిపోతుంది. ఊరికే ఎగిరితే ఏమవుతుంది?

రాం—మరీ, నేనెగిరితే నేనూ కాలిపోతాను?

సీ—బాగుంది! వెధవయక్షప్రశ్నలు నువ్వూను. ఇలాగురండి ఇద్దరూను; ఉప్పుపిండి పిసరుపెడతాను.

రాం—అలాగేను. నేనుముందు.

చి—అబ్బా! నేనుముందు.

రాం—(ముందుగా పరుగెత్తి)ముందువచ్చినవాళ్లకుచాలాను.

సీ—అలాగు మీదకొచ్చి పడతారేమిటి? ముట్టుకు పోతారేమిట్రా! ఇంకా మంచినీళ్లు త్రాగాలి! మీకు పెడతాననడమేతప్పు!

ల—(వంటగదిలోనుండి) వంటయిపోయింది! వాళ్లకేమీ పెట్టకిప్పుడు! రోజూ ఇదొకటి అలవాటు చేస్తున్నావా, భోజనాల ముందు?

సీ—అడుగోనర్రా! మీఅమ్మ కోపపడుతూంది! తరువాత పెడతాను పొండి.

చి—అబ్బా! ఇప్పుడేను!

రాం—అబ్బా! ఇప్పుడేను!

సీ—పాపం! దగ్గరకువచ్చి చేయిచాచేరు ఇవాళకు పెట్టనీయవే! (పిల్లలచేతులలో రహస్యంగా పెట్టి) చప్పున తినేయండి! మీఅమ్మ చూడకుండా!

ల—(వంటముగించి, పిల్లలదగ్గరకు వస్తూ) తిండిచెడిపోదూ! పిలిచి పెడతానంటే చెయ్యిచాచక ఏంచేస్తారు కుర్రాళ్లు? (సీతమ్మ ఫలహారం ముగించి లేస్తుంది)

చి—అమ్మా! నేను నాన్నతో బోంచేస్తానే!

ల—ఏమిటన్నావు మళ్లాఅనూ!

చి—అమ్మా! నేను నాన్నగారితో బోంచేస్తానే!

రాం—అమ్మా! నేనూ నాన్నగారితో బోంచేస్తానే!

ల—అప్పటికి నిద్దరపోడానికా?

రాం—అమ్మా! నేను నాన్నగారన్నాను కాదే!

ల—అన్నావురా నాన్నా నువ్వు!

సీ—(దగ్గరకువస్తూ) ఏమి ఓషులే నాతల్లీ!

రాం—మరీ నన్నుకూడా నాన్నగారనాలి!

ల—నువ్వుకూడా నాన్నగారివే నోయి!

సీ—(వరండామీద స్తంభానికి ఆనుకుని కూర్చుని) బాగుంది! లేచి ఆకుంపటి నిప్పులూ ఇలాతెచ్చి పడేయి! చలి! ఒళ్లు వణుకెత్తుకొస్తూంది.

ల—కాస్త రెండడుగు లలాగు వెళ్లి తెచ్చుకోలేక పోయేవా?

సీ—మరచిపోయేనే! నాతల్లీ! తెచ్చిపెట్టకూడదూ?

ల—అలాగేలే!

సీ—చలి వణికించేస్తూంది మళ్లా ఆమూలకి పోలేను. తెచ్చిపెట్టవే!

ల—అప్పుడే మైలడలేదుకద! అటకమీద ఊరగాయ తియ్యాలి.

సీ—ఇంతసేపూ చెప్పకూడదూ. చూసేవా? ఓపికలేని ముసలి ముండాకూతుగిని రాత్రిపూట అటకెక్కించి చంపేయా లనుందా ఏమిటే?

ల—మధ్యాహ్నం మూడుగంటలనుంచి వీథివీథంతా ప్రతీయింటికి వెళ్లి పెత్తనాలు చేయడానికి మాత్రం ఓపికా, మతీ ఉంటాయి.

సీ—ముట్టేసుకొన్నావూ. నీతల్లికడుపుచల్లగా! నీకొడుకు ముట్టుకున్నాడు. ఇంక ఏలాగఏడవడం!

రాం—అమ్మా! నేను ముట్టుకోలేదు.

సీ—ముట్టుకోలేదు రా వెధవా. వెనకనుంచి వేళ్లు తగిల్చేసేవు కావు? (కుంపటికోసం వెళుతుంది.)

ల—అటకెక్కడాని కిష్టంలేకపోతే ఎన్నిబొంకులేనా బొంకవచ్చును. తల్లికీకొడుక్కీ ఒక్కలాంటి బుద్ధులే. (అన్నంపెట్టడానికి పిల్లలని తీసుకువెళ్లుతుంది.)

సీ—(కుంపటితో తిరిగిప్రవేశించి) భూలోకంమీద కోడలన్నది పొద్దున్నే అత్తగారికి దండంపెడుతుంది. అత్తగారిని కూర్చోబెట్టి ఇంటిడు చాకిరీ చేస్తుంది స్నానంచేయిస్తుంది. బట్టలుతుకుతుంది కాళ్లు పిసుకుతుంది ఎంతో శుశ్రూష చేస్తుంది. ఇంత నిర్లక్ష్యమెక్కడా చూడలేదమ్మా, ఎంత మేనరికమైనాను.

ల—ఎత్తుకొని అన్నంతినిపించనక్కర లేదూ!

సీ—నువ్వన్నీ చేస్తావు పుట్టినప్పటినుండీ ఆశపడి, చిన్నప్పటినుండీ సరుకు సప్పరాపెట్టి, తల్లిలేని పిల్లగదా అని చేరదీసి, పెంచి పెద్దదాన్ని చేసినందుకు మహాబాగా సుఖపెడుతున్నావు!

ల—నాకంటె నువ్వు బాగానే సుఖపడుతున్నావు.

సీ—నీకొచ్చిన లోపమేమిటే. నిక్షేపంలాంటి మొగుడు. రత్నాల్లాంటి పిల్లలూ, పండువంటి కాపురం, అవతల ధనాలకుప్ప తండ్రి—

ల—అవతల తండ్రినీ, ఇవతల పిల్లలనీ చూసి సంతోషించవలసిందే కాని, తక్కిన నిక్షేపాలకన్నీ ఆక్షేపణలే!

(పిల్లలు భోజనాలు ముగించి వస్తారు. వీథి తలుపు చప్పుడవుతుంది.)

సీ—నాన్న వచ్చేడుకాబోలు తలుపుతీయి చిన్నతల్లీ! (చిన్నసీత వెళ్లి కొంతతంటాలుపడి తలుపుతీసి)

చిన్న—అమ్మా! నాన్నకాదే! మామయ్య!

ల—రామలింగం అన్నగారు కాబోలు!

సీ—ఇతనా? అదృష్టమంతుడు.

(రామలింగం ప్రవేశిస్తాడు. 3౫ సం. వయస్సు సాధారణ వేషం. మీసంలేదు.)

ల—అన్నయ్యా! రండి. సీనాన్నోళ్లొచ్చేరు. కుర్చీ తెస్తానుండండి!

రామ—అక్కరలేదమ్మా, ఇలాగు కూర్చుంటాను. అనవసరమైన మర్యాదలు చేయకండి!

సీ—పోనీ ఆపీట వెయ్యి!

(లక్ష్మి పీటవేయగా రామలింగం కూర్చుంటాడు. లక్ష్మి పిల్లలని తీసుకొని వెళ్లి పడుకోబెట్టి వస్తుంది.)

సీ—(కుంపటికాచుకుంటూ "ఆరామవిభుని తలచిన, కారాకులు ద్రుళ్లినట్లు కర్మము ద్రుళ్లున్" అని మననము చేస్తూంది)

సీ—ఏమయ్యా! అంతాబాగా!

రా—ఆఁ! బాగున్నాము.

సీ—నీపెళ్లానికి ఎన్నోనెలా ఇప్పుడు?

రా—అదేమో!

ల—బాగున్నాయే నీప్రశ్నలు.

సీ—అదే మన్నమాటే! పదేళ్లకు కాన్పువచ్చిందంటే అందరూ సంతోషించవలసినమాట!

రా—నరసింగరావేడీ?

ల—ఇంకా ఇంటికి రాలేదు!

రా—ఊళ్లో లేడా ఏమిటి?

ల—ఊళ్లోనే ఉన్నారే!

రా—ఏమో! ఇవాళ ఫేక్టరీకి రాలేదు, మార్కెట్టుకీరాలేదు

సీ—ఏమయి పోయేడు చెప్మా!

రా—ఎమో ఎక్కడికి వెళ్లి పోయేడో?

సీ—మొన్న నెవడో, మోటాకారో బస్సో దానిపేరు రాదు, దానికింద పడిపోయేడట. అలాగ జరగలేదుకద!

రా—కుర్రాడా యేమిటి అలాగెందుకు జరుగుతుంది?

సీ—ఏమో ఓమాటు వెళ్లి నాలుగువేపులా వెతుకుమా నాయనా! గుండెల్లో రాయిపడ్డట్టు చెప్పేవు!

ల—నువ్వు మరీ సోది చెబుతావేమిటి? అంత తెలివితక్కువ మనిషికాదు.

సీ—అయితే ఏమయిపోయేడంటావే?

ల—ఏమో ఎవ్వేహితులు దొరికేరో కాలక్షేపానికి.

రా—అసలు పీకలమీదకి వచ్చేలాగుందిప్పుడు.

ల—అదేమిటి?

రా—ఒక కాతాదారు మాషావుకారుకి కొంత బాకీ వుండి ఇవాళ ఒకచెక్కు పంపేడు. నిన్న నొక చెక్కుపంపినట్లు ఆవుత్తరంలో రాసేడు. ఆచెక్కు నాకూ అందలేదు. షావుకారుకీ అందలేదు. పోస్టుబంట్రోతును కనుక్కోగా షావుకారుఉత్తరమొకటి నిన్న మీయింట్లో ఇచ్చినట్లు చెప్పేడు.

ల—అవును. నిన్నను షావుకారు ఉత్తరమొకటి మరచిపోయి పోస్టుబంట్రోతు ఇక్కడ ఇచ్చేడనీ, అందులో చెక్కు ఉన్నాదనీ అన్నారు.

రా—ఇవాళ ఇతడు పనిలోకి రాకపోవడం, ఆ చెక్కు అందకపోవడం చూసి షావుకారు కారాలు మిరియాలు నూరుతున్నాడు. పోలీసువాళ్లకి రిపోర్టుచేయడానికి సిద్ధంగా వుంటే నేను కనుక్కుంటానని చెప్పివచ్చేను.

సీత—ఇదేమి అన్యాయమర్రా! మావాడు ఇలాటిపనులు చేస్తాడటయ్యా ఎక్కడేనాను. దొంగతనం కట్టడం కూడానా?

ల—ఆయన ఇంటికి రాగానే ఇప్పించేస్తాను. షావుకారు అల్లరిచేయకుండా ఆపుచేయండి.

రామ—ఏమో! ఆసాయబు అసాధ్యుడు! ఇతడిచ్చేసినా ఊరుకునే మనిషికాడు. మనిషిమీద అనుమానం పుట్టేక వాణ్ణి హతమార్చేస్తాడు. ఇతడీచెక్కు ఇయ్యకపోతే ముందు నామీదకి వస్తుంది. మార్కెట్టుపని నాది; ఫేక్టరీపని నరసింగరావుది. ఇతడే చెక్కుఇవ్వకపోతే ఆచెక్కు నేను కాజేసే ననుకుంటాడు.

ల—ఇవ్వకేంచేస్తారు, తప్పకుండా ఇచ్చేస్తారు.

రా—ఏమో అతనిసంగతి నాకనుమానమే! ఆచెక్కు ఎక్కడేనా మార్చుకొని వాడేస్తే?

ల—అంతకొంపమీదకివస్తే నేనిచ్చుకుంటాను. అసలు సొమ్మెంత?

రా—రెండువందలు.

ల—రెండువందలే! సరే! ఎలాగో అవసరమయితే మీమీదకి రాకుండా నేనిచ్చుకుంటాను. ఆసాయబును ఎమీ అల్లరిచేయకుండా ఆపలేరూ!

సీ—నువ్వు నంగిరిఓడడం మరీబాగుంది. అసలు ఈపెంటంతా ఇతడే పెట్టాడేమో!

రా—నాకేమిటమ్మా అంతఅవసరం! భోజనంలేకుండా ఊరంతా వెదకి, ఫేక్టరీకి వెళ్లీ, ఇంటికి వచ్చీ, కాళ్లరిగిపోయేలాగు తిరిగేదాకా నాకేం పట్టింది? ఎవరూ చెప్పక్కరలేదు. ఆచెక్కు మార్చినప్పుడే దొరుకుతాడు దొంగ! అనవసరంగా పోలీసువాళ్లకి చెప్పడం, ఖైదులో పెట్టించడం ఎందుకని ఉపకారానికివస్తే ఇదా బహుమతి! నాకేంపోయింది. నేపోయి ఉన్నసంగతి సాయబుకి చెప్పేస్తాను. ఆపయిని వాళ్లిద్దరూ ఎలాగు జుట్టులు పట్టుకుంటే నాకేమి?

ల—ఇంటికి పెద్దమనిషివస్తే ఏమిటత్తా ఆమాటలు?

సీ—మావాడిని ఖైదులోపెట్టిస్తా నంటాడు చూడుమరి! ఇతడు మహా నిజాయితీ మనిషిలాగు.

రా—నేను నిజాయితీ అయినా కాకపోయినా, బ్రహ్మకేనా పట్టుబడకుండా కాలక్షేపం చేయగలను. మీవాడిలాగు పనిలోకి రావడంమానేసి, చీట్లపేకాడి దొరికిపోను,

ల—పెద్దకాలము! ఆవిడమాటలకేంగాని చీట్లపేకన్నా వేమిటి?

రా—అవునమ్మా అతనిసంగతి మీకు తెలియదు! చెక్కు మార్చేసి రెండువందలు దమ్మిడీమిగలకుండా పేకాటలో తగలేస్తా డంటే ఆశ్చర్యంలేదు.

ల—అయితే ఒకవేళ ఆరెండువందలు కడతేర్చేసేరోఏమిటో. ఇలాగే కాబోలు నాదగ్గర డబ్బుకూడా వృద్ధిలోకి తెస్తానన్నారు. (వీధితలుపు చప్పుడు.)

(లక్ష్మీదేవి తలుపుతీయగా నరసింగరావు ప్రవేశిస్తూ)

నర—అబ్బ! ఈమార్కెట్టుపని కాదుకాని ప్రాణాలు తినేస్తూంది. (జోడువిడచి లోపలికి వెళ్లుతూ రామలింగాన్ని చూసి గతుక్కుమంటాడు. మళ్లీ ధైర్యంగా) ఇదిగో బావగారు! ఎంత సేపయింది వచ్చి.

రామ—ఒకపావుగంట అయింది.

నర—తొందరగా మాట్లాడాలా?

రా—తొందరేమీలేదు. భోజనం చేసిరా.

(నరసింగరావు త్వరగా భోజనం ముగించి, వచ్చి చుట్టకాలుస్తూ రామలింగంవద్ద కూర్చుంటాడు.)

నర—ఏమోయి! భోజనమయిందా?

రామ—భోజనానికేమిగాని, ఇవాళ ఎక్కడా కనబడ్డావు కావు.

నర—ఇవాళ ఎక్కడా తీరుబడి లేకపోయింది. ఫేక్టరీలో ఇప్పుడెంతపనుందో తెలుసునా?

రా—ఫేక్టరీకి నేనూ వెళ్లేనే! నువ్వు రాలేదన్నాడు మేస్త్రీ.

నర—నువ్వు ఎందుకువెళ్లేవు ఫేక్టరీకి?

రామ—నీకోసమే. నిన్నటి చెక్కుకోసం!

నర—నిన్నటి చెక్కేమిటి?

రా—షావుకారు చెక్కు ఒకటి నిన్న నీకంపలేదూ?

నర—ఎవరు చెప్పేరు?

సీ—నీపెళ్లాం చెప్పిందిరా. (లక్ష్మీ భోజనం ముగించి వస్తుంది.)

నర—అవునా?

లక్ష్మి—నిన్న నన్నారుకారు? షావుకారు ఉత్తరం పాఠ పాటున ఇక్కడిచ్చేడు అందులో చెక్కున్నా దని. ఆమాటే చెప్పేను.

నర—చెప్పేవూ. మా వ్యవహారాలజోలి నీకెందుకూ?

లక్ష్మి—వ్యవహారమేముంది ఇందులో. పోస్టుబంట్రోతే చెప్పేడట ఉత్తరమిక్కడిచ్చినట్లు

రా—సాయబు ప్రళయకాలరుద్రు డయిపోయి చిందులు తొక్కుతున్నాడు. ఎందుకు నానా అల్లరీను—వేగం ఇచ్చేస్తే వాడి మొగంమీద పారేస్తాను. ఇంకానేను భోజనంచేయలేదు తెలుసునా?

న—అలాగే ఇచ్చేద్దాము.

రా—ఇచ్చేద్దామంటేకాదు. ఇప్పుడిచ్చేయాలి.

నర—ఇక్కడలేదు కోటుజేబులో ఉండిపోయింది. కోటు ఫేక్టరీలో మరిచిపోయేను.

రా—ఇవాళ నువ్వు ఫేక్టరీకే వెళ్లనిదే!

ల—ఇంట్లోకి వస్తూనే మార్కెట్టులో పని ప్రాణంతినేస్తూంది అన్నారు.

న—అంటే అన్నానే.

ల—అయితే ఇవాళ పనిలోకే వెళ్లలేదూ?

న—లేదు, మార్కెట్టుకీ వెళ్లలేదు ఫేక్టరీకి వెళ్లలేదు. ఎక్కడికో నాయిష్టంవచ్చిన వగ్గరికి వెళ్లేను.

రా—ఫేక్టరీకి వెళ్లనిదే కోటెలాగు పెట్టావోయి అక్కడ?

ల—అసలు ఇవాళ కోటువేసుకొని వెళ్లలేదు. కోటు గదిలోనే ఉన్నాది.

సీత—అయితే వెళ్లి కోటులో ఉందేమో తెచ్చి ఇచ్చేయి.

(లక్ష్మి వెళ్లబోతూండగా)

న—నువ్వు శ్రమపడి వెళ్లి చూడక్కరలేదు. కోటులో లేదది

రా—అయితే ఏంచేసేవోయి?

నర—రేపు ఇస్తానుకాదా నేను!

రా—అదికాని మార్చుకొని కర్చుపెట్టేలేదు కద!

నర—ఏమిటోయి నువ్వు మహానిజాయితీలాగు శ్రీరంగనీతులు చెపుతావేమిటి?

సీ—చూసేవా, ఆమాటే నేనంటే నామీదకి కస్సుమని లేచేడు.

నర—నువ్వు పోయి పడుకుందూ చెల్లీ! నీవ్యాఖ్యానాలు అక్కరలేదు మాకు. మధ్య నువ్వు ఎందుకువస్తావు? తెలిసీ తెలియని ఏడుపు?

రా—ఇప్పుడా చెక్కు వాడికివ్వకపోతే నామీద అనుమానపడతాడు. అసలు ఏమిచేసేవో చెప్పకూడదూ,



ఆంధ్రనాటకకళాపరిషత్తు చతుర్థసమావేశము, చెన్నపురి
(అధ్యక్షులు : డా. గోవిందరాజుల వెంకటసుబ్బారావుగారు)

ఆంధ్రవిశ్వకళాశాల పట్టప్రదానోత్సవము (ఉపన్యాసకులు, అధ్యక్షులు, ఉపాధ్యక్షులు, రిజిస్ట్రారు)



రెండవ ఆయుర్వేదమహాసభ, చెన్నపురి (అధ్యక్షులు : ఆచంట లక్ష్మీపతిగారు)



జమీనురైతుమహాసభ, వెంకటగిరి (అధ్యక్షులు : టంగుటూరి ప్రకాశంగారు)

నర—చెక్కు మార్చేసేనోయి!

రా—మార్చేసేవు? ఫోర్జరీయే! ఇంక వాడు పోలీసువాళ్లని తీసుకువచ్చి ఎర్రస్టుచేయిస్తాడు! నాకొంపమీదకి వస్తుందిబాబు! నేనుపోయి చెప్పేస్తాను. (లేచి వెళ్లిపోతూండగా లక్ష్మీదేవి అడ్డుపడి,)

ల—ఎలాగయినా మీరేకాపాడాలి!

రా—ఎలాగమ్మా! ఆచెక్కు ఇవ్వకపోతే వాడూరుకుంటాడా?

ల—డబ్బు ఇచ్చేస్తే ఊరుకోడూ!

రా—ఏమో తురకసన్యాసం! వాడికి సబుమేమిటి?

ల—వాడికి కావలసినది డబ్బేకదా! ఆడబ్బిచ్చేసి మీ రూరుకోమంటే ఊరుకుంటాడు.

రా—ఏదీ ఆడబ్బుమాత్ర మితడిచ్చేడా.

ల—ఆయన ఇవ్వకపోతే నేనిచ్చుకుంటాను.

రా—ఎప్పు డింకా!

ల—ఇప్పుడు సిద్ధంగాలేదే! రేపు ఆయనే ఇస్తానన్నారే! లేకపోతే నేను పోస్టునుండి తెప్పించి రేపుసాయంత్రం దీపాలవేళప్పుడు మీరువస్తే ఇచ్చేస్తాను.

రా—మరి నీమాటనమ్మకంమీద వెళ్లిపోతున్నాను.

ల—రేపు ఇయ్యకపోతే మీయిష్టంవచ్చినట్లు చేసుకోవచ్చును.

(రామలింగం వెళతాడు. సీతమ్మ మెల్లగా లేచి నిద్రపోడానికి వెళ్లుతుంది. లక్ష్మీదేవి వీథితలుపు గడియపెట్టివచ్చి,)

ల—మీకిదేమైనా బాగుందీ?

న—అతని బెదిరింపులకి భయంపడతావేమిటి? సాహుకారులూరు చెక్కులన్నీ నేనేమారుస్తాను. అలాగే ఇదీమార్చేను.

ల—మరి ఆడబ్బేదీ?

న—ఉన్నాది ఒకచోటదాచేను.

ల—ఉన్నాదా! చీట్లపేకాడేసేరా?

న—ఆమాట ఎవరన్నారు?

ల—అతడే అన్నాడు.

న—ఇలాంటి వెధవకబుర్లన్నీ నామీద ఎవరేనా చెబుతూంటే ఆమాట నిజమనుకొని నువ్వు నమ్ముతుంటావా?

ల—మరి మీరాడబ్బియ్యకపోతే నేనిచ్చుకోవాలే.

న—నువ్వు చాలామంచిదానివటకాదూ! రా పోయి పండుకుందాము.

ల—ఇవాళ పగలల్లా ఎక్కడికెళ్లారో చెప్పండి.

న—చెబుతానురా. అప్పుడే వేళమించిపోయిందేమిటి? ఇంకా ఏంతరాత్రి లేదుమనకి—

(జటపటాలవేసుకొని తీసుకొని పోతాడు.)

## 3 వ అంకము

(అదేఇల్లు. మరునాడు రాత్రి ౯ గంటలకి భోజనాలరయేక. వరండామీద రామలింగం, నరసింగరావు కూర్చుంటారు. దూరంగా సీతమ్మ కూర్చుంటుంది. లక్ష్మీదేవి అక్కడే నిలబడుతుంది పిల్లలు నిద్రపోతూఉంటారు.)

న—నిన్ననంతా వప్పించి పంపితే పోలీసువాళ్లకి రిపోర్టు చేసేడని చెప్పడానికా వచ్చేవు?

రా—నన్నేమిచేయమన్నావు? న్యాయంతః సావుకారు ఉత్తరం, అందులో చెక్కు, పొరపాటున నీకందినపుడు వెంటనే తెచ్చి నువ్వు సాయబుకి ఇచ్చివేయవలసింది అలాగు చేయలేదు సరికదా, ఇప్పటివరకూ వాడియెదుటపడకపోతే వాడేమనుకుంటాడు? అందుచేత నేనెంతచెప్పినా వినక కంప్లయింటు చేసేడు. ఆతప్పు నీదే.

ల—డబ్బు ఇచ్చేస్తామన్నా ఊరుకోలేదా?

రా—ఇప్పుడు మించిపోయిందేమీ లేదమ్మా. ఈపట్ల వాడి సొమ్ము వాడికి పారేస్తే, కంప్లయింటుమీద అమలుజరగకుండా ఆపుచేయిస్తాను.

ల—అయితే ఇచ్చివేయండీ.

న—ఇచ్చేయి, ను వ్విచ్చేస్తా నన్నావుకాదూ!

ల—చెక్కుమార్చిన డబ్బున్నాదిః ఇవాళ ఇచ్చేస్తానన్నారు!

న—నిన్ననంటే ఇవాళ ఇంకా కూర్చుందేమిటి?

ల—ఏమయిపోయింది?

న—డబ్బు ఏమయిపోతుంది? ఖర్చయిపోయింది.

ల—ఏమిటాఖర్చు—రెండువందలూఖర్చే!

న—ఏదోఖర్చు!

రామ—అయితే డబ్బుఇవ్వనట్లే కాదూ? నేను పోతాను పాటికి పోలీసువాళ్లు వస్తూనే ఉంటారేమో!

ల—అదేమిఖర్చయిందో చెబితేగాని నేనివ్వను.

రా—సరే! నేను పోతాను.

న—ఉండవయ్యా ఒక్కనిముషం. అయితే ఇవ్వవూ! నువ్వు పోస్టులోనుండి డబ్బుతెప్పించడం నాకు తెలుసునులే! నన్ను ఖైదులోపెట్టించి నేను బాధపడుతూంటే చూడాలనుంది కాదూ!

సీ—నీమొగుణ్ణి రక్షించుకోడానికి పనికిరాకపోతే ఇంకెందుకే నీడబ్బు?

ల—ఇదొక్కటేకాదు! ఇలాంటివింకా ఎన్నున్నాయో? దీనితో ఉద్యోగానికి ఉద్వాసన అయినట్టేకద!

(వీధితలుపు తొందరగా తట్టబడును.)

రా—కొంపతీసి వచ్చేసేరు కాబోలు పోలీసువాళ్లు! (నరసింగరావు తొందరగా తలుపుదగ్గరకు వెళ్లి తలుపులు దమాయిస్తూ, ఒక్కగడియ ఉండుటచేత రెండోగడియకూడా వేయడానికి ప్రయత్నిస్తూంటాడు. తలుపు అవతలమనిషి తొందరగా తలుపుతట్టుతూ తోస్తుంటాడు. లక్ష్మీదేవి తలుపుదగ్గరకు వెళ్లుతుంది.)

న—ముందు అతనికి సొమ్మిచ్చేయి! వెళ్లువేగం!

(లక్ష్మి—రూపాయలు తేడానికి వెళుతుంది. తలుపుఅవతల మనిషి సత్తువగా తలుపుతోస్తుంటాడు. నరసింగరావు ఆపుతుంటాడు. కొంతసేపటికి తలుపులు విడగా సన్యాసిరాజు ముందుకు పడతాడు.)

సన్యాసి—ఇంట్లోకి రాకుండా తలుపులు దమాయిస్తావా?

న—అర్ధరాత్రప్పుడు బలవంతంగా నాయింట్లో నిన్నెవడు చొరబడమన్నాడు?

(లక్ష్మి—నోట్లకట్టతో ప్రవేశిస్తుంది.)

స—నా యేభయిరూపాయలూ ఇచ్చేయి. ఆహా! తమాషాలుగా ఉన్నదీ!

నర—ప్రొద్దుటరా ఇస్తాను.

స—ప్రొద్దునకాదు, ఇప్పుడిచ్చితీరాలి.

నర—ఇప్పుడు లేదు. ప్రొద్దుట రమ్మని చెప్పడంనీకుకాదూ?

రా—నాసొమ్ము ముందు పారేవమ్మా! తరువాత ఆగొడవ చూచుకోవచ్చును.

ల—ఒకగొడవయితే ఎలాగేనా తంటాలుపడవచ్చును (నోట్లు లెక్కపెడుతూ ఉంటుంది).

సీత—ఇతని నమ్మక మేమిటే? ఇతనికిచ్చేస్తున్నావు? ఆసాయబునే రమ్మను.

రా—మంచిమాటేనండి. నామీద నమ్మకంలేకపోతే ఇవ్వకండి. ఆసాయబూ పోలీసువాళ్లూ వస్తారు. అప్పుడే ఇవ్వవచ్చును.

నర—మధ్యని నీసొదేమిటే! మమ్మలని చంపేస్తున్నావు. నువ్వు నోరుమూసుకొని ఉండలేవేమిటి? పోయి పడుకో.

సీత—నా కెందుకు నాయనా, ఇలాగ నోరు మూసుకుని కుక్కినపేనులాగ చచ్చినట్లు పడివుంటాను. మీరంతా ప్రయోజకులయేక, ఇంక పెద్దవాళ్లు చెప్పడం ఎందుకు? (కోపంతో నిష్క్రమిస్తుంది.)

ల—(నోట్లు లెక్కపెట్టి రామలింగముకు ఇస్తుంది. రామలింగం రశీదు వ్రాసి ఇస్తాడు.)

స—ఊరుకుంటావేమి? నాడబ్బుకూడా తే.

రామ—అయ్యా! తొందరపడకండి. ఇచ్చేస్తారు. ఏదో కాస్త వెనకా ముందూను. ఎందుకు అనవసరంగా నాలుక బుజాన్ని వేసుకొని తిరగడం?

స—నీకేంపోయింది! మెల్లగా నీసొమ్మంతా లాగేసేవు. పెద్ద కబుర్లు చెబతావు. మూడునెలలయింది; పాతికరూపాయలురొక్కం; పాతికరూపాయలు పేకాటలో బాకీ! ఇదుగో అదుగో అనిఎన్నాళ్లు జరుపుకుని వస్తాడు! మనిషికాడు. మీ చెక్కసంగతి విన్నాను. నేనూ నెమ్మదిగానే అడుగుదామనివస్తే తలుపు దమాయించడపు తెగులేమీ?

న—ఏమిటమ్మా! నోటికొచ్చినట్లు ప్రేలుతున్నావు? రేపు రమ్మని చెబితే వినబడలేదూ?

స—రేపువస్తే ఏరంగమో పారిపోయి కనబడకుండా పోడానికా?

న—మాటలు తిన్నగారానీ. జాగ్రత్త.

స—మాటలు తిన్నగానే వస్తాయి. రెండువందలచెక్కు మార్చేసి ఆముండకింద తగలేసి నాకు సున్న పెట్టడానికా?

న—(తొందరగా లేచి సన్యాసిరాజును చెంపకాయకొట్టి) ఎమిట్రా పేలేవు?

(ఇద్దరూ కలియబడి యుద్ధంచేస్తారు. రామలింగం విడిపించడానికి ప్రయత్నిస్తాడు.)

ల—లెండి లెండి! దెబ్బలాట మానేయండి. ఏమండోయి, మీడబ్బు నేనిచ్చేస్తానులెండి. ఎమి టింటికొచ్చిరవ్వ! (ఇద్దరూ ఇంకా కలబడతారు.)

ల—మీడబ్బు నేనిచ్చేస్తానంటే ఇంకా ఎందుకు దెబ్బలాట. ఏమండీ! విడిపించరేమండీ మీరు!

(ఇద్దరూ విడిపోయి, ఒకరినొకరు కోపంగాచూస్తూ దూరంగా నిలబడతారు.)

స—ఇచ్చేయండీ డబ్బు! ఇచ్చేయడం డిప్పుడు.

ల—ఇచ్చేస్తాను గాని— ఎదో ముండ అన్నారు. దాని భోగట్టా చెప్పండి.

స—ఊరందరికీ తెలిసినదే! ముండనుంచుకొన్నాడు కాడు! నాపెళ్లాం నాకు లొంగదు. నాకు డబ్బివ్వదు. దానిమీద మన సెక్కువ. ఆముండను తీసుకొని రంగము వెళ్లిపోతానన్నాడు నాతో

(నరసింగరావు పడకకుర్చీలో కూలబడి చేతుల్లో తలపెట్టుకొని కూర్చుంటాడు.)

ల—మీసొమ్ము నేను ఇచ్చేస్తాను. రేపు మధ్యాహ్నంరండి.

స—ఇంకా రేపూ ఎల్లుండీనా ?

ల—నామాట మీరు నమ్మండి. ఇప్పుడు దగ్గరలేదు. రేపు తప్పకుండా ఇచ్చేస్తాను.

రా—ఆవిడమాట నమ్మకమేనండి. రేపు తప్పక ఇచ్చేస్తారు.

స—మీ మొగం చూసి ఊరకున్నాను. లేకపోతే దవడపళ్లు రాలగొట్టేదును—రేపు ఇవ్వకపోతే మర్యాదదక్కదు. చెపుతున్నాను. ఇదే ఆఖరుమాట. (రామలింగం సన్యాసిరాజు నిష్క్రమిస్తారు.) (లక్ష్మీదేవి వీథితలుపు గడియలు వేసివస్తుంది.)

(నరసింగరావు పడకకుర్చీలో కూర్చుని చేతుల్లో తలపెట్టుకొని ఆలోచిస్తూ ఉంటాడు. ఎదురుగా లక్ష్మీదేవి)

ల—వ్యవహారం బాగానే ముదిరింది. ఇంత పురాణం పెరిగిందని నాకు తెలియలేదు. డబ్బుపెట్టి పేకాట, ఊళ్లో బాకీలు, జూదం, ముండ, ఉండవలసిన సౌభాగ్యాలన్నీ ఉన్నాయి.

న—(జబాబు చెప్పకుండా ఆలోచిస్తూఉంటాడు.)

లక్ష్మి—అతడు చెప్పిన ముండసంగతి నిజమేనా?

న—ఆఁ! నిజమే! అయితే ఏమంటావు?

లక్ష్మి—అనడాని కేముంది! సంతోషిస్తాను.

న—నిజంగా నువ్వు సంతోషించవలసినదే! నీకంటె పదింతలు నయమది. దానికాలిగోరుకి పనికిరావు నువ్వు. దానికున్న భక్తి, ఆసరసత, ఆఅందంలో పదోవంతు నీకుందీ? నువ్వెక్కడ! నువ్వు మగాడికి మొగుడివి, నువ్వు నామీదే సవాలకతావు! నువ్వు మొగుడివి ; నేను పెళ్లాన్ని. ఆబాధ భరించలేకే దానితో పోతున్నాను.

లక్ష్మి—బాగానేఉంది. నాకంటె మంచిది-దొరికేక మానుకుంటా రేమిటికి?

న—ఆహా! సర్వవిధాలా నీకంటె నయమే అది!

ల—నేను కాదన్నానా ఎమిటి? నేనూ ఆమాటే అంటున్నాను.

న—మరి దానిమీ దెందుకు నీ కేడుపు?

ల—అయ్యో బాగుంది! నాకెందుకు ఏడుపు! మీరు ఏలాగైనా నాబాధ తప్పితే నాకు సంతోషమే!

న—బాధ ఎప్పటికీ లేకుండా తప్పించుకోవాలనే ఆలోచిస్తున్నాను.

ల—రేపే కాబోలు ప్రయాణం!

న—రేపు కాదిప్పుడే!

ల—ఇప్పు డెక్కడికి!

న—వల్లకాట్లోకి!

ల—అదేమిటి ఆమాటలు!

న—ఏమీలేదు. తిన్నగా వెళ్లి అయ్యకోనేట్లో పడిపోవడమే! తెల్లారేసరికి శవం తేలితే చూసి సంతోషిద్దువుగాని!

ల—ఒకమాట కొకమాట మంచిమాటే వస్తూంది నోటంట!

నర—ఇం కేమాటా రాకుండా శాశ్వతంగానే మూసుకుపోతుందిలే నోరు. నీకు అధికారం చలాయించడానికి ఇంక నేనుండనని విచారిస్తున్నా వేమిటి ? (కుర్చీమీదనుంచి లేస్తాడు.)

ల—బాగుంది ! ఎక్కడికి లేస్తున్నారు కూర్చోండి.

నర—ఇంట్లో నువ్వు కూర్చో, ముసుగు వేసుకొని !

ల—ఏమిటీ మాటలు ?

నర—ఇప్పుడెల్లా అర్థమవుతాయి? రేపు ప్రొద్దున్నకి అర్థం బాగా తెలుస్తుంది.

ల—మతిపోతూంది కాబోలు ?

నర—ఇంకా ఉంటుందీ మతి ! కట్టుకొన్న పెళ్లాం మరా మేకయి సాధించి చంపుతూంటే.

(వెళ్లబోతాడు. లక్ష్మి అడ్డుపడి)

లక్ష్మి—బాగుంది, ఎవరేనా నవ్వగలరు. ఇదా ప్రతాపం!

నర—ఆఖరుప్రతాపం ఇదే! నాకు అడ్డులేస్తావా లేవవా ?

ల—మీ అమ్మమొగం చూడరూ ? పిల్లలమొగం చూడరూ? చిన్నతల్లి మీకోసం ఎంత ఏడుస్తుంది ?

నర—ఏవరేడ్చినా నీకు లక్ష్యంలేదుకద ! లే నన్నడ్డకు !

ల—(అడ్డుపడి) నిజంగానే ?

నర—ఆహా ! నిశ్చయంగా !

ల—అమ్మయ్యో ! నిజమే ?

నర—ముమ్మాటికీ ! అతురాలా ! ఇదిగో గాయత్రి ! (లక్ష్మీదేవి క్రిందకూలబడి కదలనీకుండా నరసింగరావు కాళ్లుపట్టుకొని)

చిన్నతల్లీ! నాన్న వెళ్లిపోతున్నారే! అత్తా! నీకొడుకు వెళ్లిపోతున్నారు ! అమ్మయ్యో ! వెళ్లిపోవడమే ! నన్ను చంపేయరూ ! ఇంక నేనెలాగ బ్రతకను ? ఇంక నేనెలాగ భరించను ! (నరసింగరావు మొగంవేపు దీనంగాచూసి) నిజమే ? (నరసింగరావు

నిశ్చయార్థకమైన మాపుచూసి కాళ్లు విడలించుకొని వెళ్లడానికి ప్రయత్నిస్తాడు.)

ల—నా పుస్తెలు తెంపేస్తారా? నాబొట్టు చెరిపేస్తారా? నా పసుపుకుంకమో? నా కాపురమో? నా సంసారమో? నా ఐశ్వర్యమో? అమ్మో నేనెలాగ భరించేదీ? (మళ్లీ భర్తముగంపై పుచూచి) మానరూ? మానరూ? పోస్టులో ఉన్న డబ్బంతా ఇచ్చేస్తాను. మానరూ? ఇంక మిమ్మలని ఏమీ అనను! మీతోడు! మీయిష్టము వచ్చిన ట్లుండండి. మానరూ?

నర—చావడానికి సిద్ధపడ్డాక నీ డబ్బెవడికి కావాలి? నువ్వెవడికి కావాలి? లే! (ముందుకు నడవబోతాడు.)

ల—(నేలమీద సాగిలబడి భర్తకాళ్లు కదలకుండా తనరెండు చేతులతో బంధించి) నన్ను నరకేయండీ! నన్ను చంపేయండీ! నా ప్రాణాలుతీసేయండీ! నాపీక పిసికేయండి! నా గొంతు నులిమేసి నన్ను ముందు అయ్యాకోనేట్లో పడేసి, మీరు దానితో సుఖంగా ఉండండి. నేనుండగా మీరు చచ్చిపోతారా? నే భరించగలనా?

నర—(కాళ్లు విదలించుకొని నడవడానికి ప్రయత్నిస్తాడు.)

ల—అమ్మో! వెళ్లిపోడానికే? నన్ను ముందు చంపేయరూ? నేనే చచ్చిపోయేదా? (తలకాయ నేలకు ఫెడేఫెడేమని కొట్టుకుంటుంది.)

నర—అదేమిటి తల పగలగొట్టుకొని చస్తావేమిటి?

ల—మీరు చంపకపోతే నేనే చచ్చిపోగలను. నాకక్కర లేదమ్మ ఈ బ్రతుకు. (చీరకొంగు తీసి పీకకు ఉరిపెట్టుకొని గుడ్లు భయంకరంగా కనబడేలాగు చూస్తుంది.)

నర—(బలవంతంగా చీరకొంగు విడిపించబోయి శక్యంకాకపోగా) వెళ్లను. లే. లే.

ల—మీరు వెళ్లిపోతారు. నిశ్చయంగా వెళ్లిపోతానన్నారు. (మళ్లా అతనికాళ్లు పట్టుకుంటుంది.)

నర—వెళ్లను. లేవవే! వెళ్లనులే.

ల—వెళ్లిపోతారు. ఆముండతో వెళ్లిపోతారు నాకు తెలుసును.

నర—వెళ్లనంటే నమ్మవేమిటి? ఆముండదగ్గరకు వెళ్లే వెళ్లను. దానిమొగం చూడను లే!

లక్ష్మి—(క్రిందబడి దొర్లుతూ) ఇలాగే దొంగమాటలు చెప్పి వెళ్లిపోతారు. ఎల్లకాలము ఈ బ్రతుకేనా నాకు. ఎల్లకాలం దొంగ బ్రతుకే!

న—వెళ్లనంటే నమ్మవెంచేత? వెళితే తల్లితో పోయినట్లు. సరా. ఆముండదగ్గరకు వెళ్లను. పేకాడను. ఇంకేతప్పూ చేయను.

ల—(అతనిమొగం కేసిచూస్తూ) నిజంగా మానేస్తారా. ఆముండని వదిలేస్తారా? పేకాట మానేస్తారా? సుఖాన్నున్న ప్రాణం ఎందుకు దుఃఖాన్న పెట్టుకుంటారు? (మెల్లిగా లేచికూర్చుని) మిమ్మలను నేను బాధపెట్టేనా? మీరు తెచ్చేడబ్బు చాలకపోతే నేను ఖర్చుపెట్టి సంసారం గుట్టుగా జరపడం తప్పా. ఆరూపాయలు మీకిచ్చేసి మీరొక్కనాడే ఖర్చుపెట్టేస్తే మరునాటిసంగతి ఆలోచించుకోవద్దూ. మీమీద సవాలవుతున్నానన్నారు. నేను మనిషినికాను, అన్నం తినలేదు. నాకు పతిభక్తి లేదు. లేకపోతే ఈతాపత్రయమంతా నాకెందుకు?

న—బుద్ధొచ్చిందని చెంపలు వాయించుకొంటూంటే ఇంకా ఎందుకుఉపన్యాసం?

లక్ష్మి—(లేచి, భర్తభుజాలమీద చేతులువేసి, అతనిమొగంకేసి చూస్తూ) నిజంగా మానేసినట్టేనా? నామొగంకేసి చూడండి. (నరసింగరావు ఆమెమొగంకేసి ఏకదృష్టితో చూస్తుండగా చిన్నచిరునవ్వు గోచరిస్తుంది.)

ల—ఇంక ఈవూళ్లో ఉండవద్దు. మావూరు పోదాము. మానాన్నతోపాటు మీరూ వ్యవసాయపు పని చూదురుకాని.

న—ఇంక నువ్వు గీచినగీటు దాటితే ఒట్టు.

ల—(ఉత్సాహంతో నరసింగరావును ముద్దుపెట్టుకుంటుంది. ఇద్దరూ కౌగలించుకుంటారు.)

(తెరపడును.)





# నాటకాల్లో రంగానికి ముందు వ్రాతలు

'వసంతమూర్తి'

ఆధునికరచయితలు చాలామంది ఏకాంకనాటకాలూ, చిన్ననాటకాలూ వ్రాస్తున్నారు. పూర్వపునాటకాలకీ వీటికీ చాలావిషయాల్లో తేడా ఉన్నది. సామగ్రి, ఆదర్శము, వ్రాత - అన్నీ భేదమే. పూర్వనాటకకర్తలు రంగములకు ముందు, "రంగము: యమునాతీరము, ప్రవేశము శ్రీకృష్ణుడు బలరామసాత్యకి ప్రముఖులతో" అనిమాత్రము సూచించేవారు. ఆధునికులు పాశ్చాత్య నాటకకారుల మార్గముల ననుసరించిగాబోలు రెండు మూడుపేజీలు ముందువ్రాతలతో నింపివేస్తున్నారు. మచ్చుకోసము పదిపంక్తులు: "ధర్మారావు సుమారు యిరవైఅయిదేళ్లవాడు. దేహచ్ఛాయ కొంచెం నలుపు. సామాన్యమైన పొడుగు. అయినా లావుమీద కొంచెం పొట్టిగా కనిపిస్తాడు. ముఖం ప్రబంధకవులు వర్ణించినట్లు గుండ్రంగానే ఉంటుంది. ఆముఖానికి కళ్లు కొంచెం చిన్నవిగాను, నోరు కొంచెం పెద్దదిగానూ కనబడుతూ ఉంటాయి. అతని మనోభావాల నెన్నడూ వెలిబుచ్చడు. అయినా వాటిని కప్పిపుచ్చడానికి ప్రయత్నించినట్టు కూడా కనబడడు. అందంగా కనబడాలని లోన యెంత ప్రయత్నిస్తున్నా పైకిమాత్రం ఆతలంపే లేనట్టు యెంతో ఉపేక్షాభావం నటిస్తాడు..." ఎందుకీవ్రాతలు? నటుడి కోసమా? చదువరికోసమా? కళకోసమేనా?

నాటకరచన వేరేకళ. నాటకప్రదర్శనము వేరే కళ. నాటకకారుడు ప్రదర్శకుడు కాగలడనే నియమము లేదు. (నిజానికిపోతే నాటకకారులు సామాన్యము గొప్ప నటకులు కాలేదుకూడాను). కవి నాటకరచన చేశేస్తాడు. సూత్రధారుడు నాటకంచదివి నాటకకారుడుసృష్టించిన పాత్రలను ఆవాతావరణముతోపాటు ఊహించుతాడు తరవాత తనఊహ కనుకూలంగా "నువ్వు ఫలానివేషం లో ఫలానిమూలనుంచి రంగముమీదికి రావాలి. ఈ చోట 'ఆప్యాయంగా'పలకాలి. ఫలానిచోట "అనార్కలీ" అన్నప్పుడు ఆమెదగ్గరకు వచ్చిచూసి, వెనకకు తిరిగి వెళ్లిపోయి, నిట్టూర్చి, మళ్లీ దగ్గరగావచ్చి, ఉపక్రమించాలి ఈమాట లనడానికి" అంటూ నిర్ణయిస్తాడు నటుడికి. నాటకములో సంభాషణవాక్యాలుతప్ప తక్కిన తయారీ అంతా సూత్రధారుడిదే.

నాటకకారుడు సూత్రధారుడు కాకూడదా? అనే ప్రశ్న పుట్టవచ్చును. అవశ్యము కావచ్చును. అది అత్యంతలోభనీయముకూడాను. సృష్టించే పాత్రల మానసవీథుల్లో విహారముచేసిన కళాకారుడే తత్పాత్రముల బాహ్యావేషము, వైఖరులు ఊహించేవాడయితే వింతసామరస్యము కుదురుతుంది వాతావరణానికీ, మన మనస్తత్త్వాలకీ. కొన్నినాటకాలలో సూత్రధారుడు లేక,

గయోపాఖ్యానములో కృష్ణుడు అంగరఖా డబ్బాడవాళ్లతో యమునాస్నానానికి వెళ్లడము, రాజనరేంద్రుడు కవచముతో చిత్రాంగిఅంతఃపురము ప్రవేశించడములాంటివి జరుగుతూంటాయి. కాబట్టి కవే సూత్రధరుడైపోతే "ఉదయం. సలీంరాకుమారుని గది. సోఫామీదను గోడవైపుముఖమై పడుకున్న సలీం నిట్టూర్చి, నెమ్మదిగా ఇటుతిరిగి, కన్నీరైన కలలకన్నులతో చిన్నబల్లవైపు చూసి, ఉలికిపడి లేచి, బల్లదగ్గరకుఉరికి ఖంగారుగా"అంటూ ముందుమాటలు చెప్పవచ్చు. ఈమాటలాధారంగాచేసుకుని నటసమాజాలు నాటకమాడవచ్చును. తిరుపతికవుల "తెల్లనిచీరతో భాగీరథి ప్రవేశించుచున్నది...నల్లనిచీరతో యమున ప్రవేశించి"అనే వాక్యాలిలాంటివే. ఈలాంటివాక్యాలు ఎన్నో అసందర్భాలను మాపుచేస్తాయి.

సంగీతానికి గ్రామొఫోను, చిత్రకళకి ఆచ్ఛాఫీసులాగ నాటకప్రదర్శనకళకి నిత్యత్వ మలవరిచేది యింతవరకూ లేదు. బరతముని నాటక మెలాగాడించేవాడు? ఏమో? కొన్నాళ్లుపోతే రాఘవాచార్యులుగారు హిరణ్యకశిపు, భీమారావు ఎలానటించేవారో అగమ్యమనవచ్చును. అందువల్ల నాటకప్రదర్శకుడికి ముందుమాటలు కీర్తిసంపాదకరములేకాక, ముందునటులకు మార్గదర్శకములుకూడాను. కవి స్వయముగా వ్రాసేస్తే అప్పుడతడు కవి, ప్రదర్శకుడూకూడా అవుతాడు. ఇది కళాకారులకి లోభనీయమైన సుందరసమ్మేళనము. వాఙ్మయానికి కోరదగిన మధురపలము.

అట్లని కవి నాటకప్రదర్శనముతోసంబంధములేని వెర్రివర్ణనలు వ్రాస్తే అసహ్యమువేస్తుంది. "తెరచాటుకుపోయి ఘోరయుద్ధము చేయుదురు" తెరచాటుకు పంపినా వారిని వదిలిపెట్టదలచ డీకవిసార్వభౌముడు. ఇంక మొదటలోయిచ్చిన ఉదాహరణం చిత్తగించారా! "ముఖం ప్రబంధకవులువర్ణించినట్లు, గుండ్రంగా ఉంటుంది"ట."మనోభావాల్ని వెలిబుచ్చడ"ట. ఇదెలాగు నాటకప్రదర్శనంలో ప్రవర్తనమాతుంది? కాకపోతే ఇవన్నీ వ్రాసి కాగితము డాగుచెయ్యడమెందుకు? నటుల దుస్తులు, సామగ్రి, పరివారముగురించి ఒకపుటకాదు? పదిపుటలు వ్రాసుకొమ్మనండి. ప్రదర్శనానికి పనికివచ్చేదేమేనాసరే బరకమనండి. మానసతత్త్వమువైపుమాత్రము చూడవద్దని చెప్పండి.

నాటకకారుడు పాత్రముల మనస్తత్త్వాలు సంభాషణలలోను, సన్నివేశాలలోనూ చూపించాలికాని "అందంగా కనబడాలని లోన యొత్రప్రయత్నిస్తున్నా పైకి మాత్రం ఆతలంపే లేనట్టు యెంతో ఉపేక్షాభావం నటిస్తాడు" అంటూ చేతగానట్టు బయటపెట్టకూడదు. రాగరూపాన్ని సంగీతము వెలువరించలేని గాయకుడు సులభమార్గమైన స్వరకల్పనను ఆశ్రయించినట్లే, పాత్రలసంభాషణాలలో వారి గుణములను బింబితముచేయలేని కుకవి ఈముందుమాటలలో వెళ్లబోసుకుంటాడు.

తక్కిన వాఙ్మయశాఖలలో కవి చెప్పి పాఠకుల చేత "ఊఁ"అనిపించాలి. నాటకంలోమాత్రము చదువరిచేతనే గ్రహింపచేస్తాడు కవి. తక్కిన కవిత్వము, కథ, నవలలలోకంటె నాటకములో చదువరి ఊహించేదెక్కువ. పాత్రముల చరిత్రములను వారనేమాటలను, పనులనుబట్టీ పాఠకుడు, లేదా ప్రేక్షకుడు గ్రహించాలి. "కాంతాసమ్మితోపదేశము" అనే భారతీయ కావ్యాదర్శమునకు నాటకము గొప్పసాధన మీగుణము కలిగియుండడమువల్ల. ఎప్పుడు కవి పొడిమాటలతో పాత్రల మనస్తత్త్వాలను వర్ణించేస్తాడో అప్పుడు కావ్యము శ్రవ్యమైపోతుంది.

బెర్నార్డుషా, గాల్స్వర్దీ మొదలైన ఆంగ్లకవులు రంగోపోద్ఘాతాలు వ్రాశారు. కాని అవన్నీ రంగమును తయారుచెయ్యడానికే. తమనాటకాలు చేతగాని నటుల చేతిలో పడి నలిగిపోకుండా తామే సూత్రధారులైపోయి వారు ముందుమాటలు వ్రాశారు. మనవారు వారిపద్ధతి మాత్రము గ్రహించి భావకవిత్వము వ్రాస్తున్నారు ప్రతిరంగానికీ, విష్కంభానికీ కూడాను. అలాకాక్కాదు,

వారూ వ్రాస్తున్నారంటారా, వారితప్ప మీరెందుకు దిగుమతిచెయ్యడం?

"కవి కళాకారుడు. ఏ వింతవాతావరణములో ప్రవేశపెట్టితే తాను వ్రాసిన రంగము చదివేవారి మనస్సు కెక్కుతుందో ఊహించుకుని ఆవాతావరణం సృష్టి చేయడానికి తనకి అనుకూలముగా తోచినవాటిని వర్ణించేస్తాడు. దానికి తగువేమిటి" అని అడగవచ్చును పాఠకులు. కవి సర్వస్వతంత్రుడే. అట్లని రంగములో ప్రశంసకురాని విషయాలను, నటులకు పనికిరాని విషయాలను ఎక్కించేస్తే అసహ్యముకాదా అని అడుగుతాము. సంభాషణ నాటకానికి శరీరము. నాటకరంగాలలోనే వర్ణనలుంటే ఏవగించుకుంటున్నాముగదా, రంగానికిముందు పాత్రములనుగురించి "తనమనోభావాలను కప్పిపుచ్చడానికి యెంతమాత్రమూ ప్రయత్నించడు" అంటూ గుణవర్ణనమారంభిస్తే నాటకముఅంతా ఈ పక్కనే వ్రాయరాదూ? అసలురంగము రెండుపుటలు, ఈ శషభిషలు పదిపుటలూను. ఇది చదివేసరికి పూర్వరంగముతాలూకు భావాలన్నీ ఎగిరిపోవడము. అంతా వాతావరణమే. జీవాలుమాత్రము ఈ విశుభ్ర వాతావరణములో పురుగుల్లాగ పాకుతూంటారు. ఇంక చదివే పాఠకులకు రసముకాదుగాని నీరస మావేశిస్తుంది. చదివేవాళ్లగతి యిది. ఇంక ప్రేక్షకులకు రంగము ముందు కవివర్ణించే భూమికామానసవీథులు గోచరము కావుగదా! మరి యీవర్ణనలవల్ల ప్రయోజన మెవరికి? కవి స్వాతంత్ర్యానికి కాబోలు.

నాటకరచన ప్రజలకోసమైతే ఈ రంగోపోద్ఘాతాల్లో రంగవస్తువుగూర్చితప్ప పాత్రముల మనస్తత్వాలు వెల్లడించకూడదు కవి. ఈవస్తువునుగురించైనా "సారంగధరుడు తోటలో మల్లెపొదరిల్లుక్రింద కూర్చొని పాదాలకడ ప్రవహించేపిల్లకాలవలో పాదము లాడిస్తూంటాడు." అంటూ భారతము వ్రాసినా లాభముండదు. అంతా వాతావరణముమీదికేగాని కళావరణముమీది కుండదు రచయితదృష్టి. ప్రదర్శకునికోసము వ్రాశామంటారా? వ్రాయండి. చదునరులు అది వొదిలి కేవలము నాటకభాగము చదువుకుంటారు. మరో ప్రదర్శకుడు తనకు ప్రత్యేకవ్యక్తిత్వము, ఊహ, భావన లేకుంటే మీరు వ్రాసినట్లు తయారుచేస్తాడు, భవిష్యద్విజ్ఞానప్రపంచానికి తమభావనాబలము అవగాహనౌతుంది. అలాకాకుండా "నీహేతువాదాని కందని మహాసన్నివేశము నేనూహించాను. నా యిష్టమువచ్చినట్లు వ్రాస్తా" నంటారా? భేష్. కానీండి. "కాలోహ్యయం నిరవధిర్విపులాచ పృథ్వీ."






ఒత్తుగ మంచుబొట్లు పడుచుండెను, చుక్కలు నక్కిచూచె, నే
నత్తఱి వింటి నొండొక దయార్ద్రసుధామధురస్వరంబు "నో
యుత్తమజీవి! క్రోలు" మనుచుండుట; నాపయిఁ బొంచికాంచితిన్
మెత్తని మెట్టమేఁకను, సమీపమునం దొకచిన్ని కన్నెకన్.

గోవులమందకాని, మఱిగొఱ్ఱెలుకాని యుపాంతమందు లే,
వావెలిమేఁక కట్టఁబడె నల్పపుఁ ద్రాటను ఱాతి కొంటిమై,
నోవిరిబోఁడి సంజతఱి నోపిక మేఁకకు మేఁతవెట్టు, మో
దావహమైన శాద్వలపదమ్మున నమ్మలకోనకొమ్మనన్.

తనరన్ నాతుకచేతినుండి తన మేఁతన్ దించుఁ బెన్విందు మే
సినమాడ్కిన్ దలయూఁపి తోఁకఁగదలించెన్ మేఁక, యాకన్యకా
మణియున్ "గ్రోలుము క్రోలుమింక" నను ప్రేమన్జిల్కు నున్బల్కులా
డిన పైనాలతకూనమానసము నాడెందాన సంధించితిన్.

చిన్నిపాయఁపుఁగన్నియఁ బిన్నమేఁక - ననుఁగుజంటగఁ జూచి నేనలరుచుండ,
వెలితిగిన్నను గొని కన్నె వెడలిపోయి - పదిగజంబులమేరఁదాఁ బదములాపె.

కనుఁగొనె మేఁకవంకసరిగా నలబాలిక; యంత నామెమో
మునఁ దగుచిన్నెలన్నిఁటినిఁ బొంచివసించుచుఁ గంచెచాటుక

# మెట్టూరు ఆనకట్ట



౧. కావేరినదిపై కట్టబడిన పెద్ద ఆనకట్ట. ఇది ప్రపంచములోకెల్ల పెద్దది.





౨. గొట్టములనుండి అతివేగమున నీరుచిమ్ముట.

౩. కట్టడము నిర్మాణావస్థలో (౧౯౩౩)

౪. నదిలో నీరధికమైనపుడు, సాగుబడికై హైలెవెలుతూములనుండి నీటిని వదలుట

# భారత శాసనసభ సభ్యవర్గము

(మార్చి ౧౯౩౫)

మొదటివరుస: భాయిపరమానందు, యస్. కె. హాస్మాని, సేత్ షిదో దాసుదాగా, బి. బి. వర్మ, పండిట్ లక్ష్మీకాంతమైత్ర, బాబూ ఎ. యన్. ఛట్టోపాధ్యాయ, యం. యల్. సక్సేనా, కె. యస్. ఫజిల్ - ఇ - హాక్ పిరాచా, సి హెచ్. రఘువీరనారాయణసింగు, దీపనారాయణసింగు, పండిట్ నీలకంఠదాసు, ఎ. యన్. సిన్హా, యన్. సి. బార్డలాయి, యస్. యన్. సిన్హా, డా. టి. యస్. యస్. రాజన్, శ్రీప్రకాశ, యన్. వి. గడ్గీల్.

రెండవవరుస (కుర్చీలలో): రాజా సర్ వాసుదేవరాజా, పండిట్ గోవిందవల్లభపంత్, సర్. హెన్రీగిడ్నీ, సర్. లెస్లీ హడ్సన్, సర్. హెన్రీక్రెయిక్, యం. యస్. ఆణే, సర్ ఫ్రాంక్ నాయిస్, ఎ. సి. దత్తు (ఉపాధ్యక్షులు), సర్ నృపేంద్రసర్కార్, గౌ. సర్ అబ్దుర్ రహీం (అధ్యక్షులు), బూలాభాయి జీవన్జీ దేశాయి, సర్ జోసెఫ్ భోరు, సర్ కావస్జీజహంగీరు, సర్ జేమ్సుగ్రిగ్సు, యస్. సత్యమూర్తి, సర్దారు శాంతసింగు, డా. జియాఉద్దీన్ అహమ్మదు, యన్. యమ్. జోషీ, డా. భగవాన్‌దాసు.

మూడవవరుస: సేత్ హాజీ అబ్దుల్లాహరూన్, డి. కె. లాహిరీ చౌదరి, సర్ మహమ్మదు మెహర్ షా, సర్ గులామ్ హుసేన్ హిదయతుల్లా, హెచ్. యం. అబ్దుల్లా, డా. తీన్‌మాంగ్, ఉమర్ అలీషా, కె. యల్. గౌబా, కె. యస్. సిద్దిక్ అలీఖాన్, మియాన్ గియాసుద్దీన్, కె. బి. మాలిక్ అల్లాభక్షుఖాన్‌తివానా, సర్ మహమ్మదుఖాన్, సర్ జవాహర్ సింగు, పి. పి. సిన్హా, జె. యం. ఛటర్జీ, సేత్ గోవిందదాసు, సర్ యస్. సి. ముఖర్జీ, ఆర్. బి. సేత్ భాగ్‌చందుసోనీ. డా. యన్. బి. ఖారే, మాథుర్దాసు విస్సన్‌జీ, ఎ. ఇ. హరూన్‌జాఫర్, యన్. ఆర్. ముఖర్జీ, డా. జి. వి. దేశముఖ్, డా. పి. యన్. బెనర్జీ.

నాలుగవవరుస: వసంతకుమారదాసు, ఎ. కె. ఫజ్లుల్ హుక్, నబీభక్ష్ ఇల్లాహీ భక్ష్ భుట్టో, యు. బా. శి. మౌలనాషౌకత్ అలీ సయ్యదు గులాం భిక్ నైరంగ్, రా. బ. ఎ. ఎ. వి. అయ్యరు, మహమ్మదు అజర్ అలీ, కాజీమహమ్మద్, అహమ్మద్ కాజ్మీ, హాజీసర్దారునూర్ అహమ్మదుఖాన్, డబ్ల్యు. యల్. స్కాట్టు, హెచ్. కె. కృపాలినీ, పి. యస్. కుమారస్వామిరాజు, కె. యం. జెధే, ఆర్. బి. సి హెచ్. లాల్‌చందు, జె. ఏ. మిల్లెగన్, డా. యఫ్. యక్స్. డి సౌజా, డా. ఆర్. డి. దలాల్, ప్రొ. యన్. జి. రంగా, వి. వి. గిరి. ఎ. హెచ్ సతార్, హెచ్. ఇస్సక్ సేట్.

అయిదవవరుస: టి. యస్. ఎ. చెట్టియార్, కె. నాగేశ్వర రావుపంతులు, యం. ఏ. బాకి, లాల్‌చంద్ నవలారాయి, మౌల్వీ బాదీ ఉజ్ జమాన్, డబ్ల్యు. జె. సి. రిచర్డ్సు, సర్దారు మంగల్‌సింగు, కె. బి. మియాన్ అబ్దుల్ అజీజ్, బి. డబ్ల్యు. స్విథిన్‌బాంకు, జి. మార్గన్, యం. ఏ. అయ్యంగార్, సర్ డార్సీ లిండ్సే, యఫ్. డబ్ల్యు హాకెన్‌హుల్, డబ్ల్యు. బి. హాస్నాక్, యస్. కె. సోం, సి. గోవిందన్ నాయర్, డి. హెచ్. సి. డ్రేక్. మహమ్మద్ అన్వార్ ఉల్ అజీం, సర్ లాన్సి లాట్ గ్రాహం.

ఆరవవరుస: సామ్యుల్ ఆరన్, యల్. ఓవన్, యఫ్. ఇ. జేమ్స్, బి. దాస్. టి. స్లోన్, హెచ్. పి. మోడీ, జె. ఆర్. స్కాట్టు, మహమ్మదుశామాన్, యల్. సి. బస్. అబ్దుల్ మతీన్ చౌదరి, రామనారాయణసింగు, జి. వి. బెవూరు, పి. ఆర్. రావు, ఎ. జె. రైస్‌మాన్, కె యస్. రావు, శ్రీకృష్ణదత్తపాలీవాల్, డా. ఖాన్ సాహెబ్, మౌల్వీమహమ్మదు షాఫీ దౌద.

---



భారతశాసనసభ సభ్యవర్గము, (మార్చి, 1935)



సాంఘికపరిష్కారప్రతికూలమహాసభ, బొంబాయి



నేషనల్ లిబరల్ ఫెడరేషను 16-వ వార్షికసమావేశము, పూనా

ల్గిన యటనుండికాంచితి, భళీ! కవితారచనానుకూల శ
క్తి నెలఁతనందునేని యది తేఁకువ మేఁకకు నిట్లు వాకొనున్.

*       *       *       *       *

ఎది పసికూన! యేఁచు నిను? నెందుల కిట్టులు కట్టుత్రాడు లా
గెద? విటఁ గూడుగూర్కుల కొగిఁ దగదే సుఖవృత్తి నీ కయో,
మృదులత లేఁదనం బొనర నింపగు పచ్చిక కచ్చునంత ప
చ్చఁ దనముగల్గు నియ్యదిగొ శాద్వలసీమ! విషాద మేలొకో?

నీమది నేఁచు నేది? మఱి నీదగువాంఛిత మేది? యంగముల్
దామ బలంబునొందెడు, యథార్థము సుందరజీవి వీవు, మో
దామలచిత్తవృత్తి కగు నన్నియు నున్నవి చూడరాదటే?
కోమల పూసనీమ లవిగో! తులలేనివి పూరిపూ లివే!
గోముగ శ్రావ్యనాదమును గొల్పెడు నివ్వరిచేలచా లిదే!

ఇనుఁ డొగి నెండఁగాయ ఘనశృంఖలమై తగు రోమపూత్రమ
ల్లన నిగుడించి చేరనగు లావగు నీయగరాజునీడ, నిం
కను వెరపేల వానకును గాకకు నాపెనుగాలిరాకకున్
వనటను మానుమా యిఁక శివమ్ములభీతి లవమ్ము లేదిటన్.

ఎలమలమేఁక! నేదగొన నేలొకొ? నిన్దొలి నాదు తండ్రి కో
నల నడఁ గాంచినాఁ డలదినం, బిపు డేమఱి తీవు, కొండలన్
గల వపు డెన్నొ మంద లయినన్ నినుఁ గాన దొకండు సుంతయున్
దొలఁగెను నీదుతల్లియు నినుం దిగనాడుచు జ్ఞప్తిఁ దెచ్చుకో!

చేతులఁనిన్ను గొం చతఁడు చెచ్చెర నిచ్చటఁ జేర్చె జాలిచేఁ
బూతదినంబు నీ కదియెపో; యిఁక నెక్కడి కేగఁజూచెదే?
భూతదయాత్మనైన ననుఁ బొందితి వీ విట దాదిగాఁగ నీ
తొన్మెతలమందు నిన్గనినమాతయు నాసరిరాదు నమ్ముమా!

ఎరుఁగవె నీవు రోజునకు నే నిరుసారులు నీకు నీరు సం
బరమునఁ దెచ్చుచుంట యిటఁ బొఱెడు నాపగనుండి? మంచు ము
మ్మరమగువేళ నీకు దుగమార్లు దినంబున కే నొసంగనే
గరికను గుమ్మపాలు? సరిగా నిను దువ్వనె? ముద్దులాడనే?

నీయంగంబులు నేఁటికన్న మఱి రెండింతల్ బలంబొందనే
బూయింతు న్నిను నాదుబండికి హాయంబు న్పొత్తే, నాపిమ్మటన్

నాయాళీమణిఁ జేతు సీతుఁ గొనకుండన్ గప్పెదన్ గంబళుల్
నాయిల్లే యగు నీకు నిల్లు నగఁ దూలంబోలునే బేలవై.

నిద్దురఁబోవు హాయి నిట నిద్దురబో వయొసాధుజీవి! యీ
యుద్దిని నీదు తల్లితలఁ పూరక నిన్నెపు డేఁచునేమొ? లే
కద్దిర! నాన్యగోచరపరార్థపరిభ్రమ నొందుచుందువో ?
ముద్దులమేఁక! నీహృదయమూలరహస్యము లాడ వేలొకో ?

ఆరయ నీదుతల్లి మురియన్ దొలి నీవు జనించినట్టి యా
దూరపుకొండ లందముగఁ దోఁచిన నందు ఘనీభవించు త
ద్ఘోరతరాంధకారమును గూరిచి, ఝూంకృతి సేయు వాయువుం
గూరిచి వింటె నేను——మలకోనల ఖేలన మూర్తులౌచు నొ
య్యారముఁ జూపువాగులు ఘనాగ్రహవేళల నెట్టివాటి కు
ద్దారుణసింహశాబకవిధంబున నార్చుచుఁ బేర్చు, నట్టిదోఁ
జేరిన నీ కొకింతయును నేమ మెసఁగునె సాధుజీవమా ?

నింగినిదోఁచురాప్పుఁగు నిన్నని హింసఁగొనునర్పతే దిటన్,
జెంగటనుందు నేనెపుడు, నేమ మహార్నిశ లొందుచుందు, వీ
రంగునఁ బిల్చుచేల ననుఁ? త్రాటిని మాటికి లాగుచేల? ని
ద్రం గొనుమమ్మ! నిన్ననఁగఁ గ్రమ్మరవచ్చెదఁ బొద్దుదూరఁగన్.

* * * * *

మందపు టడుగుల నింటికి - సందెను నేఁ బోయి పెక్కుసార్లీగితిన్
డెందమునఁ దలఁచి యంటివె - లందిది నగబాలు నితరలబ్ధము నాదా.

అల లతకూనమానసము నాదిని సంగ్రహణంబు జేసి నే
నలరుచు నామెవాకొనిన దాడుటచేత, యలేఖ్యమైన యా
లలన మనఃప్రదర్శనకళా మయసంజ్ఞల నెల్ల నేనిటన్
బలుకఁగలేమిఁ జెందు నగపాలున కెక్కుడు గీత మామెకున్.

# ౮. కథలు

## ౧

'అమ్మా! అమ్మా! నాకెప్పుడూ జ్వరంగానే ఉంటే బాగుంటుందే' అన్నాడు మధు, తల్లివంక చూచి దీనంగా.

'అదేమిటి పిచ్చినాన్నా అట్లా అంటావు! జ్వరం యేమి బాగుంటుంది బాబూ!'

'జ్వరం బాగుండదు గాని జ్వరం వస్తేనేగాని నీవు నా దగ్గిర చాలసేపు ఉండవుగా'

'అయ్యో! నాపిచ్చితండ్రీ! నేను దగ్గిర ఉండేందుకు పాడు జ్వరం యెప్పుడూ ఉండాలని కోరుకుంటున్నావా? నేను దగ్గిర ఉండి నీకేమి చేయగలను. నాపని అయితే నీకు జ్వరం లేకపోతే మాత్రం నీవద్ద ఉండక యెక్కడికి పోతాను? నీకు యీవారం రోజులనుంచీ జ్వరంగా ఉండుటచేత నేనెంత దిగులుపడుతున్నానో చూడూ. నీవు జ్వరం లేకుండా ఉండి చక్కగా బడికి పోయి చదువుకుంటూ కులాసాగా ఆడుకుంటూఉంటే నాకెంత హాయిగా ఉంటుంది. నీకోసమే గాదూ. నే నింత శ్రమపడుట. నీవు ఆరోగ్యంగా ఉండకపోతే నే నెందుకీభూమిమీద బ్రతికి.'



కనుపర్తి వరలక్ష్మమ్మ

"'అమ్మా! అమ్మా! నాకెప్పుడూ జ్వరంగానే ఉంటే బాగుంటుందే' అన్నాడు......"

'ఏమమ్మా ఇక అక్కడనే సరా. ఎప్పుడూ కొడుకును అంటిపెట్టుకొని కూర్చోడానికి అబ్బాయి జబ్బు నెపం దొరికినట్లుంది. ఇదేమి మాయజ్వరమో యెన్నాళ్లకూ నయంగాకుండా ఉన్నది. ఆపిల్లవాడి కెంత మొండితనమో, రోగానికీ అంతే మొండితనం ఉన్నట్లున్నది.'

'అదిగో నాయనా! మీ అత్తయ్యకేకలు వింటున్నావా? బోలెడు చాకిరి ఉన్నది.

'పో! అమ్మా! పో! తొందరగా పో' అని గడగడలాడి భయంతో పక్కకు ఒత్తిగిలి పడుకున్నాడు మధు.

వదినెగారిమాటలు వినంగానే కమలమ్మ పిల్లవాడి మంచం క్రిందనున్న వేడినీళ్ల గిన్నెలూ, పాలగిన్నె తీసుకొని కన్నీళ్లు తుడుచుకుంటూ దొడ్లోకి పోతూఉన్నది. ఎదురుగా వస్తూఉన్న రాజేశ్వరమ్మ కమలమ్మ కన్నులు తుడుచుకోడం చూచి "మాసొమ్మే యేమి పాపపుసొమ్మో తినేతిండ్లు తింటూనే ఉంటారు— అయ్యే ఖర్చులు అవుతూనే ఉంటాయి. వచ్చేరోగాలు వస్తూనే ఉంటాయి. మందులకూ మాకులకూ పోసేడబ్బు పోస్తూనే ఉంటాము. మళ్లీ యేమో బాధపడుతున్నట్లు కన్నీళ్లు కారుస్తూ ఉంటారు" అన్నది.

కమలమ్మ యేమీ జవాబుచెప్పకుండా ప్రక్కకు తప్పుకొని నెమ్మదిగా వెళ్లి పోయింది.

తిన్నగా రాజేశ్వరమ్మ మధుసూదను పడుకొన్న గదిలోకి వెళ్లి 'యేమయ్యా యెన్నాళ్లకూ మంచం వదలకుండా ఉన్నావు. ఎవరినన్నా చూస్తే నంగనాచిలాగా మాట్లాడవు. అమ్మను చూస్తే యెక్కడలేని ముచ్చట్లూ మొదలుపెడ్తావే' అన్నది. రాజేశ్వరమ్మ గది దాటిపోయిందాకా మాట్లాడకుండా బల్లిలాగా మంచం కరిచిపట్టుకొని పడుకొని ఆమెవెళ్లంగానే ఒక ఆపద తప్పి బయటపడ్డట్టు తెప్పిరిల్లాడు మధు. ఎప్పుడూ చుఱచుఱచూపులేచూస్తూ విరసపుమాటలే మాట్లాడటంచేత మేనమామభార్యనుచూస్తే మధుసూదనునకు అమిత భయం.

## ౨

శ్రీనివాసరావుపంతులు డిప్యూటీకలెక్టరు చేస్తూ నెలకు ఆరువందలరూపాయలు సంపాదిస్తూ ఉన్నాడు. కాని రాజేశ్వరమ్మవద్ద మాట్లాడే సత్తాలేదు ఆయనకు. అడ్డెడు తవ్వెడు యిచ్చి అమ్మ నీప్రసాద మన్నట్టుగా, ఆరునూర్లూ సంపాదించి అమ్మగారిదోసిట్లో పోసి నీచిత్తమన్నట్టుగా ఉంటాడు. శ్రీనివాసరావుపంతులు చాలా మంచివాడు. చాలా తెలివైనవాడు. ఉద్యోగంలో ఆయన చూపే చాకచక్యం చూస్తే ఆయనభార్యా విషయంలో యింత అసమర్థుడుగా ఉంటాడేమా అని ఆశ్చర్యం పొందుతారు. కాని, ఆయన తెలివితక్కువచేత మాత్రం యిట్లా ప్రవర్తించడం లేదని కొంచెం ఆలోచిస్తే తెలుస్తుంది. సంసారం సుఖంగా వెళ్లాలంటే మొగుడికి పెళ్లామైనా లొంగిఉండాలె, పెళ్లానికి మొగుడైనా లొంగి ఉండాలె. ఇద్దరూ లొంగనివాళ్లైతే సుఖంగా ఉండే సంసారం రట్టయి ఊరివారి ఉబుసుపోకకు హేతువవుతుంది. కాబట్టి రాజేశ్వరివిషయంలో మొదటిది అసంభవం కనుక రెండవది ఖాయమైంది.

శ్రీనివాసరావుపంతులుకు కమల ఒక్కతే తోబుట్టువు. అన్నదమ్ములుగూడా లేరు. కనుక చెల్లెలుమీద ఆయనకు చాలా ప్రేమ. అన్నగారంటే ఆమెకూ చాలా ప్రేమా, గౌరవంగూడా ఉన్నది. చాలాసొమ్ము ఖర్చుపెట్టి యింజనీయరుపరీక్షకు చదివి ఉద్యోగమైన రెండేండ్లకే హఠాత్తుగా చనిపోయినాడు కమలమ్మ పెనిమిటి. చదువుకు చేసిన అప్పులైనా తీరకుండా, ఆలూమగల అనురాగపు ముచ్చటలైనా తీరకుండా, ముక్కుపచ్చలారని మూడేండ్లకూన మధువు ముద్దుమురిపాలైనా తీరకుండా, చిన్నకాపురం చితికి పోయింది. ఆమే, ఆమె చిన్నకొడుకూ సుఖంగా జీవించడానికి తగిన ఆధారమైనా లేదువాళ్లకు. ఆవల సంపాదించి అన్నీ అమర్చుకుందామనిఉన్నవన్నీ అమ్మి చదువుకున్నాడతను. మరిఅమర్చుకోడానికి అవకాశం లేకుండా దాటిపోయినాడు. ఏమనుకుంటే యేమున్నది? శ్రీనివాసరావుకు చెల్లెలుస్థితి దుర్భరవ్యథను గలిగించినది. కమలమ్మ కప్పటికి పందొమ్మి



దేండ్లు. ఎక్కడనైనా ఒంటరిగా ఉంచేస్థితి గాదు. కనుక యింట్లో పరిస్థితులు దుర్భరమని తెలిసికూడా తెచ్చి యింట్లో పెట్టుకున్నాడు చెల్లెలిని. తనధాటీ కాగలేక రోజూ వంటవాళ్లు లేచిపోయి తానే వంటచేసుకోలేక పడుతున్న అవస్థ అంతా తొలిగిపోతుందిగదా అని రాజేశ్వరమ్మగూడా ఒకవిధంగా కమలమ్మను తీసుకురావడానికి సమాధానపడ్డది.

ప్రపంచంలో సమస్తసుఖాలకు తానే వారసు ననుకుంటుంది రాజేశ్వరమ్మ. ప్రపంచం సుఖదుఃఖద్వంద్వమని ఆమెకు తెలియదు. పూర్వజన్మలో పుణ్యం చేసుకోడంచేత తా నింత భాగ్యశాలినిగా పుట్టాననీ, కమలమ్మవంటివాళ్లు పాపంచేసుకోడంచేత పాపఫలం అనుభవిస్తున్నారనీ ఆమెఊహ. అందువల్లనే అటువంటి దుఃఖితులమీద తాను దయజూపవలసిన అగత్యం లేదని ఆమె తలంపు. కనుకనే ఆమె గర్వంతో 'చేసుకున్నవారికి చేసుకున్నంత మహాదేవా' అంటూ ఉంటుంది, కమలమ్మ క్రుళ్లిక్రుళ్లి యేడ్చేట్టుగా. అష్టమదాలలో అగ్రగణ్యమైందిగదా ధనమదం.

## 3

తెల్లవారుజామున నాల్గుగంటలైంది. కమలమ్మ లేచి పనిపాటలు చేసుకుందామని అనుకుంటూఉంటగా 'మధు' గూడా మేల్కొని 'అమ్మ కథ చెప్పవే' అన్నాడు.

'ఇప్పుడు కథేమిటివాన్నా! లేచి పాఠాలు చదువుకో' అన్నది, తల్లి.

'పాఠాలన్నీ రాత్రే చదువుకున్నాను. ఇక చదువుకోవలసినవి లేవు. ఒక మంచికథ చెప్పు.'

'నీకు కథలుచెప్తూ కూర్చుంటే తెల్లవారదూ, పోయి పనులు చేసుకోవద్దా బాబూ.'

'చేసుకోవచ్చులే. ఇవ్వాళేమి భయమమ్మా! అత్తయ్య ఊళ్లో లేదుగా".'

'ఊళ్లో లేకపోతేమాత్రము. నన్ను కూర్చోమని వెళ్లిందా నాన్నా! అప్పడాలుట, వడియాలుట, కందిపప్పుట, పెసరపప్పుట' అన్నంలో పొడిట, ఎన్నో పురమాయించి పోయింది. ఈ వారంరోజుల్లో అవన్నీ కావద్దూ?"

'ఓయమ్మో! ఇన్ని చేయాలెనా? అమ్మా! నీ కీ పని చేసే కష్టం యెప్పుడు పోతుందీ?'

'బాబూ! నీవు పెరిగి పెద్దవాడవై చక్కగా చదువుకొని మామయ్యలాగా పెద్ద ఉద్యోగంచేసి డబ్బుసంపాదించితివా వాళ్లమ్మ కష్టంతొలగించిన గరుత్మంతుడిలాగా నన్నుగూడా యీకష్టంలో నుంచి విముక్తిపొందిస్తావు.'

'గరుత్మంతు డెవరమ్మా?'

'పక్షులకు రాజు. వినతకొడుకు.'

"వాళ్లమ్మ యేమికష్టపడుతుంటే విడిపించాడు పక్షిరాజు.?"

"నావలెనే ఒకరియింట్లో యెప్పుడూ చాకిరీచేసి అవస్థపడుతుంటే విడిపించాడు."

"వాళ్లమ్మ యెవరియింట్లో పనిచేసేది?"

"తన సవతి అయిన కద్రువయింట్లో దాసీత్వం చేసేది."

"ఎందుకు చేసేది?"

"కద్రువా, వినతా ఒకమాటు ఒకసముద్రపుఒడ్డున ఒక గుఱ్ఱాన్ని చూచారు. ఆగుఱ్ఱం అంతా తెల్లగా ఉన్నదని వినతా, లేదు, తోక నల్లగా ఉన్నదని కద్రువా, ఇద్దఱూ వాదించు



కున్నారు. వాదించుకొని వాదించుకొని ఆఖరుకు యెవరిమాట నిజమైతే వాళ్లకు రెండోవాళ్లు దాసీగాఉండాలనిపందెంవేసుకొని మరునాడు ఆగుఱ్ఱానికి దగ్గిరగాబోయి చూద్దామని నిర్ణయం చేసుకొని యింటికి పోయినారు, మఱునాడు పోయిచూస్తే ఏమి మాయ చేసిందో కద్రువ ఆగుఱ్ఱంతోక నల్లగానే ఉన్నది. పాపం అందువల్ల వినత పందెంలో ఓడిపోయి కద్రువకు దాసీదై పోయింది."

"అమ్మా! నీవు యేమిపందెంలో ఓడి అత్తయ్యదగ్గిర పని చేస్తున్నావే."

"అవును. నేనూ ఒక ఆటను విధితో ఆడి నాజోడాకాయను విధి బలవంతంగా చంపి ఓడించడంచేత నే దాసీనైపోయినాను. ఈజీవితంమాత్రం ఒక ఆటగాదూ. నాన్నా ఇక నేను వెళ్లుతా. నన్ను మాటలలో పెట్టకు, పనిఉన్నది."

"అమ్మ ఇంకా ఒక్కమాట. ఇది చెప్తే నిన్నిక అడగను."

"అబ్బా! ఏమి ప్రశ్నలతో విసిగిస్తావురా! కదలంటే యింత చెవికోసుకుంటావేమిరా."

"వాళ్లమ్మ కద్రువయింట్లో పనిచేస్తుంటే గరుత్మంతుడు ఆమెను ఎట్లా విడిపించాడు?"

"గరుత్మంతుడు చాలా మంచివాడు. చాలా తెలివైనవాడు. చాలా బలంగలవాడు. తల్లిఅంటే చాలా ప్రేమగలవాడు. దైవడంటే చాలా భక్తిగలవాడు. వాళ్లమ్మ కద్రువకు దాసీదై వాళ్లింట్లో పనిచేస్తుండటంచేత ఈగరుత్మంతుణ్ణి గూడా పనిచేయమనే వాళ్లు. కద్రువ పిల్లలంతా పాములు. ఆపాములను యెత్తుకోమనే వాళ్లు గరుత్మంతుణ్ణి."

"అవును అత్తయ్య పాపను యెత్తుకోమని నన్ను కోప్పడటం లేదా?"

"గరుత్మంతుడికి ఈ ఊడిగం కష్టమనిపించింది. ఎట్లాగైనా యీకష్టం తనకూ, తనఅమ్మకూ లేకుండా తొలిగించుకోవాలనుకున్నాడు. 'మీకు యేమియిస్తే నన్నూ, మాఅమ్మనూ యీ పనిలోనుంచి విడుదల జేస్తా'రని పాములను అడిగాడు ఒకనాడు. అవిఅన్నీ ఆలోచించుకొని చెప్పినవిగదా, 'దేవలోకంలో దేవేంద్ర పట్నంలో అమృతంఅనే చావులేని దివ్యౌషధం ఉన్నది. అది మాకు తెచ్చియిస్తివా అంటే మీకు దాస్యవిముక్తి చేస్తాము' అని. సరే నన్నాడు గరుత్మంతుడు. వాళ్లఅమ్మవద్దకువెళ్లి సంగతంతా చెప్పాడు. తరువాత వాళ్లనాన్నతో చెప్పాడు. ఇద్దరికీ నమస్కారంచేశాడు. వాళ్లు యిద్దరూ అమృతంతోగూడా నీవు సుఖంగా రావాలెనని దీవించి పంపించారు. పక్షిరాజు రివ్వున దేవతాలోకం పోయినాడు. అమృతంచుట్టూ కాపలిఉన్న దేవతలందరితో పోట్లాడి జయించి అమృతకలశం దెచ్చి పాములకిచ్చాడు. "దాస్యవిముక్తి అయిపోయింది. ఇక మాఅమ్మను నేను తీసుకపోతా"నని తల్లిని వీపుమీద యెక్కించుకొని చలోమని వెళ్లిపోయినాడు. విన్నావా యిది గరుత్మంతుడికథ."

"అమ్మ, బలేమంచికథ చెప్పావు. ఇంత మంచికథ నీ కెవరు చెప్పారే?"

"ఎవరుచెప్పాలె. భారతంలో లేదా చదువుకుంటే?"

"అమ్మ, భారతం చాలా పెద్దపుస్తకం గాదూ, నీవు చదువగలవా?"

"అవును నీ కేమితెల్సు. నీకు బుద్ధి తెలిసినప్పటినుంచీ యిట్లా ఊడిగపుదానిలాగానే ఉంటిని. ఆరోజులన్నీ మీ నాన్నగారితోనే పోయినాయి. అదొక కల", కమలమ్మకు కన్నులు చెమ్మగిల్లినవి.

"అమ్మ! నాకుగూడా నాన్నగారున్నారా? మన రాము బావావాళ్లు మామయ్యను 'నాన్నా, నాన్నా' అని పిలుస్తుంటే నాకుగూడా నాన్నా అని పిలవా లనిపిస్తుంది. మా నాన్నగారుంటే నేనుగూడా పిలిచేవాడినిగా.........లేరుగా మానాన్న అన్నాడు మధు ఎంతో దైన్యంగా "

మధుమాటలవలన కమలమ్మకు వెనుకటి వృత్తాంత మంతా ఒక్కమాటు సప్పున జ్ఞాపకం వచ్చింది. అప్పటి వైభవం యిప్పటి హీనస్థితీ ప్రాణంపొయ్యే సమయంలో భర్త తనచేతిని గట్టిగా పట్టుకొని "కమలా మనజీవితం యెంతో వైభవంగా ఉంటుం దనుకున్నాను. మఱి చదువుకుచేసిన అప్పు సప్పులైనా చూచుకోకుండానే చాటిపోతున్నా. అప్పుల వాళ్లు కటికితనంగా వచ్చి ఉన్నది కాస్తా ఊడ్చుకుపోతే నీవూ నాచిన్నిమధూ ఎవరియింట ఊడిగం చేయాలో" అని అని అన్నమాటలో, అన్నీ స్మృతికి వచ్చి ఆమె మనస్సు దుఃఖసముద్రం అయిపోయింది. ప్రవాహవేగంచేత పొరలి వచ్చే సెలయేళ్లలాగా రెండుకండ్లనుండి జొటజొటా కన్నీళ్లు రావడం మొదలుపెట్టి, ఆశోకవేగం ఆపుకోలేక కమలమ్మ అక్కడినుంచీ చివాలున లేచిపోయింది.

తల్లి పల్కినపలుక్కులూ, ఆమెచెప్పిన కథా ఆమె పొందుతున్న దుఃఖమూ అన్నీ తనలో యేదో అవ్యక్తమైన ఆందోళననూ, కార్యపరత్వమునూ పురికొల్పుతూ ఉండగా యెనిమిదేండ్ల కుఱ్ఱవాడు మధుపక్కమీద అట్లాగే చాలసేపు పడుకొని యేదో యోచిస్తూ ఉండిపోయినాడు.

## ౪

తమకు పుష్టిగాఉంటే మనుష్యులకు సంతోషం తృప్తీలేదు. తమకున్నది యితరులకు లేకుండా ఉండాలె, తామొక్కరే అనుభవిస్తూ ఉండాలె. అదీ అల్పులకు మానవుల ఆసురేచ్ఛ. పసిబిడ్డల దగ్గిరనుంచీ పెద్దవాళ్లవఱకూ యీగుణం సాధారణంగానే ఉంటుంది. ఈఓర్వలేనితనం స్వల్పం అనుకుంటామ్గాని దారుణమైంది. రాజేశ్వ

రమ్మ నెలకు యిరవై రూపాయలిచ్చి బిడ్డలకు ప్రైవేటు చెప్పిస్తున్నది. బడికి రానూపోనూ బండ్లు యేర్పాటుచేసి పిల్లలు భూమిమీద కాలు పెట్టకుండా వైభవం సాగిస్తూ ఉన్నది. పైగా డిప్యూటీకలెక్టరుగారి కొడుకులని ఉపాధ్యాయుల అభిమానపుచూపుగూడా రామకృష్ణుల మీదనే ఉన్నది. ఇన్ని ఉన్నా ప్రతితడవా వారికి ప్రమోషన్ చేసేరన్న పేరేగాని ప్రజ్ఞగా ప్యాసయినారన్నమాట లేదు. తన కున్నదే యితరులకుంటేనే చూడజాలని మనుష్యులకు తనకు లేక యితరులకు మాత్రమే కలిగిందంటే యెంత బాధగా ఉంటుంది. నేడు మధు స్కూలుఫైనలు పరీక్షావార్త రాజేశ్వరమ్మ కట్టి దుఃఖాన్నే కలిగించింది.

రాజేశ్వరమ్మ మధు చదువువిషయమై యెంత ఉదాసీనంగా ఉండాలో అంత ఉదాసీనంగా ఉన్నది. తనకొడుకులకు కూతురుకూ ప్రైవేటుచెప్పిస్తూ ఉన్నప్పుడు మధుమాట స్మరించి యెఱుగదు. తనకొమరులను బండిమీద బడికిపంపిస్తూ ఒక్కమాటు మధును దానిమీదయెక్కి పొమ్మనిచెప్పియెఱుగదు. జోరుగా వానలు కురుస్తూ, తీవ్రంగా యెండలుకాస్తున్నా మధు పాదచారి అయ్యే బడికి వెళ్లేవాడు. తాను సొంతంగానే చదువుకొనేవాడు. వీడికి ఒక్కపాఠమైనా చెప్పే సహాయు లెవరూ లేరు, యేమి పరీక్షవుతాడని అనుకుంటూ ఉండేది రాజేశ్వరమ్మ. కాని మధు మొదటితరగతిలోనే కృతార్థుడౌతూ ఉండేవాడు. ఆవిధంగానే నేడు స్కూలుఫైనలు పరీక్షలోగూడా ఉత్తముడుగా జయమందినట్లు తెలిసింది. రాజేశ్వరమ్మకొడుకులిద్దఱూ తప్పిపోయినారు. తనకొడుకులిద్దఱూ తప్పి యేడుస్తుంటే మధు పైక్లాసులో గూడా చదువనా. కనుకనే రాజేశ్వరమ్మ మధుమీద ఉన్న ఈర్ష్యను అనుగ్రహంగా మలిపి శ్రీనివాసరావుపంతులుతో మధువుకు ఇక చదువు చాలించి యే గుమాస్తానౌకరీలోనైనా ప్రవేశపెట్టండని చెప్పింది. భార్యసలహాకు చకితుడై శ్రీనివాసరావుపంతులు మధుకు ఇప్పుడు ఉద్యోగపుతొందరేమి వచ్చిందన్నాడు.

"పైకి చదువడానికి యెంతో డబ్బు కావాలె. ఎఫ్‌యే చదువు యిక్కడ లేకపోవడంచేత మధు పొరుగూరికి పోవాలె. వాళ్లు తల్లీబిడ్డా ఒకరి నొకరు విడిచిఉండలేరు. ఏదో నౌకరీఅయితే యిద్దఱూ ఒకచోటనే ఉంటారు. వాళ్ల పొట్ట వాళ్లు పోసుకుంటారు. యింకా పైకి చదివిమాత్రం యేమిచేయాలె?"

"మధుసూదనునకు యింకా పదిహేనేండ్లునిండలేదు. వాడిని యీసంవత్సరం పరీక్షకు పంపడానికి ప్రత్యేకం దీనిమీద పంపవలసి వచ్చింది. ఇటువంటిపసివాడిని యేఉద్యోగంలో ప్రవేశపెట్టను."

"పోనీ యీసంవత్సరం వెళ్లినతర్వాతనే చేస్తాడు, చదువు చాలించితే సరి."

"నవనవలాడుతూ పెరుగుతున్న మొక్కతలను త్రుంచివేసినట్లుగా యిప్పుడు చక్కగా చదువుకుంటున్న మధుచదువు ఆపవలసిన తొందరేమివచ్చింది. వాడు యీపసితనంలోనే ఉద్యోగం చేయాలిసిన పనేమి?"

"అయితే పొరుగూరిలో ఉంచితే తిండికి జీతానికీ యెంత పెట్టితే అవుతుందో."

"మనమేమి పెట్టవలసి ఉండదు."

"మనం పెట్టకపోతే యెవరు పెట్టుతారు? మనం కాకపోతే వారికి వేరే దిక్కేమున్నది?"

"అందఱికి దేవుడేదిక్కు."

"దేవుడు దిక్కైతే దేవుడు పోషిస్తున్నాడా, మనం పోషిస్తున్నాము గాని."

"మన మెవరు పోషించడానికి? మనలను పోషిస్తున్న వాడూ దేవుడే!"

"మీ వేదాంతవచనాల కేమి? ఊళ్లోవాళ్ల చదువుసంధ్యల కోసం సొమ్మంతా కర్చుపెట్టి బిడ్డలనోట మట్టి కొట్టుతున్నారు. ఏమైనాసరే మధును చదివించడానికివీలులేదు. ఏబస్తీలో ఉంచినా నెలకు నలభైరూపాయలకు తక్కువకావు. ఇంట్లో ఉండి చదువుకుంటూఉంటే సరిపోయిందికాని ఏపట్నవాసంలో కీవిగా ఉంచి చదివించడానికి నలభైలు యాభైలు పంపి బిడ్డలను అన్యాయం చేయనా? బిడ్డ లిద్దఱూ తప్పితే చీకూ చింతా లేదు. పైగా యెక్కడో మేనల్లుణ్ణి చదువుకు పంపడానికి యీ బులపాటం ఏమిటో తెలియకుండా ఉన్నది. ఇదే అయినవాళ్లకు ఆకుల్లోనూ, కానివాళ్లకు కంచాల్లోను అంటారు."

"వాడు కానివాడా?"

"మీబిడ్డలకంటేనా?"

"నాబిడ్డలసంగతి నీవుచెప్పాలెనా?"

"మీబిడ్డలని మీకున్నదా. రెండేండ్లనుండి పెద్దవాడిపరీక్ష పోతూఉండే. ఈయేడు చిన్నవాడిదీ పోయే. ఆ సంగతి పట్టదాయె. పైగా బిడ్డలను అన్యాయంచేసి మేనల్లుణ్ణి చదివిస్తానని బులుపాయె. ఏమన్నా అంటే నేను వట్టిదాన్ని అవుతానుగాని మీఆలోచన ఎట్లాఉంది చెప్పండి?"

"మనసొమ్ముకర్చు లేకపోయినా మధును చదువుకోనివ్వవా?"

"ఆమాటంటేనే నాకు ఒళ్లు మండుతుంది. మూడేళ్లపిల్లవాడికి అబ్బపోతే నాటినుంచి నేటిదాకా మనసొమ్ము కర్చు అవుతున్నదా?"

"అవును. యిన్నాళ్లనుంచీ మనసొమ్ము కర్చైనమాట నిజమే ఇకనుంచీ మధు చదువుకు మనమేమీ కర్చుచేయనక్కరలేదు."

"చేయకుండా?...ఈగుట్టుమాట లేమిటి, ఉన్నసంగతేమిటో చెప్పరాదా?"

"మధు పరీక్షలో ఫస్టునప్యాసైనందుకు ఎఫ్.యే. చదువుకు జీతంలేకుండా చేసే బహుమానానికి అర్హుడైనాడు. చెన్నపట్నంలో మాపినతల్లికొడుకు పురుషోత్తమరావు హైకోర్టుప్లీడరుగా ఉన్నాడుగదా. వాళ్లయింట్లో ఉంటాడు మధు. మధు స్కూలు ఫైనలు ప్యాసుఅయితే నావద్దకు పంపమని యెన్నాళ్లనుంచో అడుగుతున్నాడు. వాడిభార్యాగూడా మాకు మేనమామ కూతురున్నూ, మాకమలమ్మకు ప్రియస్నేహితురాలున్నూ అవడంచేత మనను ప్రేమగా చూస్తుంది కనుక వాడిని చెన్నపట్నం పంపుతాను. ఇక నీకేమి కర్చున్నది చెప్పూ?"

మధు చదువును భంగపఱచాలనే తీవ్రోద్దేశంతో రాజేశ్వరమ్మ ప్రయోగించినబాణం పరాస్తమై వచ్చి మళ్లీ రాజేశ్వరమ్మ గుండెకే గ్రుచ్చుకొన్నది. పాపం యిక ఆవిడే యేమి చేస్తుంది? తన సొమ్ము వ్యయంచేయడమైతే వల్లగాదని అడ్డుపడగలదు గాని ఇప్పుడు శ్రీనివాసరావుపంతులు చెప్పిన సమాధానమునకు జబా బేమున్నది? ఓడిపోయినట్టుగా ముఖం చిన్నబుచ్చుకొన్నది రాజేశ్వరమ్మ. తాను అనుకున్నట్టుగానే శ్రీనివాసరావుపంతులు మధుకు కావలసినవన్నీ సమకూర్చి జూలై నెల రాగానే చెన్నపురి పంపించాడు.

✂

శ్రీనివాసరావుపంతులు మధ్యాహ్నం భోజనం కాగానే కాసేపు విశ్రమించి అప్పుడే లేచారు. ఇంతలో రాజేశ్వరమ్మ ప్రత్యక్షమై "యెప్పుడూ మీఉద్యోగపుగొడవే మీకైతే ఎట్లా" గని సాధింపు మొదలుపెట్టింది.

"ఏమికావాలె నీకు? బెంగుళూరుచీరెలకు ఆర్డరు యివ్వమంటావా? చబిల్ దాస్‌కం పెనీకి నగలకు వ్రాయమంటావా? ఏమిటో నీ గొడవగూడాచెప్పు, ఆలోచిస్తా"నన్నాడుపంతులు మందహాసంచేస్తూ.

"ఇప్పుడు చీరెలకూ సొమ్ములకేనా నేను కొట్టుకుంటున్నది. ఇంటిగొడవంటే బెంగుళూరుచీరెలూ, చెన్నపట్నపు సొమ్ములూ తెచ్చిపెట్టమని అర్థమా? మీరు యేమాట మాట్లాడినా యిట్లాగే ఉంటుంది. అదేమంటేఅసలే మాట్లాడకుండా మూగనోము పడ్తారు."

"ఊరికే సోది కట్టిపెట్టి సంగతేమిటో చెప్పు."

"అదిగో అట్లా అడిగితే యేదైనా మంచీ చెడూ చెప్పుకోవచ్చు."

"...సరే అట్లాగే చెప్పు. యివ్వాళ ఆదివారం, కచ్చేరీపని లేదు. నీవు చెప్పేవన్నీ వింటాను ఇదేపనిగా సాయంత్రం వఱకూ."

"మీనాక్షికి పన్నాలుగేండ్లు గూడా వెళ్లిపోతున్నాయి. పెండ్లిమాట తలపెట్టకపోతిరి. మీరు స్వయంగా విచారించరాయెను. ఎవరినైనా కనుకోక్కమని వ్రాయరాయెను. ఏమని మీ ఉద్దేశం పిల్లకు సంబంధము విచారించారా?"

"విచారించవలసిన పనేమున్నది?"

"విచారించకుండానే అల్లుడు వస్తాడా యేమి?"

"మీ రెంతగొప్పవాళ్లైనా ఈరోజుల్లో మాటలు కావవి."

"ఎక్కడనుంచి రావాలె, ఇంట్లోనే ఉంటే? ఇంట్లో ఉన్న వధూవరులకు యిబ్బం దేమున్నది? మన కెప్పుడు చేయవలెనని బుద్ధి పుట్టితే అప్పుడే చేయవచ్చు."

"ఇదేమి చిత్రను. అల్లుడు యింట్లోనే ఉన్నాడా? ఎవరు?"

"మన మధు."

"అయ్యోకర్మమా! వంటముండ కొడుకు."

"ఛీ నోరుమూయ్".

"నన్ను నోరుమూయమంటారుగాని ఉండపోతే యిల్లు లేదు పండబోతే మంచంలేదు. ఎక్కడా సెంటుభూమి లేదు. నిరాధారుడికి నాబిడ్డనివ్వమనడానికి మీకునోరెట్లావచ్చింది. ఇట్లాంటి మీకు యింకాయింకా ఆపేక్షఉంటే ఎంతైనా దోచిపెట్టుకోండి గాని ఆపుట్టుదరిద్రుడికి నాబిడ్డనివ్వమనిమాత్రం సలహా చేయకండి." అని రాజేశ్వరమ్మ కళ్లనీళ్లు గోటజిమ్మటం ప్రారంభించింది.

"నీవేమీ దుఃఖపడవద్దు. మీనాక్షిని యియ్యకపోతే మధుకు పెళ్లికాకపోదు. కానినీవుమాత్రం ఆనిక పశ్చాత్తాప పడ్తావు. ఆలోచించుకో."

"అయ్యో! ఇంతచక్కని సంబంధం తప్పిపోతుందనా!"

"నీవెప్పుడూ మూర్ఖురాలవే, ఒక్కగానొక్క ఆడబిడ్డ మనకు. అమ్మాయికొఱకే విచారిస్తున్నా, చక్కనివాడు, తెలివైనవాడు, బుద్ధిమంతుడూ మధు"

'ఏముంటేనేమి చిట్టెడు గింజలొచ్చే పొలం లేకపోయిన తర్వాత. మీచెల్లెలుగనక శక్తిలాగా పనిచేస్తున్నది. నాబిడ్డ సుకుమారి."

శ్రీనివాసరావుపంతులు అమిత సహనంగలవాడు కాని అతని ఓర్పునంతా కబళించే శక్తిగలది రాజేశ్వరమ్మ. రాజేశ్వరమ్మ ఆఖరుకు పలికినమాటలు ఆయనకు చాలా అసహ్యం గొల్పినవి. ఆయన ఏకాంతహృదయంలో అనేకవత్సరములుగా కల్పించుకుంటూ ఉన్న మీనాక్షీమధుసూదనుల కల్యాణగాథలు నిముసంలో విఫలమైపోయినాయి. బలవంతంమీద చేసినా యవి విపరీతపర్యవసానానికి హేతువులౌతాయని రూపించుకొని మీనాక్షికి యితరత్రా విచారించి పెండ్లిచేద్దామని నిశ్చయించుకున్నాడు.

ఎలకుర్రు పాఠశాల ౨౩-వ వార్షికోత్సవము



గుంటూరుజిల్లా దంపుడుబియ్యముసంఘమువారి కావూరికేంద్రము



విశాఖపట్టణము నౌకాశ్రయము



కృష్ణుని వెన్నముద్ద, మహాబలిపురము J. K. C.



దక్షిణఆఫ్రికా ఆదిమవాసులు, వారి గుడిసెలు

## ౬

రాజేశ్వరమ్మ ఏదైనా ఒకవిషయం మనస్సులో పడ్డనంటే అది మనస్సులో యెంతగానున్నదో అంతకు పదిరెట్లుగా నోటితో వాగుతూఉండాలిసిందే గాని మనస్సులో యిముడ్చుకొనే రకం గాదు. ఎప్పుడైతే పెనిమిటి మీనాక్షిని మధుకు యిచ్చి వివాహం చేయడం తన అభిప్రాయమని చెప్పాడో అప్పటినుంచీ ఆమెమనస్సులో తుపాను పుట్టినట్లయి సణుగులు, సాధింపులు, సూటిమాటలు, కేకలు అన్నీ మొదలుపెట్టింది. ఇందువల్ల కమలమ్మకు సులభంగా విషయం తెలిసిపోయింది. తనవదినెగారికి యిష్టంలేని పనియేమీ సాగదనీ, సాగినా సుఖంలేదనీ కమలమ్మకు బాగా తెలుసు. అందువల్ల అన్నగారితో యీవిషయమై ప్రస్తావించవలెనని కమలమ్మ యెదురు చూస్తున్నది.

ఆనాటిసాయంత్రం యెవరియింట్లోనో పెళ్లి అని రాజేశ్వరమ్మ పేరంటానికీ, భోజనానికీ వెళ్లింది మీనాక్షిని తీసుకొని. శ్రీనివాసరావుపంతులుగారు అప్పుడే కచ్చేరీనుంచి యింటికివచ్చి కోటూ, తలగుడ్డా తీసి కాళ్లూ చేతులూ కడుక్కొని 'అమ్మాయీ కొంచెము మంచినీళ్లు తీసుకరా' అని కమలమ్మను పిలిచారు. కమలమ్మ వెంటనే మంచినీళ్లు తీసుకొనివచ్చి అన్నగారికిచ్చి పక్కగా నుంచున్నది.

"మీవదినె యెక్కడికి పోయింది" అన్నాడు పంతులు

"ఎవరో ప్లీడరుగారియింట్లో వాళ్ల అమ్మాయి పెండ్లిట. నిన్న పేరంటానికీ, భోజనానికీ పిలిచివెళ్లినారు. అక్కడికి వెళ్లింది."

"మధువద్దనుంచీ ఉత్తరం వచ్చింది తెలిసిందా?"

"అవును ప్రొద్దున గోపాలుచెప్పాడు. పరీక్షసంవత్సరమని మాఘ డిశంబరుసెలవులకు రానన్నాడుట గాదా."

"అవును, అదే వ్రాశాడు."

"పోనీ వచ్చేమిచేయాల. సెలవులలో అక్కడఉంటే బాగా చదువుకుంటాడు."

"అవు"నని పంతులు షికారువెళ్లడానికి లేవబోతూ ఉంటే 'అన్నయ్యా!' అన్నది కమల ఏదో చెప్పవచ్చినట్టుగా.

"ఏమమ్మా" అన్నాడు. పంతులు ఆదరంగా ప్రేమగా.

"మీనాక్షి వివాహం యెప్పుడు చేస్తావు? పాపం వదినె చాలా విచారపడుతున్నదే. ఆమెవిచారమేమిటి, ఎవరికైనా కష్టమే గాదా? పెండ్లియీడు వచ్చిన బిడ్డను యేఅయ్యచేతిలోనైనా పెట్టకుండా అట్టిపెట్టుకోడం."

"మీవదినె విచారపడుతుంది గాని చెప్పినమాట వినదు. ఇప్పుడు ఆడపిల్లలకు ఉచితమైన సంబంధాలు దొరకడం యెంత కష్టంగా ఉన్నది. మధుకు యిస్తామంటే అంగీకరించరాదా? ఎంతచక్కగానైనా పెండ్లిచేయవచ్చునే."

"మధుపెండ్లి ఏమితొందర యిప్పుడు? త్రాడూ బొంగరం లేనివాడు మధు. వాడికి పిల్లనివ్వడమంటే కష్టంగాదా? ఏదైనా మీ హోదాకు తగిన సంబంధం చూచుకోవాలె. ఒకవేళ మామీద ఉన్న ప్రేమకొద్దీ మాస్థితి నీకు హీనంగా తోపకపోవచ్చు కాని యితరులకట్లా అనిపిస్తుందా? మధు యింకా ఎఫ్ఏ పరీక్షకన్నా వెళ్లలేదు. ఈపరీక్ష ఈవత్సరం ప్యాసైనా వాడి చదువంతా పూర్తియై ఉద్యోగంలోకి వచ్చేటప్పటికి నాలుగుసంవత్సరాలు పట్టుతుంది గదా. ఎప్పుడో ఉన్నతస్థితికి వస్తాడని నిరాధారుడుగా ఉన్నవాడికి పిల్లనివ్వాలంటే యేతల్లికైనా కష్టమేగాదా?"

"ఏమి కష్టం? మీవదినెకు బుద్ధిలేదు. గాని పిల్లనిచ్చి పెండ్లి చేసినతర్వాత వాడిని నిరాధారంగా ఉంచుతానా? నీవుగూడా మీవదినెను బలపరుస్తున్నావే. మీనాక్షిని నీ కొమారుడికి చేసికోడం యిష్టంలేదా?"

"అన్నయ్యా! అట్లా అభిప్రాయపడతావన్న భయంతోనే నే నీప్రస్తావన చేయడంలేదు. మనమీద నాకేవిధమైన అధికారంలేదు. నీవు పెంచినబిడ్డ. నీవు పోషించిన బిడ్డ. నీవు చదువుచెప్పించిన బిడ్డ. నీఅండ నుండబట్టే మధు యీమాత్రం విద్యాబుద్ధులు కలవాడైనాడు. ఉపకృతికి మాకు మేము జన్మజన్మలకూ తీర్చుకోలేము. నీకొమార్తెను మధుకు చేయడమంటే అంతకంటె సంతోషకార్యమేమున్నది నాకు? ఇంకా ఇంకా ఆడపిల్లలైనా లేరు ఆనికై చూదామంటే. ఈసంబంధం విడిపోతే మనయిద్దటికీ శాశ్వతంగా విడుబాటు కలిగినట్లే. కాని వదినెకు అసంతృప్తియైన పని చేయడం కష్టం. అదే నాకు సందేహము. ఆమె మనస్ఫూర్తిగా ఒప్పుకుంటే నీకడ్డేమి ఉన్నదన్నయ్యా! నీసంబంధంకంటే యెక్కువైన సంబంధం ఉన్నదా నాకు? మీనాక్షి అయినా ఒకరంటి బిడ్డగాదు. చాలా మంచిపిల్ల. అది నాకు కోడలుగావటం మహాభాగ్యమే. వీలుగావుంటే నేను కాదనను. నాకూ మనసులో ఆశ లేకపోలేదు. కాని యేమి చేస్తాము?"

శ్రీనివాసరావుపంతులు యిక నేమీ మాట్లాడలేదు. నెమ్మదిగా లేచి క్లబ్బుకు వెళ్లిపోయినాడు. కమలమ్మ గూడా తనపనికి తాను వెళ్లిపోయింది.

## ౭

సుభద్రమ్మ ఒకపిల్లజమీభాగానికి వారసురాలు. చిన్ననాడే పెనిమిటి పోవడంచేత తనవంతుభాగం దాయాదులు కాజేసుకుపోతారని ఒకపిల్లవాడిని దత్తుచేసుకొని జమీలో భాగానికి హక్కు నిలబెట్టుకొన్నది. ఆపిల్లవాడిప్పుడు పద్దెనిమిదేండ్లవాడై మైనరుతీరిం

దనేమాట యెప్పుడువస్తుందా అని యెదురుతెన్నులు చూస్తు చూస్తున్నాడు. ఏకారణంచేతనో సుభద్రమ్మ కుఱ్ఱవాడి కింకాపెండ్లి చేయలేదు. ఈసంబంధంయెవరో రాజేశ్వరమ్మచెవిని వేశారు. రాజేశ్వరమ్మకు పట్టరానిసంతోషం వచ్చింది. ఆసంబంధం యెట్లాగైనా పోనీయరాదనీ, యెన్నివేలు కట్నమడిగినా యివ్వాలసిందేననీ రాజేశ్వరమ్మ పట్టుపట్టింది. శ్రీనివాసరావుపంతులుకూడా సమ్మతించాడు. అయిదువేలు కట్నమిచ్చేటట్టూ పైగా లాంఛనాలు వగైరాలు జరిపేజట్టూ నిశ్చయం చేసుకున్నారు. పెండ్లిపనులు జోరుగా చేశారు. కొమార్తెకు జమీందారీసంబంధం వచ్చిందని రాజేశ్వరమ్మ మురిసిపోతున్నది. లోకమంతా అట్లాగే అనుకున్నారు. పెండ్లి ఆరంభమైంది. దాంతో మాటివిరపులూ, ముక్కువిరపులూ గూడా ఆరంభమైనాయి. రాజ్యాలు పోయినా రాజాంగాలు పోకకాబోలు పెండ్లివారు అన్నిమేళాలతోబాటు బోగంమేళాలుగూడా పెట్టారు. అయిదువేలు రొక్కమిచ్చీ, అదనంగా లాంఛనాలుజరిపీగూడా రాజేశ్వరమ్మా, శ్రీనివాసరావుపంతులూ జమీందారీ శకలుపోయే వియ్యాలవారిని సంతృప్తిపఱచలేకపోయినారు. గుడు గుడు గుంజం అన్నట్టు చిన్నచిన్న సంసారాలు గడుపుకొనేవాళ్లు జమీందార్లతో యేమి సాటిరాగలరని వియ్యపురాలు రెండు విదిలింపులు విదిలించేటప్పటికి రాజేశ్వరమ్మ హడలిపోయి గుప్లనీరుగుడ్లగ్రుక్కుకొని ఇంటికి చేరింది. పెండ్లికొడుకు చూడబోతే వట్టిపోకేలా! ఊరిలో ఉద్యోగస్థులందఱినీ ఆహ్వానించి శ్రీనివాసరావుపంతులుగారు పెండ్లిలో ఒకనాడు పాటకచ్చేరీ జరిపిస్తూఉంటే అక్కడే ఒక సిగరెట్టు ముట్టించాడు పెండ్లికొడుకు. అంతటితో శ్రీనివాసరావుగారిమనస్సు క్రుంగిపోయింది. చూచిన పెద్దమనుష్యులంతా తెల్లపోయినారు. పదివేలరూపాయలు నష్టం. పైగా పనికిమాలిన అల్లుడనిపించింది అందఱికీ.

## ౭

అతివేగంగా ఉఱుకులుపెట్టుకుంటూ ప్రవహించే వర్షాకాలపు నదివలె సాగిపోయింది మధువిద్యాభ్యాసం. ఓడుఅనేది యెఱుగడు సరే సామాన్యంగా కృతార్థుడు కావటం అనేది గూడా మధు విద్యార్థిజీవితంలో అపరిచితమైన మాట. ప్రతియూనివర్సిటీ పరీక్షలోనూ ప్రథముడుగా అయి బహూకృతు లందాడు ... మంచి తెలివీ, తెలివికిదగిన చదువూ, చదువుకుదగిన యోగ్యతా, అన్నీ పువ్వులో వన్నె, వాసనా, మకరందం కూడినట్టు కూడినవి మధులో. ఇన్నీ ఉన్నట్టుగానే చక్కని రూపంగూడా మధుకు అమరి ఉన్నది. ఇట్టివయోరూప విద్యాగుణవిశేషాలచే ఒప్పిఉన్న మధుకు పిల్లనివ్వడానికి యేతల్లిదండ్రులు ముచ్చటపడరు? సంబంధాలు కొల్లగా వస్తున్నాయి. కాని పెండ్లిమీద మనసులేదు మధుకు.

మధు ఎం. ఏ. పరీక్షలో ఉత్తముడుగా కృతార్థుడైనాడనే మాట తెలియగానే తల్లీ, మేనమామా ఆనందసాగరంలో ఓలలాడిపోయినారు. ఇటువంటి కుమారరత్నమును కనడంచేత కమలమ్మ కడుపు రత్నగర్భ అయింది. ధన్యురాలు కమలమ్మ. కొమారునివల్ల యేఫలితం పొందాలని నిరీక్షిస్తూఉన్నదో ఆఫలితం లభింపజేసుకున్నది. సుమారు పద్దెనిమిదివత్సరాలనుంచీ ఆమెను నిబద్ధించి ఉంచిన దాస్యశృంఖలాలు నేటికి సడ్లువదలినాయి. ఆమె పరాధీనతాంధకారమును భేదించుకొని స్వాతంత్ర్యకిరణాలు ఆమెమీద ప్రసరించడం మొదలుపెట్టినాయి. ప్రొఫెసరుపని యిస్తాము రమ్మని ఆంధ్రాయూనివర్సిటీనుంచి మధుసూదనుకు ఆర్డరు వచ్చింది. నింగికి పొంగుతూఉన్న ఆనందంతో మధు తన ఉద్యోగవర్తమానం మేనమామకూ తల్లికీ వినిపించాడు. 'మధూ! నా చిరవాంఛితం సఫలం చేశావు ధన్యుణ్ణైనా'నని మేకమామంటే 'నాకష్టం గట్టెక్కించావురా బాబూ!' అని తల్లి అభినందించింది. ఆనాడే మధు విశాఖపట్నం వెళ్లి సంగతులు తెలిసికొని నాకిక్కడ ౧౨౫ రూపాయల ఉద్యోగమైనదనీ వచ్చేనెలలో అమ్మను తీసుకపోతాననీ మేనమామకు జాబు వ్రాశాడు.

## ౮

మీనాక్షివిషయం రాజేశ్వరమ్మకు హృదయశల్యమైపోయింది. ఈవిషయంలో భర్తను సాధించడానికి లేదు. విధినిమారడానికి లేదు. ఆడబిడ్డను దెప్పటానికి లేదు. ఇది కేవలం స్వయంకృతాపరాధము. అత్తగయ్యాళిది, మొగుడు దుర్మార్గుడు. ఈ యిద్దఱిమధ్య అడకత్తెర లోని పోకవలె మీనాక్షి నలిగిపోతున్నది. మీనాక్షి యీ కష్టాని భరింపలేక యెప్పుడు యేమైపోతుందో అని రాజేశ్వరమ్మకు సులో ఒకభయం పడిపోయింది. ఈదిగులుచేత, ఈభీతిచేత పోయిన రాజేశ్వరమ్మలో మునుపటిరాగతనం చూస్తామన్నా కనకుండా పోయింది.

మధు విశాఖపట్నంనుంచి వచ్చాడు. అతనికి తల్లితోబాటు మేనమామనూ, మేనత్తనూ, వారిబిడ్డలనూ అందఱినీ తన ఉద్యోగపు ఊరికి తీసుకపోదామని సరదా. ముందుగా మేనమామను పిలిచాడు. 'నాకేమిటి మధూ ఎప్పుడుపడితే అప్పుడు వస్తా. నీవు పిలవాలెనా. మీఅత్తయ్యను ప్రయాణంచేయి' అన్నాడు. మేనత్తనుచూస్తే చిన్నప్పటినుంచీ మధుకు వల్లమాలినభయం. ఇప్పుడు పెద్దవాడు కావడం చేత మునుపటిలాగా చీదరించి చీవాట్లు పెట్టుతుందనే భయం లేకపోయినా ఏ నూటిపోటీమాటలతోనో మనస్సు నొవ్వచేస్తుం దని జొటు లేకపోలేదు. అయినా సాహసించి మేనత్తవద్దకు పోయి 'అత్తయ్యా! నీవూ మామయ్యా బావలూ అందఱూ విశాఖపట్నం రావాలె. ఇదంతా మీఆశీర్వచన ఫలితం' అన్నాడు వినయంగా. 'నాఆశీర్వచన మేమున్నది నాయనా! అన్నీ చేసేవాడు భగవంతుడు. ఆభగవంతుడే నీబుద్ధికుశలతకు మెచ్చి నిన్ను విద్యావంతుణ్ణిగా చేశాడు. బాగుపడావు.'

"అవును ఆబాగు మీవల్లనే జరిపించాడు గనుక భగవంతుడు మీరువస్తే నాకు సంతోషంగా ఉంటుంది."

"రావడానికి అభ్యంతర మేమున్నది వస్తాను కాని మీనాక్షి మూలంగా నాసంతోషం అంతా చచ్చిపోయింది. అది అక్కడా, నే నిక్కడా అల్లాడుతున్నాము. ఏనాటికేమో. చేజేతులాచేసి అనుభవిస్తున్నాను. నీచేతిలో బెట్టినట్లయితే నాకీచింత లేకపోవునుగా? కాని మీమామయ్యగారి మాట విన్నాను కాను. విధిబలం ఏమి చేయను? నాబిడ్డవ్రాత యిట్లా ఉంటే" అని రాజేశ్వరమ్మ కన్నీళ్లు జోటజోట విడిచింది. ఆమె కన్నీళ్లు చూచేటప్పటికి మధుసూదనుకు గూడా దుఃఖ మాగలేదు. కన్నీళ్లు ఉత్తరీయపు కొంగుతో రెండు మూడుమారులు గట్టిగా అద్దుకున్నాడు. పులివంటి రాజేశ్వరమ్మను గూడా కడుపుతీపి యేవిధంగా క్రుంగదీసిందో చూస్తే మధుకు ఆశ్చర్యమైపోయింది. ఆమె యింత దీనంగా మాట్లాడటం అతను యెన్నడూ చూడలేదు. ఈవిచారాతిశయంవల్ల రాజేశ్వరమ్మవద్ద విశాఖపట్నంవచ్చేమాట తేలలేదు. మళ్లీ మేనమామను అడిగితే "ఇద్దరమూ డిశంబరు సెలవులలో వస్తాము. ఇప్పుడు చిన్నబావనూ, మీ అమ్మనూ తీసుకపో. మేము రాలేదని అనుకోకు. నే నిప్పుడు వస్తే సెలవుపెట్టి రావాలె. కనుకచెప్పుతున్నాను. డిశంబరు సెలవులలోతప్పకుండావస్తా"నని నచ్చచెప్పాడు మేనమామ. కావాలసిన సామగ్రి తీసుకపొమ్మని రాజేశ్వరమ్మ చెప్పింది. కాని? 'యెందు కత్తయ్యా ఇక్కడినుంచీ కైలుఖర్చులుపెట్టి తీసుకొనిపోవడం అక్కడ అన్నీ దొరుకుతా' యన్నాడు మధు.

కమలమ్మ "వదినే! వెళ్లుతున్నా"నని చెప్పితే "నావల్ల నేరాలుంటే మఱచిపొ"మ్మన్నది రాజేశ్వరమ్మ. ఆమాటతో యిద్దఱి మనస్సులూ ద్రవీభూతమై కన్నులు చెమ్మగిల్ల చేసినాయి. సంతోషంచేత వెళ్లుతున్నా యెడబాటు ఒకవిచారకారణమే అని ఖిన్నులై అనుకున్నారు శ్రీనివాసరావుపంతులుగారు.

## ౧౦

మృదువైనస్థలంలో నాటిన మొక్కవలెనే నిర్మలమైన లేతహృదయంలో నాటిన మాటగూడా బాగా నాటుకుపోతుంది. పన్నెండు సంవత్సరాలైంది. కమలమ్మ మధుసూదనుకు గరుత్మంతుడి కథచెప్పి. కమలమ్మ ఈకథను ఆనాడే మఱచిపోయింది. కాని మధుకుమాత్రం "ఉల్లంబున మఱపు బుట్ట దొకనాడైనన్" అన్నట్టు మనస్సులో నిలిచిపోయి వయస్సుతో బాటు విద్యతోబాటు, బుద్ధితోబాటు వృద్ధిపొందుతూ వచ్చింది. తోడిపిల్లలంతా బడి విశ్రాంతిగానేగానీ, స్కూలు లేనప్పుడుగానీ స్వేచ్ఛగా ఆడుకుంటూ "మధుసూదనరావు రావోయి ఆడుకుందా"మనే వాళ్లు, మధు పోవడానికి మొగ్గేవాడు కాదు. వాళ్లకేమి 'వాళ్లు యిష్టమువచ్చినట్టు ఆడుకుంటారు. నావలె అమ్మను పనిలోనుంచి విడిపించవలసిన పనేమున్నది వాళ్లకు?' అనుకొని మధు నేను రా ననేవాడు. సినిమాలనీ సర్కసులనీ ఏవో వినోదసందర్శనాలకు విద్యార్థులు తండోపతండములుగా వెళ్లుతూఉంటే మాతృదాస్యవిమోచనకు దీక్షపూని ఉన్న మధు ఆవినోదప్రస్తావనే లేకుండా ఇంటికివస్తూఉండే వాడు యేదో కార్యభారం నెత్తిమీద ఉన్నవాడివలె. ఎన్నో పెండ్లి సంబంధాలు వస్తూఉండేవి మధుకు. అతనిదగ్గిరకే వచ్చేవాళ్లు కొందఱు. శ్రీనివాసరావుపంతులుగారివద్దనుండి వచ్చేవి కొన్ని, పురుషోత్తమరావుపంతులుద్వారా చేరేవి కొన్ని. అన్నిటికీ మధుసూదను జబాబు ఒకటే, 'ఇప్పుడుగాదు' అని. అంటే 'అమ్మ పరాధీనత బాపినతర్వాత' అని అతనిభావము. ఈవిధంగా మధు తనకర్తవ్య పాలనకొఱకుగా అన్నిటినీ కట్టిపెట్టి యేకదీక్షతో ప్రవర్తించాడు ఇన్నాళ్లనుంచీ.

నేడు మధుసంతోషానికి మేరలేదు. పన్నెండువత్సరముల నుంచీ అతనిమనస్సు తహతహలాడుతూ దేనికొఱకు కృషిచేస్తున్నదో ఆఫలితాన్ని పొందాడు నేడు. తనయింట్లో తనకొమారునకు తన చేతిమీదగా అన్నము వండిపెట్టి కమలమ్మగూడా ధన్యురాలైంది.

రాత్రివేళ వెన్నెల పిండిఆరబోసినట్లున్నది. కమలమ్మ బయట ఆవెన్నెల్లో చల్లగాలికి మంచం వేసుకొని పడుకొన్నది. చల్లనిగాలి యింపుగా వీస్తూ ఉన్నది. సమీపంలో ఉన్న జాజిపందిరి విరబూచిన పుష్పాలతో విదుల్తూ నీలాకాశమునకూ తనకూ భేదంలేదు అని అంటూ పైగా సువాసనలో నేనే యెక్కువని అధిక్షేపిస్తున్నది.

ఆప్రశాంతసమయంలో కమలమ్మ యేదో యోచించుకుంటూ ఆకాశంవంక చూస్తూ ఉన్నది. నెమ్మదిగా మధు పసిబాలుడులాగా వచ్చి తల్లి పక్కలో కూర్చుండి 'అమ్మా ఒకకథ చెప్పవూ' అన్నాడు. కమలమ్మ పకక్కున నవ్వింది, 'చిన్ననాటి పిచ్చియింకా పోలేదా' అంటూ.

"పోలేదు. నేను యెనిమిదేండ్ల పిల్లవాడినిగా ఉన్నప్పుడు అత్తయ్య ఊళ్లోలేనినాడు గరుత్మంతుడికథ చెప్పావు."

"ఆకథ యింకా నీకు జ్ఞాపకం ఉన్నదా?"

"ఆకథేగాదు, ఆనాడు నీవు యింకాచెప్పిన మాటలు గూడా మనస్సులో అచ్చుగుద్దినట్లున్నాయి."

"ఏమిమాట చెప్పాను."

"నీవుగూడా గరుత్మంతుడివై దాస్యవిముక్తిచేయలన్నావు."

"అవును, అన్నానుకాబోలు."

"నే నిప్పుడు గరుత్మంతుణ్నైనానా?"

"అయినావు నాయనా, అయినావు. కాకపోతే నా కీస్వేచ్ఛ ఎక్కడినుంచి వచ్చింది?" అన్నది కమలమ్మ ఆనందోత్ఫుల్ల నేత్రా

లతో ప్రేమపురస్సరంగా మధు నెన్ను నిమురుతూ. మధు ధన్యోస్మి అనుకున్నాడో యేమో తనలో క్షణమాత్ర నిమీలితలోచను డైనాడు.

కమలమ్మ ఇంతలో 'నాన్నా!' అన్నది. 'ఏమమ్మా!' అన్నాడు మధు వినయంతో 'బాబూ, ఈవైభవమంతా నేను చూచి సంతోషింప దగ్గది. మరి నీవూ, నీభార్యా అనుభవింపతగ్గది...... నీ విట్లా బ్రహ్మచారిగా ఉండడం నాకు...........'

'దీనికేమి భాగ్యమమ్మా! మన పురుషోత్తమరావు మామయ్య కూతురు సిద్ధంగా ఉంటే.'

“తథాస్తు” అన్నది మాతృవాణి సంతృప్త హృదయంతో.

---

బుద్ధుడు నేడు జీవించియున్న యెడల




(ఇప్పటి మానసిక జీవనమును విమర్శించుటకే కాని బుద్ధభగవానుని దూషించుటకుకాదు)



# ఒక హరిజనుని కథ

కూచి నరసింహము

పీఠిక

ఇది (వారమునకు రెండుసార్లు ప్రకటింపబడు) ౩౦-౮-౩౧ వ తేదీ ఆదివారపు అమృతబజారుపత్రికలో నున్నది. దాని నాంగ్లమున వ్రాసినవారు ఎస్. ఎమ్. చక్రవర్తి, ఎమ్. ఏ., గారు. కథానాయికా నాయకుల నామములఁ బట్టియు, కథాసందర్భమునుబట్టియు అది వంగదేశపు సత్యవృత్తాంతముగాఁ దోఁచుచున్నది. ఎక్కడిదైననేమి? దయా ప్రేమములే పరమధర్మములు, ప్రతిమతమునకును ప్రాణములు, పరమేశ్వర ప్రీతికరములు అను గొప్పనీతి సనిదర్శనముగాఁ, జక్కఁగా నది బోధించుచున్నది. నాటకము నంకములుగా విభజించునట్లు చక్రవర్తిగారు విషయవిభజనముచేసి యీకథ నాలుభాగములుగా వ్రాసినారు. ఆంగ్లభాషాపరిచయము లేని యాంధ్రసోదరసోదరీమణుల కొఱకు నేను దాని నాంధ్రీకరించి ఆంధ్రపత్రిక సంవత్సరాదిసంచికకుఁ బంపుచున్నాను.

కూ. న.

౧

ఆరోజు సంతరోజు. పల్లెటూళ్లలోనుండు పరమదరిద్రులకు సంతరోజు చాల భయావహమైనరోజు. ఆభయము వారికి వారముపొడుగునను నుండును. ఎందుచేత? ఆరోజున వారమునకు సరిపడు బియ్యము, పప్పుగింజలు, ఉప్పు, నూనె మున్నగు జీవనాధారపదార్థము లన్నియు వారు కొనితెచ్చుకొనవలెను; అప్పులిచ్చిన యయ్యల బాకీలు తీర్చుకొనవలెను; లేదా వారి నెట్లో సమాధానపఱుచుకొనవలెను.

మన కథానాయకుఁడగు రామచరన్నునకు, పాపము, ఆవారమంతయు దురదృష్టపువారమే యైపోయినది. చలపట్టి కట్టుగట్టినట్టు చేపలేవియు నతనివలలోఁ బడక నూరముగానుండిపోయినవి. ఆవారములో రాబడి యొక్క పైసయైనను చేతికి రాలేదు. దినముకూడ తీక్ష్ణముగా నుండెను. ఉదయభాస్కరుఁడే మధ్యందినమార్తాండునివలె మండిపడుచుండెను. రామచరణ్ భార్యయగు "దులని" పెనిమిటికిచ్చుటకు చేఁపలవల పైకిఁ దెచ్చి "ఇటువంటి గడ్డువేఁడిగాయురోజున మీరు చేఁపలు పట్టుటకుఁ బైకిఁబోవుట నా కెంతమాత్రమును ఇష్టముగా లేదు. కాని అయ్యో! చాలినన్ని చేఁపలు నేఁడు వలలోఁ బడినఁగాని నూటికి ఉప్పును, బియ్యమును అయినను గుడిసెలో నుండవు. ఏమి చేయుదము?" అని పలికెను.

రా—అవునే! ఆసంగతి నాకుఁ దెలియును. నారాయణుఁ డేమి చేయఁదలఁచుకొన్నాఁడో చూతము! మనము పస్తుండవలెననియే ఆయన నిశ్చయించుకొనునెడల మన మట్లుండక తీఱదు. మఱేమి చేయఁగలము?

దు—నూటిమాట సరేలెండి, అన్నముకంటెను అత్యావశ్యకమైన సంగతి, అంతకంటెను తొందరపని యింకొకటి యున్నది. సెలవైనయెడలఁ జెప్పెదను.

రా—అది యేది?

దు—నిరుడు తీవ్రమైన జ్వరముచే మీకు ప్రాణముమీఁదికి వచ్చినప్పుడు ఖాయిలా నిమ్మళించి మీరు బ్రతికినయెడల నారాయణస్వామివారి కొక యరఁటిపండ్ల గెల యిచ్చెదనని నేను మ్రొక్కుకొన్న సంగతి మీకు జ్ఞప్తిలో నుండవచ్చును. ఆయన మిమ్ము బ్రతికించి మీకు మరల ఆరోగ్యమిచ్చినారు కాని, మ్రొక్కుమాత్ర మింకను ఆమట్టుననే యున్నది. నిన్నరాత్రి నాకొక కలవచ్చినది. అది నామనస్సును మిక్కిలియుఁ గలవరపెట్టుచున్నది. తళతళలాడు తెల్లని జందెము వేసికొని పొడుగు బ్రాహ్మణుఁ డొకఁడు నాతలాఁపి కడకు వచ్చి నిలఁబడి "నీవిచ్చెదనన్న యరఁటిగెల యింకను ఈయ లేదేమి?" యని నన్ను గద్దించి యడిగి, యిచ్చినమాట త్వరగా నిలుపుకోనిచో నాకుఁ దగిన శాస్తి చేసెదనని బెదరించి వెళ్లిపోయెను. మ్రొక్కుదీర్చుకొనుటకు వారమంతయు నేను తిండిమాని పస్తుండ సిద్ధపడియున్నాను.

రా—నిండుగెల యిచ్చెదనని నీవు వట్టియవివేకపు మ్రొక్కు మ్రొక్కుకొంటివి. అయిదుపండ్లిచ్చెదననవచ్చును. లేదా చివరకుఁ బదిపండ్లిచ్చెద ననవచ్చును. గాని గెలకుగెలయిత్తుననుట తెలివి

తక్కువ గాక మరేమి? అంతపెద్ద మొక్కును మనమెట్లు తీర్చుకొనఁగలమో నిజముగా నాకుఁ దెలియకున్నది. ఈచౌకరోజులలో నైనను గల యెనిమిదణాలు పెట్టినఁగాని రాదు.

దు.— ఏమి చేయుదువన్నారు? గలయోః కాదు, అప్పుడు మొక్కుబడిగా నా ప్రాణములు సైత మర్పింప సంసిద్ధురాలనై యుంటిని. అప్పటి నాయాదుర్దా యట్టిది (అని కొంచెమునే పొఁగి) ఔనులెండి! మన ప్రస్తుత దుస్థితిలో అరఁటిపండ్ల మొక్కు చెల్లించుకొనుటకంటెఁ బ్రాణ మిచ్చు ప్రతిజ్ఞ నెరవేర్చుకొనుటయే సుకరతరమని నే నొప్పుకొను చున్నాను. అది నే నెఱుఁగుదును.

రా.— (ఆమాటల కెంతో సంతాపపడి భార్య నోదార్చు నుద్దేశముతో) అయిన నేమిలే! భయపడకు. తన యరఁటిపండ్లు తనకుఁ గావలయునని నారాయణున కపేక్ష యున్న యెడల, వాఁడే నాకు నేఁడు చేపలు పుష్కలముగా దొరకునట్లు చేయును.

"ఓసీ! యీసారి మనకెన్ని చేపలు దొరకినవో చూడు!"

అనిచెప్పి రామచరణ్ వలయును, బుట్టలును పట్టుకొని యిల్లు విడిచిపోయెను.

## ౨

నారాయణస్వామి యాయూరివారి కందఱకును ఇష్టదేవత, కులదైవతము. గట్టిగా నిటికలతోఁ గట్టిన ఆయనగుడి యూరిపొలిమేర నున్నది. అది కట్టి రమారమి రెండువందల సంవత్సరములు గావచ్చినది. కష్టములు వచ్చినప్పుడా గ్రామమువారేకాక చుట్టుపట్లనున్న యూళ్లవారును, అప్పుడప్పుడు దూరగ్రామస్థులును గూడ నారాయణస్వామినే నమ్ముకొని యివి యిచ్చెదమనియు, అవి యిచ్చెదమనియు నానావిధములైన మొక్కులును మొక్కుకొను చుందురు. ఆయనయనుగ్రహమువలన నందుచే ననేకులకు వ్యాధులు నిమ్మళించినవి. గొడ్రాండ్రు బిడ్డలతల్లులైనారు. భార్యలను బాడు భర్తలు భార్యల కిష్టులగు పతులైనారు. గ్రామస్థుల కందఱకును స్వామిపై గాఢమైన విశ్వాసము గలిగినది; యథావిధిగా మొక్కుకొనినయెడల నెట్టి కార్యమైనప్పటికిని అమోఘముగా నెఱవేఱు నను నమ్మకము వారి మనసులలో గట్టిగా నాటుకొనినది. పూర్వపు జమీందారు, కోవెలగ్రామము గొప్పగ్రామము చేయుటకై సమీపమున నొక బడియును, టపాకచేరియును, ఒకటి రెండు దుకాణములును బెట్టింప నుద్దేశించి, గుడికి చేరువగా, యావద్వ్యయభారమును తానే వహించి, గ్రామోపయోగార్థము : విస్తృ

తరగతుల పాఠశాల యొకటి గట్టిది కట్టించి పెట్టినాఁడు: కాని తక్కిన తనసంకల్పములు నెఱవేఱకముందే, ప్రజాదురదృష్టవశమున, ఆయన మరణించినాఁడు. తదనంతరపు జమీందారు (౧౯౨౦ ఆ ప్రాంతమున పనుచువాఁడుగానే యుండెను) కలకత్తాలో స్థిరనివాస మేర్పఱుచుకొని యెప్పుడో కాని యింటికి రాఁడు.

సాయంకాలము రమారమి మూఁడుగంటలకు రామచరణ్ ఇంటికి వచ్చినాఁడు; ఈమాటు చేఁపలబుట్టల బరువెక్కువగా నున్నదని యతని నడకతీరుచూచిన ప్రతివాఁడును దెలిసికొనఁగలఁడు. ఇంటిముంగలనే యిల్లాలిని జూచి యతఁడామెతో నిట్లు పల్కెను:

రా—ఓసీ! యీసారి మనకెన్ని చేఁపలుదొరకినవో చూడు! ఇదంతయు నారాయణమూర్తి కృపయే! ఆయనచేసిన పనియే! అదినే నెఱుఁగుదును. ఈకాలమునఁగూడ వేల్పులున్నారు, కాని పాపాత్ములమగు మనము వారిని చూడలేము.

దులలి ఆఁపుకొనలేని ఆనందబాష్పములతో "ఔను! ఈకాలమునఁ గూడ వేల్పులున్నారు. కాని పాపాత్ములమగు మనము వారిని జూడలేము" అని మగనిమాటలే నొక్కి మరలఁ బల్కెను.

పచ్చిమిరపకాయ లుప్పులో నద్దుకొని నంజుకొనుచు రామచరణ్ తొందరతొందరగా నన్నము దిని యూరికి మూఁడుమైళ్ల దూరమున సాగుచున్న సంతకు బయలుదేఱిపోయెను. అతఁడు వెళ్లు త్రోవలోనే నారాయణాలయ మున్నది. ఆలయసమీపమునకు రాఁగానే రామచరణ్ చేఁపలబుట్టలు క్రిందఁబెట్టి, మూసియున్న గుడితలుపుల మ్రోల మోఁకరిల్లి నమస్కరించెను. పగటి పూజయు, రాత్రిపూజయుఁ జేయుటకు నుదయమున నొకసారియు, రాత్రిపడిన తరువాత నొకసారియు అర్చకుఁ డాలయమునకు వచ్చి పూజలుచేసి వెళ్లుచుండును. తాను లేనప్పుడు పైజాతిహిందువులలో నెవరైనను వసారామీఁదికి వచ్చి తలుపులు తెఱచి స్వామిని దర్శించిపోవుటకు వీలుగా పూజారి పగటిపూఁట తలుపులకుపైని గొండ్లెముమాత్రము తగిలించి పోవుచుండును. రాత్రి పూజజేసి వెళ్లునప్పుడు కప్పతాళము కూడ వేసి పోవుచుండును. రామచరణ్ అస్పృశ్యుఁడు, వసారా యెక్కఁగూడదు. కనుక "స్వామీ! యీరోజున నీవు నాపై నెంతో కృపచూపినావు. రేపుదయముననే తప్పకుండ నీ యరఁటిపండ్లగెల నీకు నేను సమర్పించుకొనెదను. రక్షింపుము" అని కృతజ్ఞతాభక్తిభరితమైన తన హృదయమును తండ్రికివెళ్లార్చి, వసారాక్రిందనుండియే వంగి నమస్కరించి వెడలిపోయెను.

## ౩

ఊరుదాఁటి రామచరణ్ పొలములమీఁది దగ్గఱత్రోవ ద్రొక్కి సంతకుఁ బరుగెత్తిపోయినాఁడు. ఆరో జతనియదృష్టపురోజు. చేఁపలమ్మినడబ్బు చాలగా వచ్చినది. విక్రయధనముతో మొదటఁ గొన్న వస్తువు అరఁటిగెలయని వేఱుగాఁ జెప్పనక్కఱలేదు. తరువాతఁ గావలసిన బియ్యము, ఉప్పు, పప్పు మున్నగు పదార్థములు కొనినాఁడు. వానితోపాటు అప్పుడప్పుడు సంతోషసమయములందు భోగభోజన పదార్థముగా నుపయోగించుకొను కొంచెము బెల్లపుపాకము కొన్నాఁడు. ఇవిగాక యతిజాగ్రత్తతో కొంతసొమ్ము మిగిల్చి దానితో పెండ్లాము దండచేతికిఁ గట్టుకొను తాయెత్తుల కుపయోగించు నొక చక్కనిబొందు కొన్నాఁడు. దులలి సందిటి తాయెత్తుల బొందు పాఁతగిల్లి చివికిపోయినది. రామచరన్ కొన్నాళ్లనుండి యది కనిపట్టి చూచుచునే యున్నాఁడు. కాని చేతిలో గవ్వయైనను లేకుండుటచే క్రొత్తబొం దింతవఱకుఁ గొనలేకపోయినాఁడు. ఒక కానిపెట్టి యిప్పుడొక బొందుకొని యది మొలలో దోఁపుకొన్నాఁడు. నారాయణస్వామితర్వాత రామచరన్నకుఁ గృతజ్ఞతాపాత్రమైన ప్రియతమపదార్థము దులలియే! ఎందుచేత? దేవునకు మ్రొక్కుకొని యామె తనప్రాణమును రక్షించినది. ఆమ్రొక్కువలననే నారాయణమూర్తి స్వయముగా వచ్చి యామెకు స్వప్నములోఁ గనఁబడినాఁడు.

సూర్యాస్తమయము కావచ్చినది. సంతకు వచ్చిన తోడి తనయూరివా రింకను క్రయవిక్రయ వ్యాపారములు ముగించుకొనలేదు. ఎప్పు డింటికి వెళ్లుదునా యని రామచరణ్ తొందరపడుచున్నాఁడు. అతని మనసులో ననేకమైన యూహ లూరి పెల్లి విరియుచున్నవి. క్రొత్తబొందుసంగతి డబ్బాటుగా దులలికిఁ దాఁజెప్పుటతోడనే యమితానందముతోఁ దన్నుఁ జూచు నామె కంటి నిగనిగలు, కలకలలాడు నామెమొగము, మొలకనవ్వులు — ఇవన్నియుఁ దనమనోనేత్రమునకుఁ గాన్పించుచున్నవి. "నేను వెళ్లినవెంటనే పాఁతబొందు త్రెంచిపాఱవైచి తాయెతులు క్రొత్త బొందునకు గ్రుచ్చి స్వయముగా నాచేతులతో నవి నాప్రియురాలి సందిటను గట్టెదను. అంతట దులలి నాపాదధూళితీసికొని తాను బొట్టుపెట్టుకొనుటకై నాముంగల వంగును. వంగియున్న యామె శిరముపై నాచేతులిడి నిమురుచు నేనామెను హృదయపూర్వకముగాఁ బూర్ణానురాగముతో నాశీర్వదింతును" అని యవశ మనస్కుఁడై యేమేమో తలపోసికొనుచు రామచరణ్ సంతలో నిఁక నొకనిమిషమైనను నిలువఁజాలక తన యూరివారు తోడరాకుండఁగనే యింటికి మరలిపోయెను.

## ౪

ఊరు చూపుమేరదూరమున నుండఁగా వాయవ్యదిక్కున ఆకాశమంతయు కారుమబ్బు క్రమ్మియుండుట రామచరన్నకుఁ గానిపించెను. ఆవులు కొన్ని యఱచుచు గ్రామమువైపునకుఁ బరుగులిడుచుండెను. రామచరణ్ త్వరగా నడవఁజొచ్చెను. కొంతదూర మరిగినపిమ్మట నేదోయొక భూతము జుట్టుపట్టుకొని తన్ను నేలపైఁ బడవైచి యీడ్చుచున్నట్టు అతనికిఁ దోఁచెను. తటిత్కాంతులేం

తనకు కాలిదివ్వటీలు పట్టుబంట్లుగా, నుఱుములే తనబిరుదతూర్య ధ్వనులుగా, నొక పెద్ద దయ్యపుగాలి వచ్చి పొలములపై ఘోరముగా విసరికొట్టుచుండెను. దానితో ప్రబలమైన వర్షముకూడ వచ్చి రామచరన్నును నల్దెసలఁ జుట్టుకొని ముట్టడించెను. అతఁడంతట యావచ్ఛక్తితోను పరుగిడ నారంభించెను. ఎడమప్రక్క నొక గొప్ప మఱ్ఱిచెట్టుండెను. అది రమారమి నూఱేండ్లనుండి వర్షాతప బాధలు తగులకుండఁ జేయుచు ఆలకాపరి బాలురకును, అధ్వగులకును అమోఘ రక్షకస్థానముగా నుండెను. రామచరణ్ ఆచెట్టుకడకుఁ బరుగెత్తినాఁడు. హఠాత్తుగాఁ బిడుగుపడినంత పెద్దధ్వని యొకటి వినఁబడినది. ఉత్తరక్షణముననే తళుక్కుమని యొక మెఱుము మెఱసి పాపమాబహూపకారియగు మహావటవృక్షము నేలపైఁగూలుట యతని కంటి కగపఱిచినది. నారాయణస్వామియాలయపు టావరణములో నొక పెద్దమామిడిచెట్టు గలదు. రామచరణ్ అటకుఁ బోఁజూచి నాఁడు. కాని అదియు తెల్లుముక్కవలె నిటునటు నూఁగాడు చుండెను. అక్కడకేగుటకూడ నతని కంత క్షేమకరముగాఁ గాన్పింప లేదు. ఏమిచేయుటకుఁ దోఁప కతఁడు మఱింతవడిగాఁ బరుగెత్తి బడలి వగర్చుచు నాఁగి సరకులగంప క్రిందఁబెట్టి బొందు తడవిచూచి నడికట్టు గట్టిగా బిగించుకొని ప్రాణరక్షణకై యెటకుఁ బోవలయునో యాలోచించుకొనుచుండెను. దులలి తనమనసు విడువక సదా తలఁపు నకు వచ్చుచుండెను. భగవత్కృపచే నామె క్షేమమునఁగూర్చి యతఁ డంతగా నాదుర్దాపడనవసరము లేకపోయెను. ఎందుచేత? వారి కొంప యెత్తుకొంపగాక క్రిందికి వ్రాలియున్న పూరికప్పు గుడిసె. అట్టిగుడిసెలు గాలివానలకుఁ గూలిపోవని యతఁ డెఱుఁగును. అదియుఁగాక దానిచుట్టును వెదురుడొంకలున్నవి. అవి తన కుటీర మును గాలిదెబ్బ తగులకుండఁ గాపాడునని యతనికిఁ దెలియును. తన స్థితియే సందిగ్ధస్థితిగా నున్నది. నారాయణస్వామికోవెల తనకు ముందు కొన్నిగజములదూరముననే యున్నది. ఆగుడిలో దూఱి కూర్చున్నచో నెంతగాలివానయైనను తన సిగపూవు గదల్ప లేదు. బహుశః పూజారి రాత్రిపూజ కింకను వచ్చియుండఁడు, గనుక, మెల్లగా తాను లోపలఁ బ్రవేశింపవచ్చును. అర్చకుఁడు వచ్చియున్న యెడల ఆసంగతి వేఱు. అతఁడు పూర్వాచార సంప్రదాయములకు మూటిగాఁ బోవు ఛాందసబ్రాహ్మణుఁడు. ఒక పక్షముక్రిందటనే అతఁడు చెఱువులో స్నానముచేసి బిందెతో నీళ్లు పట్టుకొని వచ్చు చుండఁగా రామచరణ్ ఆదారిని బోవుట తటస్థించెను. రామచరన్ నీడ తనపైని బడినదేమో యని యతఁడు బిందెఁడు నీళ్లను నేలఁ గుమ్మరించి తిరుగఁ జెఱువునకువెళ్లి మరల మునిఁగి క్రొత్తగా బిందెఁడు మడినీళ్లు తెచ్చుకొన్నాఁడు. అతఁడు గుడికే వచ్చియున్న యెడలఁ దాఁ జచ్చుటకైన నొప్పుకొనును గాని రామచరన్నును దేవాలయములోనికి రానీఁడు. అది యటుండఁగాఁ, గోవెలలో ప్రవేశింపఁ దనకుఁ గలిగిన తలంపు రామచరన్నునకే ఘోరముగాఁ దోఁచినది. తాను గుడిచొచ్చి దేవుని మైలపఱుతు నని యెట్లు సంకల్పించుకొనఁగలఁడు? పట్టనవాసులు కొందఱు తనగ్రామమునకువచ్చి తన జాతివారు దేవాలయములలోనికి వెళ్లుట తప్పుగాదు, దానివలనఁ బాపము రాదు అని తమ్మొప్పింపఁ బ్రయత్నించినమాట వాస్తవమే. కాని వారందఱును కంటిజోళ్లను, కాలిజోళ్లను ధరించి తిరుగు నవ నాగరకులు. హిందువు లెప్పుడును తాఁకఁగూడని యనేక పదార్థ ములు వారు పుచ్చుకొందురను వదంతికూడ నున్నది. నియమము లేర్పఱిచి శాసించుపని యట్టివారిది కాదు. అదియుఁగాక, యీవిష యము యుక్తులచే నిర్ణయింపఁదగిన విషయముకాదు. తన తండ్రి యును, తాతయును, ముత్తాతయును, తత్పూర్వులును జేయఁజాలనిపని చేయుటకు రామచరన్నెట్లు సాహసింపఁగలఁడు? పట్టనమునుండి వచ్చిన పెద్దమనుష్యు లది పాపముగాదని చెప్పినారు, నిజమే! తన జాతివాఁ డెవఁడో యొకఁడు దేవునిగుడి చొచ్చి దేవతావిగ్రహము నపవిత్రము చేసి, చచ్చి, లోకాంతరమునకుఁ బోయి, మరల వచ్చి, యటఁ దనకేమి జరిగెనదో చెప్పినచో — అప్పుడది పాపమో కాదో తాను తెలిసికొనఁగలఁడు! కూడదు, ప్రాణరక్షణ మునకైనను తాను గుడిలోనికిఁ బోఁగూడదు! అదిసిద్ధాంతము!— పైతుపాను ప్రపంచమును క్షోభపెట్టుచున్నట్లు ఇట్టి భావనాపరం పరారూపమైన తుపాను లోపలఁ దనమనస్సునకు దుర్భరమైన సంక్షోభము గలిగించుచుండఁగా, నొక పెద్దకొమ్మ పెళపెళ విఱిగి గాలికిఁ గొట్టుకొనివచ్చి తాను నిలుచున్న చోటికిఁ గొన్ని యడుగుల దూరమునఁ బడెను. బ్రతుకఁదలఁచినవాఁ డటనుండి కదలిపోక తప్పదు. ఆలయమున కావల పాకశాలయున్నది. కాని, యంత పెద్దగాలిహోరులోఁ గూడ నినుపరేకులు పడినప్పుడు గలుగు ధ్వనివంటి ధ్వని తనచెవిని బడినది. అది బహుశః పాకశాల కప్పు లోని ముడుత యినుపరేకులు గాలివడికి కప్పునుండి విడి యెగిరిపోయి పడిన చప్పుడు గావచ్చునని యతఁ డనుకొన్నాఁడు. ఏలాగుననైనను ప్రస్తుతపు గండము తప్పించుకొనుటకేదో యొక కొంపలోఁ జొరఁ బడక తీఱదు. మెఱపుల తెఱపులతోఁ గూడిన యానిబిడాంధకార ములో, రామచరణ్ గంప మరల నెత్తిపైఁ బెట్టుకొని సాధ్యమైనంత వడిగాఁ బరుగిడ నారంభించెను. దేవాలయముదగ్గఱకు రాఁగానే యొకముడుతయినుపరేకు గాలిలో నెరిగివచ్చి గట్టిగా నతని పార్శ్వ మునకుఁ దగిలెను. అంతట నొక పెద్దకేకతో రామచరణ్ క్రిందఁ గూలెను — తల గుడివసారాపైఁ బడినది. తక్కినశరీరము క్రిందఁ బడినది. గంప తిరుగఁబడినది. అందలి బియ్యము, అరఁటిపండ్లు మున్నగు సరకులు చెదరి గుడితలుపుముందఱఁ బడినవి.

౨

అర్చకుఁ డాసాయంకాలమున గుడికి మామూలుకంటె ముం దుగా వచ్చినాఁడు. మఱునాఁడేదో పుణ్యదినము. విశేషముగా దేవు నికిఁ బూజచేయవలయురోజు. అప్పటికిఁ గావలసినవన్నియుఁ గాల విలంబనముగాకుండ ముందే సిద్ధముచేసిపెట్టుకొనుట కతఁ డానాఁడు

పెందలకడ వచ్చినాఁడు. తుపానుపట్టినందున గుడిలో తలదాఁచు కొనవలసివచ్చినది. కావున నతఁడు కోవెలలోనికి వెళ్లి తలుపుగడియ వేసికొని కూర్చుండెను. రామచరన్నును గొట్టి క్రిందఁబడవైచిన యినుపరేకు పెద్దధ్వనితో గుడికసారామీఁదఁ బడెను. ఆధ్వని విని పూజారి తలుపుతెఱచి పైని జూడఁగా మెఱపుల కాంతివలన, నదు మును దానిపైభాగమును దేవాలయపు వసారామీఁదను, శరీరాధో భాగము క్రిందను నుండునట్లుగాఁ బడిపోయియున్న యొక మను ష్యుఁడు కనఁబడెను. అంతట నర్చకుఁడు పైకివచ్చి వడివడిగా వచ్చుచుఁ బోవుచున్న మెఱుముల తోడ్పాటున బాగుగాఁ బరీ క్షించి చూచినపిమ్మట, నామనుష్యుఁడు స్మృతిదప్పిపడియున్న రామచరణ్ పట్నీయని యతనికి స్పష్టమయ్యెను. అర్చకుఁడు పడిన వానిశరీరమును పరికించి చూచుచుండఁగా, ఆసాయంకాలము విచ్చల విడిగా విడిచిపెట్టఁబడిన నభోభూతములు చదువులబడికప్పునందలి ఇనుపరేకులు లాగి చేతి సత్తువకొలఁదిని చుట్టు నాల్గువైపులను విసరి వేయుచుండెను. ఆరేకు లనేకములు వచ్చి గుడిపైఁబడి కల్పాంతకాల మేఘగర్జలవంటి భీకరధ్వనులు గావించుచుండెను. ఆయపాయస్థితిలో పూజారి కేమి చేయుటకును పాలుపోకుండెను. రామచరన్నును ఆమట్టున విడిచిపెట్టి తాను లోపలికిఁ బోవుట యతనిని జంపుటయే కావచ్చును! అతనిని లోపలికిఁ గొనిపోవుట యొకఁ దాను శాశ్వతముగా ఘోరనరకకూపమునఁ బడిపోవుట యగును! అట్టివిషమస్థితిలో నుండి యర్చకుఁడు "తోడిమనుష్యుని, అందులో రామచరన్నును, నేనెట్లు విడిచిపోఁగలను? పోయినచో వాఁడు మృత్యువునోటఁ బడిపోవునేమో! కొన్నిసంవత్సరముల క్రిందట నేను వాని పడవయెక్కి ప్రయాణము చేయుచుండఁగా తుపానువచ్చి పడవను ఏటిలో ముంచివేసెను. అప్పుడు పాప మీ చరన్నే యేటిలో నీఁది నన్ను గట్టిగాఁ బట్టుకొని గట్టునకుఁ జేర్చి నాకు జలసమాధిదుర్గతి పట్టకుండఁ గాపాడినాఁడు! ప్రాణదాత యగు నట్టి మహోపకారి నిట్టి మహాపాయములో విడిచి నేనెట్లు పోఁగలను?" అని వితర్కించుకొనుచు సంభ్రాంతసమ్మోహస్వాంత సంక్షోభము నొందుచుండఁగా, నొక యినుపరేకు రుంయిమనుచు వచ్చి తనచెవిచెంతనుండి పోయెను. తప్పిపోయినదిగాని యొక యంగుళ మది తనవైపు వచ్చినయెడల ఆదెబ్బకు క్రిందమూర్ఛితుఁడై పడి తాను దేవేంద్రలోకము చూడవలసినవాఁడే! ఎంతో ప్రసవ వేదనపడినపిదప శిశువుగలిగినట్లు, మనసు మరణబాధ పడినపిమ్మట— ప్రాణరక్షణ పాపముగాదు — అనుభావ మతని కుదయించెను. అంతట ఛాందసబ్రాహ్మణుఁడైన యా యర్చకుఁడు అస్పృశ్యుఁడగు రామచరన్నును ఎత్తి తనచేతులలోఁబెట్టుకొని మోసికొని పోయి యాలయములోపల క్రింద దింపి, తలుపు గడియవేసి, గాలిచే నాఱి పోయిన దీపమును మరల వెలిఁగించి, యొడలు తుడిచి, తనతుండు గుడ్డ చించి ప్రక్కలకును, ముంజేతులకును దగిలిన గాయములకు కట్లుగట్టి, వసారామీఁదఁ బడిపోయినందువలన కట్టిన బొప్పులు మాటిమాటికి నీళ్లతోఁ దడుపుచు, స్మృతిదప్పిపడియున్న చండా లునికి తనబట్టతో విసర నారంభించెను. పైటిగాలివాన కొమ్మలు విఱుచుచు, చెట్లు పెఱికివైచుచు, ఇండ్లు గూల్చుచు, కప్పు నెగురఁగొట్టుచు, పడవలు ముంచుచు, మనుష్యుల నీటఁ బడవైచి చంపుచు — తనసర్వసంహార కృత్యమును విశృంఖల ముగా నెఱవేర్చుకొనుచుండెను. గుడిలో నర్చకుఁడు గాయపడిన కడజాతివాని కుపచారములు చేయుచుండఁగా, నతని మనసులోఁ గలిగిన గాలివాన పైగాలివాన కెంతమాత్రము తీసిపోలేదు. చెప్ప రాని యొకనీచభావ మతని మనసులో నాకస్మికముగాఁ బ్రవేశించి నది. విస్మృతుఁడైపడియున్న రామచరన్నును పైకిఁగొనిపోయి వాని యథాపూర్వ పతితస్థానమున మరలఁ బడవేసిన నేమి? అందువలన నే బాధయుఁ దనకుఁ గలుగదు. తాత్కాలిక మనోదౌర్బల్యముచేఁ దాను జేసిన యపవిత్రకృత్య మెవరికిని దెలియరాదుగదా! ఈతుచ్ఛ సంకల్పముతోఁ బెనఁగులాడి తప్పించుకొనుటకు, పాపము, బ్రాహ్మ ణుఁడు మరణబాధ పడినాఁడు. నారాయణవిగ్రహముమ్రోల సాఁగిలఁబడి కంట నీరు పెట్టుకొని తన యావజ్జీవ దైవసేవకుఁ బ్రతి ఫల మప్పు డిమ్మని ప్రార్థించినాఁడు. "నా ప్రియదైవతము వగు నో శ్రీమన్నారాయణమూర్తీ, నిన్ను నే భక్తితోఁ బూజించుట నిజ మగునెడల, నేఁడు నాకు నిజము చెప్పుము. నేఁ జేసినది పాపమా పాపముగాదా?" అని యర్చకుఁ డశ్రుపులేకధారగాఁ గార్చుచు "ఓ పరమేశ్వరా! నేఁజేసినది పాపమానో కాదో యసందిగ్ధమైన నీదివ్య వాక్కుతో నిప్పుడు నాకుఁ దెల్పుము" అని గట్టిగా పునఃప్రార్థనము గావించినాఁడు. అంతట గాఢాంధకారమయమైన యతని మనసులో అగ్నిజ్వాలామయములైన యక్షరములతో నీక్రింది భగవద్గీతాశ్లోకము ప్రస్ఫుటముగాఁ గానిపించినది.

శ్లో. విద్యా వినయసంపన్నే బ్రాహ్మణే గవి హస్తిని
శునిచైవశ్వపాకేచ పండితా స్సమదర్శినః. —గీత ౫-౧౮.

తాత్పర్యము — విద్యావినయవంతుఁడైన బ్రాహ్మణునియందును, గోవునందును, కుంజరమునందును, కుక్కయందును, కుక్కమాంసము వండుకొని తిను చండాలునందును సమమైన దృష్టిగలవారు నిజమైన తత్త్వము నెఱిఁగినవారు.

ఈశ్లోకమును, నింకను గీతలోని పెక్కుశ్లోకములను పూజారి చిరకాలమునుండి పఠించుచు కంఠస్థములు చేసికొనియే యున్నాఁడు. కాని యతని కీశ్లోకముయొక్క యర్థ మిప్పు డెఱుకపడిన ట్లింతకు ముం దెన్నఁడును ఎఱుకపడలేదు. అతనిమనసులోని మహాంధకార మంతయు విరిసిపోయినది! అతని దృష్టి నాఁటి వేఱైనది! అతఁడు నాఁటి క్రొత్తమానవుఁడైనాఁడు!

## ౬

అర్చకుఁడు తడిగుడ్డ పెట్టి తలతడుపఁ గాతడుపఁగా కొంత సేపటికి రామచరణ్ "దులలీ! దులలీ!" అని తెలిసియుఁ దలి యని హీనస్వరపు తొక్కుమాటలతోఁ బిలిచినాఁడు. అంత పూజారి యాశాయుక్తుఁడై యుత్సాహముతో "రామచరణ్, నీకు కొంచెము నింపాదిగా నున్నదా?" యని యడిగెను. అర్చకుని కంఠస్వరము వినుటతోడనే రామచరన్నకు స్మృతి వచ్చినది. కనువిచ్చి చూడఁగానే యెదుట నతనికి స్వామివిగ్రహ మగపడినది. నీరసస్థితికి తోడుగా భయ మొకటి పుట్టియతనిని మఱింత క్షోభపెట్టినది. అంత నతఁడు "అయ్యయ్యో! నేను గుడిలోనికి రాలేదు. నే నిక్కడ నుండుట యెట్లు సంభవించినదో నేనెఱుఁగను. పూజ్యులగు పూజారిగారూ, నామాట నమ్మఁడు. నేను దేవాలయములోఁ (బ్రవేశింపలేదు, లేదు! (ప్రవేశింపవలె నను పాపప్రవృత్తి నాకుఁ బుట్టినదిగాని, ప్రవేశించుటనే దానిని తలపెట్టి యెంచివేసికొని వడిగా బకిన ప్రనకుఁ బరుగెత్తితిని. పరుగెత్తుచుండఁగా నా మనుమఁ యనుపరేల గాలిహోరుతోఁ గొట్టుకొనివచ్చి నాపైఁ బడినది. ఆ దెబ్బతో నిలువలేక నేను (గిందఁ బడితిని. తరువాత నేమి జరిగినదో నాకుఁ దెలియదు. ఏమైననేమి? మానసికపాతకము నేఁ జేసితిని గనుక భగవంతుఁడు నాకుఁ పోవ (ప్రాయశ్చిత్తము చేసినాఁడు. ఇది పరమేశ్వరుని పనియే. చేసికొనిన పాపమునకు శిక్ష యనుభవింపక తప్పదు." అని గద్గద కంఠముతో వాపోయెను.





"కన్నువిచ్చి చూడఁగానే యెదుట నతనికి స్వామివిగ్రహ మగపడినది.

అప్పటికి, భయంకరమైన బైటి తుపానంతయును అణఁగినది. ప్రకృతి మరలఁ బ్రశాంతమై యథాపూర్వకముగా నున్నది. అర్చకుని మనస్సు

కూడ నల్లే ప్రశాంతమై, ప్రసన్నమై, నిర్మలమై యున్నది. భయదుఃఖపీడితమనస్కుఁడై వికృత వివర్ణవదనుఁడైయున్న రామచరన్ను నర్చకుఁడు తేఱిచూచి "రామచరన్, భగవన్నిదర్శనమునకు నీవు అపార్థము చేసికొనినావు. దైవసంకల్పమే నిన్ను దేవాలయము కడకు నడిపించి తెచ్చినది. నీవు దానిని బాటింపక నిరసించితివి. అందుచేతనే యీదండన నీ వనుభవింపవలసివచ్చినది. భగవదుద్దేశము కంటికి గట్టినట్టు స్పష్టముగా నీకగపడినను సందేహించి శ్రమపడితివి. సంశయించుట పాపము చేయుటయే. గుడిలోనికి నిన్నుఁ దీసికొని వచ్చినవాఁడను నేనే. సందేహించుచు నేను మఱికొంతసేపున్న యెడల నీవలెనే నేనును శిక్ష నొందియుందును. నీకంటె నెక్కువ దండన మనుభవించియుందునేమో! గాలివాన నాకంటిపొరతొలఁగించివేసినది. భగవంతునియొక్క సత్యమైన చేవ్రాత నాకిప్పుడు స్పష్టముగా అసందిగ్ధముగాఁ గానిపించుచున్నది. కనుక నాయీమాట నమ్ముము. భగవంతుఁ డొక్కఁడే యున్నాఁడు. అతఁ డందఱివాఁడునుగాని కొందఱివాఁడుమాత్రమేకాఁడు." అని కొంకుజంకులు లేని గంభీరవాక్కులతో నుపన్యసించెను.

వైద్యుతశక్తిచే నెత్తఁబడిన బొమ్మవలె రామచరన్ హఠాత్తుగా లేచి కూర్చుండి, యర్చకబ్రాహ్మణుని పాదరేణువు తీసి నుదుటనుంచుకొని, హర్షోచ్చస్వరముతో నిట్లు పలికెను: "భగవంతుఁ డొక్కఁడే యున్నాఁడు. అతఁ డందఱివాఁడును గాని కొందఱివాఁడు మాత్రమే కాఁడు — అని నే నిప్పుడు నమ్ముచున్నాను. ఎప్పటికిని అట్లే నమ్మకొనియుందును."

---

ఇది ఆంధ్రత్వమా ?






అడివి బాపిరాజు

## ప్రథమభాగం

### ౧

ఆ రాత్రి తోలుబొమ్మలాట. ఎనిమిదిగంట లయ్యేటప్పటికి పందిరి తయారయింది. ఊళ్లో బట్టలసావుకార్లు తటవర్తివారి నడిగి ఒకఅరతాను కోరామల్లు పట్టుకువచ్చి తెరకట్టారు. తెరఅడుగున గట్టితడకలు గట్టారు. ఆరుపెద్దమండిగల్లో శేరుశేరు ఆముదం పోసి ఇనపకొంకెలలో పెట్టి తెర వెనకాల వేళ్లాడతీశారు.

తొమ్మిదింటికి ఊళ్లోఉండే పాటకజనులు, కాపులు, హరిజనులు మొదలగు యావన్మందీవచ్చి తోలుబొమ్మల పందిరిముందర కూర్చున్నారు. తెర వెనక దీపాలు వెలిగించారు. వెలిగించడంతోటే తెరమీద రాములవారు, లక్ష్మణస్వామి, హనుమంతుడు, జాంబవంతుడు, సుషేణుడు ఇంకా మూడుకోతులు ఈపక్కా ఆపక్కా చెట్లు కాక యొనిమిది విగ్రహాలున్నాయి.

దీపాలు వెలిగించడంతోటే "తొండము నేకదంతమును" అనే పద్యం చక్కనిగొంతుకతో తెరఅవతల ఒకవృద్ధకంఠం ఆలాపించింది. ఒకవానరుని బొమ్మతీసి ఆప్రదేశంలో నాలుగుతాళాలు, మద్దెల, తాగా శ్రుతిలో, మూడోకాలంలో, చతుష్కళలో "విఘ్నరాజా సిద్ధివినాయకా" అంటూ నాటరాగంలో, ఏడుగొంతుకులు లయగా కలిసి, హంగుచేస్తూ ఉండగా విఘ్నేశ్వరునిబొమ్మ ప్రవేశపెట్టించారు. 'తైతకధిమికిట' అని ఆవినాయకుడు తాండవించిపోతున్నాడు. "తాండవనృత్యకర గజానన" సభికుల హృదయాలు ఝల్లుమన్నాయి. పాట అయిపోయింది. వెనకటి శ్రావ్యమైన వృద్ధకంఠము

"వినాయకో విఘ్నరాజో ద్వైమాతుర గణాధిపాః,
అప్యేకదంత హేరంబ లంబోదర గజాననాః.
ఇత్యమరః."

శ్లో. "శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజం,
ప్రసన్నవదనం ధ్యాయే త్సర్వవిఘ్నోపశాంతయే."

"అని యీలాగున ఈరోజున మేము ఆడబోయేటటువంటి శ్రీమద్రామాయణంలో రామరావణాయుద్ధం, శ్రీరామపట్టాభిషేకం అనే ఆట ప్రారంభించేముందు విఘ్నేశ్వరుని ప్రార్థించిన వారమగుతు ఇంక చదువులుతల్లియైన సరస్వతీదేవిని ప్రత్యక్షం జేసుకుంటున్నాము. "వీణా పుస్తకపాణి......" అనే శ్లోకంపాడి విఘ్నేశ్వరుని విగ్రహాన్ని తీసి సరస్వతీదేవి విగ్రహాన్ని ప్రవేశపెట్టారు. ఆమెను లాస్యగతిని నాట్యమాడించారు. చక్కనిపాట పాడారు. భాగవతాది గ్రంథాలలో ఉన్న సరస్వతీమీద పద్యాలన్నీ చదివారు. సరస్వతీదేవి పటమున్నూ మాయమైంది. మళ్లీ వెనకటి వానర విగ్రహంవచ్చింది.

ఈగుంపు చాల విద్వత్తుకలగుంపు. గుంపుపెద్ద వీరయ్య డెబ్బదియేళ్లవాడైనా కంఠం గంభీరమంద్రంలో మంద్రంలో తెల్లటి జీడిపాకంలా మాతియ్యగా సాగుతుంది. మంచివిద్యావంతుడు. వాల్మీకిరామాయణం, భాస్కరరామాయణం, సంస్కృత మహాభారతం, నన్నయ తిక్కన ఎఱ్ఱాప్రెగ్గడల మహాభారతం ఆతని కంఠస్థం, మంచినీళ్లపోకడ. అమరం అనర్గళధార. ఒక్కొక్క కథకు నాలుగైదు తోలుబొమ్మ యక్షగానాలు అద్భుతంగా వచ్చును. సంగీతశాస్త్రం ప్రసిద్ధికెక్కిన కోన సుబ్రహ్మణ్యశాస్త్రిగారి దగ్గిర నిరాఘాటంగా నేర్చుకున్నాడు.

ఆతనికుమారుడు విఠలుడూ, విఠలుని ఇద్దరుభార్యలు నాంచారి, రుక్మిణీన్ని, విఠలుడుకొడుకు ఓబలయ్యా, వాడి తమ్ముడు బేట్రయ్యా, విఠలుని కూతురు మీనాక్షి- ఈఏడుగురు ఆటలో పాలుపుచ్చుకునే జట్టు. తోలుబొమ్మలవాళ్ల ఆచారంప్రకారం మొగవాళ్లు, ఆడవాళ్లూ మద్దెలవాయించడం, తిత్తిఊదడం నేర్చుకోవాలి.

వీరయ్యకు గొంతు తొణకనన్నా తొణకదు. వీరయ్య కుమారునకీ, మనమలకీ, కోడళ్లకీ, మనమరాలికీ బొమ్మలు తయారుచేయ

డం వచ్చును. వీరయ్య తోలుబొమ్మలవాళ్లందరిలోను శిల్ప సార్వభౌముడు. వెంకటగిరిసంస్థానంలోను, కార్వేటినగర సంస్థానంలోను, గద్వాలు సంస్థానంలోను వీరయ్యకు మూడు బంగారపు కడియాలు బహుమతులు వచ్చాయి. విజయనగరంమహారాజాగారు నూటఏభై రూపాయల శాలువనూ, నూటపదహారురూపాయలు రొఖ్ఖమునూ బహుమతీ యిచ్చారు. నూజివీడు కోటలో వెండిజరీ పగిడీ, మెళ్లో అయిదుకాసుల కంఠహారం, దోసెడు రూపాయలు, ఒక ఎకరం యీనాము ఇచ్చారు.

## ౨

పూర్వకాలంలో వీరయ్య సంపాదన దోసిళ్లకొద్దీ ఉండేది. సత్తెనపల్లిలో పదియెకరాల మాగాణీభూమి కొనుక్కున్నాడు. అయిదారుచోట్ల నాలుగువేలరూపాయలు వడ్డీవ్యాపారానికి వేసుకున్నాడు. నేడు తోలుబొమ్మల్ని ఆదరించేవాళ్లు లేరు. మారీ ఫిక్ ఫర్డు, గ్రెటాగార్బో, నార్మాషీయరరు, డగ్లాసు మొదలగువాళ్లు గమ్మత్తులు చేసే యీరోజుల్లో తోలుబొమ్మలను ఆదరించేవాళ్లెవరు? ఐనా నాగరకత యింకా పూర్తిగా పాటకజనాల్ని ఆవహించలేదు. వాళ్లని సరస్వతీమాత రక్షించాలి. తోలుబొమ్మలు చూసినా, యక్షగానాల్ని ఆదరించినా, బుర్రకథలవాళ్లని, దేవరకథలవాళ్లని, వీధి భాగవతుల్ని వీళ్లని రక్షించేప్రభువులు వాళ్లేయింక.

వీరయ్యజట్టంటే ఇప్పటికి పూర్వకాలపు వాసనలు పూర్తిగా పోని విద్యావంతులకూ గౌరవమే. ఈరోజున కొంచెం ప్రొద్దుపోయినా పదిగంటలకు ఊళ్లోవర్తకులు, కరణాలు, పండితులు, ఓవరిసీయరు, స్కూళ్లయినస్పెక్టరు, రెవిన్యూ యినస్పెక్టరు మొదలగు ఉద్యోగులు, ఏమీచేయకుండా ఊళ్లోకూచొనియున్న కామేశ్వరరావు యం. ఏ. గారూ, యావన్మందీ వచ్చి వాళ్లకు వీలుగా ఏర్పరచిన పెద్దకాపుగారి పెద్దరుగులమీద కూర్చున్నారు. చాపలమీద దిండ్లూ, పరుపులూ, తివాసీలూ అన్నీ వేయించాడు. కామేశ్వరరావు ఎం. ఏ., పెద్దకాపు దగ్గిరచుట్టం.

హనుమంతుడితోటి రాములవారు సుగ్రీవుణ్ణి తీసుకురావలసినదిగా ఆజ్ఞాపిస్తున్నారు. రాములవారు కుడిచేతినిమాత్రం కదుపుతున్నారు. "అయితే, ఓయిమిత్రుడా, హనుమంతుడా"

"అవును స్వామీ ఉహుం."

"కపి, ప్లవంగ, ప్లవగ, శాఖామృగ, వలీముఖాః,
మర్కటో, వానరః కీశో వనౌకాః, ఇత్యమరః.

అట్టిమర్కటశ్రేష్ఠుడై, ఉత్తముడైన సుగ్రీవుడు,
"చిత్తం రాఘవేంద్రా, శ్రీరామచంద్రా"

"హనుమంతా ఎందుకు నాకు ఆసుగ్రీవుడు కనబడుతున్నవాడవుకుంటూ ఉండలేదేమోయి?"

"ఓహో రామచంద్రా దశరథపుత్రా, నేను తప్పకుండా సుగ్రీవమహారాజు ఏమిచేస్తున్నాడో చూసివస్తున్నాను రాఘవేంద్రా"

హనుమంతుడు దేహమంతా కదుపుతూ శిరస్సు శ్రీరామచంద్రుని పాదాలకడ ఉంచుతూ ఆడిపోతున్నాడు. ఓపక్కన ఉన్నబొమ్మలుతీసేసి, అక్కడ సుగ్రీవుడు తారాదేవి ఇద్దరు చెలికత్తెలు విగ్రహాల్ని ప్రవేశపెట్టారు. సుగ్రీవుడు తారాదేవితో నర్మసంభాషణలు చేస్తున్నాడు. ఇంతలో తారాదేవి భర్తకు జవాబు చెపుతూ ఒకపాట యెత్తుకుంది. ఆగొంతుక కిన్నరీమాధుర్యము, సమ్మోహనపూరితము, కాకలీమృదులలితము.

ఆపాట వింటూనే సభంతా నిశ్శబ్దం అయిపోయింది. పండితపామరుల యావన్మంది హృదయాలూ ఆనందంచే ద్రవించిపోయాయి.ఆగానప్రవాహము సుళ్లుచుట్టి సెలయేళ్లయిప్రవహించింది.

పెద్దకాపుగారి అరుగుమీద గోడకుజార్లాబడి, ఒయ్యారంగా పడుకుని సిగరెట్టు కాల్చుకుంటూ యేదో ఆలోచిస్తూన్న కామేశ్వరావు గబుక్కునలేచి కూచుని బొమ్మలతెరవంక చూసాడు. ఏమిటూ ఆగొంతుక? అని అనుకున్నాడు. వింటూన్నట్టు విననట్టూ, కునికినట్టు కునకనట్టూ కూచునిఉన్న గాయకశ్రేష్ఠుడు సీతారామయ్యగారు ఉలిక్కిపడి, అతిశ్రద్ధతో పాట ఆలకించడం మొదలెట్టాడు. ఆకంఠము అతితియ్యటిది. శారీరములో గంభీరత ఉంది. స్వాధీనకంఠము. శ్రమలేదు యెత్తుగడలో, గమకంలో ప్రకృతిజనితమైన వైచిత్ర్యముంది. ఆబాలిక వీరయ్య కేమవుతుందో అనుకున్నాడు సీతారామయ్యగారు.

## ౩

గాయకశ్రేష్ఠుడు సంగీతశాస్త్రపండితోత్తముడు సీతారామయ్యగారు. భీమవరంలో తోలుబొమ్మలాటైన వారంరోజుల వెనక ఓసాయంత్రం ఇంట్లోకూచొని ఫిడేలు వాయించుకుంటున్నాడు. తనఫిడేలుపాట శ్రుతికాగా వీధిలో తోలుతిత్తి శ్రుతిలో పంచమస్వరంలో చక్కనిపాట విన్నాడు. ఆయన ఫిడేలును క్రిందనుంచి, అచ్చట ఒకబాలికయున్నూ, ఒకపెద్ద ఆడమనిషిన్ని ముష్టికోసం వచ్చిఉండుట చూచాడు. పద్నాలుగేళ్లు యీడువున్న ఆబాలిక గాత్రంతో పాడుతున్నది. నడివయస్సుగలస్త్రీ శ్రుతికోసం తిత్తి ఊదుచున్నది. సీతారామయ్యగారు మొన్న తోలుబొమ్మలాటలో తాను ముచ్చటపడుతూ విన్న కంఠమేయిది.

"అమ్మాయీ! నీకు వీరయ్య ఏమౌతాడు?"

"మాతాతయ్యండి."

"ఈమని ఎవరు?"

"మా అమ్మండి."

"నీకు సంగీతం ఎవరు నేర్పారు"?

"మా తాతయ్య నేర్పాడుసామీ."

"నీకు సంగీతం నేర్పితే నేర్చుకుంటావూ?"

తల్లి—"సామీ అంత అదృష్టం మాకు పడుతుందాడీ?"

"అదృష్టానికేముందిలే. ఇటువంటి కంఠానికి క్రమమైన సాధన లేకపోవడంవల్ల దోహదం లేని పూలచెట్టులా ఉంటుంది. ఇలాంటి గొంతుకే నాచేతిలో పడితే, దీనిముందర కిన్నెరుల పాటలున్నా, మహతీవీణయున్నా కూడా అపశ్రుతిస్వరాలు పలకొద్దూ. దీని కీగళ మెక్కడనుం చొచ్చిందీ?"

"మాతల్లి గొంతు కింతకన్న అందంగా ఉండేదండి"అని నడిమి వయస్సుస్త్రీ బదులు చెప్పింది.

"నేను వీరయ్యతో మాట్లాడుతాను. అతన్ని ఒకసారి రే ప్రొద్దున్న మా ఇంటికి పంపించు."

స్త్రీలిద్దరు వెళ్లిపోయారు. సీతారామయ్యగారి కామాధుర్య మైన గొంతుక ఆరోజల్లా వినబడుతోనే ఉంది.

మరునాడుదయమే వీరయ్య, విశలుదూ వచ్చారు. వీరయ్య ఎదటివాళ్లను గౌరవంజేస్తూ తనకు గౌరవం తెచ్చుకునేరకం. ప్రపంచకం యొక్క దాతృత్వంమీదే తాను ఆధారంపడిఉన్నప్పటికీ, వీరయ్య ఎప్పుడూ భట్రాజుకాదు. సీతారామయ్యగారివంటి పండితోత్తముడు, సజ్జనుడు, ఉత్తమగాయనుడు తన మనుమరాలికి సంగీతం నేర్పడంకన్న అదృష్టం ఇంకోటి లేదని తెలుసును. అయినప్పటికీ ఈరోజుల్లో తనకువచ్చే ఆకొద్దిరాబడీ తన మనుమరాలి గొంతుకవల్ల వస్తోంది. ఆగొంతుకు వినబడకపోతే ఏవూళ్లోనూ అయిదు రూపాయిలకన్న ఎక్కువ దొరకవాయను. సంగీతం నేర్చుకుంటే వచ్చే లాభం ఏమిటి? ఆటలికి ఎక్కువడబ్బు వస్తుందా? లేకపోతే తాను తనమనుమరాలిని పెట్టుకొని సభలుచేయిస్తాడా? పైగా పిల్లకి గర్వంహెచ్చిపోయి తరతరాలనించీ వస్తూయున్న ఈపవిత్రమైన వృత్తిని భీమవరం ముటికికాలువలోనో, నర్సాపురం గోదావరిలోనో కలిపేస్తే!

"స్వామీ, తమరు శలవిచ్చింది ఎంతోసంతోషమైంది. కాని ఏమిచేసేది? వృత్తివాండ్లం. జట్టు కొద్దిమందే ఉంటిమి. ఈకరువు దినాలల్లో మారాబడి అంతా ఈపిల్లదాని గొంతుకుపైనే ఆధారము పడిఉంది సామీ?

"ఓయి వెట్టివాడా, ఇప్పుడు కొంచెం కాలం మళ్లుతోంది దోయ్. తోలుబొమ్మలు వీథినాటకాలు మళ్లీ దేశంలో ఉద్ధరింపబడతాయి. నాగరికత కలవాళ్లే వీట్లను ఉద్ధరిస్తారు. అల్లాంటప్పుడు నీమూతురు సంగీతంనేర్చుకుని ఉందంటే నీజట్టుకు వచ్చేగౌరవం ఇంతాఅంతా అనికాదు."

వీరయ్య—అదేమిటి సామీ, వీథినాటకాలు మూలబడ్డాయి. కూచిపూడిబాగవతులు కూలిపోయారు. విప్రవినోదులు అయిపు లేరు. చినీమాలు, నాటకాలు మటి అదేంటిసామీ, ఏమిట్రా అబ్బాయి దానిపేరు, విప్రవినోదులు చేసేపనులు చేస్తారు?

సీతా—ఓ! మాజిక్కా!

వీర—అదో అనండి. అల్లాంటివన్నీ పెరిగిపొయ్యాయి.

సీతా—ఓయిపిచ్చివాడా, పోనీ తోలుబొమ్మలు చచ్చిపోతాయే అనుకో. ఈరోజుల్లో సంగీతం నేర్చుకున్నవాళ్లకి డబ్బెక్కువ. సంగీతసభలు, సంగీతస్కూలుమేష్టర్లు, సంగీత గ్రామఫోనుప్లేట్లు, సంగీతసినీమాలు ఆడవాళ్లు నాటకాల్లో వేషాలు వేయడం, ఎక్కడజూసినా సంగీతానికే యీరోజుల్లో డబ్బు. అల్లాంటప్పుడు కాస్త గట్టిగా సంగీతం నేర్చుకుంటే మీకుటుంబమునంతా అదే పోషించగలదు. గౌరవముసంగతి చెప్పక్కర్లేదు. యేమంటా వోయ్ విశలయ్యా?

విశ—నిజం, సామీ! మా అప్ప ముసలివాడు. వాడికేమి తెలుసు మాఅమ్మణ్ణి మీదగ్గర ఉంచుగురు సామీ.

వీరయ్య తలఊపుతూనే ఉన్నాడు.

తానే తిండిపెడుతూ కన్నకూతురులా పోషింపుతూ ఉదార హృదయుడు, సత్స్వభావసంపన్నుడు సీతారామయ్యగారు మీనాక్షికి సంగీతం నేర్పుతున్నాడు.

## ౪

కామేశ్వర్రావు యమ్. ఎ. గారికి సాలుకు వెయ్యిరూపాయిలు వచ్చే ఆదాయం ఉంది. ఏఉద్యోగానికైనా ప్రయత్నించాలని ఉంది. కాని ఇంటిదగ్గర తల్లితో ఒక తమ్ముడితో సంసారము పొదుపుగ కాలక్షేపం చేసుకుంటున్నాడు. ఉద్యోగాలకి దరకాస్తులు పెట్టడం, ఉద్యోగాలకోసం తిరగడం, ఉద్యోగాలకోసం ప్రాధేయపడ్డం అతగాడు యెంతమాత్రం సహించలేకపోయాడు. కాంగ్రెసు అంటె అభిమానం. సాధ్యమైనంతవరకు స్వదేశీవస్తువులే కొంటూయుంటాడు.

కామేశ్వర్రావు రసపిపాసి అవడంచేత కళాహృదయానికి సంపూర్ణంగా వ్యతిరేకమైనటువంటి 'సేవ' అనేపదార్థము ఆతనికియెల్లా ఆవేశం కలగజేస్తుంది? ఆతని మనఃపథాలల్లో గ్రాయరుబల్ల, ప్రక్కని కాగితాలపెట్టి, బీరువా, కాగితాలకట్ట దొంతరలు ఇవి చిత్రలేఖానికి శిల్పానికిన్ని వ్యతిరేకమైన అడ్డుగీత లని అనుకుంటాడు.

"ఆకాగితాలు యెందుకు పంపించవు? ఈ విషయంమీద నోటు పంపించవేమీ?" అనేరకాలైన మాటలు గాంధర్వ మహాకళకు అపశ్రుతులని తలుస్తాడు.

పైవారికి కిందవారికి పంపించే విజ్ఞాపనలు తాఖీదులు కవిత్వం అవుతాయా అని పృచ్ఛ చేసుకుంటాడు.

ఏలాగున ఆతడు ఉద్యోగాలకి ప్రయత్నించగలడు?

కామేశ్వర్రావుకు సంగీతమంటే పరమప్రాణం. కవిత్వమంటే చెవికోసుకుంటాడు. చిత్రలేఖనం, శిల్పం చూసి మురిసిపోతాడు. కళారసజ్ఞుడు. కాని ఒక్కకళలోను ప్రవేశంలేదు. గొంతుక కొంచెం బాగుంటుంది. అందుచేత దేవులపల్లివారి దేవాలయందగ్గిరికీ, నండూరి వారి నాయుడుగ్రామానికీ, చింతావారి పుణ్యక్షేత్రానికి, కవికొండల వారి వికసితోత్పలదగ్గిరికీ, విశ్వనాథంవారి కిన్నెరవాగులకి, ముద్దు కృష్ణుని మురళీజ్వాలలదగ్గిరికి తీర్థయాత్రలు సేవిస్తూ వరుసలు నేర్చుకుంటూ వస్తూఉంటాడు. గ్రామఫోనులలోపాటలు చాలాబాగా వచ్చును. స్థానంవారి స్థాయీ మార్పువిలాసాలకు మురిసిపోతాడు. అద్దంకివారి ముద్దుగొంతుక, కపిలవాయివారి గంగాప్రవాహం, జొన్నవిత్తులవారి కిన్నెరకంఠానికి, సి. యస్. వారి చిన్నారి పొన్నారిపాటలకు, తుంగలవారి గమకభంగిమాలకు బాలగంధర్వుని పరమగాంధర్వానికి, రావు వ్యాసుని జీవగీతాలకు, పెండేర్కర్ ఉద్దండ సంగీతానికి మురిసిపోయి సొక్కి కన్ను లరమూతలేసి ఆనందంలో ఊగిపొయ్యేవాడు.

కాని సంప్రదాయసిద్ధమైన త్యాగరాయాదుల పాటలు, రాగాలాపనలు, రాగమాలాప్రవాహాలు అంటే అతనికి తలనొప్పి తెప్పించేటంతవరకూ వస్తుంది.

ఆనాడురాత్రి తోలుబొమ్మలాటలో సమ్మోహనాస్త్ర తుల్యమైన ఆబాలికాకంఠం విన్నప్పుడే నెమ్మదిగా ఇంటికిపోయి అయిదు రూపాయిలనోటు పట్టుకొచ్చి తోలుబొమ్మల పందిరివెనక్కి వెళ్లి వీరయ్యని ఈవలకి పిలిచి నీమనవరాలి గొంతుక్కి ఇదుగోరా బహుమానం అని ఇచ్చాడు. ఆక్షణము వీరయ్య కదఆపుచేసి తెరమీద బొమ్మనెక్కించి 'మరీమరీ కామేశ్వర్రావుగారూ' అని పొగిడాడు. గొప్పప్రభువులకు చూపించే మంచిబొమ్మలు తెరమీద కెక్కించాడు వీరయ్య.

ఆనాటినుంచి కామేశ్వర్రావుకు మీనాక్షీకంఠము సర్వకాలము ప్రతిధ్వనిస్తూనే యున్నది.

ఆబాలిక కొంచెము చామనచాయ. నవయౌవనము పరిమళిస్తూఉన్న పొంకాలరేఖలు సుడులుతిరిగి కరిగిపోతూఉన్న విగ్రహము. మోము కోల. వెడల్పు కొంచెముతక్కువైన పోకుబపాటి కన్నులు. చివరకొంచెము వట్రువతిరిగిన ముక్కు. మావిచివుళ్ల పెదవులు. అపశ్రుతిలేని సౌందర్యఖని. ఆబాలమోము కళాకోవిదత్వము స్పష్టీకరిస్తూ యున్నది.

ఇదివరకు యేనాడున్ను కామేశ్వర్రావు ప్రణయావేశుడు కాలేదు. పవిత్రమైన తెలగవారికులంలో పుట్టిన తనకు, ఈనీచంగా సంచరించే బొమ్మలాటవాళ్ల కన్నెపై ఈరోజున ఈప్రణయ ప్రాదుర్భావము యేమిటి? చదువుకుంటూఉన్నాడనిన్ని, ఇంత అన్నవస్త్రాలికి ఇబ్బందిలేకుండా ఉండేసంప్రదాయకుటుంబంలోని పిల్లవాడనిన్ని ఆలోచించి, యెక్కువకట్నంతో, తమబాలికల నిస్తామని అనేకపెద్దకుటుంబాల నాయుళ్లూ, కాపులు వస్తూఉన్నారు. చక్కని, తెలివైన, చదువుకున్న బాలికను చూసి పెళ్లిచేసుకుందామని అనుకుంటున్నాడు. అలాంటితనకు ఈప్రేమ యెక్కడనుంచి ప్రత్యక్షమయిందో!

ఆబాలిక ఈఊళ్లోనే సంగీతము నేర్చుకుంటున్నది. అతని హృదయం రాగాలు పాడింది. తానుకూడా సంగీతము నేర్చుకోవాలని చిరకాలంనుంచి ఉన్నదిగా?

మర్నాడు సీతారామయ్యగారిని కలుసుకున్నాడు.

"ఏమండీ, గురువుగారూ, నమస్కారం."

"దీర్ఘాయుష్మమస్తు, వివాహసిద్ధిరస్తు. యేమండీ, కామేశ్వర్రావుగారూ, రెండునెలల్నుంచి నాఫిడేలు వినడానికి రావటం లేదే?"

"ఇదివరకు మీతో అంటూవచ్చాను గాని నా యమ్. ఎ. చదువుకి సంగీతానికి పడదని తమ శిష్యుణ్ణి కాలేదు. నాకు సంగీతం నేర్పడం మీరు మొదలెట్టాలని నామనవి."

"నాకు ప్రస్తుతం అయిదు పెద్దపాఠా లున్నాయండీ. పొద్దున్న రాత్రి ఇంటిదగ్గిరకుఱ్ఱాళ్లకి చెప్పాలి. తక్కిన కాలంలో ఈ అయిదుపాఠాలు సరిపోతాయి. బాబూ, నన్ను క్షమించాలి."

"యెల్లాగో తీరిక చేసుకుని మీయింటిదగ్గిరే నాకు ఆరోపాఠంగా నేర్పాలి. మీరే రెండుమూడుసార్లు నా గొంతుక మంచిది, సంగీతం నేర్చుకోమన్నారు."

"మీబోటివాళ్లు మాఇంటికి రావడమే!"

"నన్ను సంగీతం నేర్చుకోవద్దంటారా?"

"అయ్యయ్యో! యెంతమాటంటారూ! మీబోటి ఉత్తములకు సంగీతం నేర్పకపోతే నావిద్యెందుకండీ!"

"ఇన్నాళ్లూ ఈచదువులతో కాలం వృథాపుచ్చాను. ఈనాటికి నా కీసత్సంకల్పం కలిగింది. సంగీతం విని ఆనందించేందుకైనా నేర్చుకోవాలని ఉంది."

"మీరు మాఇంటికి రావడం నామనస్సు ఒప్పదండీ."

"అయితే, తమరు మాయింటికి తమ ఇష్టమువచ్చినప్పుడు దయచేయొచ్చునే."

"అయిదు పాఠాలు రోజంతా తీసుకుంటున్నాయి."

సీతారామయ్యగారు చిరునవ్వు నవ్వుకున్నాడు.

"మీదీక్ష నాకు సంతోషం కలుగజేస్తున్నదండి."

"నాది ఆరోపాఠం. తమ ఇంటికేవచ్చి నేర్చుకుంటాను. తమ సేవ చెయ్యడానికి నా కీసావకాశం ఇవ్వండి."

"మీరు ఉద్యోగానికి వెళుతారే!"

"అసలు ఉద్యోగానికే వెళ్లను. ఒకవేళ వెడితే అంతవరకే చెప్పండి. నాఅదృష్టం అంతే అనుకుంటాను. ఇక అభ్యంతరాలు చెప్పకండి. సంగీతహృదయంలోకి నన్ను చొచ్చి పోనివ్వండి. మిమ్మల్ని వదలను. మీఇంటికివచ్చే నేర్చుకుంటాను. మంచి ముహూర్తం చూసి తమరెప్పుడు రమ్మంటే అప్పటినుంచి తమదగ్గిర శుశ్రూష ప్రారంభిస్తాను" అని కామేశ్వర్రావు చేతులుజోడించినాడు.

"అయ్యయ్యో, అదేమిటి కామేశ్వరరావుగారూ" అని ఆయన కామేశ్వరరావుచేతులు పట్టుకున్నాడు.

౫

కామేశ్వర్రావు మీనాక్షి పాఠం మొదలుపెట్టబోయేముందు వస్తోఉండేవాడు. కామేశ్వర్రావుపాఠం ఏడింటికి మొదలుపెట్టి ఏడున్నరకు సీతారామయ్యగారు పూర్తిజేశేవారు. కామేశ్వర్రావు మహాదీక్షగా నేర్చుకుంటున్నాడు. అంచేతనే అందరికి గంట చెప్పేపద్ధతి తనదగ్గిర అవసరం లేకుండా చేసుకున్నాడు. ఏడున్నరదగ్గిరనుంచి రాత్రి యెనిమిదిన్నరవరకు మీనాక్షికి పాఠం జెప్పేవారు సీతారామయ్యగారు. మీనాక్షిపాఠం అయినతరువాతనే కామేశ్వర్రావు ఇంటికి వెడుతూఉండేవారు. ఇంటిదగ్గిరంతా పరిశ్రమచేయడంవల్ల కామేశ్వర్రావు పరుగులమీద సంగీతవిద్యాదీక్ష పూనాడు. సంగీతశాస్త్రంలోఉండే సిద్ధాంతాలన్నీ కరతలామలకమైపోయాయి. జంటలు, గీతాలు, స్వరజితులు, వర్ణాలు ఆరునెలల్లో పూర్తిజేసి కీర్తనలకువచ్చాడు. మీనాక్షి తనతాతగారు నేర్పినదంతా మర్చిపోయి మళ్లీ నేర్చుకోవలసివచ్చింది. అద్భుతమైనగొంతుక కాబట్టి మూడునెలలలో రాగాలు, కీర్తనలుకూడా ప్రారంభించింది.

మీనాక్షి వికసిస్తూఉన్న పుష్పము. ఆమె ఇంకనూ అందాలు కోసుకొని దండలు గుచ్చుకుంటూంది. ఆమెహృదయము లేడిపిల్లలాంటిది. చిన్నతనాన్నుంచి ఆమెకంఠంలోని గానాద్భుతం చూచి మురిసిపోయే తాతగారు ఆమెకు చక్కని సంబంధం వెతికి మనమణ్ణితెచ్చుకొని ఇల్లరికం ఉంచుకోవాలని ఉవ్విళ్లూరుతోఉండేవాడు.

మీనాక్షి కామేశ్వర్రావు ఎందుకంత తనతో చనవుచేసుకొంటున్నాడో దానివిషయమై ఆలోచనైనా కలగలేదు. కామేశ్వర్రావును చూస్తే ఆమెకు చాలాసంతోషంగాఉండేది. ఎప్పుడు అతనితో ప్రాణమిచ్చి మాట్లాడేది. జట్టుతోపాటు ఆమె యెన్ని ఊర్లు తిరిగినా ప్రపంచజ్ఞానములోని ఓనమాలన్నా ఎరగదు. అంచేత కామేశ్వర్రావు రైళ్లనుగురించి, విమానాలనుగురించి, సినీమాలనుగురించి, విద్యుచ్ఛక్తిదీపాలనుగురించి, దేశాలు, దేశాలలోని ప్రజలు, పంటలు, నగలు, దుస్తులు మొదలైనవాటినిగురించి నోరూరగా చెబుతూఉంటే విస్తుపోయి వింటూఉండేది.

మీనాక్షి సీతారామయ్యగారింట్లోనే భోజనంచేసేది. ఆయన తనకోసం అని ఇచ్చిన వీథిగదిలో సామాను పెట్టుకుని అక్కడనే పడుకునేది. కామేశ్వర్రావు స్నేహముచేత శుభ్రత, ఆరోగ్యము, రసజ్ఞత వీటినిగురించి మీనాక్షి బాగానేర్చుకొన్నది. ఎరకలవాళ్ల పందిలదొడ్డిలా వుండే మీనాక్షిగది నెమ్మది నెమ్మదిగా మార్పుచెంది ఆరునెలలలో కళాప్రదర్శనపుమందిరములా తయారైనది. మోడరన్ రివ్యూ, భారతి, గృహలక్ష్మి మొదలైన పత్రికల్లోంచి కామేశ్వరరావు సంగ్రహించిన బొమ్మలు అద్దాలుకట్టించి గోడలమీద వేలాడగట్టుకుంది. జపాన్ వెదురుఅల్లికతెరలు అక్కడక్కడ అలంకరింపబడియున్నాయి.

ఇంతలో సీతారామయ్యగారి పెద్దకూతురు పుట్టింటికి పండక్కని చక్కావచ్చింది. ఆఅమ్మాయిఅత్తవారు కాకినాడ. అత్తవారు మంచి నాగరికతగల కుటుంబ మగుటచేత అతినవీన నాగరికతా సంప్రదాయంలో ప్రథమతరగతిలో ప్రథమముగా ఉంటూన్నవాళ్లలో ఒక్కత్తె. మనదేశంలో భర్తక యేదియిష్టంగా యుంటే అలాగమారిపోతారుగా ఆడవాళ్లు. సీతారామయ్యగారు పెట్టినపేరు వియ్యమ్మ. నేడు విజయానందని.

గోదావరివరదలా యింట్లోకి చక్కావచ్చింది.

"అమ్మా, వీథిగదిలో నుంచున్న అమ్మాయియెవరే?"

"నాన్నగారిదగ్గిర సంగీతం నేర్చుకుంటూయున్న ఒక బొమ్మలాళ్లమ్మాయి."

"బొమ్మలాళ్లేమిటేవు?"

"తోలుబొమ్మలాళ్లే."

"తోలుబొమ్మలాళ్లకి సంగీతం ఏమిటి?"

"ఆఅమ్మాయికంఠం కిన్నరీకంఠం. అంత అందమైనకంఠం నేనెక్కడా వినలేదుసుమా! సంగీతంలోకూడా మీకుతగ్గ తెలివితేటలున్నాయి. మెచ్చటపడి నీకు యెంతబాగా సంగీతం నేర్పారో అంత యిదిగాను మీనాన్నగారు యీఅమ్మాయికి నేర్పుతున్నారు. మా మంచిపిల్ల. నేనంటే ప్రాణం. కూతుళ్లిద్దరు కాపరాల కెళ్లినందుకు నాకు మూడవకూతురైంది."

ఆరోజునుంచే విజయకి మీనాక్షికి కృష్ణా, తుంగభద్రా సంగమమైనది. విజయానందని పుట్టింట రెండునెలలు ఉంది. ఆరెండు నెలలలో వేణీభరం కూర్చేపద్ధతుల్లో, సొగసైన వస్త్రాలు యెన్నుకొనే విధాల్లలో, నగలు అలంకరించుకొనేరీతుల్లో, పువ్వులు ముడుచుకొనే మోస్తరుల్లో, మొహానికి మంచులు, వెన్నలు, పవుడర్లు, పెదవులకు, బుగ్గలకు రంగులు సొగసుచేసుకొనే సూత్రాలల్లో, టాల్కం పౌడులు దేహానికి అద్దుకునే అందాల్లలో, యూడీకొలోను, లవండరు మొదలైన పరిమళజలాలు బట్టలపైజల్లుకొనే బావల్లలో విజయ మీనాక్షికి గురూపదేశము చేసినది.



మధుర మీనాక్షి దేవాలయము, తటాకము S. M.



తిరుక్కళుక్కుంద్రము దేవాలయము J. K. C.

విజయ సంగీతంలో సరస్వతి. గొంతుక అతి అందముగా ఉండకపోయినా ఉత్కృష్టమై సూక్ష్మాతిసూక్ష్మమైన శ్రుతి, స్వర, లయజ్ఞాన ముండుటచేత వినేవారి హృదయాలలో అమృతబిందువులు కురిసేటట్లు పాడగలదు. ఆమెయున్న రెండు నెలలలోను మీనాక్షి పదియేళ్ల విద్య నేర్చుకొన్నది.

ఆరెండు నెలలు కామేశ్వరరావు మీనాక్షితో తానొక్కడే గొంకు వచనువుగా యుండేందుకు వీల్లేకపోయింది. కామేశ్వరరావు సంగీతం నేర్చుకోడం విజయకు ఆశ్చర్యమే వేసినది. విజయ మీనాక్షిని వెనకవేసుకొని చిత్రలేఖనాన్ని గురించి, హిందూదేశములో యుండే అద్భుత శిల్పవిన్యాస దేవాలయనిర్మాణాది విచిత్రాలని గురించి కనుక్కుంటూయుండేది. ఎంత అతినవీనపద్ధతిని వేషంవేసుకున్నా విజయ యంటే కామేశ్వరరావుకు యెక్కువ గౌరవము భయమున్నూ. వంచినతల యెత్తకుండానే మాట్లాడేవాడు. కన్నింగ్ హామ్ ప్రభ్వియొక్క అజంతాబొమ్మలబుక్కు, ఫెర్గుసన్ గారి భారతీయ శిల్పగ్రంథాలు మొదలైనవి తెప్పించి కామేశ్వరరావు వాళ్లిద్దరకూ చూపించేవాడు. ఇంతలో విజయ అత్తవారింటికి వెళ్లిపోయినది. అమ్మయ్యా అని కామేశ్వరరావు నిట్టూర్పు విడిచాడు.

ద్వితీయ భాగం

౧

మీనాక్షి రెండేళ్లు గురుకులవాసము చేసింది. వచ్చినచదువు చాలునని ఇంతలో ఆమె తాత వీరయ్య గరుత్మంతుడులా వచ్చి మనుమరాల్ని తీసుకు చక్కాపోయాడు. అబాలిక సీతారామయ్యగారికడ సెలవుపుచ్చుకొని ఆయనపాదాలకు, ఆయనభార్యపాదాలకు నమస్కారంచేసి తల్లిదండ్రులను వదలివెళ్లే బిడ్డలా వెక్కి వెక్కి యేడ్చినది.

ఆదంపతుల ఇరువురకిన్ని కళ్లు చెమర్చినవి. వీరయ్య మనుమరాలిచేత తాంబూలములో పదికాసులు పెట్టి ఇప్పించబోగా సీతారామయ్యగారు కోపగించుకొని వీరయ్యను తలవాచేటట్లు చీవాట్లు పెట్టినారు.

“ఆమె నాకూతురు. అల్లాంటి అమ్మాయికి చదువుచెప్పడం నాఅదృష్టం.” సీతారామయ్యగారు భార్యచేత మీనాక్షికి పసుపు, కుంకుమ, చీరయు, రవికలగుడ్డయు ఇప్పించినారు.

కామేశ్వరరావుహృదయం దడదడమని కొట్టుకుంటూండగా కుంగిపోతూ అచటనే నిలబడియున్నాడు. మీనాక్షికోసం తెప్పించిన తొంబదిరూపాయిల తంబూరాను ఆమెకి ఇస్తూ “మీనాక్షీ! ఈ నన్ను మరిచిపో” అన్నాడు.

మీనాక్షి వెక్కి వెక్కి యేడ్చినది. కామేశ్వరరావును వదిలిపెట్టివెళ్లుట ఆమెకు అంతరాంతరాలల్లో మరీ కష్టమైతోచింది.

౨

అప్పుడు జట్టంత బెజవాడలోఉంది. వీరయ్య, విఠలుడు, చిన్నవీరయ్య మీనాక్షిని ఆనమాలుకట్టలేకపోయారు. ఆబాలిక పెంటకుప్పలోనుంచి బయలుదేరిన చేమంతిచెట్టులా ఉన్నది.

మీనాక్షి తనవాళ్లను యెగాదిగా చూచుకొన్నది. వంద సంవత్సరాలక్రితం ఉతికినబట్టలు కట్టుకుంటూ, వారానికి ఓమారైనా స్నానంచేయకుండా తిరుగుతూ, నానావిధ నీచపదార్థాలు తింటూ, ఊరుబైటవేసుకున్న గూడుగుడిశల్లో సామానుమోసుకొనేందుకు ఉపయోగించే గాడిదలతోటి, కాపలాకాసుకొనేందుకు ఉపయోగించే పులుల్లాంటి కుక్కలతోటి సావాసంచేస్తూ, నూనిరాసుకొని దువ్వుకోకుండా పేలుపట్టియున్న తలలతో, నెత్తిమొత్తీ రాళ్ల పూసల పేర్లనగలుధరించిన మెళ్లతో, వెండిమురుగులు అలంకరించిన చేతులతో, బంగారుగుల్ల దండకడియాలు దాల్చిన బాహులతో, వెండిబిళ్లల మొలనూళ్లతో, వెండివడ్డాణాళ్లతో, పొగాకు, తామలపాకూ గారలుకట్టించిన నోళ్లతో తనచుట్టూ ఉన్న తనచుట్టాలిని చూసేటప్పటికి, మీనాక్షిహృదయం క్రుంగిపోయింది. సీతారామయ్యగారి ఇల్లు, ఆరోజుల తనజీవితము మీనాక్షికి కళ్లయెదుట అస్తమానమూ ప్రత్యక్షమౌతూనేఉన్నది.

ఈరెండేళ్లూ, సీతారామయ్యగారు తండ్రిఅయ్యాడు, ఆయన భార్య తల్లిఅయినది, ఆయనకుమార్తె అక్కఅయినది, కామేశ్వరావు ప్రాణస్నేహితుడైనాడు. కంపులతో, పెంటలకంపులతో నిండియున్న ఆ యేరూరికాలవగట్టు నరకకూపమై తోచింది. కామేశ్వరావుగారు తనకు పదేపదేచెప్పిన ప్రకృతివిలాసాలేమీ ప్రత్యక్షంకాలేదు సరేకదా, ఆకాశాన్ని నక్షత్రాలు గాడిదలదెల్లా కనపడ్డా యాబాలకు. బెజవాడచుట్టూ ఉన్నకొండలు పాడైపోయిన పూరిగుడిసెల్లా ఉన్నాయి.

ఎందుకు తనకీసంగీతం నేర్పించారు? బాగా బతకడంయొక్క అందం ఎందుకు తనకు నేర్పుట? అడవికట్టుకు శిల్పసౌందర్యం యిచ్చింది మళ్లీ ముళ్లడొంకల్లో పడవేయడానికా? అమెకు జలజల కన్నీళ్లు ప్రవాహాలు కట్టినవి. తండ్రీ తాత, తల్లీ వాళ్లు యమకింకరుల్లా కనపడ్డారు. కామేశ్వరావుగారి పాదాలు కొలుస్తూ, దాసీలా ఇంతిసేవ చేస్తూంటే బాగుండునే! గురువుగారికి, గురువుగారి భార్యకు వాళ్లింటో పనిచేసే మనిషిలా తాను చాకిరీచేస్తూ ఉండిపోతే బాగుండునే! గురువుగారూ, కామేశ్వరావుగారూ ఎందుకు తన్ని తాతగారు తీసుకొస్తూంటే ఊరుకొన్నారో. కామేశ్వరావు నాయుడుగారు తియ్యటికబుర్లు చెపుతూంటే తాను నిజమనుకొంది. మలాంచేసి జీనువేసి, మంచిదుస్తులువేసినా గాడిద గుఱ్ఱం ఏలా అవుతుందని వాళ్లిద్దరూ తన్ని వదిలేసి ఉంటారు. కులదైవము రాములవారు అసలున్నారా?

ఆరాత్రల్లా నిద్రపోకుండా ఏడుస్తూనే ఉన్నది మీనాక్షి.

... ... ... ... ...

వీరయ్య తన మనవరాలు మళ్లీ తిరిగి తన జట్టులోనికి వచ్చినదనిన్నీ, పేరుపొందిన సంగీతపాటకుడగు సీతారామయ్యగారి దగ్గిర సంగీతవిద్య నేర్చుకొని గొప్పపాటకురాలైనదనిన్నీ బెజవాడ నగరాలపేటలో చాటింపించాడు. ఆరాత్రి ఆకెళ్లవారి సత్రందగ్గిర తోలుబొమ్మలు చూడడానికి వచ్చిన జనం బెజవాడ పుష్కరాని కన్నా రారు. ఉత్తరగోగ్రహణంకథ ప్రారంభించారు. మీనాక్షిది సైరంధ్రిపాత్ర. బొమ్మలాటపాకలో ఒకమూల నలిగిపోయిన పువ్వుల దండలా, చంద్రుడులేకుండా కారుమబ్బులుపట్టి, తుంపర్లు పడుతూన్న రాత్రిలా కూచునిఉంది. రెడ్డియ్య విఘ్నేశ్వర, సరస్వతీ ప్రార్థనలవగానే "ఆలాగున ధర్మరాజులవారున్నూ, భీమసేనులవారున్నూ, అర్జునమహారాజున్నూ, నకుల సహదేవులైన కవలలున్నూ, ద్రౌపదీదేవిమహారాణియూ, ధౌమ్యులవారితో కూడానున్నూ" అని అన్నాడు.

"ఆహా!"

"పన్నెండేళ్లున్నూ అటవీ, అరణ్యం, విపినం, గహనం, కాననం, వనం ఇత్యమరః, అయినటువంటి అరణ్యంలో వాసం చేసినవారు అవుకుంటూ——"

"ఆహా! ఇక ఏలాగయ్యా? సంవత్సరో, వత్సరో, అబ్దో, హాయనో, శరత్సమాః, ఇత్యమరః, ఒక సంవత్సరం అజ్ఞాతవాసం చేయవలసుంటుంది అని ఆలోచించుకుంటూ"

"ఆహా!"

ఈరకంగా కథసాగించారు. ఇంతలో ద్రౌపది పాటపాడవలసిన సమయం వచ్చింది. జట్టు అందరూ మీనాక్షివైపు చూశారు. ఆబాలిక మోకాళ్లు ముడుచుకొని కూర్చొని, మోము మోకాళ్లలో ఉంచుకొని, చేతులు మోకాళ్లకు చుట్టుకొని, కళ్లలోంచి అశ్రుబిందువులు రాలుస్తూ కూర్చొని ఉండి, ఈ లోకంలోనే లేదు. తల్లి వెళ్లి మీనీ, "మీనీ పాటపాడ్డానికిరావే, నీదుంపతెగ. మొద్దులా కూర్చున్నావేమే? లే! వచ్చిపాటపాడు" అని కేకలువేసినది. చిచ్చరపిడుగులా లేచింది మీనాక్షి.

"నేను పాడదలుచుకోలేదు. మీసరుకులు మోసే గాడిదలులా మీరుకూడా గాడిదలు. తోలుబొమ్మలాటా? ఇది దెయ్యాలాటా?" అని కాళ్లు గబ గబ భూమికేసి తన్నింది. తల్లి బ్రతిమాలడం, తండ్రి కేకలువేయడం, అంతా తాతగారు చూస్తున్నాడు. అందాకా ద్రౌపదిభాగం చిన్నవీరయ్యకు క్రొత్తగావచ్చిన భార్య చదువుతూవున్నది. వీరయ్యకు కోపమువచ్చింది. ప్రళయకాలరుద్రమూర్తిలా అయిపోయాడు. రెక్కలుపట్టి నుంచోపెట్టాడు. "నీకు సంగీతం చెప్పించినందుకా ఇంత పొగరమోతుతనం? అంతట్లోకే మహారాణివైనావనా నీ వుద్దేశం. ఛండాలపురండా! లే, వచ్చిపాడు. చావగొట్టివేస్తాను" అని ఉరిమినాడు.

తాతగారి కోపంచూసి దడదడలాడుచూ, భయముతో తెరదగ్గిరకువచ్చి, మద్దెలకు నమస్కరించి, పాటయెత్తినది. శ్రుతి కలవదు. వెనకటివరస రాదు. గొంతుక స్థాయికి పెరగదు. అందరూ అందిచ్చినారు. నాలుగుగొంతుకలూ కలిసినవి. కాని మీనాక్షిగొంతుక అందుకోదే! పదిహేనునిమిషాలు తంటాలుపడ్డారు. మీనాక్షిగొంతుక అపశ్రుతి తప్పుకోదూ సామ్యం ఏర్పడదూ. తెరఅవతల ప్రజల్లో గడబిడలు బద్దేరాయి. "మీనాక్షిని పాడమనండీ" "మీనాక్షిని పాడమనండీ" అని కేకలు. మీనాక్షి పాడలేదు. అందరికీ వెఱ్ఱెత్తిపోయింది. వీరయ్య అన్యాయంచేశాడు అంటూ ఉప్పెనకెరటం విరుచుకుపడ్డట్టు జనం అంతా పందిరిమీదకు విరుచుకుపడ్డం మొదలెట్టారు. వీరయ్య గజగజలాడిపోయినాడు. మీనాక్షి నిద్రలేచివచ్చినట్లులేచి వెనకటిగొంతుక తెచ్చుకొని వెనకటిలా పాడబోయని ఎంతైనా ప్రయత్నం చేసినది. కాని లాభం లేకపోయినది. ఆమెకు కళ్లనీరు కారాయి. వెక్కి వెక్కి ఏడ్చింది.

జనంవచ్చి తెరమీదపడి తెరపీకేశారు. విశలుడు ఈగడిబిడంతా చూసి, ఆడవాళ్లని చేతికిదొరికినన్ని బొమ్మలు పట్టుకొని పారిపొమ్మన్నాడు. మిగిలినబొమ్మలు చిన్నవీరయ్యచేతికిచ్చి పరిగెత్తమన్నాడు. తిత్తీ, మద్దిలా ఇచ్చి తండ్రిని పంపిచేశాడు. ఇంతట్లో నగరాలల్లో ఒకవస్తాదులజట్టు, వీరయ్యంటే మంచభిప్రాయం కల్గినది, లాటీకఱ్ఱలతో రంగంలో ప్రవేశించి, దెబ్బలాడి ప్రజలు పాక అంటించకుండా చూశారు. జనం అంతా వెళ్లిపోయినతరువాత విశలుడు తక్కినవన్నీ సద్దుకొని తమ గుడిశెలకాడికి చేరుకున్నాడు.

జట్టును లేవదీసుకొని బందరు పారిపోయాడు వీరయ్య.

## 3

కామేశ్వరరావుకు మీనాక్షి వెళ్లినప్పటినుంచీ మతిలేదు. అతనిప్రేమకు మీనాక్షి నిదానమైపోయింది. యౌవనము వచ్చిన ఇన్నాళ్లకు ప్రేమంటే ఏమిటో తెలుసుకున్నాడు. మీనాక్షితో రెండేళ్లు స్నేహంచేసి మీనాక్షీ, తానూ సహాధ్యాయులై, మీనాక్షికి తాను గురువై, మెలిగినతరువాత, తీరా మీనాక్షి వెళ్లిపోయినవెనుక తన్ని మూలమంతా కదల్చివేసిన ప్రేమతో ప్రేమిస్తున్నానని గ్రహించాడు. ఆమెమాటలు, దివ్యమైన ఆమె గాంధర్వమూ, విచిత్రసుందరమైన ఆమెమూర్తీ ఆతని బ్రతుకు చుట్టూ మహాప్రపంచములైనవి. మీనాక్షినామము జపమైనది. "దేవీ మీనాక్షి" అని ఆతనిహృదయకుహరాలలో పల్లవి సర్వకాలమూ నదిస్తూనేయున్నది.

భీమవరంలో ఒక్కనిముషం ఉండలేకపోయినాడు. రెక్కలకట్టుకొని బెజవాడవచ్చిపడ్డాడు. అక్కడ వాకబుచేసి బందరువెళ్లారని తెలుసుకొని సాయంత్రానికి బందరుచేరుకున్నాడు.

వీరయ్యజట్టువాళ్లు ఇనుకుదుర్లో తమపూరిగుడిశెలనిర్మించుకొని నిర్మించుకొనియున్నారు. కామేశ్వర్రావు తిరిగి తిరిగి అక్కడకు చేరుకున్నాడు. తనఆత్మలో, ఆత్మయగు మీనాక్షి ఆపూరిగుడిశెల్లో ఉందనేభావం ఆతన్ని దహించివేసింది. ఇదివరదాకా తోలుబొమ్మలవాళ్లు అల్లాంటి పూరిగుడిశెల్లో ఉండడం అతనికేమీ ఆశ్చర్యం కలుగజేయలేదు. అక్కడికివెళ్లి "వీరయ్యా" అని కామేశ్వర్రావు కేకవేసినాడు. వీరయ్య ఇవతలికి చక్కావచ్చినాడు. కామేశ్వర్రావుగారినిచూసి "బాబూ, యిల్లాగవచ్చేరేమిటి" అని ప్రశ్నించాడు. కామేశ్వర్రావు ప్రక్కనేవున్న తూముకాలవకు కట్టిన అరుగుమీద కూర్చొని వీరయ్యని ప్రక్కనే కూర్చోమన్నాడు.

వీరయ్య కామేశ్వర్రావునిచూసి "బాబూ, నానోటిదగ్గిరవున్న కూడు క్రిందకి బోర్లాపడిందిసామీ" అని బెజవాడలో జరిగినదంతా పూసగ్రుచ్చినట్లు వెళ్లబోసుకొన్నాడు. "సీతారామయ్యబాబుగారు మాపిల్లను పాడుజేసారు సామీ, పాటపాడలేదు. గొంతువిప్పలేదు. ఆట కెందుకూ పనికిరాకుండాపోయింది." అతడు నుదిటిమీద కొట్టుకున్నాడు.

కామేశ్వర్రావు అంతా నిమిషంలోగ్రహించాడు. అతనికి ఒక చక్కని ఆలోచన మృదువుగాతట్టింది. లేచినుంచొని వీరయ్యబుజంమీద చెయవేసి "వీరయ్యా, నువ్వేమీ కంగారుపడకు. గురువుగారు చేసిన దెప్పుడూ తప్పుకాదు. అందులో మాగురువుగారు పరమపవిత్రుడు. నువ్వు ఒకవారంరోజులు ఆటాగీటా తలపెట్టకు. ఓపికపట్టిమాత్రం యెదురుచూస్తూఉండు" అనిచెప్పి ఆచీకట్లల్లో మాయమైపోయాడు. వీరయ్యకు ఆశ్చర్యంవేసింది. కామేశ్వర్రావుగారు ఏమిచేస్తారా అని అనుకుంటూ తనగుడిశెకుప్రక్క ఆరుబయటవేసిన నులకమంచముమీద నిద్రపోతూవున్న మనమరాలనుచూసి "తల్లీ నీకు మీనాక్షీదేవిపేరు పెట్టుకొన్నాను. ఏంచేస్తావో?" అని తలపోసుకున్నాడు.

౪

బందరులోవుండే వుద్యోగస్థులకు, వర్తకులకు, భాగ్యవంతులకు ఒకరోజున ఆహ్వానపుపత్రికలున్న కవర్లువచ్చాయి.

గొప్ప సంగీతపు ప్రదర్శనం

శ్రీమతి మీనాక్షిబాయి

ఆర్యా,

అభినవ మీర యనదగిన ఈబాలికకంఠము మాధుర్యాతిమాధుర్యము. పాండిత్యము పండితులచేతనూ మెప్పుపొందదగినది. కాన తాము విచ్చేసి ఈబాలికాగానపవిత్రతలో దివ్యులుకండని మా ప్రార్థన.

| | |
|---|---|
| మచిలీపట్టణము,<br>౧౫-౮-౧౯౨౮ | కామేశ్వరరావు, ఎం. ఏ.,<br>సీతారామయ్య. |

| | | |
|---|---|---|
| మీనాక్షీబాయి | ... | గాత్రము |
| సీతారామయ్య | ... | ఫిడేలు |
| మణిఅయ్యరు | ... | మృదంగము |

రేపు ౧౬-౮-౨౮ తారీకున ———హాలులో ౫ గంటల నుండి ౯ గంటలవరకు——

కామేశ్వరరావు పెద్దలందరకూ ౩రూపాయల టిక్కెట్లు పంపినాడు. బందరుపురమున నున్న సంగీతపండితు లందరికడకూ కామేశ్వర్రావు స్వయముగా వెళ్లి వారి నాహ్వానించి, వారికి గౌరవపు టిక్కెట్లిచ్చినాడు.

ఊరంతా పేపర్లు పంచిపెట్టబడినవి. ౧౬-వ తారీఖున ౫౦౦ రూపాయల టిక్కెట్లమ్మబడినవి. హాలు కిటకిటలాడుతూ వున్నది. మణిఅయ్యరూ, సీతారామయ్యగారూ, పక్కవాద్యాలు వాయించే ఈప్రతిభాశాలిని ఎవరయ్యా? అనుకుంటూనే వచ్చారు జనమంతా. సరీగా అయిదు అయ్యేటప్పటికి సీతారామయ్యగారు, మణిఅయ్యరుగారు, మీనాక్షీబాయీ వచ్చి కూర్చున్నారు. సభను చూసి మీనాక్షి గజగజలాడిపోయింది. అందాలు సుళ్లుచుడుతూ ఉమాదేవిలా వచ్చిన ఆబాలికాదేవిని చూసి "యీమెపాట యీమె అందానికి తగిందేనా?" అని అనుకున్నారు. సభా ప్రారంభములో మీనాక్షి కొంత జంకింది. ఆనందరసవాహినియగు సీతారామయ్యగారి ఫిడేలు, లయామృతవర్షిణి యగు మణిఅయ్యరుగారి మృదంగం శ్రవ్యంగా వినబడుతూవున్నవి గాని మీనాక్షిగొంతుక ఎవ్వరికీ వినబడలేదు. పక్కనుండి సీతారామయ్యగారు "కళ్లుమూసుకొని పాడమ్మా తల్లీ" అని రహస్యంగా చెప్పారు.

మీనాక్షి కళ్లుమూసుకొని గురువుగారిని తలుచుకొని సమస్తమూ మరిచిపోయి, ఉత్కృష్టగానంతో అద్వైతరూపిణి అయినది. ఆమెకంఠము సంపూర్ణముగా వికసించిన మాలతీతీగలా ఆసభ అంతా అల్లుకుపోయింది. ప్రేక్షకులు అట్టి గొంతుక ఇదివరకు యెన్నడూ వినలేదూ, అట్టి సంగీతం ఎప్పుడూ వినలేదు. సభ పూర్తి అయ్యేటప్పటికి సభికులందరూ తన్మయులై ఉన్నారు.

పట్టణములోని పెద్దలూ, సంగీతవిద్వాంసులూ లేచి, మీనాక్షిని పొగడుతూ ఉపన్యాసాలు ఇచ్చారు. జగద్విఖ్యాతులగు మణిఅయ్యరుగారినీ, సీతారామయ్యగారినీ గురించి చెప్పనక్కరలేదన్నారు. ఇంకోసభ ఆపట్టణంలో ఇవ్వాలనికూడా వారు కోరారు. ఆవెనక రెండురోజులైనతరువాత సభలో ౧౨ బంగారుపతకములూ, ౧౦౦ రూపాయల వెండిగిన్నె మీనాక్షికి బహుమతు లిచ్చారు.

ఇదంతా చూసి వీరయ్య ఆశ్చర్యపూరితుడైపోయాడు. అలాంటిసభలూ చూడలేదు, ఆలాంటిపాటా వినలేదు. ఈమనమరాలు సంపాదించిందని ౫౦౦ రూపాయలు తీసుకొచ్చి వీరయ్య ఒళ్లో పోశాడు కామేశ్వరరావు. ఆరునెలలు ఆటలాడినా వీరయ్య

౨౦౦ లేనా కళ్లచూసేవాడుకాడు. కామేశ్వరరావు వచ్చినడబ్బంతో తొమ్మిదివందలయే ఖైఅనిన్నీ, మణి అయ్యరు గారికి రానూపోనూఖర్చు లు క్రింద, బహుమతీ క్రింద, తక్కినవి పేపర్లు అచ్చు వేయించడం, ఊరంతా పంచిపెట్టడంవాట్లకీ అయినఖర్చు నూరురూపాయలు అనిన్నీ, ౫౦ రూపాయిలు హాలుఅద్దె అనిన్నీ లెక్క చెప్పాడు.

కామేశ్వర్రావు వీరయ్యతో మీ రల్లాంటి పూరిగుడిశెలలో ఉండకూడదని, ఛండాలపు నీచపదార్థాలు తినకూడదనిన్నీ వీరయ్యతో హోరాహోరీని దెబ్బలాడి, ఆగుడిశెలు గాడిదలు వాళ్ల బట్ట లన్నీ, ఇతరబీదవాళ్లకు దానా లిప్పించాడు. వీళ్లందరినీ తీసుకొచ్చి సత్రములో పెట్టాడు. శుభ్రమైన వస్త్రాలు కట్టబెట్టించాడు. మీనాక్షి హృదయం సంతోషంతో సంగీతాలు పాడుకొనేటట్లు, వీరయ్య జట్టువాళ్లందరికీ నాగరకతాదీక్ష నిచ్చాడు.

మీనాక్షిసంగీతసభలు నెల్లూరు, గుంటూరు, బెజవాడ, ఏలూరు, రాజమండ్రి మొదలైన పెద్దపురాలలో పెట్టించి విశాఖపట్ట ణంలో సభ జరుగుతుందని ప్రకటించాడు. సీతారామయ్యగార్నీ, అళహసింగరిశిష్యుడైన ఒక తెలుగుమార్దంగికుణ్ణీ తీసుకొని, కామే శ్వర్రావు ఈసభలు చేయించాడు. భారతీయసంగీత మహాకాశంలో ఒక ఉత్కృష్టనక్షత్రం బయల్దేరిందనిన్నీ, మీరాబాయి మళ్లీ అవ తారం తాల్చిందనిన్నీ పత్రికలన్నీ ప్రశంసించాయి. మీనాక్షికి మెడల్సూ, హారాలూ, వెండివస్తువులూ మొదలైన బహుమానాలు వానలాగు కురిశాయి.

౫

మీనాక్షికి కామేశ్వర్రావంటే వెఱ్ఱిస్నేహభావం మొదటి నుంచీ ఉంది. కాని స్త్రీపురుషసంబంధ మగు ప్రేమభావాలన్నీ ఆమెకు కల్గలేదు. స్త్రీపురుషులకుండే ప్రణయభావంగాని, మోహ భావంకాని ఈలావుంటుందని సంగతి ఆమెకు తెలవదు. ఆమె చూపించే హావభావ విలాసాలు ఆమెహృదయంలో తాండవము చేస్తూ ఉన్న శైశవ, బాల్యదశలకు సంబంధించినవే. రూపంలో మూర్తీభవిస్తూ ఉన్నప్పటికీ, ఆబాలికలో స్త్రీత్వము ఇంకా మనఃపథాలల్లో ఆవిర్భవించ నన్నా లేదు. కామేశ్వర్రావువచ్చి చేసిన ఈ అద్భుతమంతా చూసి, మీనాక్షి విస్తుపోయి వెఱ్ఱి యానందంలో మునిగిపోయింది. కామేశ్వర్రావును కౌగ లించుకొన్నది. "నాయుడుగారు, మీరు గొప్ప మాంత్రికులా ఏమిటి" అని అన్నది. అతనికి అన్ని చాకిరీలూ చేసేది, తలదువ్వేది, నీళ్లు పోసుకునేటప్పుడు సబ్బుపెట్టి ఒళ్లు రుద్దేది తామలపాకులు రాసియిచ్చేది.

భార్యచేసే చాకిరీలలాంటి ఈపరిచర్య చూస్తూ కామేశ్వ ర్రావు ఈబొమ్మలరాణి తన్ను సంపూర్ణముగా ప్రేమిస్తున్నదని భావించుకున్నాడు. ఆమె తన్ను ముట్టుకున్నప్పుడల్లా అతనిఒళ్లు ఝల్లుమనేది. ఆమె తనదగ్గిరగా వచ్చినప్పుడల్లా తనఒళ్లోకి తీసుకొనే వాడు. ఒకనాడు తనదృఢబాహువుల్లో ఆబాలికను అదిమిపట్టుతూ, సవసవలాడు ఆమె నునివెచ్చనిదేహమును తనదేహాన్ని పులకరించగా, బుగ్గలపై, కంఠంపై, కన్నులపై, తలపై ముద్దులవర్షం కురిపించి ఆమెపెదవులను చుంబించనారంభించినాడు. మీనాక్షిహృదయం జల్లుమన్నది. ఒళ్లు ఉప్పొంగిపోయింది. ఆమెలోని బాలికాత్వము పువ్వురేకులలా రాలిపోయింది. ఆబాలిక అతనికౌగలింతలోనే జవ్వని యగు స్త్రీ అయినది. కాని కామేశ్వర్రావుపై ఇంకనూ ప్రణయ భావ మేమాత్రమూ కలుగలేదు. స్త్రీత్వమంకురించిన నునుత్రొత్తులో పైకుబికిన మోహము ఆమెను వివశనొనరించడంవల్ల ఆమె అతని కౌగిలింతలో హత్తుకుపోయింది.

ఆమహాతరంగం దాటిపోయింది. మీనాక్షికి మెలకువ వచ్చింది. ఆమె అతనిబాహుల్లోంచి విడిపించుకొని ఆగదిలోంచి బయటపడి తనగదిలో మంచంమీదపడి దొర్లుతూ ఎందుకో తనకే తెలియకుండా వెక్కి వెక్కి ఏడవడం ప్రారంభించింది. ఆగంభీర విషాదానికి కన్నీళ్లన్నా లేవు. ఆమెరావాకులా గజగజ వణికి పోయింది.

కామేశ్వర్రావుకు మీనాక్షి తన్ని ప్రేమిస్తోందనే గాఢ నిశ్చయం చేసుకున్నాడు. ఇంక తనకర్తవ్యం ఏమిటి? తనకు వివాహం కాలేదు. మీనాక్షితో వివాహంపనికిరాదా. వివాహం లేకపోతే మీనాక్షితో పులకరించే స్నేహమెట్లా? ఆలాంటి దివ్యమైత్రి తనఅంతరాత్మకు వ్యతిరేకమా? అది తప్పా? స్త్రీపురుషప్రణయసంబంధానికి వివాహము ముఖ్యమా? పురోహి తులచేతనూ, దొంగఆచారాలచేతనూ పుట్టబడిన ఈపెళ్లిళ్లు సత్యబద్ధమైనవా? భగవంతునికి ఇష్టమైనవినా? లేకపోతే వివాహం లేని ప్రణయం పాపభూయిష్ఠమైనదనేమాట నిజమా? ఇంతవరకూ తాను ప్రేమ అనేదేమిటో ఎరుగడు. ఏదో అలంకరించుకొని, పొం కాలు తిరిగియున్న దేహంతో, ఉన్నయువతులాతని హృదయం చెదరగొట్టేవారు. తనకు మోహావేశము కల్గినమాట నిజమే. అంత మాత్రమే. నిజమైన ప్రేమకూడా మోహావేశం ఉన్నది. ప్రణయం కూడా శారీరప్రేమరహితమై అదోరకపు విచిత్రమైన ఉత్కృష్ట ఆశయభావమన్నా తాను నమ్మడు. భగవంతునిమీద ప్రేమా, దేశం మీదప్రేమాకూడా దేహసంబంధం కోరుతున్నాయే!

ఈవిచిత్రసంఘటన గుంటూరులో పురవిశ్రాంతిభవనంలో జరిగింది. సీతారామయ్యగార్కి, వీరయ్యకూ, కామేశ్వర్రావు హృద యం కీనీడగా, చూచాయగా గోచరించింది. వాళ్లిద్దరూ భయపడి పోయారు. అప్పటినుంచీ ఒకరికొకరు సంప్రదించుకోకపోయినా కామేశ్వర్రావూ మీనాక్షీ, ఏకాంతంగా ఉండకుండా ఉండేటట్లూ వాళ్లు చూస్తూఉండేవాళ్లు. వీరయ్యకు తాను చేయవలసిన కర్తవ్యము గోచరించలేదు.

పులిమీద పుట్రఅన్నట్లు కొందరు ధనవంతులు ఒకరిద్దరు జమీందారులు వ్యంగ్యపుమాటలతో మీనాక్షిని తమతో ఒకటిరెండు రాత్రిళ్లు, ఇంకా ఎక్కువగాగాని గడిపేటట్లుచేస్తే పదివేల దాకా కూడ బహుమతులిస్తామని కబుర్లు పంపించారు. వీరయ్య మండి పోయాడు. లోలోన క్రుంగిపోయాడు. ఈసంగతి కామేశ్వరరావుకు తెలియదు.

వీరయ్య సీతారామయ్యగారితో ఆవ్యాపారం మనవిచేసుకున్నాడు. ఆయన తెల్లపోయినాడు.

సీతా—ఈప్రపంచకములో ఇదో పెద్ద దురన్యాయమోయి! ఎయుత్కృష్టవిద్య నేర్చుకున్నా దెయ్యంనీడలా వెంటపడుతూ వుంటుంది, ఈదురదృష్టము. నాటకాల్లో వేషాలువేసేవాళ్లు, సంగీత పాటకులు, గొప్పవాళ్లయిళ్లల్లో ఉన్న స్త్రీలమోహబాణాలకు గురా? ఆడవాళ్లువస్తే మగవాళ్లు కుంకలైపోవడమా? ఛీ! ఛీ!!

వీర—ఏమిటండి, ఇప్పు డుపాయం? నాకు మతిపోతోఉంది.

సీతా—నావల్లే ఈదిక్కు వచ్చిందని అనుకుంటానోయ్!

వీర—మాకులంలోవాణ్ణి ఇట్టాంటప్పుడు మాఅమ్మిణికెళ్లి చేసుకుంటదా సామీ!

సీతా—అదీ నిజమేనోయ్!

విఠలుడు—మీరు మాఅమ్మిణితో కదిలేస్తురూ సామీ. మాకు దానిదగ్గిరికి వెళ్లడమే భయంగా ఉండది.

## మూడవ భాగం

## ౧

కామేశ్వరరావు జట్టునంతా చెన్నపట్టణం తీసుకెళ్లినాడు. అది ౧౯౫౨-వ సం. డిశెంబరునెల. అడయారులో దివ్యజ్ఞానసమాజముయొక్క షష్టిపూర్తి మహోత్సవము అఖండవైభవంతో జరుగుతూఉన్నది. దేశదేశాలనుంచి సభికులు ప్రతినిధులుగా వచ్చారు. వేలకువేలు సామాజికులు, కానివాళ్లు కూడా, ఉత్సవాలు చూచి ఆనందించడానికి వస్తూఉన్నారు. ఒకవైపు మహామఱ్ఱి వృక్షంక్రింద సభలు. ఒకవైపు చిత్రకళాప్రదర్శనం. ఇంకోచోట బౌద్ధ, పారశీక, క్రైస్తవ, జైన, మహమ్మదీయ, యూదు, హిందూ మతాదుల ప్రార్థనలు. అఖండకోలాహలంగా ఉన్నది.

డాక్టరు జేమ్సు. హెచ్. కజిన్సుపండితుడు భారతీయకళావైభవసముద్రములో మునిగి, ఆనందరసావశ్యుడైపోతూఉంటాడు. భారతీయకళాద్భుతానికి దూరంగా ఉన్న భారతీయమహాశయులకున్నూ, ఇతరదేశీయులకున్నూ ఆకళలలో ఉన్న ఉత్కృష్టత వెల్లడించడానికి సంకల్పించుకొన్నాడామహానుభావుడు.

ఆయన ఆ ఉత్సవాలకు జావానుంచి ఒకతోలుబొమ్మలవాళ్ల జట్టు, వీధినాటకంవాళ్ల జట్టు రప్పించి ప్రదర్శనాలు ఇప్పించ్చాడు. ఆప్రదర్శనాలన్ని కామేశ్వరరావు మీనాక్షివాళ్లతోపాటు పారకించినాడు. ఆశ్చర్యపూరితుడైనాడు. అతని భావాలు ఆకాశవీథుల పరువులెత్తినవి.

ఆమరునాడు కామేశ్వరరావు కొందరిస్నేహితులసహాయంతో కజిన్సుగారిని కలుసుకున్నాడు.

కామే—జావాతోలుబొమ్మలాట చూచానండి. ఆ ఆట ఆంధ్రదేశంనించే వెళ్లిందని నాఊహ.

కజిన్సు—కావచ్చును. ఈరెండుదేశాలల్లో ప్రదర్శనాలకు చాలా సంబంధం ఉన్నమాటనిజమే.

కామే—ఈఆటలో నాటకం, నాట్యం, సంగీతం, చిత్రలేఖనము, కవిత్వము, భాష మొదలైనకళలన్నీ దివ్యంగా కలిసి ఉన్నాయండి.

కజిన్సు—జావాఆటలో కొన్నిదోషాలు వచ్చాయి, ఆంధ్రదేశంలోని ఆటలో కొన్నిదోషాలు ఆవరించాయి. కళ రానురాను హీనస్థితికి వచ్చింది.

కామే—మానవునిలోఉన్న పశుత్వం (Atavism) ప్రతి వ్యక్తిజీవితంలోను ఒకసారి వచ్చునట్లుగానే ఒకసంఘజీవితంలో కూడా అప్పుడప్పుడు వస్తుందిగాదండి.

కజిన్సు—నువ్వు సరిగా చెప్పావయ్యా! ప్రేక్షకలోకం యొక్క హృదయస్థితినిబట్టి ప్రదర్శనరీతిన్ని మారుతూఉంటుంది. సంఘకళారసజ్ఞత అధోలోకంలోకి పడిపోతూ ఉన్నప్పుడు ఆపతనాన్ని ఆపుచేసి నిలబెట్టే బాధ్యత ప్రభుత్వంవారిపైనా, కళాస్రష్టలపైనా, జమీందారులపైనా, ధనికులపైనా ఉన్నది.

కామే—అవునండి. ఈ తోలుబొమ్మల్లోని ఉత్కృష్టత మరిచిపోయి ఉత్తములు విముఖులవడంచేత పాటకజనులు కోసం గంధోళిగాడు, కేతిగాడు, అల్లాటప్పగాడు తెరమీద విజృంభించారు. కాని జాగ్రత్తగా చూస్తే పెద్దపెద్దపాత్రలకు గంభీరమైన అభినయం చిన్నపాత్రలకు వారికితగిన నటన మాచిత్రంగా ఉంటుందండి. రాముచంద్రుడు చెయ్యిమాత్రం కదుపుతాడు. లక్ష్మణుడు తలకూడా తిప్పుతాడు. ఆంజనేయులు మొదలైనవాళ్లు దేహమంతా కదుపుతూ అభినయం చేస్తారు. రాక్షసులు గడబిడదడబిడగా బల్లలచప్పుడు, బూరాలమోతలతో నీడల్లావచ్చి, రూపంపొంది, మళ్లీ పొగలా,అయి మాయమవుతారు. తమ రాశీర్వదిస్తే ఉదయశంకరుడు నాట్యకళను పునరుద్ధరించినట్లున్ను, రవీంద్రుడు నాటకకళను కొత్తపద్ధతిగ తిరిగి జీవంపోసినట్లున్ను, ఈతోలుబొమ్మలాటకూడా మార్చి ఉత్తమహృదయులు మెచ్చుకునేటట్లు చేద్దామని ఉందండి.

కజిన్సు—మీభావం, ఆశయం చాలాబావున్నాయి. నాకు చేతనయినంత సహాయం చేస్తాను.

## ౨

భారతీయ సంప్రదాయమైన చిత్రలేఖనము నేర్చుకుని ప్రసిద్ధి కెక్కిన ఒకఆంధ్రచిత్రకారకుని కామేశ్వర్రావు చేరదీశాడు.

వీరయ్యతో, విశలుడుతోనున్ను చాలారోజులు తర్జనభర్జన చేశాడు. తోలుబొమ్మలాట విద్యలో తాను గొప్పమార్పులు తీసుకొస్తాననిన్ని, అందువల్ల లోకప్రఖ్యాతిన్ని, మిక్కుటమగు ధనమున్ను వీరయ్యకు చేకూరుతాయని కామేశ్వర్రావు వాళ్లకి నచ్చచెప్పాడు.

అప్పుచేసి ఒక అయిదువందల రూపాయలు ఖర్చుపెట్టి విజృంభించి పోతూఉన్నటువంటిన్ని, పురాతన భారతీయ సంప్రదాయాలైన అజంతా మొగలు, రాజపుత్రపద్ధతులలో జపాను టిబెట్టు,పారశీక, పాశ్చాత్యసంప్రదాయాలు సమ్మిళితంచేసి నూతనంగా వచ్చే "వ్యంజ" (Impressionism) "కోణ" (Cubism) మొదలైన రీతులను ఇముడ్చుకుంటూ, కొత్తరీతులు కల్పించుకుంటూ, ఉద్భవించిన నూతనభారతీయ చిత్రలేఖనసంప్రదాయప్రకారంగా రామాయణ భారతకథలకు, భాగవతంలో శ్రీకృష్ణునికథకు సంధ్యాతాండవం మొదలైన శివగాథలకు సరిపడేచిత్రాలు వీరయ్యచేత ఆ ఆంధ్రచిత్రకారకుని సలహాతో కామేశ్వరరావు తయారు చేయించాడు.

ఉదయశంకరుడు తననాట్యానికి ఉపయోగిస్తూఉన్న సంగీతపు హంగుపద్ధతిని కామేశ్వరుడు అవలంబించి గొట్టు, వీణ, వాయులీన (Violin), మహావాయులీన (Violincella), తంబూరా, చితారు, ఇస్రాజ్ మొదలైన వాద్యవిశేషాల్ని వాయించేవాళ్లను పోగుచేశాడు.

వీరయ్యజట్టు మైసూరురాష్ట్రంలో తిరిగేటప్పుడు కన్నడంలో తోలుబొమ్మకథ చెప్పేవారు. వాళ్లు రాయలసీమవాస్తవ్యులు. కాబట్టి ఈకొత్తపద్ధతిని కన్నడంలోనూ, తెలుగులోనూ చెప్పేటట్లు కామేశ్వర్రావు యేర్పాటుచేశాడు.

## ౩

ఈనూతనసంప్రదాయపు తోలుబొమ్మలాట ప్రథమాన్ని అడయారులో శ్రీడాక్టరు కజిన్సు మొదలగు సహృదయులయెదుల, ఓరాత్రి ఎనిమిదిగంటలకు ప్రారంభించి ఆడింపించాడు కామేశ్వరుడు. ఆట పన్నెండుగంటలకు పూర్తిఅయినది.

రంగంలో ఉండవలసిన చిత్రాలమీదే వెలుగుపడుతుంది. ఉండనక్కరలేని బొమ్మలు తెరమీదలేవు. అభినయంనృత్యం రసము ఉట్టిపడుతున్నవి. సంభాషణ చక్కనినుడికారం, తేనెగడులుకట్టే తెనుగు.

హంగుచేసే సంగీతం విచిత్రము. ఉత్కృష్టపాత్రలు కర్ణాటక సంప్రదాయంగానున్ను, ఇతరపాత్రలు యేలపాటల పద్ధతిగానున్ను పాటలూ, పద్యాలు గానంచేసినారు. మహారాజు వస్తూఉన్నప్పుడు ఒకవిధమైన సమ్మేళనగానం. మహాఋషి వస్తూఉన్నప్పుడు వినిపించిన సమ్మేళనగానం వేరు. మొదటిది ప్రాపంచికాద్భుతం సూచిస్తున్నది. ఇయ్యది పారలౌకిక భావరసాలు ఉట్టిపడజేస్తున్నది.

అందరూ నిస్సబ్దులై చూశారు.

మీనాక్షి ఇంతపెద్దకళ్లు చేసుకుని కథఅంతా గమనించింది. ఆమె పేరుపొందిన సంగీతవిద్వాంసురాల నన్న భావంతో తాను జట్టులో పాలుపుచ్చుకోలేదు. కామేశ్వరరావు అందుకని ఆమెను ప్రార్థించనూలేదు.

తాను బొమ్మలరాణి. ఇంత చిన్నప్పుడు తాను గొంతుక ఎత్తడం ప్రారంభించినప్పటినుంచిన్నీ జట్టువాళ్లూ, పల్లెటూళ్లలో ఇతర్లూ తన్ను ఎంతో ఆదరించేవాళ్లు. తాతగారికీ, తండ్రికీ గారాబుబిడ్డ ఆలాంటి తనహృదయానికి తన రాజ్యానికి మించిపోయిన మహారాజ్యం ఓటి తనకు ప్రత్యక్షమైంది. ఆమె మనస్సు ఓవిధమైన వాంఛామేఘంలో అలమబడిపోయింది. అన్నీ సుళ్లు చుట్టిపోయే ఆలోచనలే. ఇంతలో భయం.

తాను సంగీతంలో సేలం గోదావరిలా, బెంగుళూరి నాగిరత్నంలా పేరు సంపాదించుకోవచ్చును. అది ఆఖరు కాదుకదా ఈవాళనుంచి? కామేశ్వరరావు మళ్లీ తోలుబొమ్మలాట మొదలుపెట్టించాడేమి? ఎంతబాగున్నా తోలుబొమ్మలాట మళ్లీ వద్దు.

ఆమెకు గాడిదపెంటవాసనా, ఏళ్లఏళ్లకు చెమటలో తడి ఆరిపోయిన భయంకరమైనంభండాలపు మురికిగుడ్డలవాసన మళ్లీ కొట్టినవి. ఒళ్లుజలపరించింది. కళ్లనీళ్లు తిరిగినవి. ఆ నరకంలోంచి రక్షించిన దైవసమానులు సీతారామయ్యగారు, కామేశ్వరరావుగారు. వాళ్లు మళ్లీ అధోలోకంలోకి తన్ను తోసివెయ్యరుకదా! అమ్మయ్యో.

ప్రదర్శనం అయినమర్నాడునుంచి కామేశ్వరరావును చూడ్డానికి ఆమెకు భయంవేసింది. ఒకనాడు కామేశ్వరరావు ఆమెదగ్గిరకు వచ్చాడు.

ఆమె మంచంపై పడుకొని మెత్తని దిండులోకి మొహం దూర్చి తలఎత్తకుండా పడుకుంది. కామేశ్వరరావు గదితలుపు చేరవేసాడు. ఆబాలిక దేహసౌభాగ్యకాంతులు ఆనందరేఖల వంపులుపోతూ, ఆసన్నని తెల్లపట్టుచీరలోంచి ప్రతిఫలిస్తున్నవి. ఆమె యౌవనము పూర్ణతదాల్చి ఆమెసౌందర్యానికి యింకా వన్నె తెచ్చింది. కామేశ్వరునిహృదయము వెర్రిఆశలలో మత్తమునిగింది. ప్రేమపూర్ణతచే ఆతడు తూలుతూపోయి మంచంపై పడుకుని ఉన్న మీనాక్షిపై సుందరేశ్వరునిలా వాలాడు. ఆమెను తనబాహు

వుల్లోకి మింగివేసుకొన్నాడు. ఆమె కర్కశత్వముదాల్చి ఆతని బాహువుల్లో కట్టెవలె బిగుసుకొనిపోయింది.

కామేశ్వరరావు ఆశ్చర్యపడి

"మీనా! నేనంటే నీకాపేక్ష లేదా?" అన్నాడు.

"........................."

"ఈమూడేళ్లనించి నాహృదయంలో ఒకదేవాలయం కట్టుకుని అందులో నిన్నధిష్ఠించి పూజచేస్తున్నాను. ఆరోజున మా ఊళ్లో బొమ్మలాటలో నీగొంతుక విన్నప్పటినుంచీ..."

కామేశ్వరరావు తనకౌగలింతలోంచి ఆమెను వదలి ప్రక్కను కూర్చున్నాడు.

"ఆనందంలేని నాజన్మకు ఆనందం ఇచ్చావు, మీనూ! నీ ప్రేమఅనే అమృతంతో నన్ను దివ్యుణ్ణి చేశావు."

మీనాక్షి లేచి కూర్చుంది.

"ఈ కొత్తబొమ్మలాటలోకి నన్ను దింపుతారా యేమిటి నాయకుడుగారు?"

"మీనూ, మీనూ! నాకుటుంబం యావత్తూ వదిలివేసా. నా తల్లినీ, వాళ్లనూచూసి యేడాదయింది. నీదాసానుదాసుణ్ణి. నా ఈ జన్మ భయంకరమైన వట్టి యెడారిచేసినా, పరమ పవిత్రాలైన హిమాలయభూములు చేసినా నీచేతిలోనే ఉంది."

కామేశ్వరరావు మంచముదిగి ఆమె పాదాలకడ మోకరిల్లి ఆమెవళ్లో తలపెట్టుకుని ఆమె నడుంచుట్టు తన రెండుచేతులూ చుట్టి "నాజన్మం పవిత్రంచేసిన దేవిని ఉద్భవించుకున్న నాకు కృపవరము దొరకదా?" అని అన్నాడు.

మీనాక్షిదృగంచలాలనుంచి వేడిచుక్కలు కామేశ్వరరావు తలపై పడ్డాయి.

"మీరు అద్భుతమైనటువంటి నూతన ప్రపంచంలోకి తీసుకు వచ్చినారు నన్ను. గడ్డిపోచను దవనపుమొక్కను చేశారు. నా చర్మం నీకాళ్లకు జోళ్లు కుట్టిఇచ్చినా నాబాకీ తీర్చుకోలేను."

"ఒట్టి బాకీయేనా?"

కామేశ్వరరావు చటుక్కున లేచి ఆమెబుజాలమీద తన రెండుచేతులూ వేసి ఆమెవేపుకు దీనంగా చూస్తూ ప్రశ్నించాడు. ఇంతలో తలుపుతోసుకొని వీరయ్య, కామేశ్వరరావు మేనమామ, సీతారామయ్యగారు లోపలికి వచ్చారు. కామేశ్వరరావు నిర్ఘాంతం. మేనమామ అతికోపకంఠంతో

"యేమిరా, కాముడూ! చదువుకున్నందుకు ఇదేనా యేంటి? కులం తగలేస్తున్నావు. కుటుంబం తగలేస్తున్నావు. మా అప్ప కుళ్లికుళ్లి మంచంపట్టింది. మేంపదిమందిలో తలయెత్తుకుని తిరగ లేకుండా ఉన్నాం. అప్పులుచేసేసి తమ్ముణ్ణీ నిన్నూకూడా తగలేసుకుంటున్నావ్. నీకొచ్చిన సమ్మంధాలవాళ్లకి జవాబులుచెప్ప లేకుండా సచ్చిపోతున్నాం. అనంతపురం డిప్యూటీకలక్టరుగారు పిల్లనిస్తామని నాతోకూడావచ్చారు. ఆయన పెద్దవటలులో ఉన్నారు. రా, అక్కడికిపోదాం. నీమూటాముల్లీ సద్దుకో. మనం బీంవారం వెళ్లిపోదాం లెగు."

సీతా—నాయనా! వీరయ్య తనగొడవ తను చూసుకుంటాను. ఆతనిపై దయఉంచి ఇహ వదిలెయ్యిమంటున్నాడు. నీధర్మం నువ్వు ఆలోచించుకో.

వీర—కామేశ్వర్రావుబాబుగారూ! మీరు మాకుచేసిన ఉపకారానికి మేం యెన్నిజన్మాలెత్తి మీకు సేవజేసినా కృతజ్ఞత తీర్చుకోలేమండి,మాతమ్ముడి కూతురుకొడుక్కిసామీ మాఅమ్మణ్ణిని ఇవ్వడానికి సమ్మందం యేర్పాటుచేసినా. మేంఅంతా ఒరంగలెడుతుండము.

కామేశ్వరరావు తుపాకులయెదుట సింహంలా చుట్టూ తేరిపారచూశాడు. మాట జవాబుచెప్పకుండా అతికోపస్వరూపంతో మూడుఅంగల్లో గుమ్మందాటి విసవిసవెడలి మాయమయ్యాడు.

## ౪

ఆనాటిసాయంత్రము మీనాక్షి మాయమయింది.

రెండురోజులైనవెనక బెంగుళూరులో మీనాక్షి, కామేశ్వరరావులకు వివాహం అయిందని పత్రికల్లో ప్రచురణం అయింది. చెన్నపట్నంలో బెంగలుపెట్టుకుని తిండిమానేసుకున్న వీరయ్య జట్టుకుసీతారామయ్యగారు నెమ్మదిగా ఈవార్త వినిపించాడు. విఠలుడుమోము ప్రఫుల్లమైంది. వీరయ్య విషాదంతోనూ, కోపంతోనూ కూలబడిపోయాడు.

ఈవార్తవిని కామేశ్వరరావు మేనమామ మహాగ్రహంతో కామేశ్వరరావుని బండబూతులు తిట్టుకున్నాడు.

సీతారామయ్యగారు కామేశ్వరరావుమేనమామ భీమవరం తిరిగి వెళ్లిపోయారు.

కొత్తతోలుబొమ్మలాటలో పాలుపుచ్చుకునే సంగీతపుహంగుదార్లను యెక్కడికీ కదలకుండా ఉండవలసిందని చెప్పివెళ్లాడట కామేశ్వరుడు.

తామిద్దరమూ వస్తున్నామని వీరయ్యకు కామేశ్వరరావు తంతినిచ్చాడు.

* * * * * *

వికసించిన గులాబిపువ్వుమోముతో మీనాక్షీదేవి తాతగారి దగ్గఱకువచ్చి నమస్కారం చేసింది. ఆమెపెదవులు చిరునవ్వు నవ్వు

తున్నవి. ఆమెకళ్లు చిరుభయంతో బెదరుతున్నవి. ఆమెఫాలంలో ముంగురులు చిరుగాలిలో చెదరుతున్నవి. ఆమె వాక్కులు చిరు కంపంతో తొణుకులాడినవి.

"నీమొహం చూడకూడదు, అమ్మిణీ!"

"........."

"నువ్వెంత పాపం చేశావో నీకు తెలుస్తుదా?"

"........."

"నీకు పుట్టినకొడుక్కి నాపేరు పెట్టుకోకు."

"తాతయ్యా, నీకు దణ్ణం పెడదామని అవతల నుంచుని ఉన్నారు."

"కామేశ్వరరావుగారు ఒకదేవుడు."

* * * * * *

కొత్తపద్ధతిలో అద్భుతమైనటువంటి అజినచిత్రనాటకప్రదర్శనం మ్యూజియమ్ నాటకప్రదర్శనశాలలో జరుగునని చెన్నపట్నంలోని పత్రికలన్నీ ప్రచురించాయి. ఆప్రదర్శనంలో బొమ్మలరాణి మీనాక్షీదేవికూడా పాలుపుచ్చుకుంటుందనిన్నీ, ఇంత విచిత్రమగు ప్రదర్శనం భరతదేశంలో ఇదివరకు చూపింపబడలేదనిన్నీ, ఈ ప్రదర్శన సూత్రధారుడైన కామేశ్వరరావుగారు యెంతయూ అభినందింపబడ తగినవాడనిన్నీ మొదలైన సంగతులతో జట్టులో పాల్గొనేవాళ్ల ఛాయాచిత్రాలతో పత్రికలు వ్యాసాలు ప్రకటించినవి. ప్రదర్శనము శ్రీగవర్నరుగారి అధ్యక్షతను జరుగుతుందట.

* * * *

ఆప్రదర్శనం చూచినవాళ్లంతా సంతోషంతో విస్తుపోయినారు. ప్రదర్శనానికి పదకొండువందలరూపాయిల టిక్కట్లమ్మబడినవి.

నాటకంలో ఉన్న అందం, సినీమా, టాకీలోఉన్న అందం, చిత్రకళా ప్రదర్శనంలో ఉన్న అందం కలవేసి ఈనవీనపద్ధతి చూరకొన్నదని పండితులు వ్యాసాలు వ్రాశారు.

* * * * * *

ఓనాడు ఉదయాన్ని మోటారునుంచి కామేశ్వరరావు భార్యతో భీమవరంలో తనఇంటిదగ్గర దిగినాడు.

బెంగచే కృశించి తల్లి మంచముపట్టి ఉన్నది. ఇంతలో మెరుపుతీగలాంటి ఒక బాలిక ఆమె పాదాలకడ వ్రాలి, పాదాలపై తలఉంచి, పాదాలు పట్టుకున్నది. కామేశ్వరరావుతల్లి నెమ్మదిగా లేచి, "యెవరమ్మా నువ్వు?" అని బాలిక తలపట్టుకొని యెత్తి మోము తేరిపారచూచింది.

"నువ్వెవరు, తల్లీ?"

ఆబాలిక కన్నుల జలజల బిందులు రాలిపోతున్నవి.

"నువ్వు దేవతాకన్నెవు కాదుగదా?"

వర్షం కురుస్తూన్నపుడు వచ్చే వెన్నెలలా ఆబాలిక పెదవులు నవ్వాయి.

కామేశ్వరరావు తల్లి, "నాబంగారుతల్లీ, నువ్వెవరో తెలియ లేదు నాకు" అని ఆబాలికని దగ్గరకు లాగుకొని హృదయానికి అదుముకున్నది.

ఇంతలో కామేశ్వరరావు గుమ్మముకడ నిలుచుని వున్నాడు.

"అమ్మా! మీఆజ్ఞ లేకుండా సంచరించిన ఈ అధముణ్ణి క్షమించి మాఇద్దర్నీ దీవించవూ?"

ఆనిడకు హృదయంపొంగింది.

"నాయనా! ఈదేవకన్నే నా నాకోడలు? బొమ్మలాటవాళ్ల పిల్లంటే యీనాదుల అమ్మాయిలా ఉంటుందనుకున్నాను. ఈమె శాపంచేతపుట్టిన ఇంద్రుడి కూతురురా."

కామేశ్వరరావు, మీనాక్షీ ఆమెపాదాలకడ మోకరిల్లారు. ఆతల్లి కొడుకూ,కోడళ్ల తలలమీద రెండుచేతులూ ఉంచి తలయెత్తి, "శ్రీరాములూ, వీళ్లిద్దర్నీ రక్షించు!" అన్నది.



శరీరసౌష్ఠవము ౧.  K. R. R.



శరీరసౌష్ఠవము ౨.                K. R. R.

అపరధన్వంతరి

వైద్యరత్న పండిత డి. గోపాలాచార్యులవారి

# జీవామృతము

భారతభాగ్యమగు ననేక అమూల్య ఓషధులతో తయారుకాబడు నీ జీవామృతము అను బలవర్ధకౌషధము 1898 సంవత్సరమునుండి చిన్నలు, పెద్దలు అనుభేదము లేకుండా లక్షలకొలది జనులు దీనిని సేవించి దీనియొక్క మహిమ తెలిసికొని యున్నారు. నేడే సేవించుట ఆరంభింపుడు.

జీ వా మృ త ము

కండపుష్టి, శరీరబలము, ఉత్సాహము కలుగజేయును ఆబాలగోపాలమునకు అత్యుత్తమమైన రసాయనము.

❀

జీ వా మృ త ము

చిరకాల మేదేని దీర్ఘవ్యాధికి గురియై మిక్కిలిగ క్షీణించిన వారికి సంపూర్ణ ఆరోగ్యమును పునః ప్రతిష్ఠింపగల ప్రాణదాత.

❀

జీ వా మృ త ము

ఎంతటి బలవంతులైన శీఘ్రకాలములో దుర్బలస్థితికి తేగల శుక్లనష్టవ్యాధిని హరింపజేసి శరీరపుష్టిని కాపాడగల సుధారసము.

❀

జీ వా మృ త ము

మెదడు నుపయోగించి జీవయాత్ర గడుపవలసిన వారికి పెన్నిధి.

జీ వా మృ త ము

పనివత్తిడిచే అతి చికాకు పడెడి దుర్బలదేహులకు ఉత్సాహమును కలిగించెడు అమృతము.

❀

జీ వా మృ త ము

ఆరోగ్యవంతులు, బలిష్ఠులునగు సత్సంతానమును బడయజేయు పరమ హంసక్రియ.

❀

జీ వా మృ త ము

నిద్రావిహీనులను అతి శీఘ్రముగా సుఖనిద్రదేల్చి స్వప్నపథమునకు గొంపోవు అమృతవాహిని.

❀

జీ వా మృ త ము

మనశ్శరీర సామ్రాజ్య పట్టభద్రత వహింప నుత్సాహమును పురిగొల్పు సౌఖ్యప్రదాయిని




అన్ని చోట్లను దొరుకును

**ఆయుర్వేదాశ్రమము, పోస్టు బాక్సు 287 మదరాసు.**



శరీరసౌష్ఠవము 3. K. R. R.



# ఊరిబడి

వేలూరి శివరామశాస్త్రి

## ౧

### తెలవాఱుజాము

వారకాంతలు నృత్యగీతవాద్యములతో మేజువాణి చేయు సమయమున తిరుమలాచార్యులు శ్రీ సంపాదించుటకు వడివడిగా బడికిఁ బరుగిడెను. రెడ్డిగారి అరుఁగుమీఁద బడి.

అతఁ డరుఁగెక్కి చూచెను. చీకటిలో నేమియు నతనికి కనఁబడలేదు. అతఁడు గోడలు తడిమిచూచెను. ఎవరును లేరు. శ్రీ యంతయు తనకే యిజారా అయినటు లతఁడు సంతసించెను. రెడ్డిగారికొడుకునుపిలిచెను. ఎవరును పలుకకుండుటచే అతఁడు కూరుచుండెను. శ్రీమదము నెత్తికెక్కినటు లతనికి కునికిపాటులు వచ్చెను. నిద్రాదేవత అతనిని భూశయనము చేయించెను.

ఊరిచివరనున్న యొక యింటిలో జనార్దనము ఉలికిపడి లేచెను. చీకటులు పాఱిపోవుచు వెనుదిరిగి చూచుచున్నటు లుండెను. జనార్దనము శ్రీసంపాదించుకొనుటకు ఇంతకచ్చికను బలపముల సంచిలో నించుకొని నీరు సిరాబుడ్డిలో పోసికొని బడికిఁ బరువెత్తెను. కాని తన శ్రీ యంతయు దోఁచుకొని యొకఁడచటఁ బరుండియుండెను.

జనార్దనమునకు ఒడలు మండిపోయెను. జనార్దనము కాలు తిరుమలాచార్యులమీఁద మూరెఁడెత్తు లేచి ఆఁగిపోయెను. అపు డతనికి ధర్మయుద్ధము చేయవలయునని సద్బుద్ధి పుట్టెను. ఎత్తినకాలు దించి జనార్దనము పలుదోమికొనుచుఁ గూరుచుండెను.

పలుదోముకొను సమయము ఆలోచనలకు పుట్టినిల్లుగదా! అతనికి అనేక-ఆలోచనలు కలిగెను. అతఁ డాయాలోచనతో క్రిందట్టుమీఁదట్టయి యిట్టనుకొనెను. 'తిరుమలిగాణ్ణి తన్నఁగూడదు; యుక్తి పన్ని వీఁడి శ్రీ లూటీచెయ్యాలి.'

జనార్దనము కుఱ్ఱఁ డయినను మెచ్చుకొనఁదగినవాఁడు. ఏలయనఁగా సర్కారువారి పశుబలప్రదర్శనముకంటె ప్లీడర్ల బుద్ధిబలప్రదర్శనమునే యతఁడు స్వీకరించెను. ఆ బుద్ధిబలప్రదర్శనమును ముందు దర్శింతముగాక!

అంతట రంగమ్మ రోఁజుకొనుచు బడికి వచ్చెను. రెండుదయ్యాము లాబాలిక కచటఁ గనఁబడెను. అంత నాబాలిక తనయవ్వ ముద్దునకుఁగాను తనకు నేర్పిన కొన్ని సుశ్లోకములను ఆ యవ్వమీఁదనే రువ్వి కూలఁబడెను.

జనార్ధనము దడదడగా సిరాబుడ్డితో ముఖము కడిగికొని వచ్చి—'రంగీ! నిన్న అటుకులు పెట్టలేదు కాదూ, చూస్కో ఇవ్వాళ నీ చెయ్యి ఎల్లా పేలకొట తానో. నాది శ్రీ. ఆపడకమోతుది చుక్క. నీది దెబ్బ. కాస్కో' అనెను.

దెబ్బలుకొట్టు అధికారము ముందరగా వచ్చిన వానిది. జనార్ధనము బాలురను మర్దించుటకు సర్దారు. అట్టి జనార్ధన మిట్లు లనఁగనే రంగమ్మగుండెలు గుభేలు మనెను. ఆబాలిక అపు డేడ్వవలసిన యే డ్పిపుడేయేడ్చి 'నేనిహ బడి మానేస్తాను' అని యింటిదారి పట్టెను.

జనార్ధన మిటు లనెను—'పోనీ కొట్టనులే. నాదే శ్రీ అని పంతులుగారితో చెపుతావా?'

రంగమ్మ రయిన వెనుదిరిగి యిటు లనెను—'శ్రీ నీది కాదా యేమిటి?'



"శ్రీ నీది కాదా యేమిటి ?"

జనార్ధనము రంగమ్మను తన అంతరంగకోటిలో చేర్చుకొని ఉన్న దున్నటులు చెప్పి — 'నీవు నాదే శ్రీ అని చెప్పు! ఆలా చెపితే ఈవేళే కాకుండా ఎప్ప టికీ బెత్తం ఏత్తుగా ఎత్తి నీ చేతిమీఁద మెల్లింగా ఆనిస్తూ ఉంటాను' అనెను.

'నిజంగా?'

'నిజంగా.'

'భేష్ భేష్ అల్లాగే. నీదే శ్రీఅని చెపుతాను.

అంతట బాలు రొక రొకరే రాఁదొడఁగిరి. రంగమ్మ వచ్చిన ప్రతిబాలుని కడకును వెళ్లి జనార్ధన ముది; శ్రీ తిరుమలయ్యది చుక్క; నాది దెబ్బ అని చెప్పి తన సాక్ష్యమును వల్లించుకొనుచుండెను.

బాలు రందఱును వర్ణసాంకర్యము లేకుండ కలిసి దండించుచుఁ గూరుచుండిరి. జనార్ధనము పలకమీఁద ఇటులు వ్రాయుచుఁ గూరుచుండెను:—

'జనార్ధనము—శ్రీ

తిరుమలాయి—చుక్క

రంగమ్మ—దెబ్బ

ఉళక్కి—రెండు . . . . . .'

ఇటులు క్రమక్రమముగా ఆపలక నిండుచు వచ్చెను.

## ౨

### ప్రాతఃకాలము

కరకర ప్రొద్దు పొడిచెను. కర్మసాక్షి సాక్షిగా రావులపాటి రాజయ్య పంతులుగారు చెఱువుకట్టమీఁదఁ గూరుచుండి మూరెఁడుపుల్ల



"చెరువుకట్టమీఁదఁ.......నోటఁబెట్టుకొని"

నోటఁ బెట్టుకొని జేనెఁడుచేసి అయిదాఱు చెంబులతో ముఖమండలమునకుఁ జేయవలసిన సత్కారము చేసిరి.

ఒడ్డున నున్న యొకదొడ్డిలోనికిఁ జని ప్రొయిలో నున్న విలువలేని యొకపదార్థముచే తమ ముఖమునకు విలువ కలిగించుకొనిరి. తూరుపుగా తిరిగి చేతులు దగ్గఱకుఁ దెచ్చి సూర్యుని ప్రార్థించిరి. పిమ్మట గజగమనముతో బడికి బయలు దేఱిరి.

తిరుమలాచార్యులు తన చేతిలోని పలకను లాగి కొని చెతిపివేయుటచే పశుబల ప్రదర్శనము కూడదను కొనిన జనార్దనము చేతులే కాక దంతములుగూడ ఉప యోగింపవలసి వచ్చెను. జనార్దన ముపయోగించిన ఆయుధములే కాక తిరుమలాచార్యులు కలములను పల కలను ఉపయోగింపవలసి వచ్చెను. రంగమ్మ జనార్దన మునకు బాసటయై చేతికందిన దస్తరము లందిచ్చుచు పడెయ్ పడెయ్ అనుచుండెను. బడి యంతయు రెండు తెగలుగా చీలి వారి యిరువురకును జయనాదము లుగ్గ డించుచుండెను. ఇటు లాపాఠశాల యంతయు సంతవలె నుండెను.

పంతులుగారు మెల్లగా వచ్చి ఖర్జూరపు ఆకుల చాఁపమీఁదఁ గూరుచుండి గోళాకారములయిన ఎఱ్ఱని గ్రుడ్లనొకతూరి అటుత్రిప్పఁగనే ఆసంతయంతయు పుంత యై పోయెను. పంతులుగారిచూపు బడిలోని బాలురకే కాక ఊరిపెదలకుఁగూడ—'కాంతః క్రతు శ్చాక్షుషః.'

లా, ఆర్డరులు చక్కఁబడఁగానే బడిపెద్ద యగు ఎల్లమంద—

'సరస్వతి! నమస్తుభ్యం వరదే కామరూపిణి!
విద్యారంభం కరిష్యామి సిద్ధి ర్భవతు మే సదా.'

అని యొకొక్కపాదమే చెప్పఁగా మిగిలినవా రందఱును అనువదించిరి.

రాజభక్తికీర్తన లప్పటి కెవరును కనిపట్టి యుండ లేదు. గురుభక్తి కీర్తనలు కలవు కాని అవి గ్రంథము లందును బెత్తములందును మాత్రమే కలవు. గతిలేక వా రిటులు సరస్వతిని ధ్యానించి నిమ్మకు నీరెత్తినటులు కూరుచుండిరి.

అంతట పంతులుగారు ఉత్తరీయపు కొంగుముడి విప్పి తాటాకులసంచినుండి ముక్కద్దములు తీసి కన్ను లకు కళ్లెము తగుల్చుకొనిరి. బడియందలి పరమశాంతి వలన పంతులుగారు వచ్చిరని గ్రహించి పొరుగింటి నుండి పొన్నాడనాగయ్య మడిసంచితో వచ్చి కూరు చుండెను.

బడికి రాఁగానే రామకోటి వ్రాయుట పంతులు గారి మొదటిపని. నన్నయ్యకు నారాయణభట్టు వలె పంతులుగారికి నాగయ్య లేఖకుఁడు.

పంతులుగారి రామకోటి దస్తరము తెచ్చుట బండసుబ్బని పని. ఆబండసుబ్బఁడు గైర్‌హాజర్. పంతు లుగారు వానికొఱకు చూడఁగనే జనార్దనము చూరు లోని దస్తరము తెచ్చి నల్లనిరంగువేయఁబడిన ఆపుణ్యా మును బయటఁబెట్టెను.

అంతట నాగయ్యయు నువ్వులు పఱచినటు లున్న తన రామకోటిని విప్పెను. వా రిరువురును ఇటులు సిరాకాగితముల మితవ్యయముతో అనల్ప మగు పుణ్యశిల్పమును చేయుచుండిరి.

బాలు రందఱును మౌనముద్ర తాల్చి తమ ముఖరత్వమును హస్తపాదాదులతో నెఱవేర్చుకొను చుండిరి. జనార్దనము మెల్లగా పాఱిపోయి బుడిపెలుగల ఈఁతబరికె చేతికి దొరకించుకొనెను. తిరుమలాచార్యులు బఱ్ఱున లాగుకొనెను. (శ్రీ)ముక్కదెబ్బలకన్న వేఱ యిన దొకటి తన చేతికి అంటుకొనుటచే జనార్దము కెవ్వ మనెను.

ఆకేకచే నాగయ్య రామకోటిమీఁద అప్రయత్న ముగా రామభక్తాగ్రేసరుఁ డయిన ఆంజనేయులవారి లంకాదహనమునాఁటి తోఁక యొకటి చిత్రింపఁబడి పోయెను. రివ్వున ఝెుగ మొత్తఁగనే పంతులుగారి కళ్లెము ఫుటుక్కుమని తెగెను. బాలు రందఱును జరుగఁబోవు ప్రమాదమునకు వెంటనే జాగ్రత్తపడుటకు నిశ్చయించుకొనిరి.

పంతులుగారు మీసములలో చిక్కుకొనిన అద్దములను నేర్పుగా తీసికొనకముందే జనార్దన మిటు లనెను—'నాది (శ్రీ) అయితే తిరుమలాయిబెత్తం లాక్కుంటున్నాఁడు చూడండి.'

జనార్దనము తనను సాక్ష్యము కోరకముందే రంగమ్మ లేచి తనసాక్ష్య మప్పగించెను. పంతులు ముక్కద్దములు క్రిందఁబెట్టి— 'ఆమాట నిన్నెవ రడిగారు? ముంధు ని వ్విట్లారా' అని చూపుడ్రవే లాడించెను. రంగమ్మగుండెలు కొట్టుకొనెను. రంగమ్మనిలువఁబడినచోటనుండి ఒక యంగుళ మేని కదలలేదు. 'ర మ్మంటే రావేం' అని పంతులు కాండ్రు మనెను. రంగమ్మ బేరుమని కూర్చుండెను.

ఇట్టి ఆరాచకపు సమయములందు స్త్రీలకుఁగూడ పోలీసుఉద్యోగములు తరతరముల నుండియు హక్కుభుక్తములలో నున్నవి. కావున ఆబాలికకు దాపటను వెలుపటను ఉన్న ఇరువురు బాలికలు చట్టసమ్మతముగా రంగమ్మచట్టలక్రింద చేతులువేసి (శ్రీ)కృష్ణభగవానులు కుబ్జకుఁ జేసినపని చేసిరి. పిదప తమ హక్కులో కీసపాలేని పోఁగొట్టుకొనకుండ రంగమ్మను ముందులకు నడచునటులు చేయఁదొడఁగిరి. కాని పంతులుగారి తేజస్సు ఆనడిపించువారి శక్తికంటె దొడ్డది. అది రంగమ్మను వెనుకకు నెట్టఁజొచ్చెను. దానివలన రంగమ్మను Custody లో ఉంచుకొనినవారు వెనుకకును ప్రక్కలకును చెదరిపడుచుండిరి. ఈరీతి వానావానావల్లప్పతో వారు మువ్వురును వర్ణసాంకర్యము కలిగించి కొందఱు మఱమలమీఁదుగా రస్తావేసి నాగయ్య రామకోటి మీఁదను శరీరముమీఁదను సిరా చిమ్మి దేవుని దయ వలన తమకుమాత్రము దెబ్బ తగులకుండ నాగయ్యను శయ్యగాఁ జేసికొనిరి. ఉపాధ్యాయులవారు సాహసించి ప్రక్క అరుఁగుమీఁదికి లంఘించిరి. ఏలనఁగా వారపుడు రామకోటి మడిలో నుండిరి. మైలపడిన తరువాతఁగాని వారిని శిక్షింపవీలు లేదు.

బాలికలు తనమీఁద పడినందులకు నాగయ్య యిసుమంతయు కినియలేదు! కాని తానును రామకోటియు మైలపడుటవలన నతఁ డపు డుపయోగించిన మాటలు ఎన్నఁడును విన్నవి కావుకావున బాలు రందఱును పంతులుగా రున్నారను మాటగూడ మఱచి పొట్టలు చేతులతోఁ బట్టుకొని పకలఁబడఁగనే నాగయ్య రామకోటితో చెఱువుకుఁ బరువెత్తెను.

ఒకయపరాధమున కిటులు రెండుమూఁడుపిల్లలు పుట్టుటచే తాము మైలపడకుండ పంతులుగారు బాలికను బెదరింపఁదలఁచి ఈఁతబరికెకొనను ఎడమచేత సవరించి ఛళ్లు మనిపించిరి. బెత్తము తాఁకకముందే రంగమ్మ బావురుమని వెనుకకు విఱుచుకొనిపడి తనను పట్టుకొనినవారికిఁగూడ ఆయుత్సవమున భాగము పంచిపెట్టెను. ప్రక్కలపడిన బాలికలు రివ్వున లేచి తమబలమును ఇతోఽధికోత్సాహముతో ప్రకటింపఁగనే రంగమ్మ—'జనార్దనం తనదే (శ్రీ) అని చెప్ప మన్నాఁడండి.' అని అనెను. ఈమాటలు వినుచు జనార్దనము రంగమ్మ మీఁద నిప్పులు కురిపించెను.

'ఏమిరా జనార్దనమ్! ఈమాట నీవన్నావాలేదా?' అని పంతులుగా రడిగిరి.

'ఉత్తది, ఉట్టిది.'

'అయితే ఇంతకూ (శ్రీ) యెవరిది?'

'నేను ముందొచ్చి పళ్లుతోముకుంటుంటే తిరుమలాయి వచ్చి నిద్ద రోయాఁడండి' అని జనార్దన మనఁగనే తిరుమలాచార్యులు లేచి—'అల్లాయితే నేను రాంగానే ఏంచేశానో చెప్పు' అనెను! జనార్దనమిపుడు బుద్ధిబలము నుపయోగించుటకు ఆలోచింపఁదొడఁగెను. దాని కందఱును వెంటనే సంతసింపఁదొడఁగిరి.

'నీదే (శ్రీ)' అని పంతులుగారు ఈ నిర్ణయముతో బడిని ఆపూఁటకు ముగించి అందఱను చలిదియన్నమునకుఁ బోవ నియమించి రామకోటిని పూర్తి చేయుటకుఁ గూరుచుండిరి.

పంతులుగారొకటి రెండుమాఱులు వీథిలోనికి వచ్చి చూచిరిగాని నాగయ్యదర్శనము లేదు. పిలిచిరి గాని పలుకులేదు. ఇటులు నిస్సహాయులై వారొకరే మెలమెలగా తమవిధిని అనుష్ఠింపఁదొడఁగిరి.

## ౩

## మధ్యాహ్నము

బాలబాలిక లందఱును అన్నము తిని జట్లుగను ఒంటిమొంటిగను వడివడిగా బడికి బయలుదేఱిరి. ఏలనఁగా శ్రీచుక్కలరహస్యమును తెలిసికొనుటకు వారినోరూరుచుండెను.

ఈపూఁట వారికి సామాను ఎక్కువ. ఎడమచేత నొకకొయ్యపలకయు పెద్ద - లేక చిన్న - బాలశిక్షయు. కుడిచేతిలో సెనగపప్పో కందిపప్పో అటుకులో యేదే నొక తినుబండము, వెనువెంట భూమిమీఁద నాలు గయిదు కుక్కలు, ఆకాశమున పది పది యేనుకాకులు.

అపుడు నాగమ్మ ముష్టియెత్తుకొనుట ముగించి కఱ్ఱపొడుచుకొనుచు ఇంటికిఁ బోవుచుండెను. నాగమ్మ కెనుబదియేండ్లు. ఆమె తనమగని నెఱుఁగదు. కాని ఆమె తనమగని గుఱుతుగా క్రిందటి యేటివఱకును తల వెండ్రుక లుంచుకొనెను. నాగమ్మ తనమగనిగుఱుతును విడిచి యిటులు సనాతనమతమవలంబించిననాఁటనుండియు 'కొబ్బరికాయ'అనుబిరుదు వడసెను. ఇట్టి నాగమ్మ విద్యాబుద్ధులను నేర్చికొనుటకు బడికరుగుచున్న యీ బాలురను చూచీ చూడనటులు చూచి తలకొంగు ముందరికి లాగికొనుచు వడివడిగా అడుగులు వయిచెను.

సత్తినాగులు పానకాలును లాగి—'కొ కొ కొబ్మరి ముక్క పెట్టవుగా?' అని ధాటిగా అడిగెను.

'కొబ్బరి యేడుందిరా? చెనగలు' అని పానకాలనెను.

ఈబిరుదు వినఁబడఁగనే నాగమ్మ కొంద్రుమన కుండుట అరుదు. అయినను ఆమె మొదటితప్పును క్షమించెను.

దవ్వుగా నున్న పర్వతాలు 'కొబ్బరికాయ కొబ్బరికాయ' అని అఱచెను.

'నీతలకాయగల' అని నాగమ్మ నోరువిప్పి నిఘంటువులలో లేని కొన్ని సుభాషితములను ప్రచారములోనికి తీసికొనిరాఁగనే బాలబాలికలందఱును గలసి—

'నాగమ్మనాగమ్మ-బోడినాగమ్మా!
నాగమ్మతలకాయ-కొబ్బరికాయా!'

అని పాడి తమకవితాప్రతిభను వెల్లడించిరి.

నాగమ్మ ఊరకుండలేదు. కనుచూపు మేరలో దేవుఁ డిచ్చిన ఆయుధములను ప్రోగుచేసి ఈమెనుబదవ యేటఁగూడ తన కఠోరవైధవ్యమునకు ఫలితమయిన లక్ష్యసిద్ధిని బాహుశక్తినిగూడ బాలు రందఱకు నగపఱిచెను. ఇటులు నాగమ్మముద్దరలు తిని వా రందఱును బడికిఁ బరుగెత్తుకొనిపోయిరి.

పంతులుగా రపుడే రామకోటిని ముగించుచు—'బండసుబ్బఁడు రాలేదా?' అని అడిగిరి. 'రాలేద'ని వినఁబడఁగనే బండసుబ్బఁడు చేయవలసిన పనులను పానకాలుకు అప్పగించిరి.

బండసుబ్బనిపని తనకు దొరకఁగనే పట్టరాని సంతోషముతో పానకాలు పొగాకుపట్టాకడకు పరుగెత్తెను. అది నిండుకొనియుండెను. పానకా లదిచూచి గంతువైచెను. ఏలయనఁగా గురుభక్తి తెలుపుట కదిసుసమయము. పానకా లిటులు తమ దుకాణమునకు పరుగుతీయఁగనే బాలు రొకరొకరే పలకలతో వచ్చి పంతులుగారిముందు నిలువఁబడిరి. పంతులుగారు ఒకొక్కపలక పుచ్చుకొని—

క. ఇంతలు బదరీఫలములు
ఇంతలు మారేడుబండ్లు ఈడుకు జోడో...'

అని చదివికొనుచు బాలబాలికల కనుగుణముగా ఒర వడి పెట్టి పంపుచుండిరి. కొంతవడి కాపని ముగియఁగనే చింతబెత్తము తెప్పించి దాని మొదలును సూదిపలె చెక్కి పంతులుగారు జనార్దనమును తిరుమలాచార్యు

లను దాపునకుఁ బిలిచి—'శ్రీ యెవరిది?' అని అడిగిరి.

జనార్దనము బెదరుచు 'నాదే' యనెను, తిరుమలాచార్యులు 'నాది' అని ఖంగున పలికెను.

'వెధవా! నీ దెట్లా అవుతుంది? నిద్దరలో నీశ్రీ జనార్దనం కొట్టుకుపోయాఁడు' అని పంతులు జనార్దనము - అఱచేతిని తనయెడమ అఱచేతిమీఁద పెట్టించి బెత్తము మొదలును లోఁగడనే చీరుకొనిపోయి యున్న అఱువడిలో గ్రుచ్చి, యెన్నఁటికిని మాయని శ్రీ పెట్టిరి. పిదప 'నీకు శ్రీకావలెనా?' అని తిరుమలాచార్యుల నడిగిరి. 'వద్దు' అని అతఁ డనఁగనే అతని చేతికిఁ గలిగిన స్పర్శవలన ఆనాఁడు శ్రీకంఱు చుక్కయే దొడ్డ దని అతఁడు తెలిసికొనెను. పిమ్మట రంగమ్మ చేయి శ్రీలో సగముసౌఖ్య మనుభవించెను. పిమ్మట దెబ్బలుకొట్టునధికారము తిరుమలయ్యకు సంక్రమించెను.

పానకాలు దిగ్విజయము చేసికొనివచ్చి తిరుమలాచార్యులదెబ్బలకు అతీతుఁడై ఒకమూల కూరుచుండి కాలిబొటన వ్రేలిలావునను జేనెఁడు పొడవునను చుట్టలు చుట్టి గురుదక్షిణ యిచ్చెను. పంతులు సంతసించి 'పొగాకు ఎక్కడిది?' అని అడుగఁగనే ఆప్రశ్నకే మొగము వాఁచుకొనియున్న పానకాలు 'మాదుకాణము లోనిదే చాటుగా తెచ్చాను' అని హస్తకౌశలమును తెలుపుకొనెను.

'ఎక్కడిసరుకు?'

'కిష్టయ్యగారి పాటితోఁటలోది'

'గుమ్మడితోఁటలో దేమయినా పట్టమ్మని బండ సుబ్బడికీ చెప్పాను నీకూ చెప్పాను. ఏంలాభం?'

'వీడితో మీరు చెప్పలేదండి; పానకాలుకు చెపితే ఇన్నాళ్లా'

'సరేలే రేపు చూడు; అయితే ఇందులో నీవేమీ దాఁచుకోలేదుగద?'

'లేదండీ లేదండీ' అని పానకాలు లేచి బట్టలు దులిపి నగ్నమయినసత్యమును ప్రకటింపఁగనే పంతులుగారు చుట్టను నోటఁబెట్టుకొనిరి. రెడ్డిగారి కుమారుఁడు ఇంటిలోనికిఁ జని కొఱివి తెచ్చెను. పానకా లిత్తడిచెంబిచ్చెను. పంతులుగారు మాధ్యాహ్నికమునకు వెళ్లిరి.

పొన్నాడనాగయ్య చెఱువునుండి యింటికి మరలి మఱచివచ్చిన సిరాబుడ్డికి బడిముందరకు వచ్చెను. పంతులుగారు లేరని తెలిసిపోయెను. అట్టి సమయమున తానచటి కొంటరిగా వెళ్లుట తనకును తన సిరాబుడ్డికిని అంత క్షేమమయినపని కాదనుకొని అతఁ డింటికే వెళ్లిపోయెను.

సాయంకాలము

బడిచిన్న యగు బాపులు తొంగిచూచి చేతులు త్రిప్పి కంఠమును అడఁచుకొని అడఁచుకొని ప్రకటించిన స్వరవిశేషముచే పంతులవారు వచ్చుచుండి రని అందఱకును తెలిసెను. అంతట బడియంతయు గప్‌చిప్ అయిపోయెను.

భుక్తాయాసమును మడిచుట్టచే పోఁగొట్టుకొనుచు పంతులుగారు అరుదెంచిరి. కరసహకారముచే కాల్చునది మైలచుట్ట, ఎంగిలి కాకుండ అంగిటిలోనికి విసరి వేసికొనునది మడిచుట్ట, వారీమడిచుట్టను మడిగానే విసర్జించి తాము తెచ్చికొనిన చెంబెఁడు నీటితో గళక్ గళక్ మనిపించి లోనికి వచ్చిరి. పానకాలు చాఁప దులిపి గడ్డిదిండుతో అయ్యవారికి శయ్య యేర్పఱిచెను. పంతులుగా రుత్తరీయము పఱవఁగనే అందఱును ఇండ్లకు వెళ్లిరి. పంతులుగారు కనులు మూయఁగనే మూలుగుచున్న నిద్రాదేవి వారి నావేశించెను. వారు గుఱ్ఱు కొట్టుచు నిదురించిరి.

పంతులుగారి ఉదరగోళమునుండియో లేక దహరాకాశమునుండియో కాని తిత్తిమోఁతలు బయలుదేఱి రాటపుమోఁతలుగా మాఱఁదొడఁగెను. రెడ్డిగారి యింట దూది యేకించుచుండి రనుకొని దూదేకుల

సాహెబు కొలఱకు కొందఱు వచ్చి హతాశులయి వెళ్లిరి. నడుమ నడుమ రాయియు రాయియు కొట్టుకొనినటు లును మబ్బు లుఱిమినటులును వినఁబడఁదొడఁగెను. కొంత వడికి ఊర్ధ్వను లన్నియు ఆఁగిపోయెను. శ్వాస యంత్రమగు పుప్ఫుస మొకింత విశ్రాంతి దీసికొనెను.

పంతులుగారి కపుడు పరివర్తనైకాదశి. వారు ఈప్రక్కనుండి అప్రక్కకు పొరలిరి. మఱియొక నిమిషములో విచిత్రధ్వని యొకటి బయలుదేఱెను.

రెడ్డిగారియింట తన యిజారాలో నున్న పాల కుండలను కొల్లగొట్టుటకు వచ్చి తనజాతిలోని దొకటి తనను ధర్మయుద్ధమునకు రమ్మని గర్జించుచున్న దేమో యని తలఁచి గోడమీఁదనుండి గండుఁబిల్లి యొకటి అమాంతముగా పంతులుగారి ప్రక్కకు దూఁకెను. పాప మాపిల్లి భూమ్యాకాశములు వెతకెను. తన దిను సెచ టను లేదు. అది యంతట విస్తుపోయి ముంగాళ్లమీఁద నిలిచి పంతులుగారి ముఖమును నిరీక్షించుచుండెను.

అంతలో ఆధ్వని మాఱెను. పిల్లి ఆత్మరక్షణ మొనర్చుకొనుటకు కస్సుమనెను. కాని దాని విరోధి జంతువు దానికి కానరాలేదు.

రెడ్డిగారి యింటికుక్క యింటి నాలుగుమూలలు పరికించి వచ్చెను. దాని జూచి పిల్లి చెంగున గోడమీఁది కెగిరెను.



" దానిజూచి పిల్లి చెంగున గోడమీఁది కెగిరెను "

మోర యోరగాఁబెట్టి ఆకుక్క పంతులుగారిని జూడఁదొడఁగెను. ఉఁహుఁ. దానికిని ఈముడివిడలేదు. తుద కది మోర ఆకసముమీఁది కెత్తి పంతులుగారి ధ్వనితో తనధ్వనిని అప్రయత్నముగా కలిపెను.

బాలు రొక రొకరేవచ్చి యీకుక్కను బయ టికిఁ గొట్టిరి. క్రమక్రమముగా అరుఁగు నిండెను. అంత పంతులుగా రేమియు నెఱుఁగనటులు లేచి 'పిల్లలంధఱూ వచ్చారా ?' అని యడిగిరి.

బడిపెద్దయగు ఎల్లమందలేచి—'బండసుబ్బఁడు, నత్తినాగులు, ఉళక్కి, పాతాళంగాఁడు, పర్వతాలు, జనార్ధనంగోరు, రంగమ్మగోరు, చుక్కమ్మ, సుబ్బి [వీ రిరువురును రంగమ్మను నెట్టుకొని వచ్చినవారు. ప్రొద్దునఁ గలిగిన హైరాణికి వీరిపూఁట గైర్ హాజర్] వీరు రాలే' దని చెప్పెను.

వీరిని పట్టి తెచ్చుటకు వెంటనే హుకుమాయెను. అబద్ధాలు, సత్యం, గున్నయ్య మొదలగు కొందఱు యోధులతో ఎల్లమంద దాడివెడలెను.

జనార్దనముతంత్రి వారితో నిటులనెను—'బర్లోకి ఈపూఁట జనార్దనమే కాదు, నేనూ రావాలి; పంతులు గారి సంగతి కనుక్కోవాలి.'

ఈయోధుల కీమాటలు చాల ఆశాజనకము లాయెను. కాని అబద్ధా లిటు లనెను— 'ఈ పెద్దాముండావాళ్లు ఇల్లాగే అంటారు కాని చివరకి వాళ్లు పంతుళ్లను కనుక్కోక పోవటం అటుండంగా బర్లోకిపోవేమని తామే మళ్లా పిల్లల్ని కర్రుచ్చుకుని వెంటడతారు?'

అంతట వారు బండసుబ్బనికొఱ కరిగి దుకాణముమీఁద నున్న గుఱివిసెట్టిని జూచి అతని మరియాదను, తమ మరి యాదను నిలువఁబెట్టి — 'సుబ్బిసెట్టి యేఁడీ ?' అని యడిగిరి.

'బళ్లో బండకొయ్యలో కూకున్నాఁడేమో అనుకున్నాం. అన్నంకూడా తినలేదు నాయనలారా! కొంచెం వెతకిపెట్టండి' అని గురివిసెట్టి యనఁగనే వారందఱును ఒకరినొకరుచూచికొని వీథిలోనికి వచ్చి ఒకచిన్న సభ చేసి రెడ్డిగారి మామిడితోఁటలోనికిఁ బోయి చూచిరి. తోఁటమాలి లేఁడు. మావిపిందె లపుడపుడే ముదురుచుండెను. వారందఱును చెట్లెక్కి యింకొక్క పదార్థమును నమలుటకు వీలుకలుగకుండఁ జేసికొని దిక్కులు చూచుచుండిరి.

'అడుగో బండసుబ్బఁడు' అనిఎల్లమంద యనెను. 'ఎక్కడెక్కడ?' అని అఱువదాఱు కంఠములు మ్రోఁగెను. 'అడుగో గుమ్మడితోఁటనట్టనడుమ!'

అందఱును క్రోఁతులవలె క్రిందికి దిగిరి. వంగి కొంతదవ్వును, కూర్చుండి కొంతదవ్వును, పొట్టమీఁద ప్రాఁకి కొంతదవ్వును వెళ్లిరి.

గుమ్మడితోఁట యను పేరుగల ఆపొగాకు తోఁట చక్కగా పిలకతొడిగెను. గురుభక్తి గల బండసుబ్బఁడు ఎన్నికయగు నాకు నేటి ఒకొక్క ఆకే కోయుచుండెను. అపు డఱువదాఱు శరీరములు తన మీఁదఁ బడుటచే నతఁడు తోఁటకాఁపులనుకొని రెండు విదిలింపులు విదిలించెను. ఈయోధులందఱును తోళ్లవలె నేలకుఁ గఱచుకొని లేచి—'చూస్కో అయ్యవారికి చెప్పకపోతే' అని అదలింపఁగనే అతఁడు సులభముగా లొంగిపోయెను.

పిమ్మట బండసుబ్బఁడు కోసిన యాకును పచ్చితాటాకునఁ గట్టుకొని తానును ఒకయోధుఁ డాయెను వీరందఱును కలిసి వెళ్లి బల ముపయోగింప నక్కఱ లేని బక్కవారిని వెంటఁ బెట్టుకొనియు, ఉక్కుముక్కల వంటి ఉళక్కి మొదలగువారికి పాదబల ముపయోగించుచు ముందుంచుకొనియు బడికి నడచిరి.

చెప్పుచున్న రంగులపద్యముల నాఁపివేసి పంతులుగారు బండసుబ్బని బహుమతిని స్వీకరించి మిగిలిన వారికి గోడకుర్చియో, బండికొయ్యయో, కోదండమో, నిలుపుజీతమో యేదియో యొకబహుమతి నొసఁగిరి.

అంతట బాలు రెక్కములుచెప్పుటకు లేచిరి. అపుడు గ్రామములోనివా రొకరిద్దఱు వచ్చి పంతులుగారిచే దస్తావేజులు వ్రాయించుకొనిరి. అది ముగియఁగనే పంతులుగారు లేచి—

దీపం జ్యోతిః పరంబ్రహ్మ దీపం జ్యోతిః పరాయణమ్;
దీపం హరతు మే పాపం సంధ్యాదీప! నమోఽస్తుతే.

అని చెప్పి బాలురచే చెప్పించి కూరుచుండిరి. వారి కిది రెడ్డిగారి కాలాత్రాయు సమయము.

బాలు రందఱును వెళ్లిపోయిరి కాని జనార్దనమును వెంటనిడుకొని అతనితండ్రి యెపుడు వచ్చునా యని అబద్ధాలుకాక కొందఱు బాలురు వీథినిచూచుచు వెళ్ల లేకవెళ్ల లేక యిండ్లకు వెళ్లిరి.

---



అసెంబ్లీ ఎన్నికలందు అఖండవిజయమునుబొందిన శ్రీ దేశోద్ధారక నాగేశ్వరరావుగారిని ఏలూరులో నాలుగుగుఱ్ఱములబండిలో ఊరేగించుట

పెరంబూరు మహాబోధి ఆశ్రమమున బుద్ధజయంతి ఉత్సవములు




"సమరమునఁ బార్థుఁడే మిగులఁ దొట్రిలుచుండును ద్రోణుఁడన్న నీ
వరయఁగఁ జిన్నవాఁడ వెటులాగెదవో?" యని పల్కెఁ జెల్లునే!
గురుఁడని కాదె, తండ్రి తనకున్గల శక్తిని వారిపైన నీ
వరకును జూపఁడయ్యె, నిది భక్తినొ భీతినొ, మీ రెఱుంగరే!.

మీరువచించినట్లరు లమేయపరాక్రము, లక్రమక్రియా
పారగు, లారితేరిన సిపాయిలు, పాపులు, నప్రమత్తులున్
గ్రూరులె యౌదు; రేను పసికూన నయ్యైనను మీదుదీవనల్
వారకఁ బ్రోచుచుండు నెడ వారొక లెక్కయె నాకు నెమ్మెయిన్.

పరశురాముని గర్వపటిమమ్ముఁ జీల్చినరఘురాముఁ డెన్నివర్షములవాఁడు?
దశరథాత్మజు లద్భుతంబందఁ బోరినప్పటి కుశలవు లెంతవయసువారు?
సింహికాసుతుఁ బాఱఁజేసినవేళ నాహనుమంతుఁ డెంతప్రాయమ్మువాఁడు?
కంసాదిఘోరరాక్షసులఁ జెండాడునాఁ డిప్పటి మామామ లెంతవారు?
డింభకులుగారె వార? లాతేప నేను-రాచబిడ్డనై తగుపరాక్రమము గలిగి
కదనసీమను గొదమసింగమ్ముభంగి - మెలఁగఁదగువేళ నిప్పుడా మిన్నకుంట?

చేతిని గాయముండెనని చింతను జెందఁగనేల నయ్య! నా
చేతన చాపమున్న నొకసేనయెగా దిఁక నెన్నియైన ని
ర్భీతినిఁ గూల్చువాఁడ నొకపెట్టున బాణపరంపరన్, మహా
వాతహతిన్ ధరన్ బడెడు పాదపపుంజముమాడ్కి వ్రేల్మిడిన్.

పోటుతనాన నొక్కరుఁడఁ బోయి రిపుప్రకరమ్మునన్ నిరా
ఘాటవిహార మెల్లెడల గండరగండడనై యొనర్చి నా

పాటవ మెప్పు జూపఁగలవాఁడనో? యంచుఁ దలంచుచుండ, నీ
నాఁటికి లభ్యమయ్యె సుదిన మ్మిటువంటి దఁకెట్లు వీడెదన్?

భరతవంశమ్మునందు సంభవముబొంది-వెఱతునే సంగరంబున? వినుము తండ్రి!
తండ్రులును మామ లొక్కటై దాఁకిరేని నొక్కరుఁడ వారి నిర్జింతు నుక్కుమీఱి.

ఇంతటి యల్పకార్యమునకే వెఱపొందెడువాఁడనొక్కొ? నా
గొంతునఁ బ్రాణముండువరకున్ మిము ద్రోణుఁడెకాదు స్థాణుఁడేఁ
బంతముఁబూని వచ్చినను బట్టఁగలేఁ డిది నిక్కువమ్ము, ని
శ్చింతగ మీరు సంతిపురిఁ జేరుఁడు తల్లుల నూఱడింపఁగన్.

కష్టకాలానఁ దండ్రి కక్కఱకు రాని-సుతుని హితమేల? బలమేల? బ్రతుకదేల?
నింక నాధర్మమే నిర్వహించుకొందు-నాజ్ఞఁ దయసేయుఁ డిపుడైన నాదరమున.

వినుఁ డేదో నటశబ్దమయ్యెడి,......నదే వీరోక్తులన్ బల్కుచుం
డెను ద్రోణుం "డెవఁ డడ్డమైన మిము ధాటిన్ బట్టి బంధింతు నీ
దినమం" చిద్ది వినంగ రేగె హృదయోద్రేకాగ్ని; యిం కోర్వఁజా
లను తండ్రీ, కర మప్రయత్నముగ వ్రాలన్ సాగె చాపమ్ముపై.

స్యందన మెక్కి, తత్‌క్షణమ సైన్యముఖమ్మున నిల్చి, ముందుగా
దుందుడుకొప్ప నాయొఱపు ద్రోణునకున్ జవిఁజూపి, వ్యూహమున్
జిందరవందరౌనటులఁ జేసి, తటాలున లోనికేగి, నా
కెందును సాటిలేరనఁ జరింతు నమోఘజయమ్ముఁ గాంచెదన్?

పగపున్ మాని దృఢాత్ములై వినుఁ డరివ్రాతమ్ము నాధాటికో
ర్వఁగలే కెక్కడివార లక్కడ ధనుర్బాణమ్ములన్ వీడి తీ
వ్రగతిన్ గాలికి బుద్ధిసెప్పినటు చేవన్ జూపి, మీసన్నిధిన్
సిగపూ వాడకయుండఁ జేరెదను తండ్రీ! పెక్కు లింకేటికిన్?

చరణముల వ్రాలు నన్నెత్తి కురులు నిమిరి-నాక విజయమ్మనుచు మీర లీకరణిని
గరుణనొసఁగిన దీవనల్ కాచుచుండ-నాకు భయమున్నె?...పోవుచున్నాఁడఁ దండ్రి!

---



# బీజపూరు (విజయపురము)

కొ. నరసింహాచారి

భారతదేశము చాలకాలమునుండియు పలుమారు విదేశీయుల దండయాత్రలకు లోనయి, పాలకులయందైకమత్యముగాని, సహనభావముగాని లేనందునను, మతవైషమ్యములవలనను, అట్టి విదేశీయదండయాత్రల కాస్పదముకలుగజేయుచు కడునిడుములపాలు కాక తప్పదయ్యెను. దాడివచ్చిన విదేశదండయాత్రికులలో కొందఱు కేవలము ధనకాంక్షవలన వచ్చినవారై జనులను హింసించియు, చంపియు, వారి ధనకనకములను కొల్లగొని యీదేశమును పరదేశముగ భావించి తమదేశములకు బోవుచుండిరి. మరికొందరు దేశముపై దండువెడలివచ్చినను, ఇచ్చటనే స్థిరనివాస మేర్పరచుకొని చాల వరకు జనులక్షేమమును, దేశక్షేమమును విచారించుటయందు శ్రద్ధగలవారై యుండిరి. అయినను ఇచ్చట స్థిరనివాస మేర్పరచుకొనినవారి వలనగూడ పరమతద్వేషపూరితులగు రాజు లయినయెడల, జనులకు సుఖములేకుండిన తరుణములుగూడ నుండెను.

భారతదేశమున స్థిరవాస మేర్పరచుకొనిన దండయాత్రికులలో మొగలులు కడపటివారు. వారు ఉత్తర హిందూదేశముననే యుండి ఢిల్లీని రాజధానిగ నేలుచుండిరి. కాని అల్లాయుద్దీనను మరియొక మహమ్మదీయవంశీయుడు దక్షిణదేశముపై దండెత్తి వచ్చిన తొలిరాజు. అదిమొదలు మహమ్మదీయులు దక్షిణదేశమునకుగూడ రాజొచ్చిరి. అందు దక్షిణదేశమున తొలుతటి స్వతంత్ర మహమ్మదీయ రాజ్యముగ నేర్పడినది బహమనీరాజ్యము. అది కాలక్రమముగా భిన్నమై బీదరు, అహమ్మదునగరు, గోలకొండ, బీజపూరు అను నాలుగు రాజ్యము లయ్యెను. అందును బీజపూరు తక్కినవాటికన్న మంచిస్థితియందుండి, తత్పాలకులవలన వృద్ధినొందింపబడి పోషింపబడిన యనేక శిల్పకళావిశేషములు గలిగి, హైందవశిల్పమున విజయనగర రాజధాని యెట్లు వన్నెకెక్కినదో యట్లే మహమ్మదీయ శిల్పమున వన్నెవాసి కెక్కినది.

రాజులు భిన్నమతస్థులైనందున మతద్వేషమువలనను, పరస్పరరాజ్యకాంక్ష గలిగినపుడును, ఒకొరొకరితో పోరాటముల గల్గించుకొని ఒకరొకరి రాజ్యమును ధ్వంసము చేయుచు, నందలి శిల్పములను పాడొనర్చియు, జనులను చంపియు తమ క్రోధాగ్నిని



జామి మసీదు. ఒకటవ ఆలీ అదిల్ షా చే కట్టబడినది.

జల్లార్చుకొనుచుండిరి. ఇట్టివియే విజయనగరమును మహమ్మదీయులు పాడొనర్చుటకును, మొగలులును, మహారాష్ట్రులును బీజపూరును పాడొనర్చుటకును కారణములు.

బీజపూరునకు మొదటిస్వతంత్రాధిపతి యూసఫ్ ఆదిల్ పా. ఇతడు తురుష్కుడు. ఇతనిగుఱించిన యొకగాథ ఇట్లు కలదు. తురుష్క (Turkey) చక్రవర్తి మూరద్ (క్రీ. శ. ౧౪౨౧-౧౪౫౧) అప్పటివారి యాచారప్రకారము సింహాసనమునకు హక్కుదారుడగు కుమారునకుతక్క తక్కిన కుమారులం జంపుమని యాజ్ఞ యిచ్చెను. ఈయాజ్ఞ మేరకు యూసఫ్ కూడ చంపబడవలసియుండెను. యూసఫ్ తల్లి తనబిడ్డ నెట్లయిన ఉపాయమువలన మరణమునుండి తప్పించి దేశాంతర మంపగలిగెను. ఆబాలుడు అట్లే ప్రయాణముచేసి హిందూస్థానమునకు రాగలిగెను. హిందూదేశమున నడుగిడినప్పటినుండియు నతనియదృష్టదేవత ప్రసన్నురాలై వానిని తొలుతనే యప్పటి దక్కనుదేశమున ప్రబలియుండిన బీదరురాజ్యమునకు గొనిపోయి వానికి రాజానుచరపదవి నిప్పించెను. అదిమొదలు రాజానుగ్రహమునకు మిక్కిలిపాత్రుడై ఉచ్చదశకు వచ్చుచు కాలక్రమమున బీజపూరురాజ్యస్థాపకు డయ్యెను. మఱియొకగాథ యొద్దియన యూసఫ్, సావాయను నొకతురుష్క రాజధానియందలి రాజప్రతినిధియగు మహమ్మదుబేగ్ యొక్క తనయుడు. ఒకానొకయుద్ధమున తండ్రి మృతుడుకాగా తనతల్లియు, సేవకులును దిక్కులబట్టి పారిపోవుట తటస్థించెననియు, యూసఫ్ యిస్పహాన్ నగరమునకును, అటనుండి షిరాజ్ నకును, కడపట హిందూదేశమునకును దీసికొనిపోబడెను. అచ్చట బీదరునవాబుల కొలువులో జేరి, అనేక సైనికోద్యోగములందుండి, పేరుపొంది, తుదకు బీజపూరు గవర్నరుగా ఆదిల్ ఖాన్ అనుబిరుదుతో నియమింపబడెను. బీదరునవాబు, సుల్తాన్ మహమ్మదునంత్యకాలమున నతని చెల్లుబడి తగ్గి రాజ్యమునందలి రాజప్రతినిధు లొక్కొక్కరును క్రమక్రమముగా స్వతంత్రులైరి. ఇట్లే యూసఫ్ అదిల్ ఖానును క్రీ. శ. ౧౪౮౯ న బీజపూరున స్వతంత్రరాజ్యమును స్థాపించెను. అతడు ౧౪౮౯-౧౫౧౦ వరకు పాలించెను. ఇతడు స్వతంత్రుడుకాగానే, బీదరుమంత్రి కాసిమ్ బరీదు విజయనగరాధిపతియగు తిమ్మరాజుసహాయమున బీజపూరును మరల గొనుటకు ప్రయత్నించెనుగాని విఫలమనోరథు డయ్యెను. అయిన తిమ్మరాజునకు దారి చూపినందున తర్వాతికాలమున తిమ్మరాజే స్వయముగ బీజపూరుపైకి దండెత్తివచ్చెను. యూసఫ్ ఆదిల్ ఖానుడు వాని నెదిర్చి యోడించి, ముదిగల్లు, రాయచూరుకోటలను జయించుటయేకాక అపారమగు ధనకనకవాహనములను కొల్లగొని బీజపూరుజేరి యాధనముతో తననగరమును బలిష్ఠమొనరింపగల్గెను.



బీజాపురమున విహారార్థము పూర్వపురాజులు నిర్మించుకొన్న జలమందిరము. ఒక తటాకమధ్యమున గలదు.

యూసఫ్ వచ్చుటకు పూర్వము బీజపూరంత ప్రసిద్ధిజెందినది కాదు. పశ్చిమచాళుక్యరాజు భువనైకమల్లుని రాజ్యమున జేరిన తర్దవాడిజిల్లాలో నొకగ్రామమై, వాని దండనాయకుడగు నాకిమయ్య యనువాని ముఖ్య



గోల్ గుంబజ్. ఇబ్రహిం అదిల్ పా కట్టించినది.

స్థానమై యుండెను. తర్వాత నిది దేవగిరి యాదవులపాలనకు లోబడెను. ఇచ్చట స్వయంభూ సిద్ధేశ్వరాలయ మొకటి యుండెను. దానిని అల్లాయుద్దీన్ సేనానియగు మాలికాఫర్ దక్కనుదండయాత్రకు వచ్చినపుడు, నాశముగావించి దానిపై నొక మసీదును గట్టించెను.



అయిన్ ఉల్ముల్క గోరీవద్ద నుండు మసీదులోని సుందరాకారములు.

యూసఫ్ ఆదిల్ షాయొక్క ముఖ్యపట్టణమైనతర్వాతనే బీజపూరు దేశచరిత్రలో ప్రసిద్ధిజెందెను.

యూసఫ్ అనంతర మతని తనయుడు ఇస్మాయిల్ ఆదిల్ షా, పదుమూడేండ్లవయసుబాలుడై, రాజ్యమునకువచ్చి ౧౫౧౦-౧౫౩౪ వరకు పాలించెను. వానికి కమాల్ ఖాన్ దక్కనీ అనువాడు సహాయుడుగా నియమింపబడెను. కమాల్ ఖాను బాలరాజును తొలగించి తానే రాజ్యము నపహరింప యత్నింపగా రాజమాత యొకనిచే కమాలును జంపించెను. ఈసందర్భమున ఖుస్రూఆఖా అనుతురుష్కుడు రాజునకు నమ్మకమగు బంటై యతనికి గొప్పసహాయకారియైనందున వాని రాజభక్తికి మెచ్చి ప్రత్యుపకారముగా అసాద్ ఖానబిరుదమును, బెల్గాముకోటజాగీరును ఇచ్చెను. ఇస్మాయిల్ అంతటినుండి తనరాజ్యమును చక్కబెట్టుకొనుచు పరరాజ్యాక్రమణమునకు గూడ కాంక్షగలవాడయ్యెను. మొదట కాసీముబరీదుని(బీదరురాజ్యప్రధానమంత్రి)జిల్లాలపైదండెత్తి జయించెను. అందువలన తక్కినబహమనీరాజ్యములోని రాజులు ఇస్మాయిల్ పై నీర్ష్యవహించి వాని నెదిరించిరి. ఈయుద్ధములకు కేవలము రాజ్యకాంక్షయేకాక మతాంతర్భేదములుగూడ నైయుండెను. మహమ్మదీయులును, హిందువులును పరస్పరము ద్వేషించుటవలన గలుగు పోరాటములకు దోడు మహమ్మదీయులలోనే షీయా, సున్నీ యను రెండుతెగలవారికిని పరస్పరవైరమును, ద్వేషమును నుండినందునగూడ కొన్ని యుద్ధములు సంభవించెను. ఇస్మాయిల్ షియాతెగవాడును, తక్కినరాజులు సున్నితెగవారును నగుటంబట్టి యతడు తనరాజ్యమున నుండిన సున్నీలను వారి యుద్యోగములనుండి తొలగించి షియాతెగవారిని నియమించి యామతమువారిని ప్రోత్సహించుచువచ్చెను. అందువలన స్వమతస్థులవలననే యతనికి బాధ మెండయ్యెను. కాని ఇస్మాయిల్ తనప్రఖ్యాతసేనాని యగు అసాద్ ఖానుసహాయమున తన్నెదిరించిన పరరాజుల నోడించెను. ఇట్లు విరోధమునే సాధించుటకన్న సఖ్యమున మెలగుట యుక్తమని యెంచి ఇస్మాయిల్ తన ముగ్గురుచెల్లెండ్రను, బీదరురాజు అహమ్మదుషా బహమనీకిని, ఖాందేష్ రాజు సుల్తాన్ అల్లాయుద్దీన్ ఇమాద్ షాకును, అహమ్మద్ నగరరాజగు సుల్తాన్ బుర్హాన్ నిజాంషాకును ఇచ్చి వివాహములు చేయించి స్నేహబంధమును బలపరచుకొనెను. బీదరు ప్రధానమంత్రి యమీర్ బరీదు తనరాజుల తొలగించి తానే బీదరున కధిపతికాగా, వానిని ఇస్మాయిల్ దండించి తాను బీదరు రాజ్యమును తీసికొనెను. ఇతడు చందాపురమును కట్టించెను; ౧౫౩౪ సం.మున మరణించెను. ఇతని తర్వాత నితని జ్యేష్ఠపుత్రుడు మల్లు ఆదిల్ షా రాజ్యమునకు వచ్చెను. ఇతడు కడు దుష్టుడును, ప్రజాకంటకుడును నైనందున ప్రజ లితనిని అంధునిజేసి రాజ్యమునుండి తొలగించి యితని తమ్ముడు ఇబ్రాహీమును రాజుజేసిరి.



అత్మీశ్వర మనుచోట కాలీ మసీదుయొక్క శిఖరాగ్రము(**Minaret**). ఇందుండి వ్రేలాడుశృంఖలలు దీని సౌందర్యము నినుమడించుచున్నవి.



మిహ్తారుమహలునందలి బాల్కనీ గవాక్షము. ఇందనేకములయిన కలప చెక్కడపుపనులు సుందరములయినవి కలవు.



ఆలీ షహీదుపర్ మసీదు ప్రధానద్వారము.

ఇబ్రాహిమ్ ఆదిల్ షా ౧౫౩౪-౧౫౫౭ వరకు రాజ్యము చేసెను. ఇతని రాజ్యకాలమంతయు నిరుగుపొరుగురాజులతో యుద్ధములు చేయుటతో సరిపోయెను. ఇతడు తన తండ్రితాతలవలెకాక సున్నీ తెగకు చేరినవాడై షియా తెగకు చేరి తన తండ్రితాతలవలన పోషింపబడుచువచ్చినవారిని తొలగించి సున్నీలను వారిస్థానమున నియమించెను. కాని కొంత పరమతసహనము గలవాడైనందున హిందువులను చాలమందిని తన కొలువున జేర్చుకొనెను. పారసీక భాష రాజభాషగ అవలంబింపబడెను.

ఆకాలమున విజయనగరమును పాలించుచుండిన భోజ్ థర్మాల్ ను తొలగించి రాజ్యము నాక్రమించిన మంత్రి రామరాజును తరుముటకు తనకు సహాయముచేయుమని భోజ్ థర్మాల్ కోరగా ఇబ్రాహి మొక గొప్పసైన్యముతో బోయెను. రామరాజపుడు ఇబ్రాహిమునకుభయపడి రాజ్యమును మరల థర్మాలున కిచ్చుట కియ్యకొనినట్లు నటించి, అనేక లక్షల ధనమును ఇబ్రాహిమున కిచ్చి వానిని మరల పంపివేసెను. ఇబ్రాహిము పోగనే థర్మాలును చంపించి తాను సింహాసనము నధిష్ఠించెను. ఇబ్రాహిము తన రాజ్యమునకు మరలినతోడనే రామరాజొసగిన ద్రవ్యముతో బీజపురపుకోటను బాగుగ గట్టించి బలపరచుకొనెను. థర్మాలువధను వినగనే, రామరాజునకు విజయనగరరాజ్యమునందు గలిగినంత హక్కు తనకుమాత్ర మేల లేకుండగలదని ఇబ్రాహిము తన సేనాని యగు అసాదుఖానును గొప్ప సేనతో పంపి, ఆదవేనిదుర్గమును ముట్టడించి ఆక్రమించుకొనెను. ఈ యుద్ధసందర్భమున అసాదుఖానుని యుద్ధకౌశలము వెల్లడియయి, రాజానుగ్రహమునకు మరింత పాత్రుడయ్యెను. బీజపూరు రాజుల చరిత్రలో అసాదునియంత నమ్మక మగు రాజభక్తియుక్తుడు వేరొకడు లేడు. తుదకు ఇబ్రాహిము అసాదునియందలి ప్రీతివిశేషమువలన నతని



'జలవసతికిగాను కట్టిన టాజ్ బౌరి యను తటాకముయొక్క ద్వారము.

కుమార్తెనే వివాహమాడి యామెయందు కలిగెడు తనయుడే సింహాసనమునకు వచ్చునట్లు వాగ్దానముచేసెను. అసాదుఖానుని యభివృద్ధియు, అదృష్టమును తక్కిన రాజసేవకుల యసూయకు కారణములయి, వారు కుతంత్రములవలన రాజున కతనిపై కోపమువచ్చునట్లు చేయగలిగిరి. కాని కొంతకాలమయినతర్వాత వారి కుట్రలను దెలిసికొని రాజు మరల అసాదుఖానునందు తొలుతటివలెనే ప్రేమ చూపసాగెను. ఇట్టి తరుణమున అహమ్మదునగరు, గోలకొండ, విజయనగరరాజులు మువ్వురేకమయి నిజాంషాయొక్క షోలాపురపుకోటను మరల వాని కిప్పించుటకై బీజపురముపై దండెత్తగా, అసాదుఖాను వారినందరి నోడించి తరిమెను. మరియొకసారి నిజామ్‌షా బీజపూరుపైకి రాగా మరల వానినిగూడ భీమానదియొడ్డున నెదిర్చి యోడించి పారద్రోలెను.



లక్ష్మేశ్వరులోని కాలీమసీదు

ఇట్లనేకయుద్ధములందు రాజునకు తోడ్పడి జయమును చేకూర్చుచుండిన అసాదుఖానునందు మరల రాజునకు ఇతరుల కుతంత్రములవలన కోపముగలిగి వానిని బెల్గాముకోటయందు ఖైదుచేసియుంచి తర్వాత నిజముతెలియగనే వానిని స్వయముగ జూచి యాదరింపనెంచి బెల్గామునకు పోవుచుండెను. అసాదు అప్పటికి వృద్ధుడుకాన చెరసాలలోనే, రాజదర్శనమునకుపూర్వమే మరణించెను. ఈమరణవార్త విని రాజు మిగుల దుఃఖించి అసాదుని తనయుల నాదరించి వారి కపారధనముల నొసగి గౌరవించెను.



అందమసీదు.

తనకాలమంతయు యుద్ధములతో వెళ్లబుచ్చవలసినవాడై ఇబ్రాహిము ౧౫౫౮ న మరణించెను. ఇతనికి నల్వురుకుమారులును, ఇర్వురు కుమారితలును నుండిరి. ఇందు పెద్దవాడగు ఇస్మాయిల్ అంత మేధావియు, చురుకుదనమును గలవాడును కానందున రెండవ కుమారుడగు అలీవలన నతని కేలాటిద్రోహమును కలుగకుండుటకు తండ్రి అలీని మీరజ్ కోటయందు బందీకృతునిగా తొమ్మిది సంవత్సరము లుంచెను. తనకుమార్తెలను నిజాంషాకును, అలీబరీదునకు నిచ్చి వివాహములు చేసెను. ఇతనికాలముననే బీజపూరునకు సమీపమున నుండు ఇబ్రాహింపుర మేర్పడెను, కోట బలపరుపబడెను. చాలామసీదులును, మహలులును కట్టబడెను. అసాదునకు తాజేసిన వాగ్దానముప్రకారము అతని దౌహిత్రుడగు తామాస్పునకు రాజ్యమివ్వజూచెనటగాని సామంతుల కెవ్వరికి నిష్టములేనందున నట్లుజేయుటకు వలనుకాదయ్యెను. తుదకు తామాస్పు రాజ్యమునకు రాకుండుటకు కొందరు విరోధులు వానికండ్లను పొడిపించిరి.

ఇబ్రాహిముమరణానంతరము మీరజ్ కోటలో చెరనుండిన అలీయే రాజ్యమునకు వచ్చెను. ఇతడుగూడ తండ్రివలెనే యుద్ధములతో కాలము గడపవలసినవాడయ్యెను. ఇతడు విజయనగరరాజగు రామరాజుసహాయమున నితర మహమ్మదీయరాజుల నెదిర్చి యుద్ధములు చేయుచుండెను. ఇట్టియుద్ధములందు విజయనగర సేనలు అలీ ఆదిల్ షాకు సహాయముచేయుట ముఖ్యముగా నెంచక తా మేగిన



ఆసార్ మహలు వెనుక నగర్తపైనున్న కమానువంతెన.

చోటులనెల్ల కొల్లగొనుటయే ముఖ్యముగా పరిగణించి ప్రవర్తించుచుండిరి. అందువలన ఆలీఆదిల్ షాకును వాని ప్రతిస్పర్ధులకును గూడ రామరాజుపై ద్వేష మంకురించి వారందరేకమయి తాళికోటవద్ద జరిగిన యుద్ధమున రామరాజు నోడించిరి. రామరాజు చంపబడెను. విజయనగరరాజ్య మంతటితో నంతరించెను. ఈయుద్ధఫలముగ రాయచూరు, ముదగల్లుకోటలు బీజపూరురాజునకు స్వాధీన మయ్యెను. విజయనగరమును కొల్లగొట్టె యాధనముతో బీజపూరుచుట్టును కోట గట్టబడెను. ఈకోట ౧౫౬౫-వ సంవత్సరమున పూర్తి యయ్యెను. విజయనగిరరాజకుటుంబము పాలకొండలో దాగియుండ నాకోటను గూడ ముట్టడించి స్వాధీనమొనర్చుకొననెంచి, ఆలీఆదిల్ షా సేనాని యగు కిషవర్ ఖానుతో నొక సైన్య మంపెను. ఇంతలో తాళికోట యుద్ధపర్యంతముండిన మహమ్మదీయరాజుల యైకమత్యము చెడి వారి మనములందు తొలుతటి పరస్పర వైరభావములును, ఈర్ష్యయు తల చూపినందునను, బీజపూరురాజు యొక్క యభివృద్ధికి ఓర్వలేనందునను, కుతుబ్ షా, నైజాంషా లేకమయి జపూరుబీపై దండెత్తివచ్చిరి.



పైవరుసలోనివి జామీమసీదులోని రంధ్రగవాక్షములు; ఒంటిరాతిపలకలలో చెక్కబడినవి. క్రిందివరుసలోనివిగోల్ గుంబజులోని కార్నిషుక్రింద నుండు అలంకారరూపములు.

కాని కిషవర్ ఖాను పాలకొండముట్టడివదలి, యకస్మాత్తుగ మరలివచ్చి వాని నెదిర్చెను. ఈయుద్ధమున కిష్వరుఖాను చంపబడెను. ఇది యట్లుండ ఈ సమయముననే బీజపూరురాజ్యములో జేరిన గోవామొదలగు సముద్రతీరప్రదేశములందు పోర్చుగీసువారి ప్రాబల్యము వృద్ధికాజొచ్చెను. వారిని బారదోలుట కనేకప్రయత్నము లొనర్పబడినవిగాని యవి నిష్ఫలములయ్యెను.

తర్వాత క్రమముగా కొన్ని యుద్ధములలో ఆదవని, తోరణగల్లు, ధార్వార్, బంకాపూరు మొదలగు కోటలను స్వాధీనములు గావించుకొని మూడుసంవత్సరముల దండయాత్రయయినపిమ్మట ఆలీఆదిల్ షా బీజపూరుచేరెను. సం. ౧౫౮౦ న ఆలీ యొక బానిస వానిచే చంపబడెను. ఇతని తండ్రి, తాత, ముత్తాతల గోరీలు గోగి యనుచోటనుండినను, ఇతని గోరీ బీజపూరునందు గట్టబడినది. ఇతడు తనకాలమున జామిమసీదు (చిత్రము ౧), గగన్ మహల్, చాంద్ బౌరీ, ఆనందమహల్ మొదలగు కట్టడముల గట్టించెను. ఇతడు వీథులలో జనోపయోగము నీటిపారుదలకు చిన్న కాలువల గూడ గట్టించెనట. ఇతడు కట్టించిన జామిమసీదు, నగరమును చుట్టియుండు గోడ మొదలగునవి కిష్వార్ ఖాను యాజమాన్యమున జరిగినవి. ఇందులకు గావలసిన శిల్పులు హిందుదేశమున నానాదిక్కుల నుండి రావింపబడియుండిరి.

ఆదిల్ షాకు సంతానములేనందున నతనితర్వాత నతనితమ్ముడగు తామాస్పయొక్క కుమారుడు తొమ్మిదేండ్లబాలుడు ఇబ్రాహీం రాజగునట్లు రాజ్యమునందలి యున్నతోద్యోగియసభయందు తీర్మానింపబడెను. అతనికి సహాయముగ కామిల్ ఖాను నియమింపబడెను. ఆదిల్ షాభార్యయు, బాలరాజగు ఇబ్రాహీమ్ II నకు పినతల్లియు నగు చాంద్ బీబీ యతిసమర్థురాలై రాజ్యపరిపాలనయందు జాగరూకతతో మెలగుచుండెను.

కామిల్ ఖాను గర్వియై తనవిషయమున నలక్ష్యభావముతో మెలగుచుండినందున చాంద్ బీబీకి కోపముకలిగి కిష్వారు ఖానుచే నతనిని చంపించెను. రాజు బాలుడైనందున నిది తగిన యదనని నిజాముషా, కుతుబ్ షాలు మరల నేకమయి బీజపూరుపైకి రా నుద్యమించుట దెలిసికొని బీజపూరుసేనాని అఫ్ జల్ ఖాను వారిరువురు చేరకమునుపే వేర్వేర వారి నోడించెను.

చాందుబీబీ బీజపూరుచరిత్రయందు మిక్కిలి ప్రసిద్ధిగాంచినరాణి, వీరవనిత. విజయనగరరాజ్యముపైకి మహమ్మదీయులేకమైనకాలమున అహమ్మదునగరరాజగు హుస్సేను కుమార్తె యగు నీచాందుబీబీని ఆలీఆదిల్ షా పెండ్లాడెను. ఈయమ తొలుతటినుండియు రాజ్యపాలనావిషయమున శ్రద్ధవహించి, యెల్లప్పుడును భర్తకు సహాయపడుచు వర్తించుచుండెను.



భారతమహిళాసమాజముయొక్క అనాథబాలికాశరణాలయ ప్రారంభోత్సవము.



జపాను న్యాయశాస్త్రవిద్యార్థినులు చేతిముద్రలను పరిశీలించుట

ఈకాలమున బీజపూరున నంతఃకలహములును, బాహ్యశత్రువుల భయమును నెక్కుడుగా నుండెను. ఎటుజూచినను కుట్రలును, కుతంత్రములును జరుగుచుండెను. ఇట్టి విపరీతపరిస్థితులలో చాందుబీబీ కడు నిపుణతతోను, ధైర్యముతోను రాజున కేయుపద్రవమును గలుగనీయక కాపాడగలిగెను. కాలక్రమమున రాజు పెద్దవాడై స్వతం



సయ్యద్ అబ్దుల్ రహ్మాన్ గోరీలోని కప్పుక్రింది యలంకారపుపని.

త్రుడై దేశమును చక్కనిస్థితికి తేగలిగెను. ఈయన రాజ్యముఖ్యస్థానమును బీజపూరునుండి అచ్చటికి నాలుగుమైళ్లదూరమున నుండిన నౌరస్‌పూరునకు మార్పయత్నించి మరల నాప్రయత్నమును విరమించుకొనెను. అట్టి తరుణమున ఢిల్లీలోని మొగలుపాదుషాలు బీజపూరు తమకు సామంతరాజ్యమనియు, కప్పముకట్టవలసినవారనియు, పూర్వపు కప్పపుబాకీ మొత్తమును చెల్లించవలసినదనియు వార్తనంపి కయ్యమునకు కాలుదువ్వుచుండిరి. ఇదికాక అహమ్మదునగర రాజ్యసేనాధిపతి యొక్కప్రక్క దండెత్తివచ్చి సిలుగుల బెట్టుచుండెను. ఇబ్రాహిం ఆకాలముననే వ్యాధిగ్రస్తుడై ౧౬౨౭ వ సంవత్సరమున మరణించెను.

ఇతనికాలమున సాత్‌మంజిల్ అను నేడంతస్తుల మేడయు, దిల్కుష్‌మహలును, హైదరీబురుజును, మాలిక్ - కా - జహాన్ మసీదు, ఆనందమహలు, నౌరస్‌మహలు మొదలగు సుందర మగు కట్టడములును కట్టబడెను. ఇతని కాలముననే బీజపూరురాజ్య మత్యున్నతదశను చెందెను. ఇందు సుమారు పదిలక్షల జనసంఖ్యయు, ౧,౬౦౦ మసీదులును ఉండి, ౫౩,౦౦౦ అశ్వికులును, ౧,౦౦,౮౦౦ పదాతులును ౯౫౫ గజములును గల సైన్యమును నుండెనట.

ఇబ్రాహీము II తర్వాత మంత్రులను ముస్తఫాఖాను, ఖావాస్‌ఖానులు, అతని జ్యేష్ఠపుత్త్రుడగు దర్వేష్‌పాద్షాను రాజ్యమునకు రానీయక, రెండవవాడగు మహమ్మదను పదునైదేండ్ల బాలుని సింహాసనాధిష్ఠితుని గావించిరి. వెంటనే మహమ్మదు అహమ్మదునగరముపై దాడివెడల నిశ్చయించెను. అందులకు భావిఫలాఫలముల నాలోచింపక పెరవారగు మొగలులసాయముకోరగా నామిషను మొగలులకు దక్కనుదండయాత్ర కవకాశముగల్గెను. సాయముచేయవచ్చిన మొగలులు బీజపూరునుగూడ ముట్టడించిరికాని తరిమివేయబడిరి. అయినను మొగలు లంతటితో వీడిపోరైరి. షాజహాన్ చక్రవర్తి నేరుగావచ్చి అహమ్మదునగరమును నాశముచేసి, స్వాధీనముగావించుకొని బీజపూరుపైకి వచ్చి మహమ్మదు ఆలీషావద్ద నుండి సంవత్సరమునకు ౨౦ లక్షలధనమును కప్పముగా గట్ట నేర్పాటు చేసికొనిపోయెను. ఇతనికాలముననే బీజపూరులో సుప్రసిద్ధమగు గోల్‌గుంబజ్ కట్టబడినది (చిత్రము ౨).

మహమ్మద్ కాలమున షాజీయను మహారాష్ట్రవీరుడు బీజపూరుసామంతులలో నొకడుగా నుండెను. ఇతని స్థానము పూనానగరము. ఇతనికుమారుడే సుప్రసిద్ధశివాజీచక్రవర్తి. శివాజీ యప్పుడు రాజుకొరకేయని పడమటికనుమలలో మొగలులచే జిక్కిన కోటల నొకటొకటిగా గైకొనుచుండెను. తుదకు శివాజికృత్యములు మహమ్మదునకు సందేహాస్పదములుగా నుండినందున అతనిని శిక్షింప యత్నించుచు భగ్నప్రయత్నుడగుచుండెను. ఇట్లుండ మహమ్మదు



కుమాట్గిలోని తటాకములనడుమనుండు మందిరములు.

కాలధర్మమొందెను. అతనికి పురుషసంతానము లేనందున, ఆలీ అనువాడు రాజ్యమునకు వచ్చెను. ఈ ఆలీఅదిల్‌షా II కాలమున శివాజీ బలీయుడయి బీజపూరురాజ్యమునుండి స్వతంత్రుడగుటయే గాక దానికి ప్రక్కలోనిబల్లెమువంటివాడయ్యెను. ఆలీ, వానిపైకి అఫ్‌జల్‌ఖానను సేనానిక్రింద నొకసైన్యమును బంపెను. శివాజీ మాయోపాయమున వానిని జంపి సైన్యమునంతయు ఛిన్నభిన్నములుగా బారదోలెను.









అయిన్ ఉల్‌ముల్కు గోరీలోని యలంకారరూపములు.

మరల బీజపూరురాజొక గొప్పసైన్యమును పంపెనుగాని, శివాజి నదియేమియు చేయజాలకపోయెను. తుదకు నిరాశుడై శివాజీతో సఖ్యముగావించుటయే యుక్తమని వానికి కొంకణమును, దక్కనులో కొంతభాగమును ఇచ్చివేసి, యిదికాక మూడులక్షల ధనమునుగూడ నిచ్చెను. మొగలుల బాధయు దుర్భరమయినందున వారికి ఉత్తరముననుండు చాలరాజ్యభాగమును షోలాపూరుకోటయు నిచ్చివేసి సఖ్యముచేసికొనెను. సం. ౧౬౭౨ న, ఆలీఆదిల్‌షా II మరణించెను. ఇతనికుమారుడు, అయిదేండ్లబాలుడు, సికందర్‌షా రాజ్యమునకువచ్చెను. ఇప్పటికి బీజపూరుప్రతిభయంతయు పోయి రాజ్య మనేకకష్టములకు లోనయ్యెను. రాజు కేవలము బాలుడును, మంత్రులు ద్రోహచింతగలవారును, పరస్పరవైరులును, శత్రురాజులగు శివాజీ, ఔరంగజేబులు బలీయులును నైయుండ బీజపూ రెట్లు క్షేమముగా నుండగలదు? శివాజీ మరలమరల బీజపూరురాజ్యమును కొంచెముకొంచెముగా నాక్రమించుచు సం. ౧౬౭౪ న మహారాజ పదముతో పట్టాభిషిక్తుడయి జింజి, వేలూరుమొదలగు ప్రదేశములను గూడ నాక్రమించుకొనెను. ఔరంగజేబు కడసారి కొకగొప్ప సైన్యముతో దండెత్తివచ్చి సికందర్‌ఆదిల్‌షాను చెరగొని బీజపూరును మొగలాయిరాజ్యమున గలుపుకొనెను. ఇంతతో బీజపూరు రాజ్యమును అదిల్‌షావంశమును నంతరించెను.

బీజపూరుప్రతిభ జాటుట కచ్చటనుండు శిథిలములగు కట్టడములుమాత్రమే నిలిచియున్నవి. అందలి ప్రతికట్టడమును, మసీదుగాని, గోరీగాని, అంతఃపురముగాని శిల్పప్రావీణ్యమును వేనోళ్ల చాటుచున్నది. అందనేకోద్యానవనములును, వాటిమధ్య తటాకములును, తటాకములమధ్య జలమందిరములును కలవు. సం. ౧౭౬౦ న బీజపూరు మహారాష్ట్రపీష్వా యాధిపత్యములోనికివచ్చెను. మహారాష్ట్రుల యాధిపత్యకాలమున నందలిసుందరభవనములలోని దారు, లోహభాగములు చాలవరకు స్థలాంతరములకు గొంపోబడినవి.

ప్రస్తుతము బీజపూరు బొంబాయి రాజధానిలోని కాలాడ్గి జిల్లాలో నొక తాలూకాగా నున్నది. ఇందలి దృశ్యముల సౌందర్యమువలనను, ప్రాతవైభవమునందలి ప్రీతివలనను కాలాడ్గిలో నుండిన జిల్లాకలెక్టరు ముఖ్యస్థానము బీజపూరునకు మార్చబడినది. శిథిలములుకాక మిగిలియుండు కట్టడముల నిప్పుడు కలెక్టరు జడ్జిమొదలగు నున్నతోద్యోగుల నివాసభవనములుగను, ఆఫీసులుగను నుపయోగించుచున్నారు. ఇట్టియుపయోగమువలన నికమీద నీసుందర భవనములు శిథిలములుకాక యుండగలవనుట సంతోషాస్పదము.



# అలంపురము.

## మారేమండ రామారావు




### వివరములు

| | |
|---|---|
| ౧. నౌబత్ ఖానా | ౯. స్వర్గబ్రహ్మాలయము |
| ౨. ప్రధానద్వారము | ౧౦. బాలబ్రహ్మాలయము |
| ౩. ఒకగోరీ | ౧౧. తుంగభద్రకుపోవుదారి |
| ౪. చిన్నదేవాలయము | ౧౨. బాలబ్రహ్మాలయ ద్వారము |
| ౫. గరుడబ్రహ్మాలయము | ౧౩. కుమారబ్రహ్మాలయము |
| ౬. షాఅలీసమాధి | ౧౪. అర్కబ్రహ్మాలయము |
| ౭. తారకబ్రహ్మాలయము | ౧౫. మసీదు |
| ౮. శూలకబ్రహ్మాలయము | ౧౬. వీరబ్రహ్మాలయము |

ఆంధ్రదేశపు చరిత్రమును సమగ్రముగ దెలిసికొనుట కొకటి రెండు ముఖ్యకార్యములు నిర్వహింపబడవలసియున్నవి. ఇందు మొదటిది యీదేశమునను, దీనిసరిహద్దులనుగల కట్టడములను కళాదృష్టితో పరిశీలించుట. ఇట్లొనర్చినగాని యాంధ్రుల కళానైపుణ్యమును, వారి కళావిశ్వాసమునందలి వివిధచ్ఛాయలను గుర్తింపవలనుపడదు. రెండవకర్తవ్య మీదేశమునకును, విదేశీయపాలకులకును గల సంబంధము. ఈసందర్భమునగూడ సరిహద్దులలోనుండు కట్టడములు, శాసనములు నుపయోగింపగలవు. ఇంతవరకును మన దేశమునందును, ప్రాంతములందునుగల కట్టడములను కళాదృష్టితో బరిశీలించుటకై ప్రయత్నములు జరిగియుండలేదు. ఆంధ్రదేశపు సరిహద్దులోనున్న అలంపురమునందలి శిథిలములు అనేకకారణములచే గమనింపదగినవి. కర్ణాటాంధ్రదేశములచరిత్రమున కమూల్యములగు ముప్పదిశాసనములుగలిగి, అపూర్వములగు నిర్మాణపద్ధతులను, కళాపరిణామమును జూపు నిచటి శిథిలము లీవ్యాసమున వర్ణింపబడుచున్నవి.

అలంపురము ప్రకృతనైజామురాజ్యములోని రాయచూరు మండలమున, తుంగభద్రానదియొడ్డున, కర్నూలు కెదురుగా నున్నది. అలంపురము తాలూకా కిది కేంద్రస్థానము. ఇచటికుత్తరమున నెనిమిది మైళ్లదూరమున కూడలిసంగమమను కృష్ణాతుంగభద్రానదీసంగమస్థానమున్నది. సుప్రసిద్ధశైవాచార్యుడగు మల్లికార్జునపండితారాధ్యు డీస్థలముననే శివైక్యమునందెను. గ్రామనుమధ్య రాజమార్గము గలదు. ఈమార్గమునకును, దీనికితూర్పునగల తుంగభద్రకును నడుమ సుమారొక మైలుపొడవున నొక శిథిలదుర్గమున్నది. ఈదుర్గపుగోడలును, బురుజులును నదిలోనికి చొచ్చుకొనియున్నవి. శైవులకు ముఖ్యయాత్రాస్థలమగు నీగ్రామమునం దమూల్యమగు చారిత్రకసామగ్రి గలదు.

## దుర్గము

అలంపురదుర్గమునకు ప్రధానద్వారము రాజవీథినంటి యుత్తరదిశ నున్నది. ఈద్వారమున కమర్పబడిన తలుపులును, పైకప్పును నేడదృశ్యములైనను ద్వారబంధమును, మేలికవలె నున్న ప్రవేశమును మాత్రము నిలిచియున్నవి. ఈద్వార మిటీవల బహుశః మహమ్మదీయులీస్థలము నాక్రమించిన పిమ్మట నిర్మింపబడినదని తోచుచున్నది. ఇచటి గోడలలో మనోహరములగు శిల్పములు గల శిలాఖండములు చిందరవందరగ బిగింపబడియున్నవి. ఈశిల్పము లన్నియు శివుని యద్భుతచర్యలను దెల్పునవియై యున్నవి. వీనిలో శివుడు లింగమునుండి వెలువడుట, ప్రమథగణములచే సేవింపబడుట, పార్వతీపరిణయము నను ఘట్టముల శిల్పములు మిక్కిలి చక్కగ చెక్కబడియున్నవి.[౧] పార్వతీపరిణయమును నిరూపించిన శిల్పి మహాకవి కాళి

౧. ఈశిల్పములలో ముఖ్యమైనవి మిక్కిలి యెత్తుగా మూలలయందును, చీకటిగనుండుచోట్లను బిగింపబడియున్నవి.

దాసుని కుమారసంభవము నాదర్శముగ నుంచుకొనె నని తోచుచున్నది. అర్ధచంద్రాకారముగ నున్న యీదుర్గముయొక్క దక్షిణోత్తరముల కొనలు తుంగభద్ర నంటియున్నవి. దుర్గపు వెలుపలి గోడనంటి త్రవ్వబడిన కందకముయొక్క భాగము లచ్చటచ్చట గాంచనగుచున్నవి.



బాలబ్రహ్మాలయమునుండి కనబడు దృశ్యము

## లోపలి యావరణము

ఈదుర్గములోభాగమున తుంగభద్రనంటుచు నొకయావరణము గలదు. ఇదియే మనకు మిగుల ముఖ్యమైనభాగము. ఈయావరణమును సౌకర్యమునకై రెండుగ విభజింపవచ్చును. ఇందు మొదటిది నదియొద్దననేయుండు సన్నని చతురశ్రభాగము.౨ రెండవది దీని దక్షిణపుకొననున్న సమచతురశ్రభాగము.౩ ఇట్టి యీలోపలి యావరణములో నత్యద్భుతములు, విస్మయజనకములు నగు తొమ్మిది దేవాలయము లున్నవి. అన్నియు నొకేపోలికనున్న యీయాలయములు ఆకృతికిని మహత్వమునకును మైసూరురాజ్యములోని సుప్రసిద్ధ నిర్మాణమగు పట్టడకల్ దేవాలయమును పోలయున్నవి. వీనిపైవిమానములు నిలువువంకర (Curvi-linear form) యాకారముగలవి.౪ వీనిచుట్టును చిన్నచిన్న స్తంభములును, కిటికీలును, గూళ్లును నిర్మింపబడినవి. వీనియన్నిటిపైనను నగిషీపనులు, చక్కనివిగ్రహములు నున్నవి. ఈవిమానములయగ్రమున నుసిరికాయవలె గుండ్రముగ నుండి గుమ్మడికాయపైభాగమునందువలె వంకెలునుగల ఆమలకములు ప్రతిష్ఠింపబడినవి. (Cushion - like capitals) బుద్ధగయ, భువనేశ్వరము మున్నగు నుత్తరదేశస్థలములలోని దేవాలయముల విమానములీట్లేయున్నవి. ఈనిర్మాణపద్ధతికి కళాభిజ్ఞులు Indo-Aryan style అనిపేరిడియున్నారు. ఈయాలయముల ప్లానును, క్రిందిభాగములను నిర్మించినపద్ధతియుగూడ గమనింపదగినవే. ముందుభాగమున స్తంభములుగల ప్రాంగణములతోడను (Porches),
చక్కనినగిషీపనిగల స్తంభములతోడను, చుట్టును మూయబడి స్తంభములుగలగూళ్లతో నిర్మింపబడిన క్రిందిభాగములతోడను ఈయాలయములు కొండలలో దొల్చబడిన ఎల్లోరాఅజంతాగుహలను పోలియున్నవి. ఇట్టియాలయములనిర్మాణములో ఉత్తరపశ్చిమదేశములలోని యాలయనిర్మాణపద్ధతులు ప్రతిబింబించుచున్నవి. ప్రత్యేకములగు రెండుకళాపద్ధతులసంకలనముగల యీకట్టడములు కర్ణాటాంధ్రదేశముల సరిహద్దులో నుండుట విస్మయజనకముగనున్నది.

ఇటుపై లోపలియావరణమునగల శిథిలములను వర్ణింపవలసియున్నది. దీనికి ప్రధానద్వారము పైనపేర్కొనబడిన సమచతురశ్రపు దక్షిణపుకొననున్నది. ఎత్తయినయొకరాతిబురుజుకును౫ బలమగు నొకరాతిగోడకును నడుమ దక్షిణాభిముఖముగ నొకద్వారమున్నది. దీనినిదాటి కొంతదూరమేగినచో మార్గము తూర్పుకు తిరుగును. ఇచట నున్నతములగు శిలాప్రాకారములనడుమ రెండవద్వారమున్నది. ఈద్వారమునకు కఱ్ఱతలుపులును, పైన కప్పును గలవు. ఈకప్పుపై నొకగోపుర ముండెడిదని తోచుచున్నది. దీనిలోపలివైపు మూడుగ విభజింపబడి త్రిమూర్తులవిగ్రహములును వానిలో చెక్కబడియున్నవి. ఈద్వారము నానియున్నగోడలలో నిరుపార్శ్వములను మూడేసి గదులున్నవి. వానిలో కొన్నిలింగములును గణపతివిగ్రహములును గలవు. గోడలపైనను స్తంభములపైనను ఆరుశాసనములు చెక్కబడినవి.౬

ఇచ్చట నేలపై నొకరాయి యున్నది. దానిపై నిర్వురు వీరులు కత్తిని, డాలును ధరించి పోరాడుచున్నట్లు చెక్కబడియున్నది. డాలులపైనను, రాతియంచులమీదను కొన్ని యక్షరములున్నవి. కాని బాగుగా నరిగిపోవుటచే నవి స్పష్టముగా తెలియుటలేదు.

ఈద్వారమును దాటి మన మొక సమచతురమగు నావరణమును ప్రవేశింతుము. దీనిలో నెడమభాగమున నొక రాతితిన్నెపై నొక మహమ్మదీయునిగోరీ యున్నది. దాని కుత్తరమున నొక చిన్నదేవళము గలదు. శిథిలావస్థయందున్న యీగుడిలో నొక ముఖమంటపమును, ప్రవేశమంటపమును, గర్భాలయము నున్నవి. పైవిమానము చిన్నదైనను మనోహరముగ నున్నది. ఇది యిటుకలతో కట్టబడినది. దీనికి తూర్పున నక్షత్రాకృతిగల గొప్పయాలయమొకటి యున్నది.౭

౨. ప్లానులోని నం. ౯-౧౬ గల భాగము.

౩. ప్లానులోని నం. ౧-౮ గలభాగము.

౪.

౫. దీనికి ప్రస్తుతము 'నౌబత్ ఖానా' యనిపేరు.

౬. ఈశాసనములు ప్రత్యేకముగ నాచే ప్రకటింపబడును.

౭. హైదరాబాదు ఆర్కియాలజికల్ శాఖవారీయాలయము నొకధర్మశాలగ వర్ణించియున్నారు. ఇదసరికాదు.

సువిశాలమగు నీదేవళము మిక్కిలి బలిష్ఠమైనది. ఇందెన్నియో మంటపములును, వసారాలును, చిల్లరగుడులు నుండెడివని తోచుచున్నది. ఈగుడివెనుకభాగముమాత్ర మాయావరణలో నున్నది. దీనిపై విమానమును, శిఖరమును నశించిపోయినను, కప్పుపై వీనిచిహ్నములు మాత్రమున్నవి. శిలానిర్మితములగు నితరాలయములవిమానములు నేటికిని నిలిచియుండుటను బట్టియు, నీ యాలయపుకప్పుపైనున్న సున్నపుపనియొక్కయానవాళ్లనుబట్టియు దీనివిమానముగూడ నిటుకతోనే గట్టబడెనని తోచుచున్నది. మిక్కిలి విశాలమగుమట్టమును, మిగుల నెత్తగుకట్టడమునుగల యీగుడికి వానికిసరియైన యెత్తును వైశాల్యమునుగల విమానము నిర్మింపబడియుండును. బహుశః ఒక గోపురమేగాక దానినిచేరి మరికొన్ని చిన్నవిమానములుగూడ నుండియుండవచ్చును. ఆలయఘమట్టసమునుబట్టి యాలోచించినచో దీనివిమానము మిక్కిలి యెత్తైనదిగ నుండవలెనని తోచుచున్నది. ఇట్టి కట్టడములలో నిటుకగోపురములను నిర్మించుటాచారమైయున్నది. వారంగల్‌కు ౩౦ మైళ్లదూరమున గాకతీయ గణపతిదేవునికాలమున నిర్మింపబడిన రామప్పగుడియు, దాని గోపురము నిందులకు నిదర్శనములు. నైజాంప్రభుత్వమువారి ఆర్షశాఖోద్యోగు లీయాలయమును ధర్మశాలగ పేర్కొనియున్నారు. ఇది సమంజసముకాదు. అలంపురమున తొమ్మదిశివాలయము లున్నటుల క్షేత్రమాహాత్మ్యమున గలదు. ప్రకృతాలయము ధర్మశాలయైనచో నిచటిశివాలయములసంఖ్య ఎనిమిదియేయగుచున్నది. అదియునుగాక స్థానికు లిమ్మది గరుడబ్రహ్మాలయమనియు, తమబాల్యమున నిందలి లింగమును జూచితిమనియు, నిటీవల నది యూడబెరుకబడెననియు నాకు చెప్పిరి. అందుచే నిది శివాలయమేయని చెప్పవలసియున్నది. ఇచటిదేవళములన్నిటిలో నిదియే పెద్దది. దీనికి దగినయౌన్నత్యమును, శిల్పములునుగల గోపురముండినకాలమున నీయాలయ మాశ్చర్యజనకముగ నుండెడిదనుటకు సందేహము లేదు. అయినను దీనిప్రకృతావస్థ మిక్కిలి విషాదజనకముగ నున్నది. మహమ్మదీయులు దీని నాక్రమించి మధ్యమధ్య గోడలనుబెట్టి పెక్కుగదులను నిర్మించిరి. ప్రక్కనున్నగోరీకి ఏటేటనుజరగు నుత్సవములలో నీయాలయము సత్రముగ నుపయోగింపబడుచున్నది. ఇతరసమయములలో నిది యనేకవిధములగు దుష్కార్యముల కుపయోగించుచున్నది. సమచతురశ్రావరణమునం దీశమభాగమున నింకేమియు విశేషములు లేవు. కుడిభాగమున ద్వారమునంటి షాఅలీయను మహమ్మదీయుని గోరీయున్నది. దీనికి వెనుకభాగమున తారకబ్రహ్మాలయమున్నది. గోరీకెదురుగ మహమ్మదీయుల స్మశానమొకటియు, దానికావల శూలకబ్రహ్మాలయము నున్నవి.



తారకబ్రహ్మాలయము-అలంపురము

వీనినిదాటి తూర్పుగా నేగినచో నొకచిన్నద్వారమువచ్చును. దీనిలోనుండి తుంగభద్రయొడ్డునగల సన్నని చతురశ్రభాగమును ప్రవేశింతుము. ఇందు మొదట గన్పించునది బాలబ్రహ్మేశ్వరాలయ బహిర్ద్వారము.౮ దీనిపై నొక చిన్న మంటప మున్నది. ఒకయావరణమధ్య నీబాలబ్రహ్మేశ్వరాలయ మున్నది. ఈగుడి యావరణలోని తూర్పుగోడలో నొకద్వారమును, దానినిజేరి తుంగభద్రవరకు నొక మెట్లవరుసయు గలవు. బాలబ్రహ్మాలయమునకు దక్షిణమున స్వర్గబ్రహ్మాలయ మున్నది. ఉత్తరమున నొకవరుసలో నాలుగు దేవళములున్నవి. ఇందు మొదటిరెండును కుమార, అర్కబ్రహ్మలవి. మూడవది నేడు మసీదుగ నుపయోగింపబడుచున్నది. నాల్గవది వీరబ్రహ్మాలయము. ఈవిధమున అలంపురములో నవబ్రహ్మాలయములును గాంచనగుచున్నవి.

## ఆలయములు

ఇంతవరకును అలంపురశిథిలములను పేర్కొనియుంటిమి. ఇచటియాలయముల నిటుపై ప్రత్యేకముగ వర్ణింపవలసియున్నది.

౧. తారకబ్రహ్మాలయము — ఈయాలయపు గోపురము శిథిలమై పోయినది. ఇందలిగోడలపై నత్యద్భుతములగు శిల్పము లున్నవి. ఇందొకముఖమంటపమును, దానివెనుక నొకప్రవేశమంటపమును, దానిని జేరి గర్భాలయము నున్నవి. ప్రవేశమంటపముచుట్టును సన్నని వసారా గలదు. భక్తులు దీనిలోనడచుచు ప్రదక్షిణము చేయుచుండిరి. నగిషీపనియేమియు లేకుండినను ఈయాలయములోని స్తంభములు బలిష్ఠములైనవి.

౨. శూలకబ్రహ్మాలయము :— ఈదేవళము ప్రాఙ్ముఖముగ నున్నది. దీనియెదుట నొకప్రాంగణము (Portico) గలదు.

౮. హైదరాబాదు ఆర్షశాఖవా రీయాలయము భీమశంకరునిగుడియని వ్రాసినారు. ఇది తప్పు.

అటుపై నొకసన్నని వసారామధ్య ప్రవేశమంటపమున్నది. ఈవసారా ప్రదక్షిణమున కుపయోగించెడిది. పిమ్మట నంతరాళమంటపము, నటుపై గర్భాలయము నున్నవి. ఈగుడిలో నొకవేదికపై లింగము ప్రతిష్ఠింపబడియున్నది. ఈవేదికకు నాల్గువైపులను రాతిస్తంభము లున్నవి. వేదికచుట్టునుగలప్రదేశము రెండవప్రదక్షిణముగ నేర్పడి భక్తులలో విశిష్టులగువారిచే నుపయోగింపబడుచుండెనని తోచుచున్నది. ఈయాలయములోని గోడలపైనను చక్కనిలతలును, కపప ముఖములును చెక్కబడియున్నవి. గోడలవెలుపలిభాగమున సుందరములగుశిల్పములున్నవి. అందు తాండవనృత్యముచేయు శివునివిగ్రహమును, ప్రణయగోష్ఠిలోనున్న గంధర్వదంపతుల బొమ్మలును మనోహరములైనవి.



వీరబ్రహ్మాలయము-అధోభాగము

3. కుమారబ్రహ్మాలయము:—ఈయాలయ మొకరాతిచపటాపై ప్రాఙ్ముఖముగ నిర్మింపబడినది. ఇందు ముఖమంటపప్రవేశమంటపములును, వానివెనుక గర్భాలయము నున్నవి. ఇచటి స్తంభములపై చెక్కడపుపని ఎల్లోరాఅజంత శిల్పములను స్మృతికి దెచ్చుచున్నది.

౪. అర్కబ్రహ్మాలయము—ఈయాలయము కుమార బ్రహ్మగుడివలెనే నిర్మింపబడినది. ఇందు లోభాగమున బ్రదక్షిణమున కుపయోగించు చుట్టువసారా యొకవిశేషము. గోడల వెలుపలిభాగమున చక్కని నగిషీపనిగల స్తంభములతో నిర్మింపబడిన గూళ్లు గలవు. వీనినడుమ హిందూదేవతల విగ్రహము లున్నవి.

౫. మసీదు—ఇది పూర్వ మొక శివాలయముగ నుండెడిదని ముందు చెప్పియుంటిమి. ఇందు ముఖమంటపమును, ప్రవేశమంటపమును, దీనిచుట్టును బ్రదక్షిణార్థ ముపయోగించెడి వసారాయును, వానివెనుక గర్భాలయము నుండెడివి. ఆలయముపైగోపురమును, ప్రవేశమంటపముపైకప్పును తొలగింపబడినవి. గర్భాలయములో వేదికయుండెడి స్థలమున నొకయడ్డగోడ పెట్టబడినది. దీని కెదురుగనే నేడు మహమ్మదీయులు నమాజ్ చేయుచున్నారు. ఈకట్టడపుగోడల వెలుపలిభాగమున నాలుగైదుశాసనములు చెక్కబడియున్నవి. అయినను ఎండవానలకు గురియగుటచే వీని యక్షరములు మిక్కిలి యరగిపోయినవి. శాసనములు తెలుగుభాషలోనివనిమాత్రము చెప్పుటకు వీలగుచున్నది.

౬. బాలబ్రహ్మాలయము — అలంపురమునందలి యాలయములలో నెల్ల నిది నేడు ముఖ్యమైనదిగ నున్నది. ఇందు నిత్యపూజాదికములు జరుగుచున్నవి. తూర్పుముఖముగ నున్న యీ యాలయమునం దొక చిన్నసంది మంటపమును, దానికావల విశాలమగు ముఖమంటపము, నటుపై నంతకంటెను పెద్ద దగు ప్రవేశమంటపము, నటుపై అంతరాళమంటపమును దానినిజేరి గర్భాలయము నున్నవి. గర్భాలయముచుట్టును బ్రదక్షిణమున కుపయోగించు సన్నని వసారాగలదు. గర్భాలయముమధ్య నొకవేదికపై నేడారాధింపబడు లింగము గలదు. ఈవేదికచుట్టును భక్తులు ప్రదక్షిణముచేయుటకు దగిన వైశాల్యముగలతావు గలదు. ఈగుడిలోభాగమున సప్తర్షుల యొక్క విగ్రహములు, నితరశైవదైవతముల విగ్రహములు నున్నవి. ఈయాలయముచుట్టును చిన్నచిన్నగుడు లెన్నియో నిర్మింపబడినవి. బాలబ్రహ్మేశ్వరాలయగోపురము కొన్ని యడుగులదట్టముగల సున్నపుపూతతో నిండియున్నది. ఇతరాలయశిఖరములవలె నిందును మనోహరములగుశిల్పము లుండియుండును. కొంచెమైనను కళాదృష్టిలేని భక్తులు, తమభక్తివిశేషమును తెల్పుటకొఱకున ప్లేటేటను మూడునాలుగుసార్లు వేయుచున్న పుపూతలీగోపురపు సౌందర్యమును మరుగుపరచుచున్నవి. ఈయాలయములోని లింగము వింతగానున్నది. వేదికపైనున్న శిలాలింగముమధ్య నొకబిలము గలదు. దానిలో మరియొకలింగమున్నది. పైకవచమునుదీసి సవిమర్శముగా జూచినగాని యీయంతర్లింగ మగుపడదు. ఈయాలయపు ఆవరణలోనుండు విగ్రహములలో నెల్ల నొకటి మాత్రము మిక్కిలి వింతగనున్నది. ఒక నల్లరాతిపైన నగ్నయై, రెండు మోకాళ్లును దౌడలకుదగులునట్లు ముడుచుకొని కూర్చొనియున్న స్త్రీమూర్తి చెక్కబడియున్నది. ౯. ఇది భూదేవివిగ్రహమట.

## పాపనాశన క్షేత్రము

అలంపురగ్రామమునకు రెండుమైళ్లదూరమున పాపనాశనమను క్షేత్ర మున్నది. ఇచ్చట నైదారుచిన్నదేవళములు తుంగభద్రాతీరమునం దున్నవి. గట్టు ఎత్తయినదికాకపోవుటచే, వరదలువచ్చినపుడీగుడులన్నియు నీళ్లతోనిండియుండును. ఈగుడులశిఖరములు చిన్నవిగను, సామాన్యముగను నున్నవి. అదేవిధమున వీనిలోభాగములుగూడ నిరాడంబరములైయున్నవి. ఇందు ముఖ్యమైనగుడి తుంగభద్రాభిముఖముగా నున్నది. ఇది యెఱ్ఱరాతితో నిర్మింపబడినది. ఇందొక

---

౯. ఇట్టి విగ్రహములు గద్వాలసంస్థానములోని రాజోలిగ్రామములో తుంగభద్రాతీరమునందున్న రామేశ్వరాలయములోగూడ నున్నవి. చాళుక్యుల ఆలయములలో నిది తరచుగా నుండునేమో.

మంటపమును, గర్భాలయమును మాత్రమేగలవు. దీనికి దక్షిణముగా కొంచెముపల్లములో కట్టబడిన మరియొకదేవళము దర్శనీయ మైనది. ఇందు మిక్కిలిమనోహరము లగు విగ్రహములు, శిల్పములు నున్నవి. వానిలో నటరాజశివునియొక్కయు, శివపార్వతులయొక్కయు, భార్యతోడను నెమలితోడనుగూడిన కుమారస్వామియొక్కయు విగ్రహము లగ్రగణ్యములు. ఈచిన్నిగుడి కప్పులోభాగమున త్రిమూర్తులవిగ్రహములు చెక్కబడియున్నవి. స్తంభములపైన చక్కని నగిషీపనిగలదు. వీనిపైనున్న శైవగాథలచిత్రములు విస్మయజనకములు.౧౦ ఏటేటనువచ్చు తుంగభద్రవరదలమూలమున నీయాలయములు పాడగుచున్నవి.

౧౦. ఈయాలయ మొకప్రక్కగా నుండుటచే దీనికి వెలుతురు వచ్చుటలేదు. దీపముండినగాని యీశిల్పము లగపడవు.

## శాసనములు

వాస్తునిర్మాణకౌశలమునకును, శిల్పవైచిత్ర్యమునకునే గాక నీయలంపురదేవాలయములు చరిత్రమునకుగూడ మిక్కిలిముఖ్యములు. వీనియందనేక రాజవంశములకుజెందిన ముప్పదియారు శాసనములను నేను గన్గొంటిని. ఇంకను కొన్ని భూమిలోను, గోడలలోను బిగింపబడినట్లు తెలియుచున్నది. ఒక బాలబ్రహ్మేశ్వరాలయావరణముననే సుమారిరువదిశాసనములు నాకు దొరకినవి. ఈగుడి ప్రధాన ద్వారమున కెడమవైపున గోడలో బిగింపబడినరాళ్లపై మూడును, గోడను జేరి నిల్పబడిన స్తంభములపై పదియు, ధ్వజస్తంభము నానియున్న బండలపై మూడును, చెదరిపడియున్న రాళ్లపై రెండును శాసనములున్నవి. తుంగభద్రలో నిర్మింపబడిన గోడలో సుమారు పదియడుగుల యెత్తున మూడురాళ్లపై నొక ప్రాచీనకన్నడశాసన మున్నది. ఎండవానలకు గురియై దీనిలోని యక్షరములు కొన్ని యరగి పోయినవి. ఇది బాదామీ చాళుక్యులశాసనము. ఈనవబ్రహ్మాలయావరణపు ముఖ్యద్వారములో గోడలపైన మరియారుశాసనము లున్నవి. మొదట శివాలయముగనుండి ప్రకృతము మశీదుగ నుపయోగింపబడుచున్న కట్టడపుగోడలపై మూడు తెలుగుశాసనములు గన్పించుచున్నవి. పాపనాశనక్షేత్రములో ముఖ్యాలయ స్తంభములపై రెండు శాసనములున్నవి. ఇంకను కొన్ని బాలబ్రహ్మేశ్వరాలయ మంటపములో నిలువున పాతబడియుండుటవలనను, మరికొన్ని భూమిలో పూడియుండుటవలనను వానికి ప్రతిబింబములను తీయుటకు వీలుకాలేదు. సవిమర్శముగ బరిశీలించినచో నింక నెన్నియో శాసనము లీస్థలమున దొరకగలవు.౧౧

ధరలు – జీతములు




౧౧. అలంపురమున నాచే సేకరింపబడినశాసనములు త్వరలో ప్రకటింపబడును.

# ఫ కీ రు

అప్పల వీరవెంకటభోగయ్యశాస్త్రి.
(కవిమిత్రమండలి)

[అల్లాకై తపమాచరించు నిస్పృహుఁడైన ఫకీరు - తన శరీరమునంతయుఁ బక్షుల కాహారముగా నిడి, యస్థిమాత్రావశిష్టుఁడైయుండ, నిర్దయతోఁ దన కన్నులంగూడ పొడిచితినుటకు వచ్చిన శకుంతముల నిట్లు ప్రార్థించుచున్నాఁడు.]

శ్రీ కుయ్యమై వెలసిన దు-ర్భిక్షంబున నాదుమేని పిశితమునెల్లన్
లక్షింపక మీకొసఁగితి-నక్షియుగముఁ దినక విడువరమ్మా మీరల్.

ఎన్నో కొండలు పిండియయ్యె మనమం దింకెన్ మహావార్ధు లు
త్పన్నం బయ్యె తమోగ్రనీలవిచల త్ప్రావృట్పయోదంబు లీ
మన్నన్ మిన్నను నేకమయ్యె రవళింపన్ దర్శనోత్కంఠచేఁ
గన్నుల్ గాయలుగాచె - జన్మమువృథా గాకుండ రక్షింపరే!

ఇల్లా? వాకిలియా? యనర్ఘమణులా? హేమంపు సద్భూషలా?
యిల్లాలా? సుతులున్ హితప్రకరమా? హృద్యంపు ఖాద్యంబులా?
తల్లా? సర్వము విశ్వమోహనకళోద్వ్యాపక్రియానాథుఁడా
యల్లా యొక్కఁడె దిక్కుగాక జగమం దన్యంబు నాకున్నదే!

బంధుర నవ్యభవ్య మృదు పాదపయోజుఁడు భూరిసత్కృపా
సింధుఁడు దర్శనంబొసఁగి చిన్మయరూపముఁజూపి లోక సం
బంధము బాపవచ్చిన శుభంకరుఁ గన్నులఁ జూడలేని క
ట్టంధుఁడనైన నెట్లు? హృదయంబున యోచనఁజేసి చెప్పరే!

కఱవరుదెంచెనంచు తమ కంబు నశింపక దేహమిచ్చితిన్
మఱవకుఁ డమ్మలార యణుమాత్రము, మాంసము శోణితంబు లే
దరయఁగ నాశరీరమున నస్థులుఁ గన్నులుఁదప్ప యెన్నఁడేన్
మఱుఁగిడినానె మీయెదుట మర్మము వీడి వచింపుఁడీ తగన్.

మృదులపేశల సత్సుధా మిళితవిమల - నవ్యనవనీతనిరుపమాన ప్రహృష్ట
హృదయ సరసీరుహుం డెవ్వ డేవిధాన - దర్శనం బిచ్చునో దేహతాప మడఁప!
కఱకురాగుండె గుహలోన మెఱయుచుండి - యారిపోవదు నాదుధైర్యంపు జ్యోతి
దర్శనంబిచ్చు 'నల్లా' యథార్థముగను - కన్నుఁగవ నిల్పరే నాకుఁ గరుణతోడ!
అరయఁ బుట్టుటగిట్టుట లాది నిజము - స్థిరత లేదు చరాచర జీవతతికి
కర్మపరిపక్వ మెన్నఁడేకరణినగునో? - యెవ్వరెఱుఁగుదు రదియెల్ల యీశ్వరాజ్ఞ!

---

ఆంధ్రరత్న. దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగారి-స్మారకదినోత్సవము, చెన్నపురి



గుంటూరు శారదానికేతనపు అష్టమవార్షికోత్సవము



రాధాస్వామి మతగురువులు హుజూరు సాహేబ్జీ మహారాజుగారు చెన్నపురికివచ్చినపుడు స్టేషనువద్ద స్వాగతము



యూరపుకువెడలిన బొంబాయి విశ్వవిద్యాలయ విద్యార్థినులు

# S. GANESAN PUBLICATIONS

## 50% Reduction allowed on the Prices.

| | Rs. As. |
|---|---|
| Young India ... ... | 4 0 |
| Supplement ... ... | 1 8 |
| Indian Home Rule ... (By M. K. Gandhi) | 0 8 |
| To the Students ... | 1 0 |
| Terence Macswiney ... (By C. F. Andrews) | 0 8 |
| The Making of a Re-public (By Kevin R. O'Shiel) | 1 8 |
| The Sayings of Kabir ... | 0 8 |
| The Sayings of Thulasidas (By Lala Kanno Mal M.A.) | 0 8 |
| The Failure of European Civilization ... (By S. E. Stokes) | 1 0 |
| Principles of Freedom ... (By Terence Macswiney) | 2 0 |
| The Story of My Life ... (By Bhai Paramanand) | 1 8 |
| The Future of Indian Fiscal Policy ... ... (By D. V. Divekar) | 0 12 |
| The Aims of Labour: An Ideal Commonwealth (By the Rt. Hon. Arthur Henderson) | 1 0 |
| India in England ... (By Miss Helena Normanton) | 2 0 |
| Indian Currency and Exchange ... ... (By K. C. Mahindra B A.) | 3 8 |
| History of England (in Tamil) ... (By N. Vasudeva Iyer, M.A. L.T.) | 1 0 |
| The National Being: Thoughts on an Irish Policy (By A. E. George Russel) | 1 0 |
| The Dawn of a New Age And other Essays ... | 1 0 |
| The Duties of Man With Biographical Introduction ... (By W. W. Pearson) | 1 0 |
| Need in Nationalism ... (By Aurobinda Ghose) | 0 8 |
| Landmarks in Lokamanya's Life ... ... (By N. C. Kelkar) | 1 8 |
| The Gospel of Swadeshi (By Prof. Kalelkar) | 0 4 |
| The Philosophy of Art... (By D Raghurama Acharya) | 0 12 |
| Ideals of Non-Co-operation And other Essays ... | 1 0 |
| The Man and His Work "Josiah C. Wedgewood" (By Lajpat Rai) | 2 0 |
| The Truth of Life ... (By Rabindra Kumar Ghose) | 0 8 |
| Ahimsa and World Peace | 1 8 |
| The Spiritual basis of Democracy ... (By Wilfred Wellock) | 3 0 |
| Letters from Abroad ... (By Rabindranath Tagore) | 2 0 |
| Faith and the Future ... | 0 12 |
| From the Council of God (By Joseph Mazzini) | 0 12 |
| The Revolt of the East ... | 1 0 |
| Food, Mind & Health ... | 0 8 |
| Menace from the West ... | 0 4 |
| The Foreign Policy in India | 0 4 |
| Agitate ... ... (By Bernard Houghton) | 0 4 |
| Rambles in Vedanta ... (By B. R Rajam Ayyar) | 2 0 |
| Hindu Culture ... ... (By K. S. Ramaswamy Sastry, B A., B.L.) | 2 0 |
| The Indian Teachers in China ... ... (By Phanindranath Bose) | 2 8 |
| Nehal the Musician & other Tales ... (By Snehalata Sen) | 2 0 |
| Some Financial Problems of India ... ... | 2 0 |
| The West ... ... (By K. Kunhigannan M.A.Ph.D.) | 2 0 |
| Labour in Madras ... (By B. P. Wadia) | 2 8 |
| Satyagraha in Champaran (By Babu Rajendra Prasad) | 2 8 |
| Swaraj Constitution ... (By S. Sreenivasa Iyengar, B.A., B.L.) | 1 0 |
| The Aphorisms of Narada (By Lala Kanno Mal, M.A.) | 0 8 |
| Women in Hindu Law... (By K. T. Bhashyam Iyengar, B.A., B.L.) | 0 8 |

*N. B.*—A commission of two annas & four annas Per Rupee is allowed on purchase of not less Than Rs. 10/- & Rs. 20/- respectively (after allowing 50% reduction) at a time. the purchase shall be one book only of every kind in the list of the Catalogue.

For Book Sellers, Libraries etc., special discount will be given on application.

Packing Charges will be free, and Postage or Railway Freight is to be borne by the purchasers.

25% of the amount of the order is to be sent in advance stating clearly the full address. If the books are to be sent by Railway, the name of the nearest Railway Station in bold Types is to be mentioned. **Ask for our Detailed Catalogue**

**ANDHRA PATRIKA OFFICE,** No. 7, Thambu Chetty Street, MADRAS.

విశ్వనాథ సత్యనారాయణగారికి చెన్నపురి ఆంధ్రమహాసభవారి సమ్మానము



9-వ ఆంధ్రదేశ కళావంతుల సంఘసంస్కరణసభకు హాజరయిన స్త్రీ ప్రతినిధులు



దక్షిణభారత హింద్ప్రచారసభవారి హిందీయాత్రాదళము



ప్రెసిడెన్సీకాలేజి ఆంధ్రసంఘవార్షికోత్సవము




ఈ కారనేషన్ నియూ డైమన్డు, జాతిపుష్యరాగం, ఆర్టిఫిషియల్, యిమిటేషన్ & శాస్త్రీయ పుష్యరాగం, రంగూన్ డైమన్డు, యిమిటేషన్ చక్కరసానలో తయారు చేయబడిన యొర్పపట్టె కెంపు, పచ్చ, వైక్రాంతం, ఇంగ్లీషు రాళ్లు మరియు అనేకవిధములైన రాళ్లు దొరకును. చాల సరసము. కేటలాగు ధరలపట్టీ ఉచితము.

క్యాటలాగ్ ఇనాముగా అంపబడును.

## R. ముత్తుస్వామి శ్రేష్ఠి,

షరాపువ్యాపారం. పెద్దబజారువీధి, తిరుచినాపల్లి.,

# రు. 100 ల బహుమతి

అసలు పుష్యరాగముల ఆభరణములు

అసలు పుష్యరాగముల ఆభరణములు గల దుకాణమునందే ఎల్లప్పుడు లావాదేవిచేయుటకు ప్రతివారు కోరుచుందురు. కావున మీరు ఈ దిగువ స్థలమునకు వచ్చిన మేలైన అసలు పుష్యరాగములు ఇతరమణుల నగలు న్యాయమైన ధరకు దొరకును.

అసలు పుష్యరాగములు కాదని రుజువు పరచునట్టి వారికి రు. 100 లు బహుమతి ఇవ్వబడును.

## జలగం సుబ్రహ్మణ్యం నాయుడు, కంపెనీ

222 చైనాబజారురోడ్డు మదరాసు.

## ది ఇండియా ఎలెక్ట్రిక్ వర్క్సు లిమిటెడ్

పో. బా. నెం. 232, 4-5 సెకండులైన్ బీచ్, మద్రాసు.

Phone 2660

Telegrams "Manufacter"

# ఢిల్లీలో ఇండియా ఫ్యానులు



భారతప్రభుత్వోద్యోగులు తమ తమ ఆఫీసు పనులను చేయునప్పుడు కాయకష్టమువలన శ్రమచెందుచున్నను యిండియా ఫ్యానుల చల్లనిగాడ్పులచే, సేదదీరి సుఖముగానున్నారు.



2000 ఇండియాఫ్యానులు యీభవనములలో నేర్పాటు చేయబడియున్న విషయమే యివి యెంత నమ్మకముగా, యెంత మితవ్యయముగా పనిచేయుచున్నవో తెలియగలదు.



ప్రతి ఇండియా ఫ్యానుతోను 2 సంవత్సరములగ్యారంటీ నమ్మకము పంపబడును.

# తెలుగు వాణి

అబ్బరాజు వెంకటరంగారావు

మొలపించినా రొక ముగురు మూర్తులుగూడి తీపిగన్నులచెట్టు తేనెపట్టు
నాటినా డొకవేద నవనవోన్మేషమౌ భక్తిమూలపుమొక్క ముక్తికిక్క
చవిజూపినా డొక సాహితీరసికుండు శృంగారఖండాల చిందుమధువు
మూచూపినాడొక ముద్దుపల్కులవాగ్మి పారిజాతసుమంపు సౌరభముల
తెలిపె నొక్కడు తెలుగు జాతీయరుచులు - ఒకడు సంగీతసాహిత్య మొలుకబోసె
నిను కళాపూర్ణగాజేసె ఘనుడొకండు - తేనెపల్కుల కల్యాణి తెలుగువాణి!

పద్యప్రబంధాలు ప్రాణాలువిసిగింప "గద్యతిక్కన" నీదు గాసిదీర్చె
భాషాప్రపంచాన పచరించె వింతలు చిలకమర్త్యన్వయ శ్రేష్ఠతముడు
వచనప్రహాసనంపు వాహినిపారించె పానుగంటికులప్రభావశాలి
కవితత్త్వమునెల్ల గాలించిగాలించి కట్టమంచిప్రధాని గౌరవించె
నడలు నిర్మించి రల గురిజాడవారు - కీర్తినింపిరి దిక్కుల గిడుగువారు
రసము లూరించి రల దుగ్గిరాలవారు - తేనెపల్కుల కల్యాణి తెలుగువాణి.

పలురకంబుల నిన్ను పలికించిమించిరి తిరుపతీశులజంట తెలుగుపంట
నానావిధంబుల నడపించినెగ్గిరి పార్వతీశయుగము బాసజగము
శిల్పనైపుణ్యాలు చిత్రించిచూపిరి శేషాద్రిరమణులు జీవమణులు:
ఉవ్వెత్తుగానిన్ను నుప్పరంబునకెత్తె కొప్పరంపుకవలు కూర్మిరవలు
భూరిహారాలునింపె వేటూరివారు - భూషలెన్నొ వేసిరి మంగిపూడివారు
క్రొన్ననలుకూర్చిరి త్రిపురనేనివారు- తేనెపల్కుల కల్యాణి తెలుగువాణి.

క్రొత్తతేజమునీకు కూర్చిపెట్టినప్రోడ "రాయప్రోల్" కావ్యాలరాశి బోసె
'వనకుమారి'ని నీకు మనువులిచ్చినరెడ్డి"దువ్వూరు" రత్నాలు దూసి పోసె
'తేనెచిన్కు'లు నీకు కానుకవెట్టినదిట్ట "నాళము" కలకండ నారు వోసె
'ఫిర్దౌసి'కూర్చిన సర్దారు "జాషువా" నూత్నంపువెల్గులు నూర్చిపోసె
అప్పరాయడు 'గేయాలు' మెప్పులిచ్చె, కొసరి 'నండూరు' భావాలు కుప్పబోసె
కథలమధురాలు "ముని——వారు" కానుకలిచ్చె- తేనెపల్కుల కల్యాణి తెలుగువాణి!

"రఘురాముచరితమ్ము" రచనకూర్చినచాన చిల్కరించినదేమొ చెఱకురసము
"వేంకటేశుచరిత" విప్పిచెప్పినకాంత మనువులిచ్చినదేమొ మధురవాక్కు
"విదుషీమణులు" కూర్చి వెలువరించినదేవి అరణమిచ్చినదేమొ అమృతవాణి
"శారదలేఖలు" హారమల్లినలక్ష్మి తెచ్చికూర్చినదేమొ తేనెపల్కు
కాక, యెక్కడిదమ్మ యీకమ్మదనము- దేశదేశాలవారు నీ తీపిగ్రోలి
బిరుదులిచ్చిరి మాధురీగరిమనీకు- తేనెపల్కుల కల్యాణి తెలుగువాణి!

సాహితీవీణెలు సారించిమీటుచు "భారతి" నీవాణి ప్రబలజేయ
భావబంధురమైన భాషలు వెలిపుచ్చు "గృహలక్ష్మి" నీకీర్తిమహిమజాట
తెలుగు వాఙ్మయరాశి దెప్పలు తేలించు "కృష్ణ" నీయురుకళాతృష్ణదీర్ప
మాటమాటకుగూడ మాధుర్యమొడ్చు "ప్రజామిత్ర" నీమాటసారుదెల్ప
"ఆంధ్రభూమి" నీతేజంబుననువదింప- నితరపత్రికలెల్ల నీకింపునింప
తెలుగుదేశాన నీకాంతి మొలకలెత్తె- తేనెపల్కుల కల్యాణి తెలుగువాణి!

తెల్గురాజులు నిన్ను తేరిచూడకయున్న సున్నయా నీమూర్తి చిన్ననాడె
'మనుమసిద్ధుడు' నిన్ను మన్నింపకున్నచో శూన్యమా నీశోభ చెన్నుదొరగి
'ఆంధ్రభోజుడు' నిన్ను నాదరింపకయున్న వినబోము నీదివ్యవాణి మేము
'విశ్వదాత'యె నిన్ను వెలిచూపుజూచిన కనబోము నీనూత్నకాంతి నేడు
నీకు కనకాభిషేకమ్ముశీకరించి, పెంచి పోషించినారు మా పెద్దలిట్లు
నిస్వనింపుము నీవీణె నిఖిలదిశల, తేనెపల్కుల కల్యాణి తెలుగువాణి.

సాహితీసమితులు సాహిత్యపరిషదుల్ సతతంబు నీచర్చ సలుపుచుండె
కవితావిహారముల్ కవిమిత్రమండలుల్ నిరతమ్ము నీసేవ నెరపుచుండె
విజ్ఞాననిలయాలు వాఙ్మయసంఘాలు నీముచ్చటలయందె నెగడుచుండె
గ్రంథాలయంబులు గ్రంథమాలలు నిండి అనయమ్ము నీ పెంపు గనుచునుండె
కవికుమారులు నవ్యవికాసపరులు,కలరు మిన్నగ మధురకావ్యాలవారు
కొల్చుచున్నారు నేడు నిన్ గొప్పజేసి- తేనెపల్కుల కల్యాణి తెలుగువాణి!

" బండి ఱా " చర్చలు బండసమాసాలు కొందఱు నీపైని గురిసినారు
అరసున్నసీలలు నిరుసంధిమేకులు కొందఱు నీమీద గ్రుచ్చినారు
ఎరువుసొమ్ములు దెచ్చి బరువుచేటునుగూర్చి కొందఱు నీమేను కుంచినారు
పలుకులో నొకతీరు గిలుకు నింకొకరూపు కావలెనని తన్నుకాడినారు
కాని, ఆవ్యగ్రరూపాలు కడగివైచి-నిన్ను సర్వాంగరూప సంపన్నజేయ
నడుముగట్టిరి క్రొత్తపోకడలవారు - తేనెపల్కులకల్యాణి తెలుగువాణి!

నన్నయనాటినుండి యొకనాటి కొకానొకరూపు దాల్చుచున్
వన్నెలరాణివై తెలుగువారనయమ్మును గొల్చు దేవివై
పున్నెము పండిపోయి రసముగ్ధులు కన్నులు విచ్చిచూడ న
త్యున్నతరీతులన్ తెలుగుతోటల నాట్యము సల్పినావుగా.

# ౬. జ్యోతిషము




[ఈ యుపన్యాసము ౧౭-౧౧-౧౯33 వ తేదీన రాజమహేంద్రవరము ట్రైనింగుకళాశాలయందు మ-రా-రా-శ్రీ, కేసిరాజు సత్యనారాయణగారి యధ్యక్షతక్రింద నీయబడినది.]

ప్రస్తుతము నాగరకప్రపంచమునంతటను వ్యాపించిన గణితశాస్త్ర మంతయు మనభారతీయులు క్రీ. శ. ౧౨-వ శతాబ్దమునాటికే గ్రహింపగలిగిరి. సంఖ్యావళియందు స్థానభేదమును, సంఖ్యలేనిచోట సున్న బెట్టుటయు, సంఖ్యాతత్త్వనిరూపణమునందు ధనఋణ సంఖ్యాభేదములును, కరణి వికరణ్యాంక వివక్షతయు (Rational and irrational quantities) మొట్టమొదట కనుగొనినది హిందువులు." (ఆంధ్రవిజ్ఞానసర్వస్వము)

"To the early Hindus, the world owes some of the basic ideas in mathematics—the place-value system of notation in Arithmetic, the generalizations of Algebra, the sine function in Trigonometry, and the foundations of Indeterminate Analysis. India may claim to be the birth-place of Algebra and Arithmetic." (The mathematics student) "Not in the field of geometry, but of arithmetic and algebra, the Hindus achieved glory. The subject of indeterminate Analysis was conspicuously advanced by them...The Hindus were the first to recognise the existance of negative numbers and of irrational numbers." (Florian Cajori's History of Mathematics.)

"The origin of the decimal system of notation and of the conception and symbolic representation of zero are considered to be important questions connected with the history of Hindu mathematics."

(Prof. M Rangacarya)

ప్రాచీన గణితశాస్త్రగ్రంథములు పద్యరూపకముగా నొప్పారుచుండును. పద్యములలో అంకెలకంటె మాటల నిముడ్చుట సులభము. కనుక సంఖ్యలు మాటల వలన తెలుపబడుచుండెడివి. మఱియు మాటల నుపయోగించినయెడల మాసిపోవుట, చెఱిగిపోవుట, పొరబడుట మొదలగు నిబ్బందు లుండవు. ఈమాటల నుపయోగించుటలోకూడ నొకవిధమైన పరిభాష వాడుచుండెడివారు. ఉదా :

"భూ చంద్ర కరత్రయ భూ
తాచల వియ దబ్ధి వసు కరాష్టత్రయ శూ
న్యాచలగతి కర సుధానిధి."

సంఖ్య యని చెప్పిన ౧౧౨౪౭౦౩౮౨౮౪౦౭౯౩౨౧౧ అగును. ప్రాచీన గణితశాస్త్ర గ్రంథములు సయుక్తికముగ లేవని చాలమంది యభిప్రాయము.

"Oriental Mathematics lacks the cold logic, the consecutive arrangement, and the abstract character of Greek mathematics, but that it possesses a richness of imagination, an interest in problem-‹etting, and poetry, all of which are lacking in the treatises of the West » (David Eugene Smith) "The Indian tradition was to make the text as brief as possible, so that the whole might be easily learned by heart thus enabling the ancient scholars to escape from the slavery of books » (Mathematics Student)

"It is an unpleasant feature about the Hindu mathematical treatises handed down to us that rules and results are expressed in verse and clothed in obscure mystic language." (Cajori)

సుమారు క్రీ. పూ. ౧౫౦౦ మొదలు క్రీ. పూ. ౮౦౦ వఱకు అనగా వేదాంగకాలమందు మన భారత దేశమున గణిత మభివృద్ధియయ్యెను. మొదట గణిత శాస్త్ర మభివృద్ధి గాంచనిదే జ్యోతిషశాస్త్ర మభివృద్ధి గానేరదు. ఈజ్యోతిష మనునది వేదాంగములలో నొకటి. వేదశరీరమునకు నేత్రమువంటిది. వేదము యొక్క షడంగములలో ప్రధానాంగమై వెలుగుచున్న యది. సిద్ధాంతశిరోమణిలో

"శబ్దశాస్త్రంముఖం జ్యోతిషం చక్షుషీ శ్రోత్ర ముక్తం
నిరుక్తంచ కల్పః కరౌ యాతు శిక్షాస్య వేదస్య సా
నాసికా పాదపద్మద్వయం ఛంద ఆద్యై ర్బుధైః."

అని యున్నది.

శంకరాచార్యులు మొదలగు మతోద్ధారకులకును, క్రీస్తుమతస్థులకును, రష్యా, స్వీడను, ఇటలీ మొదలగు దేశముల చక్రవర్తులకును, ఫిరోజిషా, జహంగీరు మొదలగు ఇస్లాముమతస్థులకును, తుదకు వేదముల యందు నమ్మకములేని బౌద్ధులకును, జైనులకును, జాతకము లున్నట్లు తెలియుచున్నది. ఇంత ప్రసిద్ధి కెక్కిన జ్యోతిశ్శాస్త్రమును వృద్ధిలోనికిదెచ్చినది భారతీయులే.

చాల పురాతనగ్రంథ మనదగు వేదాంగ జ్యోతిషమును పరిశీలించిన ప్రాచీన భారతీయులకు భిన్నాంక గణితవ్యవహారములు తెలియునని తోచుచున్నది.

తర్వాత క్రీ. శ. ౨౦౦ లోపలనే కేవలము మత విషయములకు సంబంధించిన శుల్బ సూత్రములలో చతురస్రము, దీర్ఘచతురస్రము, సమాంతర చతుర్భుజము, త్రిభుజము—వీని నిర్మాణవిధానము లుండెను. బోధాయన, ఆపస్తంబ, కాత్యాయనులచే సూత్రములనేకములు గావింపబడినవి. No proofs or demonstrations are given by base facts "G. R. Keyle's Indian Mathematics.)

Journal of the Asiatic Society of Bengal XLIV 1875 Part I లో G. Thibaut పైథాగరసు సూత్రము మొదలైన రేఖాగణితవిశేషముల గుఱించి వ్రాసియున్నాడు. ఒకసమకోణత్రిభుజమునందలి భుజములమీది చతురస్రముల మొత్తము దాని కర్ణము (hypotenuse) మీది చతురస్రమునకు సమానము. ఈ సూత్రమును మన మిప్పుడు పైథాగరస్ సూత్ర మని (Theorem of pythogoras) వ్యవహరించుచున్నాము. కాని నిశ్చయముగా నిది భారతవిద్వాంసులే కనిపెట్టిరి. "Burk maintains not only that the theorem was known and proved in all its generality by the Indians long before the date of pythagoras (about 580-500 B. C.) but that they had also discovered the irrational, and further that the much-travelled Pythagoras probably obtained this theory from India."—T.L. Heath's Euchits Elements. పైథాగరస్‌తత్త్వజ్ఞానము మన భారతీయ విజ్ఞానమునకు సరిపోవుటలో ఈ పైవాజ్ఞ్మాలము సహేతుకముగ నున్నది.

చతురస్రస్యాక్ష్ణయా రజ్జుః ద్విస్తావతీ భూమిం కరోతి.

—ఆపస్తంబసూత్రము.

అనగా The square on the diagonal of a square is twice the original square.

దీర్ఘచతురస్రస్యాక్ష్ణయా రజ్జుః పార్శ్వమానీ తిర్యఙ్మానీచ యత్ పృథగ్భూతే కురుతః తదుభయం కరోతి.—బోధాయనసూత్రము.

అనగా In a rectangle the square on the diagonal is equal to the sum of the squares on the two sides.

కనుక ఈసూత్రము మన మెంచుచున్నట్లు క్రీ. పూ. ౩ వ శతాబ్దమువాడగు Pythagoras అను గ్రీకుశాస్త్రజ్ఞునిచే కనిపెట్టబడినది గాక అంతకు పూర్వమే భారతీయులకు తెలిసియుండినది. ఒక సమకోణత్రిభుజములోని భుజములు ౩, ౪, ౫ అయినచో ఈసూత్రముప్రకారము $\text{౩}^{\text{౨}} + \text{౪}^{\text{౨}} = \text{౫}^{\text{౨}}$. ఈవిధము గనే యీక్రింది అంకెవరుసలు శుల్బసూత్రములందు గనిపించును.

| | | |
|---|---|---|
| ౫, ౧౨, ౧౩. | ౧౨, ౧౬, ౨౦. | ౧౫, ౨౦, ౨౫. |
| ౭, ౨౪, ౨౫. | ౧౨, ౩౫, ౩౭. | ౧౫, ౩౬, ౩౯. |
| ౮, ౧౫, ౧౭. | | |

మఱియు ఈక్రింద నుదాహరించిన విశేషములుగూడ కానవగును.

$$\sqrt{\text{౨}} = \text{౧} + \frac{\text{౧}}{\text{౩}} + \frac{\text{౧}}{\text{౩}\cdot\text{౪}} - \frac{\text{౧}}{\text{౩}\cdot\text{౪}\cdot\text{౩౪}}$$

$$\frac{\sqrt{\pi}}{\text{౨}} = \text{౧} - \frac{\text{౧}}{\text{౮}} + \frac{\text{౧}}{\text{౮}\cdot\text{౨౯}} - \frac{\text{౧}}{\text{౮}\cdot\text{౨౯}\cdot\text{౬}} + \frac{\text{౧}}{\text{౮}\cdot\text{౨౯}\cdot\text{౬}\cdot\text{౮}}$$

కాని G. R. Kaye గారికి భారతీయుల కింత తెలివితేట లుండుట అసంగతమైనదిగా దోచుచున్నది.

క్షేత్రగణితములో నేది కనిపెట్టినను మొదటది అంకగణితమునకు అన్వయించునో లేదో యని మన ప్రాచీనులు చూచెడివారు. వివిధశాస్త్రములయం దసమాన ప్రతీతిగాంచిన గ్రీకులు, ఫొనీషియనులు, సిరియనులు, హీబ్రూలు, రోమనులు మొదలగు ప్రాచీనజాతులవారి సంఖ్యాక్రమవిధానముకన్న ప్రాచీన భారతీయసంఖ్యావిధానమే నవీనాంకగణితమునకు మూలబీజ మయ్యెను. క్రీ. పూ. ౩ వ శతాబ్దమునాటి వగు అశోకుని శిలాశాసనములు, తత్ శిలాశాసనము (౧౦౦ B. C.), నానాఘట్టుగుహాల రాతిగోడలపై చెక్కబడిన శాసనములు, మధురాపురశాసనము (౧ లేక ౨ శతాబ్దము A. D.) వీనినిబట్టిచూచిన మనసంఖ్యాక్రమవిధానము తెలియును. ౧౧-వ శతాబ్దమున ఆల్బరూని (Alberuni) అను మహమ్మదీయ చరిత్రకారుడు మనదేశములో వేర్వేరు ప్రదేశములందు అంకెలకు రూపభేదము లుండెననియు, సంఖ్యావళిలో ౯ అంకెలును, ఒకసున్నయు నుండి స్థానమునుబట్టి ఏదేని ఒకసంఖ్యయొక్క మొత్తము పదిరెట్లు హెచ్చుటగాని, తగ్గుటగాని కలదనియు వ్రాసియున్నాడు. తదితరదేశములలో వాడుకలో నుండిన సంఖ్యాపద్ధతులవలె గాక, మనదేశములో నుద్భవించిన నవీన సంఖ్యాపద్ధతి లెక్కలు జేయుటకు కూడ ఉపయోగముగా నుండెడిది. ఇదియే నాగరకప్రపంచమునంతటను వ్యాపించి గణితశాస్త్రమును అభివృద్ధిలోనికి దెచ్చినది. ఇంతకన్న వేఱే గౌరవము మన భారతీయులకు గావలెనా?

ఇప్పటికి సుమారు ౫౫ సంవత్సరముల క్రిందట పెషావరుజిల్లాలో బఖ్షాలి యను గ్రామమున భూమి త్రవ్వుచుండగ నొకగ్రంథము దొరకినది. ఇది అంకగణితమునకు సంబంధించినదై భూర్జపత్రములపై వ్రాయబడి యున్నది. ఇందు త్రైరాశికము (Rule of three దీనినే Golden rule అనెడువారు. వర్తకుల కుపయుక్తముగా నుండెడిది). మిశ్రమ వ్యవహారము (Alligation) వడ్డీకట్టుట మొదలగు నిత్యకృత్య వ్యవహారములును, సంకలితశ్రేఢి, గుణోత్తరశ్రేఢి మున్నగు అంకగణిత వ్యవహారములు గలవు. ఈయుద్గ్రంథము క్రీ. శ. ౩ లేక ౪ వ శతాబ్దమునాటి దని శాస్త్రకారు లూహించుచున్నారు. దీనినిబట్టి అప్పటికే హిందువులకు పై జెప్పబడిన వన్నియు దెలియునని విశదపడుచున్నది. మఱియు హిందువులకు భిన్నాంకవిధానము గూడ తెలియును. భిన్నము వ్రాయుటలో మధ్యగీత యుండెడిది కాదు.

ఉదా: $\frac{2}{3}$ అనగా $\frac{2}{3}$.

శుల్బసూత్రయుగానంతరము ఆర్యభట్టు, వరాహమిహిరుడు, బ్రహ్మగుప్తుడు, మహావీరాచార్యులు, భాస్కరాచార్యులు మొదలైన గణితశాస్త్రజ్ఞసింహములు ప్రాచీన భారతీయ గణితశాస్త్రాటవిలో విచ్చలవిడిగ విహారముగావించెను.

ఆర్యభట్టు: (జననము క్రీ. శ. ౪౭౬) పాట్నా వాస్తవ్యుడు. ౪ ప్రకరణములుగల ఆర్యభట్టీయమును రచించి లోకప్రఖ్యాతి వడసెను. గణితశాస్త్రమునకు మూడవ ప్రకరణముమాత్రము సంబంధించినది. ఈ గ్రంథము Latin, French తదితర అన్యదేశభాషలలో తర్జుమా చేయబడెను. షికాగో విశ్వవిద్యాలయములో నున్న Walter Eugene Clark అనునాతడు ఆర్యభట్టీయమును ౧౯3౦ లో భాషాంతరీకరించి వ్యాఖ్యానమును విపులముగా వ్రాసియున్నాడు. "Starting with the orders of numerals he proceeds to evolution and involution and areas and volumes. Next comes a semi-astronomical section in which he deals with the circle shadow problems, etc., then a set of propositions on progressions followed by some simple algebraic identities. Of the remaining rules the very last (consisting of 66 lines of bare rules) relates to indeterminate equations" m, n, a, b అనునవి పూర్ణసంఖ్యలైనపుడు $mx + a = ny + b$ అను మాదిరి సమీకరణమును అభిన్నముగా వ్యక్తపఱచుపద్ధతి ఆర్యభట్టు మొదట కనుగొనెను. "He was an innovator in astronomy. He is a precursor of the Indian decimal notation."
వృత్తమునకును వ్యాసమునకును గల సంబంధము $\pi$ అనుచున్నాము. దీనివిలువ $\frac{22}{7}$ అనియు, సూక్ష్మముగ 3.౧౪౧౬ అనియు వాడుచున్నాము. ఈ $\pi$ విలువ స్థూలముగ $\sqrt{౧౦}$ అని ఆర్యభట్టుడు వ్రాసెను. $\pi = 3\frac{౧౭౭}{౧౨౫౦}$ (=3.౧౪౧౬) అని కూడ చెప్పెను. కాని ౧౨ వ శతాబ్దమున భాస్కరాచార్యులు దీనివిలువ $\frac{22}{7}$ అని చాటించెను.

వరాహమిహిరుడు: క్రీ. శ. ౬ వ శతాబ్దమువాడు. పంచసిద్ధాంతికయను గ్రంథమును వ్రాసి పరమపదించెను. ఆతనికాలమందు వ్యాప్తిలోనున్న సిద్ధాంతములనుగూర్చి చెప్పుటలో వరాహమిహిరుడు మొదటివాడు. మొదటి యధ్యాయములో ౩, ౪ శ్లోకములనుండి యీగ్రంథము పితామహ, వసిష్ఠ, రోమక, పౌలిస, సూర్యసిద్ధాంతములను పంచసిద్ధాంతముల గూర్చి చెప్పునవియు, అందు మొదటిరెండును సరియైనవి గావనియు వ్రాసెను. This book "Occupies a marked position of its own in Indian astronomical literature"

(G. Thibaut)

బ్రహ్మగుప్తుడు: (జననము ౫౯౮ A. D.) ముప్పదవయేటనే బ్రహ్మస్ఫుట సిద్ధాంతమును వ్రాసి ప్రసిద్ధికెక్కెను. ఈ గ్రంథ మరబ్బీభాషలోనికిగూడ తర్జుమా చేయబడెను. Pellian Equation అనబడు $X^2 = ౧ + Ny^2$ అనునది బ్రహ్మగుప్తునిచే చెప్పబడెను. ఈవిషయములో "Brahmagupta has anticipated Euler by a 1000 years" అని T. L. Heath వ్రాసినాడు. Colebrooke విశేషించి యిట్లు చెప్పదొడగును. "Had an earlier translation of Hindu mathematical treatises been made and given to the public, especially to the mathematicians early in Europe, the progress of mathematics would have been much more rapid, since algebraic symbolism would have reached its perfection long before the days of Descartes, Pascal, and Newton."

మహావీరాచార్యులు: తొమ్మిదవశతాబ్దము వాడు. జైనమతస్థుడు. ౮ ప్రకరణములుగల గణితసార సంగ్రహ మను నుద్గ్రంథమును రచించెను. ౧౧-వ శతాబ్దమునాటికి కన్నడము, తెలుగులోనికి భాషాంతరీకరింపబడినది. ప్రతిప్రకరణమునందు నుదాహరణము లనేకముగ నిచ్చి తన సహజపాండిత్యమును లోకమునకు తెలియజేసిన మహావీరుడు, శూరుడు.

ఆంధ్రగణితములోకెల్ల మిక్కిలి పురాతనమైన పావులూరిగణితము మహావీరాచార్యుని గ్రంథమునకు భాషాంతరీకరణము.

“శ్రీలలనేశుఁ డాంధ్రనృప
	శేఖరుడై చను రాజరాజభూ
పాలకుచేతఁ బీఠపురి
	పార్శ్వమునన్ నవఖండవాడ యన్
ప్రోలు విభూతితోఁ బడసి
	భూరిజనస్తుతుఁడైన సత్కళా
శీలుఁడ రాజపూజితుఁడ
	శిష్టనపుత్రుఁడ మల్లనాఖ్యుఁడన్.

దీనిసిబట్టి పావులూరి మల్లన రాజాదరణము పొందినట్లు తెలియుచున్నది. ఆకాలమున రాజులకు గణితశాస్త్రముపట్ల నభిమానము మెండు. ఎలుగంటి పెద్దనార్యుడు తన భిన్నప్రకీర్ణ మను గణితగ్రంథమున నిట్లువ్రాసెను.

“వీరాచార్యులు సంస్కృతాన గణితా
	ల్విఖ్యాతిగా జేసె దా
నారూఢిన్ బది పావులూరికవి మ
	ల్లామాత్యు దెల్గించె నన్
బేరే గాని గుణించలేరు గణకుల్
	భిన్నప్రకీర్ణంబు లీ
తీరైనన్ నెలుగంటి పెద్దన యవిన్
	దెల్పెన్ గుణించన్ ధరన్.

మహావీరుడు, బ్రహ్మగుప్తుడుగూడ చతుర్భుజము వైశాల్యము $\sqrt{(s-a)(s-b)(s-c)(s-d)}$ అని చెప్పిరిగాని యీ సూత్రము వృత్తములో అంతర్గతమైన చతుర్భుజముపట్ల వర్తించునని చెప్పజాలరైరి. మఱియు ఏదైన నొక రాశిని సున్నచే భాగించినపుడు లబ్ధము సున్నయగునని మహావీరుడు పొరపాటుపడెను. కాని శూన్యరాశిని గుర్తెఱిగి అది అంకగణితపరికర్మల (operations) కుపయుక్త మని గ్రహించుటగూడ ఆకాలములో గొప్ప యనుటలో నతిశయోక్తి లేదు. గణిత శాస్త్రాభివృద్ధికి ముఖ్యకారణమైన శూన్యనిర్మాణమును హిందువులే మొదట కనుగొనినది. క్రీ. శ. ౧౨ వ శతాబ్దమునాటికి పాశ్చాత్యులలో గణితశాస్త్రము పరిపక్వము గానప్పటికి మన దేశములోనే యీయుత్కృష్టమైన శాస్త్ర మభివృద్ధి గాంచిన దని వినుటకు ప్రతిభారతీయుడును గర్వించవలసియున్నది. ౧౨ వ శతాబ్దములో భారత దేశమున కంతటికిని ఖ్యాతిదెచ్చు భాస్కరాచార్యు లుద్భవించి గణితశాస్త్రము నభ్యసించి దానిని వృద్ధిలోనికిదెచ్చెను.

భాస్కరాచార్యులు : (జననము క్రీ. శ. ౧౧౧౪) ౧౧౫౦ లో ఈ మహానుభావుడు ౧౨ ప్రకరణములుగల సిద్ధాంతశిరోమణి యను జ్యోతిషగ్రంథమును రచించెను. ఇందు రెండుప్రకరణములు గణితశాస్త్రమునకు సంబంధించినవి. అం దంకగణితవిషయమైనది ‘లీలావతి.’ రెండవది ‘బీజగణితము.’ లీలావతి గొప్ప గ్రంథమని పాశ్చాత్యులే పొగడిరి. అనేకులు సంస్కృత వ్యాఖ్యానములు వ్రాసిరి. అంతకుపూర్వము వెలువడిన గ్రంథములకంటె నిది నూతనవిషయములతో నలరారుచున్నది. శాస్త్రపరిశ్రమ యెక్కువగ జేసినటుల గాన్పించును. పూర్వగ్రంథములవలె గాక సూత్రములు శ్లోకరూపమునను, వాఖ్యానము గద్యములోను వ్రాయబడినది. ప్రస్తుతము పాశ్చాత్యగణితశాస్త్ర ప్రకారము బీజగణితసహాయము లేనిదే చేయలేనిలెక్కలు కేవలము అంకగణితముప్రకారము చేయుటకు వీలగుచున్నది. కొన్నిలెక్కలకు న్యాసము (working) గూడ గలదు. అంకపాశవ్యవహారము (Permutations), అంకయోగములు (Combinations), అంకశ్రేఢులు (Progressions) గణితశ్రేఢి (Arithmetic Progression), గుణోత్తర శ్రేఢి (Geometric Progression), హరాత్మక శ్రేఢి (Harmonic Progression)-వీనికి సూత్రములు గలవు.

లీలావతియందు క్షేత్రగణితవ్యవహార మనువిషయమున సమకోణత్రిభుజముమీద అనేకవిధము లగు లెక్కల నిచ్చియుండెను. ప్రతిప్రకరణమునందును ప్రకృతిలోనుండి గైకొనిన యుదాహరణములు మెండుగా

నున్నవి. ఉదా: Shadow problems, problems of broken tree, lotus in the pond, etc.

Bretschneider పైథాగరససూత్రమును భాస్కరాచార్యులు బాగుగా ఋజువుచేసినాడని వ్రాసెను.

మహావీరుడు చెప్పినట్లుగాక ఏదైన నొకరాశిని సున్నచే భాగించిన లబ్ధము 'అనంత' మగునని భాస్కరుడు చెప్పెను. "ఇన్ని యని నిర్ణయించుట కతీతమై మితిలేనిస్థానములుగల సంఖ్యావళికి అనంతాంక మని పేరు." ఈఅనంతరాశిని (infinity) ఖహర మందురు. దీనినిగుఱించి భాస్కరాచార్యులు ఇట్లు చెప్పెను.

"అయ మనంతో రాశిః ఖహరఇత్యుచ్యతే"

"అస్మి న్వికారః ఖహరేన రాశా
వపి ప్రవిష్టేష్వపి నిఃసృతేషు
బహుష్వపి స్యాల్లయసృష్టికాలే
నంతేఽచ్యుతే భూతగణేషు యద్వత్."

(బీజగణితము)

క్రీ. శ. ౧౧౫౦ లో $X^{౨}-౪౫X=౨౫౦$ అను అవ్యక్తవర్గ సమీకరణమును భాస్కరుడు వ్యక్తపఱచి ఆ విలువ ౫౦ గాని లేక –౫ గాని అగునని చెప్పుచు యిట్లు చెప్పెను: "But the second value is in this case not to be taken for it is inadequate, people do not approve of negative roots."

మఱియు భూమికి ఆకర్షణశక్తి (Gravitation) యున్నదని సిద్ధాంతశిరోమణిలో యిట్లు వ్రాసెను.

"ఆకృష్టశక్తిశ్చ మహీ తయా యత్ స్వస్థం గురు
స్వాభిముఖం స్వశక్త్యా, ఆకృష్యతే తత్పతతీవ భాతి
సమే సమంతాత్ క్వపతత్వియం రవేః."

ఈభాస్కరాచార్యుల పిమ్మట గణితశాస్త్ర మభివృద్ధి చెందలేదు. భారతీయు లిట్లు తమ స్వశక్తి మూలముననే గణితశాస్త్ర మభివృద్ధిచేసిరి. "India influenced Europe in the matter of algebra more than it was influenced in return"

(David Eugene Smith)

ఖగోళశాస్త్రము (Astronomy) అభివృద్ధిగావలెననిన దానికి సహాయభూతముగా నుండు త్రికోణమితి (Trigonometry) అభివృద్ధిగాంచవలయును. "Trigonometry, in its initial stages, developed as a handmaid to Astronomy in the hands of the ancient Hindus." ఖగోళశాస్త్రసంబంధమైన సూత్రము లన్నియు భుజజ్యా (Sine), కోటిజ్యా (Cosine), ఉత్క్రమజ్యా (Versed sine) అను మూడుసంబంధములలోనే కనుగొనిరి.

ఆకాశమందు సూర్యసంచారమార్గమగు క్రాంతివృత్త (Ecliptic)మందు ఒకస్థిరబిందువు(Fixed point) అయిన అశ్విన్యాది (Stellar Aries) నుండి గ్రహస్థానమును చెప్పుపద్ధతి నిరయనపద్ధతి యని పేరు. ఇది హిందువులపద్ధతిగాని, పాశ్చాత్యులుకనుగొనినదికాదు. పాశ్చాత్యులు గ్రహస్థానమును First point of aries (The meeting point of the Ecliptic and the Equator) నుండి చెప్పెదరు.

పురాతనమైనటువంటి వేదసూక్తములలో సూర్యచంద్రులగతులు, మేషాదిరాసులు, ఋతువులు, అయనములు, సంవత్సరము వీనికాలపరిమితి మొదలగు ఖగోళశాస్త్రసంబంధాదివిషయములు చాల గలవు. వసంత సంపాతము (Vernal Equinox), అయనగతి (Precession of Equinoxes) మొదలగు అద్భుతము లెన్నియేని గలవు. అయనగతి ౫౪" (per year) అని సూర్యసిద్ధాంతమందును, ౫౯."౯౦౦౭ అని సిద్ధాంతశిరోమణిలోను గలదు. ఈసరియైన ఫలితములను మనప్రాచీనులు సూక్ష్మయంత్రాదిసాధనములుసయితము లేకుండ కనుగొన గలిగిరి.

కొంతమంది పాశ్చాత్యవిమర్శకాగ్రేసరుల యభిప్రాయమేమన, బహువ్యయప్రయాసలకోర్చి పెక్కుపద్ధతులచే గ్రీకులు కనుగొనలేని విషయమును హిందువులు నిర్దుష్టముగా కనుగొనుట వట్టి బూటకమని యూహించుచున్నారు. గ్రీకులు అయనగతి ౩౬" అని కనుగొనిరి.

జపానువిద్యార్థులు వారి యువరాజుజన్మదినోత్సవమున తమ అభినందనములు తెలుపుటకు అక్షరాకారముగ నిలుచుట



మదరాసు అడ్వకేటులు హైకోర్టున్యాయమూర్తులు వరదాచారి, పాండలే, అనంతకృష్ణయ్యరుగార్లను గౌరవించుట

దక్షిణఆఫ్రికాకు వెడలిన భారతీయ 'ఫుట్‌బాల్' ఆటగాండ్ర జట్టు



స్వాగత ఆంధ్రవైద్యసమ్మేళనము, బెజవాడ

వేదకాల మైనతరువాత సిద్ధాంతములు దాదాపు ఇరువది ప్రబలినవని ౧౮౬౦ లో ప్రచురించిన Rev. E. Burgess గారి 'Appendix to the Translation of the Surya Siddhanta' వలన తేటతెల్ల మగుచున్నది. అవి యేవన, బ్రహ్మ, సూర్య,సోమ, బృహస్పతి, గార్గ, నారద, పరాశర, పౌలస్త్య, వసిష్ఠ, వ్యాస, అత్రి, కాశ్యప, మారీచి, మను, ఆంగీరస, లోమశ, పులిశ, యవన, భృగు, చ్యవన సిద్ధాంతములు. ఇందు మొదటి రెండును ప్రసిద్ధికెక్కి ఆర్యభట్టు మొదలుగాగల సిద్ధాంతులచే పరిష్కరింపబడినవి. ఇవన్నియు రెండువేల సంవత్సరములకు పూర్వముగా నుండిన గ్రంథములే. వేదాంగ జ్యోతిషము అంతకంటె అనాదిగ్రంథము. వీనివలన మహాయుగమనిన $౪౩౨ \times ౧౦^{౪}$ సంవత్సరములనియు, కల్పమనిన $౪౩౨ \times ౧౦^{౭}$ సంవత్సరములనియు,గ్రహము లన్నియుఒకకల్పములో వారివారిmean circular orbits లో ఒకే సంఖ్యగల యోజనములు సంచరించుననియు తెలియవచ్చుచున్నది. ఈసంఖ్య $౧౮౭,౧౨౦,౬౯౨ \times ౧౦^{౮}$ అనిభాస్కరుడును, $౧౮౭౧౨.౦౮౦౮౬౪ \times ౧౦^{౬}$ అని సూర్యసిద్ధాంతము గ్రంథకర్తయు అభిప్రాయపడుచున్నారు. ఈవిషయములన్నియు న్యూటనుమహాశయుడు కనిపెట్టిన విషయములతో సమన్వయించుకొనవచ్చును. గ్రహణములు పట్టుకాల మిప్పటికిని మన భారతీయులు సరిగా లెక్కప్రకారము కనుగొనగలుగుచున్నారు. గ్రహయుతులు (Conjunctions of the planets) కూడ మన దేశీయులు సులువుగ కనుగొనుచున్నారు. ప్రతిసిద్ధాంతములోను ఇప్పుడు ప్రచురించుగ్రంథములలోవలెనే ఒక అధ్యాయములో యంత్రములను వర్ణించునట్లు కాన్పించును. Colebrooke's essays Vol II నుండి పౌలిశ సిద్ధాంతముప్రకారము సంవత్సరమనగా ౩౬౫ రో. ౬ గం. ౧౨ ని. ౩౬ సె. అని తెలియుచున్నది. గ్రంథములలో వ్రాయుటకు ముందు వారు సాధించిన విషయములను తమ అనుభవములోనికి తీసికొనెడివారు భారతీయులే యని తెలియవచ్చుచున్నది. యంత్రాది సాధనములకన్న బుద్ధియే ప్రధానము. "ధీరేక పరమార్థకం మంత్రమ్" అని భాస్కరాచార్యులు చెప్పియున్నాడు.

ఖగోళశాస్త్రమునకు చాపీయ త్రికోణమితి (Spherical Trigonometry) మెక్కువ సహాయపడును గనుక నది సరళత్రికోణమితి (Plane Trigonometry) కంటె ముందే మన దేశములో వ్యాప్తిలో నున్నది.

భాస్కరాచార్యులతర్వాత మహేంద్రసూరి (జననము క్రీ. శ. ౧౩౭౦), గణేశుడు, షాజహాను ఆస్థానములోనున్న మునిస్వార (౧౬౦౩) మొదలుగాగల జ్యోతిశ్శాస్త్రసంపన్నులు గలరు. కాని ౧౭ వ శతాబ్దములో జయపుర సంస్థానాధీశ్వరు డైన జయసింహుని యాస్థానములో బహుభాషాకోవిదు డైన జగన్నాథు డనునాతడు గలడు. ఈతడు తెలుగుబ్రాహ్మణుడు.అనేకగ్రంథములను భాషాంతరీకరించెను. రేఖాగణితమును రచించెను. ఇతని పాండిత్యమే ఔరంగజేబునాకర్షించినది. మొగలాయిచక్రవర్తి సభలో ప్రధానపండితుడుగా కాలము గడపెను.

పూర్వకాలమందు యుక్తిలెక్క లుండెడివి. అందు ప్రకృతిసౌందర్యమునుగూడ గమనించు ఉదాహరణములు మెండు గలవు. గణితమునందు పాండిత్యము కుదురుటకై అనేకవిధములుగ లెక్కలను గల్పించెడివారు. వ్యాసవిస్తరభీతిచే కొన్ని యుదాహరణముల నిందు పొందుపఱచలేదు. మనప్రాచీను లనాదినుండి చేయుచున్న లెక్కలు ౧౪,౧౫ శతాబ్దములలో పాశ్చాత్యులు వ్రాసినగ్రంథములలో గానవగును.

ఇట్లు మనపూర్వులు అనేకవిధములుగ పాశ్చాత్యులకు మార్గదర్శకు లయిరి. అందులకు మనము గర్వపడి యూరకుండుట శోచనీయము. కావున నేటి గణితశాస్త్రమునువిపులముగనేర్చికొని యదియెంతవఱకు మన పూర్వుల గణితశాస్త్రములతో సమన్వయించుటకు వీలగునో కనుగొని యీగొప్పశాస్త్రమును అభివృద్ధి చేయవలంచుట ప్రతిభారతీయునికిని విధ్యుక్తధర్మ మైయున్నది

# సప్తర్షిమండలము

చివుకుల వెంకటరమణశాస్త్రి, అరిపిరాల వెంకటనారాయణసిద్ధాంతి

సప్తమహర్షుల నెరుగనివా రుండ రని తలచెదము. ప్రత్యేకముగా గుర్తించకపోయినా, హిందువులలో ముఖ్యముగా వివాహసమయమందు అరుంధతీదేవిదర్శనమునకై వీరలను చూచుట తటస్థించును. అందు అరుంధతీదేవి వశిష్ఠునిభార్యఅగుట అతనిసమీపమం దుండు ననియు, ఆవశిష్ఠుడు సప్తర్షులలో నొక డనియు, వారు పల్లకివలె నుండు రనియు, అందు నల్గురు నాలుగు విదిక్కులం దుండు రనియు, వారికి తూర్పుభాగమందు వరుసగా మరిముగ్గు రుండు రనియు, ఆముగ్గురిలో మధ్యనుండువాడు వశిష్ఠు డనియు, వానిసమీపమందు అరుంధతీదేవి అగపడు ననియు గుర్తులుచెప్పి నూతన వధూవరులచే దర్శింపించినమస్కరింపజేతురు. ఈమండల మునే పాశ్చాత్యపండితులు Great Bear అందురు.

ఈమండలములో నెంద రుందురు? అనుప్రశ్న నిరర్థకము. వారిపేర్లవలననే వారు ఏడుగురని తెలియుచున్నది. వారిపేర్లు ఎవ్వి? వా రెల్లపుడును ఒకచో నుందురా? లేక చలింతురా? చలించుచో ఒకేమార్గములో ఎల్లపుడును చలింతురా? వీరెంతకాల ముందురు? ఎచట నుందురు? అనుప్రశ్నలకు సమాధానములను సయుక్తికముగా విచారింతము.

అసలు వీరు ఆకాశమందు గొప్పవెలుగుగల చుక్కలవలె మన కగపడుచున్నారు. ఈవెలుగునకే దేవభాషయందు "జ్యోతి" అనుపేరు గలదు. ఇట్టి జ్యోతిస్సులను (వెలుగుగల గ్రహనక్షత్రాదులను) గూర్చి విచారించుశాస్త్రమే జ్యోతిశ్శాస్త్రము. కావున నీసమాధానములకొరకు జ్యోతిశ్శాస్త్రమును విమర్శింతము.

వీరిపేర్లు అనేకగ్రంథములం దనేకవిధములుగా వర్ణింపబడినవి. వీర లొకమన్వంతర కాలము అనగా ౭౧ మహాయుగములకాలమువరకుమాత్రమే ఒక నియతమార్గమందు తిరుగుదురు. ఆకాలముపైని వీరు పరమేశ్వరునిలో లీనమగుదురు. తిరిగి మరియొకమండల మీస్థానమునకు వచ్చి మరియొకమన్వంతర కాలము ఇట్లే సంచరించును. ఈ అభిప్రాయము మత్స్యపురాణమందును బాగుగా విమర్శింపబడినది. దానిసారమేమనగా — బ్రహ్మదేవునిపగలే ఒకకల్పము. అందు ౧౪ మన్వంతరము లుండును. ఒక్కొకమన్వంతరమందు ఒక్కొకసప్తర్షులజట్టు మండలముగా నుండును. అందు మొదటిదగు స్వాయంభువమన్వంతరములో ౧ మరీచి, ౨ వశిష్ఠుడు, ౩ అంగిరసుడు, ౪ అత్రి, ౫ పులస్త్యుడు, ౬ పులహుడు, ౭ క్రతువు అనువారలు సప్తర్షులు. రెండవదగు స్వారోచిషమన్వంతరములో ౧ దత్తుడు, ౨ నిశ్చ్యవనుడు, ౩ స్తంబుడు, ౪ ప్రాణుడు, ౫ కశ్యపుడు, ౬ ఔర్వుడు, ౭ బృహస్పతి అనువారలు సప్తర్షులు. మూడవదగు ఉత్తమమన్వంతరములో ౧ కౌకురుండు, ౨ దాల్భ్యుడు, ౩ శంఖుడు, ౪ ప్రవహణుడు, ౫ శివుడు, ౬ స్మితుడు, ౭ సస్మితుడు అనువారలు సప్తర్షులు. నాలుగవదగు తామసమన్వంత

రములో ౧ కలి, ౨ పృథువు, ౩ అగ్ని, ౪ అకపి, ౫ కపి, ౬ జల్పుడు, ౭ ధీమంతుడు అనువారలు సప్తర్షులు. అయిదవదగు రైవతమన్వంతరములో ౧ దేవబాహువు, ౨ సుబాహువు, ౩ పర్జన్యుడు, ౪ సోమపుడు, ౫ ముని, ౬ హిరణ్యరోముడు, ౭ సప్తాశ్వుడు అనువారలు సప్తర్షులు. ఆరవదగు చాక్షుషమన్వంతరములో ౧. భృగువు, ౨ సుధాముడు, ౩ విరజుడు, ౪ సహిష్ణువు, ౫ నాథుడు, ౬ వివస్వానుడు, ౭ అతినాముడు అనువారలు సప్తర్షులు. ఏడవదియు ప్రకృతమందు జరుగుచున్నదియు అగు వైవస్వతమన్వంతరమందు ౧ కశ్యపుడు, ౨ అత్రి, ౩ భరద్వాజుడు, ౪ విశ్వామిత్రుడు, ౫ గౌతముడు, ౬ వశిష్ఠుడు, ౭ జమదగ్ని అనువారలు సప్తర్షులు. ఇత్యాదిగా ఒక్కొకమన్వంతరములో ఒక్కొకసప్తర్షిమండలము మారునని చెప్పబడినది.

కాని, జ్యోతిశ్శాస్త్రమునకును, పురాణములకును ప్రకృతమందలి సప్తర్షిమండలములోనివారల పేర్లవిషయములో భేదము కాన్పించుచున్నది. పురాణవచనములచే కశ్యపుడు, అత్రి, భరద్వాజుడు, విశ్వామిత్రుడు, గౌతముడు, వశిష్ఠుడు, జమదగ్ని అనువారలు ప్రకృతమందలి సప్తర్షులుగా నున్నారు. కాని జ్యోతిశ్శాస్త్రముచే మరీచి, వశిష్ఠుడు, అత్రి, అంగిరసుడు, పులస్త్యుడు, పులహుడు, క్రతువు అనువారలు ప్రకృతమందలి సప్తర్షులుగా నున్నారు.

ఇందుకు ప్రమాణముగా కొన్నివచనములను వ్రాసి, వాటిఅభిప్రాయమును విమర్శించినచో, ప్రకృతవిషయమేకాక వారలస్థానము, ఆకారము మొదలగు మరికొన్నివిశేషములుగూడ తెల్లమగును. ౧ బృహత్సంహిత, ౧౩ అధ్యాయం—"పూర్వేభాగే మరీచి రపరే స్థితో వశిష్ఠోఽస్మాత్, తస్యాంగిరా స్తస్యాసన్నః పులస్త్యశ్చ పులహః క్రతురితి భగవానాసన్నానుక్రమేణ పూర్వాద్యాః"— తా. తూర్పుభాగమందు మరీచియు, వానికి పశ్చిమమందు వరుసగా వశిష్ఠుడు, అంగిరసుడు, అత్రి, పులస్త్యుడు, పులహుడు, క్రతువు వీర లున్నారు. ౨ సిద్ధాంతదర్పణము-త్రిప్రశ్నాధికారం-భగ్రహయోగవర్ణనలో ౪౧ శ్లో. మొదలు - "పూర్వాగ్రం శకటాకార ముదక్స్థ ముడుసప్తకమ్, సప్తర్షిమండలం ప్రోక్తం వ్యక్తం విశ్వనమస్కృతమ్, తత్పూర్వోన్నతరేఖాగ్రే మరీచిః పశ్చిమే తతః, వశిష్ఠో ఽరుంధతీయుక్త స్తత్పశ్చాదంగిరా స్థితః, తత్పశ్చా చ్చతురస్రస్య శంభుదిశ్యత్రి రస్యతు, పులస్త్యో దక్షిణే తస్య పశ్చిమే పులహ స్థితః, క్రతు స్తదుత్తరస్థానే" ... దీనినిబట్టి పైబృహత్సంహితా గ్రంథములో చెప్పబడిన సప్తర్షులపేర్లను రూఢిపరచుటయేకాక వారల ఆకారమున్ను, వారలలోని అవాంతరస్థానములును ఈ క్రిందివిధముగా నున్నట్లు విదితమగుచున్నది.




పై జ్యోతిషగ్రంథప్రమాణములచే మరీచ్యాదులే ప్రకృతమందలి సప్తర్షులుగా విదితమగుచున్నది. వీరలకే ఈశాస్త్రమందు విషువాంశ(Right Assencsion) క్రాంతి (Declination) మొదలగునవి చెప్పబడినవి.

ఈపేర్లు పురాణములలో మొదటిదగు స్వాయంభువమన్వంతరమందలి సప్తర్షులపేర్లతో సరిపడియున్నవి. కావున జ్యోతిశ్శాస్త్రముప్రకారముగా వీరలు ఒక్కొకమన్వంతరమునకు మారిపోరని ఊహించవచ్చును. ఈ మండలము సంవత్సరమునకు సుమారు ౮ వికలలు (౮'') గతిచే చలించుచున్నదై, ౨౭౦౦ సంవత్సరముల కొకమారు నక్షత్రచక్రమును చుట్టివచ్చుచున్నదని జ్యోతిశ్శాస్త్రప్రమాణము లున్నవి. ఇట్లు ఎల్లపుడును తిరుగుచునేయుండును గాని కొంతకాలము మాత్రమే

తిరుగునని చెప్పుటకు యుక్తి మనకు గానరాదు. "పరస్పరస్య చైతేషాం సదా తుల్యాంతరస్థితిః" అను ప్రమాణముచే వీరలు ధ్రువముచుట్టును ఎంతకాలము తిరిగినను, వీరలలో ఒకరొకరికి మధ్యనున్న దూరము ఎల్లపుడును ఏకరీతిగనే యుండునని తెలుచున్నది. ఈ కారణముచేతను పురాణమందు స్వాయంభువమన్వంతరములోనివారలుగా చెప్పబడిన మరీచ్యాదులనే ఆ పురాణములు తెలిసిన జ్యోతిశ్శాస్త్రజ్ఞులు ఈ వైవస్వత మన్వంతరములోగూడ తమగ్రంథములలో చెప్పియుండుటచేతను, ఒక్కొకమన్వంతరములో ఒక్కొకసప్తర్షి మండలము మారుట జ్యోతిషికాభిమతము కాదని ఊహింపనగును.

కావున ఈమరీచ్యాదులనే ప్రకృతమందున్న సప్తర్షులనుగా స్థిరపరచి వీరల ప్రకృతస్థానము ఏనక్షత్రములో ఏపాదములో నున్నదియు, వీరల ఉదయాస్తమయములును, ఉత్తరదక్షిణాదిదూరములును విమర్శించెదము.

"వీర లేనక్షత్రములో నెన్నవపాదములో నున్నారు?" అనుప్రశ్నకు సమాధానము వ్రాయుటకు పూర్వము ఒకసంగతి విమర్శింపవలసియున్నది. పైని వ్రాయబడినరీతిగా వారలలో పులహక్రతువు లిద్దరును పశ్చిమభాగమందున్నారు. మరీచి అందరికంటెను తూర్పుభాగమందున్నాడు. మధ్యభాగములో అత్రి, పులస్త్యుడు, అంగిరసుడు, వసిష్ఠుడును ఉన్నారు. వీరు భిన్నస్థానములయందుండుటచే మరీచియున్న నక్షత్ర పాదములో ఈమండల మున్నదని చెప్పుట యుక్తమా? లేక పులస్త్యుడున్న నక్షత్రపాదములో ఈమండల మున్నదనుట యుక్తమా? వీరలలో ఒక్కొక్కరొక్కొక్కనక్షత్రపాదమందుండుటచే ఎవరిస్థానమును బట్టి ఈమండలము ఏనక్షత్రపాదములో నున్నది నిర్ధారణచేయబడవలెను? అనుదానికి ముందు సమాధానము చెప్పవలసియున్నది.

ఈవిషయమును శ్రీచంద్రశేఖరసింహసామంత దైవజ్ఞుడు క్రీ.శ. ౧౮౬౯ లో పరిష్కరించెను "తత్రోక్తా




పులహక్రతూ, ధ్రువసూత్రేణ యల్లగ్నౌ తద్భుక్స్థా మహర్షయః, కథ్యంతే" :— అని చెప్పినారు.

అనగా ధ్రువమునుండి పులహక్రతువు లిద్దరిపైగా విషువద్వృత్తమునకు వ్రాయబడు లంబసూత్రము ఏనక్షత్రపాదమగునో ఆనక్షత్రపాదమందు ఈసప్తర్షి మండల మున్నదని చెప్పవలయునని పైదైవజ్ఞుని యభిప్రాయ మైయున్నది.

ఈమండలము వారికాలమున సింహరాశిలో నుండెను. అందు పులహక్రతువు లిరువురును సింహరాశిలో ౨౧-వ భాగలోను, పులస్త్యుడు కన్యారాశిలో ౮-వ భాగలోను, అత్రి కన్యారాశిలోని ౯-వ భాగలోను, అంగిరసుడు కన్యారాశిలోని ౧౮-వ భాగలోను, వశిష్ఠుడు కన్యారాశిలోని ౨౬-వ భాగలోను, మరీచి తులారాశిలోని ౮-వ భాగలోను ఉండిరని పై దైవజ్ఞులు వ్రాసియుండిరి.

ఈశాస్త్రము సంస్కృతభాషలో నున్నందున దానిని అనేకులు ప్రకృతమందు రాజభాషయైన ఆంగ్లములోనికి తర్జుమాచేసిరి. మరియు దీనిని పాశ్చాత్యపండితులు అనేకవిధములుగా వృద్ధిపొందించి సూక్ష్మమైన యంత్రాదులచే ఆకాశమందున్న గ్రహనక్షత్రాదులను చక్కగా

పరిశీలించి వాటి వాస్తవస్థానమును లోకమునకు ప్రచురపరచుచున్నారు.

దీనిని ఆంగ్లములోని కనువదించినవారలలో సుప్రసిద్ధుడగు Prof. J. C. Ray గారు ఈసప్త మహర్షులకును ఈక్రింది ఆంగ్లప్రతి నామము లిడిరి.




| | | |
|---|---|---|
| ౧. మరీచి | ఈటా | Ursa Majoris |
| ౨. వసిష్ఠుఁడు | జీటా | ,, |
| ౩. అంగిరసుఁడు | ఎప్సిలాన్ | ,, |
| ౪. పులస్త్యుఁడు | గామా | ,, |
| ౫. అత్రి | డెల్టా | ,, |
| ౬. పులహుడు | బీటా | ,, |
| ౭. క్రతువు | ఆల్ఫా | ,, |

ఈనామములను బట్టి ప్రకృతమందలి గ్రీనిచ్, ప్యారిస్ మొదలైన సుప్రసిద్ధవేధశాలాప్రచురణలను (Observatory record)బట్టి చూడగా వీరల కీక్రిందివిధమైన విషువాంశయు (R. A.). క్రాంతియు (Decn) కానవచ్చుచున్నవి.

| | విషువాంశ | క్రాంతి | |
|---|---|---|---|
| | గం. ని. సె. | ° ' | |
| మరీచి | ౧౩-౪౪-౫౮ | ౪౯-౩౮ | ఉత్తరము |
| వసిష్ఠుడు | ౧౩-౨౧-౧౮ | ౫౫-౧౫ | ,, |
| అంగిరసుడు | ౧౨-౫౧-౧౦ | ౫౬-౧౮ | ,, |
| పులస్త్యుడు | ౧౧-౫౦-౨౫ | ౫౪- ౩ | ,, |
| అత్రి | ౧౧-౧౪-౪౩ | ౬౧-౫౩ | ,, |
| పులహుడు | ౧౬-౫౭-౫౫ | ౫౬-౪౩ | ,, |
| క్రతువు | ౧౦-౫౯-౪౩ | ౬౨- ౬ | ,, |

ఈ క్రింది చిత్రము ప్రకారము విషువద్రేఖ (Equation)పై నివసించువారికి కాన్పించును.

ఈవేధసిద్ధమగు విషువాంశనుబట్టి ప్రకృతమందు

| | | | |
|---|---|---|---|
| పులహుడు | పూర్వఫల్గుని | ౩-వ | పాదమందును |
| క్రతువు | ,, | | ,, |
| అత్రి | ,, | ౪-వ | ,, |
| పులస్త్యుడు | ఉత్తరఫల్గుని | ౩-వ | ,, |
| అంగిరసుడు | హస్త | ౩-వ | ,, |
| వసిష్ఠుడు | చిత్ర | ౨-వ | ,, |
| మరీచి | ,, | ౩-వ | ,, |

ఉన్నారు.

ఇట్లు ప్రతియొక్కరును భిన్నమగు నక్షత్రపాదములం దున్నను "తత్రోక్తౌ పులహక్రతూ, ధ్రువసూత్రేణ యల్లగ్నౌ తదృక్షస్థా మహర్షయః కథ్యంతే" అను పూర్వోదాహృతవచనానుసారముగ పులహక్రతువులు పూ. ఫ. ౩-వ పాదమందుండుటచే ప్రకృతకాలమందు ఈసప్తర్షి మండలము పూ. ఫ. ౩-వ పాదమందే యున్నదని చెప్పవలెను.

మరియు సూర్యుడు పులహునితో సమానమైన విషువాంశను సెప్టెంబరు ౬-వ తారీఖునను, క్రతువుతో సమానమైన విషువాంశను ౭-వ సెప్టెంబరునందును, అత్రితో సమానమైన విషువాంశను ౧౧-వ సెప్టెంబరునందును, పులస్త్యునితో సమానమైన విషువాంశను ౨౧-వ సెప్టెంబరునందును, అంగిరసునితో సమానమైన విషువాంశను ౮-వ అక్టోబరునందును, వసిష్ఠునితో సమానమైన విషువాంశను ౧౬-వ అక్టోబరునందును, మరీచితో సమానమైన విషువాంశను ౨౩-వ అక్టోబరునందును పొందును. అనగా ఆయాతేదీలందు వీరలతో సూర్యుడు యోగమునొందును. అందుచే వీరలు సెప్టెం

బరు, అక్టోబరునెలలలో సామాన్యముగా కనుపడరు. సూక్ష్మముగ సూర్యోదయమునకు కొంచెము పూర్వమందును క్రమముగ నగపడుదురు.

నవంబరునెలలో రాత్రి ౪-వ యామమందును
డిసెంబరు ,, ,, ౩-వ ,,
జనవరి ,, ,, ౨-వ ,,
ఫిబ్రవరి ,, ,, మొదటి ,,
మార్చి ,, సూర్యాస్తకాలమందును
వీర లుదయింతురు.

ఏప్రిల్ నెలలో రాత్రి ౪-వ యామమందును
మే ,, ,, ౩-వ ,,
జూన్ ,, ,, ౨-వ ,,
జులై ,, ,, ౧-వ ,,
ఆగస్టు ,, సూర్యాస్తకాలమందును
వీర లస్తమింతురు.

ఇట్లు గ్రహించినచో ప్రకృతమందలి వేధసిద్ధమగు ధ్రువములకును, ప్రాచీనగ్రంథసమ్మతనుగు ధ్రువములకును సమన్వయము గల్గి నిర్దుష్టముగా నుండునని మా అభిప్రాయముతో నీ వ్యాసమును ముగించుచున్నాము.

---






సూరి రామసుబ్బరాయ శాస్త్రి

శ్లో. ప్రణిపత్య రవిం మూర్ధ్నా వక్ష్యేఽహం భావసాధనమ్,
ద్యుచరస్థితిభేదోత్థ ఫలవిజ్ఞానసాధనమ్. ౧

జాతకశాస్త్రమున రవ్యాదిగ్రహములు తన్వాదిద్వాదశ భావములందలి స్థితులచే నోసంగుఫలములు నిర్దేశింపఁబడినవి. తత్ఫలముల నిర్ణయించుటకు ముందుగాఁ దెలిసికొనఁదగిన భావసాధనము వివరించుచున్నాను.

ఇందుఁ బ్రథమమున సాధింపఁదగిన లగ్నసప్తమ చతుర్థదశమకేంద్రముల స్వరూపము భాస్కరాచార్యులచే సిద్ధాంతశిరోమణి యందు:—

శ్లో. అవనౌ గగనం సమంతత స్సతతం లగ్నమి వావలోక్యతే,
క్షితిపృష్ఠనివాసిమానుషః క్షితిజం తద్గణకా నిరూచిరే. ౨

శ్లో. యత్ర లగ్నమపమండలం కుజే తద్గృహాద్య మిహ లగ్నముచ్యతే,
ప్రాచి పశ్చిమకుజేఽస్తలగ్నకం మధ్యలగ్నమితి దక్షిణోత్తరే. 3

భూమ్యుపరిభాగమున నెచ్చటనుండిచూచినను చుట్టును భూమ్యాకాశములు కలసియున్నటులు గాన్పించును. అట్లు లగ్నమైనటులు గనుపించు ప్రదేశము క్షితిజ మనఁబడును. ఈక్షితిజమునందు నిష్టకాలమునఁ బూర్వదిక్కునఁ గలసియుండు క్రాంతివృత్తరాశ్యంశాది "లగ్న" మనఁబడును. పశ్చిమమునఁ గలసియుండు రాశ్యాది "అస్తలగ్నము లేక సప్తమ" మనఁబడును. యామ్యోత్తరవృత్తమునాకాశమధ్యమున లగ్నమగురాశ్యాది "మధ్యలగ్నము లేక దశమ" మనియు, నధోభాగమున లగ్నమగు రాశ్యాది "పాతాళము లేక చతుర్థ" మనియుఁ బిలువఁబడును.

ఇష్టకాల లగ్నసాధనవిధానము బ్రహ్మతుల్యమునందు:

శ్లో. తాత్కాలికోఽర్కోఽయనభాగయుక్త స్తద్భోగ్య భాగై రుదయో హతః స్వః, ఖాగ్నుల్లబ్ధ ఉత్తస్తం రవిభోగ్యకాలం విశోధయేదిష్టఘటీపలేభ్యః. ౪౧

శ్లో. తదగ్రతో రాశ్యుదయాంశ్చ శేష మశుద్ధహృత్ ఖాగ్ని గుణాల్లవాద్యమ్, అశుద్ధపూర్వై ర్భవనై రజాద్యై ర్యుక్తం తనుస్సాయనాంశహీనమ్. ౪౫

లగ్నసాధనార్థము తాత్కాలిక స్ఫుటరవిరాశ్యాదిని, అయనాంశలను, స్వోదయమానములను సూర్యోదయమునుండి యిష్టకాల పర్యంతము గడచిన ఘటికాదికాలమును సాధించి యుంచుకొనవలయును. ఇందు రవియే ప్రధానమగు నాధారము. ఈరవియందయనాంశలఁ గలుపవలయును. సూర్యోదయసమయమున సూర్యుఁడున్న రాశ్యాదియే యుదయమగుటచే సూర్యతుల్యమే లగ్నమగుచున్నది. సూర్యోదయానంతరము సూర్యుఁడున్న రాశియందలి భోగ్యాంశలును, పిమ్మటఁ దరువాతిరాసులును గ్రమక్రమముగ నుదయమగుచుండును. కావున నిష్టకాలఘటికాదినుండి ముందుగ సూర్యుని రాశియందలి భోగ్యకాలముఁ దీసివేయవలయును. ముప్పదిభాగల ప్రమాణమగు రాశికిఁ ద్రాశ్యుక్తస్వోదయఘటికాదిప్రమాణ మైనయెడల రవియొక్క భోగ్యాంశలచే నెంతకాలమగు నను ననుపాతమున సాయన రవి రాశియొక్క ప్రమాణమగు ఘటికాదిని తద్రవియొక్క భోగ్య భాగాదిచే హెచ్చించి 30 చే భాగింపవలయును. ఇట్లు సాధింపఁగా వచ్చిన ఘటికాదిని ఇష్టకాలమగు ఘటికాదినుండి తీసివేయవలయును. తదనంతరమం దీఘటికాదినుండి తరువాతిరాసులమానముల నెన్నింటిని దీయవీలయిన నన్నింటిని దీసివేయవలయును. తుదకుఁ బూర్తిగా శోధింపఁబడనిరాశియే యిష్టకాల లగ్నమగును. అందును నేభాగాదిలగ్నమున నుండునో తెలిసికొనుటకై యనుపాతము చేయఁదగియున్నది. స్వోదయమానమున నారాశియొక్క శేషించిన ఘటికాదిని ముప్పదిచే హెచ్చించి, శోధ్యముగానిరాశియొక్క స్వోదయామానమగు ఘటికాదిచే భాగింపవలయును. ఇట్లనుపాతలబ్ధమగు భాగాదికమును మేషాదిగతరాసులతోఁ జేర్పఁగా సాయనలగ్నమగును. దీనినుండి యయనాంశలఁ దీసివేయఁ దాత్కాలికస్ఫుటలగ్నమగును. రవియందయనాంశలఁ గలిపి స్వోదయాసువులచే సాధించినలగ్నము నాడీమం

డలక్రాంతిమండల సంపాతమునుండి లబ్ధమగును. కాని రేవతీయోగ తారనుండి లగ్న మపేక్షింపఁబడినదగుటచేనయనాంశలఁ దీసివేయఁగా నిరయనలగ్న మగును. ఈవిషయమై బ్రహ్మసిద్ధాంతమునందును, "చలసంస్కృత లగ్నజ్యాలంబజ్యా చేద్ధ్రువ త్యపి" అని చెప్పఁబడి యుండుటచే నయనసంస్కృతలగ్నమే సాధింపఁదగియున్నది గాని సాయనలగ్నము గ్రహింపఁదగ దని ధ్రువ మగుచున్నది. అయనసంస్కారవిషయమునందును, "ఖచరాశ్చరంతి తస్మాత్పూర్వే యుక్తాశ్చ పశ్చిమే హీనాః" అని చెప్పఁబడియుండుటచే భచక్రము ప్రాక్చలనమున నున్నపు డయనాంశలను గ్రహములందుఁ గలుపుటయును, పశ్చిమచలనమున నున్నపుడు తీసివేయుటయుఁ జేయవలయును. ప్రస్తుతము భచక్రము ప్రాక్చలనమున నుండుటచే రవియం దయనాంశలం గలిపి సాధించిన లగ్నమునుండి యయనాంశలఁ దీసివేయ నిరయన లగ్నము సిద్ధించుచున్నది.

ఉదాహరణము:—కల్యాదిగత ౫౦౨౩ సంవత్సరములకు తుల్యమగు శ్రీదుందుభినామసంవత్సర భాద్రపద బ ౧౪ బుధవారమున సూర్యోదయాది జన్మకాలఘటికాది, ౫౩-౫౦; అహఃప్రమాణము ౩౦-౧౬; తత్కాలస్ఫుటరవిరాశ్యాది ౫-౪-౦-౩౦; అయనాంశాది ౨౨-౩౯-౩౦.

స్వోదయమానములు:—మీన మేషములు౪-౨వృషకుంభములు ౪-౩౦; మిథునమకరములు ౫-౧౦, -కటకధనువులు ౫-౩౫,-సింహవృశ్చికములు ౫-౨౮; కన్యాతులలు ౫-౧౫; లంకోదయమానములు మీనమేష కన్యాతులలు ౪-౩౮; వృషకుంభసింహవృశ్చికములు ౪-౫౯; మిథునకర్కట ధనుర్మకరములు ౫-౨౩.

తాత్కాలికస్ఫుటరవియం దయనాంశాదికమును గలుపఁగా ౫-౨౬-౪౦ సాయనరవిరాశ్యాది యగును. ఈసాయనరవియొక్క కన్యాలగ్నభోగ్యాంశాది ౩-౨౦. దీనిని కన్యాలగ్నస్వోదయమానమగు ౫-౧౫ చే హెచ్చించి ౩౦ చే భాగింపఁగా ౦-౩౫ ఘటికాది సాయన రవిభోగ్యకాల మగును. దీనిని సూర్యోదయమునుండి యిష్టకాలమగు ౫౩-౫౦ ఘటికాదినుండి తీసివేయఁగా ౫౩-౧౫ మిగులును. ఇందుండి తరువాతిరాశుల వీలగునంతవఱకుఁదీసివేయవలయును. తులావృశ్చిక ధనుర్మకరకుంభ మీన మేష వృషభ మిథున కర్కటకములు శోధ్యము కాఁగా ౩-౫౮ ఘటికాది శేషించును. కావున సింహలగ్నమున నింతకాలము గడవఁగా నిష్టకాల మయ్యెనని యర్థము. ఈకాలమునుండి భాగాదిని సాధించుటకై ౩-౫౮ ఘటికాదిని ౩౦ చే హెచ్చించి సింహలగ్నమానమగు ౫-౨౮ చే భాగింపఁగా లబ్ధము ౨౧-౪౬-౬ భాగాది సింహలగ్నమునఁ గడచెనని తెలియును. కావున ౪-౨౧-౪౬-౬ రాశ్యాదిసాయనలగ్నమగును. దీనినుండి యయనాంశాది ౨౨-౩౯-౩౦ ని తీసివేయఁగా ౩-౨౯-౬-౩౬ రాశ్యాది నిరయనస్ఫుటలగ్న మగును.

సూర్యునిభోగ్యకాలముకంటె నిష్టకాల మల్పమైనపుడు లగ్నమును సాధించువిధానము సిద్ధాంతశిరోమణియందు:—

శ్లో. భోగ్యాల్పకాలే ఖగుణా (౩౦) హతేఽర్కే
    స్వీయోదయాప్తాంశయుతే విలగ్నమ్.

సూర్యునిభోగ్యకాలముకంటె నిష్టకాల మల్పమైనపుడు, సూర్యునిరాశియే లగ్నమును నగును. అం దంశాదినిర్ణయమునకై ఉదయానంతరము గడచిన ఘటికాదికమును ౩౦ చే హెచ్చించి తద్రాశియొక్క స్వదేశమానముచే భాగింపవలయును. ఇట్లు లబ్ధమగు భాగాదిని రవియందుఁ గలుపఁగా స్ఫుట లగ్నమగును. సూర్యుని భుక్తకాలముకంటె నల్పముగ సూర్యోదయమునకు బూర్వ మిష్టకాల మైనయెడల నాకాలమగు ఘటికాదిచే భాగాదికము నీపూర్వోక్తవిధమున సాధించి రవియందుఁ దీసివేయఁగా స్ఫుటలగ్నమగును. ఇట్లు రవిలగ్నము లేక రాశిగతము లైనపుడు లగ్నమును సాధింపవలయును.

విలోమవిధిచే లగ్నసాధనము:—

శ్లో. భుక్తాసు శుద్ధే ర్విపరీతలగ్నం,
    భుక్తాంశ గేహో త్తలవోనితోఽర్కః

క్రమలగ్నమును సాధించుటకై సూర్యోదయమునుండి ఇష్టకాలపర్యంత ఘటికాదినుండి రవియొక్క భోగ్యకాలమును దరువాతి రాసులను దీసివేసితిమి. విలోమముగ ననఁగా (వెనుకకు) విపరీతవిధమున సాధించుటకై ఇష్టకాలానంతరము మరుసటి సూర్యోదయమగువరకు నగుకాలమునుండి (అనఁగా పూర్వోక్తమగు సూర్యోదయమునుండి యిష్టకాలపర్యంతఘటికాదిని ౬౦ ఘటికలనుండి తీసివేయఁగా లబ్ధమగుకాలమునుండి) సూర్యునిభుక్తకాలమును దీసివేసి సూర్యునిరాశినుండి విలోమక్రమమున శోధ్యమగు నన్నిరాసులను దీసివేయవలయును. అందు శోధ్యముకానిరాశియే లగ్నమగును. అందును శేషమగుకాలము భోగ్యమగును. దీనినుండి భాగాదిని దెలిసికొనుటకై తచ్ఛేషకాలమును ౩౦ చే హెచ్చించి తద్రాశిమానముచే భాగింపవలయును. ఇట్లుపపన్నమగుభాగాదిని రవియొక్క భుక్త భాగాదిని శోధ్యరాశిసంఖ్యను గలిపి రవియందుఁ దీసివేయ లగ్నము సిద్ధించును. ఇట్లు విలోమముగ రవినుండి రాశ్యాదిఁ దీసివేయుటచే నిది ఋణలగ్నసాధన మనఁబడుచున్నది. ఈవిలోమలగ్నానయనమునందును ప్రథమమున రవియం దయనాంశలఁ గలిపి సాధించిన లగ్నమునుండి యాయయనాంశలఁ దీసివేయవలయును.

పూర్వోదాహరణమునందు సూర్యోదయమునుండి యిష్టకాల ఘటికాది ౫౩-౫౦ దీనిని ౬౦ నుండి తీసివేయఁగా ౬-౧౦ ఘటికాది ఇష్టకాలమునుండి సూర్యోదయపర్యంతకాల మగును. సాయన రవిరాశ్యాది ౫-౨౬-౪౦. ఈరవిభుక్తాంశాది ౨౬-౪౦ ని కన్యాలగ్నమానమగు ౫-౧౫ చే హెచ్చించి ౩౦ చే భాగింపఁగా ౪-౪౦ ఘటికాది రవికయొక్క కన్యాలగ్నభుక్తకాల మగును. దీనిని ౬-౧౦

ఎగ్మూరు రైల్వేస్టేషను, రాత్రివేళ D. A. R.



సాధనకుటీరము (పంచమ బాలికాశ్రమము) పిఠాపురము



భారతప్రభుత్వపు నూతన ఆర్థికసభ్యుడు సర్ జేమ్సు గ్రిగ్, వారి సతి



జెనరల్ జీరో మినామి
(జపాను సైనికోన్నతోద్యోగి)



కుత్తాలము దేవాలయము

K. P. S.

నుండి తీసివేయ ౧-౩౦ సాయనలగ్నము సింహరాశియొక్క భోగ్య కాల మగును. సింహప్రమాణమగు ౫-౨౮ నుండి ఈభోగ్యకాలమగు ౧-౩౦ ని తీసివేయ ౩-౫౮ ఘటికాది సింహలగ్నభుక్తకాలమగును. దీనినుండి భాగాదిని సాధించుటకై ౩-౫౮ ని ౩౦ చే హెచ్చించి సింహమానమగు ౫-౨౮ చే భాగింపఁగా ౨౧-౪౬-౬ భాగాది యగును. మేషాదిగతరాశికిఁ జేర్పఁగా ౪-౨౧-౪౬-౬ సాయనలగ్న మగును. ఇం దయనాంశాది ౨౨-౩౯-౩౦ తీసివేయఁగా ౩-౨౯-౬-౩౬ రాశ్యాది నిరయనస్ఫుటలగ్నమగును.

అస్తలగ్నానయనము సోపపత్తికముగ భాస్కరీయ గోళము నందు:—

శ్లో. యో౽భ్యుదేతి సమయేన యేన తత్సప్తమో౽స్తముపయాతి తేనచ,

రాశి రూర్ధ్వ మపమండలం కుజాదర్ధ మేవ సతతంయతః స్థితమ్. ౭

ఏసమయమునఁబూర్వక్షితిజమున నేరాశి యుదయమగుచుండునో ఆసమయముననే పశ్చిమక్షితిజమునఁ దత్సప్తమరాశి యస్తమగు చుండును. క్రాంతివృత్త మెల్లపుడును క్షితిజమున కూర్ధ్వభాగమున నర్ధమును నధోభాగమున నర్ధమును నుండును గావున నుదయరాశికి సప్తమ మస్తమయరాశి యగుచుండును. ఇట్లే క్రాంతివృత్తము యామ్యోత్తరవృత్తమునందును నూర్ధ్వాధోభాగములందు సమద్వార మున లగ్నమగుటచే దశమమునకు సప్తమరాశ్యాది చతుర్థమును, చతు ర్థమునకు సప్తమరాశ్యాది దశమమును నగుచుండును. పూర్వోదాహ రణమునందు స్ఫుటలగ్నమగు ౩-౨౯-౬-౩౬ రాశ్యాదియం దారు రాసులఁ గలుపఁగా ౯-౨౯-౬-౩౬ రాశ్యాది సప్తమభావ మగును.

రాత్రియం దిష్టకాలమై అస్తమయాదిగ నిష్టకాల ఘటికాది తెలిసినపుడు లగ్నానయనము సులభమార్గమున:—

శ్లో. సషడ్భసాయనార్కస్య భోగ్యభాగాదికై రపి,
నిశాయా మిష్టకాలస్య లగ్నం ప్రాగ్వద్విసాధయేత్. ౮

సూర్యోదయకాలమున సూర్యతుల్య ముదయలగ్న మగుటచే రవియం దారురాసులఁ గలుపఁగా నస్తలగ్న మగును. అట్లే సూర్యా స్తమయకాలమున షడ్రాశియుక్తరవిరాశ్యాదియే ప్రాగ్లగ్న మగును. కావున నస్తమయాది గతఘటికాదివలన నస్తమయకాల ప్రాగ్లగ్న మగు సషడ్భరవినుండి పూర్వోక్తవిధమునఁ గ్రమలగ్నము సాధింప వచ్చును. సూర్యోదయకాలమునుండి యిష్టకాలఘటికల వలన రాత్రి యందు లగ్నమును సాధించుటకంటె సషడ్భరవినుండి యస్తమయాది గతకాలముచే లగ్నమును సాధించుట లాఘవము. అందులకై సూర్యో దయము మొదలు రాత్రియం దిష్టకాలపర్యంత మగు ఘటికాదినుండి యహఃప్రమాణముఁ దీసిన నస్తమయాదిగ నిష్టకాలఘటికాది తెలియఁ గలదు.

జన్మలగ్నమువలన నిష్టకాలఘటికాదిఁ దెలిసికొనుట:

శ్లో. అర్కస్య భోగ్య స్తనుభుక్తయుక్తో మధ్యోదయాఢ్య స్సమయో విలగ్నాత్, యద్యైకభే లగ్నరవీ తదా తద్భాగాంతర ఘ్నోదయ భాగ్ని (౩౦) భాగః. ౯

రవియున్న రాశియొక్క భోగ్యకాలమును, లగ్నముయొక్క భుక్తకాలమును, అర్కలగ్నాంతరరాసుల మానములను, గలుపఁగా నిష్టకాల మగును. విలోమలగ్నము సాధించినపుడు తద్విపరీతముగ రవియొక్క భుక్తకాలమును లగ్నముయొక్క భోగ్యకాలమును మధ్యోదయములతోఁ గలుపఁగా నిష్టకాలము లభించును. ఇచ్చట లగ్నసూర్యులు రెండును సాయనములే గ్రహింపవలయునని యెఱుంగ నగుది. లగ్నమును రవియు నేకరాశిగతము లయినపుడు లగ్నరవ్యంతర భాగలచే తద్రాశిమానమును హెచ్చించి ముప్పదిచే భాగింపఁగా సూర్యోదయమునుండి యిష్టకాల మగును. రవి భుక్తకాలముకంటె నిష్టకాల మల్పమైనపుడీయిష్టకాలము సూర్యోదయమునకుఁ బూర్వ మని యెఱుంగునది.

ఈవిషయమై సూర్యసిద్ధాంతమునందు:—

శ్లో. భోగ్యాసూ నూనకస్యాథ భుక్తాసూ నధికస్య చ,
సంపిండ్యాంతరలగ్నాసూ నేవం స్యాత్కాలసాధనమ్.

లగ్నసూర్యులలో నల్పమగు దానియొక్క భోగ్యకాలమును నధికమగుదానియొక్క భుక్తకాలమును గలిపి లగ్నరవ్యంతరరాశి మానములతోఁ జేర్పఁగా నిష్టకాలమగును. అధికరాశ్యాది కలదెల్లపుడు తరువాతనే యుండును. కావునఁ గ్రమలగ్నానయనమునందు నల్ప రాశ్యాదిగల రవియొక్క భోగ్యకాలమును, నధికరాశ్యాదిగలలగ్నము యొక్క భుక్తకాలమును నంతరరాసులతోఁ గలుపవలయును. ఉత్క్రమలగ్నానయనమునందులగ్నము రవికంటె నధికముగనుండును గావున రవియొక్కభుక్తకాలమును లగ్నముయొక్క భోగ్యకాలమును నంతరరాసులతోఁ గలుపవలయునని యర్థము. పూర్వోదాహరణము నందు, సాయనరవిభోగ్యకాలము ౦-౩౫ ఘటికాది. సాయనలగ్న భుక్తకాలము ౩-౫౮ ఘటికాది. అంతరమగుతులాది కటకాంత రాసులమానములు ౪౭-౧౭ ఘటికాది. వీనిని గలుపఁగా ౫౩-౦ ఘటికాది, ఇష్టకాల మగును.

లగ్నసూర్యులవలన నిష్టకాల మహోరాత్రములలో నెప్పుడైన దియుఁ దెలిసికొనుపాయము సూర్యసిద్ధాంతమునందు:—

శ్లో. సూర్యాదూనే నిశాశేషే లగ్నే౽ర్కా దధికే దివా,
భచక్రార్ధయుతా ద్భానో రధికే౽స్తమయా త్పరమ్. ౧౦

లగ్నము సూర్యతుల్యమైన సూర్యోదయకాలముననే ఇష్టకాల మగును. సూర్యునికంటె నల్పమైన, సూర్యోదయమునకుఁ బూర్వ మును సూర్యునికంటె నధికమైన, సూర్యోదయానంతరమును సూర్యునికంటె నారు రాసులకుఁ బైఁగా నున్నయెడల నస్తమయా

నంతరమును నిష్టకాల మగును. సూర్యునికంటె లగ్నము రాశిత్రయములోపుగా నల్పమైన నర్ధరాత్రానంతరమును, రాశిత్రయములోపుగా నధికమైన మధ్యాహ్నమునకుఁ పూర్వమును, మూఁడురాసులకంటె నెక్కువయైన మధ్యాహ్నానంతరమును నిష్టకాల మగును.

ఇఁక మధ్యలగ్నానయనోపయోగికమగు నతోన్నతకాల విజ్ఞానము శ్రీపత్యాచార్యులచే:

శ్లో. మధ్యాహ్నాంశుమతో ర్య ఏవ వివరః కాల స్స ఉక్తో నతః,
సోప్యగ్నిభ్రాగ్ని(30) పరిచ్యుతో రవినిశామధ్యాంతరే చోన్నతః.

జ్యోతిశ్చక్రమున యామ్యోత్తర వృత్తమునకుఁ బూర్వమున నున్నయర్ధము ప్రాక్కపాల మనియుఁ, బశ్చిమమున నున్న యర్ధము ప్రత్యక్కపాల మనియుఁ బిలువఁబడుచున్నవి. ఇట్లు ఖగోళమునఁ బ్రాగపరవిభాగముచేఁ గపాలద్వయ మగుచున్నది. అనఁగా నర్ధరాత్రమునుండి మధ్యాహ్నపర్యంతము సూర్యుని యారోహణ మార్గావధియగు ముప్పదిఘటికలకాలము పూర్వకపాలమనఁబడుచున్నది. మధ్యాహ్నమునుండి యర్ధరాత్రపర్యంతము సూర్యుని యవరోహణమార్గావధియగు ముప్పదిఘటికలకాలము పశ్చిమకపాలమనఁబడుచున్నది. అహోరాత్రప్రమాణములందు హెచ్చుతగ్గులు కలుగుచుండునుగాని యీకపాల ప్రమాణములం దెట్టిభేదము కలుగఁజాలక యెల్లప్పుడు ముప్పదిసావన ఘటికలప్రమాణము కలవిగా నుండును. ఈకపాలద్వయమునందును మధ్యాహ్నమునకును సూర్యునకును గలయంతరము నతకాల మనఁబడును. మధ్యాహ్నాపేక్షచే సూర్యుఁ డెంతకాలము నమ్రుడై




యుండునో యాఘటికాదియే నతకాల మనఁబడును. ఇట్లే కపాలద్వయమునందు రవికిని నర్ధరాత్రమునకును గలయంతర మున్నతకాల మనఁబడును. అర్ధరాత్రాపేక్షచే సూర్యుఁ డెంత యుచ్ఛ్రస్థుఁడై యుండునో యాఘటికాదియే యున్నతకాల మనఁబడుచున్నది. ఇదియే రామదయాళుచే:—"శ్లో. ఉన్నతం నతలతో నతం ఖతః ఖేచరాంత మితి గోళవిన్మతమ్" అనిచెప్పఁబడినది. మధ్యాహ్నానంతర మర్ధరాత్రములోపుగ నిష్టకాలమైనయెడల మధ్యాహ్నమునుండి యిష్టకాలపర్యంతము గడచినకాలము పశ్చిమ (కపాల) నత మగుచున్నది ఇష్టసమయమునుండి యర్ధరాత్రమువరకును గడవవలసియుండు కాలము పశ్చిమోన్నత మగుచున్నవి. ఈనతోన్నతములు రెండును గలసి తత్పశ్చిమకపాలప్రమాణమగు ముప్పదిసావనఘటిక లగుటచే 30 నుండి నతముఁ దీసివేసిన నున్నతంబును, నున్నతముఁ దీసివేసిన నతంబును నగును. అర్ధరాత్రానంతరము మధ్యాహ్నములోపుగఁ బూర్వకపాలమున నిష్టకాలమైనయెడల నర్ధరాత్రమునుండి యిష్టకాలమువరకుఁ గడచినకాలము పూర్వోన్నతమును ఇష్టకాలమునుండి మధ్యాహ్నపర్యంతము గడవవలసినకాలము పూర్వనతము నగును. ఈ నతోన్నతములు రెండును గలసి ముప్పదిఘటిక లగుటచే 30 నుండి పూర్వనతముం దీసివేసిన పూర్వోన్నతమును, పూర్వోన్నతముఁ దీసివేసిన పూర్వనతము నగును. నతోన్నతవివరము మహాకవి శ్రీ కాళిదాసుచే నుత్తరకాలామృతమునందు:—

శ్లో. నాడ్య స్స్యుర్నతసంజ్ఞికా దినదళా న్నిశ్యర్ధ పర్యంతగా,
స్తద్వ ద్రాత్రిదళా త్తదా దినదళం నాడ్యాదికం చోన్నతమ్,
త్రింశ చ్ఛుద్ధనతోన్నతేచ భవత స్తేఽన్యే క్రమాత్.

దినార్ధమునుండి యర్ధరాత్రపర్యంత గణనయందు ననఁగాఁ గపాలద్వయమునందును మధ్యాహ్నమునుండి యిష్టకాలపర్యంత ఘటికాది నతకాల మనఁబడుచున్నది. అర్ధరాత్రమునుండి దినార్ధపర్యంత గణనయందు ననఁగాఁ గపాలద్వయమునందును నర్ధరాత్రమునుండి యిష్టకాలకాలపర్యంతఘటికాది యున్నతకాల మనఁబడుచున్నది. కపాలద్వయమునందును నీనతోన్నతములు కలసి ముప్పదిఘటిక లగుటచే ముప్పదినుండి నతఘటికలఁ దీసివేసిన నున్నత ఘటికలును, నున్నతఘటికలఁ దీసివేసిన నతఘటికలును నగుచున్నవి.

నతోన్నతకాలసాధనము శ్రీకేశవాచార్యులచే:—

శ్లో. రాత్రే శ్శేషమితం యుతం దినదళే నాహ్నో గతం శేషకమ్;
విశ్లేష్యం ఖలు పూర్వపశ్చిమనతం త్రింశచ్చ్యుతం చోన్నతమ్.

(౧) అర్ధరాత్రానంతరము పూర్వకపాలమున నిష్టకాలమైనయెడల రాత్రిశేషమును దినార్ధములోఁ గలుపఁగాఁ బూర్వ నతకాల మగును. అనఁగా నిష్టకాలమునుండి మధ్యాహ్నమువరకుఁ గడవవలసిన కాల మగును. దీనిని 30 నుండి తీసివేయఁగా నర్ధరాత్రమునుండి యిష్టకాలపర్యంతము గడచిన పూర్వోన్నత కాలమగును. (౨) అర్ధరాత్రమునకుఁ బూర్వము పశ్చిమకపాలమున నిష్టకాల మైనయెడల రాత్రియందు గడచినకాలమును దినార్ధమునం గలుపఁగా మధ్యాహ్నమునుండి యిష్టకాలపర్యంతము గడచిన పశ్చిమనతకాల మగును. దీనిని 30 నుండి తీసివేయఁగా నిష్టకాలమునుండి యర్ధరాత్రపర్యంతము గడవవలసిన పశ్చిమోన్నతకాలమగును. (3) దివాకాలమున మధ్యాహ్నమునకుఁ బూర్వమిష్టకాలమైనయెడల నుదయమునుండి కడచినకాలమును దినార్ధములోఁ దీసివేయఁగా నిష్టకాలమునుండి మధ్యాహ్నమువరకుఁ గడపలసిన పూర్వనతకాలమగును, దీనిని 30 నుండి తీసివేయఁగా నర్ధరాత్రమునుండి

యిష్టకాలపర్యంతము గడచిన పూర్వోన్నతకాల మగును. (౪) మధ్యాహ్నానంతరము పశ్చిమకపాలమున నిష్టకాలమైనయెడల దినశేషమును దినార్ధములోఁ దీసివేయఁగా మధ్యాహ్నమునుండి యిష్టకాలపర్యంతము గడచిన పశ్చిమనతకాల మగును. దీనిని ౩౦ నుండి తీసివేయఁగా నిష్టకాలమునుండి యర్ధరాత్రమువరకుఁ గడవవలసిన పశ్చిమోన్నత కాలమగును. ఇట్లు ఖగోళమున క్షితిజసన్నివేశముచే నాల్గువిభాగములు కలుగుచున్నవి. పూర్వకపాలమున సూర్యుఁడు క్షితిజమున నూర్ధ్వమున నున్నయెడల దినగతమును క్షితిజమునకుఁ గ్రిందనున్న రాత్రిశేషమును నగును. పశ్చిమకపాలమున క్షితిజమున నూర్ధ్వముననున్నయెడల దినశేషమును, గ్రిందనున్న రాత్రిగతమును నగును. దినగతశేషముల దినార్ధమునుండి తీసివేసినను రాత్రిగతశేషముల దినార్ధమునఁ గలిపినను ప్రాగపరనతము లగుచున్నవి. ఈనతముల ౩౦ నుండి తీసివేయ ప్రాగపరోన్నతము లగును.

ఉదాహరణమునందు అహఃప్రమాణము ౩౦-౧౬ ఘటికాది. అహరర్ధము ౧౫-౮ ఇష్టకాలమర్ధరాత్రానంతరము పూర్వకపాలమున నగుటచే రాత్రిశేషమగు ౬-౧౦ ఘటికాదిని దినార్ధమగు ౧౫-౮ లోఁ గలుపఁగా ౨౧-౧౮ ఘటికాది పూర్వనతకాల మగును. దీనిని ౩౦ నుండి తీసివేయఁగా ౮-౪౨ ఘటికాది పూర్వోన్నతకాలమగును.

నతోన్నతకాల సాధనానంతరము కపాలద్వయము నందును క్రమవిధమున మధ్యలగ్నమును సాధించువిధానము శ్రీకేశవాచార్యులచే:—

శ్లో. యత్పూర్వోన్నత షడ్భయుక్తరవితః పశ్చాన్నతాదిత్యతః
యల్లంకోదయకైశ్చ లగ్న మివ తన్మాధ్యం సమధ్యం సుఖమ్.

పూర్వకపాలమున ననఁగా నర్ధరాత్రానంతర మిష్టకాలమైన యెడల నర్ధరాత్రమునుండి యిష్టకాలపర్యంతము గడచిన యున్నత ఘటికలవలనను, షడ్రాశియుతరవివలనను, లంకోదయములచేతను,

"తాత్కాలికోఽర్కోఽయనభాగయుక్తః" అను నిత్యాదివిధమునఁ గ్రమలగ్నమును సాధించినట్లు మధ్యలగ్నము సాధింపఁదగియున్నది. పశ్చిమకపాలమున ననఁగా మధ్యాహ్నానంతర మిష్టకాలమైనయెడల, మధ్యాహ్నమునుండి యిష్టకాలపర్యంతము గడచిన నత ఘటికలవలనను రవివలనను లంకోదయములచేతను క్రమలగ్నమును సాధించినవిధమున మధ్యలగ్నము సాధింపఁదగియున్నది. ఇట్లు కపాలద్వయమునందును క్రమలగ్నము సాధ్యమగుచున్నది.

ఉపపత్తి: 'మధ్యలగ్నమితి దక్షిణోత్తరే' అని చెప్పఁబడుటచే నిష్టకాలమున స్వయామ్యోత్తరవృత్తమున లగ్నమైయుండు క్రాంతివృత్తముయొక్క రాశ్యాదియే దశమలగ్నమగుచున్నది. ఇది యాకాశమధ్యమున నూర్ధ్వభాగముననుండునదగుటచే మధ్యలగ్న మనఁబడుచున్నది. ఈయామ్యోత్తరవృత్తాధోభాగమున లగ్నమైయుండు క్రాంతివృత్తరాశ్యాదియే చతుర్థ మనఁబడుచున్నది. క్షితిజాధోభాగమున నుండునదగుటచే నిది పాతాళమనియుఁ బిలువఁబడుచున్నది. మధ్యాహ్నకాలమున నిష్టకాలమైనయెడల సూర్యుఁ డాకాశమధ్యమున యామ్యోత్తరవృత్తముననే యుండుటచే సూర్యతుల్యమే మధ్యలగ్నమగును. మధ్యాహ్నానంతరము పశ్చిమకపాలమున నిష్టకాలమైనయెడల మధ్యాహ్నానంతరము గడచినఘటికాదిని సూర్యునియందుఁ గలుప మధ్యలగ్నమగును. నక్షత్రచక్ర మెల్లప్పుడును ప్రాగ్దిశనుండి పశ్చిమమునకుఁ దిరుగుచుండుటచేతను, నశ్విన్యాదినక్షత్రము లొకదాని కొకటి పూర్వదిశయం దుండుటచేతను మధ్యాహ్నానంతరము రవిరాశ్యాదికిం దరువాతిరాశ్యాదులే మధ్యలగ్నమగుచుండును. మధ్యాహ్నానంతరము సూర్యుఁడు యామ్యోత్తర వృత్తమునుండి యెంతపశ్చిమమునకుఁ బోయిన సూర్యుఁడున్నరాశ్యాదికంటె నంతదూరమునఁ బూర్వదిశయందే మధ్య లగ్నమగుచుండును. మధ్యాహ్నానంతర మిష్టకాలపర్యంతము గడచినకాలమే పశ్చిమకపాలమున నత మనఁబడుటచే రవియందు నతకాలముఁ గలుప మధ్యలగ్నమగును. ఈనతకాలమువలన రాశ్యాదిని సాధించుటకై లగ్నసాధనమునందువలె స్వోదయాసువులఁగాక నిరక్షోదయాసువుల గ్రహింపవలయును. ఇట్లు నతకాలమువలన లంకోదయాసువులచే సాధించిన రాశ్యాది రవియందుఁ గలుప మధ్యలగ్నమగును. ఇది యనులోమముగ ననఁగాఁ గ్రమవిధమున సాధింపఁబడుమధ్యలగ్నము ధనలగ్న మనఁబడును. ధనమనఁగాఁ గలుపుట యని యర్థము. నతకాలమునుండి సాధించిన రాశ్యాదిని రవియందుఁ గలుపుటచే సిద్ధించునదగుటచే నిది ధనలగ్న మనఁబడుచున్నది.

అర్ధరాత్రమున నిష్టకాలమైనయెడల నాసమయమున సూర్యుఁడు యామ్యోత్తరవృత్తాధోభాగమున నుండుటచే సూర్యతుల్యమే పాతాళము లేక చతుర్థమగును. అందారురాసులఁ గలుప దశమలగ్నమగుచున్నది. అర్ధరాత్రానంతర మనఁగాఁ బ్రాక్కపాలమున నిష్టకాలమైనయెడల నర్ధరాత్రమునుండి యిష్టకాలపర్యంతము గడచిన కాలమగు నున్నతఘటికాదిని రవియందుఁ గలుప చతుర్థమును, షడ్రాశియుక్తరవియందుఁ గలుప దశమమును నగును. ఈపూర్వోన్నత ఘటికలనుండి రాశ్యాదిని సాధించుటకు లంకోదయాసువుల గ్రహింపవలయును. కావున షడ్భయుక్తరవినుండియు, పూర్వోన్నత ఘటికలవలనను, లంకోదయాసువులచేతను సాధించుక్రమలగ్నము దశమలగ్నమగును. ఇందారురాసులఁ గలుపఁ జతుర్థమగును. లేదా ఆరు రాసులఁ దీసివేసినను జతుర్థమగును. ఉన్నతఘటికలనుండి క్రమమున సాధించిన, రాశ్యాదిని షడ్భయుక్తరవియందుఁ గలుపుటచే సాధ్యమగు నీమధ్యలగ్నమును ధనలగ్న మగుచున్నది. ఇట్లు ధనలగ్నమును సాధించుటకు ప్రాక్కపాలమున నున్నతఘటికలను బశ్చిమకపాలమున నతఘటికలను గ్రహింపవలసియున్నది. అట్లుగాక కపాలద్వయమునందును నతఘటికలనే గ్రహించునెడలఁ బ్రాక్కపాలమున విలోమముగ ఋణలగ్నమును సాధింపవలసియుండును. ఇందులకు వృద్ధవశిష్ఠసిద్ధాంతమునందు:—

శ్లో. లంకోదయై ర్లగ్నమృణం విలోమం ఖమధ్యజం పూర్వనతే సుధీర్యత్, పశ్చాన్నతప్రాణచయై ర్ధనాఖ్యం తత్షడ్భయుక్తం హి రసాతలాఖ్యమ్.

లంకోదయములచేఁ బూర్వకపాలమున నతఘటికలవలన విలోమముగ ఋణలగ్నమును, బశ్చిమకపాలమున నతఘటికలవలనఁ గ్రమముగ ధనలగ్నమును సాధింపఁగా మధ్యలగ్న మగును. ఇం దారు రాసులఁ గలుపఁ జతుర్థ మగును. ఇట్లుగాక కపాలద్వయమునందును ధనలగ్నానయనమే శ్రీకేశవాచార్యవాక్యమునఁ జెప్పఁబడినది.

మధ్యలగ్నానయనమున లంకోదయాసువుల గ్రహించుటకుఁ గారణము:—

లంకోదయాసువు లనఁగ నిరక్షోదయాసువు లని భావము. నిరక్షవృత్తస్థములగు సర్వదేశములందును నెల్లపుడును సమరాత్రిందివములు కలుగుటచేఁ దద్వృత్తమునందలి సర్వదేశము లందును మేషాదిరాశిమానములు తుల్యము లగుచుండును. భారతఖండమునకు లంకాపురము నిరక్షదేశముగా గ్రహింపఁబడుటచే స్వనిరక్షదేశోదయము లనుటకుఁగాను లంకోదయము లని చెప్పఁబడుచున్నది. నిరక్షదేశమున మేషాదిరాశిత్రయమానము ౧౫ ఘటికలు. ఇవియే విలోమముగఁ గటకాదిరాశిత్రయమానము నగును. మేషాది షట్కమానమే తులాదిషట్కమాన మగును. కావున నందే రాశి షట్కమానమైనను గ్రమముగ ౩౦ ఘటికలగును. అచ్చట యామ్యోత్తరవృత్త మెల్లపుడు నుదయలగ్నమునకు ౧౫ ఘటికల యంతరమున నియతమై యుండును. అనఁగా నుదయలగ్నమునుండి మధ్యలగ్నమునకును మధ్యలగ్నమునుండి యస్తలగ్నమునకును, అస్తలగ్నమునుండి చతుర్థమునకును, జతుర్థమునుండి యుదయలగ్నమునకును సమముగా ౧౫ ఘటికల చొప్పున నంతర ముండును. తద్యామ్యోత్తరవృత్తమున లగ్నమై యుండు రాశ్యాదియు నుదయకాలమునుండి ౧౫ ఘటికలచే నాదేశమానముచే సాధింపఁదగియున్నది. ఈయామ్యోత్తరవృత్తము స్వదేశమునకును స్వనిరక్షదేశమునకును నొక్కటియే యగుటచే నందు లగ్నమైయుండు దశమచతుర్థలగ్నములు స్వదేశమునకును స్వనిరక్షదేశమునకును దుల్యములే యగుచున్నవి. సూర్యుని యామ్యోత్తరగమనముల ననుసరించి స్వదేశ స్వనిరక్షదేశములం దుదయాస్తమయకాలములందు వ్యత్యస్తములు కలుగుచుండునుగాని యర్ధరాత్ర మధ్యాహ్నములు మాత్రము రెండుదేశములం దేకకాలముననే కలుగును. కావున స్వదేశోదయాస్తమయసమయములనుండి యిష్టకాల పర్యంతము గడచిన ఘటికాదికముకాక మధ్యాహ్నార్ధరాత్రముల నుండి యిష్టకాల పర్యంతము గడచినకాలమగు నతోన్నత ఘటికాదియే మధ్యలగ్నానయనార్థము గ్రహింపఁబడుచున్నది. అట్లు గ్రహింపఁబడు స్వదేశనతోన్నత ఘటికాదియే స్వనిరక్ష దేశనతోన్నత ఘటికాదియు నగుచున్నది. ఈనతోన్నతములవలన లంకోదయములచే సాధింపఁగా స్వనిరక్ష (లంకా) దేశమునందు యామ్యోత్తరవృత్తమున లగ్నమై యుండు మధ్యలగ్నము తెలియుచున్నది. అదియే స్వదేశమునను మధ్యలగ్న మగుచున్నది. కావున రవినుండి లంకోదయాసువులచే నతోన్నతకాలమువలన మధ్యలగ్నము సాధింపఁదగి యున్నది. ఇదియుఁగాక, ఉదయాసువులు మధ్యాసువులు, అస్తాసువులు అని రాశిమానము త్రివిధము. అం దుదయాస్తాసుయోగార్ధము మధ్యాసువు లగుచున్నవి. అవియు లంకోదయాసుతుల్యములగుటచే మధ్యలగ్నానయనమున లంకోదయములు గ్రహింపఁదగియున్నవి.

ఉదాహరణమునందు నిష్టకాలము పూర్వకపాలమున నగుటచే పూర్వోన్నతఘటికలచే షడ్భయుక్తరవినుండి క్రమవిధమున మధ్యలగ్నము సాధింపఁదగియున్నది. సాయన రవిరాశ్యాది ౫-౨౬-౪౦, షడ్భయుక్తరవిరాశ్యాది ౧౧-౨౬-౪౦, ఉన్నతఘటికాది ౭-౪౨. సషడ్భసాయనరవియొక్క మీనలగ్నభోగ్యభాగాది ౩-౨౦. దీనినుండి కాలముఁ గనుఁగొనుటకై ఈ ౩-౨౦ ను మీనలగ్న నిరక్షమానమగు ౪-౩౮ చే హెచ్చించి ౩౦ చే భాగింపఁగా ౦-౩౦-౫౩ ఘటికాదియగును. దీనిని ఉన్నతకాలమగు ౭-౪౨ ఘటికాదినుండి తీసివేయ ౭-౧౧-౭ ఘటికాది శేషించును. ఇందుండి మేషలగ్న నిరక్షమానమగు ౪-౩౮ తీసివేయ ౨-౩౩-౭ ఘటికాది శేషించును. దీనినుండి వృషభలగ్నమానమగు ౪-౫౯ తీసివేయ వీలులేదు గావున సాయనమధ్యలగ్నము వృషభమునం దగును. దీనినుండి భాగాదిని సాధించుటకై ౨-౩౩-౭ ఘటికాదిని ౩౦ చే హెచ్చించి మీనలగ్నమానమగు ౪-౫౯ చే భాగింపఁగా లబ్ధము ౨౧-౨౨-౧౬ భాగాదియగును. కావున సాయనమధ్యలగ్నము ౧ ౨౧-౨౨-౧౬ రాశ్యాది యగును. దీనినుండి అయనాంశాది ౨౨-౩౯-౩౦ తీసివేయఁగా ౦-౨౮-౪౨-౪౬ రాశ్యాది నిరయనమధ్యలగ్న మగును.

ఉభయకపాలములందును విలోమముగ ఋణలగ్నమును సాధించువిధానము:—

శ్లో. పశ్చాదున్నతషడ్భయుక్తరవితః యత్ప్రాఙ్నతాదిత్యతః,
యద్వ్యస్తైశ్చ విలోమలగ్నమివ తన్మాధ్యం సషడ్భం సుఖం. ౧౨

పశ్చిమకపాలమున షడ్భయుక్తరవినుండి యున్నతఘటికలవలనను, బూర్వకపాలమున రవినుండి నతఘటికలవలనను నిరక్షోదయములచే విలోమలగ్నమును సాధించినవిధమున మధ్యలగ్నము సాధింపఁదగియున్నది. ఇం దారురాసులఁ గలుపఁ జతుర్థమగును.

ఉపపత్తి:—మధ్యాహ్నసమయమున సూర్యతుల్యమే మధ్యలగ్నమగును. మధ్యాహ్నమునకుఁ బూర్వము సూర్యుఁ డింకను యామ్యోత్తరవృత్తమునకు రాకుండుటచే సూర్యునికిఁ బశ్చిమమున నుండు రాశియే మధ్యలగ్న మగుచుండును. కావున నిష్టకాలమునుండి మధ్యాహ్నమువరకుఁ గడవవలసినకాలమును రవియందుఁ దీసివేయవలయును. ఇష్టకాలమునుండి మధ్యాహ్నమువరకుఁ గడవవలసినకాలము ప్రాక్కపాలనత మనఁబడుటచే నీనతకాలమువలన లంకోదయాసు

వులచే నగురాశ్యాదిని రవియందుఁ దీసివేయ మధ్యలగ్నమగును. ఇది విలోమముగ సాధింపఁబడు ఋణలగ్న మనుచున్నది. అర్ధరాత్రమున సూర్యతుల్యమే చతుర్థమగుటచే నం దారురాసులఁ గలుప దశమ మగును. అర్ధరాత్రమునకుఁ బూర్వము పశ్చిమకపాలమున నిష్టకాల మైనయెడల నర్ధరాత్రమున కెంతకాలము పూర్వముగా నిష్టకాల మగునో రవిరాశి కంతముందుగనే చతుర్థము నుద్భయుక్తరవి కంతముందుగా దశమమును నగుచుండును. కావున నిష్టకాలమునుండి యర్ధరాత్రమువరకుఁ బశ్చిమకపాలమునఁ గడవవలసిన యున్నతఘటికలచే లంకోదయమానమున నగు రాశ్యాదిని రవినుండి తీసివేయఁగాఁ జతుర్థమును, షడ్భయుక్తరవినుండి తీసివేయఁగా దశమమును నగును. ఇట్లు పశ్చిమోన్నతఘటికలవలన షడ్భయుక్తరవినుండి లంకోదయములచే విలోమముగ సాధించిన మధ్యలగ్నము ఋణలగ్న మనుచున్నది. ఏతద్విధమున ఋణలగ్నానయన ము:

శ్లో. తాత్కాలికోఽర్కోఽయనభాగయుక్త స్తద్భుక్తభాగై రుదయో హతశ్చ, ఖాగ్న్యాప్తమత్రాస్తం రవిభుక్తకాలం పలీకృతాత్పూర్వనతాద్విశోధ్య, తత్పృష్ఠతో రాశ్యుదయాంశ్చ శేష మశుద్ధహృత్త్రిఘ్నగుణం లవాద్యమ్, మేషాద్యశుద్ధర్క్షమితైర్వి శుద్ధం తతోఽయనాంశోన మృణాఖ్య లగ్నమ్.

తాత్కాలిక రవియం దయనాంశలఁ గలుపవలయును. ఆసాయనరవియొక్క భుక్తభాగలచేఁ దద్రాశియొక్క లంకోదయమానమును హెచ్చించి ౩౦ చే భాగింపఁగా సాయనరవియొక్క భుక్తకాల మగును. క్రమలగ్నమునందు వలె రవిభోగ్యకాలముఁ గాక, వ్యుత్క్రమలగ్నమునందువలె రవియొక్క భుక్తకాలముఁ దెలిసికొనవలయును. ఈరవిభుక్తకాలమును పలములఁ జేసి విఘటికారూపమున నున్న పూర్వనతకాలమునుండి గాని పశ్చిమోన్నతకాలమునుండిగాని తీసివేయవలయును. పిమ్మట నా రాశికి వెనుకనుండు రాసుల లంకోదయమానములచే నొకదానిపిమ్మట నొకదానిని వీలగునంతవరకు శోధింపవలయును. శేషించినపలములను ముప్పదిచే హెచ్చించి యవి శుద్ధోదయలంకామానముచే భాగింపఁగా నారాశియం దేష్యభాగ లగును. దీనిని మేషాదిగ నవిశుద్ధమగురాశి యందుఁ దీసివేయఁగా సాయనమధ్య లగ్న మగును. ఇం దయనాంశలఁ దీసివేయ ఋణాఖ్యమగు విలోమమధ్యలగ్నమగును. ఇట్లే పశ్చిమోన్నతములచే షడ్భయుక్తరవినుండి విలోమమధ్యలగ్నము సాధింపఁ దగియున్నది.

పూర్వోదాహరణమునం దిష్టకాలము పూర్వకపాలమున నగుటచే నతఘటికలచే రవినుండి విలోమమధ్యలగ్నము సాధింపఁదగియున్నది. నతఘటికాది ౨౧-౧౮ సాయనరవిరాశ్యాది ౫ ౨౬-౪౦ ఈరవిభుక్తభాగాదియగు ౨౬-౪౦ ని కన్యాలగ్ననిరక్షమాన మగు ౪-౩౮ చే హెచ్చించి ౩౦ చే భాగింపఁగా ౪-౭ ఘటికాది రవియొక్క కన్యాలగ్నభుక్తకాల మగును. దీనిని నతఘటికాదియగు ౨౧-౧౮ నుండి తీసివేయ ౧౭-౧౧ శేషించును. దీనినుండి సింహలగ్నమానమగు ౪-౫౯ తీసివేయ ౧౨-౧౨ అగును. ఇందుండి కర్కటకమానమగు ౫-౨౩ తీసివేయ ౬-౪౯ అగును. ఇందుండి మిథునలగ్నమానమగు ౫-౨౩ తీసివేయ ౧-౨౬ శేషముమిగులును. దీనినుండి వృషభలగ్నమానము ౪-౫౯ తీసివేయ వీలుకాకుండుటచే వృషభము సాయనమధ్యలగ్న మగును. ఇందు భోగ్యభాగాదిని దెలిసికొనుటకై ౧-౨౬ ఘటికాదిని ౩౦ చే హెచ్చించి వృషభలగ్నమానము ౪-౫౯ చే భాగింపఁగా ౮-౩౭-౪౩ భాగాది యగును. దీనిని ౩౦ భాగలనుండి తీసివేయఁగా వృషభమున ౨౧-౨౨-౧౭ భోగ్యభాగాది యగును. లేదా ఈభోగ్యభాగాదియగు ౮-౩౭-౪౩ ను మేషాదిగ నశుద్ధరాశియగు ౨ లో నుండి తీసివేసినను, ౧-౨౧-౨౨-౧౭ రాశ్యాది సాయనమధ్యలగ్నమగును. ఇందుండి అయనాంశాది ౨౨-౩౯-౩౦ ని తీసివేయఁగా ౦-౨౮-౪౨-౪౭ రాశ్యాది నిరయనమధ్యలగ్నమగును.

దామోదరాది పద్ధత్యుక్తమధ్యలగ్నానయన విధానదూషణము:

శ్లో. యదస్తలగ్నా ద్రవివద్దినార్ధం తన్నాడికాభి ర్భవతీతి మాధ్యమ్, దామోదరేణోక్త మసన్నిరస్తై ర్నతోన్నతై స్తద్ధి యతః ప్రసాధ్యమ్. ౧౩

ఇష్టకాలఘటికలచే రవినుండి క్రమలగ్నమును సాధించిన విధమున నస్తలగ్నమునుండి దినార్ధఘటికలవలన లంకోదయాసువులచేఁ గ్రమలగ్నమును సాధింపఁగా మధ్యలగ్న మగును. ఇం దారురాసులఁ గలుపఁ జతుర్థమగును. ఇట్లే యుదయలగ్నమునుండి రాత్ర్యర్ధఘటికలవలన లంకోదయాసువులచే సాధించిన క్రమలగ్నము చతుర్థమగును గాన నతోన్నతకాలసాధన మగత్యము లేకయే మధ్యలగ్నముసాధింపఁ దగియున్నదని దామోదరునిచేఁ జెప్పఁబడినది. దామోదర వాక్యము:

శ్లో. అథాస్తలగ్నా ద్రవివ ద్దినార్ధం తన్నాడికాభిస్తత ఏవ లగ్నమ్, లంకోదయై స్తద్దశమాహ్వయం స్యా ల్లగ్నాత్తథారాత్రి దళోత్థ మంబు.

ఈవాక్యములందలియుక్తి యేమన, సూర్యాస్తమయ సమయమున సూర్యతుల్య మస్తలగ్నము. అచ్చటనుండి దశమ లగ్నము యామ్యోత్తరవృత్తమునందు లంకోదయములచేఁ గించిన్న్యూనాధికముగ ద్రిరాత్ర్యంతరమున నుండును. తత్సూర్యమధ్య లగ్నాంతరము తద్దినార్ధఘటికా ప్రమాణమున నుండును గావున సూర్యతుల్యాస్తలగ్నము నుండి దినార్ధఘటికల వలన లంకోదయాసువులచే సాధించిన క్రమలగ్నము దశమ మగును. సూర్యాస్తమయ సమయమున సూర్యతుల్యాస్తలగ్నమునుండి సాధించునట్లె యిష్టకాలముననుదదస్తలగ్నమునుండి దినార్ధఘటికలవలన లంకోదయాసువులచే సాధింపఁగా మధ్యలగ్నమగును. సూర్యోదయసమయమున సూర్యతుల్యమే

యుదయలగ్నమగును. రాత్ర్యర్ధప్రమాణఘటికలవలన లంకోదయములచే యామ్యోత్తరవృత్తాధోభాగమునఁ జతుర్థము సాధింపఁబడుచున్నది. ఇట్లే యిష్టకాలలగ్నమునుండి రాత్ర్యర్ధఘటికలచే సాధించిన క్రమలగ్నము చతుర్థమగును. ఇందాఱురాసులం గలుప దశమమగును. ఇట్లే వివాహబృందావనమునఁ గేశవార్కునిచేతను:—

శ్లో. కృత్వా లగ్నా దర్క వద్రాత్రిఖండం భూయో ష్యత్త్రి
స్తద్ఘటీభిశ్చ లగ్నమ్; చక్రార్ధోనే తేచ తత్కాల మేనం
జాయేయాతా మస్త మధ్యాహ్నలగ్నే.

అని చెప్పఁబడినది.

ఏతద్దామోదరాద్యుక్తవిధాన మెంతయు నయుక్తికము. ఏకపాలమునందైనను నతోన్నతములు రెండును గలసి ౩౦ ఘటికలగును. అనఁగా నర్ధరాత్రమునుండి మధ్యాహ్నమువరకైనను, మధ్యాహ్నమునుండి యర్ధరాత్రమువరకైనను ౩౦ ఘటికలకాలమగును. నిరక్షదేశమునందుమాత్రము క్రమముగనే యాఱురాసుల మానములైనను గలసిన ౩౦ ఘటికలగును గావున నచ్చట మధ్యాహ్నమధ్యరాత్రాంతరము లేక మధ్యలగ్నచతుర్థలగ్నాంతరము నగు ౩౦ ఘటికలవలన లంకోదయాసువులచే నాఱురాసులగును గాని స్వోదయాసువులచే నెల్లపుడు నాఱురాసులు కాఁజాలవు.

కావున షడ్రాశ్యంతరములగు నీమధ్య లగ్నాధోలగ్నముల సాధనార్థము మధ్యాహ్నాంశుమదంతరమగు నతకాలమైనను, రవినిశామధ్యాంతరమగు నున్నతకాలమైనను గ్రహించి దానివలనఁ దాత్కాలికరవినుండియే లంకోదయములచే సాధింపవలయునని చెప్పఁబడినది. తాత్కాలిక రవియును దాత్కాలికనతోన్నత ఘటికలును స్వదేశమునందును స్వనిరక్షదేశమునందును దుల్యములే యగుటచే స్వనిరక్షదేశమునకు సాధింపఁబడిన మధ్యలగ్నము స్వదేశమునకుఁ దుల్యమే యగుచున్నది. సూర్యోదయసమయమున నిష్టకాలమైనయెడల సూర్యతుల్యమగు నుదయలగ్నమునుండి తాత్కాలిక నతఘటికాతుల్యమగు దినార్ధముచే మధ్యలగ్నమును, నున్నతఘటికాతుల్యమగు రాత్ర్యర్ధముచేఁ జతుర్థమును లంకోదయములచే సాధింపఁదగి యున్నవి. ఇట్లే సూర్యాస్తమయసమయమునను నిష్టకాలమైనయెడల సూర్యతుల్యాస్తలగ్నమునుండి తాత్కాలిక నతఘటికాతుల్యమగు దినార్ధముచే మధ్యలగ్నమును నున్నతఘటికాతుల్యమగు రాత్ర్యర్ధముచేఁ జతుర్థమును లంకోదయములచే సాధింపఁదగి యున్నవి. ఇట్లు సూర్యోదయ సూర్యాస్తమయసమయములందు మాత్రమే దినార్ధ రాత్ర్యర్ధములు తాత్కాలికనతోన్నత ఘటికలకుఁ దుల్యములగును గాని తదితర సమయములందుఁ గాఁజాలవు. కావున సూర్యోదయాస్తమయ సమయములందుఁ గాని తదితర సమయములందు నస్తలగ్నమునుండి దినార్ధఘటికలచే మధ్యమును నుదయ లగ్నము నుండి రాత్ర్యర్ధఘటికలచేఁ జతుర్థమును సాధింపఁదగవు. ఏల యనఁ దాత్కాలికరవినుండి యిష్టకాలమువలన స్వోదయములచే నుదయలగ్నమును సాధించితిమి. ఈయుదయలగ్నమునుండియే కదా రాత్ర్యర్ధమువలన లంకోదయములచే రసాతలమును సాధింపవలయునసుట! రవినుండి యిష్టకాలమును రాత్ర్యర్ధమునఁ గలిపిన నున్నతఘటికలగును గాని యందు రవినుండి యిష్టకాలమువరకు స్వదేశోదయములచేత నుదయలగ్నమును, నుదయలగ్నమునుండి రాత్ర్యర్ధమువలన నిరక్షోదయములచేఁ జతుర్థమును సాధింపఁగా నది రవినుండి యర్ధరాత్రమువరకు నగుసర్వోన్నతఘటికలవలన నిరక్షోదయములచే సాధింపఁబడు మధ్యలగ్నమునకుఁ దుల్యము కానేరదు. సూర్యోదయమునుండి యిష్టకాలఘటికలవలన స్వోదయములచే సాధించినరాసులయొక్క స్వోదయనిరక్షోదయమానాంతరమునకుఁ దుల్యమగు భాగాదికము భేదము కల్గుచున్నది. ఇట్లే యస్తలగ్నమునుండి దినార్ధఘటికలచే మాధ్యమును నసంభవమగుచున్నది. కావున దామోదరాద్యుక్త విధానమునకు దూషణము కల్గుచున్నది. సర్వకాలమునను రవినుండియే నతోన్నత ఘటికలవలన నీమధ్యలగ్న చతుర్థలగ్నములు సాధింపఁదగియున్నవనుట యుక్తియుక్తము.

అవశిష్టకేంద్రేతరభావసాధనము పరాశరహోరయందు:—

శ్లో. లగ్నం సుఖాత్ సుఖం కామాత్ కామం ఖాత్ ఖంచ లగ్నతః,
త్ర్యంశ మేకద్విగుణితం యు జ్యాల్లగ్నాదిషు క్రమాత్. ౧౪

ఇంతవరకు లగ్నచతుర్థాంతరము సప్తమదశమాంతరమునకును, జతుర్థసప్తమాంతరము దశమవిలగ్నాంతరమునకును సమానములగును. ఇట్లు భచక్రమంతయు నాల్గువిభాగములైనది. ఇందుఁ బ్రతిభాగమును మూఁడేసి సమవిభాగములఁ జేసినయెడల నాల్గుభాగములందును గలసి పండ్రెండుభావములు సిద్ధించును. అందులకై లగ్నమును జతుర్థమునుండియు, జతుర్థమును సప్తమమునుండియు, సప్తమమును దశమమునుండియు, దశమమును లగ్నమునుండియుఁ దీసివేయవలయును. లగ్నచతుర్థాంతరములోని మూఁడవవంతును, లగ్నమునందుఁ గలుప ద్వితీయమగును. మరల నాత్ర్యంశమును ద్వితీయమునఁ గలుపఁ దృతీయమగును. జతుర్థమిదివరకే సాధింపఁబడియుండుటచేఁ దృతీయమున మరల నీత్ర్యంశమును గలుపఁబనిలేదు. ఇట్లు చేయుటకుఁగాను లగ్నచతుర్థాంతరములోని త్ర్యంశమును ౧ చేతను, ౨ చేతను హెచ్చించి లగ్నమునందుఁ గలుప ద్వితీయతృతీయభావము లగును. ఇట్లే చతుర్థసప్తమాంతరత్ర్యంశమును ౧ చేతను ౨ చేతను హెచ్చించి చతుర్థమునందును, సప్తమ దశమాంతరత్ర్యంశమును ౧ చేతను ౨ చేతను హెచ్చించి సప్తమమును, దశమవిలగ్నాంతరత్ర్యంశమును ౧ చేతను ౨ చేతను హెచ్చించి దశమమునను గలుపఁగా లగ్నాదిద్వాదశభావములగును.

ఇదియే కేశవాచార్యులచేతను:

శ్లో. త్ర్యంశో వ్యస్తఖభస్య భూ(౧) యమ(౨)హతో యోజ్యస్తనో
ద్వ్యచ్యుతో బంధా తేపిచ సాంగభా స్తనుముఖాః.

దశమమునుండి సప్తమముఁ దీసివేసి యందలి మూఁడవవంతును ౧ చేతను ౨ చేతను హెచ్చించి లగ్నమునఁ గలుపవలయును. ఈదశమ సప్తమాంతరత్ర్యంశమును ౨ రాసులనుండి తీసివేసి ౧ చేతను ౨ చేతను హెచ్చించి చతుర్థమునఁ గలుపవలయును. ఇట్లు లగ్నాది భావషట్క మగును. వీనియం దారేసిరాసులఁ గలుపఁగాఁ దదితర భావషట్కము నగును. లగ్నచతుర్థాంతరము సప్తమదశమాంతరము నకుఁ దుల్యమగుటచేఁ జతుర్థమునుండి లగ్నముఁ దీసివేయవలయునను టకుఁగాను దశమమునుండి సప్తమముఁ దీసివేయవచ్చు నని చెప్పఁబడినది. ఈయంతరత్ర్యంశమును ౧ చేతను ౨ చేతను హెచ్చించి లగ్నమునఁ గలుపఁ ద్వితీయ తృతీయభావము లగును. లగ్నసప్తముల యంతర మారురాసులు. ఆరురాసుల ప్రమాణమగు లగ్నసప్తమాంతరమునుండి లగ్నచతుర్థాంతరముఁ దీసివేసినఁ జతుర్థ సప్తమాంతర మగును. కావున నీలగ్నసప్తమాంతరమగు నారురాసులలోఁ ద్ర్యంశమగు రెండురాసులనుండి లగ్నచతుర్థాంతరత్ర్యంశముఁ దీసివేసినఁ జతుర్థసప్తమాంతరత్ర్యంశ మగుచున్నది. లగ్నచతుర్థాంతర త్ర్యంశ తుల్యంబగు సప్తమదశమాంతర త్ర్యంశమును రెండురాసుల నుండి తీసి(వేయఁగా నగు చతుర్థసప్తమాంతరత్ర్యంశమును)౧ చేతను ౨ చేతను హెచ్చించి చతుర్థమునఁ గలుపఁగాఁ బంచమ షష్ఠ భావములగుచున్నవి. ఇట్లు లగ్నాది షష్ఠ పర్యంత భావ చక్రార్థ మారుభాగము లైనది. ఈభావములం దారేసిరాసులఁ గలుపఁగా భావచక్రద్వితీయార్థమును నారువిభాగము లగును. లగ్నాదిద్వాదశ భావములును నిట్లు సిద్ధించుచున్నవి.

| | |
|---|---|
| ౬-౨౮-౪౨-౪౬ చతుర్థము | ౯-౨౯- ౬-౩౬ సప్తమము |
| ౩-౨౯- ౬-౩౬ లగ్నము | ౬-౨౮-౪౨-౪౬ చతుర్థము |
| ౩)౨-౨౯-౩౬-౧౦ అంతరము ౩ | ౩)౦-౨౩-౫౦ అంతరము |
| ౦-౨౯-౫౨- ౩ అంతర, త్ర్యంశము | ౧- ౦- ౭-౫౭ అంతర, త్ర్యంశము |
| ౩-౨౯- ౬-౩౬ లగ్నము | ౯-౨౯- ౬-౩౬ సప్తమము |
| ౦-౨౯-౫౨- ౩ | |
| ౪-౨౮-౫౮-౩౯ ద్వితీయము | ౧౦-౨౮-౫౮-౩౯ అష్టమము |
| ౦-౨౯-౫౨- ౩ | |
| ౫-౨౮-౫౦-౪౨ తృతీయము | ౧౧-౨౮-౫౦-౪౨ నవమము |
| ౦-౨౯-౫౨- ౩ | |
| ౬-౨౮-౪౨-౪౬ చతుర్థము | ౦-౨౮-౪౨-౪౬ దశమము |
| ౧- ౦- ౭-౫౭ | |
| ౭-౨౮-౫౦-౪౩ పంచమము | ౧-౨౮-౫౦-౪౩ ఏకాదశము |
| ౧- ౦- ౭-౫౭ | |
| ౮-౨౮-౫౮-౪౦ షష్ఠము | ౨-౨౮-౫౮-౪౦ ద్వాదశము |
| ౧- ౦- ౭-౫౬ | |
| ౯-౨౯- ౬-౩౬ సప్తమము | ౩-౨౯- ౬-౩౬ లగ్నము |

ఇఁక భావసంధిసాధనము పరాశరహోరయందు:—

శ్లో. పూర్వాపరయుతే రర్ధం సంధి స్స్యాద్భావయో ర్ద్వయోః,
ఏవం ద్వాదశభావాశ్చ భవంతిహి ససంధయః. ౧౫

పూర్వాపరభావయోగార్ధము సంధియగును. అనఁగా ముందు భావమును వెనుకభావమును గలిపి యర్ధించిన నా రెండుభావముల కును మధ్యనుండు సంధి యగును. ఇట్లగు సంధి పూర్వభావమున కంత్యసంధియుఁ,బరభావమున కాదిసంధియు ననఁబడును. లగ్నభావమును, ద్వితీయభావమును గలిపి యర్ధింపఁగా నగుసంధి లగ్నభావమున కంత్యసంధియు, ద్వితీయభావమున కాదిసంధియు నగును. ఇట్లే ద్వితీయ తృతీయ భావములమధ్య నుండుసంధి ద్వితీయభావమున కంత్యసంధియుఁ దృతీయభావమున కాదిసంధియునగును. ఇట్లే తదితరసంధులును నగును. అనఁగా నీసంధులతోఁ బూర్వభావము లంతమయి పరభావము లారంభ మగును. ఇట్లు లగ్న చతుర్థసప్తమ దశమములు మాత్ర మొక్కొక్కటి ముప్పదిభాగల ప్రమాణముగలవి యయి తదితరభావములు ముప్పదిభాగలకంటె కించిన్న్యూనాధిక ములుగ నుండును. ఇట్లు ద్వాదశభావములు సంధి సంయుతములుగా సాధింపఁదగియున్నవి.

గ్రహముల తాత్కాలికమిత్రత్వాది నిర్ణయార్థము గ్రహముల నుండియు భావముల సాధింపవలయునని కొందరనుచున్నారు. ప్రామాణికములగు శ్రీనీలకంఠ శ్రీపతి శ్రీధరాద్యాచార్యులచే నది యనుక్తమగుటచే నయుక్తమని గుర్తెరుంగునది. అట్లు గ్రహభావ సాధనమే యభిహిత మగునెడల దృక్సాధనాదివిషయమందు స్థాన నియమము నిర్దేశింపఁబడియుండదు. కావున గ్రహములనుండి భావముల సాధించుట యయుక్తికము. భావఫలనిర్ణయార్థముమాత్ర మీ భావసాధన చేయఁదగియున్నదిగాని యాధిపత్యనైసర్గికతాత్కాలిక మిత్రశత్రుత్వాదులందును, అనఫాసునఫాది యోగములందును, సూర్యచంద్రకేంద్రాది నిర్ణయములందును వ్యావహారిక మేష వృషాది రాశిక్రమవిభాగమే గ్రహింపఁదగియున్నది.

| | |
|---|---|
| ౩-౨౯- ౬-౩౬ లగ్నము | ౬-౨౮-౪౨-౪౬ చతుర్థము |
| ౦-౧౪-౫౬- ౨ | ౦-౧౫- ౩-౫౮ |
| ౪-౧౪- ౨-౩౮ సంధి | ౭-౧౩-౪౬-౪౪ సంధి |
| ౦-౧౪-౫౬- ౧ | ౦-౧౫- ౩-౫౯ |
| ౪-౨౮-౫౮-౩౯ ద్వితీయము | ౭-౨౮-౫౦-౪౩ పంచమము |
| ౦-౧౪-౫౬- ౨ | ౦-౧౫- ౩-౫౮ |
| ౫-౧౩-౫౪-౪౧ సంధి | ౮-౧౩-౫౪-౪౧ సంధి |
| ౦-౧౪-౫౬- ౧ | ౦-౧౫- ౩-౫౮ |
| ౫-౨౮-౫౦-౪౨ తృతీయము | ౮-౨౮-౫౮-౪౦ షష్ఠము |
| ౦-౧౪-౫౬- ౨ | ౦-౧౫- ౩-౫౮ |
| ౬-౧౩-౪౬-౪౪ సంధి | ౯-౧౪- ౨-౩౮ సంధి |

౦-౧౪-౫౬-౨ / ౬-౨౮-౪౨-౪౭ చతుర్థము

౦-౧౫-౩-౫౮ / ౯-౨౯-౬-౩౬ సప్తమము




ఈభావములకును సంధులకును నాకేసిరాసులఁ గలుపఁగా భావచక్రద్వితీయార్ధమును సిద్ధించును.

భావసాధనానంతరము, సంధిసమీపమున నున్న గ్రహమే భావఫల మొసంగునదియు శ్రీపత్యాచార్యులచే :—

శ్లో. ఆరంభసంధే ర్ద్యుచరో యదోనః ఫలం దదా త్యాదిమ భావ జాతమ్; విరామసంధే రధిక స్తదానీ మాగామిభావోత్థ ఫలప్రద స్స్యాత్. ౧౬

గ్రహమే భావమునకైన నారంభసంధికంటె నల్పముగ నున్న యెడలఁ దత్పూర్వభావఫలము నిచ్చును. ఒకభావముయొక్క ఆరంభ సంధికంటె న్యూనమగు రాశ్యాదియం దుండినయెడలఁ దత్పూర్వ భావమునందే యున్నదగును గావున నాపూర్వభావఫలము నొసఁగును. భావముయొక్క విరామసంధికంటె నధికముగ నున్నయెడల ననంతరభావమునందే యున్నదగును గావున నాగామి భావఫలమునే యొసఁగును. అనఁగా నారంభసంధి నతిక్రమించి విరామసంధికి లోపుగనున్న గ్రహమే యాభావఫలము నిచ్చునని తాత్పర్యము. ఇట్లు ప్రతిభావముయొక్కయు నాద్యంతములఁ దెలిసికొనవలయును.

భావస్థగ్రహఫలముయొక్క ఉపచయాపచయక్రమము:

శ్లో. భావప్రవృత్తౌహి ఫలప్రవృత్తిః పూర్ణంఫలం భావసమాంశకేషు, హ్రాసః క్రమా ద్భావవిరామకాలే ఫలస్య నాశః కథితో మునీంద్రైః. ౧౩

గ్రహము భావారంభమున నున్నపుడు తద్భావోక్త ఫల మారంభమగును. అచ్చటనుండి యధికమైనకొలఁది క్రమక్రమమున ఫల మధికమగుచు, భావ (మధ్య) తుల్యాంశాదియందు ఫలము సంపూర్ణ మగును. పిమ్మట ఫలము క్రమక్రమముగ హ్రాస మగుచు భావాంత్యసంధియందు ఫలము శూన్యమగును. ఇట్లు భావస్థగ్రహ మొసఁగుఫల మూహింపఁదగియున్నది. భావా రోహణమునందు ఫలము క్రమక్రమముగ నధికమగుచు భావ తుల్యముగా నున్నపుడు సంపూర్ణ మగును. భావమధ్యము నతి క్రమించి యవరోహణమున నున్నపుడు ఫలముక్రమక్రమముగఁ దగ్గుచు భావాంతరసంధి తుల్యమైనపుడు ఫలము శూన్య మగును. కావుననే 'భావారోహణఖేచరాశ్శుభకరాః" ఆరోహణమున నున్న గ్రహములు శుభకరము లనియు, నవరోహణమున నశుభ కరము లనియుఁ జెప్పఁబడుచున్నవి.

భావస్థగ్రహ ఫల పరిమాణనిర్ణయము శ్రీ కేశవాచార్యులచే: —

శ్లో. శూన్యం సంధిషు భావగేఽఖిలఫలం స్యా ద్భావసంధ్యంతకే ణాప్తం సంధిఖగాంతరం త్వయచయం భావాధికేఽల్పేఖగే.

గ్రహముసంధులయందున్నపుడు ఫలము శూన్యము. భావమున సంపూర్ణఫలము. సంధిభావాంతరస్థ గ్రహఫల నిర్ణయార్థ మను పాతము విధింపఁబడుచున్నది. ఆరంభసంధినుండి భావ తుల్యాంశమువరకును నగుభాగాదిచే రూపబల ముపచయ మగును గావున నారంభసంధినుండి యారోహమున గ్రహమందు భాగాదివరకు నగునంతరముచే నెంతబల ముపచయమగు ననునుపాతమున గ్రహ సంధ్యంతరమును భావసంధ్యంతరముచే భాగింపవలయును. ఇది యా రోహఫలనిర్ణయము. గ్రహము భావతుల్యమైనపుడు, గ్రహసంధ్యం తరము భావసంధ్యంతరతుల్యమే యగుటచే ఫలము రూపము (౧) అగును. ఇఁక నవరోహఫల మెట్లన, గ్రహ మంత్యసంధియందున్న ఫలము శూన్యము. భావతుల్యమైనపుడు ఫలము పూర్ణము. భావ సంధ్యంతరస్థ గ్రహఫలనిర్ణయార్థము, ఫల మెప్పుడును శూన్యస్థానము నుండి సాధింపఁదగిన దగుటచే, విరామసంధికిని గ్రహమునకును గల యంతరమును విరామసంధికిని భావమునకును గలయంతరముచే భాగింపవలయును. ఇట్లు చేయఁగా గ్రహఫలము లబ్ధమగును. భావా రంభసంధికిని భావమునకును గలయంతరమునకుఁ దుల్యముకానేరదు గావున నారోహావరోహములం దిట్లు భిన్నానుపాతము లగత్యము లగుచున్నవి.

ఉదాహరణమునందు రవిరాశ్యాది ౫-౪. ఈగ్రహము ౪-౧౪-౨-౩౮ మొదలు ౫-౧౩-౫౪-౪౧ వరకు నున్న ద్వితీయభావమునం



హరిజనోద్యమ ప్రచారమున
మహాత్ముడు అజదుమైదానమున మైక్రోఫోనులో నుపన్యసించుట



పదునొకండవ కమ్మమహాజనసభ (అధ్యక్షులు చల్లపల్లి రాజాగారి యుపన్యాసము)



ప్రథమ కమ్మ మహిళా మహాసభ
(అధ్యక్షురాలు, ఆహ్వానసంఘసభ్యురాండ్రు)



హుస్సేనుసాగరము చుట్టు (ఆరుమైళ్లు) ఈద యత్నించిన హైదరాబాదు కన్యా
గురుకుల విద్యార్థినులు. పతకముల కోటుగల బాలిక నెగ్గినది.



చేతులకు సంకెలలతో ఇరువదినాలుగుగంటలసేపు కార్నువాలిసు తటాకమున ఈది కలకత్తా మేయరు అభినందనములనందిన గజ ఈతగాడు పి. కె. ఘోషు



యం. అనంతశయనం అయ్యంగారు, యం. యల్. ఏ.



తుషారకాంతి ఘోషుగారు అమృతబజారుపత్రికా సంపాదకులు



డా. భగవాన్ దాసుగారు, యం. యల్. ఏ.



మంగళగిరిలో గోహత్యమమాన్పుటకు ప్రాయోపవేశనమునకు సిద్ధపడిన పండిత శర్మ

# ఇటు చూడుడు!

ఇతరులతో సంప్రదించి కాలము, కాయకష్టము, ధనము యేల వృధాపరచుకొనెదరు? మీయంతట మీరే సర్వజ్ఞులై యుండుటకు గాను మా **అద్భుతమైన అద్దమును** దగ్గర నుంచుకొనుడు. ఆధ్యాత్మిక శక్తుల నన్నిటిని కేంద్రీకరింపజేసి కైలాసములోని వన మూలికలచే యీ అద్దము తయారు చేయబడినది. అది ఒక మంచి అందమైన పెట్టెలో అమర్చబడినది. ఈ అద్దమువలన కలుగు ప్రయోజనములు చూచినచో నిజముగా మీరు అత్యాశ్చర్యనిమగ్నులగుదురు. స్త్రీ పురుషు లెవరయినను సరే జాతి మత విచక్షణ లేక, వయోతారతమ్యము లేక, సులభముగా వారియొక్కయు, యితరుల యొక్కయు, జ్యోతిష్కుని సహాయ మక్కర లేకయే భూత భవిష్య ద్వర్తమానములను తెలిసికొనవచ్చును. తృప్తిగా లేనిచో పోస్టేజి, ప్యాకింగు ఖర్చులు మినహాయించి మిగతాసొమ్ము వాపసు చేయబడును. వెల రు. 3-0-0. మాత్రమే. (5 షిల్లింగులు-లేక అమెరికాలో 1.00)సొమ్ము ముందుగా పంపవలెను. ప్యాకింగు, పోస్టేజికలిసి యిండియాలో అ. 0-8-0.

జాబులను యింగ్లీషులో వ్రాయవలెను.

*The Manager:—*

**Spiritual Bureau**

**Bhaghur Road, (108)**

DEVLALI, Bombay Presidency.

## శుద్ధ స్వదేశీ వస్త్రములు

భారతదేశమునందే భారతీయులచే స్థాపింపబడిన యంత్రసహాయమున తయారు చేయబడిన పాప్లిన్ షర్టింగ్, ఇతర పలురకముల షర్టింగులు, కోటుగుడ్డలు, చీరెలు, అంగవస్త్రములు, ధోవతులు, లాంగ్ క్లాత్, ట్విల్, బెడ్ షీట్లు, జాకెట్టురకములు వగైరా స్వదేశీ జవళీరకము లన్నియు సిద్ధముగా నున్నవి. మా మాలు ఖాతాదారు లందరికి చాలతృప్తి గలిగినది. గాన ఇతరులకు తప్పక తృప్తి కలుగుననియే మా దృఢనమ్మకము.

ఒకసారి వాడి చూచినచో మా వస్త్రముల నాణ్యదనము తెలియును.

**కృష్ణా అండ్ కంపెనీ,**

**242-244, చైనాబజారురోడు, మదరాసు.**

POLICY UNIQUE ASSURANCE

HAVE A GRIP ON YOUR FUTURE BY INSURING YOUR LIFE WITH

**UNIQUE ASSURANCE Co. Ltd.**

FOUNDED BY DESHABANDHU C. R. DAS.

ESTD.— 1912.

APPLY FOR — ATTRACTIVE POLICY CONDITIONS AND DECENT AGENCY TERMS.

— MADRAS BRACH —

17. ARMENIAN ST. PHONE 4066

HEADOFFICE- CALCUTTA

మీ భవిష్యత్తును గురించి దిట్టపరచు కొనుటకు

## యూనిక్ అస్యూరెన్సు కంపెనీలో భీమా చేయుడు

ఈ కంపెనీ స్థాపించినది

**దేశబంధు సి. ఆర్. దాస్**

స్థాపితము : 1912

పాలసీ షరతులకును ఏజన్సీ నిబంధనలకును వ్రాసి కనుగొనుడు.

మద్రాసు బ్రాంచి:

17 ఆర్మేనియన్ వీధి, ఫోను 4066.

హెడ్ ఆఫీసు:

కలకత్తా

దున్నది. భావమధ్యమము ౪-౨౮-౫౮-౩౯ ఇదియవరోహమున నుండుటచే నీద్వితీయభావాంత్యసంధికిని గ్రహమునకును నంతరమగు ౧౦ భాగలను భావసంధ్యంతరమగు ౧౫ చే భాగింపఁగా ౧౧/౧౫ లేక ౩/౪ లేక ౪౫ విరూపములు రవియొసంగు ద్వితీయభావ ఫలమగు చున్నది.

శ్లో॥ జన్మప్రశ్న వివాహ చౌల వ్రత ధాత్రీపాభిషేకాదిషు,
యాత్రాద్యేష్వపి చైవ మేవ విహితం భావాశ్రితానాం ఫలమ్.

జన్మప్రశ్నసమయములందును వివాహచౌలోపనయన రాజాభిషేకయాత్రాది సర్వకార్యములందును నిట్లు భావసాధనఁజేసి, తత్తద్భావస్థితగ్రహఫలము నూహింపవలసియున్నది.

శ్లో॥ పూర్వప్రణీతగ్రంథోక్తభావసాధనపద్ధతిః;
స్ఫుటీకృతేత్థం శ్రీరామసుబ్రహ్మణ్యేన సన్ముదే.

---

## అంగభంగిమము




—శ్రీపాద దుర్గారావు

మాకచింత్యమైన మాలోకమియ్యది - తెలిసికొనుఁడు సుంత తెలివియున్న
చిక్కు లున్నవన్న సిగ్గు విసర్జించి - వచ్చిచూడ మీకు నచ్చెరువగు.

సూర్యుఁడు లేఁడు చంద్రుఁడును శూన్యుఁడు చుక్కలు కానరావు, ఆ
శ్చర్యముఁగొల్పి యెల్లెడఁ బ్రశాంతతమఃప్రణయమ్ము వ్రేలు, సౌం
దర్యపిపాసయున్న కవితల్లజులే గ్రహియించువారు మా
ధుర్యముఁ గ్రోలువారు; నుతితోఁ బనియేటికి వచ్చిచూడుఁడీ.

ఆకాశమధ్యంబు లైనపూఁదోఁటల యందు రాజిల్లు హర్మ్యములు గలవు
అవరోధమే లేక యందఱనోదార్చి యొకటిగాఁజేయు దీర్ఘికలు గలవు
చవిజూచినంత మృత్యువు నైన వెఱపించు పరిపాటిగల మంచి పండ్లుగలవు
వలపించి వలఁచు నేర్పలరించుకొని చేయివైచినఁ గందుపుష్పములుగలవు
సరసగంభీరమధుర నిస్వనముతోడ - గిరులఁ గరగింపఁజాలు నిర్ఝరులుగలవు
ఇతరము వచింపలేదను వెత వహింప - వలదు మాలోకమందు సర్వమును గలదు.

కొనవచ్చు విపణివీథిని బ్రోవువెట్టిన చంచలశృతికటాక్షాంచలములు
వినవచ్చు నప్సరో విపఞ్చీగతోద్రేక తారకమధుర సుగానలహరి
కనవచ్చుఁ దప్తకాంచనరూప వరవర్ణినీమనోహరముఖ నీరజములు
తినవచ్చు మధుపూరిత నవీనపాచక పచితసమ్మోహన భక్ష్యకములు
పశ్చిమదిశాముఖంబునఁ బరిఘవిల్లు - నొక్క విద్యున్మహాదీప మోపికమెయి
సాయమును జేసికొన్నచోఁ జాలుమీకుఁ - దడవనేటికి సాధనేతరముకొఱకు.

సత్వరజస్తమోగుణ విచారణమక్కఱలేదు, లేదు జ్యే
ష్ఠత్వకనిష్ఠతాంతరము జాతిమతంబులు గానరావు మి
త్రత్వవిరోధభావముల లక్ష్యము లేదు యశంబుగోరు దీ
నత్వము సున్న స్త్రీపురుషనామవిభేదమె శూన్య మిచ్చటన్.

విధిపూర్వకవివాహవిశద సూత్రమ్ముల మంత్రములందును మమత లేదు
తరువాతఁ బ్రేమ సంకరమైనయప్పుడు విడిపోవు టెట్లను భీతి లేదు
ఇచ్ఛానుగుణముగా నింతులందఱఁగూడి సంచరించుటయందు జంకు లేదు
జీవనాధార మాశించి యేవృత్తినో చేపట్టవలెనను చింత లేదు
వ్రీడ యిసుమంత లేదు సేవింపఁదగిన - దైవమే లేఁడు సంతోషధామమైన
భావకల్లోలమాలికా ప్రణయడోలి-కావిలాసవిహారమె గాని యిచట.

మాలోమేము నుతించుకొందుమని మమ్మన్యాయ మహాభంగి ధీ
శాలుల్పల్వురు నిందసేయుదురు శాస్త్రప్రక్రియల్చెప్పి దో
షాలన్ జూపుట మాకు నచ్చదు సమాజం బెట్లు వృద్ధిం గనున్
మేలున్నప్పుడు మెచ్చికోలువలదే! మిత్రత్వ మింకెందుకో?

చెప్పెడుదానినే మరలఁ జెప్పచునుందుము మేమటంద్రు మా
గొప్పగ్రహింపలేక విసుగున్ వహియింతురు న్యాయమౌనె? వా
తప్పెడుకూతలే యివి? యథార్థమెఱుంగఁగలేనియట్టి వెం
కప్పల బూకరింపుల నికారమొనర్పక పాటిసేతుమే?

ఉత్తమరీతి మాగుణము లొక్కటినైన గ్రహింపఁగల్గుచో
నెత్తినిబెట్టుకొందుము మనీషులటంచు భవత్పదంబు లు
న్మత్తులరై విమర్శనము మానుఁడు పండితవర్యులార! జా
గ్రత్తగ సంచరింపుఁ డిది కాలముగాదు పరాక్రమింపఁగన్.

---

## వింతవిరులు

"కుమారదేవకవి"

వెలిదమ్మివికసించెఁ గలువలువిడిగెను
నువ్వుఁ బువ్వు రహిని నివ్వటిల్లె
మల్లెలు విరిసెను మంకెన పూచెను
దిరిసెన లలరెను విరివిఁగొనుచు
గుత్తులుగాఁ గొన్ని కూడెను పువ్వులు
మొగ్గలు వానిలోఁ బొడిచి నిక్క-
సరములుగాఁ గొన్ని విరులు వ్రేలెను, రెండు
చెంగల్వలవ్వాని చివరఁ బొలిచెఁ
బొన్ననన యొండు రేకిడెఁ గన్నెమొగిలి
విచ్చె;-హాయొందఁగ పూచె నీవింతవిరుల!
తెనుఁగుకైతలతోఁట నీ తీరుపువులఁ
చిదిమికొనుఁడోయి వేవేగ నదనునందె.

—మకరందస్యందనము

---

# సుధాసూత్రము

కుందుర్తి నరసింహారావు

(క)

ఎందుకే నీకపోలమ్ము లెర్రవారి
 కరగిపోయిన వీయుషఃకాంతిలోన ?
ఏమనస్సీనుగల పరిణామగతులు
బయలుపరచెదు నర్మగర్భముగ నిటులు ?
ఎవరిలోపొంగు భావవాహినులువారి
వదనదర్పణముల గానవచ్చునంద్రు,
నీ మొగమ్మేల ప్రకటించు నామనస్సు
పట్టలేకున్న రాగప్రపంచ మిటులు ?

(ఖ)

ఎన్నడో నీకొసంగిన దీసుగంధ
బంధుర సువర్ణచందనపాత్ర ; దీని
రిక్తమొనరించి తిరిగి యర్పింపుమంటి,
పూర్ణకలశమ్ము నేలపంపుదువు, చెలియ ?
ఈవిపినజీవనమునం దె కెన్నడేని
వచ్చునటె యిట్టిపరిపూర్ణవైభవమ్ము ?
కొనవె ప్రాణప్రియా ! నేడె తనివితీర
నాహృదయరాగ బంధురానంద మధువు—

(గ)

రమ్మునాతోడ జవ్వనీ, రజనిగడచు
వేళ, కైదండయొసగి—పృథ్విని త్యజించి
పయన మొనరింతు నవ్యప్రభాతరుచుల
మృదుహృదయరాగగంధమ్ము మేళవించి ?
నీవు నాతోడ రాకున్న నిర్జరప్ర
పంచమునగూడ నిన్నెంచి పాడుదునట :
వెర్రివారలుగాక యీవిబుధకోటి !
నీవుగలచోటనే పాటనిలిచిపోదె ?

(ఘ)

చెలియ, గ్రీష్మంపుఛాయలు తొలగిపోయె,
వారిదకుమారి చల్లనివార్తదెచ్చె,—
కాలపథమున కష్టసుఖాలు గలవు—
ఏమిచేయంగవలె నిర్ణయింపు మిపుడు ?
హాయిగా విశ్రమింతునో ఆత్మరచిత
గీతికాబద్ధ మధురసంగీతరుచుల ?
లేక, యీవారిదాంగన రాకతోడ
మొదలిడు మహావర్షవారాసి మునిగిపోనో ?
సంపదలకయి శాంతినే సంహరించి
లౌకికమహాపయోధిలో దూకి, భువన
భూతసంక్షోభవైభవవ్రాతమును వి
చిత్రవధ చేయుమందువా? చెప్పు మిపుడు—

(ఙ)

ఒకతె పెంచిన హరిణశాబకమువోలె
ఎన్నినాళ్లు సహింతు నీమన్ననలను ?
నన్ను నటవీమృగమ్మని మెన్నియైన
సుదతి, వదలవె ప్రేమరజ్జువు సడల్చి—
వదలవే, యీప్రవాహమ్ము నదిమిపట్టి
ఇచ్ఛవచ్చినయట్టు లాడింతు నింక,
స్వేచ్ఛవలన ఆవేశమ్ము చెందినాడె
నేని, లోకత్రయమ్ము నిర్జింపగలను ;
పిడికిట గదించుకొందు నీప్రేమవాహి
నీమహాశక్తి, మానవస్వామి నగుదు—
ఇంతదైవాంశమే నొక్కయింతి కొసగి
దుర్బలమ్మగు బ్రతుకెడద్రోయలేను.

(చ)

వేచియుండుము నెచ్చెలీ, నీచరిత్ర
నేను చినిచిన్నిగీతాలలో నిమిడ్చి

పంపెద విదేశబాంధవప్రాంతములకు
పలుకు పెంపుడుపావురమ్ముల కొసంగి;
ఆయపూర్వలేఖలగాంచి యరుగుదెంచు
నేట రేపట నీబంధుకోటి, వివిధ
పుణ్యలోకమ్ము లెడలి నీ పూజసలుప,—
వేచియుండుము నెచ్చెలీ, వెడలిపోకు.

(చ)

ఏసహోరాత్రములు నుపాసించి, విసిగి,
దేవిమొడల నాశాలతల్ త్రెంపుకొంటి
రోదసీకుటీరమ్ము నశ్రువులనింపి
తన్నివాసిని మొడదనే తడుపనైతి
ఎరిగియున్న యిలాతల మ్మేవగించి
అభిలషిత మహానభమ్ము దుర్లభమటంచు
భూనభోమధ్యగత రోదసీనివాసి
పవనదేవి నుపాసింప బ్రతుక నెంచి
కడకు కోర్కెలు గంగలో గలుపుకొంటి.
ఇపుడు నేను జీవించుట యెట్టులందు
వో? సితాసితవారిదప్లుతనభమ్ము
మోదఖేదనిర్మితమైన మేదినీత
లమ్ము నైశ్వర్యమందు సమమ్ములగుట
పవనదేవి యుర్వీతల ప్రాణికోటి
గలుగు నుచ్ఛ్వాస నిశ్వాసగతి వసించు
నను నిరంతరసత్య దృశ్యమ్మెరింగి
పరిచితమ్మైన సోదరప్రాణికోటి
నిపు డుపాసింతు నాదేవి యిల్లటంచు.

(జ)

ఏల కంటక దూషిత మిమ్మార్గమమ్ము
నేను గయికొంటినో గోచరించదిపుడు,
పోవుచున్నాడ, నొకదివ్య పుష్పగంధ
మహరహ స్స్వప్నయాత్రల ననుగమింప;
ఒకరు లేదందు రసలది ఊహకల్పి
తప్రసూనమ్ము గగన లతాంతమనుచు,
ఒకరుకంటకమార్గమ్మునకు ముగింపు
ఈసుమస్పర్శయని ప్రోత్సహించువారు.
మృదుపదయుగమ్ము కంటకావృతముగాగ
క్రమ్ముకొను దివ్యకుసుమ సుగంధమిటులు
'కలదుకల'దంచు హృదయమ్ము పలవరించి
ఈవిషయకంటక పథమ్ము నేవరించు.

---

## వసంతస్వనము

అత్తిలి సూర్యనారాయణమూర్తి
(రవీంద్రసారస్వతసమాజం)

పాడినావేపాట పంచమస్వనములో
ఈడెవ్వరే నీకు మధురగీతాలలో
పరుగెత్తె నాకళ్లు పచ్చాలనీడలో
విరిబోడిచూపులా, మెరుములాపోయావు
పాడినావేపాట......

పాడినావేపాట పంతూవరాళిలో
ఓడానెపందెమ్ము వ్యోమనీలాంగిరో
పాడినావేపాట......

మధుమాసకంఠమా! విధుపూర్ణకిరణమా!
మత్తిల్లు యువజనుల నృత్తలయతోషమా!
పాడినావేపాట......

---

# శ్రీరుక్మిణీసందేశము

వైద్యరాజ దంటు సుబ్బావధాని

"ఆత్మనివేదనము"

నీదాసను, నీదాసను, - నీదాసనుజుమ్ము వలతు నీదాస్యమ్మున్
వాదేల, మనసు మేనున్ - నీకే ప్రాణంబు నీదె నిజముగఁ గృష్ణా.

ఏదారి లేనిదాసను, - మోదదమగునీదుసేవ మోక్షంబని నీ
పాదము లెద నిల్పితి స్వామీ దాసికిఁ గొలువొసంగి యేలుము కృష్ణా.

నా దేమిలేదుసు మ్మిక, - నీదేభారంబు నేను నీ వనుభేదం
బేదీ? నీయంగంబై - నీదరిఁ జేరుటను నేను నీవే కృష్ణా.

లే దింక నిహముఁ బరమున్ - లే దొరులని స్వీయులంచు లే దహమేనిన్
నీదర్శనోత్సవంబున - నేదియుఁ గనరాదు సకల మీవే కృష్ణా.

రాదా దయ నాపై నీ - కీదామోదంబు నన్ను నేలుట నాకున్
నీదాసననుటతో సరి-గాదే సిద్ధియును నిజము కంజదళాక్షా.

ఏదీ నీమృదుభాషణ - మేదీ నీ మొలకన వ్వదేదీ యేదీ
నీదివ్యకరస్పర్శం - బేదీ నీదాని కేమి యిచ్చెదొ కృష్ణా.

ఏదియు జగమునఁ గానగ-రాదుగదా నీకుసాటి రాజీవాక్షా,
లేదెద్ది నా కుపాస్యము - నీదాసిని నీకు దాసినిన్ గృపఁ గనుమా.

నీముద్దుమొగముఁ జూడగ - నీమృదుభాషలను వినగ నీ మే నంటన్
నీమోవి నానఁగా నీ - కామోదం బొసగవలతు నబ్జదళాక్షా.

నీకంటెఁ గోరఁదగినది - నాకెందున్ లేదుగాదె నాభవమునకున్,
నీకైంకర్యము స్మరణము - నీకైవల్యంబుసిద్ధి నిజముగఁ గృష్ణా.

భవజలనిధిఁ దరియింపగ, - భవదనుపమకృపయె నావ, భక్తార్తిహరా
భవదీయనామకీర్తన - భవదీయులకెల్లఁ బరమపదమిడుఁ గృష్ణా.

నేనేమిఁ జేయఁజాలుదు - నీనామముఁ జేయుచుందు నిను మదిఁ దలతున్
నీనామరూపములనే - గానం బొనరించి దినముగడపెదఁ గృష్ణా.

నీనామము మదిమఱచిన - యానిముసము నాకు నొసగు యమయాతన, నీ
ధ్యానంబు మఱగినన్ బ్రహ్మానందము ననుభవింతు నబ్జదళాక్షా.

నినుబాసి నిముసమేనిన్ - మనజాల ననంగ నీవు మాధవ నాపై
నెనరుంచిన మే లగు నే - మనజాలుదు నచ్చఁజెప్ప నది నాతరమా.

కలవాఁడవు నామదిఁగనఁ - గలవాఁడవు నన్నుఁ బ్రోవఁగలవాఁడవు నీఁ
గలవాఁడ వేమిగోరిన - వలచిన నను గొనగ నిటకు వచ్చుట బరువా.

నినుసేవింపఁగఁజను నెమ్మన మొందేదియును గనదు మార్గంబు నదే
నిని నైన నట్టి వైచుక - ఘనసింధువుఁ జేరు గంగకైవడి కృష్ణా.
తిననేల? కట్టనేలా? - కననేలా? వినగనేల? కదలగనేలా?
మననేల నిన్నుఁ గొలువక? - వనమున మానై నమేలు వనజదళాక్షా.

హద్దులుదాటిపోవు మన మాగఁగఁజాల నికెట్టువత్తు నీ
యొద్దకు, నీదు సేవలకు నువ్విళులూరెడుఁ గాయ మద్దిరా
రద్దియొ రట్టొ, కృష్ణ! యిక రాగదె! దర్శనమీఁగదే! మహా
పద్దశ మాన్పి నీ యురముపై నలరింపవె నిర్భయంబుగన్.

ఆప్తుఁగునట్టివాఁడు లేనట్టి బ్రదుకు - దిక్కు లేనట్టి చావుతో నీటువచ్చు
మనసు నీ కిచ్చునందాక మరణబాధ - వేణుగోపాల యెటు ప్రోతొ ప్రాణము నను

తల్లిన్ నమ్మను దండ్రి నమ్మ ననుజుల్ త్వద్దూరు లింకేల నే
నొల్లన్ దక్కిన బంధువర్గమును నా కున్నట్టి పట్టెల్ల నో
ఫుల్లాబ్జాక్ష భవత్కరగ్రహణమే, మోహాబ్ధి దాటించి యు
త్సల్లావణ్యపయోధిఁ దేల్చగదె, కృష్ణా వేణుగానప్రియా.

నను గనుచుండుము రోకవె యి-గనులను మావారలెల్లఁ గమలాక్ష పటం
బున వ్రాసి మదురమూర్తిని - గనినైన సంతసింపఁ గలుగ దొకటనేన్.

నీలంబు ముత్తియంబుఁ బ్రవాళంబున్ దాకవెఱతు వనమాలీ నీ
పోలిక లేరా? నీలో - లీలాలోలాత్మ నొచు లీనముగాకే.

ఉద్యోగించి వచింతురు - చైద్యునిగుణగణము నాకు సఖు లది కృష్ణా
హృద్యంబుగాదు నీకున్ - వేద్యం బగు నాదు చిత్తవృత్తి సకలమున్
నను చైద్యున కిప్పింపఁగ - ననుజులు జనకుండు నంబ యాప్తులు నున్నా
రు నిజంబు సుమ్ము నాజీ-వనమున్ నిలుపంగరమ్ము వనజదళాక్షా.

నిన్నున్ సాధులు బొగడగ - విన్నప్పటినుండి నీదువిత్తమ నైతిన్
వెన్నలఁగాదిక నన్నున్ - దిన్నగ దొంగిలిఁగాదె దిట్టవు! కృష్ణా.
నిదురబోవంగ వెఱచెద, నీరజాక్ష - కలువరింతల నీపైనఁ గలుగువలపు
బయలుపడునని, చెలులతోఁ బలుకవెఱతు - నీదుకత తెత్తురనుచుఁ బ్రమాదమునను.

పాడుదునా నీపైఁ గృతి - గోడలకున్ జెవులు గలవు గోవింద భవ
త్క్రీడామృగముగ నుండుదు - దోడుగ నీకడకు నన్నుఁ దోడ్కొనిచనుగా
నీనుబాసి నిలువఁజాలక - నినుఁ దలచుచు రేయిఁ బగలు నిలిపెద నాజీ
వన మో వనజాక్షా దాసిని, దేవా ప్రోవ నీకె చెల్లును కృష్ణా.

---




సంతాన చింత



ఆఫ్రికానుండి మరలివచ్చిన బరోడా ఆర్యకన్యామహావిద్యాలయ విద్యార్థినులు

విశాఖపట్టణమున పోణకా కనకమ్మగారి యాధిపత్యమున జరిగిన ఆంధ్రమహిళా మహాసభ, ఆహ్వానసంఘసభ్యురాండ్రు



గుంటూరు శ్రీమహాలక్ష్మీపఠనమందిర హిందీవిద్యార్థినులు, పాలకసంఘ సభ్యురాండ్రు



48-వ జాతీయమహాసభ స్త్రీ వాలంటియరులకు శిక్షణనొసగిన మహిళాబృందము



# FRESHNESS & PURITY

బాగుగా వికసించిన యెఱ్ఱనిగులాబి లోకమంతటికిని యింపుగా నుండును. పాటలవర్ణము గలిగి పట్టువలె మృదువుగా స్వచ్ఛముగా, సువాసనగా నున్న గులాబిని చూచినచో ప్రపంచమంతయు మోహపరవశము కాకమానదు.

మీశరీరముగూడ అదేవిధముగా పాటలవర్ణముగలిగి-పట్టువలె మృదువుగానుండి, స్వచ్ఛముగాను సువాసనగాను, నుండుటకు వీలుకలదు. మీదేహము విషయమై కొంత దయజూపుము. మీశరీరమే మీధనము—మైసూరు శాండల్ సోప్ యొక్క మనోహరమైన నురుగుతో శరీరమును శుభ్రముగాతోమి, కడిగి తడియార్చుడు. ఆమురికి, గరుకుదనము, అంటువికారము, సమస్తము మటుమాయమగును. బాగుగావికసించిన ఎఱ్ఱనిగులాబివలె మీశరీరమునకుగూడ పాటలవర్ణము,పట్టువలె మృదుత్వము,సువాసనఏర్పడును.



# MYSORE SANDAL SOAP

ఆధునిక శాస్త్రీయపద్ధతులమీద గొప్పగొప్పనిపుణుల పరిశీలనతో తయారు చేయబడును. కేవలము స్వచ్ఛమైన భారతదేశచందన పరిమళము నలుదిక్కులకు ప్రసరించుచుండును.

## గవర్నమెంటు సోప్ ఫ్యాక్టరి,

బెంగుళూరు.



పండ్లపడుచు

**(Fruit-seller)**

—Sripada Durga Rao

కలకత్తా కార్పొరేషన్ మేయరు నలినీరంజనసర్కారుగారికి బందరు పురపాలకసంఘమువారి సమ్మానము



భారతతత్త్వమహాసభ పదియవసమావేశము, వాల్టేరు



ఆంధ్రోత్కళరాష్ట్రసమస్యవిషయమై గవర్నరుకడ కేగిన ఆంధ్రరాయబారవర్గము



భారతదేశపర్యటనమునకై వచ్చిన యుగోస్లేవియా టెన్నిసుఆటగాండ్రు

# ౭. సంగీతము

## కర్ణాటక రాగపద్ధతి

వింజమూరి వరాహనరసింహాచార్యులు

### మేళకర్తలపేర్లు

ఆంగీరస, శ్రీముఖ, భావవత్సరముల ఉగాది సంచికలందు భారతీయరాగపద్ధతినిగూర్చి చెప్పుచు భాషవిభాషాంతర భాష రాగవిభాగము, రాగాంగ, భాషాంగ ఉపాంగ క్రియాంగరాగ విభజనము, పేరొ్కనబడి రామామాత్యుఁడు సోమనార్యుఁడు మున్నగు వాగ్గేయులమతము ననుసరించు మేళములు వీనిజన్యరాగములు వివరింపఁబడినవి. భావసంవత్సర ఉగాదిసంచికయందు ముఖ్యముగా మేళప్రస్తార పద్ధతిగూర్చి చెప్పుచు డెబ్బదిరెండు మేళములు ఎట్లు గ్రహింఁబడునదియు వివరింపఁబడెను. మేళకర్త సంఖ్య తెలియుటచే నందలిస్వరావళియొక్క ప్రకృత వికృతస్వరూపము నెఱుగుటకు వేంకటమఖి ఎంచినపన్నెండుచక్రములు తెలుపఁబడి యది ఎట్లో వివరింపఁబడెను. * మేళకర్తసంఖ్య నెఱుగుటకు మేళకర్తయొక్క నామ మవసరమగుచున్నదనియు, నిది కటపయాదినియమము ననుసరించునదగుటచే నట్లు మేళకర్తయొక్క సంఖ్య తెలియుదుమనియు దెలిపియుంటిమి. మేళకర్తసంఖ్య నారయువిధముకూడ దెలుపఁబడెను. ప్రస్తావనపూర్వకముగ "చక్రవాకము" కటపయాదినియమమునకు విరుద్ధముగా నుంటయుఁ జూపఁబడెను.

ఆర్యావర్తమందేమి పాశ్చాత్యదేశములందేమి శాస్త్రములు, కళలు ముఖ్యముగ సంగీతము ఒక్కదినమున సంపూర్ణత జెందియుండలేదు. ఈదేశమున సమస్తశాస్త్రములు తర్జనభర్జన మొనర్పఁబడినవెనుక అనుభవైకపూర్వకముగ తమసుజ్ఞానసంపత్తి చొప్పున వెలయింపఁబడినవనునది విదితము. ఎంతటిపాశ్చాత్య సంగీతశాస్త్రమోహితుఁడును భారతీయసంగీతము ధ్వనిశాస్త్రము ననుసరించునదే యనియు, నాదప్రభావ మెఱిఁగినవారిచే నాదరింపఁబడెననియు జెప్పకపోఁడు. ప్రాచీనకాలముననే భారతీయసంగీతము ఘనతగాంచెననియు నీయ్యది గ్రీకులుమున్నగువారికిసహితము ఆదర్శముగ నుండెననియు జరిత్రలవలన దెలియుదుము.

ప్రాచీనకాలమునుండియు నీదేశమున రాగపద్ధతి యమలునందుండినను నది నాటినుండియు నొక్కవిధముగలేక ఆయాకాలములందు కొంతకొంత మార్పుచెందుచుండెననునది విదితము. శార్ఙ్గదేవునివికృతస్వరావళికిని రామామాత్యుని స్వరావళికిని వ్యత్యాసములు మాతుము. ఇట్లు సోమనార్యుఁడు వేంకటమఖిమతములందు భిన్న సంగతులు మాతుము. వీరివీరి మేళములు, జన్యరాగములు భిన్నములుగనుంటయు భావసంచికయందు తెలుపఁబడెను. అనంతరము ప్రస్తారమేళము లెట్లు వేంకటమఖిచే దెలుపబడినదియు నాసంచికయందు నిర్ణయించితిమి. ఇట ప్రస్తారమేళములనామములగూర్చియు, గర్ణాటకదేశమందలివానివ్యాపకముగూర్చియు దెలియవలసినయావశ్యకత కలదు.

మేళకర్తలనామము లారయునప్పుడియ్యవి ప్పుడు రెండు విధములుగ నుండినట్లు తెలియవలయు. ౧. వెంకటమఖిచే నేర్పఱుపఁబడినకనకాంబరి, ఫేనద్యుతిమున్నగునవి, ౨. తచ్ఛూరి శింగరాచార్యులు మున్నగువారిగ్రంథములందుగాంచుకనకాంగి, రత్నాంగి మున్నగునవి. ఇందుచే వీనిని కొందఱు దీక్షితమతము, త్యాగరాజుమతము ననుసరించునవి యనియు వ్యవహరించుకొనుచున్నారు. కనకాంగి, రత్నాంగి మున్నగునామములు త్యాగరాజసమ్మతములనియు నిందుచేఁ బైవానికన్న నాదరణీయములనియు నిట్లు చెప్పుచు త్యాగరాజుగారియెడ తమకృతజ్ఞతను వెల్లడించుచున్నారు. కటపయాదినియమమునకు విరోధములగు నీమేళకర్తలు త్యాగరాజుగారాదరించిరనుటకు నిదర్శనములు వీరు చూపవలసియున్నది. ఏలనన శ్రీత్యాగరాజు కవియై, భక్తుఁడైనందున మనస్సు ప్రశాంతవంతమై ప్రఫుల్లతఁ జెందుతరి హృదయకూపమునుండి సహజములై వెడలి వచ్చిన భావోద్రేకపుటూటలు రసవంతమగు కీర్తనరూపము దాల్చెను. అప్పుడెల్ల తనయాంతరంగికానుసరణీయమగురాగములందయ్యవి పాడఁబడుటయు శిష్యు లనువదించుటయు శ్రోతలు శ్రవణానందముగ విలీనులై వినుటయు గద్దని తెలియుదుము.

* చూడు భావసంవత్సరాదిసంచిక ౨౩౪-౨౩౬ పుటలు.

త్యాగరాజు తనకీర్తనములకు రాగములను పేర్కొనకుండెననియు నందులకు శింగరాచార్యులుగారు పూని తనగ్రంథములు వెలయించె ననియు దెలుపఁబడుచున్నది. "సింధురామక్రియ" రాగమందలి శ్రీత్యాగరాజుగారి "దేవాదిదేవ" అనుకీర్తనము నుచ్చరించుచు దమతండ్రిగారగు దీక్షితులు కీర్తనములను స్వరయుక్తముగ నచ్చొత్తించి ఘనతగాంచిన సుబ్బరామదీక్షితులు ఇట్లు చెప్పినారు. "అయ్యవారు తమశిష్యులకు ఏరాగములందు కీర్తనములు చెప్పినప్పటికిని ఆయారాగముల యథార్థనామము చెప్పలేదని పెద్దలకింవదంతి యున్నది. మహానుభావులు కనుక తామే అనేకరాగములు కల్పించి వానిలో ననేకకీర్తనములు రచించియున్నారనుటకు సందేహములేదు. ఇదిగాక ౩౧ వ రాగాంగరాగమైన కళావతీరాగమును చక్రవాక మేళజన్యమని పలుపుస్తకములలో గనియుండుటయు సరికాదు. మా పెద్దలైన ముద్దుస్వామిదీక్షితులును అయ్యవారును సంధించినప్పుడు కీర్తనములందు అతిరహస్యమైన రాగములపేళ్లు నిడి వెల్లడిపఱచుట యెంతమాత్రము సరికాదని చెప్పినప్పుడు వినియుండిన పెద్దలచేవిని యున్నాను. అయ్యవారి కీర్తనములకు ప్రసిద్ధరాగము దక్క తక్కిన రాగములను పెద్దశింగరాచార్యులు ఏర్పఱచినట్లు ఎ. ఎం. చిన్నస్వామిమొదలియారు (ఎం. ఎ) చెప్పియున్నారు." ఈ సంగతి యథార్థమైనదని సంగీతవిమర్శకాగ్రగణ్యులగు సి. ఆర్. శ్రీనివాసయ్యంగారు ౧౯౩౧ జూలై నెల ౧౨ వ తేది హిందూపత్రికలో దెల్పియున్నారు. ఈసంగతి నమ్ముటకిదియు దోడగుచున్నది.

శ్రీత్యాగరాజస్వామి తిల్లస్థానం రామయ్యంగారు, ఉమయాళ్‌పురం సుందరకృష్ణసోదరులు మున్నగు తమశిష్యులకువారివారి కనువగు విధమున నాలుగు బాడు తనకీర్తనములు చెప్పుచుండియు నాయారాగములపేరులు తెలిపియుండలే దనియు నీ సంగతి తెలిసి తోడివాగ్గేయుడైన ముద్దుస్వామిదీక్షితులు ఒకప్పుడు త్యాగరాజుగారి నీయంశమం దాక్షేపించెననియు నందుచే ద్యాగరాజుగారు ఘనరాగపంచకమందు తమ పంచరత్నములు "దుడుకు", "సాధించెనే", "ఎందరో మహానుభావులు," "కనకనరుచిరా," "జగదానంద" అను కీర్తనములు వెలయించి కీర్తిగాంచెననియు నిట్లు విందుము. ఇందుచే ద్యాగరాజుగారు తమ కీర్తనములకు రాగములు పేర్కొనియుండలేదని ఎంచవచ్చును. మరియు ద్యాగరాజుగారి కీర్తనములు రాగయుతములుగ నుండినట్లు ఎంచకపోవుటకు కారణము "నిత్యరూప", "ఎవరని నిర్ణయింతురా" మున్నగునవి రెండుమూడు రాగములతోఁ జెప్పుటయు నందుము. ఇందుచే వాడుకలో నుండిన మేళకర్తలు, రాగములు త్యాగరాజు మతము ననుసరించునవియే యనియు, వారిచే పేర్కొనబడినవనియు నిట్లు త్యాగరాజుగారిని యీసందర్భమున దీసికొనివచ్చుట నవ్యముకాదని భావింపబడుచున్నది.

కాని కొందఱు త్యాగరాజుగారిచే నేర్పఱుపబడిన రాగముల చొప్పున గల కీర్తనములు విలేఖింపబడిన తాళపత్రపుస్తకములు కలవనియు నందుచే నైవాదము కుదరదనియు నిట్లు చెన్నపురి సంగీతపరిషత్ సభలో నాప్రశ్నలకు జవాబు చెప్పిరి.

వీరాగ్రంథములను కనుపరుపరైరి. తమకీర్తనములకు ద్యాగరాజు రాగములపేరు లమర్చెననుటకు నిదర్శనములు చూపరైరి. ఇందుచే వీరిమాటయు విశ్వసింపఁబడలేదు.

మరియు గొంతకాలమువెనుక కర్ణాటకగానము దమితప్రజ్ఞ సంపాదించి తనయశశ్చంద్రికలను సంగీతలోకమునంతను విస్తరింపజేసికొనిన మహావైద్యనాథయ్యరు రాగాంగగీతము నొండువిధమున నే రచించియుంటచే నీరాగాంగములే అనగా "కనకాంగి, రత్నాంగ్యాది పేరులే జనసమ్మతములై యుండినవనియు నివియే పూర్వపు వాగ్గేయులు త్యాగరాజుసహితము సమ్మతించియుండియుండురనియు నిట్లుచెప్పువారి వాదముసహిత మీయంశమువలన యంగీకరింపఁబడను. మహావైద్యనాథయ్యరుగారికి వెంకటమఖివిరచిత "చతుర్దండిప్రకాశిక" కొండొకకారణముచే వెంకటమఖియనంతరము కంచికామకోటి మతాధిపులగు శ్రీశంకరపీఠమున కర్పింపఁబడుటచే నయ్యది లభ్యము కాలేదనియు, నందుచే వెంకటమఖి మేళములపేర్లచొప్పున దన రాగాంగరాగగీతమును చెప్పజాలకపోయెననియు, నిట్లు తెలియుదుము. కాని ముద్దుస్వామిదీక్షితులు తమగురుపరంపరసంప్రదాయము ననుసరించి "కనకాంబరి, ఫేనద్యుతి" మున్నగురాగపద్ధతిచొప్పున తనకీర్తనములు వెలయించి విశ్రుతకీర్తిని గడించియుండెననునది తెల్లము. ఎట్లులైననేమి రెండువిధములగు మేళకర్తలు కందుము.

ఈద్వివిధ మేళకర్తలలో నేది ప్రాచీనమగునది యని తెలియవలసినప్పుడు కటపయాదినియమానుసరణీయము కానిది ప్రాచీనమైన దనియు నిట్లుకాక కొంతసవరింపఁబడినది తరువాత వ్యాపించినట్లును తెలియుదుము వేంకటమఖి "మేళాద్విసప్తతిః శ్రీమద్వేంకటాధ్వరి కల్పితాః" అని తనమహిమ నుగ్గడించుకొనినను ఇతనితండ్రి గోవిందదీక్షితులుగారిచే రచింపఁబడిరఘునాథభూపవిరచితముగఁ బ్రకటింపఁబడిన "సంగీతసుధ" అను గ్రంథమున ౭౨ ప్రస్తార మేళములు ఎంచఁబడుటచే నితనికి బూర్వముననే ప్రస్తార మేళము లేర్పఱుపఁబడెననియు (వేంకటమఖితండ్రి గోవిందదీక్షితునిచే) నియ్యవి వేంకటమఖి గ్రహించి తదనుగుణ్యముగ దన మేళముల నేర్పఱచెననియు గ్రహింతుము.

మరియు నిటీవల అడయారు గ్రంథాలయమున లభ్యమైన గోవిందాచార్యప్రణీత 'సంగీతశాస్త్రసంక్షేపము"నుగ్రంథమునిప్పుడు వాడుకయందుండిన కనకాంగ్యాది ప్రస్తార మేళములు చెప్పఁబడుటచే నీగ్రంథము తచ్ఛారిశింగరాచార్యులుగారికిని మహావైద్యనాథయ్యరుగారికిని ఆదర్శముగనుండనోపు. నాగరలిపియం దచ్చొత్తింపఁబడిన "రాగలక్షణ" మనుగ్రంథమున నీరాగాంగరాగములును, వీనియందలి పెక్కు జన్యములు పేర్కొనబడుటచే నయ్యది పైగ్రంథమందలి

రాగాధ్యాయమునకు బ్రతిగ నెంచవచ్చును. ఎట్లైనను ఈపుస్తక మండలి కనకాంగ్యాదిరాగాంగములే కర్ణాటకగానమున నిప్పుడు ప్రబలినవని మాతుము. ఇందుకు కారణము పైనదెలుపబడినవిధమున వేంకటమఖిగ్రంథము "చతుర్దండిప్రకాశిక" మరుగువడి పెక్కుఅకు లభ్యము కాకపోవుటయే. ఈరెండువిధములగు మేళములలో ఒకరి మేళము ఒకరికి జన్యరాగముగనుంటయు మున్నగుసంగతులు గ్రహింతుము. ఈమతముల ననుసరించు మేళకర్తలపేరు లిట చూడనగును.—

| చక్రములు | శుద్ధ మధ్యమ మేళకర్తలు | | చక్రములు | ప్రతి (వరాళి) మధ్యమ మేళకర్తలు | |
|---|---|---|---|---|---|
| | వాదుకయందలివి | వేంకటమఖి పేర్లు | | వాదుకయందలివి | వేంకటమఖి పేర్లు |
| ఇందు ౧ | ౧ కనకాంగి | కనకాంబరి | ఋషి ౭ | ౩౭ సాలగము | సౌగంధిని |
| | ౨ రత్నాంగి | ఫేనద్యుతి | | ౩౮ జలార్ణవము | జగన్మోహనం |
| | ౩ గానమూర్తి | గానసామవరాళి | | ౩౯ ఝాలవరాళి | ధాలివరాళి |
| | ౪ వనస్పతి | భానుమతి | | ౪౦ నవనీత | నభోమణి |
| | ౫ మానవతి | మనోరంజని | | ౪౧ పావని | కుంభిని |
| | ౬ తానరూపి | తనుకీర్తి | | ౪౨ రఘుప్రియ | రవిప్రియ |
| నేత్ర ౨ | ౭ సేనావతి | సేనాగ్రణి | వసు ౮ | ౪౩ గవాంబోధి | గీర్వాణి |
| | ౮ హనుమతోడి | జనతోడి | | ౪౪ భవప్రియ | భవాని |
| | ౯ ధేనుక | ధునిభిన్నషడ్జం | | ౪౫ శుభపంతువరాళి | శివపంతువరాళి |
| | ౧౦ నాటకప్రియ | నటాభరణం | | ౪౬ షడ్విధమార్గిణి | స్తవరాజము |
| | ౧౧ కోకిలప్రియ | కోకిలారవం | | ౪౭ సువర్ణాంగి | సౌవీరం |
| | ౧౨ రూపవతి | రూపవతి | | ౪౮ దివ్యమణి | జీవంతిక |
| అగ్ని ౩ | ౧౩ గాయకప్రియ | గేయహెజ్జజ్జి | బ్రహ్మ ౯ | ౪౯ ధవళాంబరి | ధవళాంగము |
| | ౧౪ వకుళాభరణము | వాటివసంతభైరవి | | ౫౦ నామనారాయణి | నామదేశి |
| | ౧౫ మాయామాళవగౌళ | మాయామాళవగౌళ | | ౫౧ కామవర్ధని | కాశీరామక్రియ |
| | ౧౬ చక్రవాకము | తోయవేగవాహిని | | ౫౨ రామప్రియ | రమామనోహరి |
| | ౧౭ సూర్యకాంతము | ఛాయావతి | | ౫౩ గమనశ్రమ | గమకక్రియ |
| | ౧౮ హాటకాంబరి | జయశుద్ధమాళవి | | ౫౪ విశ్వంభరి | వంశవతి |
| వేద ౪ | ౧౯ ఝంకారధ్వని | ఝంకారభ్రమరి | దిశి ౧౦ | ౫౫ శ్యామలాంగి | శ్యామలాంగి |
| | ౨౦ నఠభైరవి | నారీరీతిగౌళ | | ౫౬ షణ్ముఖప్రియ | చామరల |
| | ౨౧ కీరవాణి | కిరణావళి | | ౫౭ సింహేంద్రమధ్యమం | సుమద్యుతి |
| | ౨౨ ఖరహరప్రియ | శ్రీరాగము | | ౫౮ హేమవతి | దేశిసింహరవం |
| | ౨౩ గౌరీమనోహరి | గౌరీవేళావళి | | ౫౯ ధర్మవతి | ధామవతి |
| | ౨౪ వరుణప్రియ | వీరవసంతం | | ౬౦ నీతిమతి | నిషిధం |
| బాణ ౫ | ౨౫ మారరంజని | శరావతి | రుద్ర ౧౧ | ౬౧ కాంతామణి | కుంతలం |
| | ౨౬ చారుకేసి | తరంగిణి | | ౬౨ రిషభప్రియ | రతిప్రియ |
| | ౨౭ సరసాంగి | సౌరసేన | | ౬౩ లతాంగి | గీతప్రియ |
| | ౨౮ హరికాంభోజి | హరికేదారగౌళి | | ౬౪ వాచస్పతి | భూషావతి |
| | ౨౯ ధీరశంకరాభరణం | ధీరశంకరాభరణం | | ౬౫ మేచకళ్యాణి | శాంతకళ్యాణి |
| | ౩౦ నాగానందిని | నాగాభరణం | | ౬౬ చిత్రాంబరి | చతురంగిణి |
| ఋతు ౬ | ౩౧ యాగప్రియ | కళావతి | ఆదిత్య ౧౨ | ౬౭ సుచరిత్ర | సంతానమంజరి |
| | ౩౨ రాగవర్ధని | రాగచూడామణి | | ౬౮ జ్యోతిస్వరూపిణి | జ్యోతిరాగం |
| | ౩౩ గాంగేయభూషణి | గంగాతరంగిణి | | ౬౯ ధాతువర్ధని | ధౌతపంచమం |
| | ౩౪ వాగధీశ్వరి | భోగచ్ఛాయనాట | | ౭౦ నాసికాభూషణి | నాసామణి |
| | ౩౫ శూలిని | శైలదేశాక్షి | | ౭౧ కోసలము | కుసుమాకరం |
| | ౩౬ చలనాట | చలనాట | | ౭౨ రసికప్రియ | రసమంజరి |

## మేళకర్తల పేరులు

మేళకర్తలనిరూపణమున రాగములపేర్లు స్వతంత్రముగ నుండవలయుననునది సమ్మతము. అనగా "మాయామాళవగౌళ" యందువలె కటపయాదిసంఖ్యానుగుణ్యముగ మేళకర్తలసంఖ్యను తెలుపుటకు జేర్చబడు 'మాయా' అనునట్టి సంఖ్యాక్షరములు కాక తక్కిన యక్షరములు "మాళవగౌళ" వలె రాగములపేర్లు పూర్తిగ కన్పట్టవలెననుట. 'కనకాంగి' మున్నగు మేళకర్తలపేరు లీచొప్పున గలవా? అని విచారించుతరి అయ్యవి కొన్ని కుంటువడియున్నవనవలసినదే. "గాయకప్రియ" యందలి సంఖ్యాక్షరములు 'గాయ' తీసివేసిన అర్థములేని 'కప్రియ' మిగులును. ఇట్లు వకుళాభరణము, ఖరహరప్రియ, షడ్విధమార్గిణి, షణ్ముఖప్రియ, రిషభప్రియ, నాశికాభూషణి, రసికప్రియ మున్నగునవి నఠభైరవి, గౌరీమనోహరి, మారరంజని, హరికాంభోజి, ధీర శంకరాభరణము, ఝాలవరాళి, రాగవర్ధని, చలనాట, శుభపంతువరాళి, నామనారాయణి, మేచకల్యాణి, ధాతువర్ధని మొదలగువానివలె మేళకర్తసంఖ్యను చెప్పుటకు జేర్చుకొనిన సంఖ్యాక్షరములు రెండును తీసివేసిన యెడల తక్కినవి సరళముగ స్వతంత్రముగ లేవు. రెండు సంఖ్యలను చెప్పుటకు నఠభైరవి మున్నగువానివలె చేర్చుకొనవలసిన రెండక్షరములకు మారుగ గొన్నిట హనుమతోడి, ఖరహరప్రియ, షడ్విధమార్గిణి మొదలగువానియందువలె మూడు లేక నాలు గక్షరములు కూడ చేర్చుకొనబడుటచే నవి యొక్కపద్ధతిగ గన్పట్టుటలేదు. తోడిరాగము చెంతకు హనుమంతు నేలతెచ్చిరో తెలియుటలేదు. 'ఖరహర' నామ మెటనుండి గొనిరాబడెనో తెలియుటలేదు. ఖరదూషణ, త్రిశిరస్సులలో మొదటివాని నిటకు దెచ్చిరా? ఇక "మార్గిణిని" షడ్విధములుగ నెంచి 'షడ్విధమార్గిణి' అని చెప్పిన తక్కినవి ఏవి? 'రిషభప్రియ', అనుట ఎట్లు? వీనికి సమాధానము లెట్లు చెప్పవలయును?

వేంకటమఖి చెప్పినమేళము లిట్లుకాక పెక్కులుగాన సామవరాళి, మనోరంజని, జనతోడి, ధునిభిన్నషడ్జం, గేయ హెజ్జజ్జి, వాటి వసంతభైరవి, జయశుద్ధమాళవి, నారీరీతిగౌళ, గౌరీమేళావళి, వీరవసంతం, హరికేదారగౌళ, గంగాతరంగిణి, భోగచ్ఛాయ నాట, శైలదేశాక్షి, కాశీరామక్రియ, రమామనోహరి, దేశిసింహారవము, ధాతపంచమము, రసమంజరి మొదలగునవి చేర్చుకొబడిన సంఖ్యాక్షరములు విసర్జించినను రాగనామము వ్యక్తమగుచున్నది.

మరియు మేళకర్తసంఖ్య తెలుపుటకు చేర్చుకొబడిన సంఖ్యాక్షరములతో గలపేరు ఒక్కరాగమును నాయక్కరములుఒల్లనప్పుడు మరియొకరాగము నిట్లు రెండురాగములు కొన్నిటమాత్రము భావించి కొన్నిట నట్లు భావింపకపోవుట యమాయకపు సంగీతవిద్యార్థిని మోసగించుట యనకతప్పదు. హరికాంభోజియందలి మేళకర్తసంఖ్యాక్షరములు "హరి" తీసివేసినప్పటి "కాంభోజి" పై హరికాంభోజియందు జన్యముగ నారోహణమున ధైవతవర్జముగ బాడబడుట విదితము. హరికాంభోజి, కాంభోజిరాగము లిట్లు వేరుగ నున్నవి. కాని మాయామాళవగౌళ, మాళవగౌళ, మేచకల్యాణి, కళ్యాణి ఇట్టిరాగములు భిన్నములుగ బాడబడుట తెలియము. హనుమతోడి సంపూర్ణసంపూర్ణమనియు దోడి పంచమవర్జితమగునది యనియు నీ మతము వారు చెప్పుదురు కాని ఇప్పుడు తోడి పంచమయుతముగనే పాడబడుచున్నది. నఠభైరవియందు భైరవి జన్యమనియు బంచమవర్జితమైనదనియు జెప్పుదురు కాని పంచమయుత మగునదిగనే యున్నది. శంకరాభరణము అవరోహణమున నిషాదవర్జితమగునదిగ గల్పింపబడినది కాని ధీరశంకరాభరణమునందు వలె సంపూర్ణసంపూర్ణముగ స్వరములు చేర్చిపాడుట తెల్లము. "చలనాట" సంపూర్ణ సంపూర్ణమనియు "నాట" ఋషభధైవతవర్జిత మగునది యనియు జెప్పునది చూడము. సంగీతజ్ఞులగు వీరభద్రయ్య, మాతృభూతయ్య, శ్రీత్యాగరాజు మున్నగువాగ్గేయులు వాటియందు ఋషభ ధైవతములు చేర్చి పాడియుండినట్లు తెలియుదుము. హరికాంభోజి, కాంభోజిరాగములు తప్ప తక్కినవి మేళకర్త సంఖ్యాక్షరములు తీసివేసినప్పటి రాగములు మేళకర్తరాగములకు భిన్నమగునవిగ జెప్పబడినను వాడుకయందు భిన్నములగునవిగ జూడము.

## కటపయాది నియమము

ఇదివరలో 'కనకాంగి' 'రత్నాంగి' మున్నగు పేరులు కొన్ని కటపయాదినిర్ణయమునకు వ్యతిరిక్తముగ నున్నవని తెలిపియుంటిమి. "రత్నాంగి" పేరులో రత్న ౨ సంఖ్యను తెలుపుటకు సంయుక్తాక్షరము 'త్న' యందు నకారము తీసికొని యద్దాని విలువ శూన్యముగ నెంచిరి. కాని సంయుక్తాక్షరములం దిట్లు క్రిందివత్తులను అన్ని మేళకర్తలందు గ్రహించియుండలేదు. "చక్రవాకము" అను పేరులో 'క్ర' యందు పైవిధమున 'త్న' యందలి నకారమువలె 'ర'కారము గ్రహింపక 'క' సంఖ్యాక్షరముగ దీసికొబడినది. ఇట్లు 'దివ్యమణి', 'విశ్వంభరి', 'శ్యామలాంగి' 'చిత్రాంబరి', 'జ్యోతిస్మతి' మున్నగువానియందలి సంయుక్తాక్షరములలో వరుసగ 'వ', 'శ', 'శా', 'తా', 'జో' ఇట్లు పైయక్షరములు మేళసంఖ్యను తెలుపునవిగ దీసికొబడెను. కాని సూర్యకాంతము, షడ్విధమార్గిణి, షణ్ముఖప్రియ మున్నగువానియందు సంయుక్తాక్షరముయొక్క ఒత్తులే సంఖ్యాక్షరములుగ గ్రహింపబడెను. వీని నిట చూడుడు:

| కటపయాదినియమపూర్వకములు | కటపయాదినియమవిరోధములు |
|---|---|
| ౧. రత్నాంగి | ౧. చక్రవాకము |
| ౨. సూర్యకాంతము | ౨. దివ్యమణి |
| ౩. షడ్విధమార్గిణి | ౩. విశ్వంభరి |
| ౪. షణ్ముఖప్రియ | ౪. శ్యామలాంగి |

| | |
|---|---|
| ౫. సింహేంద్రమధ్యమము | ౫. చిత్రాంబరి |
| ౬. ధర్మవతి | ౬. రిషభప్రియ |
| ౭. కాంతామణి | ౭. జ్యోతిస్మతి |
| ౮. గాంగేయభూషణి | ౮. గవాంభోజి |

కాని వెంకటమఖిమేళము లిట్లు కాక కటపయాదినియమమును పెక్కులు పాటించుచున్నవి.

## మేళకర్తల వ్యాపకము

మేళకర్తలయొక్క రెండువిధములగు నామములలో పైన తెలుపఁబడినట్లు కనకాంగి, రత్నాంగి మొదలగునవి మనము పాటించుటగూర్చి తెలిపియుంటిమి. ఇఁక డెబ్బదిరెండుప్రస్తార మేళములు; వ్యాపకమునందు కలవాయని యెంచుతెరి యట్లుకాదని చెప్పవలసి వచ్చును. కొందఱు ౧౨ చక్రములలో వివాదిదోషయుతములగు శుద్ధగాంధారనిషాదములు, షట్శ్రుతిఋషభధైవతములు గల ౧, ౬, ౭, ౧౨ మేళచక్రములు మరితక్కినవానియందలి మొదటిమేళము, తుదిమేళము ఇట్లు మొత్తమునలుబది మేళములు వివాదిదోషగ్రస్తము లగుటచే గానమున నుపయుక్తములు కావని భావించుచున్నారు. ఇందుచే వీరు ముప్పదిరెండు మేళములే కర్ణాటకగానమున వ్యాపకము చెందినవనియు నివిమాత్రము ౧౨ స్వరముల ప్రస్తారమువలన కలిగిన వనియు, బదునారుస్వరములను ప్రస్తరించి డెబ్బదిరెండు మేళముల నేర్పఱచుట కూడదనియు నిట్లు చెప్పుదురు. నాదస్వరవాద్యమున ఘనతగాంచిన మధురపొన్నుస్వామి యిట్లు నాతో నఖిలభారతగాయక మహాసభయందు "ద్వావింశతి శ్రుతులు-స్వరావళి" గూర్చి నేనొసంగిన యుపన్యాసముసందర్భమున బ్రశంసించియుండెను. కాని నేను డెబ్బది రెండు మేళములు పదునారునామములుగల పన్నెండుస్వరముల ప్రస్తారమువలననే కలిగినవనియు నలువది మేళములు అపూర్వములుగను, కష్టసాధ్యములుగ నెంచవచ్చుననియు నిట్లు సహేతుకముగ నచ్చ జెప్పితిని. డెబ్బదిరెండు మేళములందు శుద్ధనిషాదగాంధారములు మరి షట్శ్రుతిఋషభధైవతములు గల నలుబదిరాగాంగములు సులభముగ బాడుట కసాధ్యములనియు, కుశాగ్రబుద్ధిగల మహావైద్యనాథయ్యరు[1] మొదలగుధీశాలురకు సులభగ్రాహ్యములే యనియు జెప్పవలసి యున్నది. ఇప్పుడు కొందఱు సభేశయ్యరు (చిదంబరం సంగీతకళా శాల ప్రిన్సిపల్) మున్నగువారు తమగురువు వైద్యనాథయ్యరుగారి ౭౨ రాగములందలి రాగాంగగీతమును పాడగలుగుటచే నారాగాంగ ములు ఘనమగు నలవాటుచొప్పున సాధించవచ్చునని తెలుపుదురు. చెన్నపురి సంగీతపరిషత్ సభవారి గాయకమహాసభయందు డెబ్బది రెండుమేళకర్తలు గానయోగ్యములుగ దీర్మానింపబడెను. కాని నేటికిని సి. ఆర్. శ్రీనివాసయ్యంగారు, ఎం. ఎస్. రామస్వామి అయ్యరు మున్నగుకొలదిమంది పైనచెప్పినట్లు ముప్పదిరెండు మేళ ములుమాత్ర మిప్పుడు బాహుళ్యముగ వ్యాపించియుంటచే నవియే కడునాదరణీయములని చెప్పుచున్నారు. పూర్వపువాగ్గేయులకృతము లీముప్పదిరెండు మేళములందుమాత్రము చూతుమని వీరితలంపు. కొన్నిపుస్తకములందువలె చలనాట, గాంగేయభూషణి, వాగధీశ్వరి, శూలిని మున్నగు మేళములలో శ్రీత్యాగరాజుగారి కీర్తనములు కను పించుటగూర్చి చెప్పినప్పుడు వీరు వినినట్లు తచ్ఛారిశింగరాచార్యులు గా రొనర్చిరని నమ్మెదరు. ఇందుకు మరియొకకారణము అపూర్వ రాగములందలి శ్రీ అయ్యగారికీర్తనము లట్లు పాడబడకపోవుట. శ్రీమాన్ సి. ఆర్. శ్రీనివాసయ్యంగారు శ్రీత్యాగరాజుగారి ముఖ్య శిష్యులగు ఉమయాళ్ పురం కృష్ణభాగవతర్, సుందరభాగవతర్, వీరిశిష్యులనుండియు దాము నేర్చిన అయ్యగారికీర్తనములు 'నిన్నే భజన,' 'నీసరియెవ్వరే,' 'పరమాత్ముఁడువెలిగే,' 'ప్రాణనాథ' మొదలగునవి ఆయారాగములుచలనాటు, గాంగేయభూషణి, వాగ ధీశ్వరి, శూలిని ఇత్యాదులందు పాడబడుట లేదనిచెప్పుదురు. వీనిని అయిదవచక్రమందలి రాగములజన్యములుగ బాడుట విదితమందురు.

మరియు ౪ వ మేళకర్త వనస్పతి[2]యందలి "పరియాచకమా", ౨ వ మేళకర్తజన్యమగు శ్రీమణిరాగమునగల "ఏమందునే విచిత్రము, రసావళి[3] రాగమునగల "అపరాధమోర్వ," ౫ వ మేళము మానవతియందలి "ఎవరితో దెల్పుదు" ఇందలిజన్యము మనో రంజనిరాగమునగల "అటుకారాదనిపల్క" మున్నగుకీర్తనములు మొదటిచక్రమున శాడవలసియుండగా నవి రెండవచక్రమున నొప్పించి పాడుట తెలియుదుము. ఇది తెలిసి కొందఱు అయ్య గారిపై తమకుగలకృతజ్ఞతను వెల్లడించుటకుకాబోలు నపూర్వ రాగములందలి అయ్యగారికీర్తనములు పుస్తకములందు కాననగువిధ మున నాయారాగములందే పాడవలయునని శాసించుచున్నారు. ఇందుచే సంప్రదాయమును వీడి వీరు కాలునకుదగిన చెప్పుల నమర్చు కొనుటకు మారుగ జెప్పులకుదగినట్లు కాలును మార్చుటకు జూచు చున్నారు.

ఇట్లు మొదటిచక్రమునగల రాగాంగములందును, జన్యరాగము లందును గలకీర్తనములు రెండవచక్రమునందలి రాగములందును, ఆరవచక్రమునగల రాగములందలి కృతులు అయిదవ చక్రమునందలి రాగములలోను నవీనగాయకులు పాడుచుంట విదితము. ఇందుకు కారణము ఈయపూర్వరాగములు వివాదిదోషయుతము లగుటయనియు జెప్పుదురు. కాని వివాదిదోషముగల ౧,

---

౧. ఈయన ౭౨ మేళకర్తలందు రాగాంగరాగగీతము నొనర్చెను.

౨. ఈరాగమందు 'మగరి' అనుఅవరోహణమున 'మమారి' అనిపలికించి గాంధారవర్జిత మొనర్పబడుట విదితము.

3. ఇయ్యదియు శుద్ధగాంధారవర్జితమగునదియే.

౬, ౭, ౧౨ చక్రములందలి రాగాంగములు, తక్కినచక్రములందలి తుదిమొదలురాగాంగములు మొత్తము నలువదిమేళములును గాన యోగ్యములుగ నెంచుతరి వానియందలి వివాదదోషమును పోనాడుటకై యవి సంపూర్ణసంపూర్ణములయు, నందలివివాదిస్వర ములను నేర్పుగ వర్జించియు, వానియందు గమకములనుజేర్చి రంజి తములగున ట్లొనర్చియు బాడుట యాచారమని తెలియుదుము. పన్నెండుచక్రములందలిప్రథమ మేళకర్తలలో 'ధనిస' ప్రయోగము నమర్చక 'ధస' అనిసంచరించియుంట పూర్వపువాగ్గేయులకృతు లందు చూతుము.

ఈసంగతులు వేంకటమఖిశిష్యపరంపరలోనివాఁడును, వాగ్గేయుఁడును, భక్తుఁడు నగుముద్దుస్వామిదీక్షితులకృతులవలనను తెలియ గలము. దీక్షితులు సంగీతమునగల తనయపారపాండిత్యమును ప్రకటించుచు గేయకల్పనలు వెలయునట్లు పైజెప్పిన నలువదియపూర్వ రాగాంగరాగములందుసహితము కీర్తనములు రచించి గానముచేసి యుండెను. ఇట్లు ౧-వ మేళమున "కనకాంబరి" అనుకీర్తనము, ౨-వ మేళమున "శ్రీదక్షిణాబృహదీశ్వరో" అనుకీర్తనము, ౪-వ మేళమున "బృహదంబ", ౫-వ మేళమున "బాలాంబికే", ౬-వ మేళమందు "నన్నుపరీక్షించ" ౭-వ మేళమున "జ్ఞానాంబికే", ౧౨-వ మేళమందు "శ్రీకృష్ణంభజరే" ౧౩-వ మేళమున "రామ చంద్రం", ౧౮-వ మేళమున "నరహరి", ౧౯-వ మేళమున "హిమాచలకుమారీం" ౨౪-వ మేళమున "వీరవసంత", ౨౫-వ మేళమందు "శరావతి" అనుకీర్తనములు, ౩౦, ౩౧, ౩౨, ౩౩, ౩౪, ౩౫, ౩౬ మేళములందు వరుసగ "నాగాభరణం", "కలావతి", "శ్వేతగణపతిం", "వరదరాజ" "కంజదళాయతాక్షి", "భోగచ్ఛాయనాట", "శ్రీశూలినీం" "స్వామినాద" అను కీర్తనములు ౩౭, ౩౮, ౩౯, ౪౦, ౪౧, ౪౨, ౪౩ మేళములందు వరుసగ "కామకోటి" "శ్రీవిద్యారాజ" "శేషాచలనాయకం" "నభోమణి" "సచ్చిదానంద" "హిమగిరి" "నమోనమస్తే" కీర్తనములు, ౪౭, ౪౮ మేళములందు "బృహదీశ", "శృంగారాది" అనుకీర్తనములు, ౫౪, ౫౫, ౬౦, ౬౧, ౬౬, ౬౭, ౬౮, ౬౯, ౭౦, ౭౧, ౭౨ మేళకర్తలందు వరుసగ "భక్తవత్సల", "శ్యామలాంగి", "నిషదాది" "శ్రీసుగంధికుంతలా" "గురుగుహా", "ఆనందామృతకర్షిణి", "పరంజ్యోతిష్మతిం", "మాతంగి", "శ్రీరమా", "కుసుమాకర", "రసమంజరి" కీర్తనములు పాడియుండెను. కావున డెబ్బదిరెండు రాగాంగములును గానయోగ్యములే యనియు వీనియందు (నలువది)వానిలో గలవివాదిదోషము నేర్పుతో బోనాడుట విదితమనియు సంగీతజితప్రజ్ఞుఁడు వీనిని సాధించగలడనియు నిట్లు చెప్పనొప్పగు.

శుద్ధగాంధారనిషాదములు, షట్శ్రుతిఋషభ ధైవతములు గల రాగాంగరాగములు సహిత మిట్లు గానయోగ్యములుగఁ దెలియుతరి ఈరాగములందుగల శ్రీ త్యాగరాజు గారి కీర్తనములు ఆయా రాగములచొప్పున పాడబడుటలేదని యెంచబడుచున్నదని పైన చెప్పియుంటిమి. శుద్ధఋషభ శుద్ధగాంధారములతో బాడవలసిన "మానవతి" రాగమునగల "ఎవరితో నేతెల్పుదు రామ" కీర్తనము చతుశ్శ్రుతి ఋషభసాధారణ గాంధారములతో జేర్చి నవీనులు పాడుచున్నారు. ఋషభమును గాంధారము నిట్లుహెచ్చించుట సౌఖ్యము కొఱకుకాఁబోలు. ౧౨ వ మేళకర్తరూపవతియందలి "నేమొరబెట్టితి" కీర్తనము షట్శ్రుతి ధైవతము, కాకలినిషాదములతో బాడుటకుమారుగ శుద్ధధైవతము కైశికనిషాదముల నొప్పించి తోడిరాగమున బాడుచున్నారు. ౩ వ చక్రము ౧౩ వ మేళమునందలి జన్యముగు జుజాహులిరాగమునగల "పరాకుచేసిన" కీర్తనము శుద్ధధైవతము శుద్ధనిషాదములతో బాడుటకుమారుగ గాయకులు చతుశ్శ్రుతి ధైవతకైశికినిషాదములతోఁ బాడుచున్నారు. ౪ వ చక్రమునగల ౧౯ వ మేళము ఝంకారధ్వనిలోనీ "ఫణిపతిశాయి" కీర్తనముకూడ పైదానివలె మార్చి చతుశ్శ్రుతిధైవతకైశికినిషాదములను చేర్చి ఖరహరప్రియయందలిరాగమువలె పాడుచున్నారు. ఇందలిజన్యముగు చిత్తరంజని రాగముకూడ షడ్జవర్జితముగఁ బైవిధమున చతుశ్శ్రుతికైశికి నిషాదములతో బాడుచున్నారు. ౨౫ వ మేళజన్యముగు "కేసరిరాగము"న గల "నన్ను కన్నతల్లి" కీర్తనము చతుశ్శ్రుతిధైవతకైశిక నిషాదములతో హరికాంభోజిజన్యముగఁ బాడుచున్నారు. ౬ వ చక్రమునందలి రాగాంగము శూలినియందలి "ప్రాణనాథబిరానబ్రోవరా" కీర్తనము ఇందలిజన్యముగాన వారధిరాగమునగల "దయజూచుటకు" కీర్తనము శంకరాభరణరాగమున బాడుచున్నారు. ఛాయనాటలోని "ఇదిసమయమురా" కీర్తనమున్నగునవియు మార్చఁబడినవి. ఇట్లు ౬ వ చక్రము రాగములు ౫ వ చక్రమురాగములవలె పాడఁబడుచుంట గమనీయము.

ఇఁక ౭-వ చక్రమునందలి ౩౯-వ ఝాలవరాళిలోని "కనకనరుచి", "నోచేమిశ్రీరామ" మొదలైన కీర్తనములు, ౮-వ చక్రమందలి శుభపంతువరాళియందు పాడుచున్నారు. శుభపంతువరాళిలోని "అప్పరామభక్తి" "నిన్నేనెర నమ్మినాను" "శివశివశివ యనరాదా" "వాడేరాదైవము" "రఘువర" మొదలగునవి ౯ వ చక్రమందలి ౫౧ వ కామవర్ధని మేళమందు పాడుచున్నారు. ౪౦ వ నవనీత మేళమందలి "లేమదెల్ప" కీర్తనము ౮ వ చక్రములోని ౪౬ వ షడ్విధమార్గిణి మేళమునను, నవనీత మేళజన్యముగు నభోమణి రాగమందలి "నాయెడవంచన" కీర్తనము ౪౬ వ మేళజన్యముగను పాడుచున్నారు. ౪౧ వ మేళము పావనిజన్యములు చంద్రజ్యోతి రాగములోని "శశివదన" "బాగాయెనయ్య" కీర్తనములు, విజయశ్రీరాగములోని "వరనారద" కీర్తనము ౪౭ వ మేళము సువర్ణాంగి జన్యములుగ బాడుచున్నారు. ౪౦ వ మేళము దివ్యమణి జన్యముగు జీవంతినిరాగమునగల "నీచిత్తము నాభాగ్యమయ్య" కీర్తనముగ మన

క్రమజన్యముగను, ౬౦ వ నీతిమతి జన్యరాగములగు నైకవసి, హంసనాదములందలి "వాచామగోచరమే" "బంటురీతి కొలువియ్యవయ్య" అనుకీర్తనములు చతుశ్శ్రుతిధైవతముతో బాడుచున్నారు. ఏకారణముననో ౧౨ వ చక్రమునగూడ శ్రీ త్యాగరాజుగారి కీర్తనములు కానము.

ఇట్లు అపూర్వరాగములందు గానబడు శ్రీత్యాగరాజుగారి కీర్తనములు ఏకారణముననైననేమి అచ్చుపుస్తకములలో దెల్పబడినరీతి ఆయారాగములందు పెక్కురు పాడుట లేదని తెలియగలదు. ఇందుకు కారణ మూహ్యమే. ఆయారాగములందలి కీర్తనము లట్లే పాడవలయునని శాసించుటకు బూర్వము త్యాగరాజుగారి సమ్మతము ననుసరించి ఆయారాగములం దయ్యవి రచింపఁబడెనా? అను సంశయమునుదీర్చవలసి యున్నది. శిష్యపరంపరగా వ్యాపకము జెందిన ఈకీర్తనములు పైన జెప్పబడినవిధమున బెక్కురు పాడుట యాచారమగుతరి వాని నట్లుకాక యచ్చుపుస్తకములందలి రీతి బాడుటకు గోరుట భావ్యమగునా యనునదియు నాలోచింపవలసి యున్నది. ఇందుకు నేటివిద్వాంసులు, దీక్షాలులు ఎవరైనను పైనజెప్పబడినవిధమున నపూర్వరాగములందలి అయ్యగారికీర్తనము లట్లే పాడగలుగుదుమని వాకొనినచో వారు గానకళ నభివృద్ధిజేయు తలంపుతో బెక్కుతావుల బ్రదర్శనములు గావించి కృతకృత్యులగుట ఎంతేని యావశ్యక మగుచున్నది. అప్పుడే పైరాగములన్నియు వ్యాపకమునకు రాగలవు. అంతవఱకు నేటిపద్ధతి యములునం దుండునని గ్రహింతుము. ప్రకృతమున నచ్చుపుస్తకములందలి వలె నపూర్వ రాగములలో శ్రీత్యాగరాజుగారికీర్తనము లెట్లు చేర్చబడినవియు నెంచుటకును, అందులకు గారణము లారయుటకుగల యావశ్యకతను స్ఫురించుటకును ఈవ్యాసము తోడ్పడిన చాలును.

మరియు వేంకటమఖిచే నేర్పఱుపబడి వీరిశిష్యపరంపరలోనివారగు ముద్దుస్వామిదీక్షితులచే నాదరింపబడిన డెబ్బదిరెండుప్రస్తారమేళములయొక్క పేర్లు కటపయాదినియమమును చాటుచున్నవనియు, నిప్పటివాడుకయందలి కనకాంగిమున్నగు పేర్లు ఈనియమము నంతగ ననుసరించుట లేదనియు, నిట్టులు పాఠకులు తెలిసి వీనియం దెయ్యవి యాదరణీయములో నిర్ధారణ చేసి నిష్కర్షగ సంగీతవిద్యార్థులకుఁ బలుకవలసిన యావశ్యకతయు నెంతేని కలదు. ప్రస్తారమేళములందలి తోడి, ధేనుక, నాటకప్రియ, కోకిలప్రియ, వకుళాభరణము, మాయామాళవగౌళ, చక్రవాకము, సూర్యకాన్తము, నఠభైరవి, కీరవాణి, ఖరహరప్రియ, గౌరీమనోహరి, చేరుకేసి, సరసాంగి, హరికాంభోజి, ధీరశంకరాభరణము, భవప్రియ, శుభపంతువరాళి, షడ్విధమార్గిణి, సువర్ణాంగి, నామనారాయణి, కామవర్ధని, రామప్రియ, గమనశ్రమ, షణ్ముఖప్రియ, సింహేంద్రమధ్యమము, హేమవతి, ధర్మవతి, రిషభప్రియ, లతాంగి, వాచస్పతి, మేచకల్యాణి, రాగాంగములు ముప్పదిరెండును, వీనియందలి ఉపాంగాదిజన్యరాగములును సంప్రదాయానుసరణముగ విరివిగ నందఱును ఇప్పుడు పాడుటకు గోరఁబడుచున్నారు. ఏలయన వీనియందుసహితము కొలదిమేళములు మాత్ర మిప్పుడు కరము వాడఁబడుటయు, దక్కినవానిని సరకుఁజేయకపోవుటయు గలదు. ఇయ్యవిమాత్రముకాక తక్కిన యపూర్వములనియెంచబడు నలుబది బృహన్మేళములు స్వరక్రమప్రస్తారము ననుసరించినవే కావునను వేంకటమఖి, ముద్దుస్వామిదీక్షితులు, శ్రీ త్యాగరాజు మున్నగువాగ్గేయులగీతములు, కృతులు మొదలగు విరచితములు వీనియందును కందుముకావునను మేధావంతులు, సంగీతకళాపరిశోధకులు ఇత్యాదుల కీమేళములు సాధ్యయోగ్యములేయని చెప్పవలసియున్నది.

---



ప్రతిబింబము -యస్. వి. యస్. రామరావు

(Head-Study)

తొమ్మిదవ అఖిలభారత గ్రంథాలయమహాసభ, చెన్నపురి



చెన్నపురి న్యాయకళాశాల ప్రాతినిధ్యసంఘ ప్రారంభోత్సవము



బొంబాయి ఇంజనీరింగుకాంగ్రెసు ఇరువదియవ సమావేశము



ముస్లిము ఎడ్యుకేషనల్ కాన్ఫరెన్సు, పూనా (అధ్యక్షులు: నవాబ్ సర్ అక్బర్ హైదరీ)

తల్లి! సరస్వతీ! మిగుల దాలిమిఁదాల్చి యనుంగుఁబుత్రు సం
ఫుల్లసితాబ్జనేత్రు ధరఁ బూరితభావ విలాసగాత్రు సం
వేల్లిత కావ్యగానరసవేత్త భవత్పదసేవపాత్రు యు
ష్మ ల్లలితాబ్జపాణి నిడి సారసలాలనఁజేయు భారతీ!

భాగ్యము లెన్నియున్న ధన మపారముగా గడియించియున్న సం
యోగ్యకులీనతం బడసియున్న సురూప విశేషసంపదల్
యోగ్యములైనదాన జనితోరుగుణంబులఁ గూడియున్న నీ
వాగ్యతనార్థికిన్ నరుడు వారిజనేత్ర! సముండుగా డిలన్.

శారద! నీయుదంచిత విశాలకృపాతతిఁ బర్వ మత్కృతా
పారసపర్య నందుకొని పామరజన్ములమైన మమ్ము నిం
పారగ నీదు భక్తవర ప్రాజ్ఞులఁజేయుము మాదు జీవితం
బారయ నీయధీనమొగఁ బండితలోకవిలాససుందరీ!

పలుకులఁ గుల్కు తన్మధురభావపుసొంపు కలావిశేషముల్
కలకలరాలు వాఙ్మధువికాసముగొల్పు రసప్రవాహముల్
పలుమరు ఏరు గ్రోలెదరొ! వారె రసజ్ఞులు చూడ మేదినిన్
గలికి! భవత్కృపారసమె గానమొనర్తు రనేకభంగులన్.

బీదలసాదలన్ వెతకి బీరమడంగి విలాససౌష్ఠవం
బాదరభావమున్ విడిచి యాదట దీనతఁ గుందుఁ బ్రాణులన్
నీదరిఁ జేరఁదీసి కరుణించి సువాగమృతంపుసోనలన్
ఔదల నల్లఁ జిల్కి యసమాచితిభావము లొందఁజేయవే!

కీరము లేమినోచెనొ! వికీర్ణసుధామయ వాగ్విలాస సం
స్కారప్రశస్తమాన మధుజాలముచే జగదాలవాలమై
గారవమొప్ప నిగ్గు పొడఁగాంచగజెందెను మానవాళి ప
ల్మారు తపస్సుఁజేసిన విలాసిని నీ దరిఁ జేరలేరుగా.

ఒకనికి శుద్ధపదోన్నతి వేఱొకని కనంతగానంబు నిముడఁజేయు
నొకనికిభావంబు నొప్పారఁజేసి వేఱొకనికి స్వరలయ లొందఁజేయు
నొకనిని వ్యంగ్య భావోన్నతుఁజేసి, వేఱొకని నాట్యంబులో నూపుచుండు
నొకని కానందవా ర్ధ్యున్నతినొసఁగి, వేఱొకని బ్రహ్మానంద నికరుఁజేయు

పసమ సాహిత్యసంగీతరసము లనెడు – గుబ్బపాలిండ్ల ధరియించి కోవిదాళిఁ
గరుణఁజూచుచు గాంచెడి కల్పవల్లి – విద్దెలమ్మర్గొ! కరుణింపు వినయమతుల.

పలుకులకొల్కి! నాహృదయపద్మమునన్ విడిదింటిలోన నిం
పలరగ నింతదాఁక హృదయంగమవౌచుఁ జరించి యింతలో
నలువపడంతి! యేగి తెటొ! నా కనుఁబ్రామి చరించెదమ్మ! యీ
యలరుల దోలఁ గైకొని దయామతిఁ బ్రోవుము శారదాంబ యో!

భారతీ నీదు నామసంస్మరణకలన – దురితభావము లెన్నియో దూరమయ్యె
నీదు భక్తసంరక్షణ నీదె కాదె? – సరస సద్గుణనికురుంబ శారదాంబ.

---

## 'కల్పలత-౪'

కాళూరి వేంకటనరసింగరావు

గుబురుగుబురులై దివి నల్లుకొన్న మొగలి – పొదలమాటున నిలచిమంపుగొనుమరుల
వేయిరేకుల నామెడ విసరినావు – ఏమి అనుబంధవాల్లభ్య మిది శుభాంగి?

పక్షపక్షమ్ము ప్రేమప్రబంధములకు – లక్షణమ్మల్లు నీచూపులన్ గరంగి,
నిత్యనూతనరుచుల నానెడుమనమ్ము; ఈ వాకకళాసరస్వతివే! నిజమ్ము.

శారదాచ్ఛరాకారామశారికా! దిశాని, శాంతములు బొబ్బరిల్లగ నాలపింతు
వేదా జ్యోతిస్సుధాస్వాదుసాధుగీతి – వినఁ దెటిపియేడ రాగశాలినులకందు?

కల్పలతల సుగంధ సంకల్పములకు – తోడునీడలౌ కెమ్మోవి తొగరుసంజ
లే నిలింపరాగిణి తులకించునీకు? – ఇరియు కౌగిండ్ల హేమంత మిష్వ డచట.

నాకశైవలినీ స్నాన నగ్నశోభ – దడిసి వలచు నీచల్లని దారులందు,
రాకరాకకు నీకళారసవిలీన – తన్మయులగు చుక్కల చెల్మి తమి వచింతొ!

ఏనముజ్జ్వలయాత్ర సాగింతు రీ ని–శీథపక్షమ్ములందు నెచ్చెలులు నీవు?
మెలనగవుల క్రొందెలిమబ్బు మలలరాల్చు – చలయికలవాలు జూపు లుపాయనమిడ.

ఇప్పు డీవెండికొండల నెక్కి యెక్కి – ఏయదృశ్యలోకమ్ముల లోయలందు,
మసలివత్తువొ, ప్రేమతమస్సమాధి – దొలచికొనివచ్చు కిరణశృంఖలలుజార.

ఇరులకురుల నీకయి నిరీక్షించు నన్ను, బలుకరింతు వగాధశోభల విరాళి;
కటికిచీకటి గగనగంగయునుబోలె – నాయెదన్ బ్రవహింతు వసంతకాంతి.

అర్చనము సేతువా నోము లారబండ – పున్నెములు పూచు పున్నమపొలములందు,
చిన్నతనమున తలదాల్చు కన్నతండ్రి – పదసుధాభిషేకమ్ముల పాలపాట?.

---

# కీ. శే. కేతవరపు వేంకటశాస్త్రిగారు

దివాకర్ల వేంకటావధాని

తనయమితజ్ఞానముపాం-దినరూపములైన గ్రంథనిధులకతోనన్
దెనుఁగును బోషించిన గురు-వినుతింతును గేతవరపు వేంకటశాస్త్రిన్.

మెడయెత్తి చూచినమీదనేగాని కానఁగరాని మూర్తి యున్నతి తలిర్ప
దర్శించువారి హస్తా లయత్నమ్ముగా మొగిడించు కాంతిమన్ముఖముతోడ
మెఱకుఁడెందములలో మూలలందును దెల్గుతనము తోపించుభాషణము లోలయు
జగమెల్ల నావరింపఁగ నుట్టిపడు తేజు పదిలించుకొన్న దృగ్ద్వయము మఱియు
నేటికినిగూడ నామనోనేత్రమునకు-నెదుట నిలఁబడు వేంకటవిదుఁ డతండు
కీర్తిశేషుఁడటన్న దుర్వార్త వినియు - నమ్మనేరక శంకాపథమ్ము గొందు.

తన మనోవైశాల్యమును జెప్పకయచెప్పు కమనీయఫాలభాగంబుతోడఁ
దన నైష్ఠికత్వతత్పరత నుద్ఘోషించు నొసటికుంకుమబొట్టు మిసిమితోడఁ
దన యాంధ్రపండితత్వము వెల్వరించెడి నునుతెల్లమూర్ధవేష్టనముతోడఁ
తన సర్వైహికార్థవినిస్పృహత చూపు పరిపూతనిర్మమత్వంబుతోడఁ
గఱకుతుఱకుల తరవారి పరిచయమ్ము-నెఱుఁగనేరని పూర్వాంధ్ర ధరణిపతుల
భద్రమత్తేభగమన శోభనతతోడ-నాతఁ డెచటనో నడచుచున్నట్లెయుండు.

దైవము మచ్చరించిన కతాన భవద్గిరిరాణ్మహోన్నత
శ్రీవహనక్షమమ్మయిన చిన్మయమూర్తిని స్థూలదృష్టితో
భావనసేయగల్గు సిరిపట్టకపోయిన దంతెకాని మా
భావము లచ్చుగ్రుద్దుకొని పాయునె దానిని దేశికాగ్రణీ.

పాఠబోధనకలా పాటవమ్మున ముందు నిన్నెంచి యన్యు మన్నించవలెను
విద్యార్థిదౌశీల్య సద్యోపహృతికి నీ నేర్పెంచి పైపై గణించవలెను.
లసదుపన్యాసకల్పన నైపుణమున నీ తీఱెంచి వేఱు గుర్తించవలెను
ద్రష్టాత్మగౌరవో త్పాదనప్రతిభ నీ రూపెంచి యొండు పేర్కొనఁగవలెను
ఆంధ్రభాషానవల సమూహమునయందు-ముందు బొబ్బిలిరాయచూర్ముట్టడులను
ఎంచి యన్యము చెప్ప నూహించవలెను - నీయఖండము ప్రజ్ఞ వర్ణింపఁదరమె.

మన పూర్వాంధ్రధరాధినాయకుల సంపద్భోగవారమ్ము చూ
చినరీతిం గ్రమమేద కంచితరస శ్రీదుగ్ధవారాశిచే
తన గంభీరభవద్వచోనిచితిచేత న్నీవు వర్ణింప మా
నును తేడెందము లాదరించెడివి సూనూత్నస్వతంత్రేచ్ఛలన్.

ప్రమథుల కీశ్వరాగమము పాఠముచెప్ప శశాంకమౌళికిన్
దమము సవిగ్రహమ్మయినదా యనిపించు కలార్థికోటికు
త్తమగతి కోపాధ్యాయసముదాయము చెప్పెడి నీకు రెంటనే
యమరెడిదంట భేద మళికాక్షిని కంధరకాళిమమ్మునన్.

కవిసార్వభౌముసద్గ్రంథార్థములనెల్ల విప్పిచెప్పిన నీవివేకగరిమ
రసదోహలము పోతరాజుభాగవతమ్ము గద్యచేసిన నీయఖండబుద్ధి
సంస్కృతాంధ్రగ్రంథ జలరాశిగాంభీర్య మెఱుఁగఁజాలిన నీయహీనశక్తి
అంతేవసన్మాన సాంబుజన్మల(?) నార్కరోచిస్సు నీయాపచస్సు
నవలమణిదర్పణముల నీనాటి యాంధ్ర - దేశసాంఘికజీవితోద్దేశములను
ప్రతిఫలింపఁగఁజేయు నీమతివిభవము - మఱచిపోదుమె జన్మజన్మములకైన.

ఈకుంచితాకృతి నేమిసూచితమౌను విద్వద్వరేణ్యు గాంభీర్యగరిమ
ఈమహీప్రతిమలో నేమి చిత్రితమౌను కవిబిడౌజుని శాంతికలితరేఖ
ఈచిత్రపటమునం దేమికాన్పించును శాస్త్రిశేఖరుని వత్సలతపెంపు
ఈదోనెబొమ్మలో నేమిసువ్యక్తమౌ నాంధ్రపండితుని భాషాభిమాన
మీచిరుతవిగ్రహమ్మున నేమితోఁచు - నాంధ్రనవలావిధాత తియ్యందనమ్ము
నోరఁగఁబెట్టెడు పల్కుచక్కెరరసంబు - తనివితీరక యిట నిల్పుకొనుటగాక.

ఎడదనిండిన జగామెలమికి మారుగాకడకంట కన్నీరు కార్చునట్లు
జగమావరించు నీశ్వరమూర్తికుండగా చిఱురాతిగుడి ప్రతిష్ఠించినట్లు
నెఱమెచ్చుగొల్పు కిన్నెరదివ్యగీతికి కించిత్తుగా తలూగించినట్లు
ఆపాదమస్త మింపారుభక్తికి మారు లేచి దేవుని కంజలించునట్లు
పండితుఁడవౌచు మాకలాపాఠశాల - మండితముచేసి యిన్నాళ్లు మడిచినట్టి
నీకు నిర్జీవమైన యనిత్యమైన - పటము నిట నిల్పి సంతసంపడుదు మేము.

బ్రదికిన నీకు మాఱుగ కుఱంగట నిల్పుకొనంగఁజూతు మీ
యది కడకంట వత్సలత సంతగ మాపయి గ్రుమ్మరించునా
చెదరనిపల్కుతో సకలశిల్పమనోజ్ఞత నొల్కబోయునా
పెదవి చలింపఁజేసి వినిపించున కోకిలమంజులధ్వనుల్.

దెసలందెల్లెడ గల్గు నీప్రియతమాంతేవాసివర్గంబుపై
లసదాశీరమృతప్రసేచనముగల్గం జేయుచున్ సర్వదా
అసమానప్రతిభావిమోహితగురుస్వాంతుండవై యుండు మా
అసురారాతిసభాంతరాళమున నాహ్లాదంబుతో దేశికా.

---

# అన్యోక్తులు

తాళ్లూరి రాఘవయ్య

(పండితరాయల అన్యోక్తివిలాసమునుండి అనువాదితము)

విరసములగు దివసములఁ విపినవీథి
నివసనము చేయుపికరాజ! నేర్పుమీఱ
చలదనేకాళిగంధరసాల మొందు
వికసనమునొందునందాఁక వెరవుఁ గాంచు.

కలభ! భవదంతికంబును గాంతుసేయు
భ్రమరము నవజ్ఞసేయుట పాడిగాదు
దాన సుందరద్విరదసంతానమునకు
తథ్యముగ నలితతిశిరోధార్యము గద.

అమరతరుపుష్పసౌరభ్య మమరగాంచి
సకలకామ్యములను మనసారఁ బొంది
మధుప మన్యపుష్పాసక్తమతిని తివుట
నౌచితీభంగ మచ్చోట హత్తుకొనదె ?

మంజుగతి గుంజనము సేయుమధుపము నెడ
మాలతీ! మౌన మూనుట మాన్యమౌనె ?
దాతృవరసురతరుసముదాయములును
శిరమునందాల్చి మధుపముఁ జెలువుగాంచు

పికవరా! నీవొకండ వీవిపినమందు
మధురగానముసల్పుట మానుమోయి
కలుషితాత్మవిమూఢము కాకకులము
జాతిశంకామతిఁ నిన్నుఁ జంపకుండ.

తటిని మానసవీథినిఁ దఱచిచూడు
వింధ్యభువిజన్మనీదు పవిత్రముగద
శుష్కము వహించినను నీవు సుగుణవతివి
యుక్తమెట్లౌను నీకు రథ్యోదకంబు.

హంసమా! క్షీరనీరభాగాదరమున
సమయలంబనము స్నీవ సల్పినయెడ
జగతిలోఁ గులవ్రతమును సక్రమముగ
పాలనము సేయ నెవ్వండు పరిఢవిల్లు.

పత్రపుష్పముల్ శూన్యముల్ ఫలము సున్న
కంటకములు సంకటములై గడుసుమీఱె
బుర్బురా! నీయం దెట్టి సుబుద్ధిగాంచి
ఆశ్రయింతుము నిన్నేమి యాసఁ జేసి.

సంగతిప్రేమదాక్షిణ్యసమయములును
వాంఛితములును, దూరాన వర్జితములు
ఐన; లోకము సంతాపహరణమందు
ఉన్నతంబై ఘనాగమం బొప్పఁగాంచు.

రత్నములు రాజిలుచునున్న రమ్యమౌనె!
రాజితాభ్రభవదనమున్న రక్తియౌనె!
అర్ణవా! త్వజ్జలము తృషితాత్ములకును
తృప్తి నియ్యదు దాహనివృత్తిఁ జేసి.

వారణముచేయనొల్లమ వారణముగ
జహ్నుకన్యను జేరుమా! శంకవిడిచి
జాహ్నవీవీచిభంగంబు సల్పితివుట
యుక్తమౌ తరంగిణి! నీకు నుర్విలోన.

మహిమ నెన్నంగఁదరమె! యోమలయజంబ!
వాగ్విషయగోచరమె! నీదు వరగుణంబు
గరళమును గ్రక్కుచుండెడి నురగగణముఁ
బాలనము చేయుచుంటివి పరిమళముల.

దవదహనజటాజ్వాలా విదగ్ధములగు
పరిగలితలతానగములం బరిభవించి,
జలద! శైలశృంగములందు జలముధార
వితరణము చేయుచుంటివి విత్తమదము.

అగ్రమున ఘనగర్జితం బాలకించి,
"పరుషము"ని వికలత్వంబుఁ బడయవలదు
"సకలపీడాహరంబ"ని జలధరంబు
సఖుడ! వినలేదె? మనమున శాంతమూను.

సకలజగములవిదితంబు సౌరభంబు,
అద్వితీయంబు శైత్యంబు, యశముదీప్తి
దిశలఁగనుఁబ్రాకి మిగులంగఁ దేజరిల్లె
చందనమ! కాని యరయుమ శ్రద్ధఁజేసి.

నీదుకోటరములయందు నేర్పుమీఱ
వాస మొనరించుచును ద్విజిహ్వాళి సతము
గ్రక్కుచును విషజ్వాలలం గరుణదక్కి
ఇంపుగలనీదుగుణము భక్షించుచుండె.

స్థూల మతిబంధనదృఢంబు మూలమరయ,
శాఖములు మాంసలంబులు శతగుణములు,
దుర్గభూధరవాసంబు దుర్లభంబు,
విటపిరాజమ! నీకింక భీతియేల?

కాని మానసమందునఁ గరుణ విడిచి
వలయకీలితజ్వాలాలి కలితమగుచు
స్వాంతమున నాధిపీడనవార్యముగను
దాపముగఁ జేయుచుండెను దావవహ్ని.

"నిరతమేనునీచమ"నని నెమ్మనమున
దుంఖమొందకుకూపంబ! దోషమనియు;
నీదుహృదయంబుసరసంబు నిర్మలంబు,
పరగుణగ్రాహివైయీవు పరగుచుంటి.

చండకరవాలములమాడ్కి, సర్పరాజ
గరళమువిధానఁగ్రూరులై గానఁబడుచు
అంతరంగంబునందున నమృతరసము
చిలుకుచుండంగఁ గొందఱు చెలువుగాంత్రు.

---

# కామవిలాసము

యస్. విశ్వనాథశాస్త్రి

సత్యశీలముఁ గన్నసతి నెవఁడుముట్టు
    నింగలం బాడిఁగట్టి యెవఁడు నిదురించు
నిర్మలచరితంబె నిత్యునకుఁబ్రీతి
యాశ్చర్యమనిపించి యర్చించుజనము
స్థిరశీలవతిఁ గావఁ జెంతనే దివ్య
కాంతలు పదివేలు కనిపెట్టియుంద్రు

... ... ...

సతిమానభంగంబు సమకట్టు నెవఁడు
వినఁగానిమాటలు విన్పించు నెవఁడు
పడతికిశీలంబె పదనైనకత్తి
దానితత్త్వముఁ దెలియ ధాతకేఁ వశమె?

ఆవ్రతశక్తియు నాధర్మపథము
విప్పిచెప్పఁగ నాకు విధియైన నేమి
ఆత్మశుద్ధియు దాని కనువైన శ్రుతియు
నంతరించిన వాని కర్థంబు గాదు
నీవంటిపాపికి నిర్వీర్యునకును
నీకల్లు కొంపయే నిత్యభోగంబు
తెల్పకూడదు నీకు దివ్యతత్త్వంబు
మూర్ఖులవాదంబుఁ బూని యొప్పింప
బ్రహ్మకైనను వశమె? భావింపఁ దరమె?
నేలమట్టముదాక నీమాయకొంప
పడఁగూలనీశిరము పగిలి పోకున్న?
పశువ! ప్రకృతిఁదూఱ భావ్యంబుగాదు—

# ౭. ప్రకీర్ణకము




## పాఠశాలా ప్రపంచములు

గాయనం వెంకటశివుఁడు

ఒకనాఁటి ప్రాతఃకాలమున, దూరమున వింతవస్తు వొకమనుజుని కనులకుఁ గానవచ్చెను. కొంతసేపటి కది చలించునట్లుతోఁచెను. ఇం కొకింతసేపటి కది యొకమృగమువలె నుండెను. నడిచెసకువచ్చు చుండెడి యాజంతువు నరుఁడే యని యిపు డాతనికి గోచరించెను. దగ్గఱకువచ్చిన యాతనిముఖము తానెపుడో చూచినట్లు లావ్యక్తికిఁ గానఁబడెను. ఆతఁడు చేరువకు రాఁగా, ఇద్దఱును సోదరులమె యని గ్రహించి, వా రొకరినొకరు కౌఁగిలించుకొని సంతోషించిరి.

లోకములో విచిత్రసంఘటనలు పలుమా ఱిట్లు కలుగుచుండును పాఠశాలాప్రపంచములు రెండును వేర్వేఱు విరుద్ధసంస్థలని జనులు సామాన్యముగ నెంచుచున్నారు. ఇదివఱకు విద్యాలోకమునఁ గూడ నిట్టియభిప్రాయమె ప్రబలియుండెడిది. కాని, యిటీవల వీటి సంబంధమునుగూర్చి వారి మనస్సులలో మార్పుగలిగినది. భిన్నవిషయములు గావనియును, రెండింటికిని పరస్పరసంబంధమె కాక, దగ్గఱచుట్టరికముగూడ నున్నదనియును శాస్త్రజ్ఞు లిపుడు తలంచుచున్నారు. ఈరెండింటికిని అవినాభావసంబంధమె కాక అభేదము కూడ గలదని వా రిపుడు గ్రహించియున్నారు.

బాగుగ యోచించినచో, పాఠశాలాప్రపంచములకుఁ గల సన్నిహితసంబంధము మొదటినుండియు నేదోయొకవిధమున లోకము గుర్తించుచువచ్చినట్టె కానఁబడును. విశ్వమును విద్యాలయముతోను, పాఠశాలను ప్రపంచముతోను బోల్చిన యుపమానము లన్నిభాషలందును వ్యాపించియున్నవి. పాఠశాలకు సంబంధించిన పారిభాషికపదములు ప్రపంచరంగమెక్కి తాండవించుచున్నవి. బడిలోని 'చదువు,' 'శిక్షణ,' 'పాఠము,' 'బోధన'యును భాషలోని సామాన్యోపమానపదము లయినవి. ఇటులె లోకజీవితమందలి యంశములు విద్యాలయబాలుర యనుకరణములందు ప్రతిఫలించుచున్నవి. ఉపాధ్యాయుఁ డొకింతసేపు పాఠశాల కాలస్యముగవచ్చెనేని ఒకవిద్యార్థి యయ్యవారి యున్నతాసనమధిష్ఠించి, ముసిముసి నవ్వులతో సహాధ్యాయులకు గురువగుచున్నాఁడు. సెలవురోజులలో విద్యార్థులు ప్రపంచనాటక మభినయించి వినోదించుచున్నారు. విద్యార్థికూటము న్యాయసభగ మాఱుచున్నది. పెద్దవారియాలోచన లక్కఱలేకయె, వారిలో బలిష్ఠుఁడు రక్షకభటాధికారి యగుచున్నాఁడు. మేధావంతుఁడు న్యాయమూర్తికాఁగా, జిత్తులమారి హంతకునిపక్షమున, టక్కరిన్యాయవాది వాదింపఁదొడంగును. హంతృదోషమంత పూర్తిగ రుజువుకాఁగా, న్యాయాధిపతితీరుపు ననుసరించి, నల్లనివిద్యార్థికింకరు లిరువురు వానిని ఉరితీయుట నభినయింతురు. వట్టివినోదమున కాడు నిట్టియాటలందును విద్యార్థుల స్వభావ మొకింత ప్రతిఫలిత మగుచుండును.

పాఠశాలాప్రపంచముల కిట్టి పోలికలెకాక బాంధవ్యము కూడఁ గలదని భాష సాక్ష్యమిచ్చుచున్నది. విద్యాలయము సూక్ష్మవిశ్వమనియును, ప్రపంచ మొక స్థూలపాఠశాలయనియును మనము వాకొనుచుందుము. అనుభవగతముగాని చదువు 'చిలుకపలుకు' లనియు, సార్థకముగానివిద్య 'చాకలిచదు'వనియు మనము నవ్వుచున్నాము. ఈరెండింటికిని గల సంబంధమును కలలోఁ గనినట్టుగ గుర్తించినను స్పష్టముగను, పరిపూర్ణముగను, ఆచరణమునను మనము గ్రహింపలేకున్నాము. విద్యావిషయక పరిజ్ఞానమున ప్రకృతమునఁ గలిగిన యభివృద్ధివలన వీటికిఁ గల పరస్పరసంబంధము మిక్కిలి

స్ఫుటముగ మనకు గోచరించి, విద్యావిధానములం దెన్నియో మార్పుల కవకాశము గలిగించినవి.

పూర్వము మనదేశమందేగాక ఇతరదేశములందును విద్యాశాలకు ప్రపంచమునకును బొత్తిగ సంబంధము లేదనియే సాధారణముగ పరిగణింపఁబడుచుండెను. మీఁదుమిక్కిలి యీరెండింటికిని పరస్పరవిరోధముగూడ నారోపింపఁబడెను. విద్యకొఱకె విద్యనభ్యసింపవలెననియు, విద్యార్థులు పరమార్థమె ప్రధానమని యెంచిన లోకానుభవాతీతులగు ఛాందసులనియును పలువురు తలపోయుచు వచ్చిరి. ఇట్టి యభిప్రాయములను సమర్థించెడి సుద్దులతోను, సామెతలతోను ప్రతిభాషయును మాఱుమ్రోఁగుచున్నది. "నేతికి గిన్నె ముఖ్యమా గిన్నెకు నేయిముఖ్యమా" యను కఠిన సమస్యాపరిశోధనమున నేతిగిన్నె బోర్లించివైచిన "పరమానందయ్యగారి శిష్యులును" ప్రతివాఁడును తన్ను లెక్కలో వేసికొనక చూచి, తమజట్టుమొత్తము సంఖ్యలో నొక్కటి తగ్గెనని వగచిన "కాశీమజిలీల యాత్రాపరులును," లోకపరిజ్ఞానము లేని చదువుకొన్న జడుల కుదాహరణములు. మనదేశమున గొప్పవేదాధ్యయనపరు లొకవైపునను, అనుభవశాలులగు కృషీవలు లొకవైపునను సామాన్యముగ వ్రాలుచేయ నేరని యసహాయస్థితితోనె సంతృప్తినొందుట, విద్యను గుఱించిన విపరీతాభిప్రాయములకె కాక విద్యకు లోకానుభవమునకును వైషమ్యము గలదను విశ్వాసమునకుఁ గూడ తార్కాణముగ నున్నది!

బాగుగ నాలోచించినయెడల విద్యాశాలకును, ప్రపంచమునకును దూరవైషమ్యములు లేకుండుటయేకాక, అవి రెండును సన్నిహితసంబంధము గలవనికూడఁ దేలును. మనుష్యజీవితము, ఆశ్రమమునకు ఆశ్రమమునకును మధ్య నడ్డుగోడలు పెట్టిన భవనవిశేషము గాదు. నేఁటివిద్యకు రేపటిలోకానుభవమున సమన్వయము కుదురవలెను. ప్రపంచజీవితమునకు సహాయకారికాని చదువు నేలవిడిచిన సాము వంటిది. స్వీకరించిన విద్యకును విద్యాసంప్రదాయములకును విరుద్ధమగు జీవితము గడపువాని బ్రదుకు అడవిలోఁగాచిన వెన్నెలయె. శైశవమందభ్యస్తమగు విద్య యౌవనమందలి వృత్తివ్యాపార పారీణతకు దారి చూపవలెను. ఈసంగతి సిద్ధాంతమున సత్యముగను స్వాభావికముగను గానఁబడినను, బాహాటముగ ఆచరణమున కెక్కకున్నది. అట్లు జరిగినఁగాని, పాఠశాలకు ప్రపంచమునకును, విద్యకు విశ్వజీవితమునకును సమీపసంబంధ మేర్పడకయే యుండును. సామెతలోని "తీర్థమునకు తీర్థము, ప్రసాదమునకు ప్రసాదమును" వలె విద్యాలోకము బాహ్యప్రపంచమును పరస్పర సహాయకములు గాని భిన్నసంస్థలుగనె యుండిపోవును

తొలుదొల్త మనదేశమున దొరతనమువారు సాహిత్యమూలకమగు విద్యావిధానము నేర్పఱిచినప్పుడు విద్యార్థులనుండి జనసామాన్యమునకు నానాఁట విద్యాజలము స్రవింపఁగలదనియె యాశించిరి. కాని, విద్యాతోయములు చదువరుల హృదయ కుహరములలోనె యింకిపోయినవి. ఎంతకాలమునకును మనదేశమున అక్షరజ్ఞానము గలవారిసంఖ్య బాగుగఁబెరుగనేలేదు. దేశమంతటను నిర్బంధోచిత ప్రాథమికవిద్య యేర్పడిననఁ గాని, హైందవులలో విద్యావ్యాపనము బాగుగ జరుగదని యిపు డందఱును తలంచుచున్నారు. వ్యవసాయమె ముఖ్యవృత్తిగ నున్నట్టియు, ఇంటఁగల పిల్లలందఱును గూడ పాటుపడినఁ గాని సంసారముజరుగని బీదజనులు విశేషించి యున్నట్టియు మనదేశమున నిర్బంధోచిత ప్రాథమిక విద్యావిధానము నమలులో పెట్టుట సులభసాధ్యముగాదు. దీనికిఁ దోడు ప్రకృత మింకొకకష్టము కూడ సంభవించినది. ఉన్నతవిద్య నేర్చి, గొప్పపరీక్షల నిచ్చినవారె పలువురు పనులులేక యల్లాడుచుండఁగా ఏగొడ్లకాఁపుడుతోనో, కూలిపనితోనో పొట్టపోసికొని నెమ్మదిగఁ గాలక్షేపముచేయు పేదపిల్లల నాయాపనులనుండి తప్పించివైచి, చదువునేర్పి వారినుద్ధరింపఁబూనుట హాస్యాస్పదమని కొందఱనుచున్నారు: కాని, జనులలో నిరక్షరాస్యత యెంతో ప్రబలియున్న మనదేశములో నిర్బంధోచిత ప్రాథమికవిద్య ప్రారంభించుట కేదియు నడ్డురాఁగూడదు. విద్యావంతులలోను, తదితరులలోను నిర్వ్యాపారత యనునది యొక మనదేశములోనే కాదు, ప్రపంచమం దన్నిదేశములలోను ఇపుడు వ్యాపించియున్నది. విద్యావంతులలో నీనిర్వ్యాపారత పొడచూపకుండుటకును, దేశమందలి యజ్ఞానము రూపుమాయుటకును సాధనభూతమగు విద్యావిధానములు మన మాలోచింపవలెను. ఈవిషయమై అమెరికాదేశప్రముఖు లొకరు చేసిన విద్యావిషయకకృషిని మనము పరిశీలింతము.

అమెరికాసంయుక్తరాష్ట్రములలో బానిసత్వము తొలఁగిపోయిన స్వజాతీయులగు నీగ్రోజనులనుండి యజ్ఞానదాస్యమును బాపుటకై కృషిచేసి, కృతకృత్యుఁడైన బుక్కరు వాషింగుటను జీవితము, ఈసందర్భమున మనకు సత్సందేశ మొసఁగుచున్నది. బుక్కరువాషింగుటనుయొక్క స్వీయచరిత్రమును, అతఁడు టస్కీజీపురమున నెలకొల్పిన ఆదర్శప్రాయమగు పాఠశాలను గూర్చియును జదువఁగా, ఆకాలపు నీగ్రోజనులకును, మనదేశమందలి హరిజనులకే కాక, భారతీయులందఱికిని జాల పోలికలు గలవని స్ఫురింపఁగలదు. విశాలహృదయులగు అమెరికా శ్వేతవర్ణుల సాయమున, ఆ దేశమందలి నీగ్రోవారికి బానిసత్వమువదలి, రాజకీయస్వాతంత్ర్యము లభించెను. విశాలహృదయులగు బ్రిటీషువారి సానుభూతివలనను, ఉదారాశయులగు దేశభక్తుల నిరంతరకృషిచేతను, నానాఁట మనదేశస్థులకు రాజకీయ స్వాతంత్ర్యము లభింపఁగలదు. కాని, దేహపరిశ్రమచేయుట తమప్రతిష్ఠకు భంగకరమనియు, కడుపులో నీళ్లు కదలక కూర్చుండి పుస్తకపఠనము చేయుటయె స్వాతంత్ర్యానుభవమనియును ఆకాలపు నీగ్రోవారి యభిప్రాయము. దేహపరిశ్రమ చేయక పెద్దపరీక్షలం దారితేఱుటయు, దేశారిష్టములగు దురాచారములను తొలఁగించుకొనక, తమ సంఘోద్ధరణమునకు వీరభోగవసంత



మార్దంగికాచార్య అళ్వధాటి రామమూర్తిగారి షష్టిపూర్త్యుత్సవము  బందరు  అధ్యక్షులు  కా  నాగేశ్వరరావుగారు




రాష్ట్రేతరాంధ్రగ్రంథాలయమహాసభ, కల్యాణి. అధ్యక్షులు ; చిలుకూరి నారాయణరావుగారు



నెల్లూరు పవర్ లైట్ హౌసు ప్రారంభోత్సవము

మదరాసు భారతక్రైస్తవమంత్రి మహాసభ

ర్గాయుఁడెప్పుడో యవతరించునని కనులుమూసికొని కూర్చుండుటయు హైందవులకభిమతము. విద్య మేదస్సునకే కాక, హస్తమునకు, హృదయమునకును గూడ ఆవశ్యకమని బుక్కరువాషింగుటను స్వజాతీయులకు బోధించి, ఆరీతిని కార్యక్రమము జరిపి, దేశోద్ధరణము గావించెను. విద్య మేదస్సునకే కాక, హస్తమునకు, హృదయమునకునుగూడ ఆవశ్యకమని విశ్వసించి, తదనుగుణముగ విద్యనభ్యసించి, వృత్తివ్యాపారములునడపి, దురాచారములు తొలంగించుకొని, స్వయంనిర్మితదాస్యమును స్వయంకృషిచేతఁ బాపుకొనిననే భారతీయు లభ్యున్నతిని, స్వాతంత్ర్యమును బడయఁగలరు.

ఆలబామామండలమందలి టస్కీజీపురమున బుక్కరువాషింగుటను పూర్వము పాఠశాలస్థాపించినపుడు, నీగ్రోజనుల పరిస్థితులు, వారిమనస్తత్త్వమును, వర్తమానకాలపు భారతీయులపరిస్థితులను, మనస్తత్త్వమును జాలవఱకుఁ బోలియుండెను. అచటి జనసామాన్యము, కడుబీదదశలో నుండి, అజ్ఞానాంధకారమునఁ జెరలాడుచు వచ్చిరి. విద్యనుగుఱించి వారికి మనదేశీయులకువలెనే విపరీతాభిప్రాయములు గలవు. చేతులతోఁ బనిచేయవలసిన బాధ తప్పించునదియె విద్యయని వారు తలంచిరి. పెద్దపెద్దపుస్తకములు చేతఁబట్టి విమర్శన చేయక వానిలోని సంగతులు వల్లెవేయుటయె విద్యార్థిపరమావధి యని వా రనుకొనుచుండిరి. ఇంక దేహపరిశ్రమ చేయుటయె నీచమని నీగ్రోవారి తలంపు. ఒకనడివేసంగిదినమున ప్రత్తిచేనిలో పనిచేయుచుండు నీగ్రోసేద్యకాఁడొకఁడు, తనపని నిలిపివేసి, ఆకాశమువైపునకుఁ దిరిగి, "దేముడా! నా ప్రత్తిచే నింతగా కలుపువేసుకొనిపోయింది. ఎండ యింతచుర్రుమంటోవున్నది. నారెక్కలింత నొప్పి పెడుతోన్నవి. ఈనల్లోడికీ పని తప్పించేసి, ఏబోధకుడిపనో దయచేస్తూ!" అని దేవుని ప్రార్థించెనఁట!

ఇట్టి ప్రజలలో విద్యావ్యాపనముచేసి, వారి నుద్ధరింపఁగల బోధకులను సిద్ధముచేయుటకై యప్పుడు బోధనాభ్యాసన పాఠశాల స్థాపించిన వాషింగుటను, తన విద్యార్థులకు పుస్తకజ్ఞానముతో పాటుగ నేదో యొకవృత్తివిద్యయు, పరిశ్రమాభిలాషయు, పొదుపరితనమును గూడ నేర్పినచో, పాఠశాల విడిచినపిదప వారికి తప్పక జీవనోపాధి యేర్పడునని యోచించెను. ముఖ్యముగ పల్లెటూళ్లనుండి వచ్చిన యా విద్యార్థులకు గ్రంథపరిచయము గల్పించునపుడు, వ్యవసాయవృత్తి నుండి వారిదృష్టిని మరలించి, వారికి పౌరజీవితమం దభిలాషను గలిగించినచో వారికిని, వారిని బడికిఁబంపిన బంధువులకును తీఱని నష్టము గలుగఁగలదు. ఈసంగతి గ్రహించి వాషింగుటను వారిలో ననేకులకు బోధకవిద్యను గఱపినను, మరల వారు స్వస్థానములగు కుగ్రామములకుఁ దరలిపోవునట్లును, వారికి లభించిన క్రొత్త యూహలు, క్రొత్తశక్తియును వ్యవసాయమునకును, స్వజనుల నీతిమత జ్ఞానోజ్జీవనమునకును దోహదము లగునట్లుగను జేసెను. ఇటు లామహాశయుఁడు తాను విద్య నేర్పి నాయకులుగఁ బంపిన యువకులద్వారా, దేశీయుల యభ్యున్నతికి మిగుల తోడుపడెను.

పాఠశాల కట్టుట కొఱకు పెద్దబీడునేల సంపాదించిన వాషింగుటను అది శుభ్రపఱచుటకై మొదట తన విద్యార్థులసాయ మపేక్షింపఁగా వా రొకరిమొగ మొకరు చూచుకొనసాగిరి. విద్యాస్వీకారమునకును, భూమి బాగుపఱచుటకును గలసంబంధము వారికి బోధపడనేలేదు. ఇదిగాక, వారలలోఁ బలువు రదివఱకె యుపాధ్యాయులుగ నుండిరి. ఇపు డట్టివారు నేల బాగుచేయఁ బూనుకొన్నచో, తమగౌరవమునకు చేటువాటిల్లునని వారు సందేహించిరి. క్రియాపూర్వకముగా వారికి సంశయవిచ్ఛేదము చేయుటకై, పాఠశాలాధ్యక్షుఁడు వాషింగుటను, బడివిడిచిపెట్టినతోడనే, తాను గొడ్డలి మూపున నుంచుకొని అడవికిఁ బయనమయ్యెను. తమగురువె పాటుపడుటకుఁ గొంకకుండుటచూచి, శిష్యు లొక్కరొక్కరె పనిలోనికి వచ్చి యాయనకుఁ దోడ్పడిరి. ఇట్లనుదినము రెండవపూఁట పని చేసి, గురుశిష్యులు సుమా రిరువదియకరముల భూమి బాగుపఱిచి, అక్కడ పైరు వేసిరి.

ఇటు లాబోధకమహాశయుఁడు పాఠశాలారంభదశ నుండియు, తనశిష్యబృందమునకు, సాహిత్యముతోఁబాటుగ కృషి, గృహకృత్యములు నేర్పుటయెకాక, వారు నివసించుట కిండ్లు వారిచేతులతోనె గట్టించెను. ఆ విద్యార్థిసమూహ మా గురువునొద్ద గ్రహించినవి సామాన్యవిద్యయె కాక, పరిశ్రమయొక్క గౌరవ సౌందర్యములు కూడను పాటుపడుటను వారల కాయన యభ్యాసము చేసెను. క్రొత్తత్రోవలు త్రొక్కి ప్రకృతిశక్తులను, అశ్వబలమును, వాయుజలధూమవిద్యుచ్ఛక్తులను పరిశ్రమలం దుపయోగించు రీతులను వా రాయనయొద్ద నేర్చుకొనిరి. మొదట కాలు కదల్చుటకును, చేయి మెదల్చుటకును జంకుచుండెడి యావిద్యార్థిబృందము వారిపిమ్మటితరముల విద్యార్థులును, ఇవ్విధమునఁ గష్టపడి తమచేతులతోనె యాపాఠశాలావరణమున నలువదియిండ్లు కట్టిరి. ఇట్లు స్వయంసహాయము, స్వయంనిర్వహణమును, అందలి విద్యార్థులకు వెన్నతోఁబెట్టిన సుగుణము లయ్యెను. ఇట్లె, యిటుకలతీఁత, బండ్లచేఁత, వడ్రము మున్నగుపనులందు, ఆపాఠశాలావిద్యార్థు లారితేఱిరి. తమపిల్లలను జదువునేర్చుటకె బడికిఁ బంపితిమిగాని మోటుపనులు చేయుటకుఁ గాదని, విద్యార్థుల తలిదండ్రులు మొదట మూల్గిరికాని, వాషింగుటను వారి మొఱలు వినక, తనపాఠశాలలో నడుగుపెట్టిన ప్రతివిద్యార్థియు, నేదోయొక వృత్తివిద్య నేర్చుకొనవలెనని శాసించెను. దీనిఫలితము, విద్యార్థులకు ముం దపారలాభము గలుగుటయెకాక, ఇన్నాళ్లు నీవిద్యాలయమునెడ నుపేక్షవహించిన చుట్టుపట్టుల శ్వేతజాతివారు, ఇచటసిద్ధమయిన మంచిసామగ్రి కొని, జనోపయుక్తములగు నిట్టివస్తువులు నిర్మాణముచేసిన విద్యాశాలదెస సద్భావము వహించియుండిరి.

దూరపు అమెరికాపాఠశాలను గుఱించి నే నింతగాఁ బ్రస్తావించుటకుఁ గారణ మేమనఁగా పాఠశాలకుఁ, బ్రపంచమునకును గల సన్నిహితసంబంధము తక్కినవారికంటె వాషింగుటను విస్పష్టముగ గ్రహించి, ఈసూత్రముమీఁదనె తనబడిలోని విద్యావిధానము లేర్పఱిచి విద్యాబోధనమున పరిపూర్ణవిజయమువడసెను. అరణ్యములలోఁ దపస్సు చేసికొనుటకును, విహారములలో ధ్యాననిష్ఠ సలుపుటకును, తనశిష్యుల కాయన విద్యలో తరిబీదు చేయలేదు. విశ్వమునకు వినియోగించునదియె విద్యయనియు, సంఘమునకు సేవ లొనర్పఁగలదె చదువనియును ఆయన సంపూర్తిగ గ్రహించి, విద్యాలయమునఁదాము సంపాదించిన జ్ఞానఫలమును ప్రపంచాలయమున క్రియారూపమున సమర్పింపఁగల శిష్యవరులను సిద్ధపఱిచెను. ఆయన మతమున విద్యాశాలకు, విశ్వమునకు నభేదము. విశ్వజీవితమునకు శిష్యుని సంసిద్ధునిఁ జేయునదియె విద్యాశాల; విద్యాలయపద్ధతుల ప్రదర్శనరంగమె విశాలవిశ్వము. పడఁతికి పెండ్లినాఁడు పెట్టినినగలు రానట్టు శిష్యునికి బాల్యమున బడిలోఁ బట్టుపడని సుగుణములు, జీవిత నియమములు నొంటఁబట్టవు. పూవు తావులవలెను, సిద్ధాంతానుభవములవలెను- విద్యాజీవితములు కవలపిల్లలై. అనుభవరహితమగు పుస్తకవిద్య, నీరు చొరని యీఁతయు, కవిత లేని కావ్యరచనయును - ఇంతియ కాదు, విద్యయొక్క పరమావధి జ్ఞానసంపాదన మొకటియేకాదు. మనశ్శక్తు లన్నిటిని వికసింపఁజేయునదియె నిజమైనవిద్య. జ్ఞానశక్తితో పాటుగ మనకు దైవప్రసాదితమైన భావనాశక్తియు, ఇచ్ఛాశక్తియునుగూడఁ బెంపొందవలయును. గణితసాహిత్యాదులవలన జ్ఞానమును వలెనే, ప్రేమసౌహార్దాదులవలన హృదయమును, సత్క్రియాకల్పమువలన శీలమును పరిణతి నొందించుకొనుటకు చిన్ననాఁటినుండియు శిష్యుఁ డభ్యాసపడవలెను. ఏకకృషివలననె, ఏకకాలముననే, విద్యార్థి మనశ్శక్తు లన్నియు విజృంభింపవలెను. పిమ్మటి లోకజీవితము వలెనె విద్యాలయమందును విద్యార్థి మనశ్శక్తులు క్రమసాధన మూలమున నభ్యున్నతి నొందఁగలవు. అట్లుగాక, బాల్యమున సాహిత్యజ్ఞాన మొకటియె విద్యార్థికిఁ జేకూరినచో, సకాలమున నాతనికి సౌశీల్యము, కార్యదక్షతయును బట్టువడక, ఆతని జీవయాత్ర కుంటుపడియె సాగుచుండును.

రాజును జూచినకనులతో మగనిఁ జూచి మొత్తుకొనినమగువవలెనే, ఆదర్శప్రాయమగు టస్కీజీపాఠశాలాపద్ధతులను గాంచి మనదేశవిద్యాలయముల వైఖరిని పరికించు మన కెంతో యాశాభంగము కలుగును. హిందూదేశవిద్యాసంస్థలు సామాన్యముగ సాహిత్యవిద్యాబోధనమునకె యేర్పడినవి. మనదేశమున చిన్నపరీక్షలిచ్చినవారివలెనే, పెద్దపరీక్షలలో నుత్తీర్ణులయినవారును, అదివఱకెట్టి చేతిపనులును జేయనేర్చియుండక పోవుటచేత, ఏవృత్తివ్యాపారములకును దగియుండకపోవుటయెకాక, కాయకష్ట మావశ్యకమగు పను లనిన విముఖు లగుచున్నారు. "అందఱును అందల మెక్కిన మోయువారరుదయినట్లు," విద్యావంతులసంఖ్య పెరిఁగినకొలఁదియు, చేయుట కుద్యోగములు తగ్గిపోయి, వారు నిర్వ్యాపారు లగుట తటస్థించుచున్నది. దొరతనమువారి కొలువు, వైద్యము, బోధకవృత్తి, న్యాయవాదిత్వము, ఇవియె మనదేశమున సాధారణముగ విద్యాధికుల కాశ్రయము లగుచున్నవి. వీటిలో నిదివఱకె పెక్కండ్రు ప్రవేశించుటవలనను, చెన్నరాజధానిలో నుద్యోగనియామకమున నుమేజువారుని వర్ణపరిశీలన మాచార మగుటచేతను, వేలకొలఁది విద్యావంతులు జీవనోపాధి లేక యల్లాడుచున్నారు. బడిలో చేతిపను లెవ్వియు నేర్వకుండుటచేతను, మీఁదుమిక్కిలి కష్టపడుటయె నీచ మని యెంచుటచేతను, విద్యావంతుల కష్టములు మఱింత దుర్భరమైనవి. అంగడిలో కొనిన కానికూర యింటికిఁ దెచ్చుటకు రెండుకానులు పుచ్చుకొను కూలివాఁడు మన చదువుకొనినయువకులకుఁ గావలెను. అనేకప్రదేశములందు వలసినంతమంది వడ్రంగులు, కమ్మరులు, నేస్యకాండ్రును లేకున్నారు. వంశపారంపర్యముగ వచ్చెడి కొన్నివృత్తులు నానాఁట సమర్థతలేని విద్యావిహీనులపరమై యభివృద్ధి గాంచలేకున్నవి. దేశమందు ముఖ్యవృత్తియగు వ్యవసాయమె దీనికి గొప్పదృష్టాంతము. విద్యావంతు లిట్టివృత్తులలోఁ బ్రవేశించినచో, అందలిపనులు వారు వేవేగమె గ్రహించి, తమవిద్యాకౌశలముచేతను, బుద్ధిపాటవమువలనను, క్రొత్తత్రోవలుత్రొక్కి, ఆవృత్తులకు వన్నె తెచ్చిపెట్టఁగలరు.

కాని, ప్రస్తుత మట్లు జరుగకపోవుటచేత, విద్యావంతుల మూలముననె దేశము మఱింత నష్టములపా లగుచున్నది. పెద్ద చదువులకై పల్లెలువదలి పట్టణముచేరిన యువకులు, విద్యాపరిపూర్తి యైనపిదప స్వగ్రామమునకు మరలిపోవుట నీచమని యెంచి, తమ కుద్యోగము లభించినను లభింపకున్నను, పట్టణమునె కఱచిపట్టుకొనియున్నారు. బుద్ధిమంతులు, ప్రజ్ఞావంతులు నిట్లు ఏఁటేఁట విద్యకై పురములకు వలసపోవుచుండుటచేత పల్లెల కెంతో నష్టము చేకూరుచున్నది. ఆవిద్యావంతు లొకవేళ స్వగ్రామమునకు మరలివచ్చినను, వారునేర్చిన గ్రంథస్థవిద్య గ్రామవాస్తవ్యుల కంతగ నుపకరింపకున్నది. సేద్యము మున్నగు సామాన్యజనులపనుల నేవగించి, గ్రామజీవితమునఁ బాల్గొనక వారు ఎందును బొందని యొక ప్రత్యేకజాతిగ నేర్పడుచున్నారు! ఇంక విద్యావతుల సమాచార మాలోచింతము. మగవారి చదువె చదివిన మగువలును సామాన్యముగ దేశమునకుఁ గాకున్నారు. ఇంతియకాదు. క్రొత్తనీరువచ్చి ప్రాఁతనీటిని పాఱఁద్రోలినట్లు వారి యున్నతవిద్యామహిమముననా యని యనుమానపడునట్లు పలుచోట్ల గృహిణులకు గృహకృత్యములందు వైమనస్య మేర్పడుచున్నది! "చదువవేయఁగా ఉన్నమతియుఁ బోయినట్టుగ" మన విదుషీమణులు ఇంటిపనులు సొంతముగఁ జక్కపెట్టుకొననేరని యసహాయస్థితికి వచ్చుచున్నారు. పాఠశాలకును, గృహగ్రామ ప్రపంచములకును ప్రస్తుతమున మనదేశమునఁగల సామరస్యమిట్టిది!

ఇంక పాఠశాలా పౌరస్వత్వముల పరస్పర సంబంధముల నొకింత పరిశీలింతము. ఉన్నతవిద్యాప్రయోజనములలో నొకటి మంచిపౌరులను సిద్ధపఱచుటయె. కాని మనదేశమున నుపాధ్యాయులు మున్నగు విద్యాధికులు పురవిషయములందును, స్థానిక పరిపాలనా విషయములందును సామాన్యముగ తటస్థభావము వహించియున్నారు. కావుననె ప్రస్తుతమున మనదేశమున సామాన్యముగ స్థానికసంస్థల రాజకములగుట తటస్థించినది. తన వైదుష్యమును పురపరిపాలనమునందును, మండలపరిపాలనమందును వినియోగించి నిజయశస్సును, ప్రజాశ్రేయస్సును బెంపుచేసికొనవలెననెడి యాశయము సాధారణ విద్యాధికుని పట్ల మృగ్యము. ఇది కారణముగా, మన స్థానికసంస్థలు విద్యాస్వారస్యమెఱుఁగని మోటువారల కరములలో కీలుబొమ్మలై, జాతివైషమ్యములకుఁ బుట్టినిండ్లయి, అవినీతిపరుల కుక్షింభరత్వమునకు మాత్ర మనుకూలించుచున్నవి! ఇందలి గౌరవోద్యోగుల యెన్నికలు చేఁపలబజారుల బేరము లయిపోయినవి. వోట్ల యమ్మకము, వోట్ల వేలమును అభ్యర్థులకె కాక చూపరులకును, ఆవంతయు నాశ్చర్య విషాదములు గలిగింపకున్నవి. ఇట్టి యకృత్యములచే గెలుపొందిన గౌరవసభ్యులు, ప్రజాసౌఖ్యమును గాలికి విడిచివైచి, వంకరత్రోవలఁ దిరిగి, తమజేబు నింపును, విరోధుల ముంపును ముఖ్య ప్రణాళికగఁ జేసికొన్నారు. ఆవులపోట్లాటలో దూడలు నలఁగిపోవునట్లు, ఈదొడ్డదొరల పోరాటములలో పాల్గొని, స్థానిక పాఠశాలోపాధ్యాయులు పలుచోట్ల భంగపడుచున్నారు. ఈస్థానిక స్వపరిపాలనము దుష్పరిపాలనమునకు పర్యాయపదమై, ఎన్నఁటికిని భారతీయులు స్వరాజ్యార్హులు కారనిపించుకొందురేమో యని భీతిఁ దోఁపించుచున్నది.

దేశమిట్టి యనర్థములకు లోనగుట కొక ప్రబలకారణము, విద్యాబోధనకార్యక్రమము సవ్యముగ జరుగకుండుటయె. విద్యాసౌధమును మన మిన్నాళ్లను పైనుండి క్రిందికిఁ గట్ట నుద్యమించితిమి. ముసిఁడిగింజలనుండి ముంతమామిడిమొల్కలు మొలపింపఁ బూనితిమి! ప్రప్రథమమునుండియును విద్యాశకటము సరియైన మార్గమున నడువవలెను. ప్రారంభవిద్యారంభదశలోనె పారిశ్రామిక విద్యాబీజములు శిష్యుల హృదయక్షేత్రముల వెదఁజల్లవలెను. బుద్ధివికసనముతో పాటుగ విద్యార్థి చేయికూడ బాగుగ తిరుగనేర్చియుండవలెను. మన బాలబాలికలు సాహిత్యముతో పాటుగ తమ యింటిపనులు, కొంచెము కొంచెముగఁ దమవృత్తిపనులును, జేయనేరువవలెను. "చెట్టయివంగక మ్రానైవంగునా?" ప్రాథమిక తరగతులలో లెక్కలు, వ్రాఁత చదువులునెగాక, శరీరవ్యాయామము, సత్యసంధత ధర్మచింతనమును విద్యార్థుల కావశ్యకపాఠములు గావలయును. ఉన్నత పాఠశాలలో సాహిత్యవిద్యతోఁగూడ నొక కర్మవిద్యయందలినైపుణ్యము, పరోపకారచింతనమును, విద్యార్థియందుఁ గనఁబడవలెను. కళాశాల చదువులు ధనికులపిల్లలకును, మేధావంతులగు యువకులకునె యేర్పడవలెను. అందు నేర్చినవిద్య, శిష్యునికి విశాలభావము లొనఁగూర్చి వాని యభిమానవృత్తికి వన్నె గొనిరాఁగలదు. అన్ని తరగతుల విద్యాలయములందును విద్యార్థుల దేహమనశ్శక్తుల వికాసమునకును, నీతిపరిపాకమునకును సహకారమగు విద్యనే కఱపవలెను. అట్లు చేయునపుడె విద్యాప్రపంచమునకును, లౌకికప్రపంచమునకును దగు సమన్వయ సామరస్యములు సమకూరఁగలవు.

ఇట్లు క్రమపద్ధతిని విద్యాశకటము సాగిపోయినను, దానిచక్రముల కడ్డుదగిలెడి గొప్ప సాంఘికప్రతిబంధక మొకటి యింకను నిలిచియె యుండును. అపుడైనను సంఘములో నొక చిన్నభాగమునకె విద్యాతేజము ప్రసరించి పెద్దభాగమును నిబిడాంధకారమునందె యుంచివేయును. ఎంత సునిశితవిద్యావిధాన మమలులోనికి వచ్చినను దానివలని లాభ మనుభవించువారు క్రొత్తకారువారె కాని, ప్రాఁతకారువారు గాదు. అజ్ఞానతిమిరమున చిరస్థాయిగ నుండెడి యీ పామరజనసమూహమె, ఏజాతి సర్వతోముఖాభ్యుదయమునకును, "పానకములోని పుడక" లగుచున్నారు. వీరి మాంద్యమును గరఁగించి, అజ్ఞానతిమిరమును బాఱఁద్రోలెడి జ్ఞానతేజమును వీరిమీఁది కెట్లు పఱపఁగలమా యనునదియె ప్రస్తుతమం దన్ని నాగరికజాతుల నెదుర్కొనిన కఠినసాంఘికసమస్య. జనసామాన్యపు నిరక్షరాస్యత యను జగన్నాథరథమును గదలింపఁగలుగుటయె, నాగరికాగ్రగణ్యుల పరిపాలనాదక్షత కగ్నిపరీక్ష! సోవియటు రష్యాలో ప్రజలలో నూటికి ౯౧ మందియు, జపానులో ౯౯ మందియును అక్షరాస్యులుండఁగా, మనదేశమున వారిసంఖ్య యిరువదిమాత్రమె!

వెనుక చెప్పిన టస్కీజీలోను, మఱికొన్ని అమెరికాపురములందును సామాన్యజనుల కిటీవల ననేకవిద్యాసౌకర్యములు గావింపఁబడినవి. టస్కీజీపాఠశాల కనుబంధముగా నిపు డేర్పడిన "కదలుచుండుబడి"ని గూర్చి యొకింత ప్రస్తావించెదను. గ్రామొఫోను, ప్రతిమలు, పొలము పనిముట్లు, ఇంటివస్తువులును జేర్చియుండు నొకపెద్ద పెట్టె యొక బండిమీఁద ప్రతిమండలమందును సంచారము చేయుచుండును. ఏదో గ్రామమున నొకకాఁపువానివాకిట బండి నిలుచును. అచట గ్రామమున కొకతాత్కాలికవిద్యాలయ మేర్పడును. ఊరఁగల స్త్రీపురుషులు, బాలబాలికలును వేర్వేఱు తరగతుల విద్యార్థినీవిద్యార్థులగుచున్నారు. బండితో నేతెంచినయుపాధ్యాయులు, నుపాధ్యాయినులును, అనుదినోపయోగమునకుఁ గావలసిన చదువును తగిన యుపకరణములతో వారి కుపదేశింతురు. ఆరోగ్యము, గృహనిర్వహణము, పొలములు బాగుచేయుట, కోళ్ల పెంపకము, పశువులకాఁపు మున్నగు నంశములనుగూర్చిన సంగతులు వారికి నేర్పుచున్నారు. ఇండ్లకు సున్నముకొట్టుట, తోఁటబెంచుట మున్నగు పనులందలి సూక్ష్మమార్గములు మగవారాయుపాధ్యాయులయొద్ద గ్రహింతురు. తమయిండ్ల నెట్లు శుభ్రపఱుపవలెనో, పనికిమాలిన చింకిగుడ్డలు సయితము మెత్తలు గోతినీలక్రింద నెట్లు చేయవచ్చునో స్త్రీలు, బాలికలును ఉపాధ్యాయినుల శుశ్రూషచే గ్రహింతురు. సాయంకాల

ముందు గ్రామస్థులందఱును జేరి యాటలాడుకొనుపద్ధతి నేర్చుకొందురు. ఇవ్విధమున గ్రామవాస్తవ్యులగు స్త్రీపురుషులకు తమ యిండ్లయొద్దనె గృహకృత్యములను సతించియు, గ్రామజీవితమునుగూర్చియు నత్యావశ్యకమగు విశేషములు దృష్టాంతపూర్వకముగ బోధింపఁబడుచున్నవి.

ఏ దేశజనుల యభ్యున్నతికిని గ్రామపరిశ్రమాభివృద్ధియె పునాదియని గ్రహించి మహాత్మాగాంధియును, ఇపుడు రాజకీయరంగము విడిచి, భారతదేశమందలి గ్రామములలో శిష్యులతోఁ బ్రచార మొనర్చి, ప్రజాప్రబోధమునకుఁ గడంగుచున్నారు. ఏ దేశమందుఁ గాని, జనులలోఁ జాలభాగము గ్రామనివాసులె. విద్యానాగరికతల వాసనలు వీరికి సోఁకుట దుస్తరము. దేశాభ్యుదయమునకు గుదిబండ లగుచుండు నిట్టి పల్లెటూళ్ళవారి ప్రబోధమునకై మహాత్ముఁ డిఁక ముందు దేశసంచారము గావించును. గ్రామపరిశ్రమలకు సంబంధించినట్టియు, గ్రామవాసులవిద్య నీతి ఆరోగ్యములను వృద్ధినొందించుటకు వలసినట్టియు విషయముల నాతఁడు దేశీయులకు బోధింప నుద్యమించియున్నాఁడు. ఇదివఱకీమహాశయుఁడు ఖద్దరును వ్యాప్తిలోనికిఁ గొనివచ్చి అసంఖ్యాకులగు బీదజనులకు జీవనోపాధిని గలిపించెను. హరిజనుల దాస్యము తొలఁగించి, వారి దెస హిందూసంఘమును సుముఖముగఁ జేసెను. నిమ్నజాత్యుద్ధరణమున కెపుడును మహాత్ముఁడు బద్ధకంకణుఁడె. హిందూదేశమందలి గ్రామనివాసులుకూడ నొకవిధమగు నిమ్నజాతివారె. కావుననె వీరియుద్ధరణ మా పుణ్యపురుషునికి ముఖ్యకర్తవ్య మయినది.

మహాత్ముఁడు చేపట్టిన యీ గ్రామపునర్నిర్మాణ కార్యముయొక్క పర్యవసానము పాఠశాలను ప్రపంచములోనికిఁ గొనివచ్చుటయె! విద్యానాగరికతల పీఠమును చిరకాలావాసమగు పట్టణములనుండి కదలించి, పల్లెటూళ్ళకు తరలించుటయె! ఇదివఱకీగ్రామప్రపంచమును మనము నాగరికలోకములో లెక్క వేయనేలేదు. కోయలను కోదులను బోలిన యీమోటుజానపదులకును, నాగరికాగ్రగణ్యులమగు మనకును సంబంధము లేదనియె మనముకొంటిమి. మన నాగరికలోకమున వారికి నిలువనీడయె లేదు. హక్కులు, నధికారములును నామతః వారివికూడ నైనను, భుక్తమునకుమాత్రము మనవియె! వారిమీఁద మనము సార్వభౌమత్వము చెల్లించితిమి. వారి యప్పులు, వారి యాయవ్యయాదులును మనకు దుర్గ్రాహ్యములె. కాని, యిపుడీగాంధీ యైంద్రజాలికుఁ డీమోటువారి సరసనుజేరి, వారి కండయై నిలిచి, పరిస్థితులను తాఱుమాఱుచేయ సంకల్పించినాఁడు. "వెనుక గ్రామవాసులయొద్దనుండి నగరవాసులు క్రూరత్వముతోను, అవివేకముతోను అపహరించినదానిని మరల గ్రామవాసులకు వశపఱచుటకు" ఈయన పూనుకొనెను. ఇఁకముందు మనము "నవ్వినయూళ్లే పట్టణములు కాఁగలవు." కుగ్రామములు పులుగడిగిన ముత్యములు కావచ్చును. నరకకూపము లనియు, కంటకసదృశము లనియు మన మేవగించిన పల్లె లిఁకముందు సకలసౌభాగ్య సౌకర్యములతోను దులఁదూఁగుచు, భారతమాత విహారోద్యానములుగఁ బరిణమించునేమొ!

ఈసందర్భమున పాఠశాలాప్రతినిధుల కర్తవ్య మేమి? నిజమారసినచో ఉపాధ్యాయత్వము పొట్టకూటికై వారు చేకొనిన వట్టి కూలిపని గాదు. ఈశ్వరసందేశానుసారముగను, మానవ సంసేవనార్థముగను బోధకమహాశయులు స్వీకరించిన యొకదీక్షాజీవితమె ధర్మజీవితమె యిది! అజ్ఞానమూఢత్వముల యునికిపట్టులను ముట్టడించి జ్ఞానజ్యోతి నందు ప్రతిష్ఠించుటయె వారి నియతధర్మము. ఒక్క పల్లెలలోననేల పట్టణములందును విద్యాగంధములేని జనులు తండోపతండములుగ నున్నారు. వయస్సుమీఱిన యీప్రజలు బడికిఁ బోవుట యసంభవము. కావున వారి నిలయములకె విద్యానిలయములు తరలిరావలెను. ఉపాధ్యాయులకుఁగల యెక్కువ తీఱికకాలము, వారి సచ్చింతయు, బోధనాకౌశలమును దేశాభివృద్ధి నరికట్టుచున్న జనసామాన్యముయొక్క నిరక్షరాస్యతను బాపుటకు వినియోగింపఁబడవలెను. ఏడాఁదికి మూఁడు పెద్దసెలవులు, వారమునకుఁగనీసము రెండు విశ్రాంతిదినములు, పగ లెనిమిదిగంటల యాటవిడుపును, అనుభవించునుపాధ్యాయులు, తోడి ప్రజలకు విద్యాప్రబోధము గలిగించుటయను పవిత్రకార్యమునకుఁ గడంగునపుడు వారి కెవరు తోడ్పడకుందురు? ఏసత్కార్యాచరణమునందును, వారిశిష్యులు వారికి శిష్యులెగదా. భాగ్యవంతులగు వర్తకులను, పలుకుబడిగల యుద్యోగులను, న్యాయవాదులను వీరు కూడఁగట్టుకొనినచో ధనవాక్సహాయములకు వీరి కేమి కొదువ? ఇంక బోధనాపద్ధతులు వీరికిఁ గొట్టినపిండియె; బోధనాపరికరములు కరములందలి యాయుధములె! ఇట్లు దేశమునుండి నిరక్షరాస్యతాపిశాచమును బాఱఁద్రోలవలెనని యొకమహాజాతీయసంచలనము గలిగి, చదివింప విద్యావంతులకును, చదువ పామరజనులకును ఉత్సాహావేశ మీతరుణమునఁ గలిగినచో, లోకమంతటి నాశ్చర్యమున ముంపఁజాలిన సర్వతోముఖాభివృద్ధి భారతదేశమునఁ బొడఁగట్టఁగలదు. అపుడె, వర్ణవర్ణమునకు, శాఖాశాఖకును గల నిరర్థకములగు నడ్డకట్టలు తెగిపోయి, జాత్యైక్యము పాదుకొనఁగలదు. ఇట్లు పాఠశాల ప్రపంచహృదయమున స్థాపితమై, ప్రపంచము పాఠశాలకు హృదయాకర్షకమై, రెండింటికిని సంపూర్ణసమన్వయ సామరస్యములు సమకూరునపుడె, విద్యాధిదేవత రాజ్యము పృథివీస్థలి నంతటను వ్యాపించి, విద్య సార్థకనామము వహింపఁగలదు.

---



# కావ్య కాలక్షేపము

తిరుమల రంగాచార్యులు

కాలము క్షణికమా, అనంతమా యనుచర్చ గడమీఁది సాము వంటిది. సోమరులు కానివారికిఁ గాలము క్షణికము; సోమరులకుఁ గాల మనంతము. ఇఁకఁ గావ్యములలోని నూతనదంపతులకుఁ గాల మెంతక్షణికమో వియుక్తులకుఁ గాల మంత యనంతము. తమ కనుకూలముగఁ గాలము జరుగుట లేదని వీరు సూర్యచంద్రాదులను, తుదకుఁ దమ్ముసృష్టించిన బ్రహ్మనుగూడఁ జెడఁదిట్టుచుండుట కావ్యపాఠకు లెఱింగినయంశమే!

తమకంటె విజ్ఞులగువారి సహవాసము తటస్థించినఁ, దమ పని యైన నటుంచి యోగ్యులగువారు వారితో సత్కాలక్షేపమునకుఁ గడంగెదరు. ఇఁక మూర్ఖులో, పనియున్నను లేకున్నను దమయట్టివారికై వెదకుచుఁబోయి యసత్కాలక్షేపమునకుఁ గడంగుదురు కాననే "కావ్యశాస్త్రవినోదేన కాలో గచ్ఛతి ధీమతామ్, వ్యసనేనచ మూర్ఖాణాం నిద్రయా కలహేనవా" యని పెద్దలు నుడివిరి.

దృష్టాంతముగ వివాహాదులందుఁ బండితుఁడు పండితునితోను, జూదరి జూదరితోను, మూర్ఖుఁడు మూర్ఖునితోను జేరి కాలము పుచ్చుచుందురు. పండితునిచేత పామరుని కెంతరోఁతయో పామరునిచేత పండితుని కంతయేరోఁత. కారణము : ఎట్టి మనోవ్యాపారము కలవారి కట్టివారితోడి కలయికయే యాహ్లాదకరముగ నుండుట.

ధీమంతులగువా రెట్లు కాలక్షేప మొనర్తురో యావిధము నించుక వివరించుటయే ప్రకృత వ్యాసోద్దేశము. ఎట్టికాలక్షేపమైనను దమకుఁగాని యితరులకుఁగాని, తాత్కాలికముగనే కాక సార్వకాలికోపయోగకరముగ నుండవలయుననుటయే విజ్ఞుల యాశయము. చూడుఁడు: జూదరులకుఁగూడఁ గాలక్షేప మానందజనకముగ నుండును. కాని యది తాత్కాలికమే. యోగ్యుల కావ్యకాలక్షేపమన్ననో వారికిఁ దాత్కాలికముగ నానందమును గలిగించుటయే కాక యపుడుకాని, పిదపఁగాని యితరుల కానందజనకముగా నుండఁ గలదు. ధీమంతు లుగ్గడించు కాలక్షేపశ్లోకములఁ గొన్నింటిని దిలకింపుఁడు:

"కిం సూర్యేణ విభాసతే? అఖిలవపుర్వ్యాప్తం కిమాహుర్బుధాః? ధూర్తః కిం బహుమన్యతే? అఖిలజనః కిం శ్రోతు ముత్కంఠతే?

కం భోక్తుం తరుణీ నకాంక్షతి? జనైఃకిం దుర్గమం సర్వతః? కిం వోపాత్తసమస్తపాపహరణం? దివ్యాపగాజీవనమ్."

ఇది అంతరాలాపమను పేరుగల శ్లోకము. అంతరాలాపమనఁగాఁ బ్రశ్నములును, ఉత్తరమును దనలో నిమిడియుండునది. ఈయుత్తరవాక్యము వివిధరీతుల మాఱుచునుండును. ఈ శ్లోకమున నేడు ప్రశ్నము లున్నవి. మొదటి యాఱుప్రశ్నముల కుత్తరములు కావలెనన్న 'దివ్యాపగాజీవనమ్' అను నుత్తరరూపమగువాక్యములో వరుసగ నొక్కొక్కయక్షరమును దీసికొని చివరధగు 'నమ్'తో చేర్చుచువచ్చిన నుత్తరము లభించును. ఏడవ ప్రశ్నమునకుమాత్రము అన్ని యక్షరములును వరుసగాఁ గలిపి చదువవలయును. ప్రశ్నోత్తరపద్ధతి యిది:

ప్రశ్నములు—౧. సూర్యునిచేఁ బ్రకాశించున దెద్ది?

ఉత్తరము—'దివమ్' (దినము)

ప్ర—౨. శరీరమునందంతయు వ్యాపించినదని దేనినందురు?

ఉ—'వ్యానమ్' (వ్యానమను వాయువును)

ప్ర—3. ధూర్తుఁడు దేనిని గొప్పగాఁ జూచును?

ఉ—'పనమ్' (పైకమును)

ప్ర—౪. జనులందఱును దేనిని వినఁగోరుదురు?

ఉ—'గానమ్' (పాటను)

ప్ర—౫. తరుణి యెవని ననుభవింపఁగోరదు?

ఉ—'జీనమ్' (ముసలిని)

ప్ర—౬. జనులు దేనిని ప్రవేశింపఁజాలరు?

ఉ—'వనమ్' (అడవిని)

ప్ర—౭. చేసినపాపములఁ దొలఁగించున దెద్ది?

ఉ—'దివ్యాపగాజీవనమ్' (గంగాజలము)

ఈక్రింది యంతరాలాపమున నుత్తరవాక్య మనులోమ విలోమముగా నెట్లుత్తరము లొసఁగునో పరికింపుఁడు :

"కేస్యుర్ధర్మార్థయః? కేవా క్షితిపతిపశగాః? కాస్తు ఖడ్గస్య భూషా?
ధాత్రీ కర్ణస్య కావా? చరమజలనిధిం కేగతాః? కోను ధాతుః;
దానార్థః? కిం నిషేధార్థకం? అథ కో ధారణార్థశ్చ ధాతుః?
కస్సర్వానందద స్స్యాత్? నృపతికరిముఖే భ్రాంతి కా? దానధారాః."

ఇందు మొదటి మూఁడు ప్రశ్నములకు నుత్తరములు లభించుటకై మొదటి తుదియక్షరముల నుత్తరవాక్యమునందలివానిని గలుపవలెను? ఎట్లన:                    ప్రశ్నోత్తరములు

౧. ధర్మనిర్వహణమున కెవ్వ రుపయోగింతురు?
'దారాః' (భార్య)

౨. రాజునకు లోఁబడియుండువా రెవరు?
'నరాః' (ప్రజలు)

౩. కత్తికి నలంకార మెద్ది?
'ధారాః' (పదను)

పిదప ౪, ౫ ప్రశ్నముల కుత్తరము లభించుటకై తలక్రిందుగా క్రమముగా రెండక్షరములు కలిపి చదువవలయును. ఎట్లన :

౪. కర్ణుని పెంపుడుతల్లి యెవతె?
'రాధా' (రాధ)

౫. పశ్చిమసముద్రమునఁ బడున వెవ్వి?
'నదాః' (నదనులు)

తర్వాత ౬, ౭, ౮, ౯ ప్రశ్నముల కుత్తరములు లభించుటకై యుత్తరవాక్యమునందు మొదటినుండి వరుసగా నొక్కొక్క యక్షరమునుమాత్రము గైకొనవలయు. ఎట్లన :

౬. దానార్థకమైన ధాతు వెయ్యది?
'దా' (డుదాఞ్ దానే అనుధాతువు)

౭. నిషేధార్థకమైన దెయ్యది?
'న' (లేదు)

౮. ధారణార్థకమైన ధాతు వెద్ది?
'ధా' (డుధాఞ్ ధారణపోషణయోః)

౯. అందఱి కానందమును గలిగించున దేది?
'రాః' (ధనము)

పదవప్రశ్నమున కుత్తరవాక్యమంతయు నుపయోగించుకొనవలయు. ఎట్లన:

౧౦. రాజులయు, నేనుఁగులయు ముఖముల నేవి ప్రకాశించును?
'దానధారాః' (దానధారలు, మదజలధారలు)

ఈక్రింది ప్రశ్నోత్తరరూపకమైన యంతరాలాపమును గనుఁడు.

"కం సంజఘాన కృష్ణః? కా శీతలవాహినీ గంగా?
కే దారపోషణరతాః? కం బలవంతం నబాధతే శీతం?"

౧. కృష్ణుఁ డెవనిని జంపెను?
'కంసం జఘాన' (కంసుని జంపెను)

౨. చల్లగాఁ బ్రవహించు గంగ యెద్ది?
'కాశీతలవాహినీ గంగా' (కాశికడఁ బ్రవహించు గంగ)

౩. భార్యలఁ బోషింప నాసక్తికలవా రెవరు?
'కేదారపోషణరతాః' (వరిపొలములఁ గాపాడువారు)

౪. ఎట్టి బలవంతుని చలి బాధింపదు?
'కంబలవంతం నబాధతే శీతం' (కంబళి గలవాని బాధింపదు.)

ప్రతిపాదమున నాద్యంతాక్షరసంయోగముతో నుత్తర మిచ్చు నంతరాలాపమును జిత్తగింపుఁడు :

"సీమంతినీషు కా శాంతా? రాజాకోఽభూద్గుణోత్తమః
విద్వద్భిః కా సదా వంద్యా? అత్రైవోక్తం నబుధ్యతే!"

౧. స్త్రీలలో శాంతురా లెవరు?
'సీతా' (సీత)

౨. గుణోత్తముఁడగు రా జెవ్వరు?
'రామః' (రాముఁడు)

౩. విద్వాంసులచేఁ బూజింపఁబడిన దెద్ది?
'విద్యా' (విద్య)

బహిరాలాపములు : వీని కుత్తరములు శ్లోకములనే యుండవు. యోగ్యులగువా రూహించి చెప్పవలసియుండును. ఈయుత్తరవాక్యములుకూడ వివిధగతుల నొప్పుచుండును. ఎట్లన:

"రామోయత్ప్రబభంజ కార్ముకవరం సీతావివాహే? పురా
భూమాపట్టణనామ కిం విలసితం? కృష్ణేన యన్మందిరమ్?

'యద్రాజ్ఞా ముపహారభూత ఫలసద్బీజంచ యత్తోక్తం
ఆరోహా దవరోహతశ్చ కుశలై శ్శైవ పంచాక్షరీ.'

ఈపద్యములోని నాల్గుప్రశ్నములకు నుత్తరములన్నియు ఐదక్షరములుకలవిగా నుండవలెను. అవి యనులోమముగ, విలోమముగ జదివినను ఒకేవిధముగ నుండవలెను. ఎట్లన:

౧. పూర్వము రాముఁ డెవనిధనుస్సు విఱిచెను?
'పంచాస్యచాపం' (శివ ధనుస్సును)

౨. భూమిలో నేపట్టణముపేరు వాసిగాంచినది?
'రంగనగరం' (శ్రీరంగము)

౩. కృష్ణునిచే నెవరియిల్లు ప్రసిద్ధికెక్కెను?
'నందసదనం' (నందునియిల్లు)

౪. రాజులకు గానుకగా నియ్యఁదగిన శ్రేష్ఠమైన ఫలము యొక్క విత్తన మెయ్యది?
'జంబీరబీజం' (నిమ్మవిత్తనము)

ఈప్రత్యుత్తరములు ముందువెనుకల నెట్లు చదివిన నొక్క రీతిగనే యుండును. సున్నలమాత్రము సవరించుకొనవలెను. ఇట్లు సవరించుకొనుట పూర్వసంప్రదాయము.

ఉత్తరపద మనులోమముగాను, విలోమముగాను నూఱుచు నర్థమునిచ్చు బహిరాలాపము:

"క్షోణీ కం సహతే? కరోతి కిని కా నృత్యం? శివాయాఃపతి
ర్భూతానాం క మయుఙ్క్త జీవహరణే? కా రామశత్రోః పురీ?
కం రక్షంతిచ సాధవః? పశుపతేః కిం వాహనం? ప్రోచ్యతాం
ఆలోమప్రతిలోమశాస్త్రచతురై రేకం ద్వయో రుత్తరమ్."

ఈశ్లోకములోని రెండుప్రశ్నములకు నొకపదమేయుత్తరము. కాన ఆఱుప్రశ్నములకు మూఁడుమాత్రమే యుత్తరములు. ఎట్లన:

౧. భూమి దేని నోర్చుకొనును?
'భారం' (బరువును)

౨. స్వర్గలోకమున నెవతె నాట్యమొనర్చు?
'రంభా' (రంభ)

౩. రుద్రుఁడు జీవులప్రాణముల హరించుటకై యెవరిని నియమించెను?
'కాలం' (యముని)

౪. రామునిశత్రుపట్టణ మేది?
'లంకా' (లంక)

౫. సాధువు లెవని రక్షింతురు?
'దీనం' (దిక్కులేనివానిని)

౬. ఈశ్వరునివాహన మెద్ది?
'నందీ' (నంది)

పద మొకటియైనను అర్థభేదముతో రెండుప్రశ్నముల కుత్తరము నిచ్చు బహిరాలాపము:

"కిం త్రాణం జగతాం? నపశ్యతిచ కః?కే దేవతావిద్విషః?
కిం దాతుః కరభూషణం? నిరుదరః కః? కిం పిధానం దృశాం?
కే ఖే ఖేలన మాచరంతి? సుదృశాం కిం చారుతాభూషణం?
బుద్ధ్వాబ్రూహి విచార్య సూక్ష్మమతిమం స్త్వేకంద్వయో రుత్తరమ్."

౧. లోకములకుఁ గాపెయ్యది?
'అంధః' (అన్నము)

౨. ఎవఁడు చూడఁజాలఁడు?
'అంధః' (గ్రుడ్డివాఁడు)

౩. దేవతల శత్రువు లెవ్వరు?
'దానవాః' (రాక్షసులు)

౪. దాతచేతి కలంకార మెయ్యది?
'దానవాః' (దానముచేయు చేతఁబట్టిన నీరు)

౫. కడుపులేనివా డెవ్వఁడు?
'తమః' (రాహువు)

౬. చూడ్కుల నడ్డగించున దెద్ది?
'తమః' (చీఁకటి)

౭. ఆకాశమునఁ గ్రీడ నొనర్చున వెవ్వి?
'వయః' (పక్షులు)

౮. స్త్రీలయందమునకుఁ గారణమైన సొమ్మెయ్యది?
'వయః' (ప్రాయము)

ఒక్కొక్కయక్షరముమాత్రము లోపించుచు నుత్తరమిచ్చు బహిరాలాపము:

"వసంతమాసాద్య వనేషు రాజతే వికాసి కిం వల్లభ పుష్ప ముచ్యతాం, విహంగమం కంచ పరిస్ఫుటాక్షరం వదంతి కం పంకజసంభవం విదుః."

౧. వసంతకాలము వచ్చినపుడు వనములందు వికసించియుండు మనోహరపుష్ప మెద్ది?
'కింశుకం' (మోదుగపువ్వు)

౨. ఏపక్షిని పరిస్ఫుటాక్షరములుకలదానిగాఁ జెప్పుదురు?
'శుకం' (చిలుకను)

౩. ఎవనిని కమలసంభవునిగాఁ జెప్పుదురు?
'కం' (బ్రహ్మను)

ఒక్కపదమే సంస్కృతపదముగను, తెనుఁగుపదముగను నగుచు నుత్తరమిచ్చు బహిరాలాపము :

"కస్మై ప్రసీదతే విష్ణుః? కి మాంధ్రాణా మతిప్రియమ్?"
ఆంధ్రగీర్వాణభాషాభ్యా మేకమే ముత్తరం వద.

౧. విష్ణు వెవరికిఁ బ్రసన్నుఁ డగును?
'చింతకాయ' (ధ్యానించువానికి)

౨. ఆంధ్రులకు మిగులఁ బ్రియమైన దేది?
చింతకాయ

ఇట్టివియేకాక పలువిధములైన బహిరాలాపములు, నంతరాలాపములును గలవు. మచ్చుకై కొన్నింటినిమాత్ర మిం దుదాహరించితి.

ఇవియేకాక కాలక్షేపమునకై ధీమంతు లుదాహరించు కర్తృ, కర్మ, క్రియా, సంబోధనములు మొదలగునవి గుప్తములుగా నుండుచుఁ, బ్రత్యుత్తరము లొసంగువారు ప్రతిభను జూపఁదగు శ్లోకము లెన్నియో కలవు. అందు సంబోధనగుప్తముగ నుండు నొక్క శ్లోకమును వ్రాయుచు నింతటితో విరమించి మఱొక్క సందర్భమున నాశ్లోకములఁ గూర్చి విపులిగఁ జర్చింతును.

"వట వృక్షో మహా నత్ర మార్గ మావృత్య తిష్ఠతి,
అత్ర సంబోధనం వక్తుః హైమం దాస్యామి కంకణమ్."

తా. ఇచ్చట గొప్పమఱ్ఱిచెట్టు త్రోవ నావరించుచు నున్నది. ఈశ్లోకమున సంబోధనము గుర్తించువానికి బంగరుకడియము బహుమతిగా నియ్యఁబడును.

సంబోధన మెచట నున్నదనఁగా "వట వృక్షః" అనుచోట. ఎట్లన 'వటో! ఋక్షః' అనిదీనిని విభజింపవలయు. పిచ్చుల కచ్చులు పరములగుచో నయవాయావాదేశ మగును. అపుడు తాత్పర్య మేమన "పిల్లవాఁడా, గొప్ప యెలుఁగుబంటి త్రోవ నావరించి యున్నది" అని.





అఖిలభారత చిత్రకళా ప్రదర్శన కార్యనిర్వాహకవర్గము, రాజమండ్రి



జపానులో వసంతోత్సవసందర్భమున యువతుల నృత్యక్రీడ



శ్రీ రామానుజాశ్రమము, బందరు



మదరాసు గవర్నరు కుమారులు (చివరనున్నది కాప్టైను)

# మార్గో సోప్

## అందరును వాడదగినది

ఈ మార్గో సోప్ శరీరమునకు బాల నుపకార మొనరించును. దీనిలో వేప నూనె కలిసియుండుటవలన విషక్రిములు నశించి దేహము పరిశుభ్రముగా నుండును.

"కాల్ కెమికో" అను ప్రత్యేకసాధనమువలన వేపనూనె శుద్ధిచేయబడును. అపుడు దాని చెడువాసనపోయి మంచి నాజూకు పరిమళ మేర్పడును. కాని గుణములో మాత్రము లోపము కలుగదు. దీనిని నిత్యము వాడుచున్న యెడల యితర టాయిలెట్ సబ్బు లన్నిటికంటెను మిక్కిలి ప్రయోజనకారిగా నుండును.

మార్గో సోప్ నుండి నురుగు సులభముగా వచ్చును. ఎంతటి నాజూకు శరీరములకయినను హాని చేయదు.




జంతువుల క్రొవ్వులేని శ్రేష్ఠమయిన సబ్బు.

## దీనితో సమానమయినది లేదు.

---




# "నీం టూత్ పేస్టు"

దంతములు ఆరోగ్యస్థితిలో నుండుటకు వేపచెట్ల యొక్క లేతకొమ్మలరసమును వాడుటయే కారణమను రహస్యము అనాది నుండియు మన పూర్వులకు తెలిసియే యున్నది. నీం టూత్ పేస్టులో అట్టి రసమే మిశ్రమము చేయబడి యున్నది. ఇదియేగాక ఆధునిక దంతవైద్యులు పరిశుభ్రతకువాడు యితర కొన్ని వస్తువులుగూడ చేర్చబడినవి. ఈ నీం టూత్ పేస్టునకు విషక్రిమిసంహారశక్తి గలదు. ఇది తగరపు గొట్టములలో నిండింపబడి యుండును.

## "నీం డెంటల్ పౌడరు"

(మార్గో ప్రైస్) ఇది పేస్టువలెనే పనిచేయును. నికిల్ మూత గలిగిన డబ్బీలలో నిమిడ్చబడి యుండును.

## కలకత్తా కెమికల్ కంపెనీ లిమిటెడ్.,

బాలిగంజ్ — కలకత్తా.

త్వరలో వచ్చుచున్నది!　　　　త్వరలో వచ్చుచున్నది!

అపూర్వమైన గొప్ప తెలుగుటాకీ

# శ్రీకృష్ణ తులాభారము



| | | | |
|---|---|---|---|
| రంగమార్తాండ కపిలవాయి రామనాథశాస్త్రి | ఆంధ్ర ఛార్లి చాప్లిన్ జోగినాథం | యస్. పి. లక్ష్మణస్వామి | యస్. జయసింగు |

| | | |
|---|---|---|
| మిస్ ఋషేంద్రమణి | మిస్ సభారంజని | మిస్ ప్రేమలత |

*For booking Apply to sole Proprietors:—*

**M. S. R. A. Gupta,**
**Managing Director.**

**Gupta & Co.,**
**3/7 Thathamuthiappan St,**
**MADRAS.**



కాశ్మీరయువతి

**(Kashmirian Woman)**

—V. R. Chitra



బ్రిటిషుసామ్రాజ్యపు పోటీపందెములందు పాల్గొనిన భారతీయులజట్టు



'ఆల్ ఆంధ్రఇంటర్కాలేజియేట్ డిబేటు'లో జయముగాంచిన ఆర్ట్సుకాలేజి విద్యార్థులు, రాజమర్ండి



౪౮-వ జాతీయమహాసభకు హాజరయిన ట్రాన్సువాలు భారతీయప్రతినిధులు



బెలూనుపై ఆకాశములో ౧౦ మైళ్ల ఎత్తునకుబోయి ౧౦౦౦ మైళ్లదూరమున దిగిన ప్రొ. మాక్సుకాసిన్సు (బెల్జియము)

# యంత్రయుగము

భారు గోవిందరావు

ప్రస్తుత యుగమునకు యంత్రయుగ మను పేరు నిడవచ్చును. మనము కేవలము యంత్రములపైననే యాధారపడుస్థితికివచ్చితిమి కాన త్వరలోనే మనకు మహావిపత్తు రానున్న దని యనేక పండితులు తలచుచున్నారు. ప్రాగ్యంత్రయుగమునకు పోవుటయన్న నది యసంభవమే. తప్పో, యొప్పో ప్రారంభించితిమి. చిన్న చిన్న సహకార పారిశ్రామికసంఘముల నేర్పరచి యంత్ర దుర్వినియోగ మును పోగొట్టి యంత్రమును కేవలము సద్వినియోగమే చేయుట కవకాశము లున్నవని కొందఱు తలచుచున్నారు. యథార్థ మేమనగా: మన దురదృష్టమునకును, తప్పులకును హేతువు యంత్రము కాదు. మనలోనే యాలోప మున్నది. మన స్థితిగతులను మార్చుటకు శక్తిగాని యుద్దేశముగాని యంత్రమునకు లేదు. మనము దానినేపనిలో ప్రయోగించిన నది యాపని చేయును. బొగ్గు, నూనె, యినుము, రాగి, కలప మున్నగు నుపయోజ్య వస్తువులను వ్యర్థముగ మనము యంత్రములమీద వ్యయపఱుతుమేని మన గొయ్యి మనమే త్రవ్వుకొనినవారము కాగలము. మనము గ్రామములలోని ప్రకృతిసౌందర్యము చెఱుతుమేని రాక్షసుల మనిపించుకొందుము. యంత్రముల సాధనముచే మనము పేదల డబ్బును కొల్లగొట్టుదుమేని భగవంతుని యాగ్రహము మనమీదికే వచ్చును గాని యంత్రముమీదికి పోదు. ఈసమస్య మనదేశములో నంతతీవ్రముగ లేదు. కాని దాని భవిష్యత్తుయొక్క సూచనలు గన్పట్టుచున్నవి. కనుకనే గాంధిజీ మున్నగువారు మనలను మేల్కొల్పి హెచ్చరిక నిచ్చుచున్నారు. ఈ యంత్రయుగలక్షణము లేవో సంగ్రహముగ విచారింతము.

౧౯ వ శతాబ్దప్రారంభమున కవులుగూడ యంత్రతత్త్వమునకు వ్యతిరేకముగ నుండిరి. యంత్రముయొక్క ఫలితములను జూచి వారు నివ్వెరపడిరి అంతకుపూర్వము యంత్రములు లేవు. షెల్లీ, బైరను మున్నగుకవు లీవిషయమై తమ భావములను వెలిబుచ్చిరి. కార్లైలు రస్కినులు గూడ యంత్రములవలన దేశ సౌందర్యము చెడిపోవుచున్నదని గోలపెట్టిరి. ఇతర యూరపుదేశములలో గూడ పరిస్థితి యిట్లేయుండెను.

ఈపరిస్థితులు విపరీతవేగముతో మారజొచ్చినవి. బ్రహ్మాండమైన పరిమాణము, శక్తిగల యంత్రములు తయారుకాజొచ్చినవి. వానికొఱకు విశేషవ్యయము, ప్రయాస, మనుష్యులు కావలసి వచ్చెను. శుభ్రపఱచుట, నూనెపెట్టుట, బొగ్గువేయుట, మరమ్మతు చేయుట మున్నగునవెన్నియో యవసరమాయెను. ఒకవిషయములో యంత్రములకు మానవులకు కంటె హెచ్చుశక్తియుండెను. అవి వారిని స్వాధీనపఱచుకొనినవి. మనము వానినెదుర్కొని వానిని నశింపుచేయవలెనా? మనప్రాచీన ఆటవికస్థితికి మనము తిరిగి పోవలెనా? ఇదియసంభవము. గతమును మఱల ప్రత్యక్షముచేయుట యెవరికిని సాధ్యముకాదు. యంత్రములు మానవులకొఱకు చేయబడినవి గాన నవి మానవులసేవకులుగ నుండవలసినవే కాని యజమానులుగ నుండరాదను నొకసత్యమును మనము గుర్తెరిగి యాప్రకారము వర్తించిన చాలును. మనశక్తి యంత్రశక్తికంటె గొప్పది. కావున దానిని స్వాధీనము చేసికొనవలెను.

౨౦ వ శతాబ్దములో నీసమస్య తీవ్రరూపమును దాల్చినది. యుద్ధానంతరపు టార్థికమాంద్యము, ప్రస్తుతపు యుద్ధసూచనలు, జాతీయప్రభుత్వములు యుద్ధపరికరములకొసగు ప్రోత్సాహము మున్నగునవి పరిస్థితులను మఱింతక్లిష్టము చేసినవి. అది పెద్దవిషయము కావున మనము విచారింపనక్కరలేదు. యంత్రము పారిశ్రామిక వృత్తిలో నెట్టిస్థానమున నున్నదనునదియే ప్రకృతవిషయము. మనకు కావలసిన సరకులేవియో వానినుత్పత్తి చేయుట కవసరమగు శక్త్యుపాయము లేవో యనునది మనప్రకృతవిషయము. యంత్రము మనకు తయారుచేసియిచ్చు సరకులను యావత్ప్రజాళికిని నందజేయుటయే మనయాశయముగ నుండవలెను. కార్మికుడు యంత్రములలో పని చేయుటనుగూర్చిన షరతులు కార్మికున కుపయోగించునట్లు మార్చవలెను. భవిష్యత్తంతయు రాబోవుసంఘముయొక్క నిర్మాణచాతుర్యముపైనను, ధర్మబుద్ధిపైనను నాధారపడియుండును.

పరిశ్రమలు తత్కర్తల లాభమునకేగాక ప్రజల లాభమునకు గూడ, ఉద్దేశింపబడెనని పారిశ్రామికులు గ్రహింపవలెను. మన

యభిరుచులను దృక్పథమును మార్చుకొనవలెను. కోర్కెలను తగ్గించుకొనవలెను. మనము వస్తువులకిచ్చు విలువనుబట్టియు, వానికై మనకు గల మమకారమును బట్టియు, యంత్రములు పనిచేయవలసియుండును. "సంఘములో ప్రతివ్యక్తియు సంఘమునకై ప్రతిదినమును కొంత శారీరకసేవ చేయుచుండవలయును. అది వీలైనంతవరకు బుద్ధికి సంబంధింపనిదిగ నుండవలెను" అని బెర్నార్డుషా చెప్పియున్నాడు. ఇది చక్కని యభిప్రాయము. ఈనడుమ బొంబాయిలో జరిగిన ౪౫-వ జాతీయమహాసభవారు ప్రతిసభ్యుడును కొంత శారీరకపరిశ్రమను చేయవలెనని నిర్ణయించిరి. అనగా దేశములోని బుద్ధిమంతులెల్లరు ప్రజాసామాన్యముతో నైచ్ఛికముగ సమానత్వమును పొందుటకు కోరుచున్నారని తేలుచున్నది. దేశములో సౌభ్రాత్రము, అభివృద్ధి, యీవిధముగా కలుగగలవు. ఇది కేవలము సామ్యవాదముకాదు గాని దానిచిహ్నములందుగలవు. విశేషముగ దారిద్ర్యముతో బాధపడుచున్న దేశములో నిట్టియుద్యమము లిప్పుడు బయలుదేరుచున్నవి. సహకారభావము, బాధ్యతాభావము, సంఘములోని ప్రతివ్యక్తికిని పుట్టవలెను. సామ్యవాదము మలుల్లో నున్న రష్యాలో ప్రజయు ప్రభుత్వమును గూడ నొక్కటియే. ప్రజాక్షేమమునకై పనిచేయవలెనను ప్రారంభములో బలవంత మవసరమే. క్రమముగా ప్రజలు దానిని సంతోషముతో చేయగలరు. హెచ్చు, తగ్గు, పేద, సాద, కార్మికుడు, పెట్టుబడిదారు అను భేదము లుండవు. ప్రతివ్యక్తియు సంఘక్షేమమునకై పనిచేయును. ప్రజలందఱకు నొకేవిధమగు భావము లుండకపోవచ్చును గాని వారు చేయుపని కంతకును నాశయ మొక్కటియే. ఇట్టి యాదర్శప్రాయమగు స్థితి సామ్యవాదము గల దేశములలోనే గాక యితర దేశములలో గూడ నుండవచ్చును. నేడు ప్రపంచములో విశేషసంఖ్యాక దేశములు పరిశ్రమప్రధానములు. అచ్చట కార్మికుల పరిస్థితిని బాగుచేయుట ఎట్లనిద్యే నేటి ప్రధానసమస్య.

అతి ప్రాచీనకాలమునుండి యిరువదియవశతాబ్దమువఱకు గల పనిముట్ల చరిత్రనుగూర్చి నాల్గుమాటలు చెప్పవలయును. పనిముట్లును, యంత్రములును గూడ నవసరమైనపుడు వినియోగించుకొనుట కుద్దేశింపబడిన మానవావయవములె మనకుగలశక్తి నవి వృద్ధిచేయును. మనశక్తిని మంచిపద్ధతిలో వినియోగించుకొనుటకు యంత్రము సాధనము. గాంధీగారు వామహస్తముతో రాట్నపుచక్రము త్రిప్పినపుడు తాను యంత్రముతో పనిచేయుచున్నట్లు భావించుట లేదు. ఏలన, నచట జరుగుచున్నపని యంతయు నాతని యవయవముల వలననే జరుగుచున్నది. పనిముట్టునకు ప్రోత్సాహ మొకజంతువుగాని, వాయువు నీరు మున్నగు ప్రకృతిపదార్థములుగాని యైనచో, నాపనిముట్టే యంత్ర మనిపించుకొనును. సాధారణమగు పనిముట్టునకే పిడి మున్నగు చిన్నెలు పెట్టుచో దాని రూపము మారును. అన్నిపనిముట్ల ననేకముల నొకేసారి పనిచేయించునది యంత్రము. అది యీవిధముగ ననేకులగు కార్మికులు చేయుపని నొకేసారిచేయును. కనుక యంత్రము మానవుని పనిని సులువుచేయును. అది మానవుని శక్తికి తోడ్పడును.

పెద్దయెత్తులమీద పరిశ్రమలు జరుగుట ప్రారంభమైన దినములలో యంత్రములు తిరుగుటకు గుఱ్ఱములను వానికి కట్టుచుండిరి. కావుననే నేటివఱకును 'హార్సుపవర్' అనుమాట కొంతయంత్రశక్తిని తేల్చుటకు వాడబడుచున్నది. కాలక్రమమున గుఱ్ఱములకు బదులుగ నీరు, గాలి, ఆవిరి వరుసగ వాడబడినవి. తుదకు స్వతంత్రమైన ప్రేరకయంత్ర మొకటి కనిపెట్టబడినది. దానివలన నొకేపర్యాయ మనేకయంత్రములు నడుపబడును. దీనికి ఆవిరి, గ్యాసు, పెట్రోలు అనువానిలో దేనినైనను వాడవచ్చును. పూర్ణముగ పెరిగిన యంత్రములో మూడుభాగములుండును. ౧. ఇంజను-అనగా మూలప్రేరకస్థానము ౨. మధ్యభాగము - అనగా శక్తిప్రసారక యంత్రము 3. యంత్రసాధనము-అనగా పనిచేయుభాగము. యంత్రములోనిశక్తిని గల్గించుటకే యాధునికకాలములో సైన్సులు ముఖ్యముగ నుపయోగపడుచున్నవి.

యంత్రము మనుష్యహస్తము లేకుండ స్వయముగ నేపనియు చేయలేని మాట వాస్తవమే. దానియందవసరమగు మరమ్మతులను మానవుడే చేయుచుండవలెను. అయినను నాధునికయుగములోని పారిశ్రామికస్థితి యంతయు యంత్రములమీదనే యాధారపడి యున్నది. యంత్రముల ననుసరించియే మనపారిశ్రామికస్థితి నేడతిత్వరితముగ మారుచున్నది. ఒక్కొకచోట నొకేపరిశ్రమ జరుగుటవలనగూడ లాభము కలుగగలదు. పూర్వకాలములో బండ్లనుచేయువారు, బల్లలుచేయువారు, చక్రములు చేయువారు, కంచరిపనులు చేయువారు వేర్వేరుగ నుండిరి. అట్టివివిధకార్మికు లొకేకార్ఖానాలో కలసి పనిచేయుటచే చాల లాభము కలుగగలదు. గతశతాబ్దపు టుత్తరభాగమున ననేకయంత్రములు కనిపెట్టబడినవి. అందొక్కొకటి యొక్కొక పరిశ్రమకు మిక్కిలి వ్యాపకమైనది. పెద్దయెత్తుపైన పరిశ్రమలను నడపినకొలదియు నెక్కుడు లాభకారిగ నుండును. తరువాత జాయింటుస్టాకుకంపెనీలు బయలుదేరినవి. క్రమక్రమముగ నీపద్ధతి పెరిగి పరిశ్రమలు విస్తారముగ వృద్ధిచెందినవి. దీనిని నవీన పారిశ్రామిక విప్లవ మనవచ్చును.

కార్ఖానాపద్ధతివలన పరిశ్రమలు కేంద్రీకరింపబడుట తటస్థించినది. అంతకుపూర్వము పరిశ్రమలు వివిధస్థలములలో జరుగుచుండెడివి. ఈకార్ఖానాలు బయలుదేరిన స్థలములు పెద్దపెద్ద పట్టణములైనవి. పల్లెలలో జనసంఖ్య పలుచబడినది. ప్రత్తి, ఇనుము మున్నగు వస్తువులలో నొక్కొకటి యొక్కొకపట్టణములో సుప్రసిద్ధముగ నున్నది. ఈనడుమ కార్మికులు కార్ఖానాగల బస్తీలోకాక సమీపగ్రామములలో కాపురముండి ప్రతిదినమును కార్ఖానాకు వచ్చుట యాచారమైనది. ఎలెక్ట్రికు సాధనములచే రాకపోకల సౌకర్యములు పెరుగుటచే నిది సాధ్యమగుచున్నది. విరివిగ సరకును చెలామణీ

చేయుట యనునది పారిశ్రామికచరిత్రలో తరువాతిమెట్టు. యంత్రములు విస్తారముగ పెరుగుటచే ప్రజల కందఱకును సరకులు సులువుగ లభ్యము కాజొచ్చెను. ఈనడుమ ప్రజలకు కొనుబడిశక్తి తగ్గుటచే సరకు తగినంత హెచ్చుగ నమ్ముడుపుటలేదు. గత శతాబ్దములో యూరపులోను, నమెరికాలోను జనసంఖ్య పెరుగుట యనునది పారిశ్రామిక చరిత్రములో మఱొక యంశము. ఈపరిశ్రమల మూలమున నంతర్జాతీయ సంబంధము పెరుగుట మఱొకవిశేషము. వివిధదేశములకు వర్తకసంబంధము నార్థికసంబంధము పెరిగినవి. రైళ్లు, మోటారులు, ఓడలు, విమానములు, టెలిగ్రాములు, వైరులెస్సులు మున్నగునవి ప్రపంచములోని దేశముల నన్నిటిని సమ్మేళనము చేసినవి. ప్రజలు, సరకులు, వర్తకులుగూడ నతిత్వరితముగ వివిధదేశములకు పోవుటకు వీలు కలిగినది. కుగ్రామములకు గూడ నిట్టి సౌకర్యములు గల్గినవి. పూర్వ మొకదేశములో యుద్ధముజరిగిన మఱొక దేశమువారి కేమియు సంబంధము లేకుండెను. నేడన్ననో యొక దేశమువారికిని మఱొక దేశమువారికిని నభేద్య సంబంధము గలదు. అంతే కాదు: ఒకదేశముయొక్క క్షేమముపైననే మఱొకదేశముయొక్క క్షేమ మాధారపడియున్నది.

యంత్రములవలన గల్గు లాభనష్టముల రెంటిని తూచి చూచుట యవసరము. పూర్వము యంత్రములు లేనప్పటి ప్రజలస్థితికిని నిప్పటి ప్రజలస్థితికిని గల భేదమును చూడవలెను. యంత్రయుగములో వివిధ దేశము లెట్టిపరిణామములకు లోనైనవి? యంత్రపరిశ్రమల కనుకూలములగు పరిస్థితు లొకకాలమున నుండవచ్చును. మఱొకకాలమున పోవచ్చును. సంఘర్షణ పెట్టుబడిధనముతో గాని యంత్రముతో గాదు. కొంతకాలముక్రిందట యూరోపియనుదేశముల కుండినస్థితి నేడు తూర్పుదేశములకు గలదు. సిగరెట్లు, బీడీలు మున్నగుపరిశ్రమలలో పిల్లలు నియమింపబడుటచే వారి భవిష్యత్తంతయు పాడగుచున్నది. నేడు కార్మికుడు, కళాకుశలుడు పూర్వముకంటె మంచి జీవనము గడుపుచున్నారు.

యంత్రములు పరిశ్రమలపై నెట్టిప్రభావము గల్గియున్నవో మనము చూతము. యంత్రములువచ్చి మనుష్యుని కష్టము కొంత తగ్గించినవి. చైనాలోను బర్మాలోను కూలివాండ్రు బండిలాగుట మున్నగుపనులు చేయుటచే నకాలమరణము నొందుచున్నారు. ప్రతి దేశములోను వడ్రంగు లిట్లు బాధపడుచున్నారు. కోతమిల్లులు మున్నగునవి కొన్నివచ్చి చాల మేలుచేసినవి. రాసాయనికపరిశ్రమలలోను, ఇంజనీరింగుపరిశ్రమలలోను యితరప్రమాదకర పరిశ్రమలలోను యంత్రము మానవులకు చాలమేలుచేసినది. కాని యింత మాత్రముచేత యంత్రము నపారముగ స్తుతింపరాదు. కావల్సిన దేమనగా కొంత దూరదృష్టి. సైన్సు సామాన్యప్రజల కందుబాటులో నుండవలెను. ప్రజలందఱు దానివలన లాభము నొందవలెను. యంత్రము మానవుడుచేయు పనులను తానే చేయుచున్నది ఈపనులన్నిటిని మానవుడే చేసికొనుచో నాతనికి చాల విసువు గల్గెడిది. ఇట్టివిసువు అచ్చుపనులు, కాగితపుపనులు మున్నగువానిలో నపారముగ గల్గును. నేతలోగూడ నిది గన్పట్టును. యంత్రముల ధ్వనివలన సమీపముననుండు ప్రజలకు నరములదౌర్బల్యము గల్గును. ఏబదిసంవత్సరములక్రితము మానవుడు కేవలము చేతులతోనే యీపని నంతయు చేసికొనువపు డాతని కింతకంటె నెక్కుడు కష్టము గల్గెడిదనుసంగతి మరువరాదు. నాడు పండ్రెండుగంటలు పనిచేయుటకంటె నేడు ౮ గంటలు పనిచేయుటయే హెచ్చు విసువును గల్గించును. ఇంజనీర్లు, ఎలెక్ట్రిషినులు మున్నగువారికి మాత్రమే పని విసువును గల్గింపనిదిగ నుండును. ఈవిషయమై గడచిన కొలది సంవత్సరములలో చాల వాఙ్మయము పెరిగినది.

కార్ఖానాలలో పనిచేయు కార్మికుల కెన్నివిధముల మేలు కలుగజేయబడుచున్నను నేడు వారిలో అసంతృప్తి పెరిగిపోయుచున్నది. దీనికిగల కొన్ని హేతువులను మనము విచారింపవలెను. కార్మికుడు నైసర్గిక వాతావరణమునుండి దూరము చేయబడుచున్నాడు. పుట్టుకతో మానవుడు భూమితోను, తెఱపిప్రదేశముతోను సంబంధముగలవాడుగ నున్నాడు. కావున పట్టణజీవితము, గృహములో చేయు పరిశ్రమలు వానికి చెడుగును చేసినవి. కావుననే యాతడు సెలవుదినములలో గ్రామములంట బోవును. సంపూర్ణమగు స్వాతంత్ర్య మున్నపుడే మానవుడు శ్రేష్ఠతమముగ పనిచేయును. కార్ఖానాలలోనుండు శిక్షణము ప్రకృతివిరుద్ధము. ఇన్ని గంటలు పనిచేయవలెననియు, నీపనినే చేయవలెననియు మున్నగునియమము లుండుటచే కార్మికుల శక్త్యుత్సాహములు సగము నశించుచున్నవి. ప్రాచీనకాలములో కార్మికుడు వ్యవసాయమునకు తోడుగ వడుకుటను, నేయుటనుగూడ వృత్తులుగ నవలంబించెడివాడు. కొంతకాల మాతడేపనియుకూడ చేయకయే యుండెడివాడు. యంత్రముల గందరగోళము వచ్చి కార్మికుని నరములను క్రుంగదీసినది. యజమానులకును కార్మికులకును నడుమ తగినసహకారము, సదభిప్రాయము కూడ కార్మికుని దుస్థితికి గల ముఖ్యహేతువులే. వీరిరువురును కలసిననేకాని యేలాభమును నుండదు. పెద్దయెత్తుపైన సరకులను తయారుచేయు పద్ధతికి ఫలితముగ నొకేవిధమగు సరకులు బయలుదేరినవి. అగ్గిపెట్టెలు మొదలు మోటారులవఱకును నిదేపద్ధతి. ఒకేపరిమాణము, నాణ్యముగల మోటారులు కొన్నిలక్షలు తయారగును. మఱొకపరిణామము నాణ్యముగల మోటారులు మఱికొన్నిలక్షలు తయారగును ఇట్లే యన్నిసరకులలోను నుండును. కొనదలచువాడు తన యభిరుచికి, శక్తికిని తగినదానిని కొనును. సరకును త్వరితముగను హెచ్చుగను తయారుచేయుటయందే శ్రద్ధవహింపబడుచున్నది. కాని చక్కగను పనివానితనముతోను తయారుచేయుటయందు శ్రద్ధవహింపబడుట లేదు. రాకపోకల సౌకర్యములు హెచ్చుగ నుండుటచే నాధునికయుగములో ప్రజల యభిరుచు లతి

త్వరితముగ మారిపోవుచున్నవి. ఒకప్రాంతమువారిని మఱియొకప్రాంతమువారు వెంటనే యనుకరించుచున్నారు. అచ్చు యంత్రములు, గ్రామఫోనులు, సినిమాఫిలిములు మున్నగునవి యాశయములయొక్కయు, మాటలయొక్కయు, దృశ్యములయొక్కయు నకళ్లను తయారుచేయుచున్నవి. ఈసాధనములతో ప్రజలను బాగుచేయుట కెట్లవకాశములు గలవో వీనితో దుష్ప్రచారము చేయుటకును నట్లే యవకాశము గలదు.

యంత్రనాగరికత నైతికముగను, నాధ్యాత్మికముగను, కళావిషయకముగను గూడ హానికరమని యనేకులు తలచుచున్నారు. కాని యథార్థమేమనగా: యంత్రముల నుపయోగించుట యెట్లో మనకు తెలియకపోవుటవలననే యీచిక్కులు గల్గుచున్నవి. కాని స్వతస్సిద్ధముగ యంత్రములలో దోషమేమియు లేదు. పారిశ్రామికయుగము యొక్క ప్రారంభదశలో యజమానులు మిక్కుటముగ నాశాపూరితులుగను, పనివారిపట్ల క్రూరులుగను నుండిరి. ఇప్పుడిపుడే పారిశ్రామికజీవితములో ప్రవేశించుచున్న దేశము లీపూర్వచరిత్రనుండి పాఠమును నేర్చుకొనవచ్చును. కార్మికులస్థితిని బాగుచేయుటకు సరకుల నందముగ చేయుటకును నిపుడు ప్రయత్నములు సాగుచున్నవి. ప్రకృతి, సైన్సు మనకు కల్పించిన యవకాశములను మనము పూర్తిగ వినియోగించుకొనవలెను. కావున యంత్రమును నిందించుటగాని, యంత్రమే దేవతయని పూజించుటగాని కూడదు. దానిని మనము తగిన విధముగ వాడుకొనవలెను.

యంత్రమునకు కార్మికునిపైగల ప్రభావమునుగూర్చి యించుక విచారింతము. యంత్రమువలన మానవుని నేర్పరితనము, పనివానితనము నశించుచున్నవని కొందఱు తలచుచున్నారు. వ్యాయామనైపుణ్యము, కళాకుశలత, నిర్మాణచాతుర్యము మున్నగు నేర్పరితనములనేకములు గలవు. వీని యన్నిటికిని యంత్రమువలన నెంత నష్టము వచ్చినదో విచారింపవలసినవిషయమే కాని యందుల కిచట తావు చాలదు. ఒకసంగతిమాత్రము చెప్పవలెను. పరిశ్రమలలో గల్గుచున్న మార్పులనుబట్టి చూడ ప్రజల నేర్పరితనములో నెట్టిమార్పులు గల్గుచున్నవో తెలియగలదు. యంత్రములమూలమున కార్మికులయు, శాస్త్రజ్ఞులయు నేర్పరితనముకూడ వృద్ధినొందుట కవకాశ మున్నట్లు తెలియగలదు. అనేకవిషయములలో యంత్రమునుండి మానవుని రక్షింపవలసియున్నమాట సత్యమే. యంత్రము మానవునికి స్వాధీనమైనదిగ నుండవలెను.

యంత్రముపట్ల కార్మికుల దృక్పథమును విచారింతము. వారివారి శక్తులను నభిరుచులను బట్టి వారిదృక్పథ ముండుట సత్యమే. రైల్వేయింజనుడ్రైవర్లు, మోటారుడ్రైవర్లు, ఎలెక్ట్రికలుఇంజనీర్లు మున్నగువారికి వారివారిపనులు చాల వినోదకరములుగ నుండును. కొందఱిపని సులువుగను, కొందఱిపని కష్టముగను నుండును. అందఱి పనులును గూడ సులువైనవిగను, వినోదకరములుగను చేయుటయే నేటియాశయమైయున్నది. జర్మనీ మున్నగుదేశములలో పరిశోధనలు సాగినవి. అన్నిరకములవారినుండియు సాక్ష్యములు గైకొనబడెను. వానిఫలితము లిట్లున్నవి: సాంకేతికాభివృద్ధివలన పనిలోని వినోదకరత్వము తగ్గనక్కరలేదు; పనిలో నేర్పరితనము గల్గినకొలదియు పని యానందజనకముగ నుండును; కొందఱకు బాధ్యతతోకూడిన పని చేయవలెనని యుండును. కొందఱకు పెత్తనముతోకూడిన పనిచేయవలెనని యుండును. శ్రద్ధయు నుత్సాహమును తగ్గినపుడు పని కష్టముగ కన్పట్టును. పనిచేయుటకు గల కారణములనుబట్టి కూడ పనియందలి యానందమో విసువుదలయో యుండును.

ఈయంత్రయుగములో మన మొకానొక విధమైన పెత్తనము చూచుచున్నాము. శాస్త్రపరిశోధనవలన యంత్రములు క్రొత్తరకములు కనిపెట్టబడినవి. అట్టి యంత్రముల నుపయోగించుట శాస్త్రీయమైన యాజమాన్యమను పేరున వ్యవహరింపవచ్చును. అనేకసంబద్ధవిషయములకు వాని నుపయోగించుటను 'రేషనలైజేషన్' అందురు. ఇవి యంత్రయాజమాన్యము యొక్క పరిణామములు. వానివిషయమై మన మిట విపులముగ విచారించలేము. కాని యొకసంగతి చెప్పవలెను. సరకుయొక్క యుత్పత్తికి తగినరీతిగ విధుల కావించుటకై చేయుప్రయత్నములవలన కొన్ని నష్టములును లాభములును కూడ గలవు. ఒకలాభ మేమన: సరకు వ్యర్థముగ పోదు. నష్ట మేమన: పనివారిసంఖ్య తగ్గిపోవును. కార్మికుల యోగక్షేమములను యజమానులు గమనింపకపోవుట పరిపాటియైనది. కార్మికులకును యజమానులకును సహకారసామరస్యములు కలుగవలెనునదియే యాధునికయుగ సందేశము.

యంత్రయుగముయొక్క ప్రధానలక్షణములు పైన తెలుపబడినవి. యంత్రముయొక్కచరిత్ర కూడ సంగ్రహముగ తెలుపబడినది. అంతర్జాతీయపరిస్థితుల ననుసరించి యంత్రయాజమాన్యములో వచ్చుచున్న మార్పులుకూడ పేర్కొనబడినవి. యంత్రయుగమును నిందించుటవలనగాని స్తుతించుటవలన గాని లాభము లేదు. యజమానులు, కార్మికులు, ప్రజలుకూడ యంత్రమువలన వీలైనంత హెచ్చు లాభమును పొందుటకు యత్నింపవలెను. భారతీయులు పరిశ్రమలవిషయమున పాశ్చాత్యుల ననుసరించుటకు కోరుచున్నారు. వారికి చాల యాటంకములు కలవనుట వాస్తవమే. అఖిలభారతజాతీయసభవారినడుమ గృహపరిశ్రమ పునరుద్ధారకసంఘము నేర్పరచిరి. చిన్నయెత్తులపై నడుపబడు పరిశ్రమల నుద్ధరించుటయే యీ సంఘమువారి యుద్దేశ్యము. ఈసమయమున శ్రద్ధ, దూరదృష్టి యవసరము. ఈచిన్న పరిశ్రమ లన్నియు నొకే పద్ధతిపై నడుపబడి పెద్దపెద్దపరిశ్రమలకు పూరకములుగ నుండుటమంచిది. నశించిపోవుచున్న పరిశ్రమలను పునరుద్ధరించుటయేకాక క్రొత్తపరిశ్రమలనుగూడ స్థాపింపవలెను. ఈ సంఘసభ్యులు మెలకువతోను చాతుర్యముతోను వ్యవహరింపవలెను. అట్లు చేయుచో వారు మనదేశములో రానున్న బ్రహ్మాండమైన పరి

శ్రమలకు పునాదులను వేసినవా రగుదురు. వ్యవసాయము మున్నగు పరిశ్రమలను మనమెన్నడును నిరాదరింపరాదు. వివిధసంఘములవారు తమతమ విధానముల ననుసరించి పనిచేయుచుండవచ్చును. మనరాజకీయపరాధీనతవలన మనగమనము కొంచెము మందముగ నుండునే కాని యసాధ్యముకాదు. మననాయకుల పారిశ్రామిక జ్ఞానముపైనను చాతుర్యముపైనను సమస్తము నాధారపడియున్నది. యంత్రయుగ మన కేమియో యీవ్యాసమున తెలుపబడినది. భారతీయు లపుడే యీయంత్రయుగద్వారమును ప్రవేశించిరను సంగతి స్పష్టముగ తెలియుచున్నది. ఈసమయమున భారతీయులు బహుజాగరూకతతో మెలగి యంత్రమునకు దాసులుకాకుందురుగాక! వారు యంత్రమునే దాసురాలినిగ గాని, మిత్రురాలినిగగాని చేసికొందురుగాక!

---

## కొందరి జాతీయచిత్రరచనయా?

(ఒక ఆంగ్లపత్రికయందు ప్రచురితమైన హాస్యచిత్రమున కనువాదము)





మెరీనాబీచి, మదరాసు. —శ్రీపాద దుర్గారావు.




# దేశభాషలు

పండిత సత్యనారాయణరాజు

సంఘమును బలిష్ఠమైనదిగను, జ్ఞానవంతమైనదిగను, ఆత్మగౌరవముగలిగినదిగను జేయఁగలుగునది దేశభాష.

దేశభాష సంఘముయొక్క అంతరంగమును బహిరంగపఱచును; బహిర్విషయమును అంతరంగమునకుఁ దీసికొనిపోవును.

భాషయే సంఘమునాయువుపట్టు. భాషను మఱచి యెట్టి దోహదమును గల్పించినను సంఘమునందుఁ బ్రాణము తిరిగి సంచారము చేయఁజాలదు. సర్వసంస్కారములకును భాషయే మూలము; ఇంకొకమార్గము లేదు.

ఆంగ్లేయభాష హిందూదేశమునకును, పశ్చిమఖండమునకును నొకసేతువు నిర్మించెననుమాట వాస్తవము. దానం జేసియే మనము పాశ్చాత్యసభ్యతాంతర్గతములగు నూతనాంశములను నేర్చుకొనఁగలుగుచున్నాము. కాని భారతవర్షముయొక్క భవితవ్యమంతయు నీ సంస్కారత్రయముపై నాధారపడియున్నది.

౧. రాజభాష దేశభాషగ నుండవలెను.

౨. విద్య యంతయు దేశభాషలమూలముననే కఱపబడవలయును.

౩. ఈరెండుఉద్దేశ్యములును క్రమముగ నెఱవేఱుటకు భారతవర్షమును దేశభాషాప్రయుక్తరాష్ట్రములుగ విభజింపవలెను.

రాజ్యపరిపాలనము పరభాషయం దెంతకాలము జరుగుచుండునో, అంతకాలమును దేశీయులకు రాజకీయశిక్ష యలవడదు. రాజకీయశిక్ష లేని దేశములోని ప్రజాసమూహమునకు స్వాతంత్ర్యము కంటకప్రాయము; నూతనవికాస ముండనేరదు.

దేశభాష రాజభాష కానియెడల దేశభాషకుఁ దగిన పరువుప్రతిష్ఠ లుండవు. ఎప్పుడు దేశభాష రాజభాష యగునో యప్పుడే 'బ్యూరాక్రసీ' యొక్క నిరంకుశాధికారము తగ్గి జనసామాన్యముయొక్క యాధిక్యము హెచ్చును. ఉత్తమవిద్యలు విద్యాలయములలో దేశభాషలలోఁ గఱపఁబడనియెడల నుత్తమగ్రంథములు దేశభాషలలోనికి రావు. ఉత్తమగ్రంథములు లేని ప్రజాసమూహము ఉత్తమకక్ష్యలోఁ బరిగణింపఁబడఁజాలదు.

దేశభాషలకే విశ్వవిద్యాలయములలోఁ బట్టభద్రత యొసంగఁబడినప్పుడు సర్వతోముఖమగు నభివృద్ధి జనసామాన్యము గూడ నందఁగలుగును; విద్యార్థులు పెక్కురు బయలుదేఱుదురు.

భాషలప్రకారమె రాష్ట్రము లేర్పడి, స్వదేశభాషలె రాజభాషలై, సకలవిద్యలును దేశభాషలయందె కఱపఁబడిననాఁడు దేశమున కొక నూతనదశ వచ్చును. దేశభాష రాజభాష యగుటతోడనే పరిపాలనతో దేశీయుల కైక్యసంబంధము గలుగును. పరిపాలకులకును, పాల్యులకును ఒకభాషాసంబంధ మేర్పడి యన్యోన్యవిశ్వాసమును, పరస్పరగౌరవమును కుదురును.

సమస్తవర్ణములను, నానాభావములను నేకసూత్రముపై నడుపఁగలుగునది యొక్క దేశభాషమాత్రమె. ఒక దేశమువారు మఱియొక దేశమును స్వాధీనపఱచుకొన్న తరువాత దానిని దమ యధీనమునందు ముందెల్లప్పుడు నుంచుకొనుటకుఁ జేయు ప్రయత్నములలో భాషయే ముఖ్యసాధనము. తనూమూలముననే పెఱవారి వివిధవికాసములను వికాసము నొందించి తమ సంప్రదాయసిద్ధాంతములు వారికి నంటఁగట్టఁబడుచున్నది. పరభాష బలిమిని జేసియె మన సమస్తవిషయములును వ్యత్యస్తములైనవి. పాశ్చాత్యభాషయు, దానంగల యాదర్శములును మనపిల్లలు ఉగ్గుపాలతోడనే జీర్ణించుకొనుచున్నారు. పాశ్చాత్యసిద్ధాంతరూపకమగు రక్తము మనబాలుర నాళములలోఁ బ్రవహించుచున్నది. పాశ్చాత్యభావరక్తమయమగు శరీరసౌష్ఠవముగల విద్యార్థి స్వదేశభాషలను, దేశభాషాసిద్ధాంతములను దిరస్కరించుటలో నాశ్చర్య ముండఁబోదు. పరభాషా ప్రాబల్యముచేతనే నేఁటి యువకులు (యువతీయువకులు, యువకులు) భారతీయనాగరికత పూర్తిగా విస్మరించి పాశ్చాత్యనాగరికతాప్రవాహమునం బడి దరిగానక కొట్టుకొనిపోవుచున్నారు. ఈ పోక యెందాఁక సాగునో తెలియదో యందాఁక మోక్షము లేదు.

జపాను, జర్మనీదేశములయందలి విద్యార్థుల కాయాయి ప్రభుత్వములు [illegible]గాని, ఫ్రెంచిభాషగాని వారమునకు నాల్గుగంటలసేపు నాల్గవతరగతినుండి నేర్పుచుండురు. అట్లే మన ప్రభుత్వమువారును [illegible] మనదేశీయులకు నేర్పఁజాలును.

[illegible]ఆంగ్లభాషాపాండిత్యమునకు ఫలము వారితో రాజకీయవ్యవహారములను జరుపుట, వర్తకవ్యాపారము నెఱపుటయును గదా! ఈరెండుకార్యములకొఱకును మన మిప్పుడు పడుచున్న శ్రమమును, కాలహరణమును, వ్యయమును ఎంతమాత్రము నవసరము లేదు. విదేశభాషగూడ నేర్చుకొన్న విద్య మనలో సరిగా జీర్ణము గాదు. ఒంటఁబట్టదు. దానిని మనము స్వతంత్రముగా వృద్ధి పొందించుకొనఁజాలము. నూతనమార్గములను ద్రొక్కలేము.

ఆంగ్లగ్రంథసంభవు లనందగిన విద్యాధికులకును, దక్కిన దేశీయులకును భావప్రపంచమునందు విశేషవ్యత్యాస మేర్పడినది. విద్యాధికులయభిప్రాయములు వేఱు; తక్కినవారియభిప్రాయములు వేఱు. ఈయిరుతెగలకును మనస్సు నొకయబాన్యత యేర్పడినది. ఇందువలన నుభయపక్షములలోను అన్యోన్యగౌరవము లేదు; పరస్పరవిశ్వాసము లేదు. ఆంగ్లవిద్యాధికులయభిప్రాయములో నింగ్లీషు చదువనివారు రజ్ఞానులు. ఇంగ్లీషుచదువనివారిమతము ప్రకారము ఇంగ్లీషువిద్యాధికులు భ్రష్టులు. ఈపరస్పరావిశ్వాసమే దేశౌన్నత్యమున కన్నివిధముల నాతంకముగ నున్నది. ఆంగ్లభాషాపండితులు స్వభాష బాగుగారాకయు, ఇంగ్లీషుపదముల వెనుకనున్న భావములు సరిగా బోధకాకయుఁ దమ యభిప్రాయములను స్వభాషలో వెల్లడింపఁజాలకున్నారు. పరిశీలనముతోఁ [illegible] దేశభాషలసాయముననే సాధ్య మగునుగాని తదన్యవిధమున సాధ్యముగాదు. దేశభాష విద్యావిధానమునకు అవలంబనమైనయెడల ప్రాచీననవీనములగు సకలవిద్యలకును నిసర్గమగు సామరస్యము గలిగి "జాత్యభివృద్ధి స్వప్రవర్ధిత" మను న్యాయము సార్థక మగును. సంఘమునకుఁ బుష్టియు, జాతికి గౌరవమును, బుద్ధికి వికాసమును, విద్యలకు సామంజస్యమును జేకూరును. విద్యాధికులు ద్విభాషులై యుభయప్రాంతస్థులలోను (ఆంగ్లేయులు - ఆంగ్లవిద్యాధికులు) నేకాభిప్రాయములను వ్యాపింపఁజేయుటకుఁ దోడ్పడును.

ఒకదేశమున జనులు ఉన్నతపదవిం జెందవలయునేని ఆదేశమున వ్యవహరింపఁబడుభాష యున్నతపదవిం బొందవలయు. భాష యున్నతపదవిం బొందుటకుఁ గవులు ఉత్తమగ్రంథములను వ్రాయుటయు, వానిని జనులు, మహీపతులు నాదరించుటయు జరుగవలయును. ఏకాలమునందు రచింపఁబడినగ్రంథములం దాకాలపువారి మనఃప్ర[illegible]ములు ప్రతిబింబితములై యుండును. నవీనసాహిత్యమునందు నవ్యాంధ్రదేశమునేకాదు, నవ్యభారతమునేకాదు, నూతనవిశ్వరూపము సందర్శింపఁగలుగుచున్నాము.

సరస్వతీకటాక్ష మెంతవఱకుఁ బ్రసరించునో యంతవఱకును మనము మనవాఙ్మయమును విస్తరింపఁజేయవలయును. నియమశృంఖలచేఁ గట్టుపడక బుద్ధికి స్వచ్ఛందప్రచారము నొసంగి నూతనమార్గములను గనిపట్టవలయును. పాశ్చాత్యపరిజ్ఞానమును బ్రోలి దేశభాషలకు నూతనజవసత్త్వముల నొసంగవలయును. కవిత్వము ఒక్కదేశమువారిది గాదు, ఒక్కకాలమువారిదియును గాదు. లోకానుభవము ననుసరించి జ్ఞానము వృద్ధియగుచుండును. జ్ఞాన మధికమైనకొలఁదియు నాదర్శములు మాఱుచుండును. కవుల వర్ణనములకును, వర్తమానకాలమునందలి జనుల మనఃప్రచారములకును సంబంధ ముండవలెను.

ఆంగ్లేయభాషయే జనులకు బోధింపవలయునని లార్డుమెకాలే ౧౮౩౫-iii-౭ వ తారీఖునఁ దీర్మానము చేసెను. ఆంగ్లేయభాషవలన జాతి, సంఘము, స్వాతంత్ర్యము, ఆత్మగౌరవము, స్వయంసహాయము అనుపదములభావము గ్రహించితిమి. నూతన విజ్ఞానమును, నవీనాదర్శములను బ్రాపించితిమి. కాని ౩౪ కోట్ల జనులలో నూటికి ౪, ౫ గురు మాత్రమె. తక్కిన జనసమూహమంతయు నధోగతియందున్నది. ఆంగ్లేయ విధమున లక్షసంవత్సరములు ప్రాధాన్యము వహించినను జనసామాన్యము అధోగతినుండి తొలఁగనేరదు. దేశభాషయె జ్ఞానద్వారముగ నుండవలయును. ఉగ్గుపాలు త్రాగునాఁటినుండియు, జోలపాటలుపాడు తల్లిచేనూయెలలోఁ బరుండఁబెట్టఁబడియూఁగునప్పటినుండియు నేభాషాధ్వనులు శ్రోత్రములఁ బావనము చేసియున్నవో, యేభాషావర్ణోచ్చారణము ననుసరించి వాక్స్థానములు ఆకారవికారము నొందియున్నవో యాస్వదేశభాషయందు నీతులు, రాజకీయార్థికసాంఘిక ధర్మతత్త్వములు, ప్రకృతిశాస్త్రములును బోధింపఁబడినయెడల నవలీలగ గ్రహింపఁగలరు. ప్రకృతిశాస్త్రగ్రంథములు దేశభాషలందు లేకపోవుట మనతప్పు గాని భాషాదోషము గాదు. ఆంగ్లేయుల యభివృద్ధికి ముఖ్యకారణము వారి స్వభాషాభివృద్ధియే. ఈరహస్యమును వంగ పాంచాల ఘూర్జరాది దేశీయులు చక్కఁగా నెఱింగికొనుటచేతనే వారు మనకంటె పెక్కుమడుంగులు నాగరికస్థితి నందియున్నారు. వారి భాషాభివృద్ధికి వారి నాగరికతయు, వారి నాగరికతకు వారిదేశభాషాభివృద్ధియు సాక్షులగుచున్నవి. దీనికిఁ దార్కాణము వారి గ్రంథాలయములు, వారి వార్తాపత్రికలును. స్త్రీలుగూడ పత్రికాధిపుత్రులుగా నాయాదేశములం దున్నారు (స్వర్ణకుమారి).

మనవారికి స్వభాషాభిమానము పోయి తన్మూలమున భాషాజ్ఞానము మఱుఁగుపడుటచే మన యభివృద్ధికి హేతుభూతము లగు పూర్వగ్రంథములు చదువ నిచ్చగింపకున్నారు. కర్మము చాలక స్వభాషాగ్రంథములు చదువుట తటస్థపడినచో వానికి సరియైనయర్థము నరయనేరక యపార్థములు గల్పించి తక్కినవారికిఁగూడ స్వభాషాభిమానమును దొలఁగింప నెంచుచున్నారు. నేటి యాంధ్రదేశపు హిందీవిశారదులలో పెక్కుమంది యీతెగలోనికె చేరుచున్నారు. వీరు



పండిత హృదయనాథకుంజ్రుగారు
అఖిలభారత మితవాదసభాధ్యక్షులు.



డాక్టరు గుళ్లపల్లి నారాయణమూర్తిగారు.



బి. దాసుగారు
ఒరిస్సా మహమ్మదీయేతరస్థానమునకు
అసెంబ్లీ కెన్నుకొనబడిన కాంగ్రెసు అభ్యర్థి.



యల్. శాంతస్వామి, మూకబధిరవిద్యార్థి
చెన్నపురి లలితకళాశాలయందు ఎన్‌గ్రేవింగు
పరీక్షయందు త్తీర్ణుడయి స్వర్ణపదక
బహుమతిని బడసెను.



శ్రీ సుభాషచంద్రబోసు



ఎ. బాలకృష్ణపిళ్లెగారు
దేవాదాయసంఘ నూతనకార్యదర్శి.



ఎడిత్ హేమార్టిను సతి
(సంతాననిరోధప్రచారమునకై
ఇండియాలో సంచారము చేయుచున్న లండను యువతి)



డా. యం. జి. రాజాగారు
భీమవరమున జరిగిన పదునెనిమిదవ ఆంధ్రరాష్ట్రీయ
విశ్వబ్రాహ్మణ మహాజనసభాధ్యక్షులు.



ఆసఫ్ ఆలీ
యం. యల్. ఏ.



డా. మహమ్మదు షాహిదుల్లాగారు, యం.ఏ.
డక్కా విశ్వకళాశాలయందు సంస్కృత
బెంగాలీ ఆచార్యుడుగా మొదటివాడుగ
నియమింపబడిన మహమ్మదీయుడు.



బారు రాజారావుగారు
చాలాకాలము జాతీయమహాసభ కార్యదర్శిగ
పనిచేసి యిటీవలనే ఉద్యోగమునుండి విరమించిరి.



అమర్ సింగుగారు

'ఎవరిభాష వారికిఁ గన్నతల్లి వంటిది' అను న్యాయమును మఱచుచున్నారు. తల్లి యారోగ్యవతియు, విద్యావతియు, గుణవతియు నైనఁ బిల్లలును నాయాయిసుగుణములను బొంది యాధిక్యమును జెందునట్లే యెవరిభాషౌన్నత్యమునుబట్టి వారి నాగరికత వృద్ధిచెందుచుండును అనుమాట ప్రతిహిందీపండితుఁడును, ఆంగ్లకోవిదుఁడును గూడ మననముచేసికోవలయును.

మనదేశమునందలి విద్యావ్యాప్తికి ఆంగ్లేయభాష ప్రధానభాషయగుట చాలవఱ కడ్డుపడుచున్నది. మన విద్యార్థులు శాస్త్రజ్ఞానము నన్యభాషాగ్రంథములనుండి పొందవలసినవారగుటచే ఇతరదేశములలో విద్యార్థులకులేని కష్టములపాలగుచున్నారు. దేశమభివృద్ధిచెందుటకు విద్యావంతుల యుద్దేశములు సామాన్యజనులు గ్రహించుట యావశ్యకము. దేశమునందు విద్యావంతులవలనఁ గల్గు ప్రయోజనమిదియె. సామాన్యజనులు తమయుద్దేశములు గ్రహించునట్లు గావించి వారి బుద్ధిమాంద్యమును దొలఁగించుటయె విద్యావంతులు చేయఁదగిన పని. తనయుద్దేశములను, అభిప్రాయములను స్వభాష యగు నాంధ్రమునఁ దెలుపలేని విద్యావంతుని వైదుష్యమువలన ప్రయోజనము మృగ్యము.

ఆంధ్రదేశములోని పాఠశాలలలో స్వభాషను ప్రధానభాషగ నేర్పుఱచి సమస్తశాస్త్రములను తన్మూలమున బాలురకు నేర్పుటకన్న మనభాషాభివృద్ధికి వేఱుమార్గము లేదు. గ్రంథప్రచారిణీమండలులుగాని, వార్తాపత్రికలుగాని దీనికి విరుద్ధముగ భాషాభివృద్ధి నొందింపఁజాలవు. చదువువా రుండినఁ గాని గ్రంథము లుండవు; గ్రంథములున్నఁగాని చదువువా రుండరు. పిచ్చి కుదిరినఁగాని పెండ్లి గాదు. పెండ్లియైనఁగాని పిచ్చికుదురదు. పాఠశాలలకు వెలుపల విద్యావ్యాప్తి కాఁజాలదు. ఉన్నతపాఠశాలలలో నాంధ్రము ప్రధానోపాధ్యాయులచే నలక్ష్యముగాఁ జూడఁబడుచున్నది. పరీక్షాధికారుల యుదాసీనతకుఁ బాల్పడుచున్నది.

ఆంధ్రమునం దభిరుచియు, ననుభవమును లేని ప్రధానోపాధ్యాయులుగల పాఠశాలలయందలి యాంధ్రోపాధ్యాయులకు శ్రద్ధగ బోధింపవలసిన నిర్బంధము లేదు. ఈకారణముచే దేశమునకు మితిమీఱిన యపకారము జరుగుచున్నది. తెలుఁగువర్ణమాలలోని యక్షరములుగూడఁ బూర్తిగా నెఱుఁగని విద్యార్థు లనేకులు గలరు. వారాంధ్రోపాధ్యాయుని లక్ష్యముచేయరు. తెలుఁగుపాఠము చదువలేదనికాని, తెలుఁగువచనరచన వ్రాయలేదనికాని, చూపఁబడినతప్పులు దిద్దుకొనలేదనికాని యాంధ్రోపాధ్యాయుఁడు హెడ్మాష్టరుతోఁ జెప్పినప్పుడు వారు విశేషశ్రద్ధవహించుటలేదు దానంజేసి విద్యార్థులు మొదలంటఁ జెడుచున్నారు. ఇంగ్లీషు, లెక్కలు, సైన్సు మొదలగు పాఠములయందువలెఁ దెలుఁగునందును హెడ్మాష్టరులు శ్రద్ధతీసికొనినచో ఆంధ్రభాష కేదుర్గతియు రానేరదు. తెలుఁగుపరీక్షలో మార్కు లేమియు రాకపోయినను దక్కినపాఠములలో ప్యాసయిపచోఁ బయితరగతులలోనికిఁ దీసికొనుచున్నారు. ఇది శోచనీయాంశము. ఈకారణముచే విద్యార్థులు తెలుఁగుపాఠమును బూర్తిగా మానివేయుచున్నారు. తెలుఁగులోఁ దప్పుటవలన వారి కేమియు నష్టము కనఁబడనప్పుడు ఆపాఠములను విద్యార్థు లేల కష్టపడి చదువుదురు?

విద్యార్థుల వృద్ధిక్షయముల విచారించుకొనవలసిన విధి, తెలుఁగుపాఠములయందు విద్యార్థులకు శ్రద్ధపుట్టింపవలసిన విధి, తెలుఁగునఁ దప్పిన విద్యార్థులకుఁ బ్రత్యేకశిక్ష విధించుట, వారినిఁ బైతరగతులలోనికిఁ దీసికొనకుండుట మున్నగు పనులు నెఱపుట ప్రధానోపాధ్యాయుల విధి. ఇఁకఁ బరీక్షాధికారులలో మహమ్మదీయులు, అఱవలు, క్రైస్తవులు, ఆంధ్రులు కలిసియున్నారు. వీరు పండితులకుఁ దెలుపు నూత్నవిషయములు లేకపోఁగాఁ దామువేయుప్రశ్నములలోఁ బరిహాసాస్పదు లగుచున్నారు. "క్రియకు లింగములేమి? ఏక్రియ ఏలింగములో నుండును?" అని యడిగిన, యడుగుచున్న పరీక్షాధికారులుగూడ వర్తమానకాలమునఁ గలరు. ఇట్టిపరిస్థితులలో ఆంధ్రభాష పాఠశాలలోను, పాఠశాలకు బహిరావరణమునందును గూడ నభివృద్ధి నెట్లు అందఁగలుగును?

లాహోరుపశుచికిత్సాకళాశాలలోవలె శల్యశరీరాది సమస్తశాస్త్రములును బట్టపరీక్షవఱకు స్వదేశభాషలోనె చెప్పఁబడవలయును. 'దేశభాషామూలకమగు బోధ వివేకయుతము, సులభతరము' నని తమ యామోదమును హార్డింజి ప్రభువుగారె (౧౦-౧౦-౧౯౧౫) తెల్పియున్నారు. ఆత్రోవ త్రొక్కుటయె మన యాంధ్ర విశ్వకళాపరిషత్తువారికిని శుభోదర్కము కాఁగలదు. హరిద్వారపు గురుకులవిద్యాలయమువోలె నాంధ్రవిశ్వవిద్యాలయము వెలుఁగొందవలయును. మన దేశభాషలో లేనివియు, ఆంగ్లములోఁ గలవియు నగు శాస్త్రరహస్యములఁ దెలిసికొని వానిని దేశభాషలలో నేర్పవలయును. మన బియ్యపుమడుల వెట్టివలె నందఱు నొకటే శాస్త్రమును గాక యభిరుచినిబట్టి తలకొగ్రంథమును దెలిఁగించి మాతృభాషా సంపదను బెంపొందింపవలయును. కొలఁదిమందిమాత్రమె శ్రమపడినచో నాయాయిశాస్త్రములు దేశభాషలోనికిఁ బరివర్తితము లగును. తరువాతివారు పరభాషకై ప్రాఁకులాడనక్కఱలేకయే సునాయాసముగ సర్వశాస్త్రములును స్వభాషలో నేర్చుకొనఁగలరు. పదిమంది పదిభాషలు నేర్చుకొని పదిగ్రంథములు తెలిఁగింపవలయును. దానితో స్వభాషకు సమగ్రత యేర్పడి పరాపేక్ష లేక స్వజనము వెలుఁగొందును. అన్యభాషవలనఁ బ్రజాసామాన్యముయొక్క విజ్ఞానము పెంపొందఁజాలదు. అదియొకవేళఁ గొన్నివ్యక్తులకు లాభింపవచ్చును. ఒకటిరెండు వ్యక్తుల యభివృద్ధి జాతికంతకును లాభకారి కాదు.

అన్యభాషాభ్యాసముచేతను మానసికదౌర్బల్యము కలుగును. గ్రహణ, ధారణాశక్తులు పరభాషను బఠించుటతోడను, ధారణయందుంచుటతోడను వినియోగపడి కల్పనాశక్తిశూన్యము లగుచున్నవి.

కల్పనాశక్తి సన్నగిల్లుటతోడనే నూతనవిషయాన్వేషణశక్తికి నుత్సాహము పోడమదు. ఒక్క పరభాషను సాధించుటకు మనము వినియోగించు శక్తితో మనదేశభాష లెన్నియేని సాధింపవచ్చును. పరభాషాపఠనముచే శారీరకముగాను, నైతికముగాను గూడ మనము నష్టపడుచున్నాము.

ఆంగ్లవిద్య నభ్యసించుటలో మనకును జపానుజర్మనీలవారికిని భేదము హస్తిమశకాంతరము. వారు చదువునది యాంగ్లశాస్త్రరహస్యము నెఱింగికొని స్వభాషకు, స్వదేశమునకు వన్నె తెచ్చుటకు. మనది దానికి నన్నివిధముల వ్యతిరిక్తము. వారిలో నొకరో యిద్దఱో యన్యభాషలలో నాఱితేఱి పరభాషలోని నూత్నవిషయముల నెప్పటికప్పుడు వార్తాపత్రికల మూలమునఁ దమదేశభాషలోఁ బ్రకటించి స్వదేశప్రజలకుఁ బుష్టియుఁ దుష్టియు నొసఁగుదురు. మాతృభాషను సజీవముగా నుంచుదురు. మన కది గిట్టదు; చేతఁగాదు. కావుననే మనదేశమునందలి రైతు ఏవృక్షశాస్త్రము నైనఁ దెలిసికొనవలయు ననినఁ జచ్చినట్లు ఎ. బి. సి. డి లు మొదలుపెట్టి స్కూలుఫైనలు దాఁకఁ జదువవలసినదే కాని స్వభాషలోఁ దెలిసికొనుటకు నోఁచుకొనలేదు. సమృద్ధిగా నుద్యోగములు దొరకెడి యారోజులలోఁ బరభాషాపఠనమువలనఁ గొండొకలాభ ముండెడిది. నిరుద్యోగమునఁ దొప్పఁదోఁగు నీరోజులలోఁ బరభాషాపఠనముచే నుభయభ్రష్టత యేర్పడుచున్నది.

ఆంధ్రదేశపు మట్టికంటెఁ బవిత్రమైనది మఱియొకటి లేదు. తల్లులు ప్రేమసుధారసము నొలికించుచుఁ బల్కుమాటలను నిరసింపరాదు. బాలుర మధురసంజల్పములఁ జెడచెవినిఁ బెట్టరాదు. అన్యభాషయందు సంభాషించుట యాత్మగౌరవమునకు భంగకరము. విద్యాధురీణులును, పత్రికాసంపాదకులును, వక్తలును, పరిశోధకులును, గవులును గృశించిన యాంధ్రభాషావధూటినిఁ జేపట్టి యత్యాదరముతోఁ బ్రేమించి తనరారఁజేయవలయును. ఇంటను, వెలుపలను సర్వత్ర యాంధ్రభాష నిరంకుశముగా రాజ్యము చేయవలయును. స్వభాష కన్నతల్లి. జననీతనూజాతులయం దాత్మసంబంధము గలదు. ఆత్మసంబంధమే వాస్తవమైన సంబంధము. అన్యంబులం దీసంబంధము గానరాదు. "యః పరః పర ఏవసః" అనినట్లు పరకీయవిద్య పరకీయవిద్యయే. అది స్వకీయ మెన్నటికిని గాదు. "శ్రేయాన్ స్వధర్మో" అనుగీతావచనము భాషావిషయమునఁ గూడ ననుసంధించును.

దేశభాషాభ్యుదయము మన సకలారంభములకును బునాది; ఐకమత్యమునకు మూలబీజము; పారిశ్రామికాభివృద్ధికిఁ బ్రధానస్థానము; వాణిజ్యాభివృద్ధికిఁ జతురోపాయము; జ్ఞానాభివృద్ధికి సరళమార్గము; పురుషార్థసాధనమునకుఁ జక్కనిత్రోవ. మాతృపూజయు, దేశభక్తియు, స్వభాషాభిమానమును మానవులకుఁ బవిత్రధర్మములు. ఆపత్సమయముల నవితర్కితముగ స్మరణకు వచ్చు మాతృభాషోచ్చారణముకన్న మధురమైనది లేదు.

గ్రాంథికభాషకును, గ్రామ్యభాషకును సంపూర్ణసమావేశము కలుగఁజాలదు. ఈవ్యత్యాసము విద్య వ్యాపించినకొలఁదియు నంతరించును. సన్నిహితసాహచర్యమును వహించును.

భిన్నవర్ణములను, నానాశాఖలను, వివిధమతస్థులను బంధింపఁ గలుగునది భాషాభిమానము. స్వభాషకు గౌరవమిచ్చినఁ గాని యది యభివృద్ధి నొందఁజాలదు. భాష యభివృద్ధి పొందినఁగాని సర్వవిధములగు నభివృద్ధులు గలుగఁజాలవు. మాతృభాషయే దేశము, ధనము, జ్ఞానము, స్వాతంత్ర్యము, మోక్షము. ఇది కవుల స్వప్నముగాదు, ఆదర్శవాదుల కల్పనగాదు, తార్కికులయుక్తి గాదు, తరుణవయస్కుల యుద్రేకముగాదు, స్వార్థపరుల దురాశ గాదు. స్వభాష యథార్థము. స్వభాష ప్రాణము. స్వభాష జీవము. చేయఁదగినది చేయవలసినదియు స్వభాషాభివృద్ధి. నెలకొల్పవలసినది స్వభాషాప్రభుత్వము.

ప్రజ మాతృభాషపక్షము. ప్రకృతి మాతృభాషపక్షము. సృష్టి మాతృభాషపక్షము. కావున మాతృభాషారాధనకంటెఁ జేయఁదగినది యేమియు లేదు.

బలహీనునకు బలమును, భీరువునకు ధీరత్వమును, దుఃఖితునకు సంతోషమును, లోభికిఁ ద్యాగమును, దేశద్రోహికి దేశాభిమానమును, స్వార్థపరునకుఁ బరోపకారమును, ద్వేషబుద్ధికిఁ బ్రేమయును, విరోధుల కన్యోన్యమును గలిగించునది మాతృభాష.

స్వభాషయే దేవత; స్వదేశీయమే మతము. తద్వ్యతిరిక్తమే నాస్తిక్యము. దేనినుండి మనజ్ఞానశరీరము లుద్భవిల్లినవో తిరిగి దాని కర్పించుటయే నివేదనము. దానిలోఁ గలయుటయే యైక్యసంధానము. దానిని బోధించునవే వేదవాక్యములు. ఇంతకుమించిన మతము లేదు, వేదము లేదు, యోగము లేదు, రాగము లేదు, త్యాగము లేదు.

"పెలి విద్య లెన్నియైనను
గులవిద్యకు సాటిరావు గువ్వలచెన్నా!"

# మన పరిశ్రమలు - ఆర్థికసమస్య

ప్ర. పార్థసారథి

ప్రాచ్యదేశీయుల దరు మారుమూలల ముక్కు మూసుకుని, కందమూలముల దినుచు, శుష్కవేదాంత తర్కములతో కాలమువృథపుచ్చుటకుదప్ప, మరియెందుకునుపనికి రారనుఅభిప్రాయము లమగంటుచున్నవి. కడచిన అర్థశతాబ్దములో, ఈనాటి హిందూదేశముకన్న చాల వెనుకబడి సుస్థితియందున్న ప్రపంచమండలి వివిధ దేశములు అత్యద్భుతముగు పారిశ్రామికాభివృద్ధి జెంది, ఏదేశమునకు గాని ఆర్థికాభివృద్ధి మార్గమున దాటనలవికాని సహజమగు ఆటంకము లున్నవను పూర్వసిద్ధాంతము విశ్వసనీయము కాదని స్పష్టముచేసినవి. ఇతర దేశములలోవలెనే భారతదేశమునగూడ పూర్వాభిప్రాయములు మారి, పారిశ్రామికాభివృద్ధికి తోడ్పడుమార్గముల నన్వేషించుట, ప్రభుత్వము దేశీయపరిశ్రమాభివృద్ధికై తగుసహాయము చేయవలెననియు, అట్టిసహాయమునకై నిరంతరము ప్రభుత్వమువారి కొత్తిడి కల్గించుచుండుటయు గమనించుచున్నాము. ఇంగ్లండునకు పారిశ్రామికాభివృద్ధి జెందుటకు, అద్భుత నైసర్గిక సదుపాయములు కలవని, భారతదేశపారిశ్రామికాభివృద్ధిమార్గమునకు సహజలోపములు కలవని మన పాఠశాలలలో బాలురకు బోధింపబడుచు, మనభారతదేశము ముడివస్తువుల తయారుచేసి, వానిని పారిశ్రామిక దేశముల కందించి, వారు తయారుచేసిన పదార్థముల తిరిగి కొనుట తప్ప ఎందునకును పనికిరాదనుభావము కల్గించుచుండిరి. కాని పారిశ్రామికాభివృద్ధినొందిన దేశములన్నిటిలో నేఒకటో రెండో దేశములలో తప్ప (అందును మిగిలినవాటితో బాటు అది ఒకకారణము మాత్రమే) నైసర్గికసదుపాయము లెట్లున్నను, జాతి దృఢసంకల్పమే ముఖ్యకారణ మని తేలుపడినది. ప్రాచీనదృక్పథము మారి, జాతీయైశ్వర్యము దేశమందే నిలుపుజేయవలెననియు, స్వయంసమృద్ధికలిగి యితర దేశములపై దేనికి నాధారపడకుండవలె నన్నచో దేశీయపరిశ్రమల కన్నివిధముల సదుపాయముల కలుగజేసి అవి వృద్ధినొంది విదేశీయులతో పోటీకి నిలువగల్గుశక్తి కలిగించవలెననుభావము కలిగినది. వ్యాపారాధిక్యము, పారిశ్రామికౌన్నత్యము, ఆర్థికసంపదలే దేశముల గొప్పదనమును నిర్ణయించు ఈదినములలో, ఎవరికివారు తమపరిశ్రమల నన్నివిధముల నభివృద్ధి చేసుకొనుటకే తమయావచ్ఛక్తిని వినియోగించుటలో నాశ్చర్యములేదు. రాజ్యవిస్తీర్ణములకై, దేశాక్రమణలకై యుద్ధములుజరుగు దినములు గడచిపోయినవి. నేటి యుద్ధములు తగాయిదాలకు, వర్తకవ్యాపారములు, ముడివస్తువులందించు ప్రదేశములకొరకు, తయారైనవస్తువులను అమ్ముకొనుటకు కొనువారి ప్రదేశములకై (మార్కెట్లు) పెనగులాట ముఖ్యకారణము. ఈయుద్ధములకు పూర్వమువలె కత్తులు, కఠార్లు, మందుగుండు సామానులు పరికరములుగావు. దీనికి ముఖ్యసాధనములు రక్షణచట్టములు, ఎగుమతిదిగుమతులపై సుంకములు, పరిశ్రమలకు ప్రభుత్వసహాయము, విదేశవస్తు బహిష్కరణము స్వదేశదీక్ష మున్నగునవి.

పారిశ్రామికాభివృద్ధి ఆవశ్యకత గమనింపగనే, వాటి అభివృద్ధికి వలయు మార్గము లెవ్వియో చూడవలసియున్నది. పరిశ్రమల స్థాపింపవలెనన్నను, అభివృద్ధిచేయవలెనన్నను, ధన మధికముగ నుండవలె. పరిశ్రమలకు వలయుధనము రెండువిధములు: మొదటిది యంత్రాలయము, కర్మాగారములు, యంత్రసామగ్రి నిర్మించుటకు వలయు స్థిరధనము (Fixed Capital). ఇది సాధారణముగ పరిశ్రమయొక్క ప్రత్యేకావశ్యములను, వాటి పరిమితినిబట్టి యుండి, పరిశ్రమకువలయు మొత్తపుధనమం దధికభాగము దీనిక్రిందనే ఖర్చుపడును. చిన్నపరిశ్రమలైనచో ధనికులగువ్యక్తులు స్వతంత్రముగ స్థాపించుటయో, లేక కొలదిమంది కలిసి సంస్థగా ఏర్పడుటయో జరుగును. ఆపరిశ్రమలు చాల పెద్దవైనపుడు వాటి స్థాపనకు లిమిటెడుకంపెనీల నేర్పరచి వాటాలమూలమున వలయుధనము నంతయు కూడదీయుదురు. ఈవాటాలమూలమున ధనము సేకరించుపద్ధతి యెంతయు ఉపయోగమైనది. ఏవాటా కావాటాధనము కొద్దియగుటచే సామాన్యుడుకూడ తనస్థితికి మించక వీలైనన్నివాటాల కొనవచ్చును. ఇట్లనేకమందివాటాల కొనుటచే మొత్తము మూలధనము అధికముగ జేరును. ఏవాటాదారునకును తన యావత్తుధనము నొకేపరిశ్రమయందు పెట్టి, నష్టము కలుగుచో నాశమొందవలసిన అగత్యము లేదు. ఇవిగాక రైల్వేలు, నౌకామార్గములు, విద్యుచ్ఛక్తి పరిశ్రమలు మొదలగునవి ఒకవ్యక్తిగాని, ఏ పది

మందియో కలిసికాని స్థాపింపబడినవి కావు. వాటి స్వభావమును బట్టియే జాయంటుస్టాకుకంపెనీలచే నడుపబడియున్నవి. రెండవది: పరిశ్రమల కీస్థిరధనమేకాక వాటిని నడుపునుండుటకు కొంతధనము కూడ కావలసియున్నది.

ముడివస్తువుల కొనుటకును, ఉద్యోగులజీతములు, కార్మికుల కూలీల నిచ్చుటకు, సరుకు ఎగుమతిదిగుమతులఖర్చులు, సుంకములు, యంత్రముల నడపించుటకు వలయు బొగ్గు, ఆవిరి తైలము, విద్యుచ్ఛక్తి మొదలగునవి సేకరించుటకును ఈ రెండవరకమని చెప్పబడిన కార్యధనము (Working capital) అవసరము. కర్మాగారములు, యంత్రములు మున్నగురూపమున స్థిరధన మెంతయున్నను, వానికి తగుపని కల్పించి లాభము వడయుటకు తగుకార్యధనము లేకున్నచో పరిశ్రమలు సాగవు. అందుచే పరిశ్రమ లభివృద్ధిబొందవలెనన్న, వాటికి వలయు ధన మెట్లు చేకూరును, తగుసహాయ మేవిధమున గల్గునను విషయము తెలుసుకొనవలసియున్నది.

మన దేశమందెట్లున్నను, పారిశ్రామికాభివృద్ధి జెందిన పాశ్చాత్య పరిశ్రమలకు ధన మెట్లు జేకూర్చబడుచున్నదో చూతము. కంపెనీల వాటాలకొనుటలో తమఆదాయముల నుపయోగించుపద్ధతి బాగుగా వ్యాపించిన దేశములలో, పరిశ్రమలకు ధనము సమకూర్చుటయందెక్కువకష్టము లేకున్నది. కంపెనీవాటాలను, స్టాకులను చలామణి చేయుటకు ప్రత్యేకమార్కట్లు (Stock Exchanges) బ్రోకర్లు Investment Trusts మొదలగు అనేకసంస్థలు ఇందుకు సహాయపడుచున్నవి. తమక్లయింట్ల ధనమును జాగ్రత్తపరచెడి బ్యాంకులు పెట్టుబడివిషయమై తమక్లయింట్లకు తగుసలహాలనిచ్చి వారలకువలయు వాటాల కొనుచుండును. యూరపియను దేశములందు బ్యాంకులన్నియు స్టాకుఎక్స్చేంజిలో మెంబర్లగుటచే తమక్లయింట్లకు సరియైన సలహా నీయగలుగుచున్నారు. ఇంగ్లండులో నూతనకంపెనీల స్థాపింప వాటివాటాలను ప్రజలకు, బ్రోకర్లు అండర్‌రైటర్లనబడు జట్టీదార్లు, ఇతరవ్యాపారసంస్థలు మొదలగువారు అమ్ముదురు. అక్కడ వాటిఅమ్మకమందు బ్యాంకులు విశేషపరిశ్రమ చేయవు. కాని జర్మనీ, ఫ్రాన్సు మొదలగుయూరపియను దేశములందు బ్యాంకులే వాటాలవిక్రయవిషయమున స్వయముగా పాల్గొనును. ఈబ్యాంకుల కనేకచోట్ల అనేకబ్రాంచీ లుండుటచే వాటిమూలమున దేశమందు చాలమందితో అనేకవిధముల సంబంధము లేర్పడియుండి, అందుమూలమున అనేకవాటాల విక్రయించి అధికమూలధనము చేకూర్చగలుగుచున్నవి. తా మట్టిబాధ్యతాయుతకార్యములందు పాల్గొనుచుండుటచే మోసగింపుసంస్థలతో జోక్యముకలిగించుకొనకుండ జాగ్రత్తపడుచుందురు.

జర్మనీలోని బ్యాంకుల సిండికేటుపద్ధతి, కార్యక్రమము ప్రత్యేకప్రశంసాపాత్రములు. ఆదేశమందలి ముఖ్యబ్యాంకులు పరిశ్రమలకు వలయు మూలధనము సమకూర్చుటకు తామే సిద్ధపడును. ఈబ్యాంకులలో వారిలోవారికి ఒక్కొక్క రొక్కొక్కరకపు పరిశ్రమను ప్రోత్సాహము చేయవలెననియో, లేక ఒక్కొక్క రొక ప్రాంతమున వలయు సదుపాయముల గూర్పవలెననియో అంతరంగికమగు ఏర్పాట్లుండును. ఒకప్రత్యేకపరిశ్రమసంస్థనేదైన చాలపెద్దదిగ నేర్పరుపవలెనన్న, ఈ పెద్దబ్యాంకులన్నియు గూడి దానికి వలయు మూలధనము చేకూర్చును. అందుచే ఎవరిమట్టుకు వారి బాధ్యత, అపాయభయము కొంతతగ్గును. ఈధనసహాయము అవసరమునుబట్టి మొదటనో లేక కొంతస్వరూప మేర్పడినతరువాతనో జరుగవచ్చును. ఇట్టికంపెనీల యాజమాన్యమున కొందరు డైరక్టర్లను ఈబ్యాంకులు నియమించును. అందుచే ఆపరిశ్రమ నడపుటయందు ప్రత్యేకజాగ్రత్త వహించుటయేకాక, ఆర్థికపరిస్థితులన్నియు వాటిచేతనే యుండును. ఇట్లు కొంతకాలము నడిపి ఆపరిశ్రమలు స్వయంశక్తిపై నాధారపడు స్థితి రాగానే, ఈబ్యాంకులు వాటియాజమాన్యమునుండి నెమ్మదిగా తప్పుకొని, తమకుగల వాటాల నమ్మివేయును. అట్లు వాటాల నమ్మివేయుటయం దాబ్యాంకుల కెట్టి యిబ్బందియురాదు. ఏలనన, అట్టివాటాలను ప్రతివారును కొనుటకు సిద్ధముగా నుండువిధమున పరిశ్రమను వృద్ధిచేయుటయే కాక, తాము స్టాకుమార్కట్లలో మెంబర్లగుటచే బ్యాంకులకును, పెట్టుబడిదార్లకును అన్యోన్యసంబంధము లుండును. జర్మనీ అతిశీఘ్రకాలములో వ్యవసాయదేశస్థితినుండి నేటి పారిశ్రామికదేశముగా మారుట కీసిండికేట్లే ముఖ్యకారణము.

ఫ్రాంసులోగూడ ౧౮౫౨లో "సొసైటీజనరేల్ డిక్రెడిట్ మొబైలర"ను పేర నొకప్రత్యేకబ్యాంకు పెద్దపరిశ్రమల సహాయమునకై స్థాపింపబడినది. ఫ్రెంచిపరిశ్రమలు వెనుకబడి, మిగిలిన యూరపియనుపరిశ్రమలకు దీసిపోకుండునట్లు వలయు సర్వసహాయముల జేసి వాటి నభివృద్ధిజేయుటయే దాని ముఖ్యకర్తవ్యము. అది స్థాపింపబడిన కొద్దికాలముననే అనేకరైలుమార్గములు, గ్యాసుకంపెనీలు, నౌకానిర్మాణసంస్థలు మున్నగు అనేకకంపెనీల నేర్పరచి వాటిచే నద్భుతముగ పని జరిపించుచున్నది.

ఈఫ్రెంచిక్రెడిట్ మొబైలరుపద్ధతిమీద నాధారపడి జపానులోకూడ కొన్నిపారిశ్రామికబ్యాంకులు స్థాపింపబడెను. జపానులోని ముఖ్య పారిశ్రామికబ్యాంకు ౫౦,౦౦౦,౦౦౦ యెన్నుల వసూలు కాబడిన మూలధనముగల వాటాదారుల సంస్థ. ఈ బ్యాంకు కార్యనిర్వహణమందును, కార్యనిర్వాహకుల నియామకమందును ప్రభుత్వమువారికి కూడ విశేషాధికారము కలదు. దాని ముఖ్యోద్దేశము దేశీయపరిశ్రమలకు వలయు ఆర్థికసహాయమును జేకూర్చుటయే. ప్రజలనుండి డిపాజిట్లు రాబట్టి పనిచేయు పరిశ్రమలకు ఆర్థికసహాయము చేయుటకు దాని నుపయోగించును. కంపెనీలకు వలయు స్థిరధనమును, వాటివాటాల తామే మొత్తముగా కొని యితరులకు విక్రయించుమూలమునను, విదేశములనుండి ఋణముల దీసుకొనియు, పరి

శ్రమల ఆస్తుల తనఖాబాధ్యతపై డిబెంచర్లను ప్రకటించి యు జేకూర్పబడును.

మామూలు వ్యాపారపు బ్యాంకుల (Commercial Banks) కుగూడ కంపెనీల అధీనమందున్న ఆస్తి, ముడివస్తువులు, తయారగు వస్తువుల హామీపై ఆర్థికసహాయమిచ్చుటకు వీలున్నను పారిశ్రామికముగ వెనుకబడి వాటాల విరివిగ సులభముగ అమ్ముటకు ప్రత్యేక సంస్థలు లేని దేశములందు ప్రత్యేకముగ పారిశ్రామిక బ్యాంకుల అవసరము విశేషము. పారిశ్రామిక ఆర్థిక సహాయమున ధనము ఎక్కువకాల మొక్కచోటనే బంధింపబడియుండును. అదియేకాక అట్టిస్థిరసహాయమున గొంతఅపాయభయముకూడనుండును. అందుచే మామూలుబ్యాంకులు పరిశ్రమలకు సహాయము చేయుటకు వెనుదీయుదురు. మామూలుబ్యాంకులకు మిల్లులు, యంత్రములు, నౌకలు మొదలగుపరిశ్రమలవిషయమై సరియగు సంపూర్ణజ్ఞానముండదు. అందుచే అట్టిపరిశ్రమలయందు తమధనమును వినియోగించుటవలన దమ కెట్టిలాభనష్టములు రావచ్చునో వారికి ఊహింప శక్యముకాదు. ఇదిగాక మామూలుబ్యాంకులు వర్తక సహాయమునకును కొద్దికాలపు ఋణములలోను ఎక్కువ లాభమును బొందుచు, తమధనము నొకేచోట నిలువచేయక, అనేకవిధముల త్రిప్పుచుండుటచే పరిశ్రమల కవసరమగు దీర్ఘకాలఋణముల నీయజాలవు. పరిశ్రమలు హామీగానిచ్చెడి కర్మాగారములు, ఫ్యాక్టరీలు, స్థలములు, యంత్రములు మున్నగునవి సులభముగ అమ్ముడుపోవునవి కావు. తయారైన వస్తువులైనను ఒక్కమారే బలవంతముగ అమ్మివేయవలెనన్నచో ధరలు మిక్కిలి పడిపోవును. అట్టి సందర్భములలో తమ పెట్టుబడిసొమ్ము రాబట్టుకొనుట బ్యాంకులకు చాల యిబ్బంది కలుగును. బ్యాంకుల వ్యాపారధనమంతయు ప్రజలు జాగ్రత్తపరచుకొని ఉంచినదే అగుటచే బ్యాంకులు కడుజాగ్రత్తతో వ్యవహరింపవలెను. జనుల నమ్మిక పరపతి బ్యాంకులకు చాలముఖ్యము. ఒకబ్యాంకు, సరియగు పునాదిలేని వ్యాపారమునకు సహాయము చేయుచున్నదని ఎట్టి పుకారైనను పడినచో అందు సత్యమున్నను లేకున్నను, బ్యాంకులకు చాలమోసము సంభవించును. అందుచే దీర్ఘకాలము ఋణముల నిచ్చి దానిమూలమున కలుగనుండు ఇబ్బందులకు మామూలుబ్యాంకులు సిద్ధపడవు. ఒకవేళ మామూలుబ్యాంకులు పరిశ్రమలకు సహాయపడినను కార్యధనమును సమకూర్చుటకుమాత్రమే సిద్ధపడి, దాని నైనను ఆపరిశ్రమకు సహాయ మవసరమైన సమయములలో వారికి చిక్కులు కలిగి అధికావసరములలోనున్న సందర్భములలో ఈబ్యాంకులు వెనుదీయుచుండుటచే, పరిశ్రమలకు తగుసహాయము వాటివలన జేకూరదు.

పరిశ్రమాభివృద్ధికై ఇతరదేశములలోవలె మనదేశమున నేమైన సహాయకారు లున్నవా యని గమనింపవలె. వ్యవసాయాభివృద్ధికై సహకారపరపతిసంఘములు కొంతవరకు పాటుపడుచున్నవి కాని పరిశ్రమలకు మనదేశమున లేశమాత్రము బ్యాంకుల సహాయములేదు. ఒక్క టాటా ఇండస్ట్రియల్ బ్యాంకుమాత్రము ఈయుద్దేశముతో ప్రారంభింపబడినప్పటికి, కాలమంతయు పరిశ్రమల కెట్లు సహాయము చేయవచ్చునో యను అన్వేషణములోనే వ్యర్థముచేసి క్రియకు ఏమియు జేయలేక కారణాంతరములచే సెంట్రలుబ్యాంకులో లీనమైపోయెను. ఇదిగాక పేరున కక్కడక్కడ ఒకటిరెండు పారిశ్రామికబ్యాంకులున్నను అవి సరియగుబ్యాంకింగుపద్ధతి ననుసరించుటలేదు. పారిశ్రామికసహాయకము లంతకుముందే కావు.

ఇతరదేశములలోవలెనే మనదేశములోగూడ స్థిరధనము జాయింటుస్టాకుకంపెనీల వాటాదార్లు సమకూర్చుచున్నారు. కాని పాశ్చాత్యదేశములందు పారిశ్రామికులకు, వాటాదారులకు మధ్య మరియొకసలహాదా రుండ మనదేశమున నట్టివారు లేరు. పాశ్చాత్యదేశములలో మూలధనసేకరణమునకు క్రమపద్ధతిని పనిజేయు చక్కటి షేరుమార్కట్లు, బ్రోకర్లు వగైరా లేర్పడి పనిచేయుచున్నవి. అట్టి సంస్థలు లేనిచో పారిశ్రామికాభివృద్ధికి శీఘ్రగమనము కల్గుటకష్టము. దేశమందు నిరుపయోగముగ మూలపడియున్న ధనము నంతయు పరిశ్రమలలోనికి రప్పించి ఫలప్రదమగునటుల జేయుసంస్థల విలువ వేరజెప్పనవసరము లేదు. అట్టి అత్యావశ్యకమగు అంగము మనదేశమున లేకుండుట యెంతయు శోచనీయము. హిందూదేశమున నేడములలోనున్న షేరుమార్కట్లు శైశవావస్థయందే యున్నవి. బ్యాంకులీకార్యమును స్వీకరించుటలేదు. కాని వీటిస్థానమున నేదోమరియొక సంస్థ యుండితీరవలె. ప్రజలకు విశ్వాసముకలిగినగాని తమధనమునం దుపయోగింపరు. కాని ఏపరిశ్రమయం దుపయోగించిన లాభకరమో, ఏది క్షేమకరమో మున్నగువిషయముల నాలోచించుటకు వలయు ప్రత్యేకజ్ఞానము కాని, శ్రద్ధకాని సామాన్యప్రజల కుండలేదు. అందుచే, ఎవరైన ప్రఖ్యాతుల కాపరిశ్రమతో సంబంధమున్నచో వారియందలి విశ్వాసముచే ఆపరిశ్రమయందుగూడ నమ్మిక కల్గును. ఇతరదేశములందు బ్యాంకులుచేయు ఈపనిని మనదేశమున మేనేజింగుఏజెంట్లసంస్థలు చేయుచున్నవి. మన ప్రస్తుతపారిశ్రామిక ధనసహాయ మీ మేనేజింగుఏజెంట్లే చేయుచుండుటచే వారినిగూర్చి కొంత తెలుసుకొనవలసియున్నది.

ఈమేనేజింగుఏజెంట్లు, కంపెనీల వృద్ధిచేయుచు విదేశములలోని Underwriting Houses వలె వాటాలనన్నిటిని అమ్ముటకు గుత్తకు తీసుకొని తమప్రఖ్యాతిచే ప్రజలలో తగునమ్మకము కలిగించి వాటాల నమ్ముదురు. తాము ఏజెంట్లుగానున్న కంపెనీలకు కార్యధనమును తమస్వంతసొమ్మునుండి యిచ్చుటయో, లేక తమబాధ్యతపై యితరులనుండి బదులుతెచ్చుటయో చేయుదురు. ఈ మేనేజింగు ఏజెంట్లు చేయు కార్యములన్నిటిలో ధనసహాయమే చాలముఖ్యమైనది. స్థిరధనము వాటాలమూలమున లభించునని యిదివరకే గమనించియుంటిమి. ఇక కార్యధనము, అభివృద్ధికివలయు ధనము

మూడువిధముల లభించును: ౧. బ్యాంకులద్వారా, ౨. ప్రజలుంచెడి డిపాజిట్లమూలమున, 3. మేనేజింగు ఏజెంట్లవలన.

బ్యాంకులవలన ఇతరదేశములలోవలె మన దేశమున తగు సహాయము లభించుటలేదని యిదివరకే చూచితిమి. ప్రజల డిపాజిట్లమూలమున వచ్చెడి ధనము మిగిలిన పరిశ్రమలం దెట్లున్నను దూదిపరిశ్రమలందు చాలావిశేషముగ నుండెడిది. కార్యనిర్వాహకులవలయు మొత్తమీవిధమున సులభముగా జేకూరుచుండెడిది. ఉదాహరణకు ౩౧వ డిశంబరు ౧౯౨౨ తో అంతమగు ఒక సంవత్సరమునకు ౨౫ మిల్లులలో మొత్తముమీద ౫ కోట్ల ౧ లక్షలరూప్యము లిట్లు డిపాజిట్ల రూపమున సంవత్సరమునకు నూటికి అయిదారురూపాయల రేటున వడ్డీతో పోగుచేయబడెను. అహమ్మదాబాదులో నీపద్ధతి యింకను అమలులో నున్నది. ఈడిపాజిట్లమూలమున వచ్చెడి ఆర్థికసాహాయ్యముపై పరిశ్రమ లెక్కువగా ఆధారపడరాదు. కాలపరిస్థితులనుబట్టి వ్యాపారము బాగుగాసాగుచుండి పరిశ్రమలు వృద్ధియగుచుండిన ఇట్టి డిపాజిట్లు వచ్చును. అట్లుకాక ఏమాత్రము వ్యతిరేక పరిస్థితు లేర్పడినను క్రొత్తడిపాజిట్లు రాకపోవుటయే కాక ఇదివరకున్నవానినిగూడ లాగుకొనుటకు ప్రజలు యత్నింతురు. ఇన్ని డిపాజిట్లను ఇంతస్వల్ప వడ్డీలకు సంపాదించుటయందుగూడ మేనేజింగుఏజెంట్ల పలుకుబడియే కారణము. కాని యీమధ్య ప్రభుత్వమువారు ట్రెజరీబిల్లుల అమ్మకముమూలమున హెచ్చువడ్డీల నిచ్చి మిల్లులకు వచ్చు డిపాజిట్లధనమంతయు తామాకర్షించుచుండుటచే ఈ విధమగు ధనసహాయము కూడ బోవుచున్నది.

అందుచే భారతీయపరిశ్రమలలో మేనేజింగు ఏజెంట్ల ప్రాముఖ్యము, అవసరము తప్పనిసరియగుచున్నవి. పరిశ్రమలతో సంబంధమేర్పరచుకొని తమ పలుకుబడిని పేరుప్రతిష్ఠల లాభమును ఆపరిశ్రమలకు గల్గించుటయేగాక వలసినపుడెల్ల తమ యాజమాన్యమున నున్న కంపెనీలకు ఆర్థికసహాయమును ఋణములరూపమున జేయుచుందురు. ధరలుపడిపోయి వర్తకము మందగించి కాలమానపరిస్థితులు మారి బ్యాంకులు సహాయముచేయ వెనుదీయుసమయములందు వీరి సహాయమత్యవసరము క్తమైనది.

కాని భారతదేశమందలి ఈమేనేజింగు ఏజెన్సీపద్ధతియందు కొన్నిలోపములు లేకపోలేదు. బ్యాంకింగుపద్ధతికిని పరిశ్రమలకును అన్యోన్యసహాయసంపర్కములు లేకుండబోవుచున్నవి. అదిగాక కొన్నియెడల పరిశ్రమలయాజమాన్యము నేర్పులేక అసమర్థతతో నడుపబడుచున్నది. హిందూదేశమున పారిశ్రామికబ్యాంకులు లేని లోటును మేనేజింగుఏజెంట్లు కొంతవరకు పూర్తిచేసినను బ్యాంకులే స్వయముగా పారిశ్రామికాభివృద్ధికి శ్రద్ధవహించినచో గల్గునంత అభివృద్ధి నేడు కలుగుటలేదు. ఈమేనేజింగుఏజెంట్లు కొన్నిపద్ధతులలో కార్యమునడుపుట కలవాటుపడి నూతనమార్గములను, నూతన పరిశ్రమలను లేవదీయుటకును ఉత్సాహములేక తమపూర్వపరిశ్రమలకేతప్ప యితరములజోక్యమే కల్పించుకొనరు. మేనేజింగుఏజెంట్లు ఎవరికివారు స్వతంత్రముగ తంటాలుపడుటతప్ప వీరికొకసంఘము కాని, నియమముకాని లేవు. అందరు అవసరమైనచో గలసి పెద్ద పరిశ్రమలకు జేయూతనిచ్చుట అంతకన్న లేదు. వివిధపరిశ్రమల గురించి ప్రత్యేకశాస్త్రీయజ్ఞానము, వాటి ఆర్థికపరిస్థితుల చక్కగ దెలుపువిజ్ఞానముగల ప్రజ్ఞావంతుల సహాయము వీరికి లేనందున ఏపద్ధతులపై ఏపరిశ్రమను నడపుట కెక్కువసదుపాయముగను, లాభకరముగ నుండునో వీరికి తెలియదు. ఇంతేకాక ఈమేనేజింగు ఏజెంట్లకుగల ధనముకూడ కొద్దియేయగుటచే లాభదాయకమగు పరిశ్రమలందుగూడ నూతనకంపెనీల స్థాపింపలేకున్నారు. వీరెంత ప్రఖ్యాతులైనను బ్యాంకులకున్న ప్రఖ్యాతిగాని, పలుకుబడికాని యుండదు. అందుచే విశేషముగ కంపెనీల స్థాపింపలేకున్నారు.

ఇదియేగాక ఈమేనేజింగుఏజెంట్ల యాజమాన్యమునగూడ లోపము లనేకము లున్నవి. తమయాజమాన్యమందున్న కంపెనీలలో తమబంధువులకు, మిత్రులకు తగుశక్తిసామర్థ్యము లున్నను, లేకున్నను ఉద్యోగముల గల్పించుచుందురు. పరిశ్రమలకువలయు ముడిపదార్థములు వగైరాలు కొనుటయందును, ఖరీదు లధికమైనను తమ మిత్రులయొద్దను, బంధువులయొద్దను కొనుచుందురు. అందుమూలమున ఉత్పత్తియగు వస్తువుల అసలుఖరీదు పెరుగుచుండును. దానినిబట్టి పరిశ్రమల యాజమాన్య మసమర్థముగ నున్నదను అపఖ్యాతి కలుగును. ఇదియేగాక మేనేజింగుఏజెంట్లకు పరిశ్రమల స్థిరధనమందు విశేషసంబంధము లేకుండుటచే, ఖర్చుపెట్టుటయందు వాటాదారుల లాభనష్టముల శ్రద్ధతో బరికింపకపోవుటగూడ తటస్థింపవచ్చును. కొన్ని కంపెనీల యాజమాన్యమందు మేనేజింగుఏజెంట్లకు మొత్తపు ఉత్పత్తిపై కమీషను నిచ్చెడిపద్ధతి యేర్పడియుండుటచే, వ్యాపారపరిస్థితు లెట్లున్నను తమకువచ్చెడి ఆదాయమందే దృష్టి నుంచుకొని అత్యధికముగా నుత్పత్తిచేయుటచే విక్రయముగాకయు; ధరలు పడిపోయియు నష్టము సంభవించుచున్నది. ఈపద్ధతి యిప్పుడు మార్పు జెందుట సంతోషదాయకము. ఇదియేగాక ఈ మేనేజింగు ఏజెన్సీ పద్ధతి వారసత్వపుహక్కుగా కొన్నివంశములందే నిలిచియుండుటచే శక్తిసామర్థ్యహీనులచేత నీపరిశ్రమల యాజమాన్యము పడుట కవకాశము కలదు.

ఇట్లు భారతీయపరిశ్రమల అభివృద్ధియందును, యాజమాన్యమునందును ప్రస్తుత మేనేజింగుఏజెన్సీపద్ధతి తృప్తికరమగు ఫలితముల గలుగజేయలేకపోయినందువలన భారతీయపారిశ్రామికాభివృద్ధిని శీఘ్రగతిని, విరివిగ సరియగుపద్ధతులపై నడుపగల నూతనసంస్థ లావశ్యకమని వేర చెప్పనక్కరలేదు. ఇట్టి నూతనసంస్థలే పారిశ్రామికబ్యాంకులు **(Industrial Banks)**. ౧౯౧౮లో ఇండియను ఇండస్ట్రియలు కమీషనువారు తమ రిపోర్టులో వాటి ఆవసరమును గమనించి అట్టి బ్యాంకుల స్థాపించువిషయమున గొన్ని సూచనల గావించియుండిరి.

"తానుచేయు మొత్తమువ్యాపారముకన్న చాలా అధికమగు వసూలుకాబడిన మూలధనముగల పారిశ్రామిక బ్యాంకు నొకదానిని స్థాపింపవలెను. ఈమూలధనమును వాటాల అమ్మకముమూలముననో, డిబెంచర్లవలననో వసూలు చేయవచ్చును. అట్టి బ్యాంకు తన ధనమందు విశేషభాగము నొకేసంస్థలోగాని, పరస్పర ఆర్థికసంబంధము గల కొన్నిపరిశ్రమలకూడికయందుగాని వినియోగింపరాదు. స్థిరాస్తి, యంత్రములు మున్నగువాని హామీపై ఋణముల నిచ్చునపుడు తగు విచారణసలిపి వాటిపరిస్థితులబట్టి వాటి మార్కెట్టువిలువ నిర్ణయించి వాటి తాహతులకు మించనీయక అప్పీయవలెను. ఈ బ్యాంకుధనములో విశేషభాగము పరిశ్రమల కార్యధనముక్రిందనే వినియోగింపవలెను. పరిశ్రమల స్థిరధనమను మూలధనమును సమకూర్చుటకై ఈ బ్యాంకు వలయు సలహాలను, సహాయమును జేయుచుండినను ప్రత్యక్షముగా కొంత స్థిరత్వ మేర్పడువరకు అట్టి మూలధనమును తానే సమకూర్చుపద్ధతి నవలంబింపరాదు. పారిశ్రామికబ్యాంకులు తమ వ్యాపారమందు ప్రతిపరిశ్రమవిషయమై ప్రత్యేకవిశేషముల బరిశీలించి, ఎవరి కెంతఋణ మీయదగునో, ఏపరిశ్రమకు నిజముగసహాయ మవసరమో గమనింపవలె." (Vide. p. 217. The Indian Industrial Committee Report.)

౧౯౩౧లో సెంట్రల్ బ్యాంకింగుఇంక్వయిరీకమిటీవారు ఈ సూచనల నాధారముగగొని, దేశీయపరిస్థితుల బాగుగ పరిశీలించి, పారిశ్రామికార్థికసమస్యను వివరముగ జర్చించియున్నారు. (Vide Indian Central Banking Committee Majority Report Vol. I. p 260 - 309; Minority Report p 318 - 348). మేనేజింగు ఏజెన్సీపద్ధతిపై పరిశ్రమ లాధారపడియుండుట సాధ్యమైనంతవరకు తగ్గింపవలెననియు, మామూలువర్తకబ్యాంకులకు పరిశ్రమలకు అధికముగ అన్యోన్యత గల్గింపవలెననియు, జర్మనువిధానమున బ్యాంకులు పరిశ్రమలవాటాలను డిబెంచర్లను కొని ప్రజలకు అమ్ముచుండవలెననియు, రిజర్వుబ్యాంకి యేర్పడగనే ఇంపీరియలుబ్యాంకు ఈవిధానమున మార్గదర్శికావలెననియు, అవసరమైనచో వివిధరాజధానుల ప్రభుత్వములు ప్రావిన్షియల్ ఇండస్ట్రియల్ కార్పరేషనులనుపేర కొన్నిశాఖలతో సహా పరిశ్రమలకు సహాయముచేయు సంస్థల స్థాపింపవచ్చుననియు, వాటాలమూలమున వసూలుకాని లోపమును ప్రభుత్వమువారు భరించవలెననియు, డిబెంచర్లను విరివిగ విడుదలచేసి మూలధనమునకు రెట్టింపుమొత్తమునైనను మొదట సేకరించవలెననియు, ఈ కార్పరేషనులు పరిశ్రమలకు దీర్ఘకాలఋణముల నిచ్చుటయందే తమవ్యాపారమును కేంద్రీకరింపవలెననియు, రెండుసంవత్సరములకు తక్కువకాని డిపాజిట్లు బుచ్చుకొనవచ్చుననియు మొదలగు అనేకసలహాలనిచ్చియున్నారు. ఈకమిటీవారందరేకగ్రీవముగ పరిశ్రమల కార్థికసహాయము చేయుట కొక ప్రత్యేక సంస్థ కావలెనని అంగీకరించినారు. మనూసుబేదారుగారు వ్రాసినటుల అట్టిసంస్థకేదో క్రొత్తపేరు పెట్టుటకంటె ఇండస్ట్రియల్ బ్యాంకులను పేరే అందరకు తెలిసినదగుటచే తగియున్నది. ఇక అవి ప్రతిరాష్ట్రమునకు ప్రత్యేకసంస్థగా నుండవలెనా, లేక ఒక కేంద్రసంస్థగా నుండవలెనా అన్నవిషయమునగూడ మనూసుబేదారుగారు సూచించినటుల ఒకే కేంద్రసంస్థయు, దానికి ప్రస్తుత ముఖ్యపారిశ్రామిక పట్టణములగు మద్రాసు, బొంబాయి, కలకత్తా, కాన్పూరు, లాహోరు, అవసరమువెంబడి ఇతర ప్రదేశములలోను శాఖలతోడను ఏర్పరచుటయే దేశమందన్నిపరిశ్రమలకును సరియగు న్యాయమగు సహాయము ప్రోత్సాహము కలుగుట కవకాశమున్నది. ఇట్టిసంస్థల యాజమాన్యమున ఆర్థికపారిశ్రామిక విషయముల బాగుగ నెరింగి ప్రత్యక్షానుభవము గలిగి దేశాభిమానముగల మర్యాదస్థులనే యేర్పరచుట ముఖ్యము. ఉద్యోగస్థులుకూడ ఈసంస్థ లాభార్జనకైగాక దేశీయపరిశ్రమల నభివృద్ధిచేయుటకై యేర్పరుపబడినదను విషయమును మనస్సునందుంచుకొనవలెను. కేవలము ప్రభుత్వమువారి పారిశ్రామికశాఖ యాజమాన్యమున కార్పరేషనుల స్థాపించిన ఉపయోగము లేదు. వారికి తగు బ్యాంకింగుఅనుభవము అవకాశము ప్రత్యేకజ్ఞానము లేకుండుటచే సరియగువిధానమున నడుపలేకున్నారు. మద్రాసుప్రభుత్వ పారిశ్రామికశాఖవారు సహాయమొనర్చిన అప్పులు వగైరామొత్తము ౯ లక్షలలో ఒక కాగితపుమిల్లుకు యిచ్చిన ౮ లక్షలు అంతపైవడ్డీ నష్టపోయిరట. ఇట్లే బీహారు, ఒరిస్సాలలోకూడ ప్రభుత్వపారిశ్రామికశాఖవా రిచ్చిన మొత్తము ౯ లక్షల అప్పులోను 3 లక్షలవరకు వసూలుకాని బాకీలుగా వదులుకొనవలసివచ్చెనట. ఇట్టి అధికనష్టముల గమనింపగా, ఈకార్యము బ్యాంకింగువిధానమునకు బాగుగా నలవాటుపడిన ప్రత్యేక సంస్థచేత నుండిన కాని యుపయోగము లేదనుసంగతి రూఢిపడును.

ఇతరదేశములలోవలెగాక భారతదేశములో పెద్దపరిశ్రమలకేగాక గృహపరిశ్రమలకుగూడ తగు ఆర్థికసహాయము లేనందున అనేక అద్భుతపరిశ్రమలు నశించుటయేగాక అనేకమంది కార్మికులకు జీవితవృత్తి లేకుండ బోవుచున్నది. ప్రస్తుత మీచిన్న గృహపరిశ్రమలన్నియు ప్రాంతీయషాహుకార్లపైనను, మార్వారీలపైనను ధనసహాయమున కాధారపడియున్నవి. ఈషాహుకార్లు అతిదారుణమగు వడ్డీల బుచ్చుకొనుచున్నారు. చాలచోట్ల నూటికి సాలుకు ౧౨½ మొదలు ౩౭½ వరకును వడ్డీ సర్వసాధారణముగ నున్నది. ఇంతఅధికవడ్డీ నిచ్చి కార్మికు లేమిలాభము బడయగలరో ఆలోచింపుడు. చిన్న గృహపరిశ్రమల కీబాధ దప్పించి చౌకవడ్డీరేటుల ధనసహాయము చేయుట అవసరము. అందుచే మనదేశమందీచిన్నగృహపరిశ్రమలకు తగు సహాయమిచ్చు ప్రస్తుతసహకారసంఘములవంటివి (Industrial credit Unions) కొన్ని బయలుదేరి, కార్మికులకు ముడిపదార్థములు సాధనసామగ్రి కొనుటకు వలయు ధనసహాయము చేయుచు వారు తయారుచేసిన వస్తువుల అమ్మకమునుండి తమబాకీ వసూల్లు

చేసుకొనుచు కార్మికులకు భుక్తి గల్పించుచుండవలె. ఇట్టి చిన్న సంఘము లన్నియు మరియొక కేంద్రపారిశ్రామిక-బ్యాంకునుండి అప్పులు పుచ్చుకొనవచ్చును. ఇతర దేశములలోకన్న మనదేశమందీగృహపరిశ్రమల కెక్కువ సహాయము ఆవశ్యకము.

పెద్దపరిశ్రమలకు ప్రోత్సాహసహాయముల నిచ్చుటకు ఫ్రాంసులోని సొసైటీజనరేల్ డిక్రెడిట్ మొబైలరువంటి సంస్థ ఎంతఆవశ్యకమైనదో ఇదివరకే గమనించియుంటిమి. మనదేశమున పారిశ్రామికాభివృద్ధికి ముఖ్యమగు సహజసాధనలన్నియు నున్నవి: ఎన్ని పాశ్చాత్యదేశములకో ఎడతెరిపిలేకుండ ఎగుమతిచేయుచున్నను తగ్గని ముడిపదార్థసంపత్తి, తమవస్తువు లమ్ముకొనుటకు హిందూదేశపు మార్కెట్టు మాకుండిన నింకేమికొదువ యని ఇతరుల విశ్రవీగజేయగలుగునంతటి సువిశాలమైన దేశీయమార్కెట్టు; పనిదొరకినచాలును ఎంతతక్కువకూలియైనను సరేయని, తినతిండిలేక అల్లాడు కోట్లకొలది కూలిజనము; స్వదేశమందు వినియోగపరచుటకు దగుపరిశ్రమలు లేనందున విదేశీయులకు దమధనమంతయు నొప్పగించుటయో, లేక తమధనమంతయు వెండిబంగారములలో వెచ్చించి నిరుపయోగముగ దమ ఐశ్వర్యమును మూలపడవైచియో, భూస్థాపితమొనర్చియో దేశీయైశ్వర్యమును వ్యర్థపుచ్చుచున్న ధనికులు కలిగియు మనదేశమిట్లు వెనుకబడియుండుట శోచనీయము. ఎన్ని నైసర్గికసదుపాయము లున్నను పారిశ్రామికాభివృద్ధికాని ఆర్థికౌన్నత్యముకాని తనంత దానే హఠాత్తుగా ఒకచక్కటి ప్రభాతమున మనము లేచి చూడగనే అవతరింపదు. వ్యక్తిఉద్యమములకు ప్రభుత్వసహాయము తోడ్పాటు, చేయూత అవసరము. పరస్పరసహాయ ముండినగాని జాతీయాభివృద్ధి కలుగదు. సిండికేట్లు, కార్టెల్సు, ట్రస్టులు మొదలగు పెద్దసంఘములుగా నేర్పడి విదేశీయపారిశ్రామికులు వర్తకసమూహములు వీలైనచోటులనెల్ల దమవర్తకము స్థాపించి, చలనములేకుండ, పూర్వపు దిగ్విజయముగొన్న మహాసమ్రాట్టులకంటె అతికట్టుదిట్టముతో దామాక్రమించిన ప్రదేశములందు దమ వర్తకపుహక్కును గాపాడుకొనుచున్న యీ దినములలో ప్రభుత్వమునకు దేశీయపరిశ్రమాభివృద్ధికై వలయు సదుపాయములను సంరక్షణల నేర్పరచి దేశమునకు బాసటయై నిలువవలసిన ఆవశ్యకత యెంతయో వేరుగ జెప్పనవసరములేదు. అనేకవిషయములందువలెనే పారిశ్రామికబ్యాంకుల స్థాపనలోగూడ ప్రభుత్వసహాయమత్యావశ్యకము. ఇతరదేశములలో ప్రభుత్వములు స్వయముగ నిట్టి పారిశ్రామికబ్యాంకుల మూలధనములో గొంతభాగమును తామే యిచ్చి వాటి యాజమాన్యమున కొంతమంది ముఖ్య అధికారులనో, డైరెక్టర్లనో నియమింతురు. ప్రజల కీసంస్థలందు విశ్వాసముకల్గించుటకై శాశ్వతముగనో లేక కొంతకాలమువరకునో మూలధన వాటాదారులకు యేటేట కొంతరాబడిని ఆబ్యాంకు యిచ్చునట్లును, అట్లీయలేని యేండ్లలో ప్రభుత్వమువారే స్వయముగ ఇచ్చుటకును అభయహస్త మీయవలెను. జపానుదేశ పారిశ్రామికబ్యాంకు స్థాపించిన క్రొత్తలో జపానుప్రభుత్వము ౫ సంవత్సరములవరకు ౧౦౦ కి ౫ యెన్నులచొప్పున లాభమును వాటాదార్లందరకు గారంటీ చేసెను. ఇదియేగాక అమ్ముడుపోని వాటాల ప్రథమమున గవర్నమెంటువారే కొనుట, ఇకముందు స్థాపింపబోవు కేంద్ర రిజర్వుబ్యాంకులో పారిశ్రామికబ్యాంకులకు వలయు తగు సదుపాయముల నేర్పరచుటయు ముఖ్యము. ఇదిగాక ప్రభుత్వమువారి కవసరమగు వస్తువులనెల్ల నిట్టి దేశీయపరిశ్రమలనుండియే కొనుచుండినయెడల పరిశ్రమలకు సరకు విడుదలయగుటయందు ఆలస్యములేక, ధనము వెంటనే చేత జిక్కుచుండును. గౌహతీలోని ప్రభుత్వమువారి వాణిజ్యస్థాన మీ విధానమున అస్సాము సిల్కునంతను కొని ఆపారిశ్రామికులకు వెనువెంటనే ఆర్థికసహాయము కలుగజేయుచున్నది. అట్లు గుత్తగాకొనిన సరకును ప్రభుత్వడిపోలు వర్తకులకు విడుదలచేయుదురు. అందుచే వర్తకులపై నాధారపడవలసిన అగత్యము పారిశ్రామికులకు లేదు. ఈపద్ధతినే అన్నిప్రాంతములలోను ప్రభుత్వము పారిశ్రామికవస్తువులకు సరియగు మార్కెట్టును గల్గించి, ఆర్థికసహాయమును జేయవచ్చును. మద్రాసుప్రభుత్వమువారిచే "మద్రాసు స్టేటు ఎయిడ్ టు ఇండస్ట్రీసు" అనుచట్టమును బ్యాంకుల కందుబాటులోలేని, ఇతర ఆర్థికసహాయములేని పరిశ్రమలకు వలయు సహాయము ప్రోత్సాహమునిచ్చి, ఆపరిశ్రమ లభివృద్ధినొందించుటకై యేర్పరుపబడెను. ఇట్టి చట్టముల ప్రతిరాష్ట్రప్రభుత్వమువారు నేర్పరచి చట్టములజేయుటతో తృప్తినొందక వాటికార్యక్రమము నమలునం దుంచినయెడల క్షీణించి వినశించిపోవుచున్న అనేక అమూల్య గృహపరిశ్రమలు పునరుద్ధరింపబడక మానవు.



శ్రీకృష్ణరామ భూపాలకుమారుల
గద్వాలమహారాణి శ్రీ శ్రీ ఆదిలక్ష్మమ్మవారి
మనుమడు; దత్తపుత్రుడు. గద్వాలమహారాజు.



చివుకుల వెంకటరమణశాస్త్రి,
అరపిరాల వెంకటనారాయణశాస్త్రిగార్లు
(భారతజ్యోతిర్విద్యాలయము)



కె. భీమరావుగారు, బళ్లారి.
శతవృద్ధుడు కాని శరీరపటిమ తగ్గలేదు.
దృష్టి చక్కగా నున్నది.
బాసుగా నడువగలరు.



మేజర్ జనరల్ జె. ఇ. యస్ బ్రిండుగారు



జాన్ బారిమోర్ (సుప్రసిద్ధ నటుడు).



డా. కట్టమంచి రామలింగారెడ్డిగారు
[illegible] యస్. సి.



శాంప్సన్, జయశంకర్ గార్లు



డా. ఇచ్ఛపురపు రామకృష్ణరావుగారు
డి. యస్. సి.



శ్రీమతి కొల్లా కనకవల్లి తాయారమ్మగారు
మహానందిలో జరిగిన
పదవ మహిళామహాసభాధ్యక్షురాలు



శ్రీమతి తుర్లపాటి రాజరాజేశ్వరమ్మగారు
దక్షిణభారత గ్రంథాలయ సమ్మేళన
సన్మానసంఘాధ్యక్షురాలు



నరసింహదేవర
సుందరరామశాస్త్రిగారు



రావ్ బహదూర్ బి. విశ్వనాథుగారు
(సామ్రాజ్యవ్యావసాయక రసాయనవేత్త)



డా. జి. యస్. అరండేలుగారు
(దివ్యజ్ఞానసమాజాధ్యక్షులు)



కె. ఆర్. యస్. రావుగారు
(కొత్త అకౌంటెంటు జనరల్, మదరాసు)



హుసేనాలీ రహీంతుల్లాగారు
(బొంబాయి కొత్తమేయరు)



మీర్ ఇక్బాల్ హుసేనుగారు
బనగానపల్లె దివాను



క్లెమెంటు మల్లింగ్సు
మేటూరుఆనకట్ట నిర్మించిన ఇంజనీయరునకు
'నైటు హుడ్' బిరుద మొసగబడెను



మథురదాసు త్రికంజీ



సర్ షాదీలాలుగారు
(ప్రీవీకౌన్సిలు సభ్యులు)



మదనలాల్ జైనుగారు
(ఒసాకోలో హిందూస్థానీ పర్షియన్
ప్రొఫెసరు)



ఇ. కౌన్రాన్ స్మిత్తుగారు
(ఇండియా ప్రభుత్వపు సంస్కరణల
కార్యదర్శి)



సర్ అబ్దుల్ కాదిర్‌గారు
ఇండియాకౌన్సిలులో ఉమర్ హయత్‌ఖాన్ తివానా
గారిస్థానమున సభ్యులుగ నియమింపబడిరి.



యు. బా పే గారు
(బర్మా మంత్రి)

## ఏలూరు అన్న, వస్త్ర, వైద్య, విద్యాదాన సమాజము

ఈ సమాజము 1913 సం॥ స్థాపింపబడెను. దీనికి స్థలము ప్రభుత్వమువారు ధర్మముగ నొసగిరి. బొమ్మా రత్నంగారు భవనమును కట్టించి ధర్మముగ నొసగిరి. ఇచ్చట ప్రతిదినము అశక్తులకు అన్నదానము జరుగుచున్నది. సంవత్సరమున కొకసారి 15 డిశంబరు తేదీని 1500 పదిహేనువందలమందికి పైగా బీదలకు వస్త్రదానము జరుగుచున్నది. వేసవికాలము మంచినీళ్ల చలివేంద్రలు పెట్టబడుచున్నవి. వైద్య, విద్యాదానములు జరుగుటకు ప్రయత్నములు జరుగుచున్నవి. దాతలపేరున ప్రతి సంవత్సరము నెలరోజులు రెండవపూట అన్నదానము జరుగుచున్నది. అనాధశరణాలయముకూడ స్థాపించుటకు ఏర్పాటులు జరుగుచున్నవి. రు. 10 లు లగాయతు శాశ్వతనిధి ధర్మము నిచ్చి రశీదులు, పట్టాలు పుచ్చుకొని సమాజాభివృద్ధికై సహాయపడ కోరుచున్నాము. సమాజమునందు సాయంత్రములందు వైద్యదానము జరుగుచున్నది. యితర వివరములకు:—

1. రా. బ. మోతే గంగరాజు జమీందారు
2. కొత్తమాసు శీతారామయ్య (సోల్ ట్రస్టీలు)
3. పసుమర్తి పురుషోత్తము (ప్రెశిడెంటు)
4. మద్దుల వెంకటచిన్నరాజు } (వైస్ ప్రెసిడెంట్లు)
5. నున్న గంగరాజు }
6. కందుల రామయ్య (శెక్రటరీ)

మహాగీతిక

ఓడల రేవులో ఓయారి ఎవరంటె
ఓ యని పలికింది వైనతేయము

గాఢాంధకారంబు కామోహ నమావాస్య
రూఢిఁ దదాస్యంబు రూపింప సహాస్య
మోడలరేవులో ఆడున్న దెవరంటె
ఆటాడి పోయింది వైనతేయము

కవ్వించి సాగరూడు నవ్వించి సాగరూడు
ఇవ్వాడ కేలొస్తి వెవ్వరై వన్నాడు.
నాయిపకమే టంది నాయీల తో టంది
నాయిసురునీ టంది నాదొక్కమా టంది.
ఓడలరేవులో ఓయారి ఎవరంటె
ఉవ్విళ్లు ఊరింది వైనతేయము.

నల్లించి సాగరూడు బెల్లించి సాగరూడు
కళ్లేవి నీకంటు కల్లోలు డైనాడు.
నామంచినీళ్లకు నీమేలు మీ లన్ని
ఏమైనవ న్నాది సామి! చూడన్నాది.
ఓడలరేవులో ఓయారి ఎవరంటె
ఉప్పొంగిపోయింది వైనతేయము.

మత్తిల్లి సాగరూడు జొత్తిల్లి సాగరూడు
పోటేల ఏలొస్తి వొత్తిల్లుమన్నాడు.
అత్తోరి యిల్లంది చిత్తము నీ దంది
ప్రత్యేక మవ్వేళ పాటుందొ చూపంది.
ఓడలరేవులో ఓయారి ఎవరంటె
సయ్యాట గొలిపింది వైనతేయము.

కెరటాలసాగరూడు అరకాల నెగదన్ని
మగరాలపోతల్లె ఎగబోసె నుచ్చిళ్లు.

ఓడలరేవులో ఓయారి ఎవరంటె
అంకింది జంకింది వైనతేయము.

విఱుచూకు పైబడకు కఱువాకు మఱి అంది
డీకొనకు కలబడకు నాకొక్క వేఱంది:
ఓడలరేవులో ఓయారి ఎవరంటె
పాటోహాటి పాడింది వైనతేయము.

ఓలంటు సాగరూడు వాల్లాడి వొళ్లో కొచ్చె
నతగుల్లముత్తెపుగుల్ల జతగట్టి తాళంవేసె.
స్వేచ్ఛలిందంటేవచ్చా ఇచ్ఛలిందంటే వచ్చా
కచ్చించుభంగ మంటె అచ్చట్నెఆగేదాన్ని.
ఓడలరేవులో ఓయారి ఎవరంటె
ఓడ్చింది కన్నీరు వైనతేయము.

జాలేసి సాగరూడు సవరించి సాగరూడు
నీచెఱగు నన్నీముళ్లెనే విప్పేనంటూ మెఱసె.
ఓడలరేవులో ఓయారి ఎవరంటె
ఉఱికుఱికి పరుగులెత్తె వైనతేయము.

సరసాలసాగరూడు చక్కన్నిసాగరూడు
ఎఱపీతలఁదఱిమిదఱిమిఎలయించెక త్తిరిపదును
మొగలోనఖగరాజునై ముందూకుపోతానింక
నీమది కెగసియెగసి నీలాలనీర మాతా.

లోతైనసాగరూడు లోకోత్తరసాగరూడు
తానైతే వెన్నుదన్ని తొడత్తు లేచె నిట్టె.
ఓడలరేవులో ఓయారి ఎవరంటె
ఒగ్గింది సిగ్గులబుగ్గ వైనతేయము.

ముద్దెట్టుకోకూనన్నూ హద్దిదిగో నీకూనాకూ
నానీరు తియ్యన్నీరు నీనీరు ఉప్పన్నీరు.

మొగవాడుసాగరూడు మొనగాడుసాగరూడు
చలకొచ్చి ముంతదాచే జాణవేలంటూకులికె.

ఓడల రేవులో ఓయారి ఎవరంటె
కోనదో నెక్కేనంది వైనతేయము.

తెడ్డూని సాగరూడు మెడ్డిస్తా డిటూ అటూ.
ఒడ్డేటిచూపుల్ చాయగొడ్డేమె కోడలఅంటూ.

గడ్డయినా జాలరిచుక్క పడ్డాపోరుగు నంది
మొగలిపువ్వోసనొడ్డు తగిలిందివోరిగే నంది.

ఓడల రేవులో ఓయారి ఎవరంటే
ఉప్పట్టుకున్నానంది వైనతేయము.

పాటాటి సాగరూడు పలవిస్తా డుండియుండి
పగటేల సాగరూడు పరికిస్తా డుత్తమొండి.

చాటింక లేదూమనకు మాటింకా లేదూమనకు
సంద్రంబు నైనానంది అందుకే వచ్చానంది.

ఓడల రేవులో ఓయారి ఎవరంటె
సందేల కందాలంది వైనతేయము.

అదియేంటి అందమంటూ అరసేడుసాగరూడు
ఆరీరి నందటి బిలచి అడిగేడు సాగరూడు.

సద్దాటి పొద్దుకూకే యద్దగోడెనక బింబం
మాపాగే తోపూరంగు మఱసిపోనావ అంది
ఓడల రేవులో ఓయారి ఎవరంటె
పట్టీలు కొట్టింది వైనతేయము

నీలైనసాగరూడు గోలైన సాగరూడు
ముప్పేట కాయమబ్బు కెగరేసి పండువట్టె
ఓడల రేవులో ఓయారి ఎవరంటె,
కొమిరెలేతని యంది వైనతేయము

దారిచ్చి సాగరూడు సౌరెక్కి సాగరూడు
పైరుగాలూపిరోసి పూరించె పెద్దసంకు
నాలోకి ఊదామంది నాదం భంభం మంది
ఆనంద మంచేనంది అందూకె వచ్చానంది
ఓడల రేవులో ఓయారి ఎవరంటె
ఓడెక్కుతున్నా నంది వైనతేయము

మేడెక్కి సాగరూడు మిద్దెక్కి సాగరూడు
నా కెరటమ్మంత యెత్తు నీ కెరటమేన ? అనె
నా కెరటమేదో సెప్పి నీ కెరటమేదో సెప్పి
నా కాసిచూచినవ్వ అందూకె వచ్చానంది
ఓడల రేవులో ఓయారి ఎవరంటె
ఉన్నానీ ప్రక్కనంది వైనతేయము

తవణిల్లి సాగరూడు హావణిల్లి సాగరూడు
పక్కింకా సరిదిసరిది దగ్గఱ సాపేసేడు
నొక్కేయకు జీవామంది చక్కిలిగిలి బావా
చక్కనిముత్యాలకోవ నాకీవా అంది [అంది
ఓడల రేవులో ఓయారి ఎవరంటె
కోనసీంపిల్లానంది వైనతేయము

తోట్లంటా సాగరూడు పేట్లంటా సాగరూడు
ఊటాడిపోయేడు వేటాడి పోయేడు
కనబడ్డపిల్లకు పగడాల్ నిలబడ్డపిల్లకు ముత్యాల్
వినువీధి చినుకుల్లాగు విరజిమ్మె సాగరూడు
చిక్కితిసీ చేనంది నక్కితి నీలోనంది
అక్కఱ లేదందీ ముత్యాల్ అక్కఱ లేదందీ పగ
ఓడల రేవులో ఓయారి ఎవరంటె [డాల్
అయినింటి పడుచునంది వైనతేయము

ఇసుక తెరఆరుబయట బిసిబిసి మాటల్ వెట్టి
గుసగుసల్ లోకిదింపి గుసిసేడు సాగరూడు
పరవశమయ్యేనంటు పరువుల్లు ద్రొక్కి త్రొక్కి
బిసబిసనడకనలసి ముసిముసి నవ్వింది
ఓడల రేవులో ఓయారి ఎవరంటే
పైనాలబాలనంది వైనతేయము

వెన్నెట్లో సాగరూడు చీకట్లో సాగరూడు
ముచ్చట్లనచ్చట్ల నేంవైన మంటాడు
చెప్పేదికూ సంత-ఒప్పేది కాసంత
సాగారుక దెకంట-నాగాసరమూదంట
సప్తమహాఋషులు-శపబిపలః గలగేరు
చెప్పన్న రాజూలు-గజిబిజిని దలకేరు

చెప్పేదికాసంత-ఒప్పేదికూసంత
సాగారుపజ్జానె-మూగేరు పజవింత .
ఎవరెవరికేంగావా-లవిరళము నానడక
అవశనైపోతూంట-నంబూధి నోబుటక
ఆబుటకచిటికైనా-అగపిస్తవెన్నెన్నో
ఆవార్తవినిపిస్త-నవధారు! అవధారు!

* ఇపుడంటె
ఈరేవు
ఈలాగున్నది కాని
అపుడు మేడల పంకా
లపుడుమాడల శంఖా
లపుడు ఓడలరాక
లపుడు ఓడలపోక
లపుడు చేడెలజింక
లపుడు కోడెలపొంకా
లవురా!
అవధారు ! అవధారు ! *

చెప్పేదికాసంత-ఒప్పేదికూసంత

*　　*　　*

కుంచాలకొలిచేరు-పైడికాసులగుట్ల
మంచాలకోళ్లక్రిం-దుంచేరుపాతట్ల
ఏడుపాయలతియ్య-నోడీకహోరెత్త
గోదారియీపాట-పాడూగనాకూడ
అవధారు అవధారు!

*　　*　　*

పెద్దదోభవంతి-మధ్యనోమండూవ
మండూవపైనెగురు-తూండేది యొకగద్ద
ముద్దినుసులింటుంటె-గద్దాట యెవరికి?
ముద్దుగారుమగువ-ముద్దులెక్క చూసేది
ఓడెక్కి మగడెల్లి-యేడాది పైదాటె
మేడెక్కి మనసుగా-కాడుండె చూసేది
నీళ్లైనమండూవ-కేళాకూళిమీద
నీలిరంగాకాశం-తేలిపోయుండేది
చెప్పేదికాసంత-ఒప్పేది కూసంత

*　　*　　*

పద్దాకకలిగుంటె-పైనైల్య మెవరికి
సొగసైన యమ్మగువ-పగడాలె క్రుచ్చేది
ఓడెక్కి మగడెల్లి-యేడాది పైదాటె
మేడెక్కి మనసుగా-కాడానె క్రుచ్చేది
చెప్పేది కాసంత-ఒప్పేది కూసంత

*　　*　　*

మండూవగుండానో-గండుమీనుజాతి
కేళాకూళినీట-కేరింత మెఱసింది
పడుచువిరహాణిదాని-నొడిసిపట్టి, నిండు
కడుపునీల్చి, తాను-పడిపోయెనేలాపై
చెప్పేదికాసంత-ఒప్పేది కూసంత

*　　*　　*

సంపదెంతుంటేమి-జాలారి నైజంబు
వాలారుగోళ్లానె-వాల్గంటి చీల్చింది
రంగారు తనమగని-బంగారు ఉంగరము
ఆ చేప అంగుట్లో-దొంగట్లు డాగుంది
విభవమెంతుంటేమి-ప్రేమాకు నైజంబు
విభుని యుంగరమాట-వెలది మూర్ఛిల్లింది
చెప్పేది కాసంత-యొప్పేది కూసంత

*　　*　　*

రాముాలయుంగరము-సీతమ్మ చూచింది
సీతమ్మకవ్వేళ-చెఱదప్పిపోయింది
నామగనియుంగరము-నేజూస్తు సూస్తానె
జముచెఱనుబడిలీనని-జవరాలు దన్నుకునె
అయ్యయ్యొ! నానాథ!-ముయ్యేరు ముట్టేదే
నీయోడ కొయ్యంటూ-నిలువూన నీరయ్యె
హాయినిండుండాక-మాయవర్తక మేల
నోయీ! నాసామంటె-ప్రాయ మస్థిరమంటి

కాయ మస్థిరమంటి
గేహ మస్థిరమంటి
మోహ మస్థిరమంటి
ఆహా! స్వస్థుఁడవైతే?

పెద్దింటివారితో - పెనకూవ లేలంటె
ఏడుమండూవలోగి - లేనూగడుదునంటి
ఈలాగువాపోయి - వాపోయి ఆపణతి
చేపవచ్చినజాడ - చూపొగ్గి చూసింది
చెప్పేది కాసంత - ఒప్పేది కూసంత

* * *

పాతాళగంగంట - పైకెక్కి తనయింటి
కేళాకూళిదాటి - మింటికి మెఱసిందొ?
ఆకాశగంగంట - ఆగలేక పరిగ
మండూవగుండాచూ - రండాను గురిసిందొ?
మాయదారి చేప - సాయాము చేసేదొ
కోయకొన్నయ్యో! - తీయకున్నయ్యో!

అంటూనువాపోయి - వాపోయి ఆపణతి
చేపచిక్కినజాడ - చూపొగ్గి చూసింది
గ్రద్దనింగిఁదోఁచె - ఉప్పురుద్దని చేప
బద్దలుచూపిస్తె - వద్దంది ఆగద్ద
ఉప్పురుద్దిన చేప - బద్దాలుచూపిస్తె
వ్రాలింది ఆగద్ద - జిమ్మరుచులగద్ద!
చెప్పేది కాసంత - ఒప్పేదికూసంత

* * *

కళ్యాణి తనమగని - కుశలమడిగెను: గద్ద
అశరీరవాక్కల్లె - ఆడిపోసెనిట్లు
ఏమగఁడు సుస్థిరుఁడు?
ఏమగువ సుస్థిరము?
ఏసొగసు సుస్థిరము?
ఏసోకు సుస్థిరము?

వాసిగానువినుము - వైనతేయముతోడు
వాసీగానువినుము - కౌశికేశ్వరుతోడు
ఈపట్న మీపైని - నేపాడుపెడుతున్న
నీప్రేమలీమీఁద - నేయేటఁ గలిపేవా?
ఈపట్న మీపైని - నేపాడు పెడుతున్న
నీకుచ్చుపవడాల - నేనీటఁ గలిపేవా?
అదిముందు జెప్పంచు: - నాగిందియాగద్ద
మదిరాక్షి మోమప్పుడె - మాటిన ట్లాతోంది!
చెప్పేది కాసంత - యొప్పేది కూసంత

* * *

మండూవలోగిలి - మండిపోతున్నాది
ఊరుపరుపొడిచి - కాఱుప్పు గట్టింది
చెప్పేది కాసంత - యొప్పేది కూసంత

* * *

ముంగొంగునుంగరము
ముంగొంగు నుండఁగనె
ముంజేతి పవడాలు
ముంజేతి నుండగనె
ముదితతుఱుము ముక్కు-
నదిమిగ్రుచ్చియెత్తి
యాకాశ వీధికి
నయ్యాబల నెగయించి
ఆగద్దవలయాలు
సాగించి సాగించి
ముంగొంగునుంగరము
తనముక్కు కెక్కించి
గ్రుక్కుమిక్కనకుండ
గూర్చుంది యొకతాడిఁ
బగడాల పేరేమొ
తనగోళ్లఁ బెనచింది
చెప్పేదికూసంత - యొప్పేది కాసంత

* * *

బాలవివశయయ్యో!
లోల యవశయయ్యో!

గోలసామ్మసిల్లె
నీలాలకు నేలబుణము సెల్లె!
చెప్పేదికూసంత-యొప్పేది కాసంత

*    *    *

అశరీరులైరివిధి-వశమూన దంపతులు
అశరీరులైన,ఆత్మల-వశిష్టత మెఱయు
ఓడల రేవులో-ఓయారి యేదంటు
మగడొచ్చిపిల చేడు-మగువేదీ?
ఓడల రేవులో-వగలాడి యేదంటు
భర్తొచ్చిపిల చేడు-భార్యేదీ?
గాడాంధకారంబు-కామో సమావాస్య
రూఢినేయాస్యంబు-రూపింప నపహాస్య
మోడల రేవులో-ఉన్నవా రెవరంటె
ఊడేసిందాగద్ద-ఉంగరము పవడాలు
పాతేసిందాగద్ద-పగడాలు వుంగరము
పరొడిచినపంచనదిలో-ఎగరేసిం దాగద్ద
కాఱుప్వపంచనదిలో-కడిగేసిందాగద్ద
కన్నీళ్లివి యెవరీవని-కదలేసిం దాగద్ద
ఓడల రేవులో-ఉన్నా నీ(క్క-నంటూ
మగువంటేమూఱు పలుక-మగడు లేడు
ఓడల రేవులో-చన్నా నీ(క్క-నంటూ
భార్యంటె వెంటాడింప-భర్త లేడు

అదియెల్ల ఉప్పెనకడలి
అదియెల్ల అప్పులపాయ
ఓడల రేవులో-ఓయారి ఎవరంటె
పంచనదీపైదీఅంది-వైనతేయము

*    *    *

* గద్దెక్కిన తాడిమొదలు
కదలించి వంతెనగట్టి,
దరికంట దాటిచూపి
కరువలినే కతలుగొల్పి
చెలపన్ని చెట్లగుండా
పులినాల మిలమిల నెండ
చెలియలికట్టకంట
కలకట్టుచున్నదదిగో! *

*    *    *

ఓడల రేవులో-ఓయారి ఎవరంటె
అచ్చలలయొజ్జానంది-వైనతేయము
ఓడల రేవులో-ఓయారి ఎవరంటె
అక్షరశర్యోనేనంది-వైనతేయము
మంవోడు సాగగూడు-మనివోడు సాగరాడు
సర్వేజనరక్షంటు-సాయంగమ్మన్నాడు
ఓడల రేవులో-ఓయారి ఎవరంటె
ఓయని పలికింది-వైనతేయము.

---

* [గోదావరిపాయ వైనతేయము నాఁబడునది కొమరిగిరిపట్నము కడ సముద్రమునఁ గలియు జాడఁ జూడ సొంపగు. ౧౯౩౫ వ సంవత్సరపు వేసఁగిని దినత్రయ మాగ్రామమున విడిసి తత్పరిసర ప్రాంతమునందలి ప్రకృతిశోభ చూఱకొను భాగ్యము నాకు లభించినది. అప్పుడొక యుదంతంబు వింటిని. "కడచే ఓడలరేవు" పేరఁ బఱగు పల్లెవాండ్రపల్లె కలదని యయ్యది మున్ను మిక్కిలి యుచ్ఛస్థితినుండి సకల భాగ్యభోగ్యము లనుభవించి కాలగర్భమునలయించిన" దని. ఆచరిత్ర స్మృతిని సాగరసంగమ ప్రకృతిశ్రుతుల మేళవించి ౩-౬-౩౫ కి నే విరచించిన గేయమే వైగేయము. ఆయది సంవాదము, కత, యుపసంహార మని మూడు భాగములుగ విభజించి గ్రంహించనగు.—క. వేం.]




సౌందర్యపిపాస —వజ్ఝ బాబూరావు

# అజ విలాపము

గుఱ్ఱం వేంకటసుబ్రహ్మణ్యం

ఆసువు లుడిగి వెలవెలనన్ప్రియ నోడిని
    గూర్చొనంగఁ జేర్చుకొని విభుండు
వేగుఁతఱిని మలినభాగిని మృగరేఖ
తోడి చంద్రునట్లుతోఁచె నపుడు

కంఠ మశ్రుతతిని గాడ్పడ విలపించె
తనకు సహజమయ్యు ధైర్యమేఁది;
ఇనుము గూడ మెత్తదన మొందుఁ గుమ్మున
దేహి విషయ మేమి తెలుపవచ్చు!

పువ్వులు సైత మంగమును జోఁకినంత నే
ఆయువును హరింప నగున యేని
సంహరించువిధికి జగతిని వేఱేది
కటకటా! యిఁకఁ బరికరము గాదు!

మృదులవస్తువున నె మృదువస్తువును జంప
నడరెనేమొ యాప్రజాంతకుండు;
హిమని షేకమున నె సమయు నంభోజాత
తనరు నాకుఁ దోలి నిదర్శనమ్ము

అలరుదండ యిదియుఁ బ్రాణాపహారి యే
నేల నన్నుఁ జంప దేదనుదాల్ప?
అవును విష మొకప్పుడమృతమ్ము,నమృతమ్ము
నవును విషమ యీశ్వరాభిమతిని.

అట్లుగాక వేధ యశని గల్పించెనా
నాదు భాగ్య మొకట నష్టమగుట;
కాని తరువు కూలకయ నిల్చెఁ; గూలెను
దాని నూదిన పువుదాల్పుతీవ.

చిరము దోషినైనఁ జేయుదానవు గావు
న న్నవజ్ఞ నీవు మున్ను దయిత;
పలుకఁదలఁప వొక్కపట్టున నిట్లేల
అనపరాధుఁడైన జనుని నితని?

తెలిసికొంటివినను, ధ్రువము, శుచిస్మిత
వంచకుండు కపటవత్సలుఁ డని
కాన మరల రాక లేని యాపరలోక
మేఁగినావు చెప్పకేమి నాకు.

దయిత ననుసరించి తరలియుఁ దానిట్టు
లేల మరలివచ్చె నీవు లేక
నాదు పాడుజీవనం బిది యోర్చుత
అధికవేదనమ్ము నాత్మకృతిని

నిలిచియున్న దింక నీదు నెమ్మోమున
సురతఖేదజమ్ము చిఱుచెమరును;
అస్తమించి తీవ యాత్మతో నేలయీ
అంగభృత మసార మఖిల మిసిరో

మనసునను నొనర్ప మును విప్రియము నీకు
ఏల నన్ను వదలి తీవు బాల?
ఇలకు శబ్దపతిని, కలవాఁడ నీయంద
భావబంధరతిని బంధురముగ

తుఱుముకొన్న విరులు తుమ్మెదకాంతులు
రింగులొప్ప నీదు ముంగురులను
కదలఁజేయు గాలి కరభోరు, బ్రదికించు
నిన్నటంచు శంక నెఱపు నాకు

నీవు వేగ తేఱి నాపిపాద మడంప
నర్హ్మరాల వువిద యట్టు లెట్లు
శేయి వెల్గువెల్గి మాయించు నోషధి
మంచుకొండగుహ వసించు తమము.

ఆడు ముంగురులును, అణఁగిన పల్కునో
నీముఖమ్ము గ్రాఁచు నామనమ్ము
రవము మాని లోన నివసించు తేంట్లతో
నిశిని నిద్రవోవు నీరజమటు.

చంద్రు మరలఁ బొందు శర్వరి, చక్రమ్ము
ద్వంద్వచరముఁ బొందు దయిత మరల.
వీర లిర్వు రిట్లు విరహావధిజ్ఞుముల్
కాల్ప వేల పూర్ణగతవు నన్ను?

నవకిసాలశయ్యఁ దవిలియుఁ గడునొచ్చు
నేది మృదులతరము నీదుమేను
ఇదియ యది సహించు నెట్టులు వాపోరు,
చితిని నెక్కుటయును జెప్పఁగదవె.

రశన యిదియు నీకుఁ బ్రథమరహస్సఖి
నీవు పెద్దనిదురవోవుచుండ
గతివిలాసముడుగఁగా నీరవవ్యథార్తి
ననుమరణయ వోలె నగపడుఁ జుమీ.

కోకిలమ్ములందుఁ గుట్మల మధురోక్తి
అంచలందు నడ మదాలసమ్ము
ఆఁడులేళ్లఁ జంచలాలోకనమ్మును
విభ్రమమ్ము పవనవీజ్యలతల.

తీర్చితివి నిజమ్ము త్రిదివోత్సుకవెయయ్యు
నన్నుఁజూచి యీగుణమ్ము లీవు
కాని నీవియుక్తిఁ గడుదుఃఖము భరింప
శక్తగాదు నాదు స్వాంత మిపుడు.

నెమ్మి వీరికి ఫలినీసహకారుల
కు మిథునమును నీవ కూర్చినావు
పెండ్లికార్యము జరిపింపక యింతలో
అరిగితనుట చాల ననుచితమ్ము.

నీవు దోహదమ్ము నెఱపినా వీయశో
కమున, కదిసనుచు సుమమును తావ
కాలకాభరణము నర్పింతు నేనెట్లు
తరుణివో నివాపసరముగాఁగ.

అందెరవళితోడి యాపదానుగ్రహం
బన్యదుర్లభమ్ము నాత్మఁదలఁచు
ననఁగ నీయశోక మలరు కన్నీరుజాల్
కురియుచో సుగాత్రి కరము పొగులు.

నీదు నిశ్వసనపు నెత్తావిబోల్ వకు
ళముల గ్రుచ్చితిని విలాసకాంచి
అర్ధచితమ, పూర్తియనక కిన్నరకంఠి
ఏమిటిది సుషుప్తి నేలినావు.

దుఃఖసౌఖ్యసములు తోడివారెల్లరు
శిశువు వీఁడు విదియశశిసముండు
నేరనైకజీవి, నీపైద మేమందు
తలఁచుటకును చాల దారుణమ్ము.

ధృతి తొలంగె, రతియుఁ దీఱె, సంగీతమ్ము
ఇమ్ముగా, దనుత్సవమ్ము బుతువు,
నగలవలని ఫలము నష్టమ్ము, శయనీయ
మమితశూన్య మిప్పు డయ్యె నాకు.

గేహినివి, మంత్రివి, రహస్సఖివి, సలలిత
కళలఁ బ్రియశిష్యురాలవు, కరుణవంక
మోమిడని మృత్యు విటు నిన్ను గ్రుచ్చిలించి
ఏమి మిగిలించె నాది నీవెఱుఁగఁ జెపుమ.

మధురమైన మధువు మద్వదనార్పితం
బట్లు, మదిరనయన, యాస్వదించి
బాష్పదూషితమ్ము, పరలోకజుషము, నే
నంజలించు జలము నానఁగలవె.

ఉండుఁగాక విభవముండదు సుఖ మింక
నీవులేక యజున కెంత మాత్ర
మితరవిషయనిరనుకృష్టుఁడనైన నా
యఖిలవిషయములు త్వదాశ్రయములు.

కాంతఁగూర్చి యిట్లు కరుణరసార్థమ్ము
లేడ్చుచుండఁ గోసలేశ్వరుండు
స్రుతమరందబాష్పతతిదూషితము లయ్యె
నచటనున్న భూరుహమ్ము లెల్ల.

అంత నెట్టులెటులో యాతని యొడినుండి
బంధుగులు తొలంచి సుందరిని, త
దంత్య మండితాంగి ననలార్పితముచేసి
రగురుచందనేధ్మమైన చితిని.

నృపతి ప్రమదతోడ మృతుఁడయ్యె దుఃఖాన
అన్న లోకవాదు నరసి యతఁడు
దేవితోడ నగ్ని దేహమ్ముఁ జేర్పఁడ
కాదు జీవితేచ్ఛ కల్గుకతన.




OIL










ZANDU'S
FLUID EXTRACT OF
IODISED
Sarsaparilla
PREPARED FROM
INDIAN SARSA
ROOTS
WORKS



తెనాలితాలూకా వైద్యసంఘవార్షికోత్సవము



సారస్వతమండలి, బందరు



శచీంద్రుడు

**(Sachindra)**

—Ankala Venkata Subba Rao




ఆంధ్రరాష్ట్రీయ జాతీయపతాక మహాసభ, గుంటూరు



గుంటూరుమండల రాజకీయమహాసభ



చెన్నపురి రాజధాని పురపాలకసంఘములమహాసభ, గుంటూరు



పూనా న్యాయకళాశాల ఆంధ్రవిద్యార్థిసమాజము

# సాంఖ్యయోగము
(తెనుఁగు)

పసుమర్తి కృష్ణమూర్తి

## ఒక మనవి

గీతను జదువవలయునను సంకల్పము దోఁచినది. దీనినిఁ బూజ్యపాదులగు ఊటుకూరి వేంకటగోపాలరావు పంతులుగారి కెఱింగించితిని. "సద్గురుముఖమున నుపదిష్టుఁడవై చదువుము" అని వారి యాదేశమైనది. అటులేయనుకొంటిని. కాని యది నా కసాధ్యమని తోఁచినది.

అంతలో మహాత్ముఁడు మా ప్రాంతములకు విజయము చేయుదునని యుండెను. అపుడు మా కాలేజీ స్టూడెంటుసంఘ మాయోగికి నూట పదార్ల పాదపూజ యివ్వ సమకట్టిరి నిర్ణీతదినమున ప్లేగ్రౌండులో మహాసభ కూడినది. అందులో నేను నొకఁడను.

అది దీక్షారాధనసమయము. విధిలేక యాలస్యమైనందుకు వగపు జూపుచు నా పురుషోత్తము, డామహాసభ కంతటికిని స్థితప్రజ్ఞాలక్షణముల జెప్పి "ఇయ్యది మీ కందరకు గ్రాహ్యము. బాసపడుం" డని యుపదేశించెను.

నే నాయుపదేశానుసారముగా గీతఁ జదువ నారంభించితిని. ఆవెనుక రెండవ యధ్యాయమునకు పద్యములు వ్రాసి మరల శ్రీ ఊ. వేం. గోపాలరావుగారికి వినిపించితిని. "ప్రసన్న" వని యా పండితుడు సంతోషము వెలిబుచ్చుటయేగాక "సద్వాణియోగము కాఁగల" వనియు నాశీర్వదించెను.

శ్రీరమ్యంబులు, లోకబాంధవము లుత్కృష్టానురాగామృతా
సారంబుల్, మనుపాపవర్జనపరాత్రాంతంబు, లాశాంతని
స్తారామోదము, లామహాత్ముని పదాబ్జాతంబు లావిష్కృత
స్వారాజ్యంబులు, మన్మనస్సరసిలో స్వస్థంబులై యొప్పుతన్.

స్వస్తిశ్రీకరపాద, భారతధరాస్వాతంత్ర్యసంవాద, శ్రీ
కస్తూరీహృదయప్రమోద, జగతీకల్యాణసంపాదకా
శ్వస్తశ్వేతముఖాభిమానధన, సత్త్వశ్రీప్రధానా, సుధీ
ప్రస్తవ్యప్రతిభావిరాజిత, స్థితప్రజ్ఞా, నమస్కారముల్.

కాలంబా మనచేత నుండదు; వయఃకాలంబు దాదాపుగాఁ
జాలెన్; మానవతాప్రయోజనము లేశంబైనఁ జూపట్టదే
న్నాలో; వట్టియజాగళస్తనమనై నాఁడుంగదా! యిట్టి న
న్నోర్మిలిం జేకొని ప్రోచువాఁ డొకఁడు లేఁడో సద్గురుం డంచు నే
జాలిం దూలుచునుంటి ఘోరతరసంసారాబ్ధిమగ్నుండనై.

అట్టియెడ.

అర్థిన్ గాఁగలదేశసేవకులు బర్హంపురాల్ కళాశాలవి
ద్యార్థుల్, శిష్టవిధేయబుద్ధు లనవద్యానందులై కూడి సి
ద్ధార్థీ, కాంచనమంత్రపుష్పముల నిన్నర్చింపఁగాఁ గోరి య
భ్యర్థింపన్ దయతోడ నీవటులె శిష్యశ్రేణితో రావొకో.

అది యత్యంతమనోహరంబయిన సంధ్యాకాల మార్యుల్ సభా
సదు లాసాదితభారతీవరకటాక్షశ్రీకు లాభక్తిసం
పద రాకాకలశాబ్ధి-అయ్యెడ స్థితప్రజ్ఞాస్వరూపంబుఁ జూ
పి దరిం జేర్చెడునాక గీత యని నీవే పాడియున్నాఁడవే.

సత్యాసత్యవివేకసిద్ధ, జగదాచార్యోత్తమా, చూడుమా
నిత్యానంద సుధారసప్రథితమా నీగీత యే నాఁడు నేఁ
బ్రత్యాసక్త మనీషతోఁ గరవుదీరన్ వింటి నా నాఁడెపో
యత్యంతంబుఁ దనంతఁ జక్కఁబడె నాహా తొంటి నాగీతయున్.

స్టూడెంటు స్థలమందు నిన్ను నుపవిష్టుం జేసినారో యదే
క్రీడారంగము నాదుబుద్ధికిఁ గురుక్షేత్రంబు: నేనే యటం
గ్రీడిన్: శత్రుల నార్వురంగనుమ నార్తింబూలువాఁడన్ మహా
వీడన్, దత్సమయంబునందు నను సంప్రీతిన్ విలోకించి కా
పాడన్ వచ్చిన కృష్ణదేవుఁడవు నాపాలన్ జగద్వందితా.

ఆడంబోయినతీర్థమే యభిముఖం బై వచ్చె: నా భాగ్యమా
హా! డెందంబున నంతతో నియమినై యాత్మోపనీతుండనై
నాఁడన్: శత్రుభయంబు లేదిఁకను! విన్నాణంబుతో లోకవి
క్రీడన్ నే విజయుండనై మెలఁగెదన్ గీతాస్త్రమూలంబునన్.

ఇదె నీదివ్యపదారవిందముల కెంతే భక్తితాత్పర్యసం
పదలన్ జాగిలి మ్రొక్కువాఁడ గురుదేవా, సాధుసంభావనా
స్పదమై యొప్పెడు సాంఖ్యయోగమిది నాబాసన్ సమర్పించుకొం
దు; దయాళూ, గురుదక్షిణార్థ మిది సంతోషించి చేపట్టుమా.

బంధువులెల్ల చత్తురని భ్రాంతమతిం దలపోసి యా కృపా
సంధుఁడు కుందునొందుటయుఁ జయ్యన నా నిజభక్తలోక స
ద్బాంధవుఁడైనవాఁడు మధుభంజనుఁ డాతనిపట్ల శిష్యాసం
బంధము పెద్దసేసి యిటుపల్కెను దేవర! చిత్తగింపుమా.

"వలఁతీ యర్జున, యెట్టు లిట్టి విషమావస్థన్ సుధీనింద్యక
శ్మల మయ్యో నిను దాపరించినది! యస్వర్గ్యంబు దా నింకఁ బె
ద్దల కెంతేఁ బరిహాసపాత్రమును గాదా చూచుకోవయ్య నీ
విలసత్కీర్తికి జీడిచుక్క యిది యబ్బే! యేమిలాభంబయా.

పరసైన్యంబుల నెట్టివైనను దపింపంజేతు నం చెన్నియో
పరువుల్ వాఱుచు నుందువే! యిపుడు క్లైబ్యంబా? యిదేమేని నీ
కు రవంతేఁ దగియున్నదే? విను మహాక్షుద్రంబు ముమ్మాటికిన్
ద్వరగా లెమ్ము త్యజించి యీహృదయదౌర్బల్యంబు నో ఫల్గునా."

ఆవాక్యంబుల నర్జునుండు తమితో నాలించి యిట్లాడుఁ "బ్రే
మావాసంబులు లోకపూజ్యులను భీష్మద్రోణు లార్యోత్తముల్
నావారే! యెటులైన తు బాణము లయో! నాచేతు లెట్లాడునో
యీవే యానతియీయవయ్య మధువైరీ, వీరిపై నియ్యెడన్.

సాక్షాద్దేవతలట్టివారలను హింసం బెట్టి యీమట్టికై
మోక్షంబుం గనకుంటకంటెఁ గడు సమ్మోదావహంబౌ నహో
భైక్ష్యం: బీసరురక్తదిగ్ధములు సంభావ్యంబులో! యర్థకా
మ తేమంబులు-నిత్యనారకగతుల్-మా కేల మావల్లభా.

ఏ దుత్కృష్టము భైక్ష్యయుద్ధములఁ? బోరేయైనచో గెల్తుమో
లేదో? కాదటు మేము గెల్తుమను మోలిన్! సౌఖ్య మేమున్నదే!
ఓదైత్యారి, సుయోధనాదులసుతుల్యాల్ చత్తురే పోరిలో
లే దేసౌఖ్యము కష్టజీవనులకున్ లేశంబు నెల్లించినన్.

గతి యిట్టుల్ విషమించె: నింక మతియో కార్పణ్యదోషంబుచే
హత మైపోయినదోయి యాశ్రితశరణ్యా, ధర్మసంమూఢుఁడన్
హిత మేదో యెఱిఁగింపు; నీపదములందే వ్రాలితిన్; శిష్యుఁడన్
గతి నీవే యని నమ్మికొంటిఁ ద్రిజగత్కల్యాణసంధాయకా.

అసపత్నంబు, సమృద్ధమున్, సకలసౌఖ్యావాలమైనట్టి మే
టి సుపర్వాణవిభుత్వ మిచ్చుటనె కంటింబో హృషీకేశ యే
మి సుఖం? బీసకలేంద్రియంబులను భస్మీభూతముంజేయు నీ
యసమానంబగు శోకవహ్ని యిది కృష్ణా యెట్లు చల్లారునో.

వల దారాజ్యము గీజ్యమున్ బరమపాపప్రాజ్య మో కృష్ణ, య
వ్వలకుం బోదముగమ్మ; పోరుట యసంభావ్యంబుపో" యంచు సే
నలమధ్యన్ మునివృత్తితో నిలచు సవ్యసాచిరిన్ మోహవి
హ్వలు లేనవ్వులఁ గుస్తరించి యలలోకారాధ్యుఁ డిట్లాడుఁదాన్.

ఏమేవీ నర, పాండితీపర, సెబా సేయుంటి వేమంటివీ
ప్రేమంబా యిది యంతయున్? మరియు వీరిం గూర్చియా యేడు ప
ద్యో! మిథ్యామతి యిట్టిదే! పరమనిత్యుల్ నిర్వికారుల్-సువి
ద్యామర్యాదల నెంచిచూడు మటు పార్థా, శోచ్యులా నీసురల్.

విను నేఁ బూర్వ మొకానొకప్పుడయినన్ విశ్వంబులో లేకయుం
టిననే మాటయె తప్పు: లోకపరిపాటిం జెప్పుచున్నావు: నీ
వును లేకుండుట లేదు: అట్టులనె భూపుల్ వీరలున్: నెండియున్
మనకోయీ యిఁకముందుఁగూడ నికెసుమ్మీయుండఁబో మంట
(యున్.

కౌమారంబును, యౌవనంబు, జరయుం గాల్వానుకూలంబులై
ప్రాముం జూవె శరీరి ప్రస్తుతశరీరం; బట్టిచో మారునే
ధీమంతుండ, శరీరి? అట్లె నిలచున్ దేహాన్తరప్రాప్తులన్
వ్యామోహంబుఁ బనేల ధీరమతికిన్ వత్సా పృథానందనా.

అనిశారుండలి యింతనే తెలియలేదా యాత్మ యోపార్థ! గొ
ప్పవివేకం బిది యింక నీవిషయసంబంధంబునం దోచుచు
న్నవి శీతోష్ణసుఖాసుఖంబు లవియైనన్ నిత్యముల్ గావు; భా
వ వినాశాన్వితముల్; సహింపవలె విద్వన్బుద్ధి నా యన్నిటిన్.

పరమార్థం బిదియే సుమా: మరియుఁ దత్త్వంబందు రిద్దానినే;
స్థిరుఁడై యేగుణశాలి యీయెరుకచే క్షిప్రంబుగా ద్వంద్వవా
గురముల్ దప్పి చరించునాతఁడె చెలంగుం జూవె యా నిత్యమో
క్షరమాలింగనభాగధేయపరుఁడై కౌంతేయ, తానెంతలన్.

ఒకటే నిత్యము, నిర్వికార, మదియే ఓంకారవాచ్యంబు-దా
ని కభావం బెపుడైన నుండ. దిఁక దేనింగూర్చి నీచిత్త మీ
వికృతిం జెందు నదే యనిత్యమెపుడున్: వేరీత్తులన్ మారు-దీఁ
నికి భావం బెపుడైన నుండదు సుధీనిర్ధారణం బిత్తయున్.

సదసద్భేద మెఱుంగు మిట్టిదయె. యీసర్వప్రపంచంబు స
త్పదవాచ్యంబయి వేద్యమానమగు నే బ్రహ్మంబుచే నిండి యు
న్నదొ యాబ్రహ్మమనశ్వరంబు; వినుమన్నా యవ్యయం బింక ని
ట్టిది నాశంబొనరింపఁజాలునె యెవండే నెన్నఁడే నెట్టులేన్.

చూడుమా! అవ్యయుఁ డప్రమేయుఁ డవినాశుం డాత్మయే; నిత్యుఁడౌ
వాఁడే యాతఁడుఁ; దచ్ఛరీరములు సర్వత్రాంతవంతంబులన్
బ్రోడల్ సెప్పిన మేటిమాటలివి; సద్బుద్ధిన్ విలోకించి యీ
గోడన్ వీడుము యుద్ధమాడుము పరాకుల్ మాని యో భారతా.

అనఘా, చంపితినేను-చంపఁబడితినా నం చెంచువారిద్ద రెం
దు నిజార్థంబు నెఱుంగ రాత్మవిషయాంధుల్ రూఢిగా నమ్ము, నే
ననఁగా నర్థము నిర్వికారమును నిత్యంబైన ఆ యాత్మయే
కనుఁగో వానికి లేవు లేవు క్రియలం గర్తృత్వ భోక్తృత్వముల్.

మును లేకుండియుఁ గ్రొత్తఁగాఁ గలుగుటల్, మున్నుండియుం బ్రస్తుతం
బున లేకుంటయుఁ జూవె పుట్టుకయుఁ జావున్ ఫల్గునా, యిట్టిరెం
డును లేవాత్మకు జూండు నిత్యుఁడుఁ బురాణుండయ్యరే! శాశ్వతుం
డును వృద్ధిక్షయవర్జితుండగుట; నిట్టుల్ దేహముల్ మారుచుం
డిన నేనాఁడును మార్పునెందఁడతఁ డట్లేయుండుఁ బ్రత్యేకుఁడై.

అవినాశుండును; నిత్యుఁ డవ్యయుఁ డజుం డైనట్టివాఁ డాత్మయం
చు వివేకంబునఁ జూచునట్టి సుమనస్కుం డెవ్వఁడో నట్టివాఁ

డెవనిం దాను వధింప నెంచు మరియో యాత్మంపు మాయంచు వే
రెవనిం బ్రేరణ సేయనోపుఁ జెపుమా; యీమోహ మింకేటికిన్.

చినిఁగిన బట్టలన్ విడచి చెచ్చెరఁ గ్రొత్తవి కట్టుకొన్న మా
త్రన మనుజుండు మారఁడు కదా! మరియట్లె జీర్ణదేహముల్
గొనకొని చెల్లునప్పుడును గ్రొత్తశరీరము లొందునప్పుడున్
గనుఁగొను మాత్మ యెన్నఁడు వికారము నొందెడువాఁడు కాఁడహో.

పురుహూతాత్మజ, చూడు మే యవయవంబుల్ లేనివాఁడాత్మ; నీ
కరవాలం బనలానిలాంబువులు చక్కం ద్రుంచునే కాల్చునే
మరియెండించునె ముంచివేయునె? యసంభావ్యంబు లీ ప్రక్రియల్
అరశే యాత్మ కవిక్రియత్వమున నీ యాకాశమే సాటి పో.

చోద్యములందిదే మిగులఁ జోద్యమహో! సదసద్వివేకికే
వేద్యము; కానివాని కొకపీసముపాటి యెరుంగరాని ద
చ్ఛేద్య మదాహ్య మద్భుతవిశిష్టము సర్వగతంబు నిత్యమ
క్లేద్య మశోష్యమాత్మ; మరి కేవలనిర్గుణముం బృథాత్మజా.

అవికార్యంబిది యెట్లు చెప్పుటకు నవ్యక్తం బచింత్యంబు; మా
నవుఁ డెన్నెన్ని శ్రమంబులం బడుచునైనం బ్రాజ్ఞుఁడై ముక్తినొం
దవలెన్ ఘోరభవంబు నుండియని యీ తత్త్వార్థ మీరీతి నొ
క్కవడిం జెప్పినమాట వేదవిధుల వక్కాణింతు నో యర్జునా.

పారిపారి యాత్మ యెల్లయెడఁ బుట్టుచుఁ జచ్చుచు నుండునంటలే
యరయఁగ సూనృతంబనిక దా తలపోయుదువీవు-మంచిదే
మరియటు మోద మేల యిటు మానని ఖేదము నేల యట్టియా
నిరతముఁ బుట్టువానికయి నిత్యముఁ జచ్చుచునున్నవానికై.

పుట్టునుజావె మృత్యువును బుట్టినవారలకెల్ల మేనితోఁ
బుట్టును వెండియున్ మృతుఁడు; పూర్వకృతానుభవంబు పొంటె
కెట్టులనైనఁ దప్పనిది; యేటికహో యిటువంటిదానికై [నిం
యిట్టుల శోకమంగుడుతువే పలుభంగుల? నాడుదానవే?

ఎక్కడినుండి వచ్చునివి?-యెక్కడకుం జను? ప్రస్తుతంబునం
జక్కఁగ నిట్టె కానఁబడు జంతుసమూహములెల్ల; రూఢిగా
వక్కణ సేయఁగల్గునె యెవండయినన్? మరి యిట్టిదానికై
త్రొక్కటపాటదేటికి? బుధుల్ పరిహాసము సేయరో నినున్.

ఈ తత్త్వార్థముఁ జూచినట్టి నరుఁడేడీ? చూచెనేకట్టు: మే
రీతిన్ వ్యక్తము సేయ నేర్చు? సరి నేర్చెంబొమ్ము-సు శ్రోతయే
డీ? తత్సత్యము నే నెరుంగుదును-మూడే మాటలో ఫల్గునా
నీతోఁ జెప్పితిఁ; బోల్చుకోఁగలిగితే నీ జన్మ ధన్యంబగున్.

సకలార్థంబుల నాలకించితివి తత్సారంబిదే చూడు-దే
హికి నిత్యత్వ మవిక్రియత్వమను రెండేమాట-లీ భూతకో
ట్లకు దేహంబులు వధ్యముల్-బహువిధాలం గూడుచున్ వీడుచున్
వికృతుల్ సెందెడు; నిట్టివానికయి యో బీభత్స, శోకింతువా?

అది యట్లుంచుము పార్థ, బుద్ధికి దురూహ్యం-బిట్టులం జూడు: నీ
మది నేమైనఁ దలంతువో స్వకులధర్మంబున్?-మహారాజ్య సం
పదయో స్వర్గనివాసమో-పరమధర్మ్యంబైన యుద్ధంబునం
గదచే మూరును మీకు; రాజులకు యోగ్యంబైన కర్మం బిదే.

కడుఁ గడు ధన్యజీవనులు గారొకో రాజులు! చిన్నయాతపం
డిశి పెనుదాటి పండును గడింతురు - చూడుము దేహ మాజిలో
విడచి బిరానఁ జొత్తురు దివిన్; మరి రారటనుండి. కష్టముల్
పడిపడి యట్టెకోరుకొనువారికి లేదది యింతసూటిగా.

కావున నీవు ధన్యుఁడవు: కాలికిఁ జిక్కినమందు వేరిదే
త్రావుము; నీకుఁ గల్గు నమృతత్వము; లెమ్మిఁక నేడ్పు మాని గాం
డీవముఁ జేతఁబూనుము వడిన్; మరియట్టులఁ జేయకుందువా
పోవును కీర్తిధర్మములు బూడిదపాలయి; పాపమబ్బెడిన్.

అంతేనా? అపకీర్తి యీ పుడమిలో నాచంద్రతారార్కమౌ
"కుంతీదేవికి మేలు గొడ్డరికమే కొంతైన నీలాటిదు
స్సంతానంబునకంటె"నంచు యువతీసంతానముల్ నవ్వవా
రంతల్ సేసిన మేరుధీరనకు నీకా నింద! చారాదొకో.

వినఁగానే మును సవ్యసాచియను నీ విఖ్యాతనామంబు నే
జననాథుల్ పరువెత్తుచుండి రొకటన్ శ్వాసంబులంబట్టి యా
ఘనులే వారరుగో మహారథు "లయో! గాండీవి యేమోయటం
చనుకొన్నారమె కాని మాఁడఁగనె యోరా పారినాఁ" డందురే.

పడఁపడి నాడు ఖాండవము భస్మము సేయనె మూడుకండ్లవాఁ
డెదురయినన్ వహావ్వయనిపించుచు నాతని చేతి మన్ననం
బొదలవె! మన్నుఁ గొట్టుకొని పోవునవన్నియు: నింకదిట్టలై
వదరుదు రెన్నియే నెదిరివారది వీనులవిందె యర్జునా?

అతివాదంబని యెంచఁబోకు మొకముఖ్యాంశంబు వాక్రుత్తుఁ జ
చ్చితివా నీకిఁక జన్మలేదు సురసంసేవ్యుండవై యుందు గె
ల్చితివా నిస్తులరాజ్యభోగముల నోలింగొందు కాఁబట్టి సం
స్కృతబుద్ధిన్ మరిలెమ్మ వైరిజనవిచ్ఛేదంబుఁ గావింపుమా.

ఇదిగో! ఈ పనియందె కాదు మరియెందేన్ లాభమో నష్టమో
ముదమో దుర్భరఖేదమో, వరసుఖంబో ఘోరమౌ కష్టమో
విదితంబౌ గెలుపో యకీర్తికరమౌ వీగో-అదే దైనఁబో
మదిఁ బాటింపకు; మట్టులున్న నఘ మేమాత్రంబు నిన్నంటునే.

ఇది సామాన్యపుబుద్ధి కాదు! తొలి నే నే సాంఖ్యముం జెప్పినా
నది సాంసారికులైనవారికి దురూహ్యంబంటి ముక్తిప్రదం
బదియే: ఈ సమబుద్ధియుక్తి నది సాధ్యంబంటిఁ దద్బుద్ధియే
మొదలంటం గొని కర్మబంధముల నున్మూలించు సాలించితే.

పరమోత్కృష్టము కర్మనిష్ఠయిది తత్ప్రారంభమే లాభమై
వరలున్; వెండియుఁ బ్రత్యవాయము లభావంబుల్ సుమా దీన, నీ

పరధర్మంబుననో విశేషమిది. యేస్వల్పాంశమైనన్ మహా
త్తరకష్టంబులనుండి యిట్టె మనుజున్ దప్పించునో ఫల్గునా.

"జ్ఞానంబొక్కటియే సునిశ్చయముగాఁ గైవల్యమార్గంబుఁ డద్
జ్ఞానప్రాప్తికిఁ జేయఁగావలె ఫలాకాంక్షల్ విసర్జించి క
ర్మానుష్ఠానము" లన్న ధీరుఁడు చలింపంబోఁడు; కామాత్ములో
నానాకర్మల నాచరించెద రనంతంబుల్ గదా తద్గతుల్.

ఫలశూన్యం బయి చూపుమాత్రమునకే భాసిల్లుచున్నట్టి పు
వ్వులచెట్టుం బురుడించు వాక్యముల ప్రోవుల్ వోసి ఆ యర్థవా
దములు, యజ్ఞాదుల వాటివాటి ఫలసందోహంబులన్ మోహ వి
హ్వలులై వచ్చుచుఁ బుట్టుచుందు రిఁక లేదన్యాశ్రయంబం చయో.

అల రంభాపతిరంభ.సంఘనములం దా సోమపానంబులం
దల శ్రీచందనపారిజాతములయం దానందనారామసీ
మల సంచారములందుఁ గాముములు సీమల్దాట నేప్రొద్దుఁ గ
ర్మలలోఁ దేలి మునుంగుచున్ మరల సంపాదింత్రు సంసారమున్.

అవివేకం బది: నశ్వరంబులగు భోగైశ్వర్యముల్ జూరఁగో
రి విశేషశ్రమ లోర్చి యాశ్రుతులదారింబట్టి యానంట నో
క్కవడిన్ సంస్మృతిలోనఁ గూలుట లయో! కైవల్యసంబైనయా
వ్యవసాయాత్మిక బుద్ధి వారి కవిధేయంబౌ సమాధిస్థితిన్.

ఆవేదంబుల గోసలెల్ల మన కేలా? నీవు ముక్తుండవై
కావింపంజను నెల్లకర్మముల; యోగక్షేమసంకల్పసం
భావంబుల్ విడు; మచ్ఛసత్త్వమతివై పైకొన్న ద్వంద్వంబులం
దావంతైనఁ జలింప; కేమరకు మీ యంశంబునం దెన్నఁడున్.

సకుఁడా ఉన్నవి శ్రౌతకర్మములు లక్షల్; వాటిలో ముక్తిదా
యక మేదో యది యాచరించు బుధుఁ డొయ్యన్; సర్వతస్సంప్లుతో
దక మేపో యుదపానమైనను జనుల్ దానన్ సదా దాహశాం
తికి స్నానాదుల కెంతకావలయు నంతే నీరముం గొన్నటుల్.

అనవద్యంబగు సాంఖ్యపద్ధతికి నీ వర్హుండవే కావు కా
వున నీకీగతిఁ గర్మసేయుటయె యొప్పుంగాని యేతత్ఫలం
బునకై చూడకు; మట్లు చూచిన భవంబున్ దాఁటిపోఁజాల; వ
ట్లని యేకర్మముఁ జేయవేమొ; అది యత్యంతప్రమాదం బగున్.

జ్ఞానార్థంబగు చిత్తశుద్ధి కిది మార్గం బంచుఁ బాటించి స్వా
ధీనప్రజ్ఞను సిద్ధ్యసిద్ధు లొకరీతిం జూచుటే యోగమౌ
కానన్ సాధ్యము ముక్తి; సాధనము తద్జ్ఞానంబుఁ దత్ప్రాప్తికై
యీనాచెప్పినయోగ: మిట్లు నిలుమో యీ యెల్లకాలంబులన్.

ఇఁక నాయేనుఁగు దోమయంతర మెపో యీ యీశ్వరారాధనా
ర్థకమై యొప్పెడునట్టికర్మకు ఫలార్థంబైన యద్దానికిన్
సకుఁడా; కావున నాశ్రయింపుము యథేచ్ఛన్ సాంఖ్యయోగంబులం
దొకబుద్ధిన్; ఫలతృష్ణతోఁ గడఁగువారో దీనులున్ దుఃఖితుల్.

పటుబంధంబులఁ గూర్చుచున్ భవము సంపాదించి యద్దానఁ ముం
చుటయే కర్మలపైజ మట్టిది గతించుం జూవె యీయుక్తినో
క్కటఁ గర్మాంతరపుణ్యపాపములు సోకంబో విటన్ దొంగ వా
కిటనే మంచము వేసికొంట యిది: యీకీ లెట్టిదో చూడుమా.

తన ధర్మంబును బాగుగా నెరిఁగి విద్వాంసుండు నిర్ద్వంద్వుఁడై
పనులం జేయు ఫలాఫలంబులకుఁ దా బాధ్యుండు గాఁ డట్టివాఁ
డు నిమేషంబున జన్మబంధముల వీడున్; లేదిఁకన్ వానికిన్
బునరావృత్తి; యతం డనామయ పదంబుం జేరు నో యర్జునా.

అరయన్ ధీరతఁగల్గి నీమది భవవ్యామోహకాన్తార ని
స్తరణం బెన్నఁడు చేయనోపు నపు డంతంబొందు నిర్వేద; మీ
వర కాలించిన దాలకింప నిఁక నీపై నున్న యాయర్థవి
స్తరముం గూరిచి చిత్తమున్ బరమశాంతిం బొందు నో యర్జునా.

అదనంబున్ విపరీతమైన శ్రుతి యట్లాలించి యాలించి యా
తుదకుం జిందరవందరై చెడిన దెంతో బుద్ధి నీ కర్జునా
అది యేనాడు సమాధియందు నచలంబై యుండు నీయోగసం
పద, యానాఁ డొనఁగూడు నీకు మరి జీవన్ముక్తియుం గల్గెడున్.

అన విని యర్జునుండు, పరమాద్భుత మొందుచుఁ బల్కె నిట్టులన్
"తనరిసమాధియందు సతతంబును నేఁ బరమాత్మనన్న ధీ
రుని మరిపోల్తు రెట్టులఁ బరుల్? స్థితబుద్ధికిఁ జేయనుండు నే
పనులును? మాటలాడఁగలవాఁడె యతం? డిఁక నట్టివాని యా
సనగమనాదులౌ క్రియల సంగతి యెట్టులనుండుఁ గేశవా."

అన విని భగవంతుం డిట్టు లనియె:

మదిఁ గలుగునట్టి కోర్కెలఁ
దుదముట్టఁగ విడిచి యాత్మతో నాత్మమునం
బొదలి ముద మందగలయం
త దిటవుగలవాఁడెపో స్థితప్రజ్ఞుఁ డగున్.

సురరాజ్యాధిపతిత్వ మిచ్చినను ద్రోచుంబో మహానిస్పృహన్
ఉరి కంఠంబునకుం దగుల్చు నెడనే నుద్విగ్నుఁడే కాఁడువో
పరివర్జించినవాఁడు రాగభయకోపంబుల్, మహాత్ముండుఁ ద
త్పరుఁడౌ నెవ్వఁ డతండె యొప్పు నిటులో పార్థా, స్థితప్రజ్ఞుఁడై.

అనయం బే మహితాత్ముఁ డాత్మనునన వ్యాపారియై జీవితం
బున దేహంబునఁగూడ నెయ్యమును సంపూర్ణంబుగా వీడి యొ
య్యనఁ జేకూరు శుభాశుభంబులకునై యామోదఖేదంబులం
గనఁడో ఆముని బుద్ధి సుస్థిర మగుం గొంతేయ, యాలించితే.

తనయంగంబుల నన్యభీతివలనన్ దాఁచేలు, పైనుండి చ
య్యనఁ దా నెట్లుపసంహరించుకొనునో యట్లే హృషీకంబులన్
మునియుం దా నుపసంహరించి విషయంబుల్ గోరి పోనీక వా
నిని బట్టున్; మరియిట్టిపట్టులఁగదా నిల్చున్ స్థితప్రజ్ఞుఁడే.

అనుభూతంబులుగాక యొక్కెడ హృషీకార్థంబు లేలాసనో
వినివర్తిల్లును మూఢబుద్ధులకు నేన్ - విజ్ఞానికే యేల? అ
ట్లనఁగానే సరిపోవునా! విషయమం దాసక్తిపోదే అదై
నను పార్థా, పరమార్థదర్శనముచే నష్టంబగున్ రూఢిగా.

పలుయత్నంబులఁ జేయుచుండి యొకటన్ బంధించి మేధావియై
లలిఁ దన్నిష్ఠఁ జెలంగు సత్పురుషు నేన్ లంకించి కారించుఁబో
బలిమిం బగ్గములన్ బిగించి నడిపింపం ద్రోవలో నిట్టికా
ల్వలకే యీడ్చెడి పెంకెసుర్రములలీలన్ బో హృషీకంబులున్.

కడఁకన్ వాటిని లొంగదీసికొని యోగప్రేక్షతో వాసుదే
వుఁడనే నన్యుఁడఁగానటంచు ననుభావుండౌ సమాధిస్థుఁడై
వ్వఁడహో! వానికి లొంగితీరు విషయాశ్వంబుల్; స్థితప్రజ్ఞుఁడై
పడయున్ వాఁడె యనన్యలభ్యమగు జీవన్ముక్తి నో భారతా.

తద్యత్నంబుల మాని యింక విషయధ్యానంబుఁ గావించినన్
విద్యాయుక్తుఁడు గూడఁ జిత్తమున నవ్విళ్లూరుఁ గామార్తుఁడై
యుద్యోగించును దానిఁ దీర్చుకొన నెట్లో చూడఁజూడన్ దురా
సాధ్యంబై యది యుండెనేనిఁ గడుఁ గోపగ్రస్తుఁడౌ నంతటన్.

కనలుం బొందినవాఁడు, నిచ్చలు వివేకభ్రష్టుఁడై శాస్త్ర సం
జనితంబున్ గురుపాదసంస్కృతమునౌ చారుస్మృతిన్ విభ్రమిం
చు నహో! కావున వానిబుద్ధియు నశించున్; దానితో వాఁడుగూ
లును సంసారమహోగ్రవారినిధికల్లోలాహతుండై యొగిన్.

కనుమా, యీవిషయప్రసంగముల రాగద్వేషము ల్మానినం
తనె వశ్యంబు లగున్ హృషీకములు తత్త్వజ్ఞానియై యంత జీ
వనమం దన్న మవర్జనీయమగుటన్ భక్షించుచున్ ద్రొవ్వుచో
యనఘా, స్వస్థమనస్కుఁడై మనువిధేయాత్ముండు వాఁ డెందులన్.

దైవారున్ మరి యీవిరాగికటు చిత్తస్వాస్థ్యము పట్టునం
బోవున్ దుస్తరదుఃఖజాలములు నిర్మూలంబులై; బుద్ధియో
తావుం దప్పక నిశ్చలాంబరముజాడన్ సర్వతోవ్యాప్తమై
యావిర్భావము నొందియుండునుసుమా యాత్మైకరూపంబునన్.

చెలయుచు సర్వథా విషయసేవలఁ జేయుచునుండువాని కె
ట్లలవడు నయ్య నిస్తులసమాహితచిత్త? మిఁకెంతమాత్రమే
నలవియె యాత్మరూపవిషయంబున భావన వాని? కట్లు చా
వలయును వాఁడశాంతుఁడయి పంకమునం బడు గొడ్డుచాడ్పునన్

అలవోకం జరియించుచుండెడు హృషీకార్థంబులం బట్టి వ
ర్తిలఁగాఁ జేయ మనస్సునట్టి, యది వారింబోవు నౌకన్ మహా
నిల మేలాసనఁ గొట్టికొట్టి యెటనో నిర్భిన్నముం జేయు న
ట్టులనే ప్రజ్ఞను జుట్టిముట్టి మరి నెట్టుంజూవె యో భారతా.

విన్నావో, మరియిందువల్ల నెకదా విశ్వప్రయత్నంబులన్
మున్నీ యింద్రియజాలమున్ విషయనిర్ముక్తంబుఁగాఁ జేయుచున్
విన్నాణంబున భూరియోగపదవీవిశ్రాంతుఁడై బుద్ధిసం
పన్నుండౌ నెవఁ డామహాత్ముఁడుగదా ప్రజ్ఞాస్థితుం డర్జునా.

అవివేకంబను నిద్రలోఁబడి యవిద్యారాత్రి నీ సర్వజం
తువులుం బొర్లుచునుండువేళ మతిమంతుం డాతఁ డున్నిద్రుఁడై
వివిధార్థంబుల నాకళించు; నిఁక నిర్భిన్నాత్ములై వీఁకతో
నవి సంచారము సేయువేళల నతం డత్యంతనిద్రం గొనున్.

నానాదిక్కులనుండి నీరము లుదన్వంతంబులోఁ జేరి య
ద్దానం బర్వి లయంబు నొందుఁగద అత్తత్త్వజ్ఞునం దట్టులే
లీనంబయ్యెడు నెల్ల కామములు; నోలిన్ శాంతుఁడై యాతఁ డ
త్యానందంబున నుండు; నీగతి యలభ్యంబే కదా కామికిన్.

కోరిక లన్నిటన్ నెడలఁ గొట్టుచు నిస్పృహుఁడైనవాఁ డహం
కారము లేనివాఁడు, మమకారము వీడినవాఁడు నెవ్వఁడా
ధీరుఁడు కర్మబంధములఁ దెప్పునఁ ద్రెంచి దురంతఘోరసం
సారపయోధి దాటి కడుశాంతినిఁ బొందుచునుండు నర్జునా.

ఇదియే బ్రాహ్మిస్థితి సు
మ్మిది యొనవిన మోహమొందఁ డెవ్వాఁడైనన్
ముదిమి నిదే నిది యబ్బిన
బొదలును మోక్షము నొంది పురుషుఁడు పార్థా!




# నీలగిరులందలి బడగవాండ్రు

పి. వి.

వందలకొలది పరదేశీయులు, శ్రీమంతులగు మన దేశీయులు, నీలగిరుల శిఖాగ్రముల తాకుచు, పోవు నల్లని మేఘములను చల్లనివాయువులను తాక నుత్స హించుచు మార్చి నెలయందే ఆతురతతో నేగుట ఆశ్చ ర్యముగాదు.

పలురంగుల పుష్పములతో కొండపార్శ్వముల విరాజిల్లుచున్న అచ్చటి పచ్చికబయళ్లను, చల్లని పిల్ల వాయువులను, నిర్మలమైన అందచందములను వర్ణించుట నా పనికాదు.



౧. బడగాపల్లె



౨. బడగాకులపెద్ద

ప్రకృతిరమణీయత అంతయు అందుట్టిపడును. కోటగిరి, కోడైకెనాలు, కూనూరు, యేర్కాడు మొదలగు చక్కని చల్లని తావులలో ఉదకమండలము మొదటిది!

అచ్చటకు పోవువారలలో వేటగాండ్రు, గోల్ఫు (Golf) ఆటగాండ్రుతప్ప మిగతవారెవ్వరును తామున్న

స్థలములను దాటిపోరు. వింతలను పరికింపరు. అచ్చట వలె గ్రామస్థులందరిచే పూజింపబడును కుటుంబపెద్దకు నివసించుతోడులు, ఇరులు, బడగలు మొదలగు కొండ సహజముగా కుటుంబములోనివారందరును విధేయులు. జాతులు కట్టుబాట్లు, నడతలు నేర్చికొనుట ఉత్సాహ కరముగా నుండును



3 బడగల గుడిసెలు

బడగజాతివారు మనంత నాగరికులు కారు. ఆది నివాసులగు తోడులవలె అనాగరకులు, మోటులును కారు. కొంచెము పొట్టిగానుండి అందముగా నుందురు మితభాషులు వారినడతల, శాంతము, ఆదరణ, మర్యాదలు పుట్టిపడును పల్లెటూరిపెద్దను పూరివారందరును మిక్కిలి గౌరవింతురు ఆతడు ప్రజాప్రభుత్వ అధ్యక్షుని



౫. బడగా బాలికలు



౪. బడగల గుడిసెలు.



౬. బడగాపడుచు (చంకలో చిన్నబిడ్డ).

బెర్లిను 'స్టేటు ఆపెరా హౌసు'లో నడచిన జర్మనీ వీరపూజోత్సవము



కల్యాణకొప్పూరునందలి వినయాశ్రమములోని యోగవ్యాయామశిక్షణ శిబిరము

లండను వెడలిన నేపాలు రాయబారవర్గము



ఇండియాతో వర్తకపుసంధిని ముగించుకొని బయలువెడలిన జపానుప్రతినిధులు



౬. బడగలు బంగాళాదుంపల నేర్పరచుట

ఆమె గర్భవతి కాకున్న వెడలగొట్టి మరొకతెను పెండ్లాడును. మొదటి యామె యే వత్సరములో గర్భముదాల్చిన శివాలయమున మామూలురీతిగా పెండ్లి చేసికొనును.

నీళ్లకు కరువగుటచేతను, చలి ప్రదేశ మగుటచేతను వీరు దినదినము స్నానము చేయక ముఖ ప్రక్షాళనముతో సరిపెట్టుకొందురు.

బడగస్త్రీలకు సిగ్గుబిడియములు మెండు. స్త్రీ పరాయివానిచేత భంగపరుపబడినయెడల ఆత్మహత్య చేసికొనును.

వీరిలో చదువుకున్నవా రిప్పుడు తమవారలను అన్నివిధముల సరియైనత్రోవల నడిపించుటకు కృషి సల్పుచున్నారు.

స్త్రీలు, పురుషులు కాయకష్టముల కోర్చువారు. చిన్నచిన్న పొలములందు బంగాళాదుంప, సామై (Samai) పంటల పండింతురు. కొందరు చుట్టుపట్లకు నాలు గైదుమైళ్ల దూరమువరకును పోయి కూలిచేసికొని జీవింతురు. నంజనాదు గవర్నమెంటు అగ్రికల్చరల్ ఫారమునందును, బంగాళాదుంప, కాఫీ, టీ తోటలయందును బడగకూలీలు అమితముగా నియోగింపబడుచుండిరి.

మిశ్రమమైన కన్నడభాషను మాట్లాడుదురు. చాలమంది చదువు రానివారు కలరు. ఇప్పుడిప్పుడు ఆంగ్లభాష, తమిళభాషలు గరపుటకు యెలిమెంటరీ పాఠశాలలు నెలకొల్పబడినవి. పట్టభద్రులు ఒకరిద్దరు మాత్రమే కలరు. గవర్నమెంటు వుద్యోగులు చాల తక్కువ.

బడగల అలవాట్లు చాల వింతగా నుండును. వీరు శివార్చకులు. పెండ్లికొడుకు పిల్లను చేరదీసి ఒకసంవత్సరము సంసారముచేసి



౭. బడగల శివాలయము



౯ బడగాలయములు



౧౦ ఉర్లగడ్డలపొలములందు పనిచేయుచున్న బడగాస్త్రీలు



౧౧ బడగాబాలురు పాఠశాలకుపోవుట



౧౨ ఉదకమండలమున క్రీడాపందెములను చూచుచున్న బడగావాండ్రు..



౧౩. బడగయువకుడు

---

# మహా చిత్రము!

వెదురుమూడి వెంకటకృష్ణరావు

భానుం డొక్కఁడె భూనభోగతతమోవార్ధిన్ సమగ్రంబుగన్
దా నాశం బొనరించి, మర్త్యులకుఁ బ్రత్యక్షంబగున్; కోటి సూ
ర్యానూనద్యుతిరూపివయ్యును, గనన్ రా వేమిచిత్రంబొ! శం
భో! నాదౌ తమమెంత! తత్సకలమున్ బ్రోద్రోచి, కాన్పింపుమా!

(శ్రీ శంకరాచార్య విరచిత శివానందలహరినుండి అనువదింపఁబడినది.)

---



# శ్రీ విమలేందుబోసుగారు

వర్ధిష్ణు నర్తకుడు

పుట్టినది బంగాళదేశమున. బాల్యము గడపినది బంగాళదేశమున. తదాదిగ భారతదేశ యాత్రా మైక మాత్రముగ, దేశవిదేశముల మూలమూలల తిరిగినాడు. ప్రాచ్య, పాశ్చాత్య నాట్యకళలను బాగుగ నేర్చినాడు. వన్నెవాసిగాంచిన నర్తకులలో నొక్కడుగ లెక్కకెక్కినాడు. దేశమంతట నాట్య ప్రదర్శనములను నిర్వహించి కళావిదుల మన్ననలందుకొన్నాడు. మొన్న చెన్నపురియందుకూడ ఆంధ్ర నాట్యకళాపరిషత్సమావేశములందును, ప్రత్యేక గోష్ఠులయందును తనకౌశలమును ప్రదర్శించినాడు. వీరి నాట్యములలో ముఖ్యమైనవి. వివేకనృత్యము, శివతాండవ నృత్యము, క్రోధనృత్యము. ఇర వేండ్ల చిన్నవయసుననే యింతటికళను చేపట్టుకొన్న యితని యుత్సాహమును, కళాభిమానమును ప్రశంసార్హములు.



వి. ఎ. యం. బూలో, బ్రాడ్‌కాస్టింగ్ యంత్రమును నడిపి పరిశీలించుట



సర్ మాల్కం క్యాంబెల్‌గారు రికార్డు బ్రేకుచేయుటకుముందు తన బ్లూబర్డుకారును పరీక్షించుట



శ్రీమతి రాయసం రత్నమ్మగారి యాధిపత్యమున జరిగిన గుంటూరు శ్రీ మహాలక్ష్మీపఠనమందిర ద్వితీయవార్షికోత్సవసభ



మాగంటి అన్నపూర్ణాదేవి వార్షికోత్సవము (అధ్యక్షురాలు : కజిన్సుసతి)



దివ్యక్షణము

**(Divine Moment)**

—M. Krishna Murti

## యశశ్శరీరులు



౧. సి. కృష్ణస్వామినాయకుగారు



౪. గౌ. సర్. మన్మోహనదాసు రామ్‌జీ
(కే. టి.)



౬. యం. ఏ. కాండ్రైతు



౨. బచ్చు శ్రీరాములుగారు



౭. శ్రీమతి లక్ష్మీఅమ్మాళ్



౩. చిలుకూరి శేషగిరిరావుగారు



౫. పి. లక్ష్మీనరసుగారు



౮. రావ్ బహదూర్ బి. కృష్ణఅయ్యంగారు



మిస్. లెస్టరు
(ఇంగ్లాండులో గాంధిగారికాతిథ్యమొసగినయామె)
భారతదేశయాత్ర ముగించి స్వదేశము మరలెను.

ఆయుధవిసర్జనసభకు వెడలివచ్చిన



మహమ్మద్ ఉమర్ ఖానుగారు



రావ్ బహద్దరు ప్రొ. కె. సి. భట్టాచార్యులు
భారతతత్త్వమహాసభాధ్యక్షులు, పూనా



సి. వి. పీరెగారు
బీహారు భూకంపనివారణ సందర్భమున
స్విట్జర్లండునుండి వచ్చిన సుప్రసిద్ధ ఇంజనీయరు

సిలోను గవర్నరు జనరలు ప్రతినిధిగా
జాంజిబారు వెళ్లిన



కె. పి. యస్. మీనన్‌గారు



సర్. హెన్రీ క్రెయిక్
ఇండియాప్రభుత్వపు హోం మెంబరు

ప్రథమ, ద్వితీయ సంపుటములు అమ్మకమునకు సిద్ధముగా నున్నవి

# ఆంధ్రవిజ్ఞానసర్వస్వము

## ద్వితీయ సంపుటము

ఇందు 'అన్' నుండి "అశ్విని" వఱకును గల విషయము గలదు.

ప్రతి సంపుటము ౧-కి వెల రూ. ౧౦-౦-౦

ఈ రెండవ సంపుటమునందు డిమ్మీ 4 వ ఆకృతియందు 600 లకు మించిన పుటలుకలవు. "అన్" మొదలుకొని "అశ్విని" వరకు గల విషయము గలదు. త్రివర్ణపటములు 10. వానిలో 2 అమరావతీస్తూపమునకును రెండు అనాహతమునకును చెందినవియు 6 దేశ చిత్ర పటమ్ములును గలవు. ఇవిగాక మరి 5 సాదాచిత్రపటములు ఆయాదేశములకు సంబంధించినవి కలవు. ప్రాచీనాంధ్రుల కళాసంపదను వ్యక్తముచేయు అమరావతీస్తూపమును గురించిన గొప్ప వ్యాసమునందు అమరావతీశిల్పమునకు సంబంధించిన హాఫ్టోన్ బొమ్మలు 53 ను, వేషభూషాదుల వెల్లడించు లైన్బ్లాకులు 55 ను గలవు. మరియు అభినయమను వ్యాసమున హస్తవిన్యాసముల వివిధప్రకారముల జూపునవి 57 బొమ్మలును, అనాహతమునందు షట్చక్రాదుల చిత్రములును గలవు. ఇట్లు ఆయావ్యాసములకు చెందిన చిత్రములతో మొత్తముమీద 240 కి పైగా చిత్రము లిందున్నవి. వివిధవిషయముల సంఖ్య 400 వరకు నుండును. సంపుటము చక్కని స్వదేశీచర్మముతోడను బంగారు రేఖలతోడను సంపుటీకృతము.

సంపుటము వెల రూ. ౧౦-౦-౦. ప్రవేశరుసుము రూ. ౧-౦-౦. మొత్తము రూ. ౧౧-౦-౦.

ప్రతిసంపుటమున ౬౦౦ పుట లుండును.

పోస్టుద్వారా: ప్యాకింగు పోస్టుఖర్చులు రూ. ౧-౮-౦

రైలుద్వారా: దగ్గరచోట్లకు ఖర్చులు రూ. ౦-౧౨-౦.

☞ పోస్టు లేక రైలుఖర్చులు ప్రత్యేకము. చందాదారులు అడ్వాన్సు రూ. ౫ లు పంప ప్రార్థితులు.

ఆంధ్రవిజ్ఞానసర్వస్వ కార్యాలయము,

నెం. ౭, తంబుశెట్టివీధి, మదరాసు.



కీ. శే. ఆకొండి వెంకటరత్నం పంతులుగారు
పిఠాపురం.



కీ. శే. నారిశెట్టి హనుమయ్యగారు
(కొంతకాలము ప్రకృతి పత్రికాధిపతిగానుండి,
ప్రకృతి కార్యాలయమునకు ౧౫౦౦౦ రూ. ల
ధర్మమునొసంగిన ప్రకృతి ధర్మనేత.)



కీ. శే. ఆ. రామశాస్త్రిగారు.



కీ. శే. వి. పి. మాధవరావుగారు, సి. ఐ. ఇ.
(బరోడా, మైసూరు,తిరువాన్కూరుల దివాను)



కీ. శే. భాసు కేశవరావుపంతులు,
బెజవాడ.



కీ. శే. ఇబ్రహీం.



హెచ్. వెంకటస్వామి, యల్. తీవిగార్లు
(టెన్నిస్ ఆటగాండ్రు)



కీ. శే. కంచెర్ల శ్రీరామమూర్తిగారు



కీ. శే. దాసుమాధవరావుగారు.



పెర్రీ, ఇవి, బాబుగారు (టెన్నిసుఆటగాండ్రు)



కీ. శే. మార్క్విస్‌టోగో

# అమృతాంజనానికి ఇమిటేష్నొకటా ?

'కోడీ! నాకోడీ! నేనోడిపోతెపోతిగాని,
నోటబెడ్డకొట్టుకొంటి'వలె పాడవలెను

పల్లవి.

పోయిందై పోయె తల,
పోటుతగ్గదేమిమందో పూటుగమాటాడినాడు

రైలునెక్కి సీటుమీద కాలుమోపగానెవచ్చి
పేలాపనలోనన్ను జేలజేసియిచ్చినాడు   పో
అమృతాంజనమంటే, నే నందుకుడబ్బిచ్చినాను
చిమచిమనేమంటలోన చీటిసరిగగానలేక   పో

పంచభాగాపచీటిమీద ఫస్టుక్లాసుముద్రనెరిగి
వంచనపడిపోతిదానివంటిమ్ముద్రయగుటవలన   పో

కళ్లనీళ్లువచ్చుటకై కళ్లలోనమంగుపెట్టి
ఒళ్లెరుగని లెక్చరిచ్చి చిల్లరకాజేసినాడు   పో.

దొంగమందులమ్మువాళ్ల సంగతెరుగదుదుగాని
భంగపడగవలసెచవుక బేరనిభావించుకతన   పో.

గుణముస్వల్పమేగానీ ధనముఘనముగానలాగి
జనులదగాజేసే మంజనమమృతాంజనముగనా   పో.

కుక్క సక్రమైనప్పుడు నక్కసింహమైనప్పుడు
బక్క "బామ్మ' లమృతాంజన మెక్కినగ్రక్కునేమి   పో

వాసనైనసరిగలేని దోసకారియంజనాలు
మోసముకై "-మృతాంజన' వేసముతోవచ్చినాయి   పో.




అఖిలభారతస్వదేశీప్రదర్శనమునందు " అమృతాంజనడిపో " వారి ప్రదర్శనశాల-డిల్లీ



నూకాడ వెంకటరత్నవర్మ.

# కొత్తతరగతి వీణలు

(చిత్ర - విపంచి)

వీణ అనునది ఇతర గానపరికరమువంటిది కాదు. ఇందు యోగరహస్య మిమిడియున్నది వీణ అనునది ఇహపరములను మేళవింపజేయు యంత్రము దానిపై నారోహణావరోహణము లొనర్చుట యనగా జీవేశ్వరుల నేకముచేయుటయని వ్యాఖ్యానము చేయవచ్చును.

ప్రపంచములో ననేక గానయంత్రములు మానవులచే చేయబడుచున్నను, భారతసాంప్రదాయికమగు వీణకు తత్త్వము గ్రహించిన వారెల్లరు, పూజ్యస్థానము నీయకతప్పదు వీణయందు ధ్వనించు శబ్దము తక్కినవానిలోవలె భంగమును బొందక, గమకమును గలిగి, మృదువుగను, క్రమాభివృద్ధిగను కర్ణామృతముగను నుండును. స్వరములు సప్తస్వరములుగ ముఖ్యవిభాగములు చేయబడినను, వీణయం దుద్భవించు స్వరములనంతములు క్రిందిస్థాయినిగల 'స' (శ్రుతి) నుంచి పైస్థాయినిగల 'స' (శ్రుతి) వరకు గల అనంత శబ్దసాగరమును దర్శింప జేయగలశక్తి వీణయందు ఎక్కువగ గలదు చిటికనవ్రేలితో తాళమును మీటుచుండుటచే లయబద్ధముగ గానము నడుచును అంతియేకాక క్రింద తాళమువేయుటకై యేర్పచిన మూడుతీగెలలో శ్రుతి, పంచమస్థానము, పైశ్రుతి కలిగియుండుటచే వానిని మీటినప్పుడెల్ల పాట సర్వదా శ్రుతికిగలసియే యుండును.



చిత్ర

వీణ అను సరస్వతీస్వరూపము హిందూదేశములో ననేక ప్రాంతములందు శిల్పశేఖరులచే దయారుచేయబడుచు వచ్చుచున్నది. కాని, కాలానుక్రమముగ ఇతర భారతపరిశ్రమలతోబాటు ఇయ్యది యును క్రమక్రమముగ ఆనందింపబడుట తగ్గుచున్నది దానికనేక కారణములు కలవు పాశ్చాత్యసభ్యత హిందూదేశమున పెంపొందుచున్నకొలదియు, హార్మోనియములు మొదలగు జంత్రములు దేశములో వాడబడుచున్నవి హిందూదేశ మంతటిలో దక్షిణహిందూదేశములో మాత్ర మచ్చటచ్చట వీణయొక్క వాడుక కన్పడుచున్నది. విజయనగరము, మైసూరు, తంజావూరు మొదలగు కొలదిచోటులలో వీణలను జేయువారును, గాయకులును, వారిని బోషించు రసికులును గలరు మైసూరు జగన్మోహను రాజభవనములో వీణలలో వివిధ రకములు ప్రదర్శనార్థమై ఒక గదిలో నుంచబడియున్నవి, అందులో సాధారణవీణ, సరస్వతీ వీణ, రుద్రవీణ అని మూడు రకముల వీణలు కలవు నేటి జనబాహుళ్యములో వీణకు శబ్దము తక్కువకలదనియు, హార్మోనియములో శబ్దము హెచ్చుగ నుద్భవించుననియును, వీణకంటె హార్మోనియమును నేర్చుట సులభమనియు అభిప్రాయము ప్రబలియున్నది



విపంచి

ఐనను, హార్మోనియములవలె నెక్కుశబ్దమును బుట్టించకున్నను వీణవలన నుద్భవించు గానము కర్ణపేయముగను, శ్రుతిలయబద్ధముగ నుండగలదు ఇదివరలో మన ప్రాంతములసుగాని, దక్షిణదేశమున గాని శిల్పులచే జేయబడు వీణలకు శబ్దము ఎక్కువగ లేకపోవుటచే, అట్టికొరత దీసివేయుటకై ఇటీవల మదిలీపట్టణములో నూకాడ వెంకటరత్నవర్మగారు తీక్ష్ణబుద్ధితోడను, బహుశ్రమతోడను బరిశోధనమొనర్చి నూతనవీణల రెంటిని దయారుచేసి యున్నారు.

ఇయ్యవి రెండును అప్పుడే అనేక విద్వాంసులచేతను, రసజ్ఞులచేతను మెప్పువడసినవి.

విజయనగర • మహారాజాగారి గానకళాశాలాధ్యక్షులైన బ్రహ్మశ్రీ ఆదిభొట్ల నారాయణదాసుగారు ఈనూతన వీణలకు 'చిత్ర'—'విపంచి' అని నామకరణమొనర్చిరి. వీణయొక్క సహజమాధుర్యమునకు భంగము కలుగజేయకుండి దానియొక్క గాత్ర గాంభీర్యమును అభివృద్ధిచేయు విషయములో వెంకటరత్నముగారు చిత్రనైపుణ్యమును జూపియున్నారని బ్రహ్మశ్రీ హరి నాగభూషణముగ్గారు వ్రాసియిచ్చియున్నారు.

ఆరెంటిలో "చిత్ర" అను వీణయొక్క ఉదరభాగమున "డబుల్ సౌండ్ బోర్డులు' ఏర్పరుపబడిన "విపంచి" అనువీణయొక్క ఉదరములో, "సౌండ్ రిజొనెన్స బాక్స"—అనగా స్వర మండలి పేట ఒకటి యమర్పబడియున్నది. "చిత్ర" "విపంచి" అను ఈరెండు రకముల క్రొత్తవీణలు నూతనపరిశోధనఫలితములైనను, అయ్యవి అప్పుడే అనేక గాయకశిఖామణులచేత మన్ననవడసినవి

ఇట్లు విద్వాంసులవలనను, వ్యాఖ్యాతల చేతను రసికజనాళి చేతను నెక్కువగ బొగడబడి "చిత్ర' "విపంచి"లు స్వదేశవస్తువుల బ్రోత్సహించు ఈదినములలో భారతీయుల మనంబుల దప్పక నాకర్షింపగలవు రసజ్ఞులు వీనినాదరించి వర్మగారిశ్రమను సార్థకపరతురు గాత

---

# శ్రీభావ సంవత్సర విశేషములు

౧౯౩౪

మార్చి ౧౭ చెన్నపురి లామెంబరుగ సర్. కే. వి రెడ్డిగారు నియమింపబడిరి

,, ,, "స్వరాజ్య" నూతన గృహప్రవేశము.

,, ౨౮. అరేబియాలో యుద్ధము

,, ౨౬. శేపల్లెతాలూకాలో ౩౮ క్రైస్తవుల హిందూమత స్వీకారము.

,, ౨౯. ప్రొఫెసరు కాండేతుగారి మరణము.

ఏప్రిల్ ౧. ఆంధ్రపత్రిక ౨౧ వ వార్షికోత్సవము.

,, ౯. గాంధిమహాత్ముడు వ్యక్తిసత్యాగ్రహమును నిలిపివేసెను

,, ౧౧. అసెంబ్లీలో సంస్థానముల రక్షణచట్టము ఆమోదింపబడెను.

,, ౨౮. డాక్టరు యస్ రంగాచారి, శంకరునాయరు, కుమారస్వామిశాస్త్రి, హాజీ యిస్మైలుసేటుగార్ల మరణము.

మే ౮. మహాత్మునికి మోటారు ప్రమాదము

,, ,, కేతవరపు వెంకటశాస్త్రిగారి మరణము

,, ౧౬ సర్ మహమ్మద్ ఉస్మానుగారు మదరాసు గవర్నరు పదవిని స్వీకరించిరి.

,, ౧౯. కాంగ్రెసు పార్లమెంటరీబోర్డు నియామకము.

జూన్ ౨౦. దివ్యజ్ఞాన సమాజమునకు అరండేలుగారు అధ్యక్షులుగ ఎన్నుకొనబడిరి

,, ౨౫. మహాత్మునిపై బాంబుప్రయోగము.

జూలయి ౧౦. వి. టి. పన్నీరు శెల్వంగారు మదరాసు హోంమెంబరుగ నియమింపబడిరి.

,, ౧౮. వల్లభాయి పటేలుగారి విడుదల.

,, ౨౬ ఆస్ట్రియా అధ్యక్షుడు డాల్ఫసుహత్య.

,, ౨౭. అనే, మాలవ్యాగార్లు పార్లమెంటరీబోర్డు సభ్యత్వమునకు రాజీనామా.

ఆగస్టు ౨. జర్మనీ అధ్యక్షుడు వాన్ హిండెంబర్గు మరణము.

,, ,, హిట్లరు డిక్టేటరుగ నియమింపబడెను.

,, ౭ మహాత్ముని వారముగోంల ఉపవాస ప్రారంభము.

,, ,, వేమవరపు రామదాసుపంతులుగారు అంతర్జాతీయ సహకారసభకై లండనుకు ప్రయాణము.

,, ౧౬ సర్ జార్జి స్టాన్లీగారు తిరిగి మదరాసుగవర్నరుపదవి స్వీకరించుట.

,, ,, సర్ మహమ్మదు ఉస్మానుగారు గవర్నరుపదవి నుండియు ఎగ్జిక్యూటివు సభ్యత్వమునుండియు విరమించుట.

,, ౧౯. కాంగ్రెసు జాతీయపక్ష నిర్మాణము.

,, ౨౦. మెట్టూరుప్రాజెక్టు ప్రారంభము.

,, ౨౭. అబ్దుల్ గఫూరుఖాను విడుదల.

సెప్టెంబరు ౧౦ కమ్యూనలు అవార్డు విషయమై, కాంగ్రెసునకు, మాలవ్యా అనేగార్లకు సంధికుదురలేదు.

,, ౧౮ రష్యా జాతిసమితిలో చేర్చుకొనబడెను.

,, ౨౯ దక్షిణయిండియా లిబరలు ఫెడరేషను సమావేశము-మదరాసు-అధ్యక్షుడు-బొబ్బిలిరాజా.

అక్టోబరు ౯ మార్సెయిల్సులో యుగోస్లేవియారాజు, ఫ్రెంచి ప్రధానామాత్యుల హత్య

,, ౧౫. ఆస్ట్రేలియా శతవర్ష వర్ధంతి

,, ౨౬ బొంబాయిలో ౪౮-వ కాంగ్రెసు సమావేశము-బాబు రాజేంద్రప్రసాదుగారు అధ్యక్షులు.

,, ౨౭. సయామురాజు రాజ్యపరిత్యాగముచేయునట్లుప్రకటన.

,, ౨౯. మహాత్ముడు కాంగ్రెసును విడిచిపెట్టెను.

నవంబరు ౩. ఇంగ్లండులో మునిసిపల్ ఎన్నికలయందు భారతీయుడగు కృష్ణమీననుగారి విజయము.

,, ౧౫ ఎర్స్కైను ప్రభువు మదరాసుగవర్నరు పదవి స్వీకరించిరి.

,, ౨౨ జాయింటు పార్లమెంటరీ కమిటీరిపోర్టు ప్రకటనము.

,, ౨౬ అసెంబ్లీసభ్యులు సాస్మాలుగారి మరణము.

,, ౨౯ జార్జిచక్రవర్తి కుమారుని వివాహము.

డిసంబరు ౧ వి పి. మాధవరావుగారి మరణము.

,, ౭ ఒరిస్సా సరిహద్దుల విషయమై ఆంధ్రమహాసభ గవర్నరుగారిని సందర్శించుట.

,, ౭ ఖాను అబ్దుల్ గఫూరుఖానుగారి అరెస్టు

,, ౧౧ జస్టిసుపార్టీకి ముత్తయ్యచెట్టిగారి రాజీనామా.

,, ,, నోబెలుశాంతి బహుమానము (౧౯౩౮) ఆర్థరు హెండరుసనుగారికి కొసంగబడెను

,, ౧౩ ది. బ మోచర్ల రామచంద్రరావుగారు రిజర్వు బ్యాంకు డైరెక్టరుగ నియమింపబడిరి.

, ౧౮. ఖానుఅబ్దుల్ గఫూరుఖానుగారికి రెండుసంవత్సరముల కఠినశిక్ష

,, ౨౦ ఆంధ్ర విశ్వవిద్యాలయ పట్టప్రదానోత్సవము.

,, పదియవ అఖిలభారత తాత్త్వికమహాసభ వాల్టేరులో సమావేశము-గవర్నరుగారి ప్రారంభోత్సవము

౨౮ అఖిలభారత గ్రంథాలయ మహాసభ మదరాసులో సమావేశము - అధ్యక్షుడు - మణీంద్రదేవరాయ్ మహాశయ్.

౨౫. చతుర్థాంధ్ర నాట్యకళాపరిషన్మహాసభ - మదరాసు- అధ్యక్షులు గోవిందరాజుల సుబ్బారావుగారు

౨[illegible] ౧౮-౯ భారతీయార్థిక మహాసభ, పాట్నా: అధ్యక్షులు సి యన్. వకీలుగారు

౨౭. అఖిలభారత వైద్యమహాసభ-క్రొత్తఢిల్లీ అధ్యక్షుడు భోలానాన్.

౨౯ సేవనలు లిబరలు ఫెడరేషను పూనాలో సమావేశము-అధ్యక్షుడు హృదయనాథకుంజ్రూ.

౩౦. ఆంధ్రమహాసభా ప్రత్యేకసమావేశము-విశాఖపట్టణమున: అధ్యక్షుడు దేశపాండ్య సుబ్బారావుగారు.

౧౯౩౯

జనవరి ౧ అభయంకరుగారి మరణము

,, ౧౧ ఆంధ్రరాష్ట్రీ కాంగ్రెసునకు అధ్యక్షులుగ టంగుటూరి ప్రకాశముగారి ఎన్నిక

,, ౧౨ బొల్లిని మునిస్వామినాయుడుగారి మృతి

,, ,, ఆచార్య గిద్వానిగారి మరణము

,, ౧౫ సారు జర్మనీపక్షమున ఓటుచేసినది.

,, ౨౧ క్రొత్త అసెంబ్లీ సమావేశము

,, ౨౮ అసెంబ్లీ అధ్యక్షులుగ సర్ అబ్దుర్ రహీంగారు ఎన్నుకోబడిరి

,, ౨౯. యం కే ఆచార్య, యల్ ఎ గోవిందరాఘవయ్యరుగార్ల మరణము

,, ౩౦ డాక్టరు బి యస్ మల్లయ్యగారి మరణము

ఫిబ్రవరి ౧ ఇండియాబిల్లు ప్రకటనము

,, ౫ అసెంబ్లీ ఉపాధ్యక్షులుగ అఖిల చంద్రదత్తుగారు (కాంగ్రెసుపక్షము) ఎన్నుకోబడిరి

,, ౧౭. శ్రీ మద్దూరి అన్నపూర్ణయ్యగారి విడుదల

,, ౨౮ సారురాష్ట్రము జర్మనీకి ఒప్పగింపబడినది

మార్చి ౧ నెల్లూరినుండి మదరాసుకు ట్రంకు టెలిఫోను ఏర్పరుపబడినది.

,, ౩ సయామురాజు రాజ్యపరిత్యాగము

,, ౧౮ మదరాసు మంత్రివర్గముపై విశ్వాసరాహిత్య తీర్మానము—ఓటమి

,, ౨౨ షెర్వానిగారి మరణము

,, ౨౩ విశాఖపట్టణమండలకాంగ్రెసు ప్రముఖుడు భీమిడిపాటిచిన్నయజ్ఞనారాయణశర్మగారి మరణము